## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త

# మహాపురాణము

## ప్రకృతి ఖండము

"కాయేన మనసా వాచా పరంభక్త్యా దివానిశమ్ ।
భజ సత్యం పరంబ్రహ్మ రాధేశం త్రిగుణాత్పరమ్ ॥"


రచయిత:
"పౌరాణిక రత్న"
శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయ గుప్త

పరిష్కర్త:
'పండితకవిప్రియ'
బ్రహ్మశ్రీ చతుర్వేది అమరేశ్వరశాస్త్రి



ప్రకాశకులు:
శ్రీ మట్టుపల్లి జగన్నాథం
గుంటూరు.




[మేలుప్రతి రూ. **45-00**

శ్రీ రస్తు ఓం నమః శుభ మస్తు

శ్రీగణేశ్వరాయ నమః

# ఆత్మ నివేదనము

మహావిష్ణోశ్చ మాతా త్వం మూలప్రకృతిరీశ్వరీ ।
సగుణా త్వం చ కలయా నిర్గుణా స్వయమేవ తు ॥

జ్యోతిరూపా నిరాకారా భక్తానుగ్రహవిగ్రహా ।
భక్తానాం రుచివైచిత్ర్యాన్నానామూర్తీశ్చ బిభ్రతీ ॥

మహాలక్ష్మీశ్చ వైకుంఠే భారతీ చ సతాం ప్రసూః ।
పుణ్యక్షేత్రే భారతే చ సతీ త్వం పార్వతీ తథా ॥

తులసీ పుణ్యరూపా చ గఙ్గా భువనపావనీ ।
బ్రహ్మలోకే చ సావిత్రీ కలయా త్వం వసున్ధరా ॥

గోలోకే రాధికా త్వం చ సర్వగోపాలకేశ్వరీ ।
త్వయా వినాహం నిర్జీవో హ్యశక్తః సర్వకర్మసు ॥

(ప్రకృతి ఖండము అ 55. శ్లో 44-48)

నీవు శ్రీమహావిష్ణువునకే జననివి, మూలప్రకృతిరీశ్వరివి, స్వయముగ ప్రాకృతగుణరహిత వైనను (నిర్గుణవైనను) నీకళచే సగుణ రూపమున సాక్షాత్కరించితివి. జ్యోతిస్స్వరూపిణీ! నిరాకారస్వరూపిణీ! నీవు భక్తులననుగ్రహించుటకే స్వరూపము ధరించితివి. భక్తులవిభిన్న భావముల కనుగుణముగ నానారూపములను ధరించెదవు. వైకుంఠములో శ్రీమహాలక్ష్మి గను, సరస్వతిగను, నీవే విరాజిల్లెదవు. పుణ్యక్షేత్ర మైనభారతవర ములో సత్పురుషులయొక్క జననివి నీవే. సతీపార్వతులరూపములో నీవే ప్రాదుర్భవించితివి. నీవే పుణ్యస్వరూపిణి వై నతులసివి, భువనపావని వై నగంగవు. నీవే నీకళాస్వరూపమున వసుంధరవైతివి. గోలోకములో నీవే సమస్తగోపాలకుల కధీశ్వరి వైన

శ్రీరాధవు. నీవు లేనినేను నిర్జీవుడను, కర్మలాచరించుటలో అసమర్థుడను అని శ్రీకృష్ణభగవానుడు పలికెను.

సకలవిశ్వములందు రెండే రెండుపదార్థములు కలవు. అవియే జడ, చేతనములు. పురుషుడే చేతనము, ప్రకృతియే జడము, పురుషుడు ద్రష్ట, ప్రకృతి దృశ్యము, పురుషుడు నిర్వికారము ప్రకృతి సాకారము; ఈ రెండుదివ్యతత్త్వము లక్షరప్రత్యక్షములు, ఎవరైనను యీరెండుతత్త్వముల నంగీకరింపవలసినదే. ఈ రెండింటిలో దర్శించువాడు ద్రష్ట, సకలజగములరూపములో గోచరించునది దృశ్యము.

జీవులందఱు పరమాత్మయొక్క అంశస్వరూపులు. అగ్నికి, అగ్నికణములకు భేదములేనట్లు జీవులు పరమాత్మకంటె భిన్నులుకారు. దృశ్యమగు జడవర్గముకూడ ప్రకృతికార్యమే, కావున నది తత్త్వానుసారముగ ప్రకృతియే యైయున్నది. ఆయాద్యప్రకృతియే సాకారస్వరూపిణి.

కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే।

(శ్రీమద్భగవద్గీత 13-20)

“కార్యకారణముల కర్తృత్వమునందు ప్రకృతియే హేతు వనిచెప్పబడుచున్నది.”

ఆకార్యకారణము లనగానేమి ? ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి - యీయైదుభూతములు, శబ్దస్పర్శరూపరసగంధములుననునైదు విషయములు మొత్తమీపదింటినామమే కార్యము. అయిదుజ్ఞానేంద్రియములు (చెవి, కన్ను, చర్మము, నాలుక, ముక్కు), అయిదు కర్మేంద్రియములు - (వాక్కు, చేతులు, పాదము, మలవిసర్జనద్వారము, జననేంద్రియము), మనస్సు, బుద్ధి, అహంకారము ననునీపదమూడింటినామమే కారణము. ఆద్యప్రకృతి యగు నీశ్వరి యీకార్యకారణము లన్నింటికి ఆదికారణస్వరూపిణి. కావున ప్రకృతి నుండిప్రాదుర్భవించిన కారణముననే యీయనంతకోటిదృశ్యజగత్తులు ప్రకృతి స్వరూపములనబడినవి. ఆసకలలోకజననియొక్క దివ్యాఖ్యానమే శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి ప్రకృతిఖండము.

ప్రకృతి పురుషునియంశకాదు. ఆమె సాక్షాత్తుగా ఆయనశక్తి, శక్తి శక్తిమానులు భిన్నులుకారు. ప్రాకృతమహాప్రళయము సంభవించినపుడు సకల

దృశ్యజగత్తులు ఆద్యప్రకృతియందు లీనములగును. ఆసమయమునపరమాత్మతో ప్రకృతిమాతయే విరాజిల్లుచుండును, ఈదృశ్యజగత్తు లుండవు. వేదములలో, వేదాంతశాస్త్రములలో, యోగశాస్త్రములో, సాంఖ్యాశాస్త్రములో అంబ అనాదియని, సాంతయని, నిత్యయని, కీర్తింపబడెను. ఆమె క్రియారూపిణి యైనప్పుడు సకలవిశ్వములుగ గోచరించును. అక్రియారూపిణి యైనపుడు అవ్యక్త రూపమున విరాజిల్లును. వ్యక్తరూపోత్పత్తిక్రమమేమనగా, మూలప్రకృతి నుండి పరమాత్మసంకల్పముచే సకలవిశ్వాధారు డగుమహావిరాట్పురుషు డైనశ్రీమహావిష్ణువు ప్రాదుర్భవించెను. తదుపరి మహతత్త్వ ముత్పన్న మయ్యెను. దీనినే సమష్టిబుద్ధి యందురు. సమష్టిబుద్ధినుండి సమష్టిఅహం కారము, సమష్టిఅహంకారమునుండి సమష్టిమనస్సు ఉత్పన్నములైనవి. ఈయహంకారమునుండి శబ్దస్పర్శరూపరసగంధము లనుపంచసూక్ష్మతన్మాత్ర లుత్పన్నములైనవి. ఇవియే యింద్రియములకు గారణభూతములైనయర్థములన బడెను. కొందఱు ఇవిమహత్తత్త్వమునుండి ఉత్పన్నములైనవనిప్రవచించిరి, ఎట్లన్ననుఒక్కటే, సమష్టిబుద్ధి, సమష్టిఅహంకారము, సమష్టిమనస్సు – ఈ మూడును ఒకేయంతఃకరణముయొక్క విభిన్నావస్థలనామములు. ఈపంచ సూక్ష్మభూతములనుండి, అనగ తన్మాత్రల నుండి అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు కర్మేంద్రియములు, ఆకాశాది స్థూలభూతము లైదు నుత్పన్నము లైనవి. వీనియన్నింటినే దృశ్యజగత్తనిరి.

ఈవర్ణనవలన సకలజగత్తులకు గారణము ప్రకృతి యనిస్పష్టముగ సిద్ధ మగుచున్నది. ఆప్రకృతియే మన మాతృదేవత. ఆప్రకృతికంటెనతీతుడు, పర మాత్మయు, పరంధాముడు, పరమేశ్వరుడు, చైతన్యస్వరూపుడు నైనఆజగన్నా థుడే మనతండ్రి. మనతల్లిదండ్రులవిశదవర్ణనమే శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణము. శ్రీకృష్ణద్వైపాయనవ్యాసభగవానుడు ప్రస్తుతప్రకృతిఖండ ములో ఆజగజ్జననియనంతరూపములను మంత్రస్తోత్రకవచారాధనాదులను, సృష్టిరహస్యాదులను, పరమభక్తులయుపాఖ్యానములను, యమదూర్వాసాదులు ప్రవచించినపరతత్త్వదివ్యోపదేశములను వర్ణించి సకలమానవాళికి మహోపకార మొనరించెను. తల్లినిగూర్చి విపులముగ దెలిసికొనుట ప్రతిబిడ్డయొక్క విధ్యుక్త ధర్మమైయున్నది. ఆద్యప్రకృతిరూపమును సామాన్యవాక్కుతో వర్ణించు టసంభవము. వాక్కుకూడ ఆమెకార్యమే యైయున్నది. కావున ప్రకృతి

యనిర్వాచనీయము. మనోబుద్ధ్యాదులుగూడ ప్రకృతికార్యములేకావున అవి కూడ నామెను దెలిసికొనజాలవు. ప్రకృతియచింత్యము, అతర్క్యము. ఇట్లు ప్రకృతి వాక్కు, మనస్సు, బుద్ధియొక్క విషయముకాకున్నను ఈసకలజగత్తులను దర్శించినచో నామెరూపము స్పష్టముగ గోచరించును. సకలవిశ్వము లామె రూపములే.

ప్రకృతిపురుషు లిర్వురువ్యాపకులే. కారణ మెల్లపుడు కార్యమందే వ్యాపించియుండును. మంచుగడ్డలో జలము వ్యాపించియున్నట్లు సకలవిశ్వము లందు ప్రకృతివ్యాపకత్వము స్పష్టముగ విదితమగును; కాని అతిసూక్ష్మ మైనకారణమున పురుషునివ్యాపకత్వము శీఘ్రముగ స్పష్టరూపముగ గోచరము కాదు. అందులకు ప్రకృతిమాత అనుగ్రహము కావలెను. ప్రకృతి కారణ మైయున్నది. కాని పురుషుడు అనగా ఈశ్వరుడు మహాకారణ మైయున్నాడు. ఆయనయే యీసకలవిశ్వములను ధరించియున్నాడు. ప్రకృతియందు ప్రకృతి కార్యమందు మహాకారణ మైనయీశ్వరుడు నిండియున్నాడు. ఎట్లనగా ఆకాశమునుండి వాయు వుత్పన్నమైయున్నది. కావున ఆకాశము వాయువు నందు వ్యాప్తమైయున్నది. వాయువునుండి తేజస్సు ఉత్పన్నమైనది; కావున తేజస్సునం దాకాశము, వాయువు రెండును వ్యాప్తములైయున్నవి. తేజస్సు నుండి జల ముద్భవించెను. కావున జలములో నాకాశము, వాయువు, తేజ స్సులువ్యాప్తములైయున్నవి. జలములనుండి పృథ్వి ఉత్పన్నమయ్యెను; కావుననే పృథ్విలో నాకాశము, వాయువు తేజస్సు, జలము ఈనాల్గుతత్వములు పరి పూర్ణములైయున్నవి. అట్లేవీనియన్నింటికి గారణస్వరూపిణి యైనప్రకృతి కూడ సర్వమునందు వ్యాపకమైయున్నది. శక్తిమంతుడైనపురుషునకీప్రకృతి శక్తిమాత్రమైయున్నది; కావున సకలమునకు మహాకారణమైన, చైతన్యమైన పురుషుడీప్రకృతియందు, ప్రకృతికార్యరూప మైనదృశ్యవిశ్వములందు వ్యాపించి యున్నాడు. ఆయనయే ఉపాదానకారణము, నిమిత్తకారణము నైయున్నాడు.

ఆద్యప్రకృతి యగునీశ్వరీయే ఆసనాతనునిశక్తి యైయున్నది. శాస్త్రము నందు శక్తిశబ్దమునకు ప్రసంగానుసారముగ ననేకార్థములు ప్రవచింపబడెను. తాంత్రికు లీమెను పరాశక్తియందురు, విజ్ఞానానందఘన మైనబ్రహ్మమందురు. వేదశాస్త్రోపనిషత్పురాణాదులందుగూడ శక్తి-శబ్దప్రయోగము దేవి, పరా శక్తి, యీశ్వరి, మూలప్రకృతిమున్నగు నామములతో ప్రవచింపబడెను. శక్తి

నామముతో బ్రహ్మము నుపాసించిన పరమాత్మప్రాప్తి కలుగును. ఏకైక పరమాత్మతత్త్వమును నిర్గుణసగుణనిరాకారసాకారరూపములతో అనగా బ్రహ్మవిష్ణుశివశక్తిరామకృష్ణాద్యనేకనామరూపములతో భక్తు లుపాసించుచున్నారు. ఈ రహస్యము నెఱింగి శాస్త్రములు, ఆచార్యులు, ప్రవచించిన మార్గానుసారముగ ఉపాసన మొనరించిన నిశ్చయముగ పరబ్రహ్మసాక్షాత్కారముకలుగును. దయాసాగరుడు, ప్రేమమయుడు, సగుణనిర్గుణరూపుడు నగు పరమేశ్వరుని సర్వాతీతునిగ, సర్వజ్ఞునిగ, సర్వశక్తిమంతునిగ, సర్వవ్యాపకునిగ, సంపూర్ణగుణాధారునిగ, నిర్వికారునిగ, విజ్ఞానానందఘనునిగ, పరబ్రహ్మముగ, పరమాత్మగ నెఱింగి శ్రద్ధాభక్తిపూర్వకముగ నిష్కామప్రేమతో నుపాసన మొనరించిన భగవత్ప్రాప్తినిశ్చయము, ఈయక్షరసత్యమునే వ్యాసదేవుడు శ్రీమద్బ్రహ్మవైవర్తమహాపురాణమందు నిరూపించెను.

ఆజగన్నాథుని నిర్గుణస్వరూపిణి యైనశక్తియే జీవులపై దయగలదియై స్వయముగ సగుణభావమును బొంది బ్రహ్మవిష్ణుమహేశ్వరాదిరూపములతో సృష్టిస్థితిప్రళయములను సంపన్న మొనరించుచుండును. ఆమె పరమాత్మచే చైతన్యమును బొంది సకలకారణములకు గారణమైనది. పరమాత్మ, పరాశక్తి యిరువురుకాదు: ఒక్కరే. స్వయముగ అమ్మనుగూర్చి శ్రీకృష్ణభగవాను డిట్లుపలికెను.

త్వమేవ సర్వజననీ మూలప్రకృతిరీశ్వరీ ।
త్వమేవాద్యా సృష్టివిధౌ స్వేచ్ఛయా త్రిగుణాత్మికా ॥
కార్యార్థే సగుణా త్వం చ వస్తుతో నిర్గుణా స్వయమ్ ।
పరబ్రహ్మస్వరూపా త్వం సత్యా నిత్యా సనాతనీ ॥
తేజఃస్వరూపా పరమా భక్తానుగ్రహవిగ్రహా ।
సర్వస్వరూపా సర్వేశా సర్వాధారా పరాత్పరా ॥
సర్వబీజస్వరూపా సర్వపూజ్యా నిరాశ్రయా ।
సర్వజ్ఞా సర్వతోభద్రా సర్వమఙ్గలమఙ్గలా ॥

(ప్రకృతి ఖండము అ. 66 శ్లో. 7-10)

నీవే విశ్వజనని వైనమూలప్రకృతియగునీశ్వరివి, నీవే సృష్ట్యారంభ సమయమున ఆదిశక్తిరూపమున విరాజమానురాలవై యుండి స్వేచ్ఛగా త్రిగుణాత్మికవైతివి. వస్తుతః నిర్గుణస్వరూపిణి వైననీవు ప్రయోజనార్థమై సగుణవైనావు. నీవు బ్రహ్మస్వరూపిణివి, సత్యవు, నిత్యురాలవు, సనాతనివి,

పరమ తేజఃస్వరూపిణివి, భక్తుల ననుగ్రహించుటకేరూపమును ధరించితివి. నీవు సర్వస్వరూపిణివి, సర్వేశ్వరివి, సర్వాధారివి, పరాత్పరవు, సర్వబీజస్వరూపిణివి, సర్వపూజ్యవు, ఆశ్రయరహితురాలవు, సర్వజ్ఞురాలవు, సర్వమంగళవు, మంగళములకే మంగళస్వరూపిణివి.

బ్రహ్మరూపమైనయాచైతన్యశక్తికి రెండుస్వరూపములుకలవు; నిర్గుణము, సగుణము. సగుణమందు రెండుభేదములు కలవు; ఒకటి నిరాకారము, రెండుసాకారము. ఈపరాశక్తినుండే సకలవిశ్వము లుత్పన్నములైనవి. అందుచేతనే ఈమెను జగత్ప్రసువ యనిరి. ఈమె నుపనిషత్తులయం దిట్లు వర్ణింపబడెను.

> తస్యా ఏవ బ్రహ్మా అజీజనత్ ।
> విష్ణురజీజనత్ । రుద్రోఽజీజనత్ ।
> సర్వే మరుద్గణా అజీజనన్ ।
> గంధర్వాప్సరసః కిన్నరా వాదిత్రవాదినః
> సమంతా దజీజనన్ ।
> భోగ్యమజీజనత్ । సర్వమజీజనత్ ।
> సర్వశాక్తమజీజనత్ । అణ్డజం స్వేదజముద్భిజ్జం
> జరాయుజం యత్కించైతత్ప్రాణి స్థావరజఙ్గమం
> మనుష్యమజీజనత్ । సైషా పరాశక్తిః ।
>
> (బహ్వృచోపనిషత్)

ఆశక్తినుండియే బ్రహ్మ, విష్ణువు, రుద్రు లుత్పన్నులైరి. ఆమెనుండియే మరుద్గణములు, గంధర్వులు, అప్సరసలు, కిన్నరలు, అన్నివైపులనుండి యుత్పన్నులైరి. ఆమెనుండియే సమస్తభోగ్యపదార్థములు, అండజములు, స్వేదజములు, ఉద్భిజ్జములు, జరాయుజములు, స్థావరములు, జంగమములు, మనుష్యాదులు, సర్వమాపరాశక్తినుండియే యుత్పన్నములైనవి. ఆమెయేయాపరాశక్తి.

ఋగ్వేదములో తన్నుగూర్చి భగవతి యిట్లుపలికెను.

> అహం రుద్రేభిర్వసుభిశ్చరామ్య-
> హమాదిత్యైరుత విశ్వదేవైః ।
> అహం మిత్రావరుణోభా బిభర్మ్య-
> హమిన్ద్రాగ్నీ అహమశ్వినోభా ॥
>
> (అష్టకము. 8-7-11)

"నేనే రుద్రాదిత్యాదివిశ్వేదేవులరూపములో సంచరించుచున్నాను. ఆట్లే మిత్రావరుణ, ఇంద్ర, అగ్ని, అశ్వనీకుమారాదిరూపముల నుధరించి యున్నాను".

బ్రహ్మసూత్రములలోగూడ నిట్లు చెప్పబడి యున్నది - "సర్వోపేతా తద్దర్శనాత్" "అనగా పరాశక్తి ప్రత్యక్షముగ జూడబడునుగాన సర్వసామర్థ్య యుక్తమై యున్నది". బ్రహ్మము శాస్త్రములలో స్త్రీలింగపుంలింగ నపుంసక లింగములుగ వ్యాఖ్యానింపబడెను. కావున మహాశక్తి నామములోగూడ బ్రహ్మోపాసన మొనరింపవచ్చును. శ్రీరామకృష్ణ పరమహంస ఆ పరబ్రహ్మ మును తల్లిగా, భగవతిగా, శక్తిగా, ఆరాధించి తరించెను. ఎందఱో మహానుభావులు పరబ్రహ్మమును పరాశక్తిగా భావించి ఆరాధించి విజ్ఞానా నందఘను డైనపరమాత్మారాధనమును సంపన్న మొనరించిరి. ఆ పరబ్రహ్మ మును మహాశక్తిరూపములోశ్రద్ధాభక్తులతో, ప్రేమతో, నిష్కామభావముతో నుపాసించిన పరబ్రహ్మమైన పరమాత్మప్రాప్తి నిశ్చయము.

ఎందఱో మహాత్ములీయాద్యప్రకృతిని హ్లాదినీశక్తి యందురు మహేశ్వరి, జగదీశ్వరి, పరమేశ్వరి యని యీమెనే కీర్తింతురు. లక్ష్మి, సరస్వతి, దుర్గ, తులసి, మంగళచండి, మనసా, స్వధ, స్వాహా, దక్షిణ, మొదలగువా రందఱు శక్తిరూపములే. మాయ, మహామాయ, మూలప్రకృతి, విద్య, అవిద్య మొద లగునవన్నియు నీమె రూపములే.

పరమేశ్వరుడు శక్తిమంతుడు. పరమేశ్వరి ఆయనశక్తి. శక్తిమంతుడు, శక్తి వేఱుగా గోచరించుచున్నను ఒక్కటే యని తెలిసికొనవలెను. అగ్ని యొక్క దాహకశక్తి అగ్నికంటె భిన్నముకానట్లు ఈ సకల విశ్వస్వరూపిణియైన శక్తి శక్తిమంతునిచే పరిపూర్ణయై ఉత్పత్తిస్థితి ప్రళయముల నొనరించుచున్నది. కావుననే ఈ సత్యమును దెలిసికొనిన మనీషులు శక్తిమంతుని, శక్తిని ఉపాసింతురు. ప్రేమస్వరూపిణి యైనఆద్యప్రకృతియే భక్తులను సుగమముగ భగవంతుని చెంతకు జేర్చగలదు. అందులకే కొంద ఱమ్మనాశ్రయించి శీఘ్ర ముగ బరమాత్మను జేరిరి. తల్లి యనుగ్రహింపనిదే బిడ్డ తండ్రి నెట్లుగుర్తింప గలదు ? ప్రస్తుతప్రకృతఖండములో సుయజ్ఞుడను రాజు (64వ అధ్యాయము) అమ్మ నాశ్రయించి పరమాత్మను జేరుకొనెను. సమాధి యనువైశ్యుడు భగవతి నారాధించి యామె యనుగ్రహమును బొంది పరంధామము జేరెను.

ప్రకృతిఖండమంతయు అమ్మయొక్క వివిధదివ్యరూపములతో నిరూపింపబడినది. పాఠకులు తల్లియొక్క యథార్థస్వరూపము నెఱింగి మంత్రస్తోత్రధ్యానకవచారాధనాదులతో అమ్మ నుపాసించి భవబంధవిముక్తులై పరమాత్మను జేరెదరుగాక !

త్వరలోనే శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి తృతీయ ఖండ మైనగణపతిఖండమును, చతుర్థఖండ మైనశ్రీకృష్ణ జన్మఖండమును ముద్రించి మీకు సమర్పింపగలము.

కాళయుక్తి వైశాఖబహుళదశమీ (31-5-78) శుభదినమున అనగా శ్రీహనుమజ్జయంతినాడు శ్రీశ్రీశ్రీవాసవీ కన్యకాపరమేశ్వరీ దేవస్థాన (గుంటూరు) ప్రాంగణములో తల్లిసమక్షమున శ్రీశ్రీశ్రీ జగద్గురు పుష్పగిరి శంకర పీఠాధీశ్వరులుపరమహంస పరివ్రాజకాచార్యులు నగుశ్రీమదభినవోద్దండ విద్యానృసింహ భారతీస్వామిపాదులు శ్రీమద్బ్రహ్మవైవర్త మహాపురాణసార సంగ్రహమను మొదటిగ్రంథము నావిష్కరించిరి. శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమునకు సంబంధించిన మొదటిభాగ మైనబ్రహ్మఖండమును శ్రీ కాళయుక్తి శ్రావణ కృష్ణాష్టమి (శ్రీకృష్ణజయంతి) శుభదినమున (26-8-78) శ్రీశ్రీశ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీదేవస్థాన ప్రాంగణములో అంబ దివ్యసముఖమున శ్రీగౌడీయ వైష్ణవమఠ యతీంద్రు లైనత్రిదండిస్వామి శ్రీభక్తివిజయవిష్ణుమహా రాజుగారు ఆవిష్కరించిరి. నేడు శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తములోని రెండవ భాగమైన ప్రకృతిఖండమునుముద్రించి సమర్పించుచున్నాము. అష్టాదశమహా పురాణములలో పదియవది, భగవంతుని పరిపూర్ణ బ్రహ్మస్వరూపమును ప్రతిపాదించినది, శ్రీకృష్ణద్వైపాయన వ్యాసదేవునిచే పదునెనిమిదివేల శ్లోకములలో ప్రవచింపబడినదియు నైన శ్రీమద్బ్రహ్మవైవర్త మహాపురాణమును భాషాంతరీకరించుట, ముద్రించుటయన్న సామాన్యవిషయముకాదు. ఈవిషయమున నావంటిసామాన్యవ్యక్తిని గూర్చి యిక చెప్పనదేమి? ఈమహాగ్రంథానువాదము కేవలము భగవదనుగ్రహము చేతనే సమకూడినది. ఇచట నావిషయము కొంతప్రస్తావించుట సముచితమని భావించుచున్నాను.

1976 జనవరి 22 వ తేదీనాటి తెల్లవారుజామున స్వప్నములో సచ్చిదానందస్వరూపుడు, అష్టభుజుడు నగుశ్రీకృష్ణభగవానుడు దర్శనమొసంగి తనకు తననామమునకు, రూపమునకు, ధామమునకు, చరితమునకు భేదము

లేదనియు, శ్రీమద్బ్రహ్మవైవర్తమే తాననియు, దాని నాంధ్రీకరించి ప్రచార మొనరింపవలసినదనియు నన్నాదేశించెను. అంతేకాక మద్గతచిత్తుడవు, మద్భక్తుడవు, నన్నే పూజించువాడవు, మత్పరాయణుడవు కావలసిన దనియు మేఘగంభీరస్వరముతో బలికి యంతర్థానముచెందెను. సామాన్యుడ నగునే నెక్కడ? భగవదభిన్నస్వరూప మైనశ్రీమద్బ్రహ్మవైవర్తమహాపురాణమెక్కడ యనిమిన్నకుంటిని. ఈ స్వప్నమువచ్చిన సరిగ నెలరోజులతరువాత అనగా ఫిబ్రవరి 22వ తేదీనాడు నాకు స్కూటరు ప్రమాదము సంభవించి కుడిచేయి విరిగి పోయినది. చికిత్సాలయమున 'ఆపరేషన్' నిమిత్తమై చేర్చబడితిని. 24 వ తేదీన ఆపరేషన్ థియేటరులో నాపరిస్థితి విషమించినది. ఉదయము 6 గంటల నుండి మధ్యాహ్నము 2 గంటల వఱకు ప్రముఖులైనపలువురు డాక్టర్లు నా ప్రాణములను రక్షించుటకు మిగులప్రయత్నించి నాయందాశలు వదలిరి. అట్టి సమయమున నష్టభుజయుక్తుడైనశ్రీకృష్ణపరమాత్మ మరల సాక్షాత్కరించి వెనుకటి తనయాదేశమును జ్ఞాపకము చేసి, వెంటనే శ్రీమద్బ్రహ్మవైవర్త మహాపురాణము నాంధ్రీకరింపవలసినదిగా నాదేశించి యంతర్హితుడయ్యెను. భగవన్నామస్మరణ మొనరించుచు లేచికూర్చుంటిని మరణాసన్నుడనైన నేను పునర్జీవితుడనగుట కాంచి వైద్యులతోగూడ బంధుమిత్రు లందఱు హర్షామోదములనందిరి.

పిమ్మట మూలసంస్కృతగ్రంథమును పూనానుండి తెప్పించి అనువాదముచేయసాగితిని. భగవత్కృపవలన నాలుగుమాసములలో తదేకదీక్షతో గ్రంథానువాదమును బరిసమాప్త మొనరించితిని. అనంతరము భగ్న మైననా దక్షిణకరము యథాస్థితి నొందినది.

'మాతృదేవోభవ, పితృదేవోభవ' అను సూక్తుల ననుసరించి భగవత్సేవాకింత మైననాకీజన్మము నిచ్చిన నాతల్లిదండ్రు లగుశ్రీమతి వేంకట మహాలక్ష్మమ్మ శ్రీజగన్నాథముగార్ల కాజన్మాంతము నేను ఋణపడి యున్నాను. దానశీలురు, జ్ఞానవైరాగ్యసంపన్నులు, పుణ్యమూర్తులు, భగవద్భక్తి యుతులు నగువారియనుగ్రహావిశేషముచే నాకీమహాత్కార్య మొనరించు యదృష్టము లభించిన దనిచెప్పికొనుట కెంతయో గర్వపడుచున్నాను. నేడు నా జననీజనకులే యీ గ్రంథము నావిష్కరించుట నా పురాకృతసుకృతముగా భావించుచున్నాను.

ఆధ్యాత్మికచింతనలోను, గ్రంథానువాదములోను నెట్టి యాటంకములు కలుగకుండగ నత్యంతాదరముతో నా కనేకవిధముల సహకరించిన నాశ్రీమతి శ్యామసుందరికి, కుమారు లగు 'యదువీరరంగధామ్, శ్రీనివాసశరణ్, నాగచల్లి కార్జును'లకు శ్రీకృష్ణభగవాను డాయురారోగ్యైశ్వర్యాదులను బ్రసాదించుగాక !

పుత్రికాసంతానరహితుడ నగునా యనేకజన్మల సుకృతవశమున నేటి కాలమునకు శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణకన్య మాయింట జన్మించినది. ఇట్టియీమెను శేషాచలవాసుడు, విమలరవికోటిసంకాశుడు, సర్వజగన్నివాసుడు, కలితలక్ష్మీశుడు నగుశ్రీవేంకటేశ్వరవిభునకు సమర్పించుకొనుచున్నాను. ఇట్టి దేవాదిదేవుడు నా కల్లుడుగ లభించి నన్ను, నావంశమును చరితార్థ మొనరించినాడు. అట్టి యనంతకల్యాణగుణనిలయు డగుశ్రీవేంకటేశ్వరస్వామి కనన్యభక్తితో సాష్టాంగదండప్రణామము లర్పించుచున్నాడ. బ్రహ్మ కడిగిన నాదేవాదిదేవుని దివ్యచరణారవిందములను కడిగి కన్యాదాన మొనరించిన నా సౌభాగ్యము నేమని చెప్పికొనగలను ?

నాయీ మహాకార్యమునకు దోడ్పడినమహనీయు లెందఱో గలరు. వారిలో బ్రథములు 'పండితకవిప్రియ'బిరుదాంచితులు, అగ్రహారోపహారేత్యాతాదిబహుగ్రంథకర్తలు, బహుగ్రంథపరిష్కర్తలు నగుబ్రహ్మశ్రీ చతుర్వేది అమరేశ్వరశాస్త్రిగారు. వారికృషి బహుథా ప్రశంసనీయము, వారికి నా హృదయపూర్వక నమస్సులు.

లాక్షణికశిరోమణులు, దర్శనాచార్యులు, మహోపాధ్యాయులు, అభినవపండితరాయలు, అభినవభారతి మున్నగుననేకబిరుదాంచితులు ; నాట్యవేదము, భావప్రకాశము, ఏకావళి, ప్రతాపరుద్రీయము, నవరసగంగాధరము నృత్తరత్నావళిమున్నగుబహుగ్రంథకర్తలునగు బ్రహ్మశ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు నా కీగ్రంథానువాదసమయమున నెన్ని యోసలహాల నొసంగిరి. దురూహము లగువిషయముల నెన్నింటినో నాకు వివరించిచెప్పిరి. ప్రార్థింపగనే నామాటమన్నించి భావవివర్తమను పేరుతో వారి యమూల్యాభిప్రాయ మొసంగిరి. వారికి నాహృదయ పూర్వకనమస్సులు.

శ్రీశంకరాచార్యులు, నృసింహపురాణము, జైవధర్మము, శ్రీమద్భాగవతము, శ్రీకృష్ణోద్ధవసంవాదము మున్నగు బహుగ్రంథకర్తలగుశ్రీజన్నాభట్ల

వాసుదేవశాస్త్రిగారు ఈగ్రంథముద్రణమునందును, భాషావిషయమునందును, ననేకవిధము లగుసలహాలనిచ్చుచు నెంతగనో తోడ్పడిరి. వారికి నాహృదయ పూర్వక ధన్యవాదములు.

నా యనువాదమును సుందరముగను, నిర్దుష్టముగను వ్రాసిన చిరంజీవి ఎల్లాప్రగడ రంగనాయకుల కాయురారోగ్యైశ్వర్యాదులను బ్రసాదించుగాక యని శ్రీకృష్ణభగవానుని బ్రార్థించుచున్నాను.

అయాచితముగనే గ్రంథముద్రణమున నార్థికసాహాయ్య మొనరించిన సహృదయుల కందఱకు నా మనఃపూర్వకధన్యవాదములు. వారికి శ్రీకృష్ణ భగవాను డాయురారోగ్యైశ్వర్యాదులను బ్రసాదించుగాక !

ఈమహాగ్రంథమును నిర్దుష్టముగ సకాలములో ముద్రించి యిచ్చిన 'రఘు ప్రింటింగ్ వర్క్సు' అధిపతులకు నా హృదయపూర్వక ధన్యవాదములు.

ది. 12-11-77 నుండి అవిచ్ఛిన్నముగ ప్రతిదినము సాయంసమయమున ఏడుగంటలనుండి తొమ్మిదిగంటల వరకు శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహా పురాణమును ప్రవచన మొనరించుటకు నాకవకాశ మొసంగిన శ్రీ శ్రీ శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ దేవస్థానముయొక్క ధర్మకర్తలసంఘము (గుంటూరు) నకు, ధర్మకర్తల సంఘాధ్యక్షు లైన శ్రీ చండ్రపాటి వేంకటేశ్వర్లు C. A., గారికి, దేవాలయ సేవకవర్గమునకు నాహృదయపూర్వక ధన్యవాద ములు తెల్పుచున్నాను. వీరియొక్క అపూర్వసహకారముచే ప్రతిదినము అసంఖ్యాకు లైనభక్తజనులు శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణా మృతమును గ్రోలగలుగుచున్నారు. వీరందఱిని ఆపరమాత్మ ఆయురారోగ్య ఐశ్వర్యాదులను, భక్తిజ్ఞాన వైరాగ్యములనొసంగి సదా రక్షించుగాక.

ఇట్లు,
భక్తజన దాసానుదాసుడు,
మట్టుపల్లి శివసుబ్బరాయ గుప్త

# భావ వివర్తము

బ్రహ్మవైవర్తమహాపురాణమునకు సంబంధించిన మొదటిభాగము ప్రకటితమైనది. ఇది ప్రకృతిఖండము. బ్రహ్మపదారంభము గలపురాణములలో బ్రహ్మవైవర్తమహాపురాణమునకు కొంతవిశిష్టతకలదు. ఆవిశిష్టత శివగుప్తకు ప్రబోధహేతువు అయినది. ఇది ఒక శివవైవర్తము, గుప్తవైవర్తము, శివగుప్త ఈ విధముగ వ్రాయుటకు తగినసామర్థ్యము కలవాడేనా? అర్హమైన విద్యావ్యాసంగ మొనరించెనా? తగిన విద్యావైదుష్యము కలవాడేనా? ఈ ప్రశ్నలు నాకు రాబట్టవు. ఒక అపూర్వమైనస్ఫురణమువలన కళ్యాణభావగుప్తమైనబ్రహ్మవైవర్తము నిట్లు నిరూపించెను. బ్రహ్మవైవర్త పరిమితిని గుఱించి, విశిష్టతను గురించి దీనితరువాత భాగములో పాఠకులు భావింపగలరు.

ప్రకృతిఖండము ప్రశ్నోత్తరరూపముగ భాసించును. గురుశిష్యరీతి సాంప్రదాయికమైనట్టిది. ఇది యిందు స్పష్టముగనున్నది. ఇది పాఠకులకు ప్రబోధహేతువు. కళ్యాణపత్రికా కార్యసాఫల్యము దీనిలో గోచరించును. ఆ యా విశిష్టగ్రంథములను వ్యాసంగమొనరించినవారు దీనిలో సాఫల్యమును భావింతురు. ఈ ప్రకృతిఖండభావనముచేయగా, పతిపత్నీభావము ఉపనిషత్తులలో నిరూపితమైనట్టిది మనస్సులో స్ఫురించును. ప్రకృతి యనునది శాక్తేయ ప్రకృతి, శైవప్రకృతి, సాంఖ్యప్రకృతి, వేదాంతప్రకృతి వేఱువేఱుగ గోచరించును. శివగుప్త దీనిలోని వైష్ణవప్రకృతిని హృదయంగమము చేసికొనెను. బ్రహ్మవాదుల ప్రకృతి మాయారూపము, మిథ్యారూపము. నానాప్రకృతుల స్వరూపపరిష్కారము ఇందలిది వైష్ణవప్రకృతిలోనున్నది. ప్రకృతిసర్వస్వమునకు శ్రీకృష్ణపరత్వము దీనిలో ప్రతిపాదితమైనది. ముందుగ కృష్ణపారమ్యము భావించినగాని గ్రంథావగాహన మొనరింపరాదు.

కథామార్గమున తత్త్వము నిరూపించుట భారతీయుల చిరంతనపద్ధతి. కథకొఱకై కథయుండదు. తత్త్వమునకై కథయుండును. మిత్రసమ్మితము లైనపురాణములలో నిదియే తత్త్వము. కావుననే కొన్నికొన్నికథలు నానా పురాణములలో, నానావిధములుగ నున్నను పాశ్చాత్యులవలె భారతీయులు వ్యాక్షేపము పొందరు. సూత్రప్రాయముగ నొకవిషయమును నిర్దేశించి దాని

వ్యాఖ్యాప్రాయముగ కథను, తత్త్వమును పురాణములు నిరూపించును. దగ్గర నున్న మిత్రుడు కర్తవ్యమును, అకర్తవ్యమును నేరుగా చెప్పడు. కథా వ్యాజమున చెప్పును. ఆవిశేషమే దీనిలో నున్నది. నారదుడు ఒకప్పుడు సనత్కుమారుని సన్నిధికేగెను. నేను విద్యావిదుడనే కాని బ్రహ్మవిదుడను కాను. కావుననే దుఃఖపడుచున్నాను. నాదుఃఖతరణోపాయమును మీరు నిర్దే శింపుడు. నారదా! నీ వేమిచదివితివి? వేదములను, జ్యోతిర్విద్య, వాకో వాక్యము, సర్వవిద్యా దేవవ్యజన విద్య, పురాణము, ఇతిహాసము, నక్షత్రవిద్య మొదలగు వానినన్నిటిని చదివితినికాని దుఃఖముపోలేదు. ఈ కథనముతో పురాణమున్నది.

ఆ పురాణమే యీపురాణమా? అది యఖండమైన మహాపురాణము, యిది ఖండలకాత్మకమైన పురాణము, ఇంతగా నారదుడు చెప్పినను 'నామైవ ఏతత్' అని సనత్కుమారు డనెను, ఈ నామముకన్నను కలదా! కలదు. ఇదుగో 'భూమ' అనిచెప్పి పదునాలుసోపానములను జూపెను. ఇది ఉపనిష ద్విద్యాతత్త్వము. ఆతత్త్వమే ఈ వైవర్తములోనున్నది. శ్రీకృష్ణుడు 'భూమ' పదమున నిర్దేశింపదగినవాడు. ఇందలి వైష్ణవము సృష్టిప్రక్రియ సర్వవైష్ణవు లామోదించునది అవునా? పాంచరాత్రాగమములు కలవు. సాత్వతసంహిత కలదు. దానిలోని రీతివేఱు. ఇందలిరీతి వైవర్తరీతి. శివసుబ్బరాయగుప్త తెలుగురచనలో అచటనచట కొన్నికొన్ని అంశములు పూరణాపేక్షములుగ నున్నవి. ఇది శివభావనముననుకలదు. అపుడు సంస్కృతమావశ్యకమని శివ గుప్తయు భావించును. పరాత్పరుడైన శ్రీమన్నారాయణుడు సర్వాతీతుడు, ఏరికిని గోచరింపడు. వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, విష్వక్సేనరూపమైన వ్యూహ చతుష్టయముకూడ భాసింపదు. మూడవదియైన బ్రహ్మసృష్టిలోని భగవానుని అవతారభావము గ్రంథములలో వర్ణితమైనందున, గోచరించి నట్లనిపించును, కాని వాస్తవముగ నదియు భాసింపదు. భగవల్లీలలు ఆయా గ్రంథములలోని విశేషములతో సమాప్తములు కాలేదు. అవి అనంతలీలలు, సర్వబ్రహ్మాండభాండవ్యాప్తములు. నాల్గవదియైన అంతర్యామి స్వరూ పము, సాధకులకు తెలియును. కాని తెలిసినట్లుండదు. దోమలో, ఏనుగులో, మానవులలో, దానవులలో, నరులలో, వానరులలో అంతటను అంతర్యామిగ పరమాత్మయున్నాడని లోకజీవులు భావింపలేకున్నారు. ఇక సాధకజీవులకు గతి

యేమి ! అర్చావతార విగ్రహము లైనపరమాత్మయేగతి. ఈ గతిని శివసుబ్బ రాయగుప్త గుర్తించి దీనిలో నిరూపించెను. అన్యాన్యవైష్ణవములలోని తత్త్వమునుగూడ నీవైవర్తానుసారముగ సమన్వయింపవచ్చునని శివసుబ్బ రాయగుప్త భావించెను. ప్రకృతిఖండములోని నానావిధ గ్రహములలో జీవరాశికలదా? అనేకులు సందేహింతురు, ఇది చదివినపుడు సందేహింపనక్కర లేదు. విశ్వాతీతముగ విశ్వోత్తీర్ణమగు తత్త్వమున్నది. ఈ విశ్వము గర్భోద కముచే వ్యాప్తమైయున్నది. గర్భోదకతీరమునందు జ్యోతిర్మయరూపులు, అనంతకోటి సంఖ్యాకులు మహాసమాధిమగ్నులై యున్నారు. వారియనుగ్రహము ఒకింత ఈ శివగుప్తపై ప్రసరించెనని నావలె అందఱును భావింతురు. మహా విరాడ్రూపము, క్షుద్రవిరాడ్రూపము సర్వము సమన్వయించి గుర్తించుటకు దీనిలో ఉపాయమున్నది.

వైష్ణవతంత్రములలో నిరూపితమగు సృష్టిదీనిలోనున్నది. ఈసర్వము కూడ ఒకానొకవిధమైన ఉపాసనము. ఉపాసనమునకు మంత్రము, యంత్రము కావలెను. క్షేత్ర తీర్థ దేవసన్నిధి కావలెను. ఇవన్నియు కావలెనని శివగుప్త భావించి, కావలయు వానిని సంగ్రహించి దీనిలో నిరూపించెను. అచటనచట దీనిలో మంత్రకథనము, స్తవమున్నది. అది భక్తులొనరించిన స్తవము. అది కేవలము స్తవముకాదు, మంత్రాత్మకమైన విన్యాసము. అనేకులు ఆ స్తవమును పారాయణమొనరించి పవిత్రులైనారు. వారిపారాయణమును మనకును వారందించిన పవిత్రతకల్గును. కావుననే శివగుప్త అప్పుడపుడు సాధకజన అనుగ్రహదృష్టితో మంత్రయంత్రతంత్రములను నిర్దేశించుటకలదు. ఏవం ప్రాయములైన రహస్యములను చెప్పరాదు, చెప్పవచ్చును, ఎవరికి చెప్ప వచ్చునో శివగుప్తకు తెలియును, తానునిర్దేశించి చెప్పెను.

వేదాంతవాదములను సమన్వయించుటకు వ్యాసభట్టారకుడు బ్రహ్మ సూత్రము రచించెను. దానిపై భాష్యములు వేదాంతార్థములను నిశ్చిత మార్గమున భావింపచేయుచున్నవి. పురాణములను, ఉపపురాణములను సమన్వ యించి యేకమార్గమున సంభావించుటకు పురాణసూత్రమును భట్టారకుడు రచింపలేదేమి ! అట్లు రచనచేసియున్నచో మనకు భావవైకల్య మేర్పడదు కదా ! ఈవైవర్తమును భావించి పురాణసూత్ర సమున్మేష మొనరింప వచ్చునా ! పురాణబ్రహ్మవాదు లాలోచింపతగును.

భారతదేశమున తీర్థ, క్షేత్ర, దేవపవిత్రతాభావనమున్నది. అన్యదేశములలోకూడ నదులు, పర్వతములు, ప్రదేశములు యెన్నెన్నో విశేషములుకలవు కదా ! వానినికూడ పవిత్రముగా భావనముచేయుటకు, దేవస్థలములుగ గుర్తించుటకు దీనిలోని భక్తిప్రధానతాసూచకములగు అర్థవాదరీతులు సహాకరింపవచ్చును. ఆయా దేవతానుకూల భావనారీతి దీనిలోనున్నది. నదిని నదిగా అమ్మయముగా భావింపరాదు; అదియొకశక్తివిశేష విలాసమనియే భావింపవలెను. ఇట్లు భావించిన శివగుప్త తన భావవైశిష్ట్యమును అటనట సూచించెను. కలిలో ధర్మనాశము వచ్చినది, దేవాయతనశక్తి అంతర్హితమైనదా ? అచటమంత్రశక్తులు లుప్తములైనవా ? యంత్రప్రభావము నష్టములైనవా ? అయినచో మనగతియేమి ? ఈసర్వము కలిప్రవాహమని, మనమా ప్రవాహమున కొట్టుకొనిపోవలసినదేనా ? ఇట్టి పరిస్థితులలో శివగుప్త గంభీరముగ నిలబడి పలుకును, యుగాంతమింకనురాలేదు. ఈలోపుగ ఈగ్రంథ నిర్దిష్టములైన విశేషములను అనుసంధానించినచో, సాధకులధీరులుకారు. సత్యయుగ మావిర్భవించును. ఇతర పురాణముల సంవాదము నన్వేషించి దీని నిగూఢాఖ్యానమును గుర్తింపవచ్చును, పురాణములలోనుండు కథలు, ఆఖ్యాయికలు, గాథలు, కల్పశుద్ధివిశేషములు విభాగదృష్టితో స్వీకరించినచో, సాధకులకు ఆక్షేపింపవలెనన్న భావముకలుగదు, కథలలోనన్నిటను తత్వమాలోచనీయముకాదు ! కాని లోకముదానిని గుర్తింపదు, గుర్తింపదని గుప్తశివుడు గుర్తించెను. అందుకై ఆయాస్థలములలో స్తోత్రములను నిబంధించెను. గోలోకములోని విశేషములను విశేషముగ నిందు దర్శింతుము. దానికి లౌకికమైన స్వరూపాఖ్యానమున్నది. ఈ శ్రీశైలము దివ్యశ్రీశైలమునకు చిహ్నము, అట్లే ఈబృందావనము గోలోక బృందావనమునకు ప్రతీకము. ఇట్లుభావించుటకు శివగుప్త సంక్షిప్తముగ రచనలిచ్చెను. అనన్యభక్తికలవారలకు ఈతత్త్వము గోచరించునని ఇందేయున్నది. గంగ, విష్ణునదియైనది. ఇతర పురాణములలోని కథలకు కొన్నినిగూఢార్థములు కలవు. ఆ అర్థములు యీ వైవర్తములోనున్నవి రామాయణములోని రావణఅపహృతసీత ఛాయాసీతయేకాని రామునిసీత కాదు. ఇట్టివిశేషమును తొందరపడక దీనినుండి చక్కగ భావించుట ఉచితము. సంఘమునకు సంబంధించిన నీతివచనములను వెతికివెతికి కూర్చుకొనుటావశ్యకము. ఈవైవర్తములోనిది సర్వముదివ్యము. అయినను మానవసంబంధముకలదు. కొన్నికొన్ని చెప్పినవేచెప్పుటగానున్నది.

విషయదార్ఢ్యమున్నకై ఆపునరుక్తి అవసరము, గ్రంథమునంతటను భక్తిశాస్త్ర చ్ఛాయలు కనిపించుచున్నవి. యుగానుసారముగ ధర్మమటునిటునగుట ఇందు గోచరించును, అది కాలభావము; కాని దేవుడు కాలాతీతుడు.

క్రీడాభాండ మిదం విశ్వం కృష్ణస్య పరమాత్మనః ।
యదా దదాతి యస్మై స తస్యై శ్వర్యం భవేత్తథా ॥ పుట : 146

దీనిలో కృష్ణకవచమున్నది, సాలగ్రామ రూపఫలములున్నవి, నామ భేదములున్నవి. యమస్తుతి కావించినచో నరకకుండముల వినిపాతముకల్గును నరకహేతుకర్మలను విడనాడి యమదేవుని యనుగ్రహామువలన ధర్మాచరణా సక్తులుకావచ్చును. స్త్రీల విషయమున చెప్పవలయుదానిని నిస్సంకోచముగ శివగుప్త చెప్పెను. నరకములకు రూపము వర్ణితమైయున్నది. వర్ణితరూపాను సారమున నరకముల చిత్రములు రచించి లోకమంతట వ్యాపింపజేసినచో పాపమొనరించుటకు జనులు సంకోచపడగలరు. జ్ఞానసారము, తపస్సారము, బ్రహ్మసారము, యోగసారము శ్రీకృష్ణపదసేవనము యనునది యిందలి తత్వము. గర్భవాసమునుండి హరినామ సంకీర్తన మొనరించుట, వైవర్తము చెప్పుచున్నది. జగజ్జీవనములో భక్తిజీవనమునకు గర్భదరిద్రులు సమర్థులుకారు. మహాలక్ష్మీరూపముల గుర్తించి తదనుసంధాన మొనరించినచో భక్తులు భక్తిని విడనాడ నక్కరలేదు.

తనకు తెలియని భావావేశముతో శివగుప్త ఈ వైవర్తము నిరూపించెను, నానా దేవీదేవుల మంత్రస్తుతి, కవచాదులను స్పష్టముగ నిర్దేశించెను. సాధకులు వీని ననుసరింతురని శివగుప్త భావించియుండును. ఇంతటి గ్రంథము నిట్లుముద్రించుట అశివగుప్తులకు సాధ్యముకాదు.

గుంటూరు నగరములోని శ్రీ కన్యకాపరమేశ్వరీదేవి పీఠసన్నిధిలో శ్రీమాన్ శివగుప్త చాలకాలముగ నిత్యము తనకంఠముతో తాను ఈ వైవర్తము సర్వము అచటి శ్రోతలకందరకు చెవులలోపోసి హృదయమున కెక్కించుచుండెను. పురాణశ్రోతలు ముద్రణమునకు ద్రవ్యమిచ్చుటయా ? కాదు. ఈ గ్రంథము చదువవలెను. చదివింపవలెను. ముద్రణమునకు శివగుప్త అసమర్థుడని యెవరును భావింపలేదు. తమకువైవర్తముపైగల అభిమానమును ముద్రారూపమున సూచించిరి. ఆ కన్యకాదేవి యింకనింకను యేమేమో చేయింపవలసియున్నది. శ్రీమాన్ శివగుప్త పురాణప్రవచన మొనరించుచు

తన్నుదాను మరచిపోవును. విస్ఫారిత విశాలనేత్రములతో సానుగ్రహా కృపా దృష్టిని ప్రసరింపచేయును. అందఱు మంత్రముగ్ధులగుదురు. ఇంకను బ్రహ్మ వైవర్తమింతటితో పూర్తి కాలేదు సమగ్రగ్రంథము త్వరలో ముద్రితమై చక్కగా చిక్కణీకృతమై పరమేశ్వరి పాదసన్నిధిలో కుంకుమ తిలకము ధరించుగావుత.

— జమ్ములమడక మాధవరామశర్మ

శ్రీ రస్తు ఓం నమః శుభ మస్తు

# మంగళాశీర్వచనము

మన సమాజంలో శ్రీమంతులెందరో ఉన్నారు. కాని భగవంతుడు ప్రసాదించిన ద్రవ్యమును జగత్కళ్యాణకర సత్కార్యములకు నిండు హృదయముతో ఖర్చుచేయగల వారెందరున్నారు? భగవంతుడు, పరమాత్మ, పరబ్రహ్మము నగు శ్రీకృష్ణుని కరుణకలవారే, మహత్తర పుణ్యఫలము కలవారే మహదానందముతో, పవిత్ర హృదయముతో యిట్టి పరమపవిత్ర బృహత్తర, మహత్తర ఆధ్యాత్మ జ్ఞాన యజ్ఞాలలో పాల్గొనగల్గెదరు. అట్టివారి శుభనామములే విశ్వమహేతిహాసములో సువర్ణాక్షరాల లిఖింపబడి మానవాళికి సర్వదా ఆదర్శమార్గాన్ని దర్శింప జేయగల్గుతాయిగదా! కోరినదాన మొనరించుట సర్వ సామాన్యము. కోరకనే భగవత్కార్యమునకు సహాయమొనరించి తోడ్పడుట అసమాన్యము. ఇట్టి కోవకు చెందినవారే దిగువ నుదహరింపబడిన భగవద్భక్తులగు సజ్జనులు.

## శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణ ప్రచారోద్యమ సభ్యులు

శ్రీ మటుపల్లి సుబ్బారాయుడు, వారి ధర్మపత్ని కోటమ్మగార్ల జ్ఞాపకార్థం
శ్రీ మట్టుపల్లి జగన్నాథం వీరి ధర్మపత్ని వేంకటమహాలక్ష్మమ్మ గార్లు కొత్తపేట, గుంటూరు. రూ. 1116

శ్రీ జూలగంటి వీరాస్వామి, వారిధర్మపత్ని ఆదిలక్ష్మమ్మగార్ల జ్ఞాపకార్థం కుమారుడు కాటయ్యసెట్టిగారు, చీరాల. 1116

శ్రీ మద్దాల సుబ్బారావుగారు, నరసరావుపేట. 1116

శ్రీ గొల్ల చిరంజీవిరావుగారు, లాలాపేట, గుంటూరు. 1116

శ్రీ కంతేటి రంగనాయకులుగారి జ్ఞాపకార్థం వారిధర్మపత్ని సత్యవతిగారు, బందరు. 1116

శ్రీ కంతేటి లక్ష్మీనరసింహప్రసాదు, వీరి ధర్మపత్ని సీతామహాలక్ష్మి గార్లు, బందరు. 516

శ్రీ కంతేటి యతిరాజకృష్ణానందరావు వీరిధర్మపత్ని ధనలక్ష్మి గార్లు, విజయవాడ. 516

సర్కారా ఇండస్ట్రియల్ కార్పొరేషను, రాజకోట. 500

రాంసార్ ఫారమ్ మెషిన్స్ ప్రైవేట్ లిమిటెడ్, కోయంబత్తూరు. 500

శివా ఇంజనీరింగు కంపెనీవారు, నరసరావుపేట. 400

శ్రీ గుండిమెడ శ్యామలరావుగారు వీరి ధర్మపత్ని వరలక్ష్మమ్మగార్లు
చంద్రమౌళినగరు, గుంటూరు. 400

స్ప్రేయర్సు ఇండియా, న్యూఢిల్లీ. 251

ది గుజరాత్ ఫర్టిలైజర్సు, అహమ్మదాబాదు. 251

శ్రీ మానికొండ రాజారావుగారు, ఆడిటరు – గుంటూరు. 250

బ్రైట్ ఎంటర్‌ప్రైసెస్, న్యూఢిల్లీ. 201

కాంటినెంటలు స్ప్రేయర్సు, ,, 201

భర్తీ ఇంజనీరింగు కార్పొరేషను, పగ్వారా. 151

శ్రీ సాధు పుల్లయ్య, నారాయణమ్మగార్ల కుమార్డు సుబ్రహ్మణ్యం
వీరి ధర్మపత్ని జయలక్ష్మిగార్లు, సంగడిగుంట – గుంటూరు. 125

శ్రీ గార్లపాటి కామేశ్వరరావు, వీరిధర్మపత్ని వివేకవతిగార్లు
ఆర్. అగ్రహారం, గుంటూరు. 121

శ్రీ చొప్పర్ల వెంకటేశ్వర్లుగారు వీరిధర్మపత్ని సావిత్రమ్మగారు,
వడ్లమచ్చులవీధి, సంగడిగుంట, గుంటూరు. 116

శ్రీ మద్ది రాజగోపాలరావుగారి ధర్మపత్ని శ్రీలక్ష్మమ్మగారు.
దూదుపీరుపంజావీధి, చౌత్రా, గుంటూరు. 116

శ్రీ సంకా వెంకటస్వామిగారి కుమార్డు సత్యన్నారాయణగారు,
రైస్‌మర్చంటు, గుంటూరు. 116

శ్రీ కాకరపర్తి ఆదినారాయణ కుమార్డు వెంకటేశ్వర్లుగారు,
రైస్‌మర్చంటు, గుంటూరు. 116

శ్రీ గొట్టిపాటి రామకోటేశ్వరరావు, వీరిధర్మపత్ని అనంతలక్ష్మి
గార్లు, విజయదుర్గ ట్రేడర్సు, సంగడిగుంట, గుంటూరు. 116

శ్రీ తాడేపల్లి పూర్ణచంద్రరావుగారు, తవుడు, నూకల వ్యాపారము
శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవస్థానమువీధి, ,, 116

శ్రీ దేవిశెట్టి వీరాంజనేయులుగారు, కిరాణామర్చంటు,
పట్నంబజారు, గుంటూరు. 116

శ్రీ పెనుగొండ పుల్లయ్యగారు, కుమార్డు రామారావుగారు,
వీరి ధర్మపత్ని లక్ష్మిబాపమ్మగారు, ఏలూరుబజారు, గుంటూరు. 116

శ్రీ కొప్పురావూరి బ్రహ్మయ్యగారు వీరి ధర్మపత్ని
రంగనాయకమ్మగారు, బండలబజారు, గుంటూరు 116

శ్రీ రాచపూడి పున్నయ్యగారి కుమార్డు వెంకటప్పయ్యగారు,
గడియారంవారివీధి, కొత్తపేట ,, 116

శ్రీ గుడివాడ వెంకటలక్ష్మీనారాయణగారు, మెయిన్ రోడ్,
ఆర్. అగ్రహారం ,, 116

శ్రీ కోరళ్ళ సత్యన్నారాయణ, వీరి ధర్మపత్ని
మంగతాయారమ్మగార్లు పాతబ్యాంకిరోడ్డు, కొత్తపేట ,, 116

శ్రీ భృగుమళ్ళ రామయ్య, చెంచమ్మగార్ల జ్ఞాపకార్థం కుమార్డు
సత్యన్నారాయణగుప్త వీరిధర్మపత్ని శీతారావమ్మగార్లు
సూరేపల్లి 116

శ్రీ బెజవాడ మల్లిఖార్జునప్రసాదరావుగారు, సంగడిగుంట, గుంటూరు. 116

శ్రీ కొత్త గురవయ్యగారు, వీరిధర్మపత్ని కోటిరత్నంగార్లజ్ఞాపకార్థం
కుమారుడు పిచ్చయ్య వీరిభార్య హైమావతిగారు, లాలాపేట,
గుంటూరు. 116

శ్రీ కుందా రోశయ్య అండ్ సన్స్., మాచిరాజువారివీధి,
కొత్తపేట ,, 116

శ్రీ ఉప్పుటూరి చినఅప్పయ్యగారు, పుల్లడిగుంట. 116

శ్రీ భృగుమళ్ళ రామయ్య, చెంచయ్యగార్ల జ్ఞాపకార్థం కుమార్డు
లక్ష్మీకాంతారావు వీరిధర్మపత్ని వెంకటరత్నమ్మగార్లు, గుంటూరు, 116

శ్రీ ఆలపాటి నాగయ్యగారి కుమార్డు రఘునాధరావుగారు, వీరిధర్మపత్ని
రేణుకాదేవిగారు, ఆర్. అగ్రహారం ,, 116

శ్రీ పెనుగొండ మల్లయ్యగారు వీరిధర్మపత్ని భ్రమరాంబగార్ల
కుమార్తె పోలిశెట్టి శీతారావమ్మగారు. ,, 116

శ్రీ జూలూరి ఆదినారాయణగారి జ్ఞాపకార్థం వీరి ధర్మపత్ని
నాగరత్నమ్మగారు, పాతగుంటూరు ,, 116

శ్రీ మాటూరు పిచ్చయ్య వీరి ధర్మపత్ని బాలాత్రిపురసుందరిగార్ల
జ్ఞాపకార్థం కుమార్డు సత్యన్నారాయణ వీరిధర్మపత్ని గాయత్రి ,, 116

శ్రీ కొత్తమాసు నాగేశ్వరమ్మగారు, రేటూరు 116

శ్రీ మద్ది వెంకటసుబ్రహ్మణ్యంగారు, స్టెయిన్‌లెస్ స్టీలుమర్చంటు, గుంటూరు. 116

శ్రీ అచ్యుం రామమోహనరావుగారు వీరిధర్మపత్ని లక్ష్మీతులశమ్మగార్లు - తిరుపతి. 116

మెసర్సు స్ప్రియర్సు అండ్ సప్లయర్సు, సికిందాబాదు. 116

శ్రీ మాజేటి వేంకటేశ్వర్లు వీరిధర్మపత్ని సుశీలగార్లు, చౌత్రా-గుంటూరు 116

శ్రీ చక్కా గుర్నాథంగారి కుమార్డు సుబ్బారావుగారు, బ్రాడీపేట ,, 116

శ్రీ రాచపూడి వెంకటసుబ్బారావుగారు, చౌత్రా - గుంటూరు 116

శ్రీ చుండూరి రామచంద్రమూర్తి, లింగమల్లు శీతారామయ్య, L. I. C. ఏజంట్లు, భవానీపురం, విజయవాడ. 116

శ్రీ కర్పూరపు రామకృష్ణమూర్తిగారు. గుంటూరివారితోట, గుంటూరు 116

శ్రీ కొల్లా ముక్తేశ్వరరావు, వీరిధర్మపత్ని సూర్యకుమారిగార్లు ,, 116

శ్రీ తేలప్రోలు రామకోటిరత్నంగారు, ,, 116

శ్రీ పారేపల్లి పూర్ణచంద్రరావుగారు, తవుడు వ్యాపారం కన్యకాపరమేశ్వరి అమ్మవారివీధి ,, 116

శ్రీ ఆత్మకూరి బ్రహ్మయ్యగారు, ఆర్. అగ్రహారం ,, 111

శ్రీ చొప్పర్ల వెంకటేశ్వర్లుగారి కుమార్లు, సాంబశివరావు సూర్యనారాయణ, రాజమోహనరావుగార్లు సంగడిగుంట, ,, 101

శ్రీ తాడికొండ కోటేశ్వరరావు వీరిధర్మపత్ని సుశీలమ్మగార్లు, ,, 101

M/s యాడ్ ఆటోవేంచర్సు, పూనా. 101

శ్రీ వేమూరి వెంకటేశ్వరరావుగారు, చౌత్రా గుంటూరు 100

శ్రీ వేమూరి రామచంద్రరావుగారి ధర్మపత్ని కోటిరత్నమ్మగారు ,, 100

శ్రీ కనిగల్పుల సుబ్బారావుగారు వీరిధర్మపత్ని జాలమ్మగారు, ,, 100

శ్రీ బందం రామారావుగారు వీరిధర్మపత్ని స్వరాజ్యధనలక్ష్మిగారు, ప్రత్తిపాడు 100

శ్రీ చక్కా రామమోహనరావుగారు, రామకృష్ణహార్డువేరు కం, గుంటూరు 100

శ్రీ దేవిశెట్టిపుల్లారావు, శ్రీకన్యకాపరమేశ్వరీ దేవస్థానంవీధి-గుంటూరు 100

| | |
|---|---|
| శ్రీ మాదంశెట్టి శీతారామాంజనేయులుగారి జ్ఞాపకార్థం వీరిధర్మపత్ని సౌభాగ్యమ్మ వరఫ్ అన్నపూర్ణమ్మగారు, ఉపేంద్రమెడికల్స ,, | 100 |
| శ్రీ మూర్తి మల్లేశ్వరరావుగారు వీరిధర్మపత్ని వెంకటనాగరత్నమ్మగార్లు విజయవాడ | 100 |
| శ్రీ గ్రంధి సుబ్బారావుగారు క్రేన్ బెటల్ నట్ పౌడరు వర్క్సు, గుంటూరు | 100 |
| M/s శ్రీ వత్సవ ఏజన్సీస్, విజయవాడ. | 100 |
| శ్రీ దాచేపల్లి దత్తాత్రేయులుగారు సన్ ఆఫ్ రామబ్రహ్మాచార్యులు, చౌత్రా, గుంటూరు | 100 |
| శ్రీమతి నాగసూరి శకుంతల జ్ఞాపకార్థం తండ్రి కోటేశ్వరరావుగారు ,, | 75 |
| శ్రీ మాజేటి లక్ష్మీనరసింహారావు వీరిధర్మపత్ని జయలక్ష్మీగార్లు, పాతగుంటూరు ,, | 75 |
| మెస్సర్సు ఇండస్ట్రియల్ ట్రేడింగు ఏజన్సీస్, బొంబాయి, | 71 |
| శ్రీ బచ్చు రామయ్య సీతమ్మగార్ల జ్ఞాపకార్థం కుమార్డు మంగారావు గారు, గుంటూరు. | 65 |
| శ్రీ మునగాల రామమోహనరావుగారు, రైస్ అండ్ ఆయిల్ బ్రోకర్సు ,, | 60 |
| శ్రీ పోలిశెట్టి వెంకటసుబ్బారావుగారు, ,, | 60 |
| శ్రీ మాడిశెట్టి మురహరిరావుగారు ,, | 60 |
| శ్రీ తూనుగుంట్ల గురుపార్వతీశంగారు ,, | 60 |
| శ్రీ యజ్జగుంట్ల లక్ష్మీకాంతమ్మగారు ,, | 60 |
| శ్రీ దోరెడ్ల వెంకటేశ్వరరావుగారు ,, | 60 |
| శ్రీ చేగు సాంబశివరావుగారు ,, | 60 |
| శ్రీ వూటుకూరి సూర్యనారాయణగారు, వేటపాలెం-ప్రకాశంజిల్లా | 60 |
| శ్రీ కొత్త వెంకటసుబ్బారావుగారు గుంటూరు. | 60 |
| శ్రీ బచ్చు వెంకటసుబ్బమ్మగారు ,, | 60 |
| శ్రీ చీదెళ్ళ శంకరరావుగారు ,, | 60 |
| శ్రీ శ్రీరాం సుబ్బయ్యగారు ,, | 60 |
| శ్రీ యేలూరి పెదవెంకటేశ్వర్లు, నాగరత్నమ్మగార్లు, ,, | 60 |

శ్రీ ఇమ్మడిశెట్టి నాగభూషణం, వీరిధర్మపత్ని వరలక్ష్మమ్మగారు,
గుంటూరు. 60

శ్రీ జూలూరి బాపారత్నంగారి కుమార్డు రాజేంద్రప్రసాదుగారు,
గుంటూరు. 60

శ్రీమతి కొప్పరపు వెంకటసుబ్బమ్మగారు, ,, 60

శ్రీ కొలిశెట్టి కృష్ణమూర్తిగారు వీరి ధర్మపత్ని హనుమాయమ్మగారు
,, 60

శ్రీమతి చిరతనగళ్ళ పార్వతిగారు ,, 60

శ్రీ పోలిశెట్టి వెంకటేశ్వర్లుగారు, ,, 60

శ్రీ జూలూరి కుసుమకుమారిగారు, ,, 60

శ్రీ గొల్ల సుబ్బయ్యగారి దత్తకుమార్డు నాగేశ్వరరావుగారు ,, 60

శ్రీ నీలి శ్రీరామమూర్తిగారు, సి.ఎ. ఆడిటరు ,, 60

శ్రీ వేలూరి చినవెంకటేశ్వర్లు వీరిధర్మపత్ని లక్ష్మీనరసమ్మగారు ,, 60

శ్రీ కొణతం ఆంజనేయులుగారు వీరిధర్మపత్ని హనుమాయమ్మగారు,
,, 60

శ్రీ గుంటూరు కోటేశ్వరరావు, స్వరాజ్యలక్ష్మిగార్లు ,, 60

శ్రీ కొత్తూరి శ్రీరామమూర్తిగారు, సుదర్శన్ ట్రేడర్సు ,, 60

శ్రీ ఇమ్మడిశెట్టి రామలింగంగారి ధర్మపత్ని పరమేశ్వరిగారు, గుంటూరు. 60

శ్రీ భీమినీడి గోవిందుగారు, వీరిధర్మపత్ని సుబ్బమ్మగారు, అనంతారపాడు. 60

శ్రీ భవానిశంకరంగారు, అసిస్టెంటు మార్కెటింగు ఆఫీసరు, గుంటూరు. 60

శ్రీ జాగు గోపాలరావుగారు, ,, 60

శ్రీ కొల్లి రాధాకృష్ణమూర్తిగారి జ్ఞాపకార్థం కుమార్డు శివరామ
కృష్ణమూర్తిగారు వీరిధర్మపత్ని ఉమాదేవిగార్లు ఆం. ప్ర.
స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషన్ - హైదరాబాద్. 60

శ్రీ సంకా శ్రీరాములుగారు, గుంటూరు. 60

మెస్సర్సు స్వస్తిక్ ఇంజనీరింగు వర్క్సు - రాజకోట. 57

ఈ సహృదయులకు, వారి కుటుంబములకు, బంధుమిత్ర పరివారములకు, శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణ నాయకుడు, అఖిలజగన్నాటకసూత్రధారి అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు, సర్వాన్తర్యామి, కరుణానిధి, సత్యస్వరూ

పుడు, శ్రీరాధేశ్వరుడు, పరబ్రహ్మము నైనశ్రీకృష్ణపరమాత్మ ఆయురారోగ్యభోగ భాగ్యాదులను, యదార్థమైన సుఖశాంతులను, ఆచంద్రతారార్కమైన సత్కీర్తినీ, సత్య ధర్మ దైవకార్యానురక్తిని, ప్రసాదించి సర్వకాల సర్వావస్థల యందు రక్షించునుగాక! భక్తిజ్ఞానవైరాగ్యములను బ్రసాదించి అంత్యకాలమున పరంధామ ప్రాప్తి కల్గించుగాక.



శేషం శ్రీకృష్ణ స్మరణం.

గుంటూరు
శ్రీసిద్ధార్థ చైత్ర శుద్ధ
పాడ్యమి – ఉగాది,
29—3—1979.

భక్తజన దాసానుదాసుడు,
సుజనవిధేయుడు,
మట్టుపల్లి శివసుబ్బరాయ గుప్త

# విషయసూచిక

ఏబదినాలుగవ అధ్యాయము :



ఏబదియైదవ అధ్యాయము :



ఏబదియాఱవ అధ్యాయము :



ఏబదియేడవ అధ్యాయము :



ఏబదియెనిమిదవ అధ్యాయము :



ఏబదితొమ్మిదవ అధ్యాయము :



అఱువదియవ అధ్యాయము :



అఱువదియొకటవ అధ్యాయము :

# మంత్రస్తోత్రకవచసూచిక

పుట

# చిత్రసూచిక

— ౦ —

వర్ణ చిత్రములు : పుటలు

రే ఖా చి త్ర ము :



సు వ ర్ణ రే ఖా చి త్ర ము లు :

1. అట్టమీాది చిత్రము : అష్టభుజయుక్తురాలైన శ్రీ ఆద్య ప్రకృతి ఈశ్వరి.

2. అట్టవెనుక చిత్రము : “ప్రణవము”.

— 0 —

# రచయిత పరిచయము

1. పేరు : మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త.
2. జన్మస్థలము : గుంటూరు — ఆంధ్రప్రదేశ్.
3. తల్లిదండ్రులు : శ్రీమతి వేంకటమహాలక్ష్మమ్మ - శ్రీ జగన్నాథంగారు.
4. జననము : విక్రమనామ సంవత్సర ఆశ్వయుజ శుద్ధ అష్టమి
   ది. 8-10-1940 అనగా దుర్గాష్టమి దినమున.
5. గోత్రము : పారాశర్య
6. విద్యాభ్యాసము : గుంటూరు హిందూకాలేజీ హైస్కూలులో ఉన్నత పాఠశాలవఱకు, హిందూకాలేజీలో బి.కాం. వఱకు, దక్షిణభారత హిందీప్రచారసభ ప్రవేశిక.
7. వృత్తి : వాణిజ్యము, శివా యింజనీరింగు కంపెనీ, గుంటూరు.
   ,, ,, . నరసరావుపేట.
   యం. జగన్నాథం, అండ్ జె. యస్. ప్రసాదు, చిలుకలూరిపేట.
8. అభిలాష, కృషి: శ్రీకృష్ణపరమాత్మ చరణారవిందసేవ
   ఆయన దివ్యలీలాచరిత వర్ణనము.
9. రచనలు :
   1. శ్రీమద్బ్రహ్మవైవర్తమహాపురాణ సారసంగ్రహము (ప్రచురితము).
   2. శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణము — (5 భాగములు) రెండు భాగములు ప్రచురితములు.
   3. సత్సంగ సుధాబిందువులు (పది భాగములు)
   4. శ్రీమద్రాఘవేంద్ర గురుచరితము
   5. శ్రీచైతన్యచరితామృతము (పది భాగములు)
   6. శ్రీహనుమద్భాగవతము (శ్రీహనుమచ్చరితామృత సింధువు).
   7. శ్రీ మదాంధ్ర గణేశపురాణము
10. విలాసము : మట్టుపల్లి వారివీధి, కొత్తపేట, గుంటూరు-1 (ఆం. ప్ర.)
    ఫోన్సు : గృహము : 23827 ఆఫీసు : 20827

# కృతిపతి

శ్రీ మదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణము

త్వదీయం వస్తు గోవింద
తుభ్యమేవ సమర్పయే !

ఓం నమః

శ్రీ రస్తు ... శుభ మస్తు

శ్రీ గణేశ్వరాయ నమః

# శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణము

## ప్రకృతి ఖండము

### మొదటి అధ్యాయము

**పంచదేవీరూపిణి యగుప్రకృతియొక్క; ఆమె యంశలు, కళలు, కళాంశలయొక్క విశదవర్ణనము.**

మంగళాచరణము

శ్రీదేవీ జగతాం మాతా విష్ణుమాయా సనాతనీ ।
కృష్ణప్రాణాధిదేవీ చ కృష్ణప్రాణాధికా శుభా ॥
కృష్ణప్రేమమయీ శక్తిః కృష్ణసౌభాగ్యరూపిణీ ।
కృష్ణభక్తిప్రదే రాధే నమస్తే సర్వమంగళే ॥

ఓ రాధా! నీవు శ్రీదేవివి, జగత్తులకు దల్లివి, విష్ణుమాయవు, సనాతనివి, కృష్ణప్రాణముల కధిదేవతవు, కృష్ణప్రాణాధికవు, శుభమైనదానవు, కృష్ణప్రేమమయివి, శక్తివి, కృష్ణసౌభాగ్యరూపిణివి, కృష్ణభక్తి నిచ్చునట్టి దానవు, సర్వమంగళవు ఇట్టి నీకు నమస్కారము.

**నారదుడు పలికెను :**

శ్రీమన్నారాయణమునీంద్రా! నీయనుగ్రహామువలన గణేశ్వరుని జనని యైనదుర్గ, శ్రీమహాలక్ష్మి, సరస్వతి, సావిత్రి, శ్రీరాధాదేవి- యీయైదుగు రాది శక్తులనే ప్రకృతి యందురని యవగత మొనరించుకొనగల్గితిని. ఈయాద్య ప్రకృతులవలననే సకలచరాచరసృష్టి సంభవించుచున్నదని నీదివ్యముఖార విందమునుండి శ్రవణమొనరించి నేను పరమాశ్చర్యచకితుడ నైతిని. జ్ఞాని శ్రేష్ఠా! సాధుపురుషా! నీవు వర్ణించిన యయ్యాదిప్రకృతి యెవరినుండి ప్రాదుర్భ వించెను? ఆజగజ్జనని స్వరూపము లేవి? ప్రకృతిలక్షణము లెట్లుండును? మూల ప్రకృతి యీశ్వరి యెందుల కీయైదుదివ్యస్వరూపములను ధరించెను? మహా భాగా! ఆద్యప్రకృతిసంభూత లైనశక్తిమాతల దివ్యచరిత్రములు, వారి పూజా విధానములు, వారి దివ్యగుణనామ వర్ణనములు, వారి ప్రాదుర్భావప్రసంగ ములు మొదలగు సకలవిషయములను సవిస్తరముగ ననుగ్రహాముతో నా కుప దేశించి నన్ను జరితార్థునిగ జేయవలసినదిగా నిన్ను బ్రార్థించుచున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

వత్సా! ఆసనాతని యగునాద్యప్రకృతియగునీశ్వరియొక్క లక్షణములను వర్ణించుట కెవరు సమర్థులు? అయినను నాపితృదేవు లైనధర్మదేవుని ముఖారవిందమునుండి మున్ను నేను శ్రవణమొనరించిన యాద్యప్రకృతి దివ్య జ్ఞానమును నా కవగతమైనంతవఱకు నీసమక్షమున వర్ణించెద సావధానచిత్తు డవై అవధరింపుము.

ప్రకృష్టవాచకః ప్రశ్చ కృతిశ్చ సృష్టివాచకః ।
సృష్టౌ ప్రకృష్టా యా దేవీ ప్రకృతిః సా ప్రకీర్తితా ॥
గుణే ప్రకృష్టసత్త్వే చ ప్రశబ్దో వర్తతే శ్రుతౌ ।
మధ్యమే కృశ్చ రజసి తిశబ్ద స్తమసి స్మృతః ॥
త్రిగుణాత్మస్వరూపా యా సర్వశక్తిసమన్వితా ।
ప్రధానా సృష్టికరణే ప్రకృతి స్తేన కథ్యతే ॥
ప్రథమే వర్తతే ప్రశ్చ కృతిః స్యా త్సృష్టివాచకః ।
సృష్టే రాద్యా చ యా దేవీ ప్రకృతిః సా ప్రకీర్తితా ॥ (5-8)

వత్సా! 'ప్ర' యనునక్షరమునకు 'ప్రకృష్ట' (పరమప్రవీణ)యనియర్థము. 'కృతి' యనగ 'సృష్టించుట' యని భావము. ఏ దేవి సృష్టి నొనరించుటలో

'ప్రకృష్ట' (పరమప్రవీణ)యో యాదేవినే 'ప్రకృతి' యందురు. సర్వోత్తమములైన సత్త్వగుణములకు వాచకమే 'ప్ర' శబ్దము, మధ్యమము లైన రజోగుణార్థమే 'కృ' శబ్దము, తృతీయము లైనతమోగుణములకు వాచకమే 'తి' శబ్దము. ఏపరమేశ్వరి త్రిగుణాత్మికయో, యామెయే సర్వశక్తిసంపన్నయై సృష్టివిషయకసకలకార్యములందు ప్రధానురా లైనది. అందువలననే యా దేవిని 'ప్రధానము' లేక ప్రకృతి యందురు. 'ప్ర' యనగ ప్రథమ యనియర్థము, 'కృతి' యనగ 'సృష్టి' యని అర్థము. అందువలన సమస్తసృష్టికి నాదికారణ స్వరూపిణియగు నాదేవిని ప్రకృతి యని కీర్తించిరి.

యోగేనాఽఽత్మా సృష్టివిధౌ ద్విధారూపో బభూవ వః ।
పుమాంశ్చ దక్షిణార్ధాఙ్గో వామాఙ్గః ప్రకృతిః స్మృతః ॥
సా చ బ్రహ్మస్వరూపా స్యా న్మాయా నిత్యా సనాతనీ ।
యథాఽఽత్మా చ తథా శక్తి ర్యథాఽగ్నౌ దాహికా స్మృతా ॥
అతఏవ హి యోగీన్ద్రైః స్త్రీపుంభేదం న మన్యతే ।
సర్వం బ్రహ్మమయం బ్రహ్మన్ శశ్వత్పశ్యతి నారద! ॥
స్వేచ్ఛామయ స్యేఽచ్ఛయా చ శ్రీకృష్ణస్య సిసృక్షయా ।
సాఽఽవిర్బభూవ సహసా మూలప్రకృతి రీశ్వరీ ॥ (9-12)

సృష్టిరచనకొఱకు బరబ్రహ్మ మైనపరమాత్మయే రెండురూపములుగ విభక్తుడై నాడు. ఆస్వరూపములే పురుషుడు మఱియు ప్రకృతి యని గ్రహింపుము. భగవంతుని దక్షిణార్థపార్శ్వమే పురుషుడయ్యెను; వామార్థపార్శ్వమే ప్రకృతి యయ్యెను. ఆయాద్యప్రకృతి యీశ్వరియే పరబ్రహ్మస్వరూపిణి, నిత్య, సనాతని, మాయ మొదలగునామములచే గీర్తింపబడుచున్నది. పరబ్రహ్మ మైనపరమాత్మ యెంతటి యనంతశక్తి గలవాడో, ప్రకృతికూడ నంత యనంతశక్తిసమన్వితయే. తాత్పర్యమేమన బరబ్రహ్మ మైనపరమాత్మ యొక్క సమస్తానురూపదివ్యగుణములు ప్రకృతియందును నిహితములై యున్నవి. ఎట్లగ్నియందు సదా దాహకశక్తి యుండునో, యట్లే పరబ్రహ్మ మందు శక్తిస్వరూపిణి యైప్రకృతి సదా విరాజిల్లుచుండును. అందువలననే పరమయోగులు స్త్రీపురుషాదిభేదములను బాటింపరు. నారదా! పరమభక్తు లందఱిని, సర్వత్ర పరబ్రహ్మస్వరూపులనుగనే దర్శించెదరు. భగవంతు డైన శ్రీకృష్ణపరమాత్మయే స్వేచ్ఛామయుడని, సర్వతంత్రస్వతంత్రుడని, పరమ

పురుషుడని గ్రహింపుము. ఆపరబ్రహ్మము సృష్టించుటకు సంకల్పింపగనే మూలప్రకృతి యైనపరమేశ్వరి తక్షణమే ప్రాదుర్భవించెను.

తదాజ్ఞయా పంచవిధా సృష్టికర్మణి భేదతః ।
అథ భక్తానురోధాద్వా భక్తానుగ్రహవిగ్రహా ॥
గణేశమాతా దుర్గా యా శివరూపా శివప్రియా ।
నారాయణీ విష్ణుమాయా పూర్ణబ్రహ్మస్వరూపిణీ ॥
బ్రహ్మాదిదేవై ర్మునిభి ర్మనుభిః పూజితా సదా ।
సర్వాధిష్ఠాతృదేవీ సా బ్రహ్మరూపా సనాతనీ ॥
యశోమఙ్గలధర్మశ్రీ సత్యపుణ్యప్రదాయినీ ।
మోక్షహర్షప్రదాత్రీ యా శోకదుఃఖార్తినాశినీ ॥
శరణాగతదీనార్తపరిత్రాణపరాయణా ।
తేజఃస్వరూపా పరమా తదధిష్ఠాతృదేవతా ॥
సర్వశక్తిస్వరూపా చ శక్తి రీశస్య సంతతమ్ ।
సిద్ధేశ్వరీ సిద్ధరూపా సిద్ధిదా సిద్ధిదేశ్వరీ ॥
బుద్ధి ర్నిద్రా క్షుత్పిపాసా ఛాయా తన్ద్రా దయాస్మృతిః ।
జాతిః క్షాన్తి శ్చ కాన్తి ర్భ్రాన్తిశ్చ చేతనా ॥
తుష్టిః పుష్టి స్తథా లక్ష్మీ ర్వృత్తి ర్మాతా తథైవ చ ।
సర్వశక్తిస్వరూపా సా కృష్ణస్య పరమాత్మనః ॥ (13-20)

ఆయాద్యప్రకృతియే భగవంతుని యాజ్ఞనుసారము సకలచరాచరసృష్టి నిర్మాణార్థమై యైదుదివ్యరూపముల బ్రాదుర్భవించెను. ప్రకృతిమాత తన యనన్యభక్తుల ప్రార్థనలను మన్నించి, వారిపై ననుపమకృపాసుధలను వర్షించుటకే వివిధదివ్యరూపములను ధరించెను. శ్రీగణేశ్వరుని జననియే భగవతి దుర్గ. ఆశక్తిస్వరూపిణినే శివస్వరూప, సతి, పార్వతి, శాంభవి మొదలగుదివ్య నామములతో గీర్తింతురు. ఆదేవియే సదాశివుని ప్రియార్ధాంగి. ఆమెయే నారాయణి, విష్ణుమాయ, పూర్ణబ్రహ్మస్వరూపిణి మున్నగు ననంత దివ్య నామధారిణి. బ్రహ్మాది దేవతలు, మనువులు, మహర్షులు, మానవులు మొదలుగాగల సకలచరాచరజీవు లీమెను బూజించి ధ్యానింతురు. ఈప్రకృతి స్వరూపమే సర్వులకు నధిష్ఠాత్రిదేవి, సనాతనబ్రహ్మస్వరూపిణి. తన యనన్య భక్తులకు యశమును, మంగళములను, ధర్మార్థములను, సుఖములను, మోక్షములను, హర్షోల్లాసములను బ్రసాదించుటయే యీజనని స్వాభావికము లగు

గుణములు. దుఃఖశోకాద్యుద్వేగముల నీశక్తిమాత దూర మొనరింప గలదు. ఈజనని తనశరణాగతదీనులను, పీడితులను సదా రక్షించుటలో సంలగ్నమై యుండును. ఈమె శ్రీవిగ్రహ మత్యంత తేజోమయము. ఈమెయే సర్వశక్తిస్వరూపిణియై శంకరుని నిరంతరము శక్తిశాలిగ నొనర్చెను. సిద్ధేశ్వరి, సిద్ధిస్వరూపిణి, సిద్ధిప్రదాయని, సిద్ధిప్రదాత్రీశ్వరి, బుద్ధి, నిద్ర, క్షుధ, పిపాస, ఛాయ, తంద్ర, దయ, స్మృతి, జాతి, క్షాన్తి, భ్రాన్తి, శాన్తి, చేతనత్వము, తుష్టి, పుష్టి, లక్ష్మి, వృత్తి, మాత మొదలగు నామధేయము లన్నియు నీజనని నామములే. శ్రీకృష్ణుడే భగవంతుడు, పరబ్రహ్మమైన పరమాత్మ. ఈదేవి తత్సమీపముననే సర్వశక్తి సంయుక్తయై సదా విరాజిల్లుచుండును.

ఉక్తాః శ్రుతౌ శ్రుతగుణ శ్చాతిస్వల్పో యథాఽగమమ్।
గుణోఽస్త్యనన్తోఽనన్తాయా అపారం చ నిశామయ॥
శుద్ధసత్త్వస్వరూపా యా పద్మా చ పరమాత్మనః।
సర్వసమ్పత్స్వరూపా యా తదధిష్ఠాతృదేవతా॥
కాన్తా దాన్తాఽతిశాన్తా చ సుశీలా సర్వమఙ్గలా।
లోభా న్మోహా త్కామరోషా న్మదాహంకారత స్తథా॥
త్యక్తాఽనురక్తా పత్యుశ్చ సర్వాద్యా చ పతివ్రతా।
ప్రాణతుల్యా భగవతః ప్రేమపాత్రీ ప్రియంవదా॥
సర్వసస్యాత్మికా సర్వజీవనోపాయరూపిణీ।
మహాలక్ష్మీశ్చ వైకుణ్ఠే పతిసేవాపరాయణా॥
స్వర్గే చ స్వర్గలక్ష్మీశ్చ రాజలక్ష్మీశ్చ రాజసు।
గృహే చ గృహలక్ష్మీశ్చ మర్త్యానాం గృహిణాం తథా॥
సర్వేషు ప్రాణిద్రవ్యేషు శోభారూపా మనోహరా।
ప్రీతిరూపా పుణ్యవతాం ప్రభారూపా నృపేషు చ॥
వాణిజ్యరూపా వణిజాం పాపినాం కలహంకరీ।
దయామయీ భక్తమాతా భక్తానుగ్రహకారికా॥
చపలే చపలా భక్తసమ్పదో రక్షణాయ చ।
జగ జ్జీవన్మృతం సర్వం యయా దేవ్యా వినా మునే॥
శక్తి ర్ద్వితీయా కథితా వేదోక్తా సర్వసంమతా।
సర్వపూజ్యా సర్వవన్ద్యా చాన్యాం మత్తో నిశామయ॥ (21-30)

శ్రుతులందు ప్రకృతివిఖ్యాత గుణము లత్యంత సంక్షేపముగ వర్ణింపబడెను. ఎందువలననగా ఈదేవి యనంతయగుటవలన నీమె దివ్య గుణములుకూడ నసంఖ్యాకములే, వర్ణించుట కలవికానివే. ఈదేవియన్య రూపములనుగూడ వర్ణించెద నవధరింపుము. జగత్ప్రభువైన శ్రీహరి శక్తి స్వరూపమే పరమశుద్ధసత్త్వస్వరూపిణి యైనభగవతి శ్రీమహాలక్ష్మి, అఖిల జగములం దున్నసర్వసంపత్తులు నామెస్వరూపములే, లక్ష్మి సకలైశ్వర్యములకు నధిష్ఠాత్రి దేవి. ఆభగవతి పరమసౌందర్యరాశి, యనుపమసంయమస్వరూపిణి, శ్రేష్ఠస్వభావసంపన్నురాలు, పరమశాంతవిగ్రహధారిణి, సమస్తమంగళములు మూర్తీభవించిన దివ్యరూపము. లోభము, మోహము, కామము, క్రోధము అహంకారాది దుర్గుణము లీమె నంటవు. తన యనన్యభక్తులను గరుణతో ననుగ్రహించుట, తనప్రాణేశ్వరు డైనశ్రీహరిని సదా ప్రేమించి సేవిం చుట శ్రీమహాలక్ష్మి సహజస్వభావములు. లక్ష్మీదేవి సర్వులకు నాదికారణ రూపము, పరమపతివ్రత, సాధ్వి. ఆమె శ్రీహరినే ప్రాణసమునిగ భావించి యాదేవాదిదేవునే సదా ప్రేమించి సేవించును. లక్ష్మి యత్యంతప్రియభాషిణి. ఆమె యెపుడు నప్రియము లాడదు. సకల సస్యములు, ధాన్యములు, సకల జీవన రక్షోపాయములు నామె స్వరూపములే. దేహధారుల జీవనములను స్థిరముగ నుంచుటకే, వారిని సౌభాగ్యవంతులుగ నను గ్రహించుటకే శ్రీమహాలక్ష్మి యీదివ్యరూపమును ధరించెను. స్వర్గమం దామెయే స్వర్గలక్ష్మి; నరేశ్వరులకు రాజ్యలక్ష్మి; గృహస్థుల గృహములందు గృహలక్ష్మి. సమస్తప్రాణులందు, సమస్తద్రవ్యములందు విరాజిల్లు సర్వో త్కృష్ట మైనశోభ యీమె స్వరూపమే. శ్రీమహాలక్ష్మియే పుణ్యాత్ములకు కీర్తి, రాజాధిరాజులకు ప్రభ, వాణిజ్యశ్రేష్ఠులచెంత వాణిజ్యలక్ష్మి, పాపాత్ము లందు గలహకారిణి. ఈదేవి యత్యంతదయామయి, భక్తులకు మాతృ స్వరూ పిణి, భక్త వరప్రదాయిని.

శ్రీమహాలక్ష్మి తన యనన్యభక్తుల సంపదలను రక్షించుటకు జంచలయై చరించును. మునీశ్వరా! ఈదేవి లేనిదే సకలజగములు జీవించియున్నను మర ణించినట్లే భావింపవలెను. వేదములందు కీర్తింపబడినటుల సర్వసమ్మత మతానుసారముగ నీరెండవప్రకృతి వర్ణనమును నానుండి శ్రవణమొనరించితివి. సర్వపూజ్య, సర్వవంద్య యైన యీప్రకృతి యన్యరూపములను వర్ణించెద నవధరింపుము.

వాగ్బుద్ధివిద్యా జ్ఞానాధిదేవతా పరమాత్మనః ।
సర్వవిద్యాస్వరూపా యా సా చ దేవీ సరస్వతీ ॥
సుబుద్ధిః కవితా మేధా ప్రతిభా స్మృతిదా నృణామ్ ।
నానాప్రకారసిద్ధాన్తభేదార్థ కల్పనాప్రదా ॥
వ్యాఖ్యాబోధస్వరూపా చ సర్వసన్దేహభంజనీ ।
విచారకారిణీ గ్రన్థకారిణీ శక్తిరూపిణీ ॥
సర్వసంగీతసన్ధాన తాలకారణరూపిణీ ।
విషయజ్ఞానవాగ్రూపా ప్రతివిశ్వం చ జీవినామ్ ॥
యయా వినా చ విశ్వౌఘో మూకో మృతసమః సదా।
వ్యాఖ్యాముద్రాకరా శాన్తా వీణాపుస్తకధారిణీ ॥
శుద్ధసత్త్వస్వరూపా యా సుశీలా శ్రీహరిప్రియా ।
హిమచన్దనకున్దేన్దు కుముదామ్భోజసన్నిభా ॥
జపన్తీ పరమాత్మానం శ్రీకృష్ణం రత్నమాలయా ।
తపఃస్వరూపా తపసాం ఫలదాత్రీ తపస్వినీ ॥
సిద్ధివిద్యాస్వరూపా చ సర్వసిద్ధిప్రదా సదా ।
దేవీ తృతీయా గదితా శ్రీయుక్తా జగదంబికా ॥
యథాగమం యథాకించిదపరాం సంనిబోధ మే । (31-38)

నారదమునీంద్రా! ప్రకృతిమూడవదివ్యరూపమును వర్ణించెద నాకర్ణింపుము. పరబ్రహ్మమైన పరమాత్మనుండి యావిర్భవించిన వాణికి, బుద్ధికి, విద్యకు, జ్ఞానమునకు నధిష్ఠాత్రి సరస్వతి. విద్యలన్నియు నామెస్వరూపములే. ఆజనని కృపాకటాక్షమువలననే దేహధారులకు సుబుద్ధి, కవిత్వము, మేధ, ప్రతిభ, స్మరణశక్తి మొదలగునవి లభింపగలవు. అనేకప్రకారములైన సిద్ధాంతభేదములను నర్థకల్పనాశక్తులను సరస్వతీదేవియే ప్రసాదించును. వాణి సకలములకు వ్యాఖ్యయై, బోధస్వరూపిణియై భాసించును. ఈ దేవికృప కల్గిన సమస్తసందేహములు నశించి యఖండజ్ఞానము ప్రాప్తించును.

ఈశక్తినే విచారకారిణి, గ్రంథకారిణి, శక్తిస్వరూపిణి, సర్వసంగీతసంధానతాళకారణరూపిణి యని జనులు కీర్తింతురు. ప్రత్యేకవిశ్వమునందు సకలజీవులకు వాణియే విషయమై, జ్ఞానమై, సకలవిద్యలకు నధిష్ఠాత్రియై విరాజిల్లును. ఈ శక్తిస్వరూపిణి లేనిచో సకలవిశ్వములు మూకములై మృతసములు కాగలవు. ఆ పరమశాంత స్వరూపిణి సుశీల శ్రీహరిప్రియ స్వహస్తము

లును వీణాపుస్తకజపమాలలను ధరించి యభయముద్రతో శుద్ధసత్త్వవిగ్రహముతో సదా విరాజిల్లును. హిమచందన కుందేందుకుముదాంభోజసన్నిభ మైన భగవతి సరస్వతి హస్తమునందు గలరత్నమాలను త్రిప్పుచు సదా శ్రీకృష్ణ పరమాత్మ దివ్యనామమునే జపించుచుండును. ఆతపస్స్వరూపిణి తాపసులకు తపఃఫలములను ప్రసాదించుటలో సదా తత్పరమై యుండును. సిద్ధి, విద్యా బుద్ధులు నీదేవీస్వరూపములే. జగదంబికయు, శ్రీసంయుక్తయునైన దేవీ తృతీయప్రకృతి నాగమానుసారముగ నా కవగతమైనంతవఱకు గించిన్మాత్రమే వర్ణించితిని.

మాతా చతుర్ణాం వేదానాం వేదాఙ్గానాం చ ఛన్దసామ్ ॥
సన్ధ్యావన్దనమన్త్రాణాం తన్త్రాణాం చ విచక్షణా ।
ద్విజాతిజాతిరూపా చ జపరూపా తపస్వినీ ॥
బ్రాహ్మణ్యతేజోరూపా చ సర్వసంస్కారకారిణీ ।
పవిత్రరూపా సావిత్రీ గాయత్రీ బ్రహ్మణః ప్రియా ॥
తీర్థాని యస్యా స్సంస్పర్శం దర్శనం వాంఛన్తి శుద్ధయే।
శుద్ధస్ఫటికసంకాశా శుద్ధసత్త్వస్వరూపిణీ ॥
పరమానన్దరూపా చ పరమా చ సనాతనీ ।
పరబ్రహ్మస్వరూపా చ నిర్వాణపదదాయినీ ॥
బ్రహ్మతేజోమయీ శక్తి స్తదధిష్ఠాతృదేవతా ।
యత్పాదరజసాం పూతం జగ త్సర్వం చ నారద॥ (39-44)

ఇకనిపుడాద్యప్రకృతి నాల్గవరూపమును వర్ణించెద నవధరింపుము. నాల్గువేదములకు, వేదాంగములకు, ఛందస్సులకు నీమె జనని. ఈదేవినుండియే సంధ్యావందనాదిమంత్రములు, తంత్రములు నుద్భవించినవి. ద్విజాతీయుల ననుగ్రహించుటకే యీశక్తి దివ్యమంగళ స్వరూపమును ధరించెను. ఈ మాతయే బ్రహ్మజ్ఞాన స్వరూపిణి, మహాతపస్విని, బ్రహ్మతేజముతో ప్రకాశించుచు సర్వులకును సంస్మరింపగలదేవత యైయున్నది.

ఈపరమపవిత్రదివ్యస్వరూపధారిణి యైనశక్తినే భక్తులు సావిత్రి యని, గాయత్రి యని కీర్తింతురు. ఈగాయత్రీదేవి బ్రహ్మ కనన్యప్రియశక్తి. పుణ్యతీర్థములుకూడ బవిత్రత కొఱ కీవేదమాత దర్శనమును, స్పర్శను గాంక్షించుచున్నవి. శుద్ధస్ఫటికమణిదివ్యకాంతులతో ప్రకాశించు సత్త్వ

మయస్వరూపిణి యైనసావిత్రిదివ్యసందర్శనము భక్తులకు బరమానందదాయకము. ఆసనాతనీపరబ్రహ్మస్వరూపిణి తనయాశ్రితులకు నిర్వాణపదప్రదాయని. గాయత్రి బ్రహ్మతేజోమయి, పరమశక్తి, శక్తికే అధిష్ఠాత్రీదేవి. నారదా! ఆమెచరణధూళి సకలజగములను బవిత్రమొనరింపగలదు.

దేవీ చతుర్థీ కథితా పంచమీం వర్ణయామి తే ।
ప్రేమప్రాణాధిదేవీ యా పంచప్రాణస్వరూపిణీ ॥
ప్రాణాధికప్రియతమా సర్వాద్యా సున్దరీ వరా ।
సర్వసౌభాగ్యయుక్తా చ మానినీ గౌరవాన్వితా ॥
వామార్ధాఙ్గస్వరూపా చ గుణైస్తేజసా సమా ।
పరావరా సర్వమాతా పరమాద్యా సనాతనీ ॥
పరమానన్దరూపా చ ధన్యా మాన్యా చ పూజితా ।
రాసక్రీడాధిదేవీ చ కృష్ణస్య పరమాత్మనః ॥
రాసమణ్డలసమ్భూతా రాసమణ్డలమణ్డితా ।
రాసేశ్వరీ సురసికా రాసావాసనివాసినీ ॥
గోలోకవాసినీ దేవీ గోపీవేషవిధాయికా ।
పరమాహ్లాదరూపా చ సన్తోషహర్షరూపిణీ ॥
నిర్గుణా చ నిరాకారా నిర్లిప్తాఽఽత్మస్వరూపిణీ ।
నిరీహా నిరహంకారా భక్తానుగ్రహవిగ్రహా ॥
వేదానుసారధ్యానేన విజ్ఞేయా సా విచక్షణైః ।
దృష్టిర్దృష్టా సహస్రేషు సురేన్ద్రైర్మునిపుంగవైః ॥
వహ్నిశుద్ధాంశుకాధానా రత్నాలంకారభూషితా ।
కోటిచన్ద్రప్రభాజుష్టశ్రీయుక్తా భక్తవిగ్రహా ॥
శ్రీకృష్ణభక్తదాస్యైకదాయినీ సర్వసంపదామ్ ।
అవతారే చ వారాహే వృషభానుసుతా చ యా ॥
యత్పాదపద్మసంస్పర్శపవిత్రా చ వసుంధరా ।
బ్రహ్మాదిభిరదృష్టా యా సర్వదృష్టా చ భారతే ॥
స్త్రీరత్నసారసంభూతా కృష్ణవక్షఃస్థలోజ్జ్వలా ।
యథా ఘనే నవఘనే లోలా సౌదామినీ మునే! ॥ (25-56)

"నాల్గవప్రకృతిని వర్ణించితిని. ఇక నైదవశక్తిని వర్ణించెద. సావధానచిత్తుడవై యనన్యభక్తితో నాకర్ణింపుము. ఈజననియే ప్రేమకు, ప్రాణము

లకు నధిష్ఠాత్రీదేవి యైనపంచప్రాణస్వరూపిణి. ఈమె పరమాత్ముడైన శ్రీకృష్ణునకు ప్రాణాధిక ప్రియతమ, జగదేకసుందరి, సర్వమంగళ, సకల ప్రకృతులందు నగ్రగణ్యురాలు, మానిని, సకలగౌరవాన్విత, సర్వసద్గుణసంపన్న. పరమసౌభాగ్యవతి యైనయీదేవి పరబ్రహ్మమున కర్ధశరీరమే. ఈ శ్రేష్ఠ ప్రకృతియే సర్వులకు జనని, పారావార, పరమాద్య, సనాతని, పరమానంద స్వరూపిణి, ధన్యురాలు, మాన్యురాలు, సకలపూజితురాలు. ఈశ్రేష్ఠప్రకృతి స్వరూపమే శ్రీరాధ. రాధాదేవి పరబ్రహ్మముతో సమానమైన దివ్యగుణ సంపన్నురాలు. ఈమె నిత్యనికుంజేశ్వరి, రాసక్రీడల కధిష్ఠాత్రీదేవి, శ్రీకృష్ణుని యర్ధాంగమునుండి రాసమండలమధ్యమున నీదేవి యావిర్భవించెను. దివ్య గోలోకపరంధామములో విరాజిల్లునీయీశ్వరి ననన్యభక్తులు రాసేశ్వరి, సురసిక యనునామములతో గీర్తింతురు. గోపికావేషధారిణి యైనయీమె పరమానంద స్వరూపిణి. శ్రీరాధాదేవి దివ్యవిగ్రహము హర్షసంతోషములతో బరిపూర్ణ మైవిరాజిల్లును. ఆమె సచ్చిదానంద స్వరూపిణి యని గ్రహింపుము. జనని శ్రీరాధ నిర్గుణ (లౌకిక త్రిగుణరహిత స్వరూపభూత మైనగుణవతి) యని, నిర్లిప్త (లౌకిక విషయభోగరహిత) యని, నిరాకార (పాంచభౌతిక శరీరరహితమైన దివ్యచిన్మయ స్వరూపిణి) యని, ఆత్మస్వరూపిణి (శ్రీకృష్ణుని యాత్మ) యని భక్తజనులు సదా కీర్తింతురు. ఇచ్ఛాహంకారరహిత యైన యీమాతృశ్రీ తనయనన్యభక్తుల ననుగ్రహించుట కనేక దివ్యావతారములను ధరించెను. వేదోక్తవిధి ననుసరించి యేకాగ్రచిత్తులై ధ్యానించి యనన్య భక్తితో విద్వాంసులైనవారీజనని దివ్యానుగ్రహము పొందెదరు. సురేంద్రు లైనను, మునీంద్రులైనను, సమస్తచరాచరజీవులైనను, దమ సామాన్యనేత్రములతో నీజగజ్జననిదివ్యచిన్మయరూపమును దర్శింపలేరు. శ్రీరాధామాత సచ్చిదానంద విగ్రహమును సందర్శనమొనరించుటకు భక్తిజ్ఞానములనెడు నేత్రము లవసరము.

అగ్నిశుద్ధదివ్యవస్త్రధారిణియై యనేకసువర్ణరత్నాభరణభూషితయై శ్రీరాధామాత కోటానుకోట్ల పూర్ణిమాచంద్రుల కాంతిని మించి సదా ప్రకాశించును. సర్వశోభాసంపన్నురాలైన శ్రీవిగ్రహధారిణి యైనరాధ సంపూర్ణైశ్వర్యములకు నిలయము. శ్రీకృష్ణభగవద్భక్తుల కాయనయెడల దాస్యసౌభాగ్యము నీజననియే యనుగ్రహింపగలదు. సకలైశ్వర్యములందు శ్రీకృష్ణ దాస్య

సౌభాగ్యమే సర్వోత్కృష్టమని యీప్రకృతి యభిప్రాయము. వృషభానుని గృహమున దివ్యరూపధారిణియై శ్రీరాధామాత యవతరించెను. ఈదేవ దేవే శ్వరిచరణకమలరజస్సంస్పర్శముచే బృథ్వీసహితము పరమపునీత మైనది. నారదా! ఏజగన్మాతదర్శనము బ్రహ్మాదులకును బరమదుర్లభమో, యాదేవాది దేవి యీవరాహకల్పమున ననన్యకరుణాభరితయై భారతవర్షములో నవతరించి సకలప్రాణులకు దనదివ్యసందర్శన మొసంగెను. సకల స్త్రీరత్నసారసంభూత యైన యీయాద్యప్రకృతి శ్రీరాధాదేవి నవీనజలధరములో విద్యుల్లతవిరాజిల్లు నట్లు శ్రీకృష్ణపరమాత్మ వక్షఃస్థలమునందు విరాజిల్లుచుండును".

రాధామాతృదివ్యసందర్శన మొందుటకు విధాత యైనబ్రహ్మ యఱువదివేలదివ్యవర్షములు ఘోరతప మాచరించెను. అయినను విధాతకు శ్రీరాధా దేవి సందర్శన సౌభాగ్యము ప్రాప్తింపలేదు. బ్రహ్మ యొనర్చిన తపస్సునకు, నారాధనకు, రాధాదేవి కరుణించి పవిత్రభారతవర్షములో దివ్యబృందావన ములో వృషభానుకన్యగా నవతరించి శ్రీకృష్ణసహితముగ దనదివ్యదర్శనమును బ్రహ్మదేవున కొసంగెను.

ఆద్యప్రకృతిమాత కంశములు, కళలు, నంశాంశములు, కళాకళాంశ ములు మొదలగుభేదములతో ననేకరూపములు కలవు. ప్రత్యేక విశ్వమం దున్నసర్వస్త్రీలు ప్రకృతిస్వరూపిణులే. నేను మొదట వర్ణించిన పంచప్రకృ తులను బూర్ణప్రకృతు లందురు. ప్రకృతిమాత కేయేప్రధానాంశములు కలవో, వానిని వర్ణించెద నవధరింపుము. వసుంధరను పావన మొనరించు చున్న గంగాభవాని ప్రకృతిమాత ప్రధానాంశము. ఈసనాతని గంగ జల స్వరూపిణి. శ్రీకృష్ణపరమాత్మ పుణ్యాం (దివ్యాం)గములనుండి యావిర్భ వించినగంగ పాపులయొక్క పాపము లనెడునింధనములను భస్మమొనరింపగల ప్రజ్వలితాగ్నిస్వరూపిణి. గంగాభవానిని స్మరించినను, దజ్జలములందు స్నాన మాడినను, దజ్జలములను పానమొనరించినను దేహధారు లైనజీవులు కైవల్య పదమున కధికారులు కాగలరు. ఈదేవి యారాధనము గోలోకగమనమున కేకసోపానము. గంగామాతస్వరూప మత్యంతపవిత్రము. సకలసరిత్తులందు, సమస్తతీర్థములందు నీమెయే శ్రేష్ఠురాలు. పవిత్రగంగాభవాని శంకరుని మస్తకముపై జటాజూటమధ్యములో సదా విరాజిల్లును. సదాశివుని జటా జూటమునుండి బయల్వెడలి గంగ భారతవర్షమును బరమపవిత్ర మొన

రించెను. తపోధనుల తపములకు సఫలత్వమును బ్రసాదించుటకే దివినుండి గంగ భువి కరుదెంచెను. పూర్ణిమాచంద్రునిపంచు వెన్నెలవలె, నవవికసిత శ్వేతకమలమువలె, బరిశుద్ధక్షీరమువలె గంగాభవాని స్వరూపముశుద్ధసత్త్వమయము. ఈపరమసాధ్వి శ్రీమన్నారాయణున కత్యంతప్రీతిపాత్రురాలు.

శ్రీతులసికూడ మూలప్రకృతి ప్రధానాంశమే. శ్రీమహావిష్ణుప్రియ యైనతులసీమాతకు విష్ణుదేవుని వశీభూతుని గావించుకొనుటయే స్వాభావిక గుణము. శ్రీమహావిష్ణుచరణారవిందములే యీాజననికి నివాసస్థానములు. మునీశ్వరా! సకలతపములు, సంకల్పములు, పూజలు, శుభకర్మములు తులసీదేవి యనుగ్రహమునలన శీఘ్రముగ సంపన్నములు కాగలవు. సమస్తపుష్పము లందు శ్రీతులసీదళము భగవంతున కత్యంతప్రియ మైనపవిత్రపూజాకుసుమము. నారదా! శ్రీతులసి పరమపావని, యఖండపుణ్యప్రదాయిని. సందర్శనస్పర్శ మాత్రముననే యీామెసకలజీవులకు బరంధామ మొసంగగలశక్తిసంపన్నమైనది శుష్కకాష్ఠములవంటి పాపపుంజములను దహింపజేయుటకు బ్రజ్వలితాగ్ని స్వరూపమును ధరించి యీాకలియుగములో నాతులసి బవిత్రవృక్షరూపమున నావిర్భవించెను. ఈతులసీ దివ్యచరణస్పర్శమాత్రముననే వసుంధర యత్యంత ధన్యురాలై పరమపావని యైనది. శ్రీతులసి లేకుండ నాచరించు దైవకర్మములు నిష్ఫలములని భావింపవలెను. తులసీదేవి యనన్యకృపవలన ముముక్షువులు ముక్తి నొందగలరు. ఎవరెవ రేయేమనోవాంఛలతో శ్రీతులసీదేవి నుపాసించెదరో, వారివారికోర్కె లన్నియు సకాలములోనే సంపన్నములు కాగలవు. పవిత్రభరతభూమిపై వృక్షరూపమున విరాజిల్లిన శ్రీతులసి సాక్షాత్కల్పవృక్షస్వరూపమని గ్రహింపుము. పాపాత్ము లైనజీవులను రక్షించుటకే, యుద్ధరించుటకే యీాయపారకరుణామయి పృథ్వికి దయచేసెను. శ్రీతులసి పూజనీయ దైవీశక్తులందు బరాదేవత యనిగ్రహింపుము.

ఆద్యప్రకృతియొక్క మఱియొకప్రధానాంశమే జరత్కారుదేవి. ఈమె కశ్యపప్రజాపతి మానసపుత్రిక; అందువలననే జరత్కారుదేవిని మనసాదేవి యనికూడ గీర్తింతురు. మహావిదుషీమణి యైనమనసాదేవి శంకరునకు బ్రియ శిష్యురాలు; ఆదిశేషునకు గారాబుసహోదరి. సమస్తసర్పజాతులు జరత్కారు దేవిని బరాదేవతగ నారాధించి గౌరవించును. సర్పములే వాహనములుగా గలయీాదేవిని నాగేశ్వరి, నాగమాత మొదలగునామములతో భక్తులు

కీర్తింతురు. మనసాదేవి యఖండసిద్ధయోగిని యైననాగలోకవాసిని. సాక్షా చ్ఛ్రీహరిస్వరూపిణి యైనజరత్కారుదేవి శ్రీమహావిష్ణువున కనన్యభక్తురాలు. తపస్స్వరూపిణి యైనయీదేవి సదా శ్రీహర్యారాధనములందు సంలగ్నురాలై యుండును. నారదా! భగవతి యగుమనసాదేవి మూడులక్షల దివ్యవర్షముల పర్యంతము శ్రీహరి ప్రసన్నత కొఱకు ఘోరతప మాచరించెను. సర్వసంబంధములైన సకలమంత్రతంత్రములకు నీదేవి యధిష్ఠాత్రి. అహర్నిశములు పరబ్రహ్మసంస్మరణమందే సంలగ్నయైయుండు నీమెను బరబ్రహ్మస్వరూపిణి యని బుధజనులు కీర్తింతురు. ఈమెప్రాణేశ్వరు డైనజరత్కారుమహర్షి శ్రీకృష్ణ పరమాత్మ యంశోద్భవుడు. తపస్వులందు వరేణ్యు డైనయాస్తీకమహర్షి యీామె సుపుత్రుడు.

నారదా! ఆద్యప్రకృతియొక్క మఱియొకప్రధానాంశమునే దేవసేన యందురు. మాతృకలందు వరేణ్యా యైనయీదేవిని భక్తజనులు భగవతి "షష్ఠీ" యని ప్రార్థింతురు. ప్రత్యేకలోకమందు శిశువులను బాలించుట, రక్షించుట, యీామె ప్రధానకార్యము. ఈసాధ్వి ప్రకృతియొక్క యాఱవ యంశము కావుననే యీామెను షష్ఠీదేవి యందురు. విష్ణుదేవుని పరమభక్తురాలైన శ్రీషష్ఠీదేవి కార్తికేయునకు బ్రియపత్ని. సంతానోత్పత్తిసమయములం దభ్యుదయము నాకాంక్షించి ప్రజలీషష్ఠీదేవి నారాధింతురు. సంతానోదయానంతర మాఱవదినమున సూతికాగృహములో శ్రీషష్ఠీదేవిప్రీత్యర్థము ప్రజలు పూజ లొనరింతురు. కళ్యాణకాముకు లైనవారు శిశుజనన మైనయిరువదియొకటవదినమున షష్ఠీభగవతి నుపాసించెదరు. పరమదయాస్వరూపిణి యైనశ్రీషష్ఠీదేవసేన సదా తనయాశ్రితులను రక్షించుటలో దత్పరయై యుండును. జలములందు, స్థలమందు, గగనమందు, కందరములందు, మఱి యెందైనను శిశువులను రక్షించుట దేవసేన ప్రధానకార్యము.

ప్రకృతియొక్క మఱియొక ప్రధానాంశమే 'మంగళచండి'. ఈ శక్తి ప్రకృతిముఖమునుండి యుద్భవించెను. ఈమె కృపవలన భక్తులకు సమస్త మంగళములు సులభములు కాగలవు. సృష్టిసమయములో నీమె మంగళమయస్వరూపిణియై లయసమయమందు క్రోధమయాత్యంత భయంకర స్వరూపిణియై దర్శనమొసంగును. అందువలననే యీాశక్తిని విద్వాంసులు మంగళచండి యని కీర్తించిరి. ప్రతిమంగళవారమున విశ్వములం దంతట

దేహధారు లై నజీవులీమె నారాధింతురు. ఈదేవి యనన్యానుగ్రహమువలననే సాధకు లై నభక్తులు పుత్రపౌత్రులను, ధనసంపదలను యశఃకీర్తులను గళ్యాణ జయములను బడయగలరు. ఈదేవి ప్రసన్న యైన ప్రపన్నస్త్రీల సకలమనోరథ ములు నిశ్చయముగ సిద్ధింపగలవు. భగవతి యగునీమహేశ్వరి కినుకవహించిన తక్షణమే విశ్వములు భస్మములు కాగలవు.

ప్రకృతియొక్క మఱియొకప్రధానాంశమే భగవతి మహాకాళి. ఆది కాలమున భగవతి దుర్గ శుంభనిశుంభులతో సంగ్రామ మొనరించు సమయ మున నీమహాకాళి, దుర్గామాత లలాటమందుండి దుష్టసంహారార్థము, శిష్ట రక్షణార్థము నావిర్భవించెను. నారదా! ఈశక్తి జననిదుర్గకు నర్థాంశమని తెలిసికొనుము. గుణములందు, తేజఃపరాక్రమములందు, సంపూర్ణశక్తులందు మహాకాళి జననిదుర్గాసమురాలు. సంపూర్ణశక్తులం దీమెయగ్రగణ్య. కాళిని మించిన బలవంతు లీవిశ్వములలో మఱియొకరు లేరు. ఈపరమయోగస్వరూ పిణి యైనదేవి భక్తులకు సంపూర్ణసిద్ధులను బ్రసాదింపగల సమర్థురాలు. శ్రీకృష్ణుని యనన్యభక్తురా లైనయామె తేజమందు, పరాక్రమాది గుణము లందు శ్రీకృష్ణునితో సమానురాలు. నారదా! ఈమె యంగకాంతికూడ గృష్ణవర్ణమే. మహాకాళిసంకల్పమాత్రముననే బ్రహ్మాండములు నశింపగలవు. జగములందు బరిఢవిల్లిన దుష్టశక్తులను మర్దించుటకే యీజనని యత్యంత భయంకరస్వరూపిణిగ నావిర్భవించి ఘోరసంగ్రామములందు దురాత్ము లైన రాక్షసాధములను సంహరించి ధర్మసంస్థాపన మొనరించెను. దుర్మార్గుల కత్యంతభయంకర వికృతరూపమున దర్శనమొసంగి శిక్షించు నీజనని మహాకాళి తన యనన్యభక్తుల కత్యంతశాంత దివ్యస్వరూపమున సాక్షాత్కరించి వారల ననన్యకరుణతో ననుగ్రహించును. మహర్షీ! ఈదేవి నారాధించిన ధర్మార్థ కామమోక్షములనెడి చతుర్విధపురుషార్థములు నిశ్చయముగ సిద్ధించును. బ్రహ్మాదిదేవతలు, మహర్షిగణములు, సకలమానవసమాజములు తుదకు దైత్యులుకూడ నీమహాకాళిని భక్తితో నారాధింతురు.

బ్రహ్మనందనా! భగవతివసుంధరాదేవి కూడ నాద్యప్రకృతి ప్రధా నాంశయే. ప్రత్యేకవిశ్వమందు గలజగము లీదేవిపై నాధారపడి స్థిరము లై యున్నవి. భక్తు లీమెను సర్వసస్యప్రసూతిక యని కీర్తింతురు. ఈదేవినే రత్నకర, రత్నగర్భ యని బుధజనులు పొగడిరి. సంపూర్ణరత్నములు, ననేక

లోహములు, ననేకశక్త్యుత్పాదక పదార్థములు నీమె గర్భమందే నిక్షిప్తము లైయున్నవి. నరేశ్వరులు, జనులు, సకలజీవులు తమస్థితికొఱ కీదేవిని స్తుతించి నిరంతర మారాధింతురు. నారదా! సకలదేహధారు లైనజీవులకు జీవనాధారము లైనయాహారముల నుత్పన్న మొనరించుటకే ఆద్యప్రకృతి యనన్యకరుణామయియై యీదివ్యరూపమును ధరించెను. సంపూర్ణసంపదలను ప్రసాదింపగల యీవసుంధరాదేవి లేనిచో సమస్తచరాచరజగములు నిరాధారములై నశించును.

మునీశ్వరా! ప్రకృతి కేయేకళాంశములు కలవో యెవరెవరికి బ్రియ పత్నులో యీవిషయముల నన్నింటిని సంక్షేపముగ వర్ణించెద నాకర్ణింపుము. ప్రకృతికి మఱియొక కళాంశ మైనస్వాహాదేవి యగ్నిదేవునిప్రియపత్ని. సంపూర్ణ విశ్వములం దున్నవా వారందఱు నీదేవిని బూజించి యారాధింతురు. ఈమె సహకారము లేనిదే దేవతలు కర్మిష్ఠులు తమ కర్పించిన హవిర్భాగములను బొందుటలో నసమర్థులు కాగలరు. ఈమె లేనిచో విశ్వములందు కర్మము లెల్ల నిష్ఫలములు కాగలవు. స్వధాదేవి పితరులకు బ్రియపత్ని. ఈమె నామమును స్మరింపక పితృదేవతల కర్పించు తర్పణములు నిష్ఫలములు కాగలవు. కావుననే సకలజను లీమెను బూజించి గౌరవింతురు. వాయుపత్నినామధేయమే స్వస్తి. ఈమె ప్రకృతికళాంశసంభూత. ఈమె లేనిదే యాదాన ప్రదానము లన్నియు నిష్ప్రయోజనములు కాగలవు. ప్రకృతియొక్క మఱియొక కళాంశ మైనపుష్టి శ్రీగణేశ్వరుని ప్రియార్థాంగి. ఈమె యనుగ్రహము లేనిదే పురుషులు, స్త్రీలు, తదితరదేహధారులును క్షీణించి బలహీనులు కాగలరు. అనంతుని దేవేరియే తుష్టి. ఈమె యనుగ్రహము లేనిదే జీవులు సంతుష్టి నొందరు. ఈశానుని యర్థాంగినామధేయమే సంపత్తి. ఈమె కరుణాకటాక్షములు పొందనియెడల సర్వజగములు సంపద్విహీనములై పరమదారిద్ర్య మనుభవింపగలవు. కపిలమహర్షి సహధర్మచారిణియే ధృతి. ఈశక్తి యనుగ్రహము లేనిదే జగములందు గలప్రాణులు ధైర్యవిహీనులై భీరువులు కాగలరు. యమునిపత్నియే క్షమాదేవి. ఈదేవి యాశ్రయము లేనిదే దేహధారు లున్మత్తులై క్రోధాములకు వశులు కాగలరు. సాధ్వి రతి కామదేవుని ప్రియార్థాంగి. నారదా! రతీదేవి సమస్తక్రీడలకు నధిష్ఠాత్రి యని తెలిసికొనుము. ఈమె యనుగ్రహము లభించనిచో జగములం దున్నదేహధారులు కేళీకౌతుక

శూన్యులు కాగలరు. ముక్తికాంత సత్యమునకు ప్రియపత్ని. సర్వలోకప్రియ యైన యీ జనని యనుగ్రహము లేనిచో సకలజనులు బంధుశూన్యులై బంధనముల జిక్కగలరు.

పరమసాధ్వి యగు దయ మోహమునకు పత్ని. ఈమె యనుగ్రహము లేనియెడల ప్రాణులు కఠినాత్ములై పరస్పర ద్వేషులు కాగలరు. పుణ్యమునకు సహధర్మచారిణియే ప్రతిష్ఠ. ఈమె యనుగ్రహము లేనిచో దేహధారులు జీవించియున్నను మరణించినవారితో సమానులే. సుకర్మయొక్క భార్యయే కీర్తి. ఈదేవి కరుణ లేకున్న జీవులు యశోహీనులై మృతతుల్యులుకాగలరు. క్రియాదేవి యుద్యోగమునకు భార్య. ఈమె యనుగ్రహము లేకున్న జగములందు గలజీవు లుచ్ఛిన్నులై, క్రియాహీనులు కాగలరు. అధర్మమునకు భార్యయే మిథ్య. ఈశక్తిని దుర్మార్గులు, నాస్తికులు సదా యారాధింతురు. ఈశక్తి సత్యయుగములో నదృశ్యముగ నుండును; త్రేతాయుగములో సూక్ష్మరూపము ధరించును; ద్వాపరమం దర్ధశరీరము కల్గి శోభించును; గలియుగములో దినదినప్రవర్ధమానయై యుగాంతమునకు మహాప్రగల్భయై పూర్ణరూపముతో సర్వత్ర వ్యాపింపగలదు. ఈదేవి సోదరుడే కపటము. ఈతడు కూడ దన సహోదరితో గలిసి కలియుగమున నింటింట బ్రవేశింపగలడు. శాంతిలజ్జలు సుశీలున కాదరణీయ లైనభార్యలు. వీరు లేనిదే సకలజగములం దున్నప్రాణులున్మత్తులై చరింపగలరు. జ్ఞానమునకు బుద్ధి, మేధ, స్మృతి, యనుముగ్గురు భార్యలు కలరు. వీరు లేనిచో ప్రాణులు మూర్ఖులు కాగలరు.

ధర్మదేవతకు సహధర్మచారిణి యైనమూర్తి కమనీయకాంతిసమన్విత యైన దేహమును ధరించి సకలజీవులను ముగ్ధులుగ నొనరించుచున్నది. ఈమె లేనిచో విశ్వములెల్ల నాకారరహితములు కాగలవు, తుదకు బరబ్రహ్మము కూడ నిరాకారుడుగ నుండవలసినదే. ఈదేవి సహకారముచే శ్రీమహాలక్ష్మి మొదలగు ప్రకృతిశక్తులు దివ్యమంగళరూపధారిణులై సర్వత్ర పరమపూజనీయులై నారు. శ్రీరూప మీమూర్తిస్వరూపమె. ప్రకృతికళాంశ యైనమూర్తి పరమమాన్యురాలు, అత్యంతధన్యురాలు, సర్వత్రపూజ్యురాలు.

కాలాగ్నిరుద్రుని యర్ధాంగియే యోగనిద్ర. రాత్రులందు సకలజీవు లీమె యనుగ్రహమువలననే నిద్రావస్థను బొందగలరు. సంధ్య, దినము, రాత్రి—ఈముగ్గురు కాలమునకు భార్యలు. వీరు లేనిచో విధాతయైనను గాల

పరిగణన మొనరింపలేడు. క్షుధ, పిపాస- వీరిర్వురు లోభమునకు భార్యలు. ఈ శక్తులప్రభావము ప్రాకృతికము లైనసకలమర్త్యలోకములందు వ్యాప్తము. వీరి వలన సకలజీవులు క్షోభయుక్తులై యుదరపోషణార్థము చింతాక్రాంతులు కాగలరు. ప్రభ, దాహిక- వీరిర్వురు తేజమునకు భార్యలు. వీరు లేనిచో బ్రహ్మకూడ దనకర్తవ్య నిర్వహణమం దసమర్థుడు కాగలడు. కాలకన్య లైనజరామృత్యువులు జ్వరమునకు భార్యలు. నిద్ర కుద్భవించిన కొమార్తె పేరే తంద్రి. ఈమెయు, బ్రీతియు సుఖమునకు బ్రియురాండ్రు. బ్రహ్మ కంఠో ద్భవా! విధియొక్క విధానమం దున్నయీసర్వజగములు నీ శక్తులతో వ్యాప్తములై యున్నవి. శ్రద్ధాభక్తులు వైరాగ్యమున కాదరణీయ లైన భార్యలు. మునీశ్వరా! ఈశక్తుల యనన్యకృపాప్రసాదములవలన నఖిల జగ ములు జీవన్ముక్తులు కాగలవు. కశ్యపప్రజాపతిపత్ను లైనదేవమాత యగు నదితి, గోమాత యగుసురభి, దైత్యమాత యగుదితి, సర్పమాత యగు కద్రువు, పక్షిమాత యగువినత, దనుజమాత యగుదనువు మొదలగు వారం దఱు సృష్టికార్యమును నిర్వర్తింతురు. ఈశక్తులనే ప్రకృతి కళ లందురు. వీరుకాక ప్రకృతిమాత కనేకాన్యాన్య కళాకళాంశములుకూడ గలవు. ప్రకృతి జననియొక్క మఱికొన్ని ముఖ్యకళలను వర్ణించెద నాకర్ణింపుము.

చంద్రుని యర్ధాంగి రోహిణి, సూర్యునిపత్ని సంధ్య, మనువునర్ధాంగి శతరూప, యింద్రపత్ని శచీదేవి, బృహస్పతి సహధర్మచారిణి తార, వశిష్ఠ మహర్షి ధర్మపత్ని యరుంధతి, గౌతమమహర్షి భార్య యహల్య, అత్రిమహర్షి యర్ధాంగి యనసూయ, కర్దమునిపత్ని దేవహూతి, దక్షప్రజాపతి పత్ని ప్రసూతి, పితరుల ప్రియపత్ని మనసాదేవి, హిమవంతునిపత్ని మేన, యగస్త్యమహర్షి పత్ని లోపాముద్ర, యగ్నిభార్య యాహుతి; వీరుగాక కుబేరపత్ని, వరుణపత్ని, యమపత్ని, బలిచక్రవర్తిపత్ని వింధ్యావళి, పాండురాజుపత్ని కుంతి, నలునిభార్య దమయంతి, నందసతి యశోద, వసుదేవునిపత్ని దేవకి, ధృత రాష్ట్రునిభార్య గాంధారి, పంచపాండవులప్రియపత్ని ద్రౌపది, సత్యవంతుని యర్ధాంగి సావిత్రి, రాధాజనని కళావతి, రావణబ్రహ్మసతి మండోదరి, దశరథుని భార్య కౌసల్య, యర్జునుని భార్య సుభద్ర, దశరథుని మూడవభార్య కైకేయి, బలరామునిభార్య రేవతి మొదలగువారందఱు ప్రకృతికళాకళాంశములే.

సత్యభామ, కాళింది, లక్ష్మణ, జాంబవతి, నాగ్నజితి, మిత్రవింద, రుక్మిణి, సీత మొదలగు సాధ్వీమణు లాద్యప్రకృతి ప్రధాన కళాసంభూతలు,

శ్రీమహాలక్ష్మీస్వరూపిణులు. వీరుగాక వ్యాసజనని యగుయోజనగంధి, కాళి, బాణపుత్రి ఉష, తత్సఖి చిత్రలేఖ, ప్రభావతి, భానుమతి, మాయావతి, పరశు రామజనని రేణుక, బలదేవుని మాత రోహిణి, శ్రీకృష్ణసోదరియు, దుర్గా స్వరూపిణి యగుఏకానాంశ మొదలగు వీరందఱు పవిత్రభారతవర్షమందు ప్రాదుర్భవించిన ప్రకృతికళలని ప్రసిద్ధికెక్కిరి. సకలగ్రామములందు గల గ్రామ దేవత లందఱు ప్రకృతిజనని కళలే.

నారదమునీంద్రా! ఇంతయేల? సకలవిశ్వములం దెంద ఱుత్తమమధ్య మాధమస్త్రీలు కలరో వా రందఱు ప్రకృతి కళాకళాంశములని గ్రహింపుము.

> యోషితా మపమానేన ప్రకృతేశ్చ పరాభవః ॥
> బ్రాహ్మణీ పూజితా యేన పతిపుత్రవతీ సతీ ।
> ప్రకృతిః పూజితా తేన వస్త్రాలంకారచన్దనైః ॥
> కుమారీ చాష్టవర్షీయా వస్త్రాలంకారచన్దనైః ।
> పూజితాయేన విప్రస్య ప్రకృతి స్తేన పూజితా ॥ (143-145)

స్త్రీల నవమానించిన స్వయముగ బ్రకృతినే యవమానించి నట్లగును. సౌభాగ్యవతియైన పతిపుత్రవతి యైన సాధ్వి యైన స్త్రీనిగాని, యష్టవర్షీయ యగు కన్యనుగాని వస్త్రాలంకార చందనాదులతో నారాధించిన ప్రకృతిభగవతీపూజ సంపన్నము కాగలదు.

ఏస్త్రీలు సదాచారయుక్తలై, శీలవతులై, పతివ్రతలై విరాజిల్లెదరో వారే ప్రకృతి సత్త్వగుణాంశములు. వీరే సర్వోత్తమ లైననారీమణులు. ఏ స్త్రీలకు భోగభాగ్యము లత్యంత ప్రీతికరములో వారు ప్రకృతిరాజసాంశము నుండి జన్మించిన మధ్యమశ్రేణికి జెందినవారు. ఈమధ్యమలు సదా సుఖభోగ ములం దాసక్తలై చరింపగలరు. ప్రకృతిదేవి తామసాంశముచే నుత్పన్న లైనస్త్రీలే యధమశ్రేణికి జెందినవారు. వారే కటువచన భాషిణులు, కులటలు, ధూర్తలు, స్వేచ్ఛాచారిణులు, కలహప్రియలు. నారదా! భూమండలమం దున్న కులటలు, స్వర్గములందు గలయప్సరసలు, పరవిశ్వములందు గలవ్యభిచా రిణీస్త్రీలు ప్రకృతి తామసాంశములని గ్రహింపుము.

నారదమునీంద్రా! ఇట్లు నేను ప్రకృతిమాతయొక్క రూపములను సంక్షిప్తముగ వర్ణించితిని. ప్రకృతి ప్రధానాంశ మైన దుర్గ సకలదుర్గతులను

నశింపజేయగలదు. ప్రప్రథమమున సురథరాజవనిపై నీమె నుపాసించెను. రావణసంహారార్థమై శ్రీరామచంద్రప్రభువుకూడ నీదేవినే పూజించెను. జగదంబ సకలలోకములందు బరమపూజ్యురాలు. సకలదేవతల తేజములనుండి ప్రాదుర్భవించిన యీయాద్యశక్తి దైత్యులను దానవులను మర్దించుటకు దక్షుని గృహమున సతిగా బ్రాదుర్భవించెను. తదనంతరము మాహేశ్వరుని యర్థాంగియై యజ్ఞభూమిలో దనభర్తను దక్షుడు నిందింపగా బతినిందను విని సహింపలేక యీమె దేహమును జాలించెను. ఈమె హిమవంతుని గృహమున మరల బ్రాదుర్భవించి యఖండ తపోమూలమున శంకరుని మరల ప్రాణేశ్వరునిగా బొందగలిగెను. సకలవిఘ్ననాయకుడైన గణేశ్వరుడు, కార్తికేయుడు శ్రీకృష్ణాంశముచే నీదేవికి గల్గిన కుమారులు. నారదా! శ్రీకృష్ణుడే స్వయముగ గణేశ్వరుడై యవతరించెనని గ్రహింపుము. స్కంధుడు శ్రీమహావిష్ణువుయొక్క కళోద్భవుడు.

నారదమునీంద్రా! సర్వప్రథమమున మంగళుడనురాజు శ్రీమహాలక్ష్మి నారాధించెను. తదనంతరమే సకలలోకవాసులును లక్ష్మీదేవి నుపాసింపదొడంగిరి. అశ్వపతి మహారాజు బ్రథమమున సావిత్రీదేవి నుపాసించెను. తదనంతరమే సకలదేవతలు, మహరుల్షు నామెను బూజించిరి. మొదట బ్రహ్మదేవుడు సరస్వతి నారాధించెను. తదనంతర మామె త్రిలోక పూజ్యురాలైనది. సర్వప్రథమమున గోలోకములో రాసమండలములో శ్రీకృష్ణపరమాత్మ స్వయముగ రాధను బూజించెను. గోపగోపికలతో బరివేష్టితుడై శ్రీకృష్ణపరమాత్మ కార్తికపూర్ణిమాదినమున శ్రీరాధాదేవి యారాధన స్వయముగ సంపన్నమొనరించెను. తదనంతరము భగవంతుని యాదేశానుసారముగ బ్రహ్మాది సకలదేవతలు, మహర్షులు, మనువులు శ్రీరాధాదేవి నారాధించిరి.

అవనిపై సర్వప్రథమముగ సుయజ్ఞప్రభువు, సమాధి యను వైశ్యశ్రేష్ఠుడు శంకరునుపదేశానుసారముగ బవిత్రభారతవర్షములో శ్రీరాధాదేవి నుపాసించిరి. తదనంతరము విశ్వములం దున్నసకలప్రాణులు శ్రీరాధామాతను బుష్పధూపదీపనైవేద్యాది సకలోపచారములతో భక్తితత్పరులై పూజించుచుండిరి. ప్రకృతి నుండి యేయేశక్తులు ప్రాదుర్భవించిరో వారందఱు పవిత్రభారతవర్షములో సదా యారాధింపబడెదరు. మునీశ్వరా! ఆసమయము

నుండియే ప్రజలు గ్రామములందు, నగరములందు గ్రామదేవతలను బూజింప నారంభించిరి. నారదా! ఇట్లు నే నాగమానుసారముగ బ్రకృతియొక్క శుభ చరితమును సంక్షిప్తముగ వచించితిని.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని ప్రకృతిచరిత
మను మొదటి అధ్యాయము
సంపూర్ణము.

—o—

## రెండవ అధ్యాయము

### పరబ్రహ్మ మగుశ్రీకృష్ణునినుండి, శ్రీరాధాదేవినుండి ప్రకటులైనదేవీదేవతల చరిత్ర వర్ణనము.

**నారదుడు పలికెను :**

దేవా! నీకరుణాకటాక్షమువలన సమస్తప్రకృతిశక్తులచరితమును సంక్షేపముగ శ్రవణమొనరింపగల్గితిని. నేను బాగుగ నవగతమొనరించుకొని మననము చేసికొనుటకు వారిదివ్యచరితములను మరల సవిస్తరముగ వర్ణించి నన్ను కృతార్థుని జేయవలసినదిగ బ్రార్థించుచున్నాను.

సకలసృష్టికి గారణభూత మైనభగవతి యాద్యప్రకృతి యెట్లు ప్రాదుర్భవించెను? ఆప్రకృతి యైదుదివ్యరూపముల నవతరించుటకు గల కారణమేమి? ఈ రహస్యముల నన్నింటిని సవిస్తరముగ వర్ణింపుడని మిమ్ముల నర్థించుచున్నాను. దేవియొక్క దివ్యగుణములనుండి యావిర్భవించిన దేవీమాతల పావనచరితములను సవిస్తరముగ విశదీకరించి నన్ను గృతార్థుని జేయుడు. ప్రభూ! ఆ దేవీమాతల ప్రాదుర్భావ ప్రసంగములను, బూజాధ్యానవిధానములను, స్తోత్రములను, గవచములను, మంత్రములను నుపదేశింపవలసినదిగ బ్రార్థించుచున్నాను.

## శ్రీనారాయణఋషి పలికెను :

దేవర్షీ! నారదా! ఆత్మ, యాకాశము, కాలము, దిశలు, అనంత విశ్వగోళములు, గోలోకము, వైకుంఠము, శివలోకప్రభృతు లెట్లు నిత్యములో (అనగా నక్షరములలో, నాశరహితములో), యట్లే ప్రకృతిసహితము నిత్యమని గ్రహింపుము. ఈ యాద్యప్రకృతి పరబ్రహ్మమందు లీనమై యున్న సనాతనపరాశక్తి. అగ్నియం దెటు దాహకశక్తి లీనమైయుండునో, చంద్రుని యందు, కమలమునకు శోభలు కలవో, సూర్యునియందు ప్రభ ప్రకాశించుచుండునో, యట్లే ప్రకృతి పరమాత్మయుభగవంతుడు నైన పరబ్రహ్మమునందు నిత్యము విరాజమానయై యుండును. స్వర్ణకారుడు సువర్ణము లేనిదే యాభరణములను నిర్మింపలేనట్లు; కుమ్మరి మట్టిలేనిదే కుండలు చేయ లేనట్లు, పరమాత్మ ప్రకృతి సహాయోగము లేకున్న సృష్టి యొనరింపలేడు.

సర్వశక్తిస్వరూపా సా తయా స్యా చ్ఛక్తి మా న్సదా ॥
ఐశ్వర్యవచనః శక్ చ తిః పరాక్రమవాచకః ।
తత్స్వరూపా తయో ర్ధాత్రీ యా సా శక్తిః ప్రకీర్తితా ॥
సమృద్ధిబుద్ధిసమ్పత్తియశసాం వచనో భగః ।
తేన శక్తి ర్భగవతీ భగరూపా చ సా సదా ॥
తయా యుక్తః సదాఽఽత్మా చ భగవాం స్తేన కథ్యతే ।
స చ స్వేచ్ఛామయః కృష్ణః సాకారశ్చ నిరాకృతిః ॥ (9-12)

సర్వశక్తి స్వరూపిణి యైనయాద్యప్రకృతిని ధరించి యాపరబ్రహ్మము సదా శక్తిమంతుడై నాడు (ఏ దేవివలన బరబ్రహ్మము సదా శక్తిమంతుడై యుండునో, యా దేవియే సర్వశక్తిస్వరూపిణి యని గ్రహింపవలెను). 'శక్' యనగా నైశ్వర్యమని 'తి' యనగ బరాక్రమమని అర్థము. ఈరెండు నెవరి స్వరూపములో, యీరెండింటి నేదేవి ప్రసాదింపగలదో యాదేవినే శక్తి యని కీర్తించిరి. భగశబ్దమునకు సమృద్ధి, బుద్ధి, సంపత్తి, యశములని యర్థము. వీనియన్నింటితో సంపన్నురాలై విరాజిల్లుచున్నది గావున నా దేవిని భగవతి యని కీర్తింతురు. ఈప్రకృతి సర్వదా భగస్వరూపిణి, పరమాత్మ యైనపరబ్రహ్మము సదా యాప్రకృతిని గలిగి విరాజమానుడై యుండును కావుననే యాయనను భగవానుడని యాగమములు వర్ణించినవి.

స్వేచ్ఛామయుడు, నిరాకారుడు నయిన శ్రీకృష్ణపరమాత్మ యాద్యప్రకృతి వలన సాకారుడైనాడు.

తేజోరూపం నిరాకారం ధ్యాయన్తే యోగినః సదా ।
వదన్తి తే పరం బ్రహ్మ పరమాత్మాన మీశ్వరమ్ ॥
అదృశ్యం సర్వద్రష్టారం సర్వజ్ఞం సర్వకారణమ్ ।
సర్వదం సర్వరూపాన్త మరూపం సర్వపోషకమ్ ॥
వైష్ణవా స్తం న మన్యన్తే తద్భక్తాః సూక్ష్మదర్శినః ।
వదన్తి ఇతి తే కస్య తేజ స్తేజస్వినం వినా ॥ (13-15)

పరమయోగులు పరబ్రహ్మముయొక్క నిరాకార తేజోరూపమును సదా ధ్యానింతురు. ఆజ్యోతిస్స్వరూపముననే పరబ్రహ్మమని, ఈశ్వరుడని కీర్తింతురు. పరమాత్మ సామాన్యచక్షువుల కదృశ్యుడై నను సర్వులకు ద్రష్ట, సర్వజ్ఞుడు, సర్వమునకు మూలకారణుడు, సర్వకారణకారణుడు, సమస్తములకు లయకారుడు, ప్రాకృతిక రూపరహితుడు, సర్వపోషకుడు, నిఖిలానందైశ్వర్య ప్రదాత; కాని భగవంతుని సూక్ష్మదర్శులైనపరమవైష్ణవభక్తులీప్రకాశ రూప నిరాకారబ్రహ్మము నాదిబ్రహ్మమని యంగీకరింపరు. తేజస్వియైన సాకారదివ్యస్వరూపము లేకున్న నా యఖండతేజ మెవరిదని ప్రశ్నింతురు.

తేజోమణ్డలమధ్యస్థం బ్రహ్మ తేజస్వినం పరమ్ ।
స్వేచ్ఛామయం సర్వరూపం సర్వకారణకారణమ్ ॥
అతీవ సున్దరం రూపం బిభ్రతం సుమనోహరమ్ ।
కిశోరవయసం శాన్తం సర్వకాన్తం పరాత్పరమ్ ॥
నవీననీరదాభాసం రాసైకశ్యామసున్దరమ్ ॥
శరన్మధ్యాహ్నపద్మౌఘశోభామోచకలోచనమ్ ॥
ముక్తాసారమహాస్వచ్ఛదన్తపంక్తిమనోహరమ్ ।
మయూరపిఞ్ఛచూడం చ మాలతీమాల్యమణ్డితమ్ ॥
సునాసం సస్మితం శశ్వద్భక్తానుగ్రహకారకమ్ ।
జ్వలదగ్నివిశుద్ధైక-పీతాంశుక సుశోభితమ్ ॥
ద్విభుజం మురలీహస్తం రత్నభూషణభూషితమ్ ।
సర్వాధారం చ సర్వేశం సర్వశక్తియుతం విభుమ్ ॥
సర్వైశ్వర్యంప్రదం సర్వం స్వతన్త్రం సర్వమఙ్గలమ్।
పరిపూర్ణతమం సిద్ధం సిద్ధిదం సిద్ధికారణమ్ ॥

ధ్యాయన్తే వైష్ణవాః శశ్వ ద్దేవం రూపం సనాతనమ్ ।
జన్మమృత్యుం జరావ్యాధిశోకభీతిహరం పరమ్ ॥
బ్రహ్మణో వయసా యస్య నిమేష ఉపచర్యతే।
స చాఽఽత్మా పరమం బ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే ॥ (16-24)

పరమయోగు లేయఖండ తేజోమండలమును సదా ధ్యానింతురో, దాని మధ్యమున సమస్త తేజమునకు గారణభూతుడై యంతర్యామిపరమాత్మ యైన పరమపురుషోత్తము డున్నాడు. ఆసాకార పరబ్రహ్మమే స్వేచ్ఛామయ రూపధారి, సర్వస్వరూపుడు, సర్వకారణకారణుడు. ఆప్రభువుయొక్క సచ్చిదానంద విగ్రహ మత్యంత కమనీయము, నిత్యము, సత్యము, శివము, సుందరము. ఆయన సదాకిశోరవయస్కుడు, నఖండశాంతస్వరూపుడు, సర్వశక్తులకు గాంతుడు, బరాత్పరుడు. సర్వశ్రేష్ఠు డైనయీదేవాదిదేవుని మించినవారు మఱియొకరు లేరు. ఆదివ్యమంగళ సుందరాకారుని చిత్ విగ్రహము నవీన నీలనీరదశ్యామలము. ఆయన విశాలనేత్రములు శరత్కాలములో మధ్యాహ్నమున హెచ్చుగ వికసించిన కమలములకంటె నత్యంత సుందరములు. ఆణిముత్యములకంటె నాయన దంతపంక్తి యధిక మనోహరము. ఆపరమాత్ముడు తన చూడములో మయూరపింఛము నలంకరించుకొని, గళమునందు మాలతీ వనమాలికలను ధరించి, సునాసిక కలవాడై, సస్మితవదనుడై సదా తన యనన్య భక్తుల ననుగ్రహించుట కుత్సుకుడై యుండును. ఆయన ప్రజ్వలితాగ్ని వర్ణ శుద్ధపీతాంబరములను ధరించి శోభించు కమనీయమూర్తి. ఆయన ద్విభుజుడు, మురళీహస్తుడు, రత్నభూషణభూషితుడు, ఆయన సర్వాధారుడు, సర్వేశ్వరుడు, సర్వశక్తియుతుడు, సకలలోకైకవిభుడు, సర్వైశ్వర్యప్రదుడు, స్వతంత్రుడు, సర్వమంగళమంగళుడు, నారదా! ఇంతయేల? సర్వమాయనయే. ఆపరమాత్మ పరిపూర్ణతముడు, సిద్ధుడు, సిద్ధిప్రదుడు, సకలసిద్ధులకు గారణుడు. పరమోత్కృష్టము, జన్మమృత్యుజరావ్యాధిశోకభీతిహరము, సనాతనము, శాశ్వతమగు నాదేవదేవుని సచ్చిదానందస్వరూపమునే యనన్యభక్తులైన వైష్ణవులు సదా ధ్యానింతురు. ఆసచ్చిదానంద విగ్రహమే పరబ్రహ్మ మైన శ్రీకృష్ణభగవానుడని తెలిసికొనుము. బ్రహ్మదేవుని పరిపూర్ణాయుర్దాయ మీపరమేశ్వరున కొక్కనిమేషకాలమే యని గ్రహింపుము.

కృషి స్తద్భక్తి వచనో నశ్చ తద్దాస్యవాచకః ।
భక్తి దాస్యప్రదాతా యః స కృష్ణః పరికీర్తితః ॥
అసంఖ్యబ్రహ్మణాం పాతే కాలేఽ తీతేఽ పినారద! ।
యద్గుణానాం నాస్తి నాశస్తత్సమానో గుణేన చ ॥ (26, 27)

'కృష్' అనగా భగవంతునియం దనన్యభక్తి, 'ణ' అనగా సచ్చిదానంద విగ్రహుని దాస్యసౌభాగ్యము. ఏ దేవాదిదేవుడు తన యాశ్రితుల కనన్యభక్తిని, దాస్యసౌభాగ్యమును బ్రసాదించునో యాయననే కృష్ణు డందురు. 'కృష్' సర్వార్థవాచకము, 'ణ' అనగ బీజమని యర్థము. సర్వబీజస్వరూపు డైనపరబ్రహ్మమునే కృష్ణు డందురు. అనంతకాలప్రవాహములో నసంఖ్యాక బ్రహ్మలు పతనమైనను దత్పరమపురుషుని దివ్యగుణములు లేశమాత్రమైనను దరిగినవి కావు.

నారదమునీంద్రా! అనంత మైనసనాతనకాలమున సంభవించిన విషయములను వర్ణించెద; సావధానుడవై యవధరింపుము. సృష్టికి బూర్వము పరమాత్మ స్వైన శ్రీకృష్ణు డొక్కడే యఖండప్రకాశములో విరాజిల్లుచుండెను. అపుడు పరమాత్మ సృష్టింపవలెనని సంకల్పింపగ నాయన యంశమే యనంత కాలమై సంభవించును.

కాలప్రేరితుడై ప్రభువు సృష్టికార్యమున కుద్యుక్తుడై తన సంకల్ప మాత్రముననే ద్విరూపుడై ప్రకాశించెను.

స్త్రీరూపా వామభాగాంశా దక్షిణాంశః పుమాన్స్మృతః ॥ (29)

స్వేచ్ఛామయు డైనయాభగవంతుని వామపార్శ్వము స్త్రీరూపమయ్యెను, దక్షిణభాగము పురుషుడుగనే శేషించెను.

సనాతను డైనయాపురుషోత్తము డాదివ్యమంగళ సౌందర్యవతి యైన స్త్రీని వీక్షించెను.

అతీవ కమనీయాం చ చారుచమ్పకసన్నిభామ్ ॥
పూర్ణేన్దుబిమ్బసదృశనితమ్బయుగలాం పరామ్ ।
సుచారుకదలీస్తమ్భసదృశశ్రోణిసున్దరీమ్ ॥
శ్రీయుక్తశ్రీఫలాకారస్తనయుగ్మమనోరమామ్ ।
పుష్ట్యా యుక్తాం సులలితాం మధ్యక్షీణాం మనోహరామ్ ॥

అతీవ సున్దరీం శాన్తాం సస్మితాం వక్రలోచనామ్ ।
వహ్నిశుద్ధాంశుకావాసాం రత్నభూషణభూషితామ్ ॥
శశ్వ చ్చక్షుశ్చకోరాభ్యాం పిబన్తీం సతతం ముదా ।
కృష్ణస్య సున్దరముఖం చన్ద్రకోటివినిన్దకమ్ ॥
కస్తూరీబిన్దుభిః సార్ధ మధశ్చన్దనబిన్దునా ।
సమం సిన్దూరబిన్దుం చ ఫాలమధ్యే చ బిభ్రతీమ్ ॥
సువక్రకబరీభారం మాలతీమాల్యభూషితమ్ ।
రత్నేన్ద్రసారహారం చ దధతీం కాన్తకాముకీమ్ ॥
కోటిచన్ద్రప్రభాజుష్టపుష్టశోభాసమన్వితామ్ ।
గమనే రాజహంసీం తాం దృష్ట్వా ఖంజనగంజనీమ్ ॥ (30-37)

"చారుచంపకకాంతితో ప్రకాశించు నాదివ్యసుందరి బహుకమనీయురాలు. ఆపరాదేవి రెండునితంబములు పూర్ణేందుబింబసదృశములు. ఆమె శ్రోణి చారుకదళీస్తంభసదృశము. ఆమె మనోహరస్తనయుగ్మము శ్రీయుక్త శ్రీఫలాకారము. ఆమె సులలిత, యత్యంతహృష్టపుష్ట, మధ్యక్షీణ (సన్నని నడుముగలది), పరమమనోహారిణి. వహ్నిశుద్ధము లైనపట్టువస్త్రములను ధరించి రత్నభూషణవిభూషితయై యామహాసుందరి యత్యంతశాంత సస్మితవదనయై తనవక్రచక్షువు లనెడి చకోరములతో గోటానుకోట్ల చంద్రులనేనినిందింపగల శ్రీకృష్ణపరమాత్మసుందర ముఖసౌందర్యమును పానమొనరింప దొడంగెను. ఆమెలలాటముపై కస్తూరీబిందువులు, చందనబిందువులలంకరింపబడియున్నవి.

ఆమె ఫాలమధ్యప్రదేశములో సిందూరతిలక మలరారుచున్నది. ఆసువక్ర కబరీభారమాలతీమాలవిభూషితయై, రత్నేంద్రసారహారములను ధరించి యఖండకాంతితో ప్రకాశింప దొడగెను. కోటిచంద్ర ప్రభాసమన్వితయై రాజహంసవలె గమన మొనరించు నాఖంజనగంజనిని బరమాత్మ వీక్షించెను".

శ్రీకృష్ణపరమాత్మ పరమరసికాగ్రణి, రాసేశ్వరుడు. ఆయన రాసోల్లాసియై యాదివ్యభామినితో గూడి మహారాసక్రీడ నారంభించెను. ఒకబ్రహ్మసంపూర్ణాయుర్దాయ పర్యంతము స్వామి యాదివ్యాంగనతో దివ్యరాసక్రీడాతత్పరుడై యుండగా, నాసచ్చిదానంద విగ్రహుని దివ్య తేజ మాయన సంకల్ప

మాత్రమున నాదేవాదిదేవిని బ్రవేశించెను. ఉత్తమవ్రతపాలకా, నారదా! దివ్యరాసక్రీడాసమయమున నాసుందరాంగి చిన్మయదేహమునుండి ప్రస్వేదము ప్రవహించి, సమస్తవిశ్వగోళములుగ బరిణామమొందెను. ఆదేవి యుచ్ఛ్వాస నిశ్వాసములే ప్రాణవాయురూపమున నావిర్భవించెను. జననినుండి బహిర్గత మైన యాప్రాణవాయువు నాశ్రయించియే యీజగము లన్నియు వర్తించు చుండును. విశ్వములం దెందఱు సజీవులైనదేహధారులు కలరో, వారందఱి లోపల, బయట నీప్రాణవాయువు విరాజిల్లుచుండును. ఆమెనుండి బహిర్గత మైనయావాయువు, వాయుదేవునిరూపమును ధరించెను. వాయుదేవుని వామాంగమునుండి యత్యంతసౌందర్యవతి యైనస్త్రీయుద్భవించి వాయుసతి యయ్యెను. వాయుతేజమువలన నామె కైదుగురు కుమారు లుదయించిరి. వారే జీవులశరీరమం దుండుపంచప్రాణములు. ప్రాణ, అపాన, సమాన, ఉదాన, వ్యాన నామధేయములు గల యీయైదు ప్రాణములు మహావాయువు నంశ సంభూతములు. జనని శ్రమజలముల రూపమున బ్రవహించిన జలముల కధిష్ఠాతే యైనదైవమే మహావరుణుడు; ఆయన వామాంగమునుండి వారుణి బయల్వెడలి వరుణున కర్ధాంగి యయ్యెను.

శ్రీకృష్ణుని చిన్మయశక్తి యాద్యప్రకృతియందు స్థితమైన నూఱు మన్వంతరములకాల మామె చిన్మయదేహము పరబ్రహ్మతేజముతో దేదీప్య మానముగ బ్రకాశించెను. శ్రీకృష్ణుని వక్షఃస్థలమే నివాసముగా గల యామె సదా యాపురుషోత్తమునే తనప్రాణాధికునిగా బ్రేమించి, యారాధించును. ఒకనూఱు మన్వంతరములు గడచిన పిదప నాదేవినుండి సువర్ణకాంతియుక్త మైనమహాడింభ ముదయించెను. ఆమహాడింభమే సంపూర్ణవిశ్వధారణశక్తి సమన్వితము. కాని యయ్యాద్యప్రకృతి శ్రీకృష్ణమాయకు వశురాలై యా మహాడింభమును గాంచి చింతాక్రాంతయై తదండాకారమును బ్రహ్మాండ గోళోకాధోజలములందు విడిచివైచెను. ఆద్యప్రకృతి యొనరించిన యీ విచిత్రచర్యను గాంచి శ్రీకృష్ణపరమాత్మ సంతానహీనవు కమ్మనియు, ద్వాదంశోత్పన్నలైన దివ్యాంగనలు కూడ సంతానవిహీనలు కాగలరనియు శపించెను.

ఆసమయమున నాద్యప్రకృతి జిహ్వాగ్రమునుండి శుద్ధశుక్లవర్ణముతో బ్రకాశించు వీణాపుస్తకమాలధారిణి ప్రాదుర్భవించెను. ఆమెయే సకలవిద్య

లకు, శాస్త్రములకు నధిష్ఠాత్రి. తదనంతరము మూలప్రకృతి యీశ్వరి రెండు దివ్యరూపముల విభక్తకాగా నామెవామాంగము శ్రీమహాలక్ష్మియై, దక్షిణాంగము శ్రీరాధగా శేషించెను.

ఆదేసమయమున శ్రీకృష్ణపరమాత్మ ద్విరూపుడై ప్రకాశింపగా నాయన వామపార్శ్వము చతుర్భుజుడైన శ్రీమన్నారాయణుడుగ నావిర్భవింప, దక్షిణ పార్శ్వము శ్రీకృష్ణుడుగనే శేషించెను. అపుడు శ్రీకృష్ణపరమాత్మ సకల శాస్త్రములకు నధిష్ఠాత్రియైన సరస్వతిని, సకలైశ్వర్యములకు జనని యైన శ్రీమహాలక్ష్మిని, శ్రీమన్నారాయణు ననుసరింపవలసినదిగ నాదేశించెను. శ్రీమన్నారాయణుడు లక్ష్మీసరస్వతులతోగూడి దివ్యవైకుంఠపరంధామము జేరెను. శ్రీహరిసమానతేజోవంతులు చతుర్భుజులు నైనపురుషులు శ్రీమన్నారాయణుని పూజ్యాంగములనుండి యావిర్భవించి యాయనకు పార్షదులైరి. అటులనే శ్రీమహాలక్ష్మి యంగోద్భవలైనదివ్యస్త్రీ లందరు శ్రీమహాలక్ష్మికి సేవకురాండ్రయిరి.

గోలోకేశ్వరుడైన శ్రీకృష్ణుని రోమకూపములనుండి యసంఖ్యాక గోపకుమారు లుదయించి తత్ప్రియపార్షదులైరి. అట్లే శ్రీరాధాదేవి రోమకూపములనుండి రాధాసదృశలైనయసంఖ్యాకగోపకాంత లుదయించి యామెకు సేవకురాండ్రైరి. ఆగోపిక లందరు తరుణవయస్కలు, నిత్యనూతన యౌవనులు, శ్రీరాధాసదృశసౌందర్యవతులు. వా రందరు పరమపురుషుని శాపవశమున సంతానవిహీనలైరి.

తదనంతరము శ్రీకృష్ణునినుండి దుర్గతినాశని యైనదుర్గ ప్రాదుర్భవించెను. ఆమెయే సనాతని శ్రీకృష్ణమాయ, సాక్షాన్మూలప్రకృతి పరిపూర్ణాంశ. నారాయణి, ఈశాని, సర్వశక్తిస్వరూపిణి, విష్ణుమాయ యను ననేకదివ్యనామములతో శ్రీకృష్ణమాయ ప్రసిద్ధిగాంచెను. దుర్గాదేవి శ్రీకృష్ణుని బుద్ధికే యధిష్ఠాత్రిదేవి. దేవాంగన లెల్ల నీయాద్యశక్తినుండియే యుద్భవించిరి. అందు వలననే యీమెను దేవీబీజస్వరూపిణి, మూలప్రకృతి, యీశ్వరి యని కీర్తింతురు. ఈపరిపూర్ణస్వరూపిణి యైనదేవి యఖండతేజస్స్వరూపిణి, త్రిగుణాత్మిక, ఆమె సుభగాంగములతేజము కోటానుకోట్ల సూర్యులకాంతిని మించి ప్రకాశించెను. త్రినేత్రధారిణి యైనదుర్గ సహస్రభుజసమన్వితయై, హస్తములం

దనేక దివ్యశస్త్రాస్త్రములను ధరించి దివ్యరత్నాభరణవిభూషితయై యగ్నిశుద్ధ దివ్యవస్త్రధారిణియై, దివ్యరత్ననిర్మితముకుటధారిణియై దర్శన మొసంగెను. స్త్రీలందఱు నీమె కళాకళాంశోత్పన్నలే యని తెలిసికొనుము. ఈకృష్ణమాయ జగములం దున్నసమస్తజీవులను మోహింపజేయ సమర్థురాలు. సకాములై దుర్గ నుపాసించువారి కామె కరుణాకటాక్షములవలనసంపూర్ణైశ్వర్యములు సిద్ధింపగలవు. నిష్కాములై యారాధించిన భక్తుల కీమె శ్రీకృష్ణా నన్యభక్తిని బ్రసాదించును. ముముక్షువులకు ముక్తిని, సుఖముల గాంక్షించు వారికి సర్వసుఖములను, శ్రీకృష్ణ సేవాసౌభాగ్యమును గోరువారికి బరమాత్మ దాస్యభక్తి సౌభాగ్యములను బ్రసాదించుటయే యీామె స్వభావములు. స్వర్గములం దీమె స్వర్గలక్ష్మియై, మర్త్యలోకమున మర్త్యలక్ష్మియై, గృహస్థుల గృహములందు గృహలక్ష్మియై సదా విరాజిల్లును. తాపసులచెంత దపోరూపమై, రాజులవద్ద శ్రీరూపమై, యగ్ని యందు దాహరూపమై, సూర్యునియందు బ్రభాస్వరూపమై, చంద్రునియందు గమలములందు శోభాస్వరూపమై సదా యీశక్తియే ప్రకాశించును. ఈమె వలననే జీవులకు గర్మ లొనరించు యోగ్యత సంప్రాప్తించును. ఈమె శ్రీకృష్ణపరమాత్మయొక్క సర్వశక్తిస్వరూపిణి. ఈమె కల్గిననే యాత్మ శక్తి సమన్విత మగును; జగములు శక్తియుక్తములు కాగలవు. ఈమె లేనిదే సకలజగములు జీవించియున్నను మరణించినట్లే భావింపవలెను. ఈ సనాతనీ దివ్యశక్తి సకలసంసారవృక్షములకు బీజరూపిణి. నారదా! జనని యగుదుర్గ సకల స్థితరూపిణి, బుద్ధిరూపిణి, ఫలరూపిణి, క్షుధ, పిపాస, దయ, నిద్ర, తంద్ర, క్షమ, మతి, శాంతి, లజ్జ, తుష్టి, పుష్టి, భ్రాంతి, కాంతి, మొదలగున వన్నియు దుర్గాస్వరూపములే. దుర్గామాత ముకుళితహస్తములతో సర్వేశ్వరున కనేక ప్రణామము లర్పించి యనన్యభక్తిసమన్వితయై స్తుతించి పరమాత్మ యొసంగిన దివ్యరత్నసింహాసనముపై సుఖాసీనురా లయ్యెను.

మహావిష్ణువు నాభికమలమునుండి జగత్స్రష్ట యగుబ్రహ్మయుద్భవించి శ్రీకృష్ణపరమాత్మ దివ్యదర్శనార్థమై గోలోకపరంధామమున కేతెంచెను. జ్ఞాను లందు శ్రేష్ఠుడైనబ్రహ్మదేవుడు హస్తములలో దండకమండల జపమాలలను ధరించి యఖండతేజముతో బ్రకాశించుచుండెను. చతుర్ముఖము లతో ఆయన తనదేవి యైనబ్రహ్మశక్తితోగూడి శ్రీకృష్ణు ననేకవిధముల

స్తుతించెను. తదనంతరము బ్రహ్మదేవుడు, బ్రహ్మాణి భగవంతు . ననుజ్ఞ పొంది రత్నసింహాసనముల నలంకరించిరి.

ఏతస్మిన్నన్తరే కృష్ణో ద్విధారూపో బభూవ సః ।
వామార్ధాఙ్గో మహాదేవో దక్షిణో గోపికాపతిః ॥ (74)

నారదా! ఆసమయముననే శ్రీకృష్ణపరమాత్మ రెండురూపముల విభక్తుడైనాడు. ఆయన వామార్ధాంగమే మహాదేవు డయ్యెను. దక్షిణార్ధాంగము గోపికాపతిగ శేషించెను.

శుద్ధస్ఫటికసంకాశః శతకోటిరవిప్రభః ।
త్రిశూలపట్టిసధరో వ్యాఘ్రచర్మధరో హరః ॥
తప్తకాంచనవర్ణాభజటాభారధరః పరః ।
భస్మభూషణగాత్రశ్చ సస్మిత శ్చన్ద్రశేఖరః ॥
దిగమ్బరో నీలకణ్ఠః సర్వభూషణభూషితః ।
బిభ్రద్దక్షిణహస్తేన రత్నమాలాం సుసంస్కృతామ్ ॥
ప్రజప న్పంచవక్త్రేణ బ్రహ్మజ్యోతిః సనాతనమ్ ।
సత్యస్వరూపం శ్రీకృష్ణం పరమాత్మాన మీశ్వరమ్ ॥
కారణం కారణానాం చ సర్వమఙ్గలమఙ్గలమ్ ।
జన్మమృత్యుజరావ్యాధిశోకభీతిహరం పరమ్ ॥
సంస్తూయ మృత్యో ర్మృత్యుం తం జాతో మృత్యుంజయాభిధః ।
రత్నసింహాసనే రమ్యే సమువాస హరేః పురః ॥ (85-90)

కోటానుకోటిసూర్యసమాన తేజః ప్రకాశవంతుడై మహాదేవుడు శుద్ధస్ఫటికమణికాంతితో ప్రకాశించుచుండెను. జటాజూటధారి, వ్యాఘ్రచర్మాంబరధారి యైనమహాదేవుడు తనశరీరమును విభూతితో నలంకరించుకొని హస్తములందు త్రిశూలమును, డమరుకమును, బట్టిసమును జపమాలను, ధరించి సర్పములే భూషణములై విరాజిల్లగ నీలకంఠుడై, చంద్రశేఖరుడై, దిగంబరుడై దివ్యదర్శన మొసంగెను. శంకరుడు తనపంచముఖములతో శ్రీకృష్ణుని దివ్యనామజపమందే తత్పరుడై గోచరించెను. సత్యస్వరూపుడు, పరమాత్మ, సర్వకారణ కారణుడు, సర్వమంగళములకే మంగళప్రదాత, మృత్యువునకే మృత్యువు, జన్మమృత్యుజరావ్యాధిశోకభయహారి యైనశ్రీకృష్ణపరమాత్మను మహాదేవు డనన్యభక్తితో ననేకవిధముల స్తుతించి మృత్యుం

జయుడయ్యెను. తదనంతరము హరుడు శ్రీకృష్ణుని యాజ్ఞానుసారము దివ్య రత్న సింహాసన మలంకరించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని దేవదేవ్యుత్పత్తి
యను రెండవ అధ్యాయము
సంపూర్ణము.

—♦—

# మూడవ అధ్యాయము

## పరిపూర్ణతముడగు శ్రీకృష్ణునినుండి; చిన్మయియగు శ్రీరాధనుండి ప్రకటుడైన విరాట్స్వరూపబాలుని వర్ణనము.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదమునీంద్రా! మూలప్రకృతిచే త్యజింపబడిన యామహాండాకార డింభము బ్రహ్మాయుఃపర్యంతము, గోలోకబ్రహ్మాండాధోజలములందు వసించెను. సమయము సంపూర్ణమైన పిదప నా డింభము శతకోటిరవిసమప్రభాసంపన్నుడైనయద్భుతశిశురూపమున బరిణామ మొందెను. ఆదివ్యబాలకు డసంఖ్యాక బ్రహ్మాండములకు స్థాతయైన మహావిరాట్పురుషుడు. ఆమహాశిశువు నాకృతి మహాస్థూలములకంటె మహాస్థూలము, కావుననే యాతని నామధేయము 'మహావిరాట్' అనబడెను. పరమాణు వెట్లు సూక్ష్మమో, యట్లేయీమహా విరాట్పురుషు డత్యంత స్థూలము.

తేజసాం షోడశాంశోఽయం కృష్ణస్య పరమాత్మనః ।
ఆధారోఽసంఖ్యవిశ్వానాం మహావిష్ణుః సురేశ్వరః ॥
ప్రత్యేకం రోమకూపేషు విశ్వాని నిఖిలాని చ ।
అద్యాపి తేషాం సంఖ్యాం చ కృష్ణో వక్తుం నహి క్షమః ॥
యథాఽస్తి సంఖ్యా రజసాం విశ్వానాం న కదాచన ।
బ్రహ్మవిష్ణుశివాదీనాం తథా సంఖ్యా న విద్యతే ॥

ప్రతివిశ్వేషు సన్త్యేవం బ్రహ్మవిష్ణుశివాదయః ।
పాతాలబ్రహ్మలోకాన్తం బ్రహ్మాణ్డం పరికీర్తితమ్ ॥
తత ఊర్ధ్వం చ వైకుణ్ఠో బ్రహ్మాణ్డాద్బహిరేవ సః ।
సచ సత్యస్వరూపశ్చ శశ్వన్నారాయణో యథా ॥
తదూర్ధ్వంచైవ గోలోకః పంచాశత్కోటియోజనాత్ ।
నిత్యః సత్యస్వరూపశ్చ యథా కృష్ణస్తథాఽవ్యయమ్ ॥ (5-10)

మూలప్రకృతి యగునీశ్వరినుండి శ్రీకృష్ణపరమాత్మ, పరబ్రహ్మ తేజమునుండి యావిర్భవించిన యామహావిరాట్పురుషుడు తేజములో శ్రీకృష్ణపరమాత్మ యందు బదునాఱవయంశము. అసంఖ్యాకవిశ్వముల కాధారస్వరూపుడు డైన యాశ్రీమహావిష్ణువే సకలసురేశ్వరేశ్వరుడు. ఆశ్రీమహావిష్ణువు రోమకూపము లందు నిఖిలవిశ్వములు వర్తమానములై యున్నవి. స్వాయముగ శ్రీకృష్ణు డైన నయ్యసంఖ్యాకవిశ్వములను లెక్కింపలేడు. జగములం దున్నరజఃకణము లను లెక్కించుట యసాధ్యమైనట్లే మహావిరాట్పురుషుని రోమకూపములందు విరాజిల్లుచున్న యసంఖ్యాకవిశ్వములలోని బ్రహ్మవిష్ణుమహేశ్వరాది దేవతలను గూడ లెక్కించుట యసాధ్యమే. మహావిరాట్పురుషుని యొక్కొక్కరోమకూప ములో నున్న ప్రత్యేకబ్రహ్మాండమందు బ్రహ్మవిష్ణుశివాది దేవతలు విరాజిల్లు చుందురు. వీరితో నలరారు నిట్టి యసంఖ్యాకము లైనబ్రహ్మాండము లెన్నియో మహావిరాట్పురుషునియం దున్నవి. నారదా! పాతాళమునుండి బ్రహ్మ లోకమువఱకు గల జగము నొక బ్రహ్మాండమని గ్రహింపుము. అనేక బ్రహ్మాం డములతో గూడియున్న మహావిరాట్పురుషుని యూర్ధ్వభాగమున నైదువందల కోట్ల యోజనములదూరములో చిన్మయవ్యోమమందు గోలోకవైకుంఠశివ లోకాది దివ్యలోకములు కలవు. శ్రీకృష్ణపరమాత్మవలె నాదివ్యలోకములు నిత్యములు, చిన్మయములు, సత్యస్వరూపములు.

సప్తద్వీపమితా పృథ్వీ సప్తసాగరసంయుతా ।
ఏకోనపంచాశదుపద్వీపాఽసంఖ్యవనాన్వితా ॥
ఊర్ధ్వం సప్త సువర్లోకా బ్రహ్మలోకసమన్వితాః ।
పాతాలాని చ సప్తాధశ్చైవం బ్రహ్మాణ్డమేవ చ ॥
ఊర్ధ్వం ధరాయా భూర్లోకో భువర్లోకస్తతః పరః ।
స్వర్లోకస్తు తతః పశ్చాన్మహర్లోకస్తతో జనః ॥

తతః పర స్తపోలోకః సత్యలోక స్తతః పరః ।
తతః పరో బ్రహ్మలోక స్తప్తకాంచన నిర్మితః ॥
ఏవం సర్వం కృత్రిమం త ద్బాహ్యాభ్యన్తర ఏవ చ ।
తద్వినాశే వినాశశ్చ సర్వేషామేవ నారదః ॥
జలబుద్బుదవ త్సర్వం విశ్వసజ్ఞ మనిత్యకమ్ ।
నిత్యౌ గోలోకవైకుణ్ఠౌ సత్యౌ శశ్వదకృత్రిమౌ ॥ (11-16)

నారదా! ఒకబ్రహ్మాండమం దున్నపృథ్వి సప్తద్వీపములతో, సప్తసముద్రములతో, నలువదితొమ్మిది యుపద్వీపములతో, నసంఖ్యాకవనములతో విరాజిల్లుచుండును. బ్రహ్మాండమును బదునాల్గుభాగములుగ విభజించిన పైనిగలయేడుభాగములు స్వర్గములు, క్రింది యేడుభాగములు పాతాళములు. ఊర్ధ్వభాగమున భూలోకము, దానిపై భువర్లోకము, దానిపై స్వర్లోకము, దానిపై జనలోకము, దానిపై తపోలోకము, దానిపై సత్యలోకము, దానిపై బ్రహ్మలోకము కలవు. అట్లే యధోభాగమున నతల, వితల, సుతలాది సప్తపాతాళములు కలవు. నారదా! ఇదియే యొకబ్రహ్మాండముయొక్క సంక్షిప్త పరిచయము. ఈబ్రహ్మాండము బ్రహ్మయుఃపర్యంతమే యుండి బ్రహ్మపతనముతో నశించును. ఇట్లే సకలబ్రహ్మాండములు జలబుద్బుదములవలె ననిత్యములు, నశాశ్వతములు, గృత్రిమములు, మిథ్యాసమములని తెలిసికొనుము. కేవలము సచ్చిదానందవిగ్రహుడై, పరబ్రహ్మ మైనశ్రీకృష్ణ పరమాత్మయే నిత్యమని గ్రహింపుము. అట్లే యాపురుషోత్తముని చిన్మయ వ్యోమమందు గల గోలోకవైకుంఠాది దివ్యలోకములుకూడ నిత్యములని, నాశరహితములని తెలిసికొనుము.

నారదా! మానవజన్మము పరమదుర్లభము. అట్టి జన్మము లభించిన జీవు డనన్యభక్తి యోగముతో బ్రాకృతాకాశము నధిగమించి చిన్మయవ్యోమమును బ్రవేశించి పరమాత్ముని పరంధామమును జేరుటయే మానవ జన్మకు నిజమైన సాఫల్యము. ఆమహావిరాట్పురుషుని ప్రత్యేకరోమకూపములలో బైన వర్ణింపబడిన యనేకాసంఖ్యాకబ్రహ్మాండములు కలవు. ఒక్కొక్క బ్రహ్మాండములో బ్రహ్మవిష్ణుమహేశ్వరాది దేవతలు విరాజిల్లుచుందురు. దేవతలసంఖ్య మూడుకోట్లు. వీరు బ్రహ్మాండమంతట వ్యాపించి దిశలకు రక్షకులై విరాజిల్లుచున్నారు. నారదమునీంద్రా! మర్త్యదేహధారులైనసకల

చరాచరప్రాణులు కేవలము పృథ్విపైనే యుండగలవు. ఈబ్రహ్మాండములో గల యన్యగ్రహములు జీవశూన్యములని తెలిసికొనుము.

అసంఖ్యాకబ్రహ్మాండములకు స్వామియైనయీమహావిరాట్పురుషు డాశ్రయముకొఱ కూర్ధ్వదృష్టిని సారించెను. భగవంతుని పూర్ణానుగ్రహమువలన నఖండజ్ఞాన ముదయింపగా నతడు పరమాత్మ ననేకవిధముల స్తుతింపదొడంగెను. జ్యోతిర్మయ స్వరూపు డైన శ్రీకృష్ణపరమాత్మ తన సచ్చిదానందవిగ్రహముతో దర్శన మొసంగి యనన్య కరుణతో నాతనిని యనుగ్రహించెను. తనకుజన్మదాత యైనప్రభువును దర్శించి యీ మహావిరాట్పురుషు డత్యంత సంతుష్టుడు, పరమానందభరితుడు నయ్యెను.

పరమాత్మ విరాట్పురుషున కిట్లనేకవరముల నొసంగి "వత్సా! నీకనంతజ్ఞానము లభించుగాక! ఆకలిదప్పులు నిన్నంటవు. మహాప్రళయపర్యంత మీ సకలబ్రహ్మాండములు నిన్నే యాధారముగ జేసికొని యుండగలవు. నీవు మాత్రము నిత్యుడవు, నిష్కాముడవు, నిర్భయుడవు సకలజీవులకు ముక్తిప్రదాతవునై" విరాజిల్ల గలవని పలికెను. తదనంతరము శ్రీకృష్ణపరమాత్మ విరాట్పురుషునకు షడక్షరమహామంత్రము నుపదేశించెను. ఈదివ్యమంత్రము సకలవేదములకు ప్రధానాంగము. ఈమహామంత్రమున కాదియందు ప్రణవము (ఓంకారము) కలదు. మధ్య జతుర్థీవిభక్తిస్థానమందు 'కృష్ణ' యను రెండు బీజాక్షరములు కలవు. అంత్యమం దగ్నిపత్ని స్వాహాసమ్మిళితమై యున్నది. అదియే "ఓం కృష్ణాయ స్వాహా" అనుమంత్రము.

ఇది సకలమంత్రసార స్వరూపము. ఈదివ్యమంత్రస్మరణమాత్రముననే సర్వవిఘ్నములు నశించును. బ్రహ్మపుత్రా! నారదా! ఈదివ్యమంత్రోపదేశానంతర మీమహావిరాట్పురుషునకు శ్రీకృష్ణు డాహారవ్యవస్థ నిట్లు రూపొందించెను. ప్రత్యేకబ్రహ్మాండ మందు భక్తులు భగవంతున కర్పించు నైవేద్యములలో కేవలము పదునాఱవభాగమే గర్భోదకశాయి యగువిష్ణువునకు లభించును, శేషించిన పదునైదుభాగములు మహావిరాట్పురుషునకు జెందగలవు; ఎందువలననగా, నిదియే పరిపూర్ణతము డైనశ్రీకృష్ణుని మహావిరాట్ స్వరూపము.

విప్రవరా! తదనంతరము శ్రీకృష్ణపరమాత్మ వరములను గోరవలసినదిగ మహావిరాట్పురుషుని యాదేశించెను. భగవంతుని యనన్యానుగ్రహ వాక్యముల నాలకించి సంతుష్టాంతరంగుడై విరాట్పురుషు డిట్లు పల్కెను.

**మహావిరాట్పురుషుడు పలికెను :**

వరం మే త్వత్పదామ్భోజే భక్తి ర్భవతు నిశ్చలా ।
సతతం యావదాయు ర్మే క్షణం వా సుచిరం చ వా ॥
త్వద్భక్తియుక్తో యో లోకే జీవన్ముక్తః స సంతతమ్ ।
త్వద్భక్తిహీనో మూర్ఖశ్చ జీవన్నపి మృతో హి సః ॥
కిం తజ్జపేన తపసా యజ్ఞేన యజనేన చ ।
వ్రతేనైవోపవాసేన పుణ్యతీర్థనిషేవయా॥
కృష్ణభక్తివిహీనస్య పుంసః స్యా. జ్జీవనం వృథా ః
యేనాఽఽత్మనా జీవితశ్చ తమేవ నహి మన్యతే ॥
యావ దాత్మా శరీరేఽస్తి తావ త్స్యా చ్ఛక్తిసంయుతః ।
పశ్చా ద్యాన్తి గతే తస్మి న్న స్వతన్త్రాశ్చ శక్తయః ॥
స చ త్వం చ మహాభాగ సర్వాత్మా ప్రకృతేఃపరః ।
స్వేచ్ఛామయశ్చ సర్వాద్యో బ్రహ్మజ్యోతిః సనాతనః ॥ (34-39)

దేవాదిదేవా! మీచరణకమలములందు నాకచంచలమైన, దృఢమైన, యనన్యభక్తిని బ్రసాదింపుము. నాయాయుర్దాయ మొకక్షణమైనను లేదా దీర్ఘకాలమైనను నాలో జీవ మున్నంతవఱకు నాకు నీయం దవిచలానన్య భక్తిశ్రద్ధలను బ్రసాదింపుము. ఈలోకములం దెవరు నీ భక్తు లయ్యెదరో, వారే సదా జీవన్ముక్తులు. నీభక్తివిహీను లైనమూర్ఖులు జీవించియున్నను మరణించినవారితో సమానులే. నీయందు శ్రద్ధాభక్తులు లేనివారెన్ని జపతపో యజ్ఞవ్రతపుణ్యతీర్థసేవనాదుల నొనరించిన నాకర్మ లన్నియునిష్ఫలములే. అట్టి యజ్ఞానిజన్మము నిష్ఫలమే కాగలదు. ప్రభూ! శరీరమం దాత్మస్వరూపుడ వైన నీ వున్నంతవఱకే ప్రాణాది శక్తులు కూడ నుండ గలవు. నీవు వెడలిపోయిన నాసర్వశక్తులు భృత్యులవలె నిన్ననుసరింపగలవు. దేవాదిదేవా! ప్రకృతికి సైత మతీతుడ వైన సర్వాత్మకుడవు నీవే. నీవే సనాతనుడవు, పరబ్రహ్మజ్యోతిస్స్వరూపుడవు, పరమాత్మవు, ఆదిపురుషుడవు, స్వేచ్ఛామయుడవు.

నారదా! ఇట్లు మహావిరాట్పురుషుడు జగన్నాథు ననేకవిధముల స్తుతించి ధన్యుడయ్యెను. శ్రీకృష్ణపరమాత్మ మహావిరాట్పురుషు నిట్లు మరల ననుగ్రహించెను.

## శ్రీకృష్ణభగవానుడు పలికెను :

"వత్సా! నాయనుగ్రహమున నీవనాదిపురుషుడవు కాగలవు. అసంఖ్యాకులై నబ్రహ్మలు నశించినను నీవక్షయుడవై విరాజిల్లగలవు. నీవే ప్రత్యేక బ్రహ్మాండమందు నీ యల్పాంశముతో క్షుద్రవిరాట్ స్వరూపుడవై జగత్పాలనకార్య మొనరింపగలవు.

నీనాభికమలమునుండియే జగత్స్రష్టయైన బ్రహ్మ యావిర్భవింపగలడు. బ్రహ్మదేవుని లలాటమునుండి ద్వాదశరుద్రు లావిర్భవించి సృష్టిసంహారకారకులు కాగలరు. ఆద్వాదశరుద్రులందు ప్రధానుడు కాలాగ్నిరుద్రుడై ప్రసిద్ధిగాంచును. విష్ణువే విశ్వమును రక్షించుటకు నీయల్పాంశముతో నావిర్భవింపగలడు. కుమారా! నావరప్రభావమున నాయెడలననన్యభక్తి కలుగగలదు. నీధ్యానమునందు సదా నీవు నాసచ్చిదానందస్వరూపమునే వీక్షింపగలవు.

ఇట్లు శ్రీకృష్ణపరమాత్మ మహావిరాట్పురుషు ననుగ్రహించి యంతర్ధానుడై గోలోకపరంధామము జేరి యచట బరమాత్మయాజ్ఞకై నిరీక్షించుచున్న బ్రహ్మను సృష్టినిర్మాణార్థమై మహావిరాట్పురుషునిరోమ కూపమందున్న క్షుద్రవిరాట్పురుషునినాభికమలమునుండి జన్మింపవలసినదనిగా నాదేశించెను. అట్లే బ్రహ్మలలాటమునుండి శివాంశముతో రుద్రుడవై జన్మింపుమని మహాదేవునిగూడ నాదేశించెను. శ్రీకృష్ణాజ్ఞానువర్తులై బ్రహ్మశివాదులు సెలవుగైకొనిరి.

మహావిరాట్పురుషుని రోమకూపములో నున్న బ్రహ్మాండజలములందు ఆతడే తన యల్పాంశముతో క్షుద్రవిరాట్పురుషుడైనాడు. ఆయనయె నవీననీరదశ్యాముడు, చతుర్భుజుడు, పీతాంబరధారియు, శంఖచక్రగదాపద్మధారియు, వనమాలావిభూషితుడునై జలములనే శయ్యగ నొనరించుకొని శయనించెను. ప్రసన్నవదనుడు, విశ్వవ్యాపియు నగుపురుషోత్తమునే జనార్దనుడని కీర్తింతురు. ఈపరమపురుషుని నాభికమలమునుండియే సృష్టికర్త యగుబ్రహ్మ యుద్భవించి జనార్దనునిదర్శనార్థమై కమలనాళములో

నొక లక్షదివ్యయుగములు వెదకెను. ఎంతప్రయత్న మొనరించినను బద్మజుడు పద్మనాభుని నాభికమలమం దావిర్భవించిన నాళముచివరవఱకుగూడ బోలేక పోయెను. అపుడు బ్రహ్మ చింతాక్రాంతుడై తనస్వస్థల మైనపద్మము జేరి బహుకాలము పరబ్రహ్మముయొక్క చరణకమలముల దదాదేశానుసారముగ ధ్యానించెను. అట్టిస్థితిలో దివ్యదృష్టిద్వారమున ఆయనకు క్షుద్రవిరాట్పురుషుని దర్శనమయ్యెను. బ్రహ్మాండగోలోకమందు జలయమగుశయ్యపై నాపురుషుడు శయనించియుండెను. ఇంకను నెవనిరోమకూపమం దాబ్రహ్మాండమున్నదో, ఆ మహావిరాట్పురుషునితోపాటు ఆయనకు బరమప్రభు వైనశ్రీకృష్ణభగవానుని దర్శనముగూడ కలిగెను. అంతేకాక గోపీగోపకులచే శోభిల్లు గోలోక ధామముయొక్క దర్శనముగూడ గలిగెను. తదనంతరము బ్రహ్మ పరమేశ్వరు డైనశ్రీకృష్ణుని సచ్చిదానందవిగ్రహమును దనివిదీర వీక్షించి యనేకవిధముల స్తుతించి యాయన యనుజ్ఞ గైకొని సృష్టికార్య మారంభించెను. ప్రథమమున బ్రహ్మకు సనకసనందనాదు లనునల్వురు పుత్రు లుద్భవించిరి. తదనంతరము బ్రహ్మలలాటమునుండి ద్వాదశరుద్రు లుదయించిరి. ఆసమయముననే క్షుద్రవిరాట్పురుషుని వామభాగమునుండి జగమును రక్షించుటకై చతుర్భుజధరు డైనవిష్ణువు ప్రాదుర్భవించెను. ఆయనయే శ్వేతద్వీపములో విరాజిల్లుదైవము. క్షుద్రవిరాట్పురుషుని నాభి కమలసంజాతు డైనబ్రహ్మయే సకలచరాచర సృష్టిచేసెను. స్వర్గమర్త్య పాతాళాదిలోకములను, సమస్తచరాచరదేహధారు లైనప్రాణులను నవ్విధాతయే సృజించెను.

నారదమునీంద్రా! ఇట్లామహావిరాట్పురుషుని ప్రత్యేకరోమకూపమం దొక్కొక్క బ్రహ్మాండముగ నాయన యసంఖ్యాకరోమకూపములం దనేక బ్రహ్మాండము లావిర్భవించినవి. ప్రతిబ్రహ్మాండమందు నొకయల్పవిరాట్ పురుషుడు, బ్రహ్మవిష్ణురుద్రాదిదేవతలు నుండగలరు. కుమారా! ఈవిధముగ నీకు సర్వమంగళస్వరూపు డగుశ్రీకృష్ణుని దివ్యలీలలను సంక్షేపముగ నుపదేశించితిని. ఈపవిత్రప్రసంగశ్రవణము సమస్తసుఖములను, మోక్షమును బ్రసాదింపగలదు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణసంవాదములో
విశ్వబ్రహ్మాండవర్ణన మను
మూడవ అధ్యాయము
సంపూర్ణము.

# నాలుగవ అధ్యాయము

## సరస్వతీదేవి మూలమంత్రము, పూజావిధానము, కవచము.

**నారదుడు పలికెను :**

భగవానుడా! మూలప్రకృతినుండి ప్రాదుర్భవించిన శక్తిమాతల పూజా ప్రసంగములను గృపతో నుపదేశింపుడని ప్రార్థించుచున్నాను.

ఏభక్తు లేదేవి నేవిధముగ నారాధించిరో, మర్త్యలోకమం దేప్రకారముగ వారియారాధనలు, పూజలు ప్రచారము పొందెనో, ఏయేమంత్రముల నుపాసించి వారిని బూజించిరో, ఏయేస్తోత్రములతో వారిని స్తుతించిరో, ఏయేమాత లెవరెవరి కేయేవరములను బ్రసాదించిరో, ఈమొదలగు చరితముల నన్నింటిని సవిస్తరముగ వర్ణించి నన్ను గృతార్థుని జేయవలసినదిగా బ్రార్థించుచున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

దేవర్షి! శ్రీగణేశ్వరజనని యగుదుర్గ, రాధ, లక్ష్మి, సరస్వతి, సావిత్రి, ఈయైదుగురుశక్తులు సకలసృష్టికి బీజస్వరూపిణు లైనపంచప్రకృతులు. వీరి యారాధనలు, నద్భుతప్రభావములు సకలజగములందు [illegible] మంగళమయము లైనశుభచరితములు సర్వమంగళప్రదములు [illegible] నారదా! ఏ శక్తులు మూలప్రకృతి యంశ [illegible] పిణులో, వారిపుణ్యప్రదదివ్యాఖ్యానములను [illegible] యాకర్ణింపుము.

వాణి, వసుంధర, గంగ, షష్ఠి, మంగళచండి, తులసి, [illegible] స్వధ, స్వాహా, దక్షిణ– వీరు తేజోరూపగుణములందు మూలప్రకృతికి సరిసమానలు. వీరి దివ్యచరితములు పుణ్యప్రదములై, సుఖదాయకములై జీవులకర్మలను దివ్యకర్మలుగ మార్చగలవు. జనని యగుదుర్గయొక్క, రాధామాత యొక్క, యాఖ్యానము లత్యంతవిస్తృతములు. వీరిద్దరి దివ్యపావన చరితములను తదనంతరము సంక్షేపముగ వివరింపగలను. శ్రీకృష్ణపరమాత్మయే ప్రప్రథమమున భగవతి సరస్వతీదేవిని బూజించి యారాధించెను. ఆదేవి

దివ్యానుగ్రహమువలన బరమమూర్ఖులు సహితము పండితప్రకాండులు కాగలరు. సరస్వతీదేవి యవతరింపగనే తనసమక్షములోనున్న దివ్యసచ్చిదానందవిగ్రహు డైనశ్రీకృష్ణపరమాత్మను గాంచి యాయనయం దత్యంతానురక్త యయ్యెను. భగవత్యంతరంగమును గ్రహించి శ్రీకృష్ణపరమాత్మ యత్యంతమధురవచనములతో సరస్వతీదేవి నీవిధముగ నాదేశించెను.

## శ్రీకృష్ణభగవానుడు పలికెను :

దేవీ! మదంశసంభూతుడు, ననంతకోటికందర్పసుందరుడు, చతుర్భుజుడు నైనశ్రీమన్నారాయణుని సేవింపుము. నేను సర్వేశ్వరేశ్వరుడను; ఎవరైనను నాశాసనమును బరిపాలించవలసినదే. మూలప్రకృతి యగుశ్రీరాధ తేజోరూపగుణములందు నాతో సమానురాలు. సర్వదేహధారులకు బ్రాణములన్న, నెట్లత్యంతప్రియములో, యట్లే నాకు నాప్రాణాధికురాలు, నాప్రాణాధిష్ఠాత్రిదేవి యైనరాధ యత్యంతప్రియురాలు. నేను రాధ యభిన్నులమని గ్రహింపుము. ఆమెను నే నొకక్షణమైనను వీడజాలను. కావున నీవు వైకుంఠమున కరిగి శ్రీమన్నారాయణుని స్వామిగ స్వీకరించి సకలారాధ్యవు కమ్ము. సర్వగుణములందు నీతో సమురా లైనశ్రీమహాలక్ష్మి శ్రీమన్నారాయణుని యర్ధాంగి. శ్రీమహాలక్ష్మి కామక్రోధలోభమోహమాత్సర్యరహితురాలు, కావున నీ వామెతో గలిసి శ్రీమహావిష్ణువునానందపూర్వకముగ సేవింపుము.

సురసుందరీ! ప్రత్యేకబ్రహ్మాండమందు బ్రతిమాఘశుక్లపంచమినాడు, విద్యారంభసమయములలో బ్రజ లనన్యభక్తిసమన్వితులై నిన్ను బూజించి యారాధించెదరు. దేవీ! నావరప్రభావమువలన నీసమయమునుండి మహాప్రళయపర్యంతము ప్రత్యేకకల్పమందు మనుష్యులు, మనువులు, మోక్షకాములైనప్రసిద్ధమహర్షులు, దేవతలు, వసువులు, యోగులు, సిద్ధులు, నాగులు, గంధర్వులు, తుదకు రాక్షసులు సైత మత్యంతభక్తితో షోడశోపచారములతో నిన్ను ఆరాధింతురు. జితేంద్రియు లైనపురుషులు కణ్వశాఖయందు వర్ణింపబడిన విధానముతో నిన్ను బూజించి ధ్యానింతురు. వారు నిన్ను మంగళకలశమందు, బవిత్రపుస్తకమందు నావాహనము చేసి షోడశోపచారములతో బూజించెదరు. నీ కవచమును పత్రిమ్మునై

లిఖించి బంగారు గుటికయం దుంచి, చందనగంధాక్షతలతో బూజించి గళమందుగాని, దక్షిణభుజమందుగాని ధరించిన మహావిద్యా సంపన్ను లయ్యెదరు.

ఇట్లు శ్రీకృష్ణపరమాత్మ సరస్వతీదేవి ననుగ్రహించి తానే స్వయముగ నామెను బూజించెను.

తదనంతరము బ్రహ్మ, విష్ణువు, శంకరుడు, అనంతుడు, ధర్మదేవత, దేవతలు, మహర్షులు, నరేశ్వరులు, మానవులు, నాసరస్వతిదేవిని గ్రమముగ నారాధించిరి. నారదా! సకలవిద్యలకు నధిష్ఠాత్రిశక్తి యైనభగవతి సరస్వతీదేవి సకలప్రాణులకు సదా యారాధ్యురాలని గ్రహింపుము.

**నారదుడు పలికెను :**

వేదవేత్తలందు శ్రేష్ఠుడవైన ప్రభూ! సరస్వతీపూజావిధానమును, ధ్యానమును, గవచమును నాకు గృపతో నుపదేశింపవలసినగ బ్రార్థించు చున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదమునీంద్రా! కణ్వశాఖయందు జగన్మాత యగుసరస్వతీదేవి పూజావిధానము సవిస్తరముగ వర్ణింపబడెను. మాఘశుక్లపంచమి విద్యారంభమునకు శుభప్రదమైన దినము. కావున నానాడు ప్రాతఃకాలమునకు బూర్వమే నిద్ర మేల్కాంచి సంయమశీలురై పవిత్రహృదయముతో వ్రతులు దేవి నారాధించుటకు బ్రతిజ్ఞ నొనరించి స్నానాదినిత్యనైమిత్తికకార్యములను బరిపూర్తి గావింపవలెను. తదనంతర మనన్యభక్తిపూర్వకముగ మంగళకలశమును స్థాపించి నైవేద్యాది వివిధోపచారములతో గణేశ్వరుని, సూర్యుని, నగ్నిని, విష్ణువును, శివుని, బార్వతిని బూజింపవలెను. ధ్యాన ద్వారమున నావాహనముచేసి సరస్వతీదేవిని షోడశోపచారములతో బూజింపవలెను. నవనీతమును, దధిని, క్షీరములను, బరమాన్నములను, మధురలడ్డుకములను, జెఱకును, జెఱకురసమును, జెఱకురసముతో నొనరింపబడిన బెల్లమును, స్వస్తికభక్ష్యములను, జక్కెరను, ఘృతమును, సైంధవలవణముతో సిద్ధపఱచిన హవిష్యములను, వ్యంజనములను, గోధుమపిండి చక్కెర నేయికలిపి సిద్ధము చేసిన మధురపదార్థములను, పిష్టకములను, బండినయరటిపండ్లను, బరమాన్న

మును, సుధోపమమైన నేతితో గలిపివండిన మృష్టాన్నమును, నారికేళమును, నారికేళోదకమును, శ్రీఫలమును, బదరీఫలమును మఱియు ననేక స్వాదిష్ట సుపక్వఫలములను సరస్వతీదేవికి నైవేద్యముగ నర్పింపవలెను. మునీశ్వరా! సుగంధయుక్తములైన తెల్లని పుష్పములను జందనమును, నవీనశ్వేతవస్త్రములను, సుందరశంఖమును, శ్వేతపుష్పమాలికలను వివిధభూషణములను దేవికి భక్తితో నర్పింపలెను.

సరస్వతీదేవి ధ్యానము పరమసుఖదాయకము, సర్వసంశయములను, భ్రమలను నివారింపగల మహాశక్తిసమన్వితము.

> సరస్వతీం శుక్లవర్ణాం సస్మితాం సుమనోహరామ్ ।
> కోటిచన్ద్రప్రభాజుష్టపుష్టశ్రీయుక్తవిగ్రహామ్ ॥
> వహ్నిశుద్ధాంశుకాదానాం సుప్రసన్నాం దయామయీమ్ ।
> రత్నసారేన్ద్రఖచితవరభూషణభూషితామ్ ॥
> సుపూజితాం సురగణైర్బ్రహ్మవిష్ణుశివాదిభిః ।
> వన్దే భక్త్యా వన్దితాం తాం మునీన్ద్రమనుమానవైః ॥ (46-48)

శుక్లవర్ణసంయుక్తయు, సదా సస్మితవదనారవిందయు, సుమనోహారిణియు, కోటిచంద్రప్రభాయుక్తహృష్టపుష్టశ్రీయుక్త దివ్యవిగ్రహధారిణియు, అగ్నిశుద్ధదివ్యవస్త్రధారిణియు, సుప్రసన్న దయామయియు, సుమనోహారిణియు, రత్నసారేంద్రఖచిత వరభూషణభూషితయు; దేవతలచేత, బ్రహ్మవిష్ణుశివాదులచేత, మునీంద్రులచేత, మనుమానవులచేత సదా పూజింపబడునదియు నగుసరస్వతికి నేననన్యభక్తితో వందనముల నర్పించెదను.

ఇట్లు ధ్యానమొనరించి విద్వాంసులైనపురుషులు సరస్వతీ మూలమంత్రోచ్చారణ మొనర్చుచు షోడశోపచారములతో సకలపదార్థములను దేవి కర్పించి, దేవీకవచమును బఠించి, సాష్టాంగదండప్రణామము లర్పింపవలెను. మునీశ్వరా! సరస్వతి యనుగ్రహము నాకాంక్షించువారు పైనవర్ణింపబడిన విధముగనే యామె నారాధింపవలెను. విద్యారంభసమయములందు, సంవత్సరాంతమున, మాఘశుక్లపంచమీ దినమున నందఱు సరస్వతీదేవిని విధిగ బూజింపవలెను. "శ్రీం హ్రీం సరస్వత్యై స్వాహా"- ఇదియే వేదప్రోక్తమైనసరస్వతీదేవ్యష్టాక్షర మూలమంత్రము. ఈమహామంత్రము పరమశ్రేష్ఠము, సర్వులకు జపయోగ్యము. సరస్వతీశబ్దము చివర జతుర్థీవిభక్తిని

గలిపి యంతమందు స్వాహా శబ్దమును జేర్చవలెను. ఈమంత్రాదియందు లక్ష్మీబీజము (శ్రీం), మాయాబీజము (హ్రీం) చేర్చవలెను. "శ్రీం హ్రీం స్వాహా" యను నీదివ్యమంత్రము సాధకులకు గల్పవృక్ష సదృశము. ప్రాచీన కాలములో గృపానిధి యైననారాయణుడు పుణ్యక్షేత్ర మైనభారతవర్షములో జాహ్నవీ నదీతీరమున వాల్మీకిమహర్షి కి నుపదేశించెను.

తదనంతరము సూర్యగ్రహణసమయమున బుష్కరక్షేత్రములో భృగు మహర్షి శుక్రాచార్యునకు, మరీచినందను డైనకశ్యపబుషి చంద్రగ్రహణ సమయములో బ్రసన్ను డైనబృహస్పతికిని, బదరికాశ్రమమునబ్రహ్మ భృగువు నకును, జరత్కారుమహర్షి యాస్తీకునకును, మేరుపర్వతముపై విభాండక మహర్షి బుష్యశృంగునకును శివుడు కాణాదునకును, గౌతమునకును నీ మంత్ర మునే ప్రసాదించిరి. సూర్యుని కృపవలన యాజ్ఞ్యవల్క్యుడు, కాత్యాయ నుడు నేతన్మహామంత్ర సంపన్నులైరి. ఆదిశేషు డీమంత్రమును బాణినికి, భరద్వాజునకును, శాకటాయనునకును నుపదేశించెను. నాల్గులక్షల పర్యాయ ములు జపమొనరించిన మానవుల కీమహామంత్రము సిద్ధింపగలదు. ఈ మంత్రసిద్ధి నొందినవారు మహావిద్వాంసులై యఖండజ్ఞాన సంపన్నులు కాగలరు.

విప్రేంద్రా! సరస్వతీదేవి దివ్యకవచము కవచధారికి విశ్వవిజయమును బ్రసాదింపగలదు. జగత్స్రష్ట యగుబ్రహ్మ గంధమాదన పర్వతముపై భృగు మహర్షిప్రార్థనలకు బ్రసన్నుడై యీసరస్వతీ విశ్వజయకవచము నుపదేశించెను. ఆ సంఘటనమును వర్ణించెద నాకర్ణింపుము.

## భృగుమహర్షి పలికెను :

బ్రహ్మదేవా! నీవు బ్రహ్మజ్ఞానులందు శ్రేష్ఠుడవు, పరిపూర్ణబ్రహ్మజ్ఞాన సంపన్నుడవు, సర్వజ్ఞుడవు, విశ్వమునందు గలసకలచరాచరప్రాణులకు దండ్రివి, స్వామివి, పరమారాధ్యదైవమవు. ప్రభూ! అనన్యకరుణతో ననుగ్రహముతో విశ్వజయ మనుభగవతి సరస్వతీదేవి దివ్యకవచమును నా కుపదేశింపవలసినదిగ మిమ్ముల నర్థించుచున్నాను. దేవా! ఈకవచమునే బుధజనులు మాయాప్రభావ నివారక మందురు. మంత్రసమూహ సార మందురు, పరమపవిత్రమందురు గదా!

# విశ్వజయ సరస్వతీ కవచము

**బ్రహ్మోవాచ :**

శృణు వత్స ప్రవక్ష్యామి కవచం సర్వకామదమ్ ।
శ్రుతిసారం శ్రుతిముఖం శ్రుత్యుక్తం శ్రుతిపూజితమ్॥
ఉక్తం కృష్ణేన గోలోకే మహ్యం బృన్దావనే వనే ।
రాసేశ్వరేణ విభునా రాసే వై రాసమణ్డలే ॥
అతీవ గోపనీయం చ కల్పవృక్షసమం పరమ్ ।
అశ్రుతాద్భుతమన్త్రాణాం సమూహైశ్చ సమన్వితమ్ ॥
యద్ ధృత్వా భగవాన్ శ్శుక్రః సర్వదైత్యేషుపూజితః
యద్ధృత్వాపఠనాద్ బ్రహ్మన్ బుద్ధిమాంశ్చబృహస్పతిః॥
పఠనా ద్ధారణా ద్వాగ్మీ కవీన్ద్రో వాల్మీకో మునిః ।
స్వాయంభువో మనుశ్చైవ యద్ ధృత్వాసర్వపూజితః
కణాదో గౌతమః కణ్వః పాణినిః శాకటాయనః ।
గ్రన్థం చకార యద్ ధృత్వా దక్షఃకాత్యాయనఃస్వయమ్॥
ధృత్వా వేదవిభాగం చ పురాణా న్యఖిలాని చ।
చకార లీలామాత్రేణ కృష్ణద్వైపాయనః స్వయమ్ ॥
శాతాతపశ్చ సంవర్తో వశిష్ఠశ్చ పరాశరః ।
యద్ ధృత్వా పఠనాద్ గ్రన్థం యాజ్ఞవల్క్యశ్చకార సః
ఋష్యశృఙ్గో భరద్వాజ శ్చాస్తీకో దేవల స్తథా ।
జైగీషవ్యోఽథ జాబాలి ర్యద్ ధృత్వా సర్వపూజితః ॥
కవచ స్యాస్య విప్రేన్ద్ర ఋషిరేవ ప్రజాపతిః ।
స్వయం ఛన్దశ్చ బృహతీ దేవతా శారదామ్బికా ॥
సర్వతత్త్వపరిజ్ఞానే సర్వార్థసాధనేషు చ ।
కవితాసు చ సర్వాసు వినియోగః ప్రకీర్తితః ॥
శ్రీం హ్రీం సరస్వత్యై స్వాహా శిరో మేపాతు సర్వతః।
శ్రీం వాగ్దేవతాయై స్వాహా ఫాలం మే సర్వదాఽవతు ॥
ఓం సరస్వత్యై స్వాహేతి శ్రోత్రే పాతు నిరన్తరమ్ ।
ఓం శ్రీ హ్రీం భారత్యై స్వాహా నేత్రయుగ్మం సదాఽవతు ॥
ఐం హ్రీం వాగ్వాదిన్యై స్వాహా నాసాం మే సర్వతోఽవతు ।
హ్రీం విద్యాధిష్ఠాతృదేవ్యై స్వాహా ఓష్ఠం సదాఽవతు ॥

ఓం శ్రీం హ్రీం బ్రాహ్మ్యై స్వాహేతి దన్తపంక్తిం సదాఽవతు ।
ఐ మిత్యేకాక్షరో మన్త్రో మమ కణ్ఠం సదాఽవతు ॥
ఓం శ్రీం హ్రీం పాతు మే గ్రీవాం స్కన్ధౌ మే శ్రీం సదాఽవతు ।
ఓం శ్రీం విద్యాధిష్ఠాతృదేవ్యై స్వాహా వక్షః సదాఽవతు ॥
ఓం హ్రీం విద్యాస్వరూపాయై స్వాహా మే పాతు నాసికామ్ ।
ఓం హ్రీం క్లీం వాణ్యై స్వాహేతి మమ హస్తౌ సదావతు ॥

ఓం సర్వవర్ణాత్మికాయై పాదయుగ్మం సదావతు ।
ఓం వాగాధిష్ఠాతృదేవ్యై స్వాహా సర్వం సదావతు ॥
ఓం సర్వకణ్ఠవాసిన్యై స్వాహా ప్రాచ్యాం సదావతు ।
ఓం హ్రీం జిహ్వాగ్రవాసిన్యై స్వాహాగ్నిదిశి రక్షతు॥
ఓం ఐం హ్రీం శ్రీం క్లీం సరస్వత్యై బుధజనన్యైస్వాహా ।
సతతం మన్త్రరాజోఽయం దక్షిణే మాం సదావతు ॥
ఐం హ్రీం శ్రీంత్ర్యక్షరో మన్త్రో నైఋత్యాం మే సదావతు ।
కవిజిహ్వాగ్రవాసిన్యై స్వాహా మాం వారుణేఽవతు ॥
ఓం సర్వామ్బికాయై స్వాహా వాయవ్యే మాం సదావతు।
ఓం ఐం శ్రీం గద్యపద్యవాసిన్యై స్వాహా మా ముత్తరేఽవతు ॥
ఐం సర్వశాస్త్రవాసిన్యై స్వాహైశాన్యాం సదావతు ॥
ఓం హ్రీం సర్వపూజితాయై స్వాహాచోర్ధ్వం సదావతు।
ఐం హ్రీం పుస్తకవాసిన్యై స్వాహాఽధో మాం సదావతు
ఓం గ్రన్థబీజరూపాయై స్వాహా మాం సర్వతోఽవతు ॥
ఇతి తే కథితం విప్ర! బ్రహ్మమన్త్రౌఘవిగ్రహమ్ ।
ఇదం విశ్వజయం నామ కవచం బ్రహ్మరూపకమ్ ॥
పురా శ్రుతం ధర్మవక్త్రాత్ పర్వతే గన్ధమాదనే ।
తవ స్నేహా న్మయాఽఽఖ్యాతం ప్రవక్తవ్యం న కస్యచిత్ ॥
గురు మభ్యర్చ్య విధివ ద్వస్త్రాలఙ్కార చన్దనైః ।
ప్రణమ్య దణ్డవ ద్భూమౌ కవచం ధారయేత్ సుధీః ॥
పంచలక్షజపేనైవ సిద్ధం తు కవచం భవేత్ ।
యది స్యాత్ సిద్ధకవచో బృహస్పతిసమో భవేత్ ॥
మహావాగ్మీ కవీన్ద్రశ్చ త్రైలోక్యవిజయీ భవేత్ ।
శక్నోతి సర్వం జేతుం చ కవచస్య ప్రభావతః ॥ (82-90)

వత్సా! సమస్త కామనలను బరిపూర్ణ మొనరింపగల కవచము నుపదేశించెద సావధానుడవుగమ్ము. ఈదివ్యకవచము శ్రుతులసారము, శ్రుతిముఖము, శ్రుతిపూజితము, శ్రవణ మొనరించుట కత్యంతయుక్తము. గోలోకములో విరాజిల్లు శ్రీకృష్ణపరమాత్మ బృందావనరాసమండలమధ్యమున రాససమయములో నా కీదివ్యకవచమును బ్రసాదించెను. అత్యంత గోపనీయ మైనయీకవచము కల్పవృక్షసమము. ఎవ్వరును శ్రవణ మొనరింపని యద్భుతమంత్రసమూహము లీదివ్యకవచమందు నిహితములై యున్నవి. ఈకవచధారణ మొనరించి యత్యంతప్రభాయుక్తుడై శుక్రాచార్యుడు సర్వదైత్యులకు బూజనీయుడయ్యెను. ఈకవచమును బఠించి, ధరించి బృహస్పతి యసామాన్య ప్రజ్ఞాసంపన్నుడైనాడు. అట్లే వాల్మీకిమహర్షి మహావక్త యైనకవీంద్రుడైనాడు. స్వాయంభువమనువు సర్వపూజితుడైనాడు. కణాదుడు, గౌతముడు, కణ్వమహర్షి, పాణిని, శాకటాయనుడు, దక్షుడు, కాత్యాయనుడు నీకవచధారణశక్తివలననే యనేకశాస్త్రగ్రంథములను రచించుటలో సఫలులైరి. స్వయముగ కృష్ణద్వైపాయన వ్యాసదేవుడు వేదములను విభజించి లీలగా నిఖిలపురాణములను బ్రవచింపగల్గెను. అట్లే శాతాతపుడు, సంవర్తుడు, వశిష్ఠుడు, పరాశరుడు, యాజ్ఞవల్క్యుడు, ఋష్యశృంగుడు, భరద్వాజుడు, ఆస్తీకుడు, జైగీషవ్యుడు, జాబాలి యనువారనేక గ్రంథ నిర్మాతలై సర్వపూజితులైరి.

విప్రేంద్రా! ఈకవచమునకు ఋషి స్వయముగ ప్రజాపతియే. ఈకవచమునకు ఛందము బృహతియే, శారదాంబికయే యధిష్ఠాత్రీదేవి. సర్వతత్త్వపరిజ్ఞానముకొఱకు, సర్వార్థములను సాధించుకొఱకు, సుకవిత్వముకొఱకు నీకవచమును వినియోగింపవలెను.

'శ్రీం, హ్రీం' స్వరూపిణి యైనభగవతి సరస్వతికొఱకు నాశ్రద్ధలనే యాహుతులుగ నర్పించెదను గాన నాదేవి యన్నిదిశలనుండి నాశిరమును రక్షించుగాక. 'ఓంశ్రీం' వాగ్దేవత సదా నాలలాటమును, ఓంకార స్వరూపిణి నిరంతరము నాశ్రోత్రములను రక్షించుగాక. ఓంశ్రీంహ్రీంకారస్వరూపిణినా నేత్రయుగ్మమును, ఐం హ్రీంకారస్వరూపిణి సర్వదానానాసికను, ఓంహ్రీంకార స్వరూపిణినా పెదవులను, ఓం శ్రీం హ్రీంకారస్వరూపిణి నా దంతపంక్తిని, ఐం అనుసరస్వతీదేవి యేకాక్షరమంత్రము సదా నాకణ్ఠమును, ఓం శ్రీం హ్రీంకారాం స్వరూపిణి! నాగళమును, శ్రీంకారరూపిణి నాభుజములను, ఓం శ్రీం కార

స్వరూపిణి సదా నావక్షఃస్థలమును, ఓం హ్రీం స్వరూపిణి నానాభిని, ఓం హ్రీం క్లీం స్వరూపిణి నాకరములను, ఓంకారస్వరూపిణి నాపాదములను, ఓం కారస్వరూపిణి నాసర్వస్వమును, సర్వుల కంఠములలో నివసించు ఓంకారస్వరూపిణి పూర్వదిశయందు సదా నన్ను రక్షించుగాక. జిహ్వా గ్రమున విరాజిల్లు ఓం హ్రీంకారస్వరూపిణి యగ్నికోణమందు సదా నన్ను రక్షించుగాక.

'ఓం ఐం హ్రీం శ్రీం క్లీం సరస్వత్యై బుధజనన్యై స్వాహా' అను నీ మహామంత్రము సర్వమంత్రరాజము. సరస్వతీ స్వరూప మైన యీదివ్య మంత్రము నిరంతరము నాదక్షిణదిశను, రక్షించుగాక. 'ఐం హ్రీం శ్రీం' అను నీమూడక్షరముల మంత్రము నైరృతికోణమందు, కవుల జిహ్వాగ్రమ ములపై సదా విరాజిల్లు ఓంకార స్వరూపిణి పశ్చిమదిశయందు, ఓంకార స్వరూపిణి వాయవ్యకోణమందు సదా నన్ను రక్షించుగాక.

ఓం ఐం శ్రీంకారస్వరూపిణి యుత్తరదిశయందు, ఐం కార స్వరూపిణి యీశాన్యదిశయందు, ఓం హ్రీంకారస్వరూపిణి ఊర్ధ్వదిశయందు ఐం హ్రీంకారస్వరూపిణి యధోభాగమునందు నన్ను రక్షించుగాక. ఓంకార స్వరూపిణి యన్నిదిక్కులనుండి సదా నన్ను రక్షించుగాక.

విప్రేంద్రా! అనేకబ్రహ్మమంత్రములు మూర్తీభవించిన యీకవచమును నీకుపదేశించితిని. ఈ విశ్వజయ మనుకవచము స్వయముగ పరబ్రహ్మస్వరూ పము. ప్రాచీనకాలమందు గంధమాదన పర్వతముపై నాపితృదేవు లైనధర్మ దేవతముఖారవిందమునుండి నే నీకవచమును శ్రవణమొనరించితిని. నీవు నా కత్యంతప్రీతిపాత్రుడవు కావున నీ కీదివ్యకవచమును నుపదేశించితిని. ఈకవ చము ననర్హులయెదుట బహిర్గత మొనరింపరాదు. విద్వాంసు లైనవారు వస్త్రచందనాద్యలంకారాది వివిధసామగ్రులతో విధిపూర్వకముగ గురువును బూజించి యాయనకు సాష్టాంగ దండప్రణామము లర్పించి, తదనుగ్రహమునకు బాత్రులై గురుముఖమునుండి కవచోపదేశమును బడసి, హృదయమందు ధారణచేసికొందురు. ఐదులక్షల పర్యాయములు జపించిన నీ దివ్యకవచము సిద్ధింపగలదు. ఈకవచసిద్ధి పొందిన దేహధారి బృహస్పతి సముడు, మహా వాగ్మియు కవులయందు సమ్రాట్టు, త్రైలోక్యవిజయుడు కాగలడు. ఈకవ చానుగ్రహమువలన గవచధారి విద్వత్తులో సర్వులను జయింపగల సమర్థుడు కాగలడు.

నారదమునీంద్రా! ఈదివ్యకవచము కణ్వశాఖయందు ప్రపంచింపబడెను. ఇక సరస్వతీ దివ్యస్తోత్రము నుపదేశించెద సావధానుడవై యవధరింపుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణ
సంవాదమున సరస్వతీకవచ మను
నాలుగవ అధ్యాయము
సంపూర్ణము.

## ఐదవ అధ్యాయము

### యాజ్ఞవల్క్యమహర్షికృత సరస్వతీస్తుతి

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదమునీంద్రా! సకలమనోరథములను సిద్ధింపజేయగల సరస్వతీదేవి దివ్యస్తోత్రము నుపదేశించెద సావధానుడవై యాకర్ణింపుము. పూర్వకాలమున యాజ్ఞవల్క్యు డనుప్రసిద్ధమహర్షి యుండెను. ఆయన యీ దివ్యస్తోత్రముతోనే సరస్వతీదేవిని స్తుతించి పరిపూర్ణజ్ఞానసంపన్ను డయ్యెను. దైవవశమున యాజ్ఞవల్క్యుడు గురుదేవుని శాపమునకు గుఱియై విద్యాభ్రష్టుడై యత్యంత వ్యథితహృదయముతో లోలార్కకుండ మను పవిత్రతీర్థమున కేగెను. అచట నామహర్షి యఖండభక్తితో నారాధించి సూర్యుని ప్రసన్నునిగ జేసికొనెను. అపుడు సూర్యదేవుడు యాజ్ఞవల్క్య

నకు సర్వవిద్యాజ్ఞానప్రదాయక మగుసరస్వతీదివ్యస్తోత్రము ననుగ్రహించి సకల వేదవేదాంగముల నుపదేశించి స్మరణశక్తిప్రాప్తికై యీస్తోత్రముతో సరస్వతీ దేవి నారాధింపుమని యాదేశించెను. సూర్యాజ్ఞానుసారముగ మహా స్నానమాచరించి పవిత్రుడై వినయపూర్వకముగ శిరమును వంచి యనన భక్తితో సరస్వతి నిట్లు ప్రార్థించెను.

**యాజ్ఞవల్క్య ఉవాచ :**

కృపాం కురు జగన్మాత ర్మా మేవం హతతేజసమ్ ।
గురుశాపాత్ స్మృతిభ్రష్టం విద్యాహీనం చ దుఃఖితమ్ ॥

జ్ఞానం దేహి స్మృతిం దేహి విద్యాం విద్యాధిదేవతే ।
ప్రతిష్ఠాం కవితాం దేహి శక్తి శిష్యప్రబోధినీమ్ ॥

గ్రన్థకర్తృత్వశక్తిం చ సుశిష్యం సుప్రతిష్ఠితమ్ ।
ప్రతిభాం సత్సభాయాం చ విచారక్షమతాం శుభామ్ ॥

లుప్తం సర్వం దైవవశా న్నవీభూతం పునః కురు ।
యథాఙ్కురం భస్మని చ కరోతి దేవతా పునః ॥

బ్రహ్మస్వరూపా పరమా జ్యోతీరూపా సనాతనీ ।
సర్వవిద్యాధిదేవీ యా తస్మై వాణ్యై నమో నమః ॥

యయా వినా జగత్సర్వం శశ్వజ్జీవన్మృతం సదా ।
జ్ఞానాధిదేవీ యా తస్యై సరస్వత్యై నమో నమః ॥

యయా వినా జగత్ సర్వం మూక మున్మత్తవత్సదా ।
వాగాధిష్ఠాతృదేవీ యా తస్యై వాణ్యై నమో నమః ॥

హిమచన్దనకున్దేన్దుకుముదామ్భోజసన్నిభా ।
వర్ణాధిదేవీ యా తస్యై చాక్షరాయై నమో నమః ॥

విసర్గబిన్దుమాత్రాణాం యదధిష్ఠాన మేవ చ ।
ఇత్థం త్వం గీయసే సద్భి ర్భారత్యై తే నమో నమః ॥

యయా వినా చ సంఖ్యాతా సంఖ్యాం కర్తుం నశక్యతే ।
కాలసంఖ్యాస్వరూపా యా తస్యై దేవ్యై నమో నమః ॥

వ్యాఖ్యాస్వరూపా యా దేవీ వ్యాఖ్యాధిష్ఠాతృదేవతా ।
భ్రమసిద్ధాన్తరూపా యా తస్యై దేవ్యై నమో నమః ॥

స్మృతిశక్తి ర్జ్ఞానశక్తి ర్బుద్ధిశక్తిస్వరూపిణీ ।
ప్రతిభా కల్పనా శక్తి ర్యా చ తస్యై నమో నమః ॥

సనత్కుమారో బ్రహ్మాణం జ్ఞానం పప్రచ్ఛయత్ర వై ।
బభూవ జడవత్ సోఽపి సిద్ధాన్తం కర్తు మక్షమః ॥
తదాఽఽజగామ భగవా నాత్మా శ్రీకృష్ణ ఈశ్వరః ।
ఉవాచ స చ తాం స్తౌహి వాణీ మిష్టాం ప్రజాపతే ॥
స చ తుష్టావ త్వాం బ్రహ్మ చాజ్ఞయా పరమాత్మనః ।
చకార త్వత్ప్రసాదేన తదా సిద్ధాన్త ముత్తమమ్ ॥
యదా ప్యనన్తం పప్రచ్ఛ జ్ఞానమేకం వసున్ధరా ।
బభూవ మూకవత్ సోఽపి సిద్ధాన్తం కర్తు మక్షమః ॥
తదా త్వాం స చ తుష్టావ సన్త్రస్తః కశ్యపాజ్ఞయా ।
తత శ్చకార సిద్ధాన్తం నిర్మలం భ్రమభంజనమ్ ॥
వ్యాసః పురాణసూత్రం చ పప్రచ్ఛ వాల్మీకం యదా ।
మౌనీభూతః స సస్మార త్వామేవ జగదమ్బికామ్ ॥
తదా చకార సిద్ధాన్తం త్వద్వరేణ మునీశ్వరః ।
సమ్ప్రాప్య నిర్మలం జ్ఞానం ప్రమాదధ్వం సకారణమ్॥
పురాణసూత్రం శ్రుత్వా చ వ్యాసః కృష్ణకలోద్భవః ।
త్వాం శిషేవే చ దధ్యౌ చ శతవర్షం చ పుష్కరే ॥
తదా త్వత్తో వరం ప్రాప్య సత్కవీన్ద్రో బభూవ హ ।
తదా వేదవిభాగం చ పురాణం చ చకార సః ॥
యదా మహేన్ద్రః పప్రచ్ఛ తత్త్వజ్ఞానం సదాశివమ్ ।
క్షణం త్వామేవ సంచిన్త్య తస్మై జ్ఞానం దదౌ విభుః ॥
పప్రచ్ఛ శబ్దశాస్త్రం చ మహేన్ద్రశ్చ బృహస్పతిమ్ ।
దివ్యం వర్షసహస్రం చ స త్వాం దధ్యౌ చ పుష్కరే॥
తదా త్వత్తో వరం ప్రాప్య దివ్యవర్షసహస్రకమ్ ।
ఉవాచ శబ్దశాస్త్రం చ తదర్థం చ సురేశ్వరమ్ ॥
అధ్యాపితాశ్చ యే శిష్యా యై రధీతం మునీశ్వరైః ।
తే చ త్వాం పరిసంచిన్త్య ప్రవర్తన్తే సురేశ్వరీమ్ ॥
త్వం సంస్తుతా పూజితా చ మునీన్ద్రై ర్మనుమానవైః ।
దైత్యేన్ద్రైశ్చ సురై శ్చాపి బ్రహ్మవిష్ణుశివాదిభిః ॥
జడీభూతః సహస్రాస్యః పంచవక్త్ర శ్చతుర్ముఖః ।
యాం స్తోతుం కి మహం స్తౌమి తా మేకాస్యేన మానవః॥

ఇత్యుక్త్వా యాజ్ఞవల్క్యశ్చ భక్తినమ్రాత్మకన్ధరః ।
ప్రణనామ నిరాహారో రురోద చ ముహుర్ముహుః ॥
తదా జ్యోతిస్స్వరూపా సా తేన దృష్టా ప్యువాచ తమ్ ।
సుకవీన్ద్రో భవేత్యుక్త్వా వైకుణ్ఠం చ జగామ హ ॥
యాజ్ఞవల్క్యకృతం వాణీస్తోత్ర మేతత్తు యః పఠేత్ ।
స కవీన్ద్రో మహావాగ్మీ బృహస్పతిసమో భవేత్ ॥
మహామూర్ఖశ్చ దుర్మేధా వర్ష మేకం యదా పఠేత్ ।
స పణ్డితశ్చ మేధావీ సుకవిశ్చ భవేద్ ధ్రువమ్ ॥ (6-36)

జగన్మాతా! నాపై నీకృపను ప్రసరింపజేయుము. గురుశాపమువలన స్మరణశక్తిని గోల్పోయి విద్యావిహీనుడనై దుఃఖించుచున్నాను. సకలవిద్యలకు నధిష్ఠాత్రు దేవీ! నీవు నాకు జ్ఞానమును, స్మృతిని, విద్యను, ప్రతిష్ఠను, గవిత్వశక్తిని, శిష్యులను ప్రబోధింపగలశక్తిని ప్రసాదింపుము. దేవీ! నన్ను శిష్యునిగ జేకొని నాకు గ్రంథకర్తృత్వశక్తిని, ప్రతిభను, విబుధసభామధ్యమున నిర్భయముగ నామతమును ప్రకటింపగల యుత్తమక్షమతను నిమ్ము. దేవతలు మట్టియందు లేదా భస్మమందు సమయానుసారముగ బీజము నంకురింప జేయునట్లు దురదృష్టవశమున నేను బోగొట్టుకొన్న సంపూర్ణజ్ఞానమును మరల నవీనరూపమున నాలో ప్రకాశిత మొనర్పుము. బ్రహ్మస్వరూపిణీ! జ్యోతిస్స్వరూపా! సనాతనీ! సకలవిద్యాధిష్ఠాత్రు దేవీ! వాణీ! నీకు ననేకప్రణామములు. ఎవరులేనిదే సర్వజగములు జీవించియున్నను మృతసమానములో, యెవరు జ్ఞానమున కధిష్ఠాత్రీ దేవియో, యాసరస్వతీమాతకు నే ననేకానేక పర్యాయములు నమస్కరించెదను. ఎవరు లేనిదే సర్వజగములు సదా మూకములై యున్మాదాదులను బొందగలవో, యెవరు వాణి కధిష్ఠాత్రీ దేవియో, యావాగ్దేవతకు నేను మరల మరల నమస్కరించెదను. ఎవరి యంగకాంతి హిమచన్దనకున్దచన్ద్రకుముద శ్వేతకమలములవలె నుజ్జ్వలమో, యేదేవి వర్ణములకు (అక్షరములకు) నధిష్ఠాత్రియో, యట్టియక్షరస్వరూపిణి యైనసరస్వతికి నే ననేకానేకపర్యాయములు నమస్కరించెదను. విసర్గ, బిందు, మాత్ర లనెడిమూడింటికి నెవరధిష్ఠానమో, యాదేవివి నీవే యని సాధుపురుషులు సదా నీమహిమలను గాన మొనరించెదరు. దేవీ! నీవే భారతివి, నీకు ననేకానేకనమ

స్కారములు. ఎవరు లేనిదే సుప్రసిద్ధ గణికులైనను, సంఖ్యాపరిగణనములో సాఫల్యము నొందలేరో, యాకాలసంఖ్యాస్వరూపిణి యైనభగవతికి మరల మరల ననేకానేక నమస్కారములు. ఎవరు వ్యాఖ్యాస్వరూపమో, వ్యాఖ్య కధిష్ఠాత్రియో, భ్రమ, సిద్ధాంతము-ఈరెండు నేదేవీస్వరూపములో యావాగ్దేవత కనేకానేక నమస్కారములు. ఏదేవి స్మృతిశక్తియో, జ్ఞానశక్తియో, బుద్ధిశక్తియో, ప్రతిభాశక్తియో, కల్పనాశక్తియో యాభగవతికి మరల మరల ననేకప్రణామముల నర్పించెదను.

ఒకసమయమున సనత్కుమారుడు బ్రహ్మను జ్ఞానవిషయమై ప్రశ్నింపగ నాసమయమున బ్రహ్మ జడునివలె మిన్నకుండెను. అపుడు శ్రీకృష్ణపరమాత్మయే స్వయముగ దయచేసి జ్ఞానార్థమై భగవతిసరస్వతిని స్తుతింపవలసినదిగ బ్రహ్మ నాదేశించెను. దేవీ! పరమప్రభు వైనశ్రీకృష్ణుని యాజ్ఞానుసారము బ్రహ్మ నిన్ను స్తుతించి నీకృపాకటాక్షములవలన నుత్తమసిద్ధాంతజ్ఞానవివేచనాదులందు సఫలీభూతుడై సనత్కుమారునకు జ్ఞానోపదేశ మొనరింపగల్గెను.

మఱియొకసమయమున బృథ్వి యనంతుని జ్ఞానరహస్యముల వివరింపవలసినదిగ ప్రార్థించెను. అపు డాదిశేషుడుకూడ మూగవానివలె మిన్నంకుడి జ్ఞానసిద్ధాంతములను వివరింపలేకపోయెను.

తదనంతర మాదిశేషుడు కశ్యపప్రజాపతి యాదేశానుసారము సరస్వతీదేవిని స్తుతించి తనభ్రమను దూర మొనరించుకొని నిర్మలసిద్ధాంతస్థాపనముల సఫలత్వము నొందెను.

వ్యాసమహర్షి పురాణజ్ఞానవిషయమై ప్రశ్నింపగా వాల్మీకి మౌనము వహించెను. అపుడు వాల్మీకిమహర్షి జగదంబవైన నిన్ను స్తుతింపగా నీవాయన కనేకవరములను బ్రసాదించితివి. ఆవరప్రభావముననే వాల్మీకిమహర్షి సకలసిద్ధాంత ప్రతిపాదన మొనరింపగల్గెను. శ్రీకృష్ణాంశసంభూతు డైనవ్యాసమహర్షి వాల్మీకిమహర్షి ముఖారవిందమునుండి పురాణసూత్రములను శ్రవణ మొనరించి వానియర్థములను గవితారూపమున స్పష్ట మొనరించుట కొఱకు నిన్నే యుపాసించెను. వ్యాసమహర్షి పవిత్రపుష్కరక్షేత్రములో వసించి నూఱుదివ్యవర్షములు నిన్నుపా

సించెను. తల్లీ! ఆయన నీయనన్యానుగ్రహమునకు పాత్రుడై యుత్తమ కవీశ్వరుడై, వేదములను విభజించి పురాణరచన మొనరింపగల్గెను.

దేవరా జైనయింద్రుడు తత్త్వజ్ఞానవిషయమై ప్రశ్నింపగా శంకరుడు సహితము క్షణకాలము మౌనము వహించి నిన్ను ధ్యానించి యింద్రునకు జ్ఞానోపదేశ మొనరించెను. తదనంతరము మహేంద్రుడు బృహస్పతిని శబ్దశాస్త్రవిషయమై ప్రశ్నించెను. జగదంబా! ఆసమయమున బృహస్పతి పుష్కరక్షేత్రమునకు జని సహస్రదివ్యవర్షములు నీధ్యానములో సంలగ్నుడై పిమ్మట నీయనుగ్రహమునకు పాత్రుడై యింద్రునకు శబ్దశాస్త్రములను, శాస్త్రార్థములను వివరింపగల్గెను.

బృహస్పతి యెందఱు శిష్యులకు విద్యాదాన మొనరించెనో, యెందఱు సుప్రసిద్ధమహర్షు లాయన సన్నిధి నధ్యయన మొనరించిరో, వా రందఱు సురేశ్వరి వైన నిన్ను మనసార చింతించి విద్యాసిద్ధిలో సఫలులైరి. మాతా! వారి ననుగ్రహించిన దేవివి నీవే. మునీశ్వరులు, మనువులు, దేవతలు, మానవులు మొదలగు వా రందఱు విద్యాజ్ఞానార్థమై నిన్నే పూజించి, స్తుతింతురు. బ్రహ్మ, విష్ణు, శివాది దేవతలు, దానవేశ్వర ప్రభృతు లందఱు నిన్నుపాసింతురు. సహస్రముఖములు కల్గిన యాదిశేషుడు, పంచముఖములు కల్గిన శంకరుడు, చతుర్ముఖములు కల్గిన బ్రహ్మ నీయశము లను వర్ణించుటలో నసమర్థులే. అట్టిచో నొకముఖము కల్గిన మానవుడనైన నేను నిన్నేమని స్తుతింపగలను?

నారదా! ఇట్లు సరస్వతీదేవిని యాజ్ఞవల్క్యమహర్షి భక్తినమ్రాత్మకంధరుడై యనేకవిధముల స్తుతించుచు, నిరాహారుడై బహుకాలము తప మొనరించెను. అపు డఖండజ్యోతిస్స్వరూపిణి యైనసరస్వతీదేవి యాజ్ఞవల్క్య మహర్షికి దివ్యదర్శన మొసంగి "మునీశ్వరా! నీవు విఖ్యాతకవీశ్వరుడ వయ్యెదవు గాక! నీకు సమస్తవిద్యలు, జ్ఞానము సిద్ధించుగాక" యని యనుగ్రహించి వైకుంఠపరంధామము జేరెను.

యాజ్ఞవల్క్యకృత మగునీవాగ్దేవీస్తోత్రమును నిత్యము పఠించునాతడు నిశ్చయముగ సుకవీంద్రుడు మధురసంభాషణములం బృహస్పతిసముడు కాగలడు. ఒకసంవత్సర మీస్తోత్రమును పఠించిన మానవుడు మహా

మూర్ఖుడైనను, విద్యావిహీనుడైనను, దుర్బుద్ధియైనను నిశ్చయముగ మహా పండితుడు, పరమబుద్ధిమంతుడు, సుకవీశ్వరుడు కాగలడు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణ
సంవాదమున యాజ్ఞవల్క్యకృత
సరస్వతీస్తుతి యను
నైదవ అధ్యాయము
సమాప్తము.

—♦—

## ఆఅవ అధ్యాయము

## విష్ణుపత్నులగు లక్ష్మి గంగా సరస్వతుల కలహము, పరస్పర శాపము.

**శ్రీనారాయణఋషి పలికెను:**

నారదమునీంద్రా! సరస్వతీదేవి స్వయముగ వైకుంఠములో విరాజిల్లుచు శ్రీహరిసేవలందు సంలగ్నురాలై యుండును. ఒకానొక సమయములో బరస్పరకలహకారణముగ గంగాభవాని సరస్వతీదేవిని శపింపగా నామె పవిత్రభారతవర్షములో దనకళాంశముచే నదీమతల్లియై ప్రవహించెను. దేవర్షీ! పవిత్రసరస్వతీనది యఖండపుణ్యతీర్థస్వరూపిణి, పాపుల పాపములను భస్మమొనరింపగల ప్రజ్వలితాగ్నిస్వరూపిణి. సరస్వతీ తీర్థము తాపసులకు దపోరూపము, తపఃఫలము, జీవు లొనరించిన పాపము లనెడునింధనములను భస్మమొనరించు ప్రజ్వలితాగ్నిస్వరూపిణి. భూమండలములో నేమానవుడైన నీదేవి మహిమల నెఱింగి యీపవిత్రనదీతటమందు దేహము త్యజించునో యతడు నిశ్చయముగ వైకుంఠపరంధామము నొందగలడు.

**నారదుడు పలికెను :**

మహాభాగా! పరమసత్త్వస్వరూపిణి యైనగంగాభవాని సర్వపూజ్య యైనసరస్వతీదేవి నేల శపించెను ? ఈయిద్దరు దేవాంగనల వివాదకారణ మును సవిస్తరముగ వర్ణింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! ఈప్రాచీనేతిహాసమును వర్ణించెద శ్రవణ మొనరింపుము. లక్ష్మి, సరస్వతి, గంగ యీ ముగ్గురు శ్రీహరి సహధర్మచారిణులు. ఒకా నొకసమయమున సరస్వతికి దన కంటె గంగనే శ్రీహరి యధికముగ ప్రేమించు చున్నాడేమో యని సందేహము కల్గెను. అపు డామె యీర్ష్యకు వశురాలై శ్రీహరినిగూడ నిష్ఠురవచనము లాడి యీర్ష్యతో గంగపై సైతము క్రోధము వహింపనారంభించెను. శాంతస్వరూపిణి యైనలక్ష్మి సరస్వతీదేవిని వారింప బోగా లక్ష్మి గంగయెడ బక్షపాతము కల్గి యున్నదని యారో పించి యామె నవనిపై వృక్షముగా జన్మింపుమని శపించెను. సరస్వతీదేవి శపించినను శాంతస్వరూపిణి యైనలక్ష్మి యాగ్రహింపక మిన్నకుండెను. అది విని గంగాభవాని కోపించి నీవు నదివై భూమిపై ప్రవహించి పాపులపాపము లను భరింపుమని సరస్వతిని శపించెను. తదనంతరము సరస్వతిదేవికూడ గంగను వసుంధరపై నదిగ నవతరింపుమని ప్రతిశాప మొసంగెను. ఆసమయ మున పార్షద పరివేష్టితుడై శ్రీమన్నారాయణుడు సాక్షాత్కరించి కరుణాభరిత వీక్షణములతో లక్ష్మీగంగాసరస్వతులను గాంచి సర్వమును గ్రహించి వారి వారి శాపవిమోచనముల నిట్లనుగ్రహించెను.

**శ్రీహరి పలికెను :**

శుభాంగీ! లక్ష్మీ! నీవు నీయంశముతో ధర్మధ్వజరాజ గృహమున నయోనిజవై యావిర్భవింపుము. శంఖచూడు డనుదైత్యేంద్రుడు మదంశ ముచే నవనిపై జన్మింపగలడు. నీ వాతని పత్నివై తదనంతరము నాయను గ్రహమునకు పాత్రురాలవై మరల వైకుంఠపరంధామము జేరగలవు. దేవీ! నీవు భూమండలముపై వృక్షస్వరూపమున నావిర్భవించి సకలజీవులను దరింప జేయగలవు. పవిత్రభారతవర్షములో త్రిలోకపావని యైనతులసి యను నీవృక్షస్వరూపమున ప్రసిద్ధిగాంచగలవు భారతీదేవి శాపవశమున

భారతవర్షములో నీయంశము పద్మావతి యనుపవిత్రనదీరూపమున ప్రవహించుగాక?

గంగా! సరస్వతీశాపవశమున నీవు నీయంశముతో మానవుల సకల పాపములను భస్మమొనరింపగల విశ్వపావనీ నదీమతల్లివై ప్రవహించెదవుగాక. భగీరథుని యఖండ తపఃప్రభావమున నీవు దివినుండి భువికి దయచేయగలవు. ఆకారణముననే ని న్నందఱు భాగీరథి యను నామమున గీర్తింతురు. సాగరుడు మదంశసంభూతుడు గావున నీ వాయనకు సహధర్మచారిణివి కాగలవు.

భారతీ! నీవు గంగాదేవి శాపానుసారముగ స్వాంశముతో భారతవర్ష మందు బవిత్రనదివై ప్రవహింపుము. నీవు నీపూర్ణాంశముతో బ్రహ్మలోకము నకు జని బ్రహ్మదేవునకు బత్నివి కమ్ము. గంగ తనపూర్ణాంశముతో శివ లోకము జేరి పరమశివునకు సహధర్మచారిణి కాగలదు. పరమశాంతస్వరూపిణి, యత్యంతశుద్ధురాలు, నాయం దనన్యభక్తియుక్తయు, నఖండసౌభాగ్యవతియు మహాసాధ్వియు, నగుశ్రీమహాలక్ష్మి తనపూర్ణాంశముతో వైకుంఠమందు మత్సహధర్మచారిణియై విరాజిల్లగలదు.

ఇట్లు శ్రీహరి గంగాలక్ష్మీసరస్వతులకు శాపవిమోచనముల ననుగ్ర హించి వారితో మరల నిట్లు పల్కెను. "ఆహా! విభిన్నస్వభావములు గల ముప్వురుస్త్రీలు, ముప్వురు సేవకులు, ముప్వురు బంధువులు కలిసియుండుట వేదా నుమతికి విరుద్ధము. ఇట్టివారు ముప్వురు నొకేప్రదేశమున నివసించిన గళ్యాణ ప్రదులు కాలేరు. ఏగృహములో స్త్రీపురుషులు సమానముగ వ్యవహారముల నాచరించెదరో, పురుషుడు స్త్రీ కధీనుడై చరించునో వారి జీవనములు నిష్ఫ లములని గ్రహింపవలెను. అట్టివారి కడుగడుగున నశుభములు సంభ వించును. ఎవనిపత్ని ముఖదుష్టయై, యోనిదుష్టయై, కలహప్రియయై చరిం చునో వానికి ఘోరారణ్యవాసమే గృహవాసముకన్న మిన్నయై సుఖప్రదము కాగలదు. ప్రజ్వలితాగ్ని సమీపముననో, భయంకరవన్యమృగములచెంతనో, నివసించిన సుఖము లభింపగలదు, కాని దుష్టురాలైన స్త్రీతో నివసించు పురుషు డవశ్యముగ మహాక్లేశముల ననుభవింపగలడు. పురుషులు వ్యాధులను లేదా విషజ్వాలలను భరింపవచ్చును గాని దుష్టురాం డ్రైనస్త్రీల నోట బయ

ల్వేడలు కఠినవచనాగ్నిజ్వాలలను సహింపజాలరు. అవి మృత్యువుకంటె నధికకష్టప్రదములు కాగలవు. స్త్రీకి నధీనుడై జీవించు పురుషుడు మరణించిన పిదపనే పవిత్రుడు కాగలడు. అతడు దినమంతేదేయే శుభకర్మల నాచరించునో యాయాకర్మలఫలముల బొందలేడు. ఇహ పరలోకములం దట్టి పురుషుడు కీర్తిహీనుడై మృతతుల్యుడు కాగలడు. ఒకభార్య కల్గినవానికే సుఖములేదన్న, నిక బహుభార్యాయుతు డైనవాడు సుఖములను గురించి స్వప్నమునందై నను జింతింపలేడు. కావున గంగా భవానీ! నీవు శివు నాశ్రయింపుము. సరస్వతీ! నీవు బ్రహ్మకు సహధర్మ చారిణివి కమ్ము. నాపరంధామములో సుశీలవతి యైనశ్రీమహాలక్ష్మియే నివ సింపగలదు.

సుసాధ్వీ యస్య పత్నీ చ సుశీలా చ పతివ్రతా ।
ఇహ స్వర్గసుఖం తస్య ధర్మమోక్షౌ పరత్ర చ ॥
పతివ్రతా యస్య పత్నీ స చ ముక్తః శుచిః సుఖీ ।
జీవన్మృతోఽశుచి ర్దుఃఖీ దుశ్శీలాపతిరేవ యః ॥

"ఎవనిపత్ని పరమసాధ్వియై, సుశీలయై, ఉత్తమాచరణముల నొనరించు పతివ్రతయై మెలంగునో యత డిహలోకమందే స్వర్గసుఖముల ననుభవించి పరలోకములో ధర్మమును, కైవల్యపదమును సురక్షితముగ నొందగలడు. ఎవని సహధర్మచారిణి సాధ్వియో యతడు పరమపవిత్రుడై సుఖముల ననుభ వించి యంత్యకాలమందు ముక్తినొందగలడు. దుశ్శీలయైనభార్య కలిగిన పురుషుడు జీవించియున్నను మృతతుల్యుడు, యశుచియునై నిరంతరము దుఃఖ ముల ననుభవింపగలడు."

**శ్రీనారాయణఋషి పలికెను:**

నారదా! శ్రీమన్నారాయణుని హితోపదేశముల నాలకించి గంగా సరస్వతులు తమ తప్పిదములను గ్రహించి పశ్చాత్తప్తహృదయలై యొకరి నొక రాలింగన మొనరించుకొని తమకు శ్రీమన్నారాయణుడే యేకైక శరణ్యుడని గ్రహించి యా పరమాత్మ నీవిధముగ బ్రార్థించిరి.

**సరస్వతీదేవి పలికెను :**

నాథా! నేను బరమదుష్టస్వభావమునకు లోనై మిమ్ములను నొప్పించి

తిని. నాపాపము, తాపము, శాపము నశించుటకు ప్రాయశ్చిత్తము నుపదేశింప వలసినదిగ ప్రార్థించుచున్నాను.

సత్స్వామినా పరిత్యక్తాః కుత్ర జీవన్తి కాః స్త్రియః ॥ (72)

మహాత్ముడు, సచ్చరిత్రుడు నైనస్వామి పరిత్యాగమొనరించిన నెట్టిస్త్రీ యైన, నెక్కడైనను జీవింపగలదా ?

**గంగాదేవి పలికెను :**

నాథా! జగత్ప్రభూ! ఏమి పాప మొనరించితినని మీరు నన్ను విస్మరించుచున్నారు ? మీరు లేనిదే నేను జీవింపలేను.

నిర్దోషకామినీత్యాగం కురుతే యో జనో భవే।
స యాతి నరకం కల్పం కి తే సర్వేశ్వరస్య వా ॥ (73)

నిర్దోషురాలైనసహధర్మచారిణిని త్యజించువారు సర్వేశ్వరులైనను గల్పపర్యంతము నరక మనుభవింపక తప్పదు.

**శ్రీలక్ష్మీదేవి పలికెను :**

నాథా! మీరు పరమసత్త్వస్వరూపులు, మఱి మీ రెందులకు గినుక వహించి మమ్ములను దూరమొనరించుచున్నారో, నాకవగతము కాకున్నది. దేవా! అజ్ఞానుల మైనమమ్ము క్షమించి యనుగ్రహింపుము. ఎందుచేననగ శ్రేష్ఠు డైనస్వామికి క్షమాగుణమే ప్రధానలక్షణము. మీయాజ్ఞానుసార ముగ నేను సరస్వతీదేవి శాపమును గ్రహించి నాకళతో భారతవర్షమం దుద్భ వించెదను. కాని ప్రభూ! నే నెంతకాలము మీదివ్యచరణారవిందములను వీడి భూమిపై నుండగలను ? మరల నెంతకాలమునకు నాకు మీదివ్యసేవా సౌభాగ్యము ప్రాప్తింపగలదు. పాపాత్ము లైనజనులు నదీస్వరూపిణి నైన నాలో స్నానముచేసి వారిపాపములను నా కొసంగగలరు. ఆపాపములనుండి విముక్తనై మరల మిమ్ములను బొందుసౌభాగ్యము నా కెట్లు లభింపగలదు? అచ్యుతా! నేను నాయంశముతో ధర్మధ్వజుని కొమార్తెనై యవతరింప గలను. నాథా! తదనంతరము మరల నీపరంధామము నా కెప్పుడు లభించును? కృపానిధీ! వృక్షస్వరూపిణినై యవతరించిన నన్ను మరల మీ రెప్పు డుద్ధ రించెదరు? ఈగంగాసరస్వతు లెట్లు శాపవిముక్త లై మిమ్ముల జేరగలరు? మీరు కినుక వహింపక గంగాసరస్వతులను మరల స్వీకరింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను:**

నారదా! ఈప్రకారముగ లక్ష్మీదేవి శ్రీహరిని యనేకవిధముల ప్రార్థించి ఆయన పాదములపై బడి ప్రణామము లర్పించెను. భక్తానుగ్రహావిగ్రహు డైనశ్రీహరి శ్రీమహాలక్ష్మిని లేవనెత్తి అనన్యప్రేమతో ఆలింగన మొన రించుకొని ప్రసన్నుడై చిరునవ్వులు విరాజిల్లు నగుమోముతో గంగాలక్ష్మి సరస్వతుల నిట్లు అనుగ్రహించెను.

**శ్రీహరి పలికెను :**

సురేశ్వరీ! కమలేక్షణా! నేను నీప్రార్థనల నవశ్యముగ మన్నించెదను. సరస్వతి తనయేకాంశముచే భారతవర్షములో బవిత్రనదియై ప్రవహింపగలదు. తన యర్ధాంశమున నామె బ్రహ్మలోకములో నివసింపగలదు. తన పూర్ణాంశ ముతో స్వయముగ సరస్వతి నాప్రేమపాత్రురాలై సదా వైకుంఠమందే విరా జిల్లగలదు. అట్లే గంగ భగీరథుని యఖండతపమునకు బ్రసన్నురాలై తన యంశముతో త్రిలోకములను బవిత్ర మొనరింపగల నదియై భారతవర్షమున బ్రవహింపగలదు. గంగాభవానికి శంకరుని జటాజూటమందు నివసించుసౌభా గ్యము కల్గును. తన పూర్ణాంశముతో గంగ నాప్రేమకు బాత్రురాలై నా వద్దనే విరాజిల్లగలదు. పద్మలోచనా! లక్ష్మీ! నీవు నీయంశముతో భారత వర్షమున దులసి యనుదివ్యవృక్షమవై యావిర్భవించెదవుగాక. నీ వేకాంశ ముతో బద్మావతి యనుపవిత్రనదివై యవనిని బవిత్రమొనరించెదవు గాక. కలియుగాంతమున నదీస్వరూపిణు లైనమీరు ముగ్గురు నుద్ధరింపబడి మద్ధామ మును జేరగలరు.

సమ్పదాం హేతుభూతా చ విపత్తిః సర్వదేహినామ్ ।
వినా విపత్తే ర్మహిమా కేషాం పద్మే భవే ద్భువే ॥ (90)

పద్మభవా! సమస్త దేహధారులకు సంపత్తులు విపత్తులు సంభవించుట కేదోయొక హేతు వంతర్గతముగ నుండును. విపత్తుల ననుభవింపక యెవ్వ రును మహిమలతో బ్రకాశింపలేరు.

పాపాత్ముల స్పర్శచే సంక్రమించిన మహాపాపపుంజములనుండి మీ నదీస్వరూపములు విముక్తము లగుటకొఱకు నుపాయము నుపదేశించెద నవధ రింపుడు.

మన్మన్త్రోపాసకానాం చ సతాం స్నానావగాహనాత్ ।
యుష్మాకం మోక్షణం పాపాత్పాపిస్పర్శనహేతుకాత్ ॥
పృథివ్యాం యాని తీర్థాని సన్త్యసంఖ్యాని సున్దరి ।
భవిష్యన్తి చ పూతాని మద్భక్తస్పర్శదర్శనాత్ ॥
మన్మన్త్రోపాసకా భక్తా భ్రమన్తే భారతే సతి ।
పూతం కర్తుం భారతం చ సుపవిత్రాం వసున్ధరామ్ ॥ (91-93)

నామన్త్రోపాసకులైన యనన్యభక్తులు మీయందు స్నానమాడిన, మిమ్ములను స్పృశించిన, పాపాత్ముల స్పర్శమువలన సంభవించిన పాపముల నుండి మీకు ముక్తి లభింపగలదు. సుందరీమణులారా! మీరే కాదు పృథివి యందు గల యనేకానేక తీర్థములుకూడ నాయనన్యభక్తుల దర్శనస్పర్శ నాదులచే బవిత్రములు కాగలవు. సతీ! నామంత్రోపాసకులు భారత వర్షములో సంచరించి దానితోపాటు సకల వసుంధరాతలమును బవిత్ర మొనరింపగలరు.

మద్భక్తా యత్ర తిష్ఠన్తి పాదం ప్రక్షాలయన్తి చ ।
తత్స్థానం చ మహాతీర్థం సుపవిత్రం భవేద్ ధ్రువమ్ ॥ 94

నాయనన్యభక్తు లేప్రదేశమున నివసించెదరో, యేప్రదేశమున దమ చరణములను బ్రక్షాళన మొనరింతురో, యాప్రదేశమే మహాతీర్థమై, పవిత్రమై నిశ్చయముగ విరాజిల్లగలదు.

స్త్రీఘ్నో గోఘ్నః కృతఘ్నశ్చ బ్రహ్మఘ్నో గురుతల్పగః ।
జీవన్ముక్తో భవేత్పూతో మద్భక్తస్పర్శదర్శనాత్ ॥ 95
ఏకాదశీవిహీనశ్చ సన్ధ్యాహీనోఽపి నాస్తికః ।
నరఘాతీ భవేత్పూతో మద్భక్తస్పర్శదర్శనాత్ ॥
అసిజీవీ మషీజీవీ ధావకః శూద్రయాజకః ।
వృషవాహో భవేత్పూతో మద్భక్తస్పర్శదర్శనాత్ ॥
విశ్వఘాతీ సుమిత్రఘ్నో మిథ్యాసాక్ష్యప్రదాయకః ।
న్యాసహారీ భవేత్పూతో మద్భక్తస్పర్శదర్శనాత్ ॥
ఋణగ్రస్తో వార్ధుషికో జారజః పుంశ్చలీపతిః ।
పూతస్స్యాత్పుంశ్చలీపుత్రో మద్భక్తస్పర్శదర్శనాత్ ॥
శూద్రాణాం సూపకారశ్చ దేవలో గ్రామయాజకః ।
అదీక్షితో భవేత్పూతో మద్భక్తస్పర్శదర్శనాత్ ॥

అశ్వత్థఘాతకశ్చైవ మద్భక్తానాం చ నిన్దకః ।
అనివేదితభోజీ చ పూతో మద్భక్తదర్శనాత్ ॥

మాతరం పితరం భార్యాం భ్రాతరం తనయం సుతామ్ ।
గురోః కులం చ భగినీం వంశహీనం చ బాన్ధవమ్ ॥

శ్వశ్రూం చ శ్వశురం చైవ యో న పుష్ణాతి నారద ।
స మహాపాతకీ పూతో మద్భక్తస్పర్శదర్శనాత్ ॥

దేవద్రవ్యాపహారీ చ విప్రద్రవ్యాపహారకః ।
లాక్షాలోహరసానాం చ విక్రేతా దుహితుస్తథా ॥

మహాపాతకినశ్చైతే శూద్రాణాం శవదాహకాః ।
భవేయు రేతే పూతాశ్చ మద్భక్తస్పర్శదర్శనాత్ ॥ (95-105)

స్త్రీఘాతి, గోఘాతి, కృతఘ్నుడు, బ్రాహ్మణఘాతి, గురుద్రోహియైనను మానవుడు నాయనన్యభక్తులను దర్శించి స్పృశించిన బవిత్రుడై జీవన్ముక్తుడు కాగలడు.

ఏకాదశీవ్రతమును బాలింపనివాడైనను, సంధ్యావందన మాచరింపనివాడైనను, నాస్తికుడైనను, నరహంతకుడైనను మానవుడు నాయనన్యభక్తులను దర్శించి స్పృశించిన బాపవిముక్తుడు పవిత్రుడు కాగలడు.

ఖడ్గముపై నాధారపడి జీవించువాడు, లేకరియై జీవించువాడు, శూద్ర పురోహితుడై జీవించువాడు, సందేశముల జేర్చుకర్మల నాచరించువాడు, వృషభములను బూన్చి బాధించువాడు, నా యనన్యభక్తుని దర్శనస్పర్శాదులచే బరమపవిత్రుడు కాగలడు.

లోకకంటకుడైనను, మిత్రద్రోహియైనను, కూటసాక్ష్యమునిచ్చువాడైనను, బరులజీవిక నపహరించువాడైనను నాయనన్యభక్తులను దర్శించి స్పృశించిన బునీతుడు కాగలడు.

ఋణగ్రస్తుడైనను, వడ్డీలుగొని జీవించువాడైనను, బరులు తమకడ దాచినసొమ్మును హరించువాడైనను, జారజుడైనను, గులటాపతియైనను, గులటాపుత్రుడైనను నాయనన్యభక్తులను దర్శించి స్పృశించిన బునీతుడు కాగలడు.

శూద్రులకు వంటచేయుచు జీవించువాడు, గ్రామయాజకుడు, దీక్షలేనివాడు, నాయనన్యభక్తులను దర్శించి స్పృశించిన బవిత్రుడు కాగలడు.

అశ్వత్థవృక్షమును ఖండించువాడు, నాభక్తులను నిందించువాడు, నా కర్పింపక భుజించువాడు నాయనన్యభక్తుల దర్శనమాత్రముననే పవిత్రుడు కాగలడు.

తండ్రిని, దల్లిని, భార్యను, సోదరీసోదరులను, బుత్రులను, బుత్రికలను, గురువును, నేత్రహీను దైనబంధువును, మామను, అత్తను, బోషించుట కే పురుషుడు వ్యవస్థీకరింపడో, యాతడే మహాపాతకి. అట్టిమహాపాతకియైనను నాయనన్యభక్తుల దర్శనస్పర్శనాదులచే బవిత్రుడు కాగలడు.

దేవద్రవ్యముల నపహరించువాడు, విప్రద్రవ్యాపహారియు, లాక్షా లోహరసాదుల విక్రయించువాడు, గుమార్తెలనమ్ముకొనువాడు, మహా పాతకులందఱు, శూద్రశవదాహకులు నాయనన్యభక్తులను దర్శించి స్పృశించిన బునీతులు కాగలరు.

## మహాలక్ష్మి పలికెను :

భక్తుల ననుగ్రహించుటకొఱకు సదాయాతురతతో నుండు ప్రభూ! హరిభక్తివిహీనులైనను, నహంకారులైనను, దమనుదాము ప్రశంసించుకొను వారైనను, ధూర్తులైనను, శఠులైనను, సాధునిందకులైనను, నత్యంతపాపాత్ము లైనను, నధమాధమ మానవులైనను నీభక్తుల స్పర్శదర్శనాదులచే దత్క్షణమే పాపవిముక్తులు పునీతులు కాగలరు. అట్టినీ యనన్యభక్తుల లక్షణములను వివరముగ వర్ణింపవలసినదిగ బ్రార్థించుచున్నాను.

పునన్తి సర్వతీర్థాని యేషాం స్నానావగాహనాత్ ।
యేషాం చ పాదరజసా పూతా పాదోదకా న్మహీ ॥
యేషాం సన్దర్శనం స్పర్శం దేవా వాంఛన్తి భారతే ।
సర్వేషాం పరమో లాభో వైష్ణవానాం సమాగమః ॥ (108, 109)

ఎవరు స్నాన మొనరించిన సకలతీర్థములు పవిత్రములు కాగలవో, యెవరిచరణధూళి స్పర్శమువలన జరణోదక స్పర్శమువలన, వసుంధరసహితము పవిత్రము కాగ:దో, యెవరిని దర్శించుటకు, స్పృశించుటకు బవిత్రభారత వర్షములో దేవతలైన నాకాంక్షింతురో, యట్టి శ్రీహరిభక్తుల సమాగమము సంపూర్ణ దేహధారులకు బరమలాభదాయకము.

న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః ।
తే పునన్త్యురుకాలేన విష్ణుభక్తాః క్షణాదహో ॥ (110)

జలమయములైన తీర్థములను, మృత్పాషాణ విగ్రహరూపులైన దేవతలను దీర్ఘకాలమువఱకు నారాధించిననేగాని వారు జీవులను బవిత్రమొనరింపరు. కాని విష్ణుభక్తులో క్షణమాత్రములోనే పాపులను బవిత్రులుగ నొనర్పగలరు. ఆ విష్ణుభక్తులనే సాక్షాద్దేవతలుగ, బుణ్యతీర్థములుగ భావింపవలెను.

**సూతుడు పలికెను :**

శౌనకాదిమహర్షులారా! మహాలక్ష్మి ప్రార్థనల నాలకించి తదారాధ్యుడైన శ్రీహరి మందస్మిత ముఖారవిందుడై యత్యంత నిగూఢములు శ్రేష్ఠములు, శ్రుతిపురాణప్రోక్తములు నగుయనన్యభక్తుల లక్షణముల నిట్లుపదేశింపనారంభించెను.

**శ్రీహరి పలికెను :**

లక్ష్మి ! నాయనన్యభక్తుల లక్షణములు, శ్రుతులయందు, పురాణములందు గూఢముగ నిహితములై యున్నవి. ఈ భక్తుల లక్షణములు సాక్షాత్పుణ్యస్వరూపములు, పాపములను నశింపజేసి, సుఖములను, భక్తిని, ముక్తిని, బ్రసాదింపగల యనన్యశక్తి సమన్వితములు. మద్భక్తుల లక్షణము లత్యంత గోపనీయములు, సకలసారభూతములు; ఖలులకు వీని నుపదేశింపరాదు. దేవీ! నీవు పరమపవిత్రురాలవు, నాప్రాణతుల్యవు, కావున నాయనన్యభక్తుల దివ్య లక్షణములను వర్ణించెద బ్రపత్తితో నవధరింపుము.

గురువక్త్రాద్విష్ణుమన్త్రో యస్య కర్ణే విశేద్వరః ।
వదన్తి వేదవేదాఙ్గాస్తం పవిత్రం నరోత్తమమ్ ॥
మద్భక్తియుక్తో మత్పూజానియుక్తో మద్గుణాన్వితః ।
మద్గుణశ్లాఘనీయశ్చ మన్నివిష్టశ్చ సంతతమ్ ॥
మద్గుణశ్రుతిమాత్రేణ సానన్దః పులకాన్వితః ।
సగద్గదః సాశ్రునేత్రః స్వాత్మవిస్మృతిరేవ చ ।
పురుషాణాం శతం పూర్వం పూతం తజ్జన్మమాత్రతః ।
స్వర్గస్థం నరకస్థం వా ముక్తిం ప్రాప్నోతి తత్క్షణాత్ ॥
యైః కైశ్చిద్యత్ర వా జన్మలబ్ధం యేషు చ జన్తుషు ।
జీవన్ముక్తాస్తే చ పూతా యాన్తి కాలే హరేః పదమ్ ॥

సద్గురువునుండి శ్రీమహావిష్ణుదివ్యమంత్రోపదేశము నొంది సర్వధర్మములను ద్యజించి, నన్నే శరణువేడి నన్ను సర్వాత్మునిగ భావించి నిష్కా-

ములై, యనన్యభక్తిసమన్వితలై సదా నన్నారాధించి, నా దివ్యగుణనామ సంకీర్తన మొనరించువారే పరమపుణ్యాత్ములని, పరమపవిత్రులని, యత్యంత శ్రేష్ఠులని వేదవేదాంగములు నొక్కి వక్కాణించుచున్నవి. దేవీ! నా యనన్యభక్తులు సదా మద్భక్తియుక్తులై, నాపూజలయందే తత్పరులై నా దివ్యగుణనామములనే సంకీర్తన మొనరించుచుందురు. వారు సదా నాయందే మనమును నిశ్చలమొనర్చి, నాదివ్యగుణకీర్తనలందే సంలగ్నులై యుందురు. నా యనన్యభక్తశిఖామణులు నాదివ్యగుణనామ సంకీర్తనాదుల శ్రవణమాత్రముననే యఖండానంద పరవశులై పులకితగాత్రులు కాగలరు. నాదివ్యనామ సంకీర్తన సమయములో వారికంఠము గద్గదము, వారినేత్రకమలము లానందాశ్రుపూర్ణములు కాగలవు. వారు విస్మృతాత్ములై సదా పరమాత్మనైన నాయందే సంలగ్నులు కాగలరు. దేవీ! అట్టి భక్తులు జన్మించిన మాత్రముననే యావంశములోని నూఱుతరముల వారు స్వర్గమునం దున్నను, నరకమునం దున్నను దక్షణమే ముక్తినొందగలరు. అట్టి మహాపురుషు డెట్టి ప్రదేశమున నెట్టియోనియందు జన్మించినను బరమపవిత్రుడు, జీవన్ముక్తుడునై యంత్యకాలమున శ్రీహరిపరంధామము జేరగలడు.

న వాంఛతి సుఖం ముక్తిం సాలోక్యాది చతుష్టయమ్ ।
బ్రహ్మత్వ మమరత్వం వా తద్వాంఛా మమ సేవనే ॥
ఇన్ద్రత్వం చ మనుత్వం చ దేవత్వం చ సుదుర్లభమ్।
స్వర్గరాజ్యాదిభోగం చ స్వప్నేఽపి నహి వాంఛతి ॥
బ్రహ్మాణ్డాని వినశ్యన్తి దేవా బ్రహ్మాదయ స్తథా ।
కల్యాణభక్తియుక్తశ్చ మద్భక్తో న ప్రణశ్యతి ॥
భ్రమన్తి భారతే భక్తా లబ్ధ్వా జన్మ సుదుర్లభమ్ ।
తేఽపి యాన్తి మహీం పూతాం కృత్వా తీర్థం మమాఽఽలయమ్ ॥

(119-122)

నా యనన్యభక్తులు నాసేవాసౌభాగ్యము దక్క సుఖములనుగాని, సాలోక్యాది ముక్తులనుగాని, బ్రహ్మత్వమునుగాని, యమరత్వమునుగాని, ఇంద్రత్వమునుగాని, మనుత్వమునుగాని, సుదుర్లభమైన దైవత్వమును గాని, స్వర్గరాజ్యాది భోగములనుగాని, స్వప్నమ్మునందైనను వాంఛింపరు. లక్ష్మీ! బ్రహ్మాండములు, దేవతలు, బ్రహ్మాదులు నశింపగలరు.

కాని కళ్యాణభక్తియుక్తు డైననా యనన్యభక్తుడు నిత్యుడై, యక్షరుడై వర్ధిల్ల గలడు. నా యనన్యభక్తుడై జన్మించు సౌభాగ్య మందఱకు సులభము కాదు. పరమభాగ్యసంపన్ను లైన నాభక్తు లన్యమానవులను, సకలతీర్థము లను, బృథ్విని బవిత్రమొనరించుటకొఱకే భారతవర్షములో నవతరించి చరింప గలరు.

ఇట్లు శ్రీహరి పరమభక్తుల లక్షణములను లక్ష్మీగంగాసరస్వతులకు వర్ణించెను. తదనంతర మా దివ్యకాంతలు భగవంతుని యాజ్ఞానుసారముగ దమతమ విధులందు సంలగ్నులైరి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణసంవాదమున
సరస్వత్యుపాఖ్యాన మను
నాఱవ అధ్యాయము
సంపూర్ణము.

—♦—

# యేడవ అధ్యాయము

## కలియుగభవిష్యచ్చరిత్ర; కాలమాన గోలోక శ్రీకృష్ణలీలల వర్ణనము.

**శ్రీనారాయణఋషి పలికెను :**

దేవర్షీ ! తదనంతరము సరస్వతీదేవి గంగాశాపవశమున దనయేకాంశ ముతో బవిత్రభారతవర్షముపై బుణ్యనదీమతల్లియై ప్రవహించెను. తనయర్ధాంశ ముతో బ్రహ్మకు సహధర్మచారిణియై బ్రహ్మలోకమున విరాజిల్లెను. తన పూర్ణాంశముతో శ్రీహరి సామీప్యమున నివసించు సౌభాగ్య మామెకు హరి కరుణవలన బ్రాప్తించెను.

భారతీ భారతం గత్వా బ్రాహ్మీ చ బ్రహ్మణః ప్రియా ।
వాగాధిష్ఠాతృదేవీ సా తేన వాణీ చ కీర్తితా ॥
సర్వం విశ్వం పరివ్యాప్య స్రోతస్యేవ హి దృశ్యతే ।
హరిః సరస్సు తస్యేయం తేన నామ్నా సరస్వతీ ॥
సరస్వతీ నదీ సా చ తీర్థరూపాఽతిపావనీ ।
పాపిపాపేధ్మదాహాయ జ్వలదగ్నిస్వరూపిణీ ॥

భారతవర్షమందు ప్రవహించినది గావున భారతి యని, బ్రహ్మకు ప్రీతి పాత్రురాలై నది కావున బ్రాహ్మియని, వాక్కునకధిష్ఠాత్రీదేవియైనది కాన వాణి యని సరస్వతీదేవి విఖ్యాతిగాంచెను. శ్రీహరి సమస్తవిశ్వమందు వ్యాపించియున్నను సాగరుని జలస్రోతమునందు శయనించియుండును. సరస్సు (నీరు) నందు శయనించియున్న కారణమున నాయనను 'సరస్వా' నందురు. ఆ దేవాదిదేవునకు ప్రీతిపాత్రురాలు కావున నీమె నామధేయము సరస్వతియని గణుతికెక్కెను. నదీరూపమున ప్రవహించిన సరస్వతి పరమ పావని, పుణ్యతీర్థస్వరూపిణి, పాపుల పాపము లనెడి సమిధలను గాల్చివేయు ప్రజ్జ్వలదగ్నిస్వరూపిణి.

నారదా! వాణిశాపానుసారముగ గంగాదేవి భగీరథుని యఖండ తపమునకు బ్రసన్నురాలై సరిద్రూపమున భారతవర్షమునకు బయలుదేరెను. గంగాదేవి యూర్ధ్వలోకమునుండి ప్రచండవేగముతో ధరాతలముపై బ్రవ హింపబోగా నామెధాటికి నిలువజాలనని భూమి గ్రహించి మహాదేవుని బ్రార్థిం పగా నాకరుణామయుడు గంగను దనజటాజూటమందు ధరించి యామెప్రచండ వేగమును నిలువరించెను. తదనంతరము లక్ష్మి తనకళాంశమున నవనిపై బద్మావతియను దివ్యనదీరూపమున బ్రవహించెను. శ్రీమహాలక్ష్మి తన పూర్ణాంశముతో శ్రీహరిదివ్యధామమందే విరాజిల్లి తత్సేవలందు నిమగ్న రాలయ్యెను. ఆమె తన మఱియొక యంశముతో భారతవర్షములో ధర్మధ్వజ రాజున కయోనిజ యగుకొమార్తెగ నావిర్భవించి తులసి యనుదివ్యనామమున బ్రసిద్ధిగాంచెను. సరస్వతీ శాపమువలన శ్రీహరి యాదేశానుసారముగ శ్రీమహాలక్ష్మి తనకళాంశముతో విశ్వపావనదక్ష మగుతులసీ దివ్యవృక్షముగ బవిత్రభారతవర్షమం దవతరించెను.

ఈముప్వురు దేవతలదివ్యకళలు కలియుగాంతమువఱకు బవిత్రభారత వర్షములో సరిత్తులుగ బ్రవహించి తదనంతరము తమనిజస్వరూపములను బరిత్యజించి వైకుంఠపరంధామము జేరగలవు.

గాశీబృందావనములుదక్క నన్యపుణ్యక్షేత్రములు, సకలతీర్థములు శ్రీహరియాజ్ఞ ననుసరించి గంగాసరస్వతీపద్మావతులతో గూడి శ్రీహరిపదము చేరును. సాలగ్రామము, శ్రీహరిమూర్తియు, బురుషోత్తముడు నగుజగన్నాథుడు కలిలో బదివేలసంవత్సరములు గతించినపిమ్మట భారతవర్షమును విడచి తమ నిలయమునకు వెడలిపోవును. సాలగ్రామాంతర్ధానానంతరము సాధువులు, భక్తులు, వైష్ణవులు, పురాణములు, శంఖములు, శ్రాద్ధతర్పణాదులు, వేదోక్తకర్మములు, దైవపూజలు, భగవంతుని దివ్యనామములు, దైవదివ్యగుణనామసంకీర్తనములు, వేదములు, శాస్త్రములు,ధర్మము, గ్రామదేవతలు, తపోపాసనాది దివ్యకర్మములు నన్నియు ధరాతలమును వీడి యదృశ్యములు కాగలవు. అనగా మానవుల కీపవిత్రకర్మములందు శ్రద్ధ క్రమముగ క్షీణించి తుదకు నశించునని భావము.

కలియుగములో సాధారణముగ నందఱు వామాచారరతులై మద్య మాంసాదులను సేవింప నారంభించెదరు. అసత్యము నెడల, గపటాచరణముల యెడల నెవ్వరు నేహ్యభావములు కలిగివర్తింపరు. తులసీదళములు లేకుండగ పూజ లొనరింపబడును. ఏకాదశీవ్రతవిహీనులై యందఱు ధర్మవివర్జితులు కాగలరు. ప్రజలు హరివిప్రసంఘవిముఖులై యజ్ఞానులై ప్రవర్తింపగలరు. పైనుదాహరింపబడిన దేవతలు, దివ్యకర్మములు క్రమముగ భూమినుండి లుప్తము లగుచుండగా, శఠము, క్రూరత్వము, దాంభికము, అహంకారము, చౌర్యము, హింసాకాండము, మాత్సర్యము, మదము, కామము, క్రోధము, మొదలగు ననేకదుర్గుణము లీప్రపంచమంతటా వ్యాపింపగలవు. మానవులలో బరస్పరమైత్రి లుప్తము కాగా వారు యుద్ధోన్మాదులై హింసను బ్రోత్సహించెదరు. నారదా! ఘోరకలిలో నుత్తమస్నేహితులు లభింపరు, సుశీలవతు లైనపతివ్రత లరుదు కాగలరు. వివాహాది దివ్యకర్మములను బ్రజలు సరకుగొనక యథేచ్ఛగా బ్రవర్తింపగలరు.

జాతివర్ణనిర్ణయము సమసిపోయి స్వపరస్వామిభేదము సహితము లుప్తము కాగలదు. పెద్దచిన్న యనుభేదములు నశించి పురుషులు స్త్రీలకు

లోబడి జీవింప నారంభించెదరు. ఇంటింట గులట లుద్భవించి యత్యంత దురాచారపరలై కటుభాషణములతో నితరులమనములను, దుదకు దమ భర్తలను సహితము నొప్పింపగలరు. గృహపత్ని గృహమునకు యజమానురాలై భర్తను సేవకునికంటె నధమునిగ బరిగణన మొనరింపగలదు.

కలియుగములో బలవంతుడే పరిపాలకుడై తన యిష్టానుసారము ప్రవర్తింపగలడు. కేవలము రక్తసంబంధము కలవారే (కుమారుడు, తల్లి, తండ్రి, సహోదరుడు మొదలగువారు) బంధువు లయ్యెదరు. మానవుడు తన దూర బంధువులను, మిత్రులను దుద కాచార్యులను గూడ విస్మరింపగలడు. కొందఱు తమ పరివారముతోనే యపరిచితులుగ వ్యవహరించెదరు. సంధ్యావందనమును, యజ్ఞోపవీత సంస్కారాదులను బాటింపక ప్రజలు మ్లేచ్ఛులవలె వ్యవహరింతురు.

మ్లేచ్ఛశాస్త్రం పఠిష్యన్తి స్వశాస్త్రాణి విహాయ తే।
బ్రహ్మక్షత్రవిశాం వంశాః శూద్రాణాం సేవకాః కలౌ॥ (25)

"కలియుగములో ప్రజలు స్వశాస్త్రములను బరిత్యజించి మ్లేచ్ఛశాస్త్రములను బఠింపగలరు. అంతియేకాదు; బ్రాహ్మణక్షత్రియవైశ్య శూద్రులు సర్వులు సేవకులై మనగలరు. ఇతరుల జీవనాధారములను హరించువారు, వృషభాదిజంతువులను హింసించువారు, ధావకులు వృద్ధి నొందగలరు. సర్వజనులు సత్యహీనులై చరింపగలరు. మేదిని క్రమముగ సస్యహీన కాగలదు, వృక్షములు, ఫలహీనములై, స్త్రీలు పతిహీనలై, గోవులు క్షీరహీనములై శేషింపగలవు. దంపతులు పరస్పర ప్రీతిహీనులై చరింతురు. గృహస్థులకు సుఖములు లభింపవు. పరిపాలకులు ప్రతాపహీనులై ప్రజలను వివిధములగు పన్నులతో బీడింపగలరు. ప్రజలు మేదస్సును ప్రసాదించు నవనీతము లేని క్షీరములను సేవించెదరు. పరిపాలకులు తేజోవిహీనులై భగవద్భక్తి శూన్యులై నాస్తికరాజ్యములను స్థాపింపగలరు. లక్షమందిలో నొక్కపుణ్యాత్ముడు గూడ లభింపడు. దుర్వచనములను బలుకుచు ప్రజలు దుష్టవ్యవహారములతో వ్యవహరించెదరు. తుదకు నడవులందు నివసించు ప్రజలు సహితము పరిపాలకుల పన్నులభారమును వహింపక తప్పదు.

నారదా! కలియుగములో మానవు లశ్లీలభాషాయుక్తులై, ధూర్తులై శఠులై, అసత్యవాదులై జీవింపగలరు. నీచులు ధనవంతులై శ్రేష్ఠులుగ

బరిగణింపబడగలరు. నగరవాసులు హింసకులై, నిర్దయులై మనుష్యఘాతకులు కాగలరు. జనులు రుగ్ణులై యల్పాయుర్దాయముతో నచిరకాలములోనే యౌవనరహితులు కాగలరు. పదునాఱేండ్ల వయసుగల వారి శిరోజములు సహితము తెల్లబడగలవు. ఇరువదివర్షముల ప్రాయమందే మానవులలో వృద్ధత్వము ప్రవేశింపగలదు. మానవులు తుదకు భగవన్నామమును, భగవంతుని ప్రసాదమును విక్రయింపగలరు. పాపాత్ములు పుణ్యాత్ములవలె దురాచారసంపన్నులు శిష్టాచారసంపన్నులవలె నటింపగలరు. లంపటులు జితేంద్రియులవలె, పుంశ్చలీస్త్రీలు పతివ్రతలవలె, ఘాతకులు తపస్వులవలె, నవైష్ణవులు విష్ణుభక్తులవలె గాపట్యముతో బ్రవర్తింపగలరు. కలియుగాంతమున వంచకులు, జ్ఞానదుర్బలులు పూజింపబడగలరు. సర్వత్ర పురుషులు, స్త్రీలు వామనులై (పొట్టివారై) వ్యాధియుక్తులై పరితపింపగలరు. యువకులును నల్పాయుష్కులై జరావస్థ నొందగలరు. కొందఱు కన్యలను, నక్కచెల్లెండ్రను జారవృత్తికి నలవఱిచి జీవనోపాధిని బొందెదరు. కీర్తికొఱకే దానము లొనరించుచు దానమొనరించిన పదార్థములను మరల బరిగ్రహింపగలరు. పురుషులు కన్యాగాములు, భ్రాతృజాగాములు, యగమ్యాగాములునై, చరింపగలరు, స్త్రీపురుషులను నిర్ణయించుట యత్యంత కష్టము కాగలదు. అందఱు నొకేవిధముగ నలంకరించుకొని దుర్వ్యవహారముల నొనరింపగలరు. కలియుగాంతమున నందఱు మోసగాండ్రు, పాపాచరణపరాయణులు మ్లేచ్ఛులు, నయ్యెదరు. ద్విజులు పంచయజ్ఞముల నాచరింపక యజ్ఞోపవీతమును గూడ ధరింపరు. ఘోరకలియుగమం దందఱు మ్లేచ్ఛులుకాగలరు. తుదకు గ్రమముగ వృక్షములు హస్తప్రమాణకములు కాగా మానవులు వామనులై యంగుష్ఠప్రమాణ మాత్రులు కాగలరు.

విప్రస్య విష్ణుయశసః పుత్రః కల్కీ భవిష్యతి ।
నారాయణకలాంశశ్చ భగవా న్బలినాం బలీ ॥
దీర్ఘేణ కరవాలేన దీర్ఘ ఘోటకవాహనః ।
మ్లేచ్ఛశూన్యం చ పృథివీం త్రిరాత్రేణ కరిష్యతి ॥
నిర్మ్లేచ్ఛాం వసుధాం కృత్వా చాన్తర్ధానం కరిష్యతి । (58, 59)

ఇట్లు యావత్ప్రపంచము మ్లేచ్ఛాచరణముతో నిండియున్నసమయమున విష్ణుయశు డనుబ్రాహ్మణుని గృహమున శ్రీమన్నారాయణుని కళాంశముచే

మహాబలసంపన్నులయందుమను మహాబలి యైనకల్కిమూర్తి యయోనిజుడై యవతరింపగలడు. ఆకల్కిభగవానుడు సమున్నత దివ్యాశ్వము నధిరోహించి, దీర్ఘకరవాలమును ధరించి మూడురాత్రుల కాలములో ధరాతలమునందు గల పాపుల నందఱిని సంహరించి భూమిని మ్లేచ్ఛరహితము గావించి యంతర్ధాన గతు డగును.

మఱికొంతకాలము గడచినపిదప యుగాంతమున దుర్మార్గులు జన్మించి యీభూమి నాక్రమింపగలరు. ఆసమయమున స్థూలప్రమాణముగ నాఱు రాత్రు లవిచ్ఛిన్నవర్షధారలచే నీమహీతల మంతయు జలమయ మగును. పృథ్వి జనశూన్యమై, వృక్షశూన్యమై, గృహశూన్యమై శేషింపగలదు. అప్పుడేకకాలమున ద్వాదశాదిత్యు లుదయించి తమ ప్రచండతేజముతో జలప్లావిత మైనపృథ్విని శుష్కింప జేయగలరు. అంతటితో గలియుగ మంతరించి కృతా యుగారంభము కాగలదు.

సత్యయుగములో దపములు, సత్త్వాది దివ్యగుణములు, సంపన్నమైన ధర్మము పూర్ణరూపమున నావిర్భవింపగలవు. సత్యయుగములో బృథ్వి ధర్మాత్ములతో, బుణ్యాత్ములతో, దపోధనులతో, దైవజ్ఞులతో బరిపూర్ణమై శోభింపగలదు. ప్రతిగృహమందు స్త్రీలు పతివ్రతలై, ధర్మాచారపరాయణలు కాగలరు. ధర్మవర్తనులు, న్యాయపరాయణు లైనక్షత్రియులు రాజ్యపాలన వ్యవస్థను స్వీకరించెదరు. ఆపరిపాలకులు సద్బ్రాహ్మణులందు, దపస్వులందు, భక్తులందు, బ్రతాపవంతులందు, బుణ్యకర్మములయందు, సత్యాచరణ మందు శ్రద్ధ కల్గి ప్రేమతో వర్తించెదరు. వైశ్యులు ధర్మపరాయణులై వాణిజ్యవ్యవసాయగోరక్షణాదుల నొనరించుచు బ్రాహ్మణులయెడ బూజ్య భావముతో బ్రవర్తించెదరు. శూద్రు లత్యంత ధర్మపరాయణులై, పుణ్య శీలవంతులై విప్రులను గౌరవించుచు నివసింపగలరు. సకల విప్రులు, వైశ్యులు క్షత్రియులు, విష్ణుయజ్ఞపరాయణులై యుందురు. సర్వజనులు విష్ణుమంత్ర రతులు, విష్ణుభక్తులు వైష్ణవులు కాగలరు. సకలజనులు శ్రుతిస్మృతిపురాణ జ్ఞానసంపన్నులై, ధర్మజ్ఞులు, ఋతుగాములునై (ఋతుకాలములోనే స్త్రీసమాగమ మొనరించుట) ప్రవర్తింపగలరు. సత్యయుగములో నధర్మము లేశమాత్ర మైనగోచరింపదు. ధర్మము పరిపూర్ణముగ వ్యాపించి విరాజిల్లును.

ధర్మము త్రేతాయుగములో మూడుపాదములతోను, ద్వాపరయుగములో రెండుపాదములతోను, కలియుగప్రవేశమున నొకపాదముతోను నుండి క్రమముగ గలియుగాంతమున బూర్తిగ లుప్తము కాగలదు.

విప్రేంద్రా! ఏడుతిథు లొకవారము, పదునైదుతిథు లొకపక్షము. రెండుపక్షములు ( శుక్లకృష్ణపక్షములు) ఒకమాసము, రెండుమాసము లొక ఋతువు, ఆఱుమాసము లొకయయనము, రెండు అయనములు (ఉత్తరాయణ, దక్షిణాయనములు) ఒకసంవత్సరము నగును. సంవత్సర ఇడావత్సర మను భేదముల నైదువిధములైన వర్షములు కలవని గ్రహింపుము. ఇవియే కాలసంఖ్యానియమములు. దినములవలె నాల్గుయుగములు నొకదాని తరువాత నొకటి క్రమముగ సంభవించుచుండును. మనుష్యుల యొకసంవత్సరము దేవతలకొక పగలు, రేయి కాగలదు. ఉత్తరాయణమే పగలు, దక్షిణాయనమే రాత్రి. మనుష్యులకు మూడువందల యఱువదియుగములు గడచిన దేవతల కొకయుగము కాగలదని కాలసంఖ్యావిశేషజ్ఞులైనపురుషుల సిద్ధాంతము. ఇట్లే డెబ్బదియొక్క దివ్యయుగము లొకమన్వంతర మనబడును. ఒకమన్వంతర మింద్రుని పూర్ణాయుర్దాయమునకు సమానమని వచింపబడెను.

ఇరువదియెనమండుగు రింద్రులు గతించిన బ్రహ్మ కొకపగలు రాత్రి కాగలదు. ఈమానము ననుసరించి నూటయెనిమిదిసంవత్సరములు గతించిన పిమ్మట బ్రహ్మాయుర్దాయము పరిపూర్ణము కాగలదు. దానిని ప్రాకృతప్రళయ మని గ్రహింపుము. ప్రాకృతప్రళయమున సర్వబ్రహ్మాండము జలమయము కాగా బృథ్వి యదృశ్య కాగలదు. ఆబ్రహ్మాండములోని బ్రహ్మవిష్ణురుద్రాదులు, మహర్షులు, భక్తులు మొదలగు వా రందఱు శ్రీకృష్ణపరమాత్మ యందే లీనము కాగలరు. బ్రహ్మాయుర్దాయము కాలరూపుడైన శ్రీకృష్ణ పరమాత్మ కొకనిమేషకాలమే యని గ్రహింపుము. మరల బరమాత్మనిమేష కాలానంతరము సృష్టిక్రమము యథావిధిగ బ్రారంభము కాగలదు. ఇట్లెన్ని కల్పములు గడచినవియో యెన్ని వచ్చునవియో యెవ రెరుగుదురు ? నారదా! సృష్టులయొక్క, ప్రళయములయొక్క, బ్రహ్మాండములయొక్క, బ్రహ్మాండములలోనుండు బ్రహ్మాది ప్రధానప్రబంధుకులయొక్క సంఖ్యల జ్ఞానమేమానవున కుండును ?

పరబ్రహ్మమైన శ్రీకృష్ణపరమాత్మ ప్రకృతికి సహితమతీతుడు, సంపూర్ణబ్రహ్మాండముల కేకైకసర్వేశ్వరేశ్వరుడు, సచ్చిదానందవిగ్రహుడు, నిత్యుడు, సనాతనుడు, జ్యోతిస్స్వరూపుడు, శాశ్వతుడునై యున్నాడు. మహావిరాట్పురుషుడు, బ్రహ్మాదిదేవతలు, స్వల్పవిరాట్పురుషుడు మొదలగువారందఱు నీపరమప్రభువైన పరమాత్మాంశములే. ఆద్యప్రకృతి సహిత మీసకల జగన్నాథుని యంశోత్పన్నయని తెలిసికొనుము. శ్రీకృష్ణపరమాత్మయే ద్విభుజుడుగను, చతుర్భుజుడుగను నయ్యెను. చతుర్భుజుడైన శ్రీహరి వైకుంఠములోను ద్విభుజుడైన శ్రీకృష్ణుడు గోలోకపరంధామమందు కొలువుండును. నారదా!

> బ్రహ్మాదితృణపర్యన్తం సర్వం ప్రాకృతికం భవేత్ ।
> యద్యత్ప్రాకృతికం సృష్టం సర్వం నశ్వరమేవ చ ॥ (86)

బ్రహ్మ మొదలు తృణమువఱకుగల సర్వము ప్రాకృతికమే యని గ్రహింపుము. ప్రాకృతికసృష్టి యంతయు నిశ్చయముగ నశ్వరమే.

ప్రాకృతికసృష్టిలో బ్రహ్మనిర్మిత స్వర్గాదులు కూడ కలవని తెలిసికొనుము.

> విద్ధ్యేకం సృష్టిమూలం తత్సత్యం నిత్యం సనాతనమ్ ।
> స్వేచ్ఛామయం పరం బ్రహ్మ నిర్లిప్తం నిర్గుణం పరమ్ ॥
> నిరుపాధి నిరాకారం భక్తానుగ్రహవిగ్రహమ్ ।
> అతీవ కమనీయం చ నవీననీరదప్రభమ్ ॥
> ద్విభుజం మురలీహస్తం గోపవేషం కిశోరకమ్ ।
> సర్వజ్ఞం సర్వసేవ్యం చ పరమాత్మానమీశ్వరమ్ ॥ (87-89)

దేవర్షీ! సకలసృష్టికి మూలమై సకలకారణములకు కారణమైన పరబ్రహ్మము నిత్యుడు, సత్యుడు, సనాతనుడు, సర్వతంత్రస్వతంత్రుడు, నిర్గుణుడు ప్రకృతి కతీతుడు, సర్వదా నిర్లిప్తుడు. ఆయన కెట్టిలౌకికోపాధికాని, భౌతికాకారముకాని లేదు. ఆభగవంతుడు కేవలము భక్తుల ననుగ్రహించుటకే సచ్చిదానంద విగ్రహుడైనాడు. ఆభక్తానుగ్రహవిగ్రహు డత్యంత కమనీయుడు, నవీననీరదప్రభాసమన్వితుడు. ద్విభుజుడు, మురళీహస్తుడు, గోపవేషధారి, సదా కిశోరుడు, సర్వజ్ఞుడు, సర్వవ్యాపి, సర్వేశ్వరుడు సర్వసేవ్యుడు, పరమాత్మయు నని గ్రహింపుము.

ఈపరమాత్మప్రసాదిత దివ్యజ్ఞానమువలననే క్షుద్రవిరాట్పురుషుని నాభి కమలమునుండి యుత్పన్నుడై నబ్రహ్మాయఖండజ్ఞానసంపన్నుడై బ్రహ్మాండము నందుసృష్టియొనరింపగలుగుచున్నాడు. సంపూర్ణతత్త్వజ్ఞాతమైన,మృత్యుంజయు డైనశివు డీదేవాదిదేవుని యనుగ్రహమువలననే సంహారకార్యమును నిర్వర్తింప గల్గుచున్నాడు.శ్రీకృష్ణుని గుఱించి తా నొనర్చిన యఖండతపఃప్రభావమువలన బరమాత్మ యనుగ్రహించిన జ్ఞానమువలన శంకరుడు పరమాత్మసముడై సర్వే శ్వరుడైనాడు. ఆభగవంతుడైనశ్రీకృష్ణుని కృపవలననే విష్ణువు మహావిభూతి సంపన్నుడై, సర్వజ్ఞుడై, సర్వదర్శియై, సర్వవ్యాపియై, సర్వరక్షకుడై, సంపూర్ణ సంపత్ప్రదాతయై, సర్వేశ్వరుడై, సమస్తజగములకు నధిపతియై విరాజిల్లు చున్నాడు.

శ్రీకృష్ణప్రసాదితదివ్యజ్ఞానమువలన ఆయనకొఱకై యొనరించిన యఖండతపఃప్రభావమువలన ఆయన యెడల ననన్యభక్తి కల్గి తత్సేవాసౌభా గ్యము పొందినందువలన నాద్యప్రకృతి సర్వశక్తిసమన్వితయు,మహామాయయు సర్వేశ్వరేశ్వరియు నైనది. పరమాత్మ నారాధించి, సేవించి సావిత్రి వేద ముల కధిష్ఠాత్రీదేవియై సర్వులకు బూజనీయురాలైనది. శ్రీకృష్ణుని సేవా సౌభాగ్యమువలన నాయనను గుఱించి యొనరించిన తపఃప్రభావమువలన సరస్వతి వాగ్దేవతయై సకలవిద్యలకు నధిష్ఠాత్రీదేవియై విరాజిల్లెను. సనాతని యగు శ్రీమహాలక్ష్మి శ్రీకృష్ణుని యనన్యానుగ్రహముననే సకలసంపదలకు, ధన ధాన్యములకు నధిష్ఠాత్రీదేవియై, సకలవిభూతిప్రదాయినియై విరాజిల్లెను. ఈయన నుపాసించియే దుర్గ సర్వులకు సేవ్యయై సర్వేశ్వరియై యభీష్టవరముల బ్రసాదింపగల్గుచుండెను. దుర్గతినాశని యైనదుర్గ పరమాత్మకృపావిశేషము వలననే గ్రామములందు గ్రామదేవతయై సకలజనులచే స్తుతింపబడుచు, సర్వజ్ఞ రాలైనది. శ్రీకృష్ణపరమాత్మ సేవాఫలస్వరూపముగ సర్వేశ్వరేశ్వరుడైన శివునే యామె పతిగా బడయగలిగెను.

శ్రీకృష్ణుని వామభాగమునుండి ప్రాదుర్భవించినరాధ యాయననే ప్రేమించి, యారాధించి, సేవించి, తత్ప్రేమాధిదేవత యైనది. శ్రీరాధ శ్రీకృష్ణునకు ప్రాణములకన్న నధికప్రియతమురాలు. శ్రీకృష్ణుని యనన్య సేవలవలననే రాధకు సర్వాధిక మనోహరరూపము, అఖండసౌభాగ్యము, యశము, గౌరవము, తద్వక్షఃస్థలస్థానము, తత్పత్నీత్వము లభించెను. పూర్వ

కాలములో రాధ యొకసహస్ర దివ్యయుగముల పర్యంతము ఘోరతపమాచ రించెను. శ్రీకృష్ణపరమాత్మ రాధ యొనరించిన యఖండారాధన కత్యంత ప్రీతుడై సాక్షాద్దర్శన మొసంగి యి ట్లనేకవరములను బ్రసాదించెను. "ప్రాణ వల్లభా! నీస్థానము నావక్షఃస్థలమే, కావున నీవిందే నివసింపుము. నీకు నా యెడల నవిచలప్రేమ, యనన్యభక్తి కల్గుగాక. నీ వఖండసౌభాగ్యసంప న్నవై, ప్రేమమూర్తివై సర్వులయందు శ్రేష్ఠురాలవై నాకు సర్వాధిక ప్రియతమురాలవు కాగలవు. విశ్వములం దున్నసమస్తయువతులందు నీస్థాన మత్యంతోన్నతము, శ్రేష్ఠము. నీ వందఱికంటె నత్యధిక మాహాత్మ్యము కల్గి మాననీయురాలవై సదా విరాజిల్లెదవు గాక. దేవీ! యనన్యభక్తురాల నైన నీదివ్యగుణగానము సదా స్వయముగ నేనే యొనరించి నిన్ను బూజించె దను. ప్రాణాధిక ప్రియా! నేను సదా నీ యధీనుడనని తెలిసికొనుము".

ఏయే దేవతలవలన నేయే దేవాంగనలు సన్మానింపబడినారో వారి గౌరవమునకు కేవలము శ్రీకృష్ణారాధనమే యేకైక కారణమని తెలిసి కొనుము.

తపస్యా యాదృశీ యాసాం తాసాం తాదృక్ఫలం మునే॥ (107)

మునీశ్వరా! ఎవ రెంతెంత తప మొనరింతురో వారి కంతంతే ఫలము ప్రాప్తింపగలదు.

దుర్గాదేవి సహస్ర దివ్యవర్షములు హిమాలయముపై నఖండ తపోని యతితో శ్రీకృష్ణుని చరణారవిందములను ధ్యానించెను. ఆతపఃప్రభావము వలన నామె సర్వపూజ్యురాలై మాహేశ్వరుని యర్థాంగి యయ్యెను. గంధ మాదన పర్వతముపై శ్రీకృష్ణుని ప్రసన్నత కొఱకు సరస్వతి యొకలక్షదివ్యవర్ష ములు ఘోరతప మాచరించి తత్ప్రభావమున సర్వవంద్య యయ్యెను. శ్రీమహాలక్ష్మి నూఱుదివ్యయుగములపర్యంతము పుష్కరతీర్థములో శ్రీకృష్ణుని నఖండ తపోమూలమున నారాధించి సమస్తసంపదలను బ్రసాదించుటలో సమర్థురాలయ్యెను. మలయాచలముపై సావిత్రి యఱువదివేల దివ్యవర్ష ములు శ్రీకృష్ణుని ధ్యానించి విశ్వములందు గల ద్విజులకు పూజనీయురా లయ్యెను. నారదా! పూర్వకాలమున బ్రహ్మవిష్ణుమహేశ్వరాదులు నూఱు మన్వంతరముల కాలము శ్రీకృష్ణప్రీత్యర్థము తపమాచరించి సృష్టిపాలన

సంహారకార్యముల కధిపతులైరి. ధర్మదేవత నూఱుమన్వంతరములకాల మా సచ్చిదానందవిగ్రహు నారాధించి సర్వపూజితు డయ్యెను. అనంతుడు, సూర్యుడు మొదలగువా రందఱు ననన్యభక్తిసమన్వితులై యొక్కొక్కమన్వం తరకాలము శ్రీకృష్ణు నారాధించి ధన్యులైరి. వాయుదేవుడు నూఱుదివ్య యుగములపర్యంత మనన్యభక్తిభావముతో శ్రీకృష్ణు నారాధించి సర్వులకు నాధారమై, ప్రాణమై సర్వపూజితుడైనాడు. నారదా! ఈప్రకారముగ శ్రీకృష్ణుని ప్రీత్యర్థమై తపముల నాచరించి సకలదేవతలు, మనువులు, నరేశ్వ రులు, బ్రాహ్మణాదిమానవులు లోకములందు బూజితులైనారు. నేను నా గురుదేవుని వలన శ్రవణమొనరించి దివ్యజ్ఞానసంపన్నుడనై యాగమానుసార ముగ నీపురాణప్రవచన మొనరించుచున్నాను, మఱి నీ వేమి వినగోరు చున్నావో తెల్పిన నేను బ్రవచనము కొనసాగింపగలను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి<br>ప్రకృతిఖండములోని కలియుగాంతమాహాత్మ్య<br>మన్వంతరకాళేశ్వరగుణ నిరూపణ<br>మను నేడవ అధ్యాయము<br>సమాప్తము.

---

## ఎనిమిదవ అధ్యాయము

### వసుధోత్పత్తి; పృథివీపూజామంత్రస్తోత్రములు.

**నారదుడు పలికెను :**

శ్రీకృష్ణభగవానుని నిమేషమాత్రకాలములో బ్రహ్మయుర్దాయము పరిపూర్ణము కాగలదనియు, నాసమయములో బృథ్వి యదృశ్యయై బ్రహ్మాండ మంతయు జలమయమై, ప్రాకృతప్రళయము సంభవించుననియు నీవు ప్రవచించి

తివి. ప్రాకృతప్రళయములో దేవతలు మొదలగువా రందఱు పరబ్రహ్మ మైన శ్రీకృష్ణునియందే విలీను లయ్యెదరని నీవు ధ్రువీకరించితివి. మహాభాగా! ప్రాకృతప్రళయములో నదృశ్య మైనపృథ్వి యేప్రదేశములో విరాజిల్లి మరల సృష్టిసమయమున నెట్లావిర్భవింపగలదు ? ధన్యురాలు, మాన్యురాలు, సర్వాశ్రయురాలు, జయశాలిని యగుసౌభాగ్య మాపృథ్వికి మరల నెట్లు లభింప గలదు? ప్రభూ! పృథ్వి యుత్పత్తిని గుఱించిన మంగళమయాఖ్యానమును నా కుపదేశింపవలసినదిగ బ్రార్థించుచున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

> సర్వాదిసృష్టౌ సర్వేషాం జన్మ కృష్ణా దితి శ్రుతిః ।
> ఆవిర్భావ స్తిరోభావః సర్వేషు ప్రలయేషు చ ॥ (5)

సంపూర్ణసృష్టి కారంభమున సర్వము శ్రీకృష్ణపరమాత్మనుండియే యుత్పన్నము కాగలదు. సర్వప్రళయములందు సకలప్రాణులు శ్రీకృష్ణుని లోనే తిరోభావమొంది సృష్టిసమయములో మరల నావిర్భవింపగలవు.

సర్వమంగళమంగళము, సకలవిఘ్నవినాశకము,పరమము, పాపనాశనము, పుణ్యవర్ధకమునైన వసుధాజన్మప్రసంగమును బ్రవచించెద సావధానుడవై యాకర్ణింపుము.

ఆదరణీయురాలైనపృథ్వి మధుకైటభులమేదస్సునుండి యుత్పన్న మయ్యెనని కొందఱువిద్వాంసులయభిప్రాయము.వీరిభావమేమన, మధుకైటభుల జీవనకాలమందు బృథ్వి స్పష్టరూపమున గనబడలేదు. ఆదైత్యుల మరణా నంతరము వారి శరీరముల నుండి మేదస్సు బయల్వెడలెను. తదనంతరము సూర్యుల ప్రకాశమువలన నది శుష్కించి భూమిగా మాఱెను. అందు వలననే మేదిని యనునామమున బృథ్వి విఖ్యాతిగాంచెను. నారదా! ప్రళయా నంతరము సర్వత్ర జలమే దృష్టిగోచర మగుచుండెను. వాస్తవముగ నాజలము లలో నదృశ్యముగ బృథ్వి కలదు. మధుకైటభుల శరీరజనితమేదస్సు కేవ లము జలములలో నంతర్గతయై యున్న పృథ్విని స్పృశించెను. ఈకారణము ననే ప్రజ లామెను మేదిని యనిరి. ఈ రెండు ప్రసంగములు కొందఱి విశేష జ్ఞుల యభిప్రాయములు మాత్రమే. మునీశ్వరా! వసుంధరాదేవి సార్థకజన్మ ప్రసంగమును వర్ణించెద శ్రవణ మొనరింపుము. ఈపవిత్ర చరిత శ్రవణము

సర్వమంగళములను బ్రసాదింపగలను. పూర్వకాలములో బుష్కరక్షేత్ర మందు నాపితృదేవు లైనధర్మదేవత ముఖారవిందమునుండి శ్రవణ మొన రించిన, యీ పృథ్వీచరితమునే యథాతథముగ వర్ణించెద నవధరింపుము.

మహావిరాట్ శరీరస్య జలస్థస్య చిరం స్ఫుటమ్ ।
మలో బభూవ కాలేన సర్వాఙ్గ వ్యాపకో ధ్రువమ్ ॥
స చ ప్రవిష్టః సర్వేషాం తల్లోమ్నాం వివరేషు చ ।
కాలేన మహతా తస్మా ద్బభూవ వసుధా మునే ॥
ప్రత్యేకం ప్రతిలోమ్నాం చ స్థితా కూపేషు సా స్థిరా ।
ఆవిర్భూతా తిరోభూతా సా చలా చ పునః పునః ॥
ఆవిర్భూతా సృష్టికాలే తజ్జలా త్పర్యుపస్థితా ।
ప్రలయే చ తిరోభూతా జలాభ్యన్తరవస్థితా ॥ (12-15)

మహావిరాట్పురుషు డనంతకాలమునుండి జలములలో విరాజమానుడై యున్నాడనుట యత్యంత స్పష్టము. సమయానుసారముగ నాయనలోనుండి సర్వవ్యాపక మైనసమష్టిమలము ప్రకటితమగును. మునీశ్వరా! మహావిరాట్పు రుషుని సకలరోమకూపము లాసమష్టిమలమున కాశ్రయము లగును. కాల మాసన్న మైనపుడు మహావిరాట్పురుషుని రోమకూపములలో నిహితమైయున్న పృథ్వి బయల్వెడల గలదు.

మహావిరాట్పురుషునిలో నెన్ని రోమకూపములు కలవో వానియన్నిం టిలోనుండి యసంఖ్యాకపృథువులు జలముతోగూడ నావిర్భవింపగలవు. ఆ పృథ్వి మాటిమాటికి ఆవిర్భావతిరోభావముల నొంపుచుండును. సృష్టిసమయ మున ప్రకటితమై జలములపై స్థిరముగ నుండుట, ప్రళయకాలములో లోనికి దిరోగమించుట పృథ్వీనియమములు.

ప్రతివిశ్వేషు వసుధా శైలకానన సంయుతా ।
సప్తసాగర సంయుక్తా సప్తద్వీపమితా సతీ ॥
హిమాద్రిమేరు సంయుక్తా గ్రహచన్ద్రార్కసంయుతా ।
బ్రహ్మవిష్ణుశివాద్యైశ్చ సురై ర్లోకై స్తథా నుతా ॥
పుణ్యతీర్థసమాయుక్తా పుణ్యభారతసంయుతా ।
కాంచనీభూమిసంయుక్తా సర్వదుర్గసమన్వితా ॥

పాతాలాః సప్త తదధ స్తదూర్ధ్వే బ్రహ్మలోకతః ।
ధ్రువలోకశ్చ తత్రైవ సార్ధం విశ్వం చ తత్ర వై ॥
ఏవం సర్వాణి విశ్వాని పృథివ్యాం నిర్మితాని వై ।
ఊర్ధ్వం గోలోకవైకుణ్ఠౌ నిత్యౌ విశ్వపరౌ చ తౌ ॥ (16-20)

మహావిరాట్పురుషుని యసంఖ్యాక రోమకూపములయం దున్న యొక్కొక్క బ్రహ్మాండములో సకలజీవులకు నేకైకాధారమై వసుధ విరాజిల్లు చుండును. ఆవసుంధర శైలకాననములతోను, సప్తసాగరములతోను, సప్త ద్వీపములతోను, హిమాలయ ప్రభృతి మహాపర్వతములతోను సదా శోభించు చుండును. మహావిరాట్పురుషు నాజ్ఞానుసార మవని యూర్ధ్వదిశలో విరాజిల్లు సప్తస్వర్గములలో బ్రహ్మవిష్ణుశివాది దేవత లావిర్భవించి సకలజీవకల్యాణము కొఱకు సంకల్పముల నొనరించుచుండెదరు. పాంచభౌతిక దేహధారులైనప్రాణికోట్ల కీమెయే విశ్వమం దేకైకాధారము. (అనగా నొక బ్రహ్మాండములో గల సకలజీవులకు కేవలము వసుంధరయే నివాసయోగ్యము, అన్య గ్రహములు జీవరహితములై శూన్యములై కేవలము వసుంధర సుస్థిరత కొఱకు బరిభ్రమించు చుండగలవని భావము). అనేకపుణ్యతీర్థములు, పవిత్ర భారతవర్షాది దేశములు వసుధాశోభను బెంపొందింప జేయగలవు. వసుధ కాంచనభూమి (బంగారుభూమి) సంయుక్త (అనగా స్వర్ణాదిసకలలోహములను వజ్రాద్యమూల్యరత్నములను. వివిధసస్యములను బ్రసాదింపగలది). వసుంధర కూర్ధ్వదిశలో సప్తస్వర్గములు, అధోదిశలో సప్తపాతాళలోకములు కలవు. సప్తస్వర్గములలో నత్యున్నతమైనదే బ్రహ్మలోకము (అనగా నీ యేడేడు లోకములలో బృథ్వియే మధ్యభాగములో విరాజిల్లుచున్న కర్మ భూమి). ఈబ్రహ్మాండమున కావల ధ్రువలోకాద్యసంఖ్యాకవిశ్వములు కలవు. ఇట్లు జీవుల కాధారమై వివిధరూపములతో మహావిరాట్పురుషుని వలననిర్మిత మైనపృథ్వి సర్వవిశ్వములలో విరాజిల్లగలదు. ఈప్రాకృతికాసంఖ్యాక బ్రహ్మాండముల కావల నూర్ధ్వదిశలో జిన్మయవ్యోమములో నణురహితములు నిత్యములు, శాశ్వతములు, చిన్మయములు, సత్యములు, ఆనంద సమన్వితములు నగుగోలోకవైకుంఠాదిదివ్యలోకములు కలవు.

నశ్వరాణి చ విశ్వాని కృత్రిమాకృత్రిమాణి చ ।
ప్రలయే ప్రాకృతే బ్రహ్మన్ బ్రహ్మణశ్చ నిపాతనే ॥ (21)

నారదా! కృతిక్రమములు నకృతిక్రమములు నగువిశ్వములన్నియు, నశ్వరములని గ్రహింపుము. ప్రాకృతప్రళయకాలములో బ్రహ్మసహితము నశింపగలదు.

మహావిరాడాదిసృష్టౌ సృష్టం కృష్ణేన చాఽఽత్మనా ।
నిత్యే స్థితః స ప్రలయే కాష్ఠాకాశేశరైః సహ ॥ [22]

మహాప్రళయకాలములో కేవలము మహావిరాట్పురుషుడే శేషించి విరాజిల్లగలడు. కారణమేమనగా సృష్ట్యారంభమునకు ముందే పరబ్రహ్మమైనశ్రీకృష్ణపరమాత్మ యీయనను ప్రాదుర్భవింపజేసి సకలసృష్టి కార్యమున నియమించెను.

సృష్టి ప్రళయములు ప్రవాహరూపముగ నిరంతరము సంభవించు చుండును. ఈసృష్టిప్రళయచక్రము కాలమునే నియమింపగల ఏకైక పరమాత్మ మైనశ్రీకృష్ణుని యధీనము.

వరాహకల్పములో పృథ్వి మూర్తి భవించి సర్వులకు దర్శన మొసంగెను. సకలదేవతలు, మునీశ్వరులు, మనువులు, గంధర్వులు, బ్రాహ్మణులు మొదలగువా రందఱు నీమె యారాధనలో సమ్మిళితులైరి. ఆ సమయములో భగవంతుడు వరాహ రూపమున నవతరించి జలములలోనుండి పృథ్వి నుద్ధరించెను. ఆపృథ్వి వరాహభగవానుని ప్రియపత్ని యైనదని శ్రుతి వచనము కలదు. వరాహరూపుని దివ్యతేజముతో నవనినుండి మంగళు(కుజు) డుదయించెను. వానినుండి ఘటేశ్వరు డుద్భవించెను. ఘటేశ్వరుని మఱియొక నామధేయమే సుయశుడు.

## నారదుడు పలికెను :

ప్రభూ! దేవతలు వరాహకల్పములో పృథ్వి నేరూపమున బూజించిరి? సర్వులకు నాశ్రయప్రదాయిని యైనపృథ్వి నాకల్పములో స్వయముగ వరాహేశ్వరుడు, సకలదేవతలు పూజించిరట! భగవానుడా! వసుంధరామాత పూజావిధానమును, జలములలో నంతర్గతయైన యీమెను వరాహేశ్వరు డుద్ధరించుట, మంగళుని ప్రాదుర్భావము మొదలగు కళ్యాణమయ ప్రసంగములను విస్తారముగ వివేచనమొనరించి నన్ను గృతార్థుని జేయుడు.

**శ్రీనారాయణఋషి పలికెను :**

దేవర్షీ! ఈయాఖ్యాన మత్యంత నిగూఢము, మహాప్రాచీనము. ఆ సమయమున వరాహకల్పము జరుగుచుండెను. హిరణ్యాక్షు డను మహాదైత్యుడు హిరణ్యము (బంగారము) నం దత్యంతానురక్తుడై దానిని బొందుటకై యవనిని దప్వసాగెను. అపు డాయుత్పాతములవలన నవని బరువులేనిదై బ్రహ్మాండజలములలో గుంగిపోయెను. సకలజీవాధారయగు వసుంధరను రక్షింపుమని హిరణ్యాక్షుని సంహరింపుమని బ్రహ్మ ప్రార్థింపగా నాలోకైక రక్షామణియగు శ్రీహరి మహావరాహరూపమును దాల్చి తటాకములో గమలమువలె జలమయ మైనరసాతలమునుండి పృథ్విని దన దంష్ట్రలతో నుద్ధరించి యామెకు యథాపూర్వస్థితి కల్పించెను. తదనంతరము క్షణములో మహాదైత్యు డైనహిరణ్యాక్షుని సంహరించెను.

తదనంతరమే బ్రహ్మ వసుంధరపై సృష్టిచేయ నారంభించెను. భగవంతునిచే నుద్ధరింపబడిన పిదప వసుంధరాధిష్ఠాత్రీదేవి యొక దివ్యసుందరీ రూపమున సాక్షాత్కరించెను. ఆమెను జూచినంతనే శ్రీహరిభగవానునకు బ్రేమకలిగెను. వరాహభగవానుని కాంతి కోట్లకొలది సూర్యులప్రకాశమును మించియుండెను. ఆయన తనరూపమును బరమమనోహరముగ జేసెను. రతికై యోగ్య మగునొకశయ్యను సిద్ధముచేసెను. ఆదేవితోపా టొకదివ్య వర్షమువఱ కాయన యేకాంతమునందుండెను. పిమ్మట ఆసుందరీసాంగత్యమును విడచి విలాసముగ నాయన తన వెనుకటి వరాహరూపమును దాల్చెను. ఆయన పరమసాధ్వి యగుబృథ్విని బ్రథమమున ధూపదీపనైవేద్యాది షోడశోపచారములతో సాంగోపాంగముగ నారాధన మొనరించి యామె నుద్దేశించి యిట్లు పలికెను.

**వరాహభగవానుడు పలికెను :**

కల్యాణీ! నీవు సర్వులకు నాశ్రయప్రదాయినివి గమ్ము. మహర్షులు, మనువులు, దేవతలు, దానవులు, సర్వులు నిన్ను బూజించి యారాధింపగలరు.

> జలోచ్ఛ్వాసోజ్జ్వల త్యాగగృహారమ్భప్రవేశనే ।
> వాపీతడాగారమ్భే చ శుభే చ కృషికర్మణి ॥

తవ పూజాం కరిష్యన్తి సమ్ప్రేమేణ సురాదయః ।
మూఢా యే న కరిష్యన్తి యాస్యన్తి నరకం చ తే । [36-37]

గృహప్రవేశగృహారంభములందు, వాపీకూపతటాకాదినిర్మాణ సమయములందు, శుభసమయములందు, గృషి (వ్యవసాయ) కర్మారంభములందు, నత్యంత ప్రసన్నులై సురాదులు నిన్నారాధింపగలరు. ఆసమయములలో నిన్నారాధింపని మూఢు లవశ్యము నరక మనుభవింపగలరు.

ఆ సమయమున వరాహరూపు డైనశ్రీహరి యనుగ్రహముచే బృథ్వి నుండి మంగళు డుద్భవించెను. కణ్వశాఖయందు బ్రవచింపబడిన మూల మంత్రమును బఠించుచు వరాహమూర్తి పృథ్విని ధ్యానించి పూజించెను. తదనంతరము ముల్లోకములయందలి సకల జీవులు పృథ్వీదేవ్యారాధనల నొన రింప దొడంగిరి.

## నారదుడు పలికెను :

స్వామీ! పృథ్వీమాత నే రూపమున ధ్యానింపవలెను? ఆమె పూజా విధాన మేమి? ఆమె మూలమన్త్రి మేమి? సర్వపురాణములందు గూఢ ములైయున్న యీ విషయములను కృపతో నా కనుగ్రహింపుము.

## శ్రీనారాయణఋషి పలికెను :

మునీశ్వరా! ఆదిలో బృథ్వీదేవి వరాహమూర్తిచే బూజింపబడెను. తదనంతరము బ్రహ్మదేవు డామె నారాధించెను. బ్రహ్మదేవుని తరువాత సకలమహర్షులు, మనువులు, మునులు, దేవతలు, మానవులు నామె నారాధించిరి. పృథ్వీమంత్రము నుపదేశించెద నవధరింపుము.

ఓం హ్రీం క్లీం శ్రీం వాం వసుధాయై స్వాహా ।
ఇత్యనేన తు మన్త్రేణ పూజితా విష్ణునా పురా ॥ [49]

"ఓం హ్రీం క్లీం శ్రీం వాం వసుధాయై స్వాహా"

ఈమహామంత్రమును జపించుచు బూర్వము విష్ణుభగవానుడే స్వయముగ భూదేవి నారాధించెను.

## వసుధా ధ్యానము

శ్వేతచమ్పకవర్ణాభాం శతచన్ద్రసమప్రభామ్ ।
చన్దనోక్షితసర్వాఙ్గీం సర్వభూషణభూషితామ్ ॥
రత్నాధారాం రత్నగర్భాం రత్నాకరసమన్వితామ్ ।
వహ్నిశుద్ధాంశుకాధానాం సస్మితాం వన్దితాంభజే॥ 50-51

శ్వేతచంపకమువంటి వర్ణముకలదియు, నూఱుగురుచంద్రులతో సమానమైనకాంతికలదియు, చందనముచే జర్చితములైన సర్వావయవములు గలదియు, సర్వభూషణములచే భూషితయు, రత్నములను ధరించినదియు, రత్నములు గర్భమునందు గలదియు, రత్నాకరునితో సమానమైనదియు, వహ్నిశుద్ధములగు వస్త్రములను ధరించునదియు, చిఱునవ్వుతో గూడినదియు, సర్వులచే నమస్కరింపబడునదియు నగుపృథ్విని సేవించుచున్నాను.

ఇట్లు ధ్యానమొనరించిన పృథ్వీపూజ సంపన్నము కాగలదు. విప్రేన్ద్రా! కణ్వశాఖలో బ్రతిపాదితమై విష్ణువొనరించిన పృథ్వీస్తోత్రము నాలకింపుము.

## పృథ్వీ స్తోత్రము

**శ్రీవిష్ణు రువాచ :**

యజ్ఞసూకరజాయా త్వం జయం దేహి జయావహే।
జయేఽజయే జయాధారే జయశీలే జయప్రదే ॥
సర్వాధారే సర్వబీజే సర్వశక్తిసమన్వితే ।
సర్వకామప్రదేదేవి సర్వేష్టం దేహి మే స్థిరే ॥
సర్వసస్యాలయే సర్వసస్యాఢ్యే సర్వసస్యదే ।
సర్వసస్యహరే కాలే సర్వసస్యాత్మికే క్షితే ॥
మఙ్గలే మఙ్గలాధారే మాఙ్గల్యే మఙ్గలప్రదే ।
మఙ్గలార్థే మఙ్గలాంశే మఙ్గలం దేహి మే పరమ్ ॥
పుణ్యస్వరూపే పుణ్యానాం బీజరూపే సనాతని ।
పుణ్యాశ్రయే పుణ్యవతా మాలయే పుణ్యదే భవే ॥
స్త్రీరత్నరూపే రత్నౌఘే రత్నసారవర ప్రదే ॥
భూమే భూమిపసర్వస్వే భూమిపాలపరాయణే ।
భూమిపాహఙ్కారరూపే భూమిం దేహి వసున్ధరే ॥
ఇదం స్తోత్రం మహాపుణ్యం తాం సమ్పూజ్య చ యః పఠేత్ ।

కోట్యన్తరే జన్మని స సమ్భవే ద్భూమిపేశ్వరః ॥
భూమిదానకృతం పుణ్యం లభతే పఠనా జ్జనః ।
దత్తాపహారజా త్పాపా న్ముచ్యతే నాత్ర సంశయః ॥
అమ్బువీచీభూఖననా త్పాపా న్ముచ్యతే స ధ్రువమ్ ।
అన్యకూపే కూపదజా త్పాపా న్ముచ్యతే స ధ్రువమ్ ॥
పరభూశ్రాద్ధజా త్పాపా న్ముచ్యతే నాత్ర సంశయః ।
భూమౌ వీర్యత్యాగపాపా ద్దీపాదిస్థాపనా త్తథా ॥
పాపేన ముచ్యతే ప్రాజ్ఞః స్తోత్రస్య పఠనా న్మునే ।
అశ్వమేధశతం పుణ్యం లభతే నాత్ర సంశయః ॥ (55-64)

విజయమును బ్రసాదించు వసుధా! నాకు విజయము నిమ్ము. నీవు వరాహమూర్తి పత్నివి, కావున దేవీ! నీ కెపుడును బరాజయము సంభవింపదు. నీవు విజయముల కాధారము, విజయశీలవు, జయప్రదాయినివి. నీవు సర్వాధారవు, సర్వబీజస్వరూపిణివి, సర్వశక్తి సమన్వితవు, సర్వ కామప్రదవు, మాతా! నా కీసంసారములో సర్వాభీష్టవస్తువులను బ్రసాదింపుము. నీవు సకల సస్యములకు నాలయస్వరూపిణివి, సకలసస్యసంపన్నవు, సర్వ సస్యప్రదాయినివి. క్షితే! సర్వశక్త్యాత్మిక వైననీవు కాలానుసారముగ సర్వ సస్యములను హరింపగలవు. మంగళమయీ! దేవీ! నీవు మంగళాధారస్వరూపిణివి, సకలమంగళయోగ్యురాలవు, మంగళప్రదాయినివి, మంగళమయ పదార్థస్వరూపిణివి, మంగళేశ్వరీ! నీ వీజగములో నాకు మంగళములను బ్రసాదింపుము. సనాతనీ! నీవు సకలపుణ్యములకు బీజస్వరూపిణివి, పుణ్యస్వరూపిణివి. పుణ్యాశ్రయీ! పుణ్యాత్ములకు నీ వాలయస్వరూపిణివి, నాకు బుణ్యములను బ్రసాదింపుము. స్త్రీరత్నస్వరూపిణీ! రత్నగర్భా! నీవు రత్నసారవర ప్రదాయినివి. భూదేవీ! భూపాలకుల సర్వస్వము నీవే. నీవు భూపాలపరాయణవు, భూపాలుర యహంకారమునకు రూపము. వసుంధరా! నివసించుటకు నాకు భూమిని బ్రసాదింపుము.

నారదా! ఈమహాస్తోత్రము మహాపుణ్యప్రదము. పృథ్విని బూజించి యీస్తోత్రమును బఠించువా రనేకజన్మలపర్యంతము భూపాలు లగుసౌభాగ్యము నొందగలరు. వారికి భూదాన మొనరించిన పుణ్యము లభించును; దాన మొనరించి మరల బరిగ్రహించిన పాపమునుండి నిస్సంశయముగ వారు

విముక్తులు కాగలరు. అంబువాచీయోగములో భూమిని దవ్విన సంభవించు పాపమునుండియు, నన్యుల ప్రదేశములో వారి యనుజ్ఞ లేకుండ బావిని త్రవ్విన సంభవించు పాపమునుండియు, బరుల భూమి నపహరించిన పాపము నుండియు, భూమిపై వీర్యమును విడిచిన పాపమునుండియు, భూమిపై దీపమును స్థాపించిన పాపమునుండియు విముక్తులు కాగలరు. ఈస్తోత్రపాఠకులకు నిశ్చయముగ శతాశ్వమేధము లొనరించిన పుణ్యము లభించును.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని పృథివ్యుపాఖ్యానమున
పృథివీస్తోత్ర మను నెనిమిదవ
అధ్యాయము
సంపూర్ణము.

---

# తొమ్మిదవ అధ్యాయము

## పృథ్వీపట్ల శాస్త్రవిరుద్ధముగ వ్యవహరించిన లభించు నరకములవర్ణనము.

**నారదుడు పలికెను :**

మహానుభావా! పృథ్వీదానమొనరించిన నేయేపుణ్యములు లభించునో, పృథ్విని హరించిన, నితరులభూమిని హరించిన, అంబువాచీయోగమందు బృథ్వి నుపయోగించిన, భూమిపై వీర్యపాత మొనరించిన, దీపమునుంచిన నేయేపాపములు సంభవించునో వాని నన్నింటిని గృపతో వర్ణింపుము.

నే నడిగినవికాక ఇంకను పృథ్వీజన్యపాపము లేవైననున్న వానిని, వాని ప్రాయశ్చిత్తములను దయయుంచి వివరింపుము.

**శ్రీనారాయణఋషి పలికెను :**

మునీశ్వరా! ఈపవిత్రభారతవర్షములో పరిశుద్ధుడైన, పరమభక్తుడైన, త్రిసంధ్యాపూతుడైన సద్బ్రాహ్మణునకు భూదానమొనరించువారు, నిశ్చయముగ విష్ణుపరంధామమును నొందగలరు. సర్వసస్యాఢ్యమైనభూమిని బరమవైష్ణవభక్తునకు దానమొనరించిన యాభూమిలో నెన్ని రేణువులు కలవో యన్నిదివ్యసంవత్సరముల పర్యంతము దానమొనరించినవారు పరంధామమున వసింపగలరు. గ్రామములనుగాని, భూమినిగాని, ధాన్యములనుగాని, సత్పాత్రునకు దానమొనరించిన దాత ప్రతిగ్రహీత లిరువురు వైకుంఠము జేరగలరు. భూదాన మొనరింపుడని తమమిత్రులను బ్రోత్సాహపఱచిన వారికి గూడ వైకుంఠమున నివసించు సౌభాగ్యము లభింపగలదు.

నారదా! తాను దానమొనరించిన భూమినిగాని, యితరులు బ్రాహ్మణులకు దానమొనరించిన భూమినిగాని తిరిగి పరిగ్రహించిన యాతడు సూర్యచంద్రు లున్నంతవఱకు గాలసూత్ర మనునరకమున బడి దుఃఖముల ననుభవించును. అతడేగాక యాపాపమువలన నతని పుత్రపౌత్రులుకూడ ననేకకష్టముల ననుభవింపగలరు. వారుశ్రీహీనులై పుత్రహీనులై దరిద్రులై ఘోరరౌరవాది నరకముల ననుభవింపగలరు. గోచరభూమిని (పచ్చని పచ్చికబయళ్ళు) అన్యకార్యముల కుపయోగించువా రాపాపము వలన నొకనూఱు దైవవర్షముల పర్యంతము కుంభీపాక నరక మనుభవింపగలరు. గోవులు నివసించుచున్న స్థానమునుండి గోవులను బారదోలి యాగోష్ఠము నన్యవ్యవహారములకొఱకై యుపయోగించువారు సుదీర్ఘకాల మనేక ఘోరనరకముల ననుభవింపగలరు. కామాంధుడైనవ్యక్తి భూమిపై వీర్యపాత మొనరించిన నాభూమియం దెన్ని రేణువులు కలవో యన్నిసంవత్సరములపర్యంతము రౌరవాదినరకముల ననుభవింపగలరు. అంబువాచీయోగ సమయములో (సౌరమాసము ప్రకార మార్ద్రానక్షత్ర ప్రథమచరణములో బృథ్వి ఋతుమతి కాగలదు. ఆ సమయమునే అంబువాచీయోగమందురు.) భూమిని ద్రవ్వినవారలు నాల్గుయుగముల పర్యంతము క్రిమిదంష్ట్ర మనునరక మనుభవింపగలరు. మానవులు త్రాగునదీ కూపతటాకములనుగాని, గోవులు జలములను త్రాగు జలాశయములనుగాని పరిశుద్ధ మొనరించువారు భూమి రేణుప్రమాణవర్ష పర్యంతము బ్రహ్మలోకమున నివసింపగలరు.

దీపమును, శివలింగమును, భగవతీమూర్తిని, శంఖమును, దైవయంత్రమును, సాలగ్రామమును, సాలగ్రామమును బూజించిన పుష్పములను, జలములను, దులసీదళములను, జపమాలికను, భగవంతుని కర్పించిన పుష్పములను, గర్పూరమును, గోరోచనమును, జందనమును, రుద్రాక్షమాలలను, గుశములను, బవిత్రగ్రంథములను, యజ్ఞోపవీతమును నిర్లక్ష్యముగ భూమిపై జాఱవిడుచు మానవులు సుదీర్ఘకాలము నరకముల ననుభవింపగలరు. వారికి జన్మాంతరమున విప్రయోని లభింపదు, బ్రహ్మహత్యాపాతకము సంభవించును. గ్రంథియుక్తమైనయజ్ఞసూత్రమును గౌరవించుట, పూజించుట సర్వద్విజాతులకు నత్యంతావశ్యకము. యజ్ఞము లొనరించి యాప్రదేశమును క్షీరములతో బవిత్రమొనరింపనివారు సర్వజన్మములయందు దుఃఖముల ననుభవింపగలరు. భూకంపసమయములందు, గ్రహణసమయములందు భూమిని దవ్వినవారికి మహాపాపము సంభవింపగలదు. వారు మరుజన్మమునం దంగవిహీనులై జన్మింపగలరు.

భవనం యత్ర సర్వేషాం భూమి స్తేన ప్రకీర్తితా ।
వసు రత్నం యా దధాతి వసుధా చ వసున్ధరా ॥
హరే రూరౌ చ యా జాతా సా చోర్వీ పరికీర్తితా ।
ధరా ధరిత్రీ ధరణీ సర్వేషాం ధరణాత్తు యా ॥
ఇజ్యా చ యాగభరణాత్ క్షోణీ క్షీణా లయే చ యా ।
మహాలయే క్షయం యాతి క్షితి స్తేన ప్రకీర్తితా ॥
కాశ్యపీ కశ్యపస్యేయ మచలా స్థితిరూపతః ।
విశ్వమ్భరా తద్భరణా చ్చానన్తాఽనన్తరూపతః ॥
పృథ్వీయం పృథుకన్యాత్వా ద్విస్తృతత్వాన్మహీ మునే। (29-33)

సకలజీవరాశికి నునికిపట్టయి విరాజిల్లుకారణమున నీమెను భూమి యని కీర్తించిరి. ఈమెపై సర్వుల భవనములు నిర్మితములైనవి కావున నీమె నామధేయము భూమి యయ్యెను. సంపదలను బ్రసాదించుకారణమున నీమె వసుధ యనియు, రత్నములను బ్రసాదించిన కారణమున వసుంధర యనియు నీమెను గీర్తించిరి.

శ్రీహరియూరుప్రదేశమునుండి ప్రాదుర్భవించినకారణమున వసుంధరను భక్తజను లుర్వియని కీర్తించిరి. అంధతని ధరించినందువలన నీ దేవి ధర,

ధరిత్రి, ధరణి యను నామముల బ్రసిద్ధిగాంచెను. యాగద్రవ్యముల నన్నిం టిని బ్రసాదించుచు యాగములను రక్షించుచున్న కారణమున విద్వాంసు లీమెను 'ఇజ్యా' యనిరి. లయకాలమున క్షీణించుకారణమున నీమెను క్షోణి యనిరి. మహాప్రళయకాలమందు క్షయమై యదృశ్యయగు కారణమున నీమెను క్షితి యని కీర్తించిరి. కశ్యపప్రజాపతికి సంబంధించినది గావున నీమె కాశ్యపి యని గణుతికెక్కెను. దృఢస్థిరత్వముతో విరాజిల్లిన కారణమున నీమెను అచల యని కీర్తించిరి. విశ్వమును భరించియున్నది గావున నీమె నామధేయము విశ్వంభర యయ్యెను. అనేకవిధములైనరూప ములలో విశ్వములలో నుండుటవలన నీమెను అనంత యనిరి. పృథుచక్రవర్తి పాలించిన కారణమున నాయనకు బుత్రీసమురాలైన కారణమున నీమెను బృథ్వి యనిరి. మునీశ్వరా! విస్తృతరూపముతో విస్తరించియున్న కారణమున నీమెను మహియని కీర్తించిరి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని పృథివ్యుపాఖ్యాన
మను తొమ్మిదవ అధ్యాయము
సంపూర్ణము.

---

# పదియవ అధ్యాయము

## గంగాదేవ్యుపాఖ్యాన వర్ణనము.

**నారదుడు పలికెను :**

వేదవిదాంవరా! శ్రీమన్నారాయణ ఋషీంద్రా! నీయనన్యకరుణా కటాక్షములవలన బరమమనోహర మైనపృథ్వీమహోపాఖ్యానమును నేనుశ్రవణ మొనరించి ధన్యుడనైతిని. దేవా! కృపతో బవిత్రగంగాభవానీదివ్యచరిత మును వర్ణింపవలసినదిగ బ్రార్థించుచున్నాను. సురేశ్వరి, విష్ణుస్వరూపిణి,

విష్ణుపది మొదలగు దివ్యనామములచే సంకీత మైనగంగాభవాని సరస్వతీదేవి శాపానుసారముగ బవిత్రభారతవర్షములో నేయుగములో నెట్లవతరించెను? ఎవరి ప్రార్థనలనుమన్నించి యాదేవి దివినుండి భువికి దరలివచ్చెను? సకలపాపములను నశింపజేయగల పవిత్రము, పుణ్యప్రదము నగుగంగాదేవి దివ్యోపాఖ్యానమును సాంగోపాంగముగ వర్ణింపవలసినదిగ బ్రార్థించుచున్నాను.

## శ్రీనారాయణఋషి పలికెను:

నారదమునీంద్రా! పూర్వకాలమున, సూర్యవంశములో శ్రీసగరు డనుసమ్రాట్టుదయించెను ఆయనకు బరమసుందరీమణు లైనశైబ్య, వైదర్భి యను నిర్వురు భార్యలు కలరు. సగరచక్రవర్తి సత్యస్వరూపుడు, సత్యేష్టుడు, సత్యవాక్పరిపాలకుడు, సత్యభావనసంయుతుడు, సత్యధర్మవిచార జ్ఞుడు, సత్యయుగోద్భవుడైన క్షత్రియోత్తముడు. ఆయన భార్య యైనశైబ్య యందు గులవర్ధనుడగు నసమంజసుడను మనోహరపుత్రుని గనెను. ఆయన రెండవభార్య యైనవైదర్భి పుత్రసంతానము కోరి శంకరు నుపాసింపగా నామహా దేవుని కరుణవలన నామె గర్భమును ధరించి యొక బృహన్మాంసపిండమును బ్రసవించెను. మాంసపిండమును గాంచి యామె యత్యంత దుఃఖితయై మరల సదాశివుని ధ్యానింపగా హరుడు బ్రాహ్మణరూపధారియై సాక్షాత్కరించి యామె ననుగ్రహించి యాబృహత్ పిండము నఱువది వేలభాగములుగ విభజించెను. వానినుండి మహాబలపరాక్రమవంతులు గ్రీష్మకాలమధ్యాహ్నమార్తాండ ప్రభాయుక్తకళేబర సంపన్నులునగు నఱు వదివేలమంది యుదయించిరి. కొంతకాలము గడచిన పిదప సగరచక్రవర్తి యశ్వమేధయజ్ఞ మొనరింపగా నయ్యఱువదివేలమంది కుమారులు తండ్రి యజ్ఞాశ్వము నెవరో యపహరింప దానిని వెదకుచు బాతాళమునకు దారి చేసికొని పయనించి కపిలమహర్షి యాగ్రహమునకు గుఱియైభస్మ మైరి. తన కుమారుల మరణవార్త నాలకించి సగరచక్రవర్తి పరమదుఃఖితు డయ్యెను. తండ్రి యజ్ఞమును బరిపూర్ణ మొనరించుటకు సగరుని సత్పుత్రు డైనయసమంజసుడు కపిలమహర్షి ని బ్రార్థించి యాయన కృపకు బాత్రుడై యజ్ఞాశ్వమును సంపాదించి యశ్వమేధ యజ్ఞకార్యమును నిర్విఘ్నముగ సంపన్న మొనరించి చరితార్థుడయ్యెను. తదనంతరము పుత్రవియోగముచే విరక్తి నొంది సగరచక్రవర్తి సకలరాజ్యమును బరిత్యజించి తపమాచరించుటకు వన

మున కరిగెను. అసమంజసుడు తనయఱువదివేల సోదరుల యుత్తమగతుల కొఱకు గంగావతరణార్థమై తనజీవితాంతము ఘోరతప మాచరించి యసంపూర్ణ మనోరథముతో దేహత్యాగ మొనరించెను. ఆయన సత్పుత్రుడైన యంశుమంతుడు కూడ గంగావతరణార్థమై సుదీర్ఘతప మాచరించి దేహమును ద్యాగ మొనరించెను.

అంశుమంతుని కుమారుడే భగీరథుడు. భగీరథుడు మహాభాగవతోత్తముడు, ధీశాలి, అనన్యవిష్ణుభక్తుడు, సకలసద్గుణ సంపన్నుడు, అజరామరుడు. అతడు గంగావతరణముకొఱకై లక్ష సంవత్సరములు శ్రీకృష్ణపరమాత్మనుగుఱించి ఘోరతపమాచరించెను. శ్రీకృష్ణ పరమాత్మ భగీరథుడొనరించిన తపమున కత్యంత ప్రసన్నుడై యాతనియెదుట సాక్షాత్కరించెను. ఆసమయమున భగవానుని శ్రీవిగ్రహమునుండి యనంతకోటి సూర్యులప్రకాశమును మించిన దివ్యప్రభ యుద్భవించి సకలము నాచ్ఛాదిత మొనరించెను. ద్విభుజుడై నయాజగన్నాథుడు గోపవేషమును ధరించి కిశోరవయస్కుడై, హస్తములందు వేణువును ధరించినవాడై భక్తానుగ్రహకాతరుడై దివ్యసుందర సచ్చిదానంద విగ్రహుడై భగీరథుని యెదుట సాక్షాత్కరించెను. మునీశ్వరా! శ్రీకృష్ణపరమాత్మయే పరిపూర్ణ పరబ్రహ్మమని, స్వేచ్ఛామయుడని, పరంధాముడని, సకలలోకైకవిభుడని గ్రహింపుము. ఆసమయమున బ్రహ్మవిష్ణుశివాది సకలదేవతలు వినీతభావముతో నాపరబ్రహ్మము ననేకవిధముల స్తుతించిరి. మహర్షులు శిరములను వంచి యహంకారాదులను త్యజించి యనన్యభక్తితో నాదేవాదిదేవుని శరణు వేడిరి. శ్రీకృష్ణపరమాత్మ సదా నిర్లిప్తుడు, సర్వసాక్షి, నిర్గుణుడు, ప్రకృతికే యతీతుడు, భక్తానుగ్రహ నిరతుడు. ఆయన దివ్యపీతాంబరధారియై యనేక రత్నాభరణములను ధరించి చిఱునవ్వులు చిందులాడు నగుమోము కలవాడై భగీరథునకు దర్శనమిచ్చెను. ఆసచ్చిదానంద విగ్రహుని దివ్యమంగళస్వరూపమును గాంచి పరమభాగవతోత్తముడైనభగీరథుడు పులకితగాత్రుడై యశ్రుపూర్ణలోచనములతో నాదేవాదిదేవు ననేక విధముల స్తుతించి, యసంఖ్యాక ప్రణామముల నర్పించెను. తన పితరులను దరింపజేయవలసినదిగ అతడనేకవిధముల స్తుతించెను. నారదా! శ్రీకృష్ణుని సాక్షాత్కారమైనతక్షణమే భగీరథుని సకలాభీష్టములు సిద్ధించినవని గ్రహింపుము.

భగీరథుని గంగావతరణాభీష్టమును బరిపూర్ణ మొనరించుటకు దివ్య లీలాపరంధాముడు స్మరింపగనే సురేశ్వరి యైనగంగ భగవంతుని యెదుట సాక్షాత్కరించి ముకుళితహస్తయై పరమాత్మ కనేకప్రణామము లర్పించెను. పులకాంకిత విగ్రహయై దివ్యస్తోత్రములతో దన్ను స్తుతించుచున్న గంగను గాంచి శ్రీకృష్ణపరమాత్మ యిట్లు పలికెను.

## శ్రీకృష్ణభగవానుడు పలికెను :

సురేశ్వరీ! నీవు భారతీశాపమును సంపన్న మొనరించుటకు బవిత్రభారత వర్షముపై దివ్య గంగానదీమతల్లివై ప్రవహింపుము. నిన్ను స్పృశించి వీచు వాయుస్పర్శమాత్రముననే సగరుని పుత్రులు తరించి నాపరంధామము జేరి నాకుబార్షదులు కాగలరు, దేవీ! వారు నీస్పర్శచే నిశ్చయముగ తమ యసంఖ్యాక జన్మ సముపార్జిత పాపపుంజమునుండి విముక్తులు కాగలరు. గంగాదేవి వాయుస్పర్శమాత్రముననే మానవులు తమ జన్మజన్మల పాపములనుండి విముక్తులు కాగలరని శ్రుతులు నొక్కి వక్కాణించినవి. పవిత్ర గంగాజలములందు మౌసలస్నాన మాచరించినను మానవులు తా మొనరించిన యసంఖ్యాకజన్మ సముపార్జిత పాపములనుండి ముక్తి నొందగలరు. (మౌసలస్నానమనగ : గంగాదేవికి భక్తిభావముతో బ్రణామము లాచరించి యామె నారాధించి ఆమె పవిత్రజలములలో బ్రవేశించి యంగములను గదల్పక శాంతస్వభావముతో స్నాన మాచరించుట). పర్వములందు, విశేషపుణ్యతిథులందు, గంగాజలములలో స్నాన మాచరించిన దేహధారు లనంతఫలములను బొందగలరు. చంద్రగ్రహణ సమయమున గంగాస్నానమొనరించినవారి కఖండపుణ్యము ప్రాప్తించును. అట్లే సూర్యగ్రహణ సమయములో స్నానమాచరించిన వా రఖండఫలప్రాప్తి నొందగలరు. సూర్యోదయకాలమందు గంగాస్నానమొనరించుట పరమపుణ్యఫలప్రదాయకము. దేవి! నా యనన్యభక్తుల మాహాత్మ్యముల వర్ణించెద నవధరింపుము.

గురువక్త్రా ద్విష్ణుమన్త్రో యస్య కర్ణే విశే ద్వరః ।
జీవన్ముక్తం వైష్ణవం తం వేదా స్సర్వే వదన్తి చ ॥ (43)

ఎవరు సద్గురుముఖమునుండి దివ్యవిష్ణుమంత్రమును శ్రవణ మొనరించి

సదా పవిత్రులై మంత్రజప మొనరింతురో వారే పరమవైష్ణవులు, వారే జీవన్ముక్తులునని సర్వవేదములు ఘోషించుచున్నవి.

అట్టి మహాభక్తులవంశమున గడచిన నూఱుతరములవారు, జన్మింపబోవు నూఱుతరములవారు, తల్లివంశములో నూఱుతరములవారు, తల్లితల్లివంశములో నూఱుతరములవారు తరింపగలరు. వీరేగాక సహోదరీమణులు, సోదరులు, అత్తమామలు, ఆచార్యుడు, ఆచార్యపత్ని, ఆచార్యసుతులు, విద్య నొసంగిన గురువు, జ్ఞానప్రదాత, మిత్రులు, సహధర్మచారిణి, భృత్యులు, శిష్యులు మొదలగువా రందఱు నాపరమభక్తుని జన్మకారణమున దరింపగలరు. విష్ణుమంత్రగ్రహణమాత్రమున నరులు జీవన్ముక్తు లయ్యెదరు. నా యనన్య భక్తుల సంస్పర్శమాత్రముననే సకలతీర్థములు పవిత్రములు కాగలవు. వారి పద రజములవలన సకలవసుంధరాతలమే పునీతము కాగలదు. నా యనన్యభక్తుల పాదోదక మేప్రదేశములో ప్రవహించునో యాప్రదేశమే నిశ్చయముగ మహా తీర్థమని తెలిసికొనుము. గంగాభవానీ! నా కర్పింపని యన్నపానములు మల మూత్రసమములు, కావున నాయనన్యభక్తులు సదా నా కర్పించిన పదార్థములనే భుజింతురు. విష్ణువునకు నివేదించి నిత్యము భుజించు భక్తులస్పర్శము వలన సకలతీర్థములు పునీతములు కాగలవు. విష్ణుదేవుని పుణ్యప్రదపాదోదకము నెవరు నిత్యము స్వీకరింతురో వారిపాపపుంజము లన్నియు వైనతేయుని గాంచి పలాయనము చిత్తగించుసర్పములవలె దొలగిపోగలవు. అట్టివారిని దర్శించినమాత్రముననే భువనత్రయము పవిత్రము కాగలదు. సుదర్శనచక్రము నా భక్తులను సదా రక్షించుచుండును.

మద్గుణశ్రవణా ద్యే చ పులకాఙ్కితవిగ్రహాః ।
గద్గదాః సాశ్రునేత్రాశ్చ నరా స్తే వైష్ణవోత్తమాః ॥
పుత్రాదపి పరః స్నేహో మయి యేషాం నిరన్తరమ్ ।
గృహాద్యాశ్చ మయి న్యస్తా స్తే నరా వైష్ణవోత్తమాః ॥
ఆబ్రహ్మస్తమ్బ పర్యన్తం మత్తః సర్వం చరాచరమ్ ।
సర్వేషా మహ మేవేశ ఇతి జ్ఞా వైష్ణవోత్తమాః ॥
అసంఖ్యకోటిబ్రహ్మాణ్డం బ్రహ్మవిష్ణుశివాదయః ।
ప్రలయే మయి లీయన్తే చేతి జ్ఞా వైష్ణవోత్తమాః ॥
తేజస్స్వరూపం పరమం భక్తానుగ్రహవిగ్రహమ్ ।
స్వేచ్ఛామయం నిర్గుణం చ నిరీహం ప్రకృతేః పరమ్ ॥

సర్వే ప్రాకృతికా మత్త ఆవిర్భూతా స్తిరోహితాః ।
ఇతి జానన్తి యే దేవీ తే నరా వైష్ణవోత్తమాః ॥ (53_58)

దేవీ! నాదివ్యగుణశ్రవణమాత్రముననే పులకాంకితవిగ్రహు లై యెవరు నాదివ్యనామకీర్తన మొనరించుచు నయనముల నుండి యానందబాష్పములను బ్రవహింపజేసెదరో వారే వైష్ణవోత్తములని తెలిసికొనుము. ఎవరు నిరంతరము నన్ను దమ సంతానముకంటె హెచ్చుగ బ్రేమించెదరో, గృహస్థాశ్రమధర్మములో నున్నను విషయముల నంటక సదా నాసేవలందే సంలగ్నులై యుందురో యట్టినరులే వైష్ణవోత్తములు. బ్రహ్మ మొదలు కీటకపర్యంత మున్నసకలచరాచరప్రాణులు నానుండియే ప్రాదుర్భ వించి, నాయందే లయింపగలవని తెలసికొన్నవారే వైష్ణవోత్తములు. అనంతకోటిబ్రహ్మాండములు, బ్రహ్మవిష్ణుశివాది దేవతలు నానుండియే యావిర్భ వించి ప్రళయకాలములో నాయందే లీనమయ్యెదరని తెలిసికొనిన వారే వైష్ణవోత్తములు. నేనే తేజస్స్వరూపుడనని, పరమారాధ్యుడనని, భక్తాను గ్రహవిగ్రహుడనని, స్వేచ్ఛామయుడనని, ప్రాకృతికనిర్గుణుడనని, నిరీహుడనని ప్రకృతికే యతీతుడనని, సర్వప్రకృతులు నానుండియే యావిర్భవించి నాలోనే తిరోగమింపగలవని తెలిసికొన్నవారే వైష్ణవోత్తములు.

**శ్రీనారాయణఋషి పలికెను :**

ఇట్లు మధురవచనముల నుపదేశించి శ్రీకృష్ణపరమాత్మ మౌనము వహించెను. అపుడు త్రిపథగామిని యగుగంగాభవాని భక్తినమ్రాత్మకంధ రయై పరమాత్మతో నిట్లు పల్కెను.

**గంగాదేవి పలికెను :**

నాథా! సరస్వతీదేవి శాపమును సంపన్న మొనరించుటకు నీ యాజ్ఞను శిరసావహించి యీభగీరథుని ఘోరతపఃప్రభావమువలన నే నీసమయ మందే పవిత్రపుణ్యనదీరూపమున భారతవర్షమందు బ్రవహించెదను. కాని ప్రభూ! భూతలముపై గల పాపాత్ములు నాపవిత్రజలములలో స్నానము లాచరించుటవలన వారిఘోరపాపములు నాకు గలుగును. వానినుండి ముక్తి లభించునుపాయమునుపదేశింపవలసినదిగ బ్రార్థించుచున్నాను. హృదయేశ్వరా! కలియుగమున భారతవర్షములో నెంతకాలమువఱకు నామహిమలు పరిపూర్ణ

ముగ విరాజిల్లగలవు? మరల నెపుడు నేను దమదివ్యపరంధామము జేరగలను? ప్రభూ! నీవు సర్వాంతర్యామివి, సర్వజ్ఞుడవు. కావున నా మనోభీష్టములు సంపూర్ణమగుట కుపాయముల గృపతో నుపదేశింపవలసినదిగ బ్రార్థించుచున్నాను.

**శ్రీకృష్ణభగవానుడు పలికెను :**

సురేశ్వరీ! నాకు నీపవిత్రాంతఃకరణములో గలసకలాభీష్టములు విదితమే. దేవీ! నీ విక బవిత్రనదీస్వరూపిణివై భారతవర్షమందు బ్రవహింపుము. సాగరుడు మదంశసంభూతుడు, నీవు సాక్షాత్తు శ్రీమహాలక్ష్మీస్వరూపిణివి, నీ వాయనకు బ్రియపత్నివి కాగలవు. అన్యపుణ్యానదులలోని కెల్ల నీవే సాగరమునకు బ్రియపట్టమహిషివి కాగలవు. భారతీదేవి శాపవశమున నీ వవనిపై గలియుగాంతమువఱకు దివ్యనదీరూపమున విరాజిల్లగలవు. పవిత్రభారతవర్షములోని సకలజనులు ని న్ననన్యభక్తితో భగీరథప్రణీతస్తోత్ర ద్వారమున స్తుతించి యారాధింతురు. కణ్వశాఖయందు నిర్దేశింపబడిన విధమున మానవులు నిన్ను ధ్యానించి పూజించి యవలీలగ భవసాగరమును తరింపగలరు.

> యః స్తౌతి ప్రణమే న్నిత్యం సోఽశ్వమేధఫలం లభేత్ ।
> గఙ్గా గఙ్గేతి యో బ్రూయా ద్యోజనానాం శతై రపి ।
> ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం స గచ్ఛతి॥ (71)

నిన్ను నిత్యము భక్తిభావముతో స్తుతించి ప్రణామము లర్పించు వారి కశ్వమేధయజ్ఞఫలము సులభముగ లభింపగలదు. ఎంతదూరమునుండియైన గంగా! గంగా! యనుచు నీనామము నుచ్చరించిస్నాన మాచరించిన మానవుడు తనసమస్తపాపములనుండి విముక్తుడై విష్ణులోకము జేరగలడు.

దేవీ! అసంఖ్యాకులైనపాపులు నీపవిత్రజలములలో స్నానమొనరించి నీకు సంక్రమింపజేసిన ఘోరాతిఘోరపాపములు, వేనవేలు పాపులశవముల స్పర్శచే నీకు సంభవించు ఘోరపాతకములు నాయనన్యభక్తుల దర్శనస్పర్శనాదులవలన నిశ్చయముగ నశింపగలవు. సరస్వతీ ప్రముఖ పుణ్యానదులు నీ కుపనదులై ప్రవహింపగలవు.

> యత్ర యత్ర భవే ద్గఙ్గే మన్నామగుణకీర్తనమ్ ।
> తత్రైవ త్వ మధిష్ఠానం కరిష్య స్యఘమోచనాత్ ॥ (74)

గంగా! ఏయేప్రదేశములలో నాదివ్యగుణనామసంకీర్తనము మార్మోగు చుండునో ఆయా ప్రదేశములలో (పాపులవలన సంక్రమించిన పాపములను ప్రక్షాళన మొనరించుకొనుటకు) నీవు విరాజిల్లగలవు.

నీరజఃకణస్పర్శమాత్రముననే మహాపాతకులుగూడ బవిత్రులు కాగలరు. ఆరజఃకణము లెన్నియుండునో యన్నిసంవత్సరముల పర్యంతము వారు నిశ్చయముగ దేవలోకవాసులు కాగలరు. భక్తిజ్ఞానసమన్వితులై నాదివ్యగుణ నామములను గీర్తించుచు నీలో స్నాన మాచరించువారు దేహములను త్యజించిన పిదప నిశ్చయముగ శ్రీహరిపదము జేరగలరు. వారచట పార్ష దప్రవరులై యసంఖ్యాక ప్రళయములను దర్శింపగలరు. దేవీ! దివ్యజ్ఞాన సంపన్నులై, నా దివ్యనామమును స్మరించుచు నీతటముపై దేహత్యాగ మొన రించువారు నాపరంధామము జేరి మదీయపార్షదులై యనంతకాలము నివసింప గలరు. మృతవ్యక్తుల శరీరములు పూర్వజన్మపుణ్యావశముచే నీజలములందు బడగలవు. ఎంతకాలము వారియస్థికలు నీయం దుండగలవో యంతకాలము వఱ కాజీవులు వైకుంఠమందు విరాజిల్లగలరు. అజ్ఞానియైనను నీజలముల స్పృశించి దేహత్యాగ మొనరించిన నతడు నాయనుగ్రహమునకు బాత్రుడై సాలోక్యపదమును బొందగలడు. మరణకాలమందు నీదివ్యనామములను జపించి యన్యప్రదేశములలో మరణించిన వారైనను నాపరంధామము జేరి బ్రహ్మాయుఃపర్యంతము నివసింపగలరు.

**శ్రీనారాయణఋషి పలికెను :**

మునీశ్వరా! ఇట్లు శ్రీహరి గంగ కుపదేశ మొనరించి, గంగాదేవిని బూజించి ధ్యానింపవలసినదిగ భగీరథు నాదేశించి యంతర్హితు డయ్యెను. భగీరథుడు భగవంతుని యాజ్ఞనుసారముగ కౌథుమీశాఖోక్తస్తోత్రముచే గంగాదేవిని స్తుతించి యనేకవిధముల నారాధించి కృతకృత్యుడయ్యెను.

**నారదుడు పలికెను :**

వేదజ్ఞులందు శ్రేష్ఠుడా! ఏపూజావిధానముతో భగీరథుడు గంగాదేవిని బూజించెనో, యేవిధముగ నామెను ధ్యానించెనో, యేస్తోత్రముతో నామెను స్తుతించెనో నాకు సవిస్తరముగ నుపదేశింపుడని ప్రార్థించుచున్నాను.

## శ్రీనారాయణఋషి పలికెను :

నారదా! రాజ గుభగీరథుడు నిత్యనైమిత్తికక్రియలను బరిపూర్ణ మొనర్చి స్నానమాచరించి, పాదప్రక్షాళన మొనరించుకొని, పరిశుద్ధుడై, స్వచ్ఛవస్త్రములు ధరించి, యింద్రియములను వశమం దుంచుకొని, ప్రప్రథమమున శ్రీగణేశ్వరుని, సూర్యభగవానుని, అగ్నిదేవుని, విష్ణుమూర్తిని, శంకరుని, పార్వతీ దేవిని బూజించెను. ఈయార్గురు దేవతలను బూజించిన పిదపనే ఆయన గంగాదేవిపూజ కధికారియయ్యెను.

గణేశం విఘ్ననాశాయ నిష్పాపాయ దివాకరమ్ ।
వహ్నిం స్వశుద్ధయే విష్ణుం ముక్తయే పూజయే న్నరః ॥
శివం జ్ఞానాయ జ్ఞానేశం శివాం బుద్ధివివృద్ధయే ।
సమ్పూజ్యైతల్లభే త్ప్రాజ్ఞో విపరీత మతోఽన్యథా ॥ (94, 95)

"విఘ్నములను నివారించుటకొఱకు గణేశ్వరుని, పాపరహితుడు, నారోగ్యవంతుడునగుటకు సూర్యభగవానుని, పవిత్రత కొఱకు నగ్నిదేవుని, ముక్తికొఱకు మహావిష్ణువును, జ్ఞానప్రాప్తికి జ్ఞానేశ్వరుడైనశివుని, సద్బుద్ధికొఱకు బార్వతిని ప్రథమమున నారాధించి ప్రాజ్ఞు లఖండఫలములను బొందగలరు. ఇందులకు విపరీతముగ వ్యవహరింపరాదు".

నారదా! కౌథుమీశాఖోక్తము సర్వపాపప్రణాశమునగుభగీరథు డొనరించిన గంగాభవానీ దివ్యధ్యానమును వర్ణించెద సావధానచిత్తుడవై యాకర్ణింపుము.

### గంగా ధ్యానము

శ్వేతచమ్పకవర్ణాభాం గఙ్గాం పాపప్రణాశినీమ్ ।
కృష్ణవిగ్రహసమ్భూతాం కృష్ణతుల్యాం వరాం సతీమ్॥
వహ్నిశుద్ధాంశుకాధానాం రత్నభూషణభూషితామ్ ।
శరత్పూర్ణేన్దుశతకప్రభాజుష్టకలేవరామ్ ॥
ఈషద్ధాస్యప్రసన్నాస్యాం శశ్వత్సుస్థిరయౌవనామ్ ।
నారాయణప్రియాం శాన్తాం సత్సౌభాగ్యసమన్వితామ్ ॥
బిభ్రతీం కబరీభారాం మాలతీమాల్యసంయుతామ్ ।
సిన్దూరబిన్దులలితాం సార్ధం చన్దనబిందుభిః ॥
కస్తూరీపత్రికం గణ్డే నానాచిత్రసమన్వితమ్ ।
పక్వబిమ్బసమానై కచార్వోష్ఠపటు ముత్తమమ్ ॥

ముక్తాపంక్తి ప్రభాజుష్టదన్తపంక్తి మనోహరామ్ ।
సుచారువక్త్రనయనాం సకటాక్షమనోరమామ్ ॥
కఠినం శ్రీఫలాకారం స్తనయుగ్మం చ బిభ్రతీమ్ ।
బృహచ్ఛ్రోణీం సుకఠినాం రమ్భాస్తమ్భవినిన్దితామ్ ॥
స్థలపద్మప్రభాజుష్టపాదపద్మయుగం ధరామ్ ।
రత్నాభరణసంయుక్తం కుఙ్కుమాక్తం సయావకమ్ ॥
దేవేన్ద్రమౌలిమన్దారమకరన్దకణారుణామ్ ।
సురసిద్ధమునీన్ద్రాదిదత్తార్ఘ్యైః సంయుతం సదా ॥

తపస్విమౌలినికరభ్రమరశ్రేణిసంయుతమ్ ।
ముక్తిప్రదం ముముక్షూణాం కామినాం స్వర్గభోగదమ్ ॥
వరాం వరేణ్యాం వరదాం భక్తానుగ్రహవిగ్రహామ్ ।
శ్రీవిష్ణోః పదదాత్రీం చ భజే విష్ణుపదీం సతీమ్ ॥ (97-107)

శ్వేతచంపకమువంటి స్వచ్ఛమైనవర్ణముగలదియు, సర్వపాపములను, నశింపజేయునదియు, శ్రీకృష్ణవిగ్రహసంజాతయు, శ్రీకృష్ణతుల్యయు, పరమసాధ్వియు, వహ్నిశుద్ధము లగువస్త్రములను ధరించినదియు, రత్నమయాభూషణములచే నలంకృతయు, వందలకొలది శరత్పూర్ణిమాచంద్రుల కాంతివంటికాంతితోఁగూడిన శరీరముగలదియు, చిరునవ్వుచేవిరాజిల్లు మోము గలదియు, నిత్యసుస్థిరయౌవనయు, నారాయణప్రియయు, శాంతస్వరూపిణియు, నుత్తమసౌభాగ్యముతోఁగూడినదియు, మాలతీమాలచేత నలంకృత మైనకబరీభారమును ధరించినదియు, చందనబిందువులచేత, సిందూరబిందువులచేతనలంకరింపబడినలలాటముకలదియు, నానాచిత్రసమన్వితకస్తూరీపత్రకములచేనలంకరింపబడిన కపోలములుగలదియు, పండినదొండపండువలెసుందరము నుత్తమమునగు నధరోష్ఠముగలదియు, ముత్యాలవరుసయొక్క కాంతితోఁగూడిన మనోహరమగు పలువరుసగలదియు, సుందరము లగుకటాక్షములతోఁగూడిన నయనములుగలదియు, కఠినములు, శ్రీఫలాకారములు నగుస్తనములుగలదియు, విశాలశ్రోణి గలదియు, కదళీస్తంభములను దిరస్కరించు నూరువులుగలదియు, స్థలపద్మప్రభతోఁగూడినవియు, రత్నాభరణములచే నలంకరింపబడినవియు, దేవేంద్రమకుటమందారపుష్పరజఃకణసమన్వితములు, సురసిద్ధమునీంద్రులచే నీయబడిన నర్ఘ్యములుగలవియు, తాపసులముకుటములయందుగల భ్రమరపంక్తులచే శోభిల్లునవియు, ముముక్షువులకు ముక్తినిచ్చునట్టివియు, కాముకులగోర్కెలను దీర్ప

గలవియునగుచరణకమలములుగలదియు, వరములనిచ్చుటలో సామర్థ్యముగల దియు, భక్తానుగ్రహావిగ్రహాయు, విష్ణులోకమును బ్రసాదించునదియు, విష్ణు పదియను నామముచే విఖ్యాతిచెందినదియు, పరమసాధ్వియు నగుగంగాదేవిని నుపాసించెదను.

నారదా! ఈవిధముగ ధ్యానించి సకలకళ్యాణప్రదాయిని త్రిపథగామిని యగుగంగను షోడశోపచారముల నర్పించి పూజింపవలెను. తదనంతరము హస్తములను ముకుళించి కౌథుమీశాఖయందు శ్రీమహావిష్ణువు బ్రహ్మదేవున కుపదేశించిన మంత్రమును జపించి స్తోత్రమును బఠింపవలెను. ఆగంగాదేవి దివ్యమంత్రమును, విష్ణుప్రదత్తస్తోత్రమును బ్రథమమున విధాత శ్రీమహా విష్ణువు నర్థించి యెట్లుపదేశము పొందెనో వివరించెద నవధరింపుము.

## బ్రహ్మదేవుడు పలికెను:

దేవేశ్వరా! లక్ష్మీకాంతా! ప్రభూ! నీ కనేకానేక నమస్కారములు. సకలపుణ్యప్రదము, పాపహరము నైనగంగాదేవిమంత్రమును, విష్ణుపదీస్తోత్ర మును నా కుపదేశ మొనరింప బ్రార్థించుచున్నాను.

## శ్రీమహావిష్ణువు పలికెను :

బ్రహ్మదేవా! "ఓం నమో గఙ్గాయై" ఇదియే గంగాభవాని దివ్య మంత్రము. విష్ణుపదీస్తోత్రము నుపదేశించెద సావధానుడవై యవధ రింపుము.

## విష్ణుపదీ స్తోత్రము

శివసఙ్గీతసంముగ్ధశ్రీకృష్ణాంగద్రవోద్భవామ్ ।
రాధాంగద్రవసమ్భూతాం తాం గంగాం ప్రణమా మ్యహమ్ ॥

యా జన్మసృష్టే రాదౌ చ గోలోకే రాసమణ్డలే ।
సంనిధానే శంకరస్య తాం గంగాం ప్రణమా మ్యహమ్ ॥

గోపై ర్గోపీభి రాకీర్ణే శుభే రాధామహోత్సవే ।
కార్తికీపూర్ణిమాజాతాం తాం గంగాం ప్రణమా మ్యహమ్ ॥

కోటియోజనవిస్తీర్ణా దైర్ఘ్యే లక్షగుణా తతః ।
సమావృతా యా గోలోకం తాం గంగాం ప్రణమా మ్యహమ్ ॥

షష్ఠిలక్షైర్యోజనైర్యా తతో దైర్ఘ్యే చతుర్గుణా ।
సమావృతా యా వైకుణ్ఠం తాం గంగాం ప్రణమామ్యహమ్॥

వింశలక్షైర్యోజనైర్యా తతో దైర్ఘ్యే చతుర్గుణా ।
ఆవృతా బ్రహ్మలోకం యా తాం గంగాం ప్రణమామ్యహమ్॥

త్రింశల్లక్షైర్యోజనైర్యా దైర్ఘ్యే పంచగుణా తతః ।
ఆవృతా శివలోకం యా తాం గంగాం ప్రణమామ్యహమ్ ॥

షడ్యోజనవిస్తీర్ణా దైర్ఘ్యే దశగుణా తతః ।
మన్దాకినీ యేన్ద్రలోకే తాం గంగాం ప్రణమామ్యహమ్ ॥

లక్షయోజనవిస్తీర్ణా దైర్ఘ్యే సప్తగుణా తతః ।
ఆవృతా ధ్రువలోకం యా తాం గంగాం ప్రణమామ్యహమ్॥

లక్షయోజనవిస్తీర్ణా దైర్ఘ్యే షడ్గుణితా తతః ।
ఆవృతా చన్ద్రలోకం యా తాం గంగాం ప్రణమామ్యహమ్॥

యోజనైః షష్ఠిసాహస్రైః దైర్ఘ్యే దశగుణా తతః
ఆవృతా సూర్యలోకం యా తాం గంగాం ప్రణమామ్యహమ్॥

లక్షయోజనవిస్తీర్ణా దైర్ఘ్యే షడ్గుణితా తతః ।
ఆవృతా సత్యలోకం యా తాం గంగాంప్రణమామ్యహమ్ ॥

దశలక్షైః యోజనైర్యా దైర్ఘ్యే పంచగుణా తతః ।
ఆవృతా యా తపోలోకం తాం గంగాం ప్రణమామ్యహమ్॥

సహస్ర యోజనా యా చ దైర్ఘ్యే సప్తగుణా తతః ।
ఆవృతా జనలోకం యా తాం గంగాం ప్రణమామ్యహమ్ ॥

సహస్రయోజనాయా చ దైర్ఘ్యే సప్తగుణా తతః ।
ఆవృతా యా చ కైలాసం తాం గంగాం ప్రణమామ్యహమ్

పాతాలే యా భోగవతీ విస్తీర్ణా దశయోజనా ।
తతో దశగుణా దైర్ఘ్యే తాం గంగాం ప్రణమామ్యహమ్ ॥

క్రోశైకమాత్రవిస్తీర్ణా తతః క్షీణా న కుత్రచిత్ ।
క్షితౌ చాలకనన్దా యా తాం గంగాం ప్రణమామ్యహమ్ ॥

సత్యే యా క్షీరవర్ణా చ త్రేతాయా మినుసన్నిభా।
ద్వాపరే చన్దనాభా చ తాం గంగాం ప్రణమామ్యహమ్ ॥

జలప్రభా కలౌ యా చ నాన్యత్ర పృథివీతలే ।
స్వర్గే చ నిత్యం క్షీరాభా తాం గంగాం ప్రణమామ్యహమ్ ॥

యస్యాః ప్రభావ అతులః పురాణే చ శ్రుతౌ శ్రుతః ।
యా పుణ్యదా పాపహర్త్రీ తాం గంగాం ప్రణమా మ్యహమ్॥
యత్తోయకణికాస్పర్శః పాపినాం చ పితామహ ।
బ్రహ్మహత్యాదికం పాపం కోటిజన్మార్జితం దహేత్ ॥
ఇత్యేవం కథితం బ్రహ్మగఙ్గాపద్యైకవింశతిమ్ ।
స్తోత్రరూపం చ పరమం పాపఘ్నం పుణ్యబీజకమ్ ॥
నిత్యం యో హి పఠే ద్భక్త్యా సమ్పూజ్య చ సురేశ్వరీమ్ ।
అశ్వమేధ ఫలం నిత్యం లభతే నాత్ర సంశయః ॥
అపుత్రో లభతే పుత్రం భార్యాహీనో లభే త్ప్రియామ్ ।
రోగాన్ముచ్యేత రోగీచ బద్ధో ముచ్యేత బన్ధనాత్ ॥
అస్పష్టకీర్తిః సుయశా మూర్ఖో భవతి పణ్డితః ।
యః పఠే త్ప్రాత రుత్థాయ గఙ్గాస్తోత్ర మిదం శుభమ్ ॥
శుభం భవేత్తు దుఃస్వప్నం గఙ్గాస్నానఫలం భవేత్। (114-138)

శివసంగీతముచే ముగ్ధుడైన శ్రీకృష్ణుని యవయవములనుండి యుద్భవించినదియు, రాధాంగద్రవసంభూతయు, సృష్ట్యాదిలోనే గోలోకమున రాసమండల మధ్యమున శంకరుని సమక్షములో నావిర్భవించినదియు, సకలగోపగోపికలు కార్తికపూర్ణిమాదినమున గావించు రాధామహోత్సవ సమయమున నావిర్భవించినదియు, కోటియోజనముల విస్తీర్ణము కలిగి యంతకంటె లక్షరెట్లు విస్తృతయై గోలోకము నావరించి ప్రవహించు నదియు, అఱువదిలక్షలయోజనముల విస్తీర్ణము కలిగి యంతకంటె నాల్గురెట్లు పొడవై వైకుంఠమందు బ్రవహించునదియు, ఇరువదిలక్షల యోజనముల విస్తీర్ణము కల్గి యంతకంటె నాల్గురెట్లు పొడవై బ్రహ్మలోకము నావరించి ప్రవహించు నదియు, ముప్పదిలక్షలయోజనముల విస్తీర్ణము కల్గి యంతకంటె నైదురెట్లు పొడవై శివలోకము నావరించి ప్రవహించు నదియు, ఆఱుయోజనములు బాగుగ విస్తరించి యంతకంటె పదిరెట్లు విస్తృతయై యింద్రలోకములో బ్రవహించు నదియు, లక్షయోజనముల విస్తీర్ణము కల్గి యంతకంటె నేడురెట్లు పొడవై ధ్రువలోకము నావరించి ప్రవహించునదియు, లక్షయోజనముల విస్తీర్ణము కల్గి యంతకంటె నాఱురెట్లు విస్తృతయైచంద్రలోకము నావరించి ప్రవహించు నదియు, అఱువదివేలయోజనముల విస్తీర్ణము కలిగి యంతకంటె బదిరెట్లు పొడవై సూర్యలోకము నావరించి ప్రవ

హించు నదియు, లక్షయోజనముల విస్తీర్ణము కల్గి యంతకంటె నాలు రెట్లు పొడవై సత్యలోకము నావరించి ప్రవహించు నదియు, పదిలక్షలయోజనముల విస్తీర్ణము కలిగి యంతకు బదిరెట్లు పొడవై తపోలోకము నావరించి ప్రవహించు నదియు, వేయి యోజనముల విస్తీర్ణము కల్గి యంతకు నేడురెట్లు పొడవై జనలోకము నావహించి ప్రవహించు నదియు, వేయియోజనముల విస్తీర్ణము కల్గి యంతకు నేడురెట్లు పొడవై కైలాసము నావరించి ప్రవహించు నదియు, పదియోజనముల విస్తీర్ణము కల్గి యంతకు బది రెట్లు పొడవై భోగవతి యనునామముతో పాతాళలోకములలో బ్రవహించు నదియు, ఒకయోజన విస్తీర్ణము కలిగి క్షితిపై బ్రవహించు నదియు, సత్యయుగములో క్షీరవర్ణయుతో, త్రేతాయుగములో జంద్రకాంతితో బ్రకాశించునదియు, ద్వాపరములో జందనవర్ణముతో భాసించునదియు, కలియుగములో బృథ్వీపై జలప్రభతో బ్రకాశించుచు నన్య ప్రదేశములందు గూడ జలవర్ణముతో శోభిల్లుచు, స్వర్గములందు నిత్యము క్షీర వర్ణముతో బ్రవహించునదియు నగుగంగానదిప్రభావము లనంతములని, యతు ల్యములనిపురాణములు శ్రుతులుకీర్తించుచున్నవి. పుణ్యప్రదాయిని, పాపహారిణి యగుగంగాభవాని కివే నా ప్రణామములు. పితామహా! ఈగంగాభవాని జల కణమునైన స్పృశించిన పాపాత్ములు తమ కోటానుకోట్ల జన్మార్జితబ్రహ్మ హత్యాది పాపములనుండి విముక్తులు కాగలరు. బ్రహ్మదేవా! ఇట్లు నేను బ్రవచించిన యిరువదియొక్క శ్లోకములలోనున్న యీదివ్యస్తోత్రము పరమ పాపఘ్నము, పుణ్యబీజము నని గ్రహింపుము.

నిత్య మనన్యభక్తితో నీవిష్ణుపదీస్తోత్రమును బఠించి సురేశ్వరి యైన గంగాభవానిని బాగుగ బూజించువారికి నిస్సంశయముగ నిత్య మశ్వమేధ యజ్ఞఫలము ప్రాప్తించును. ఈస్తోత్రమును బఠించిన నపుత్రులకు బుత్రులు, భార్యాహీనులకు బతివ్రతలగుభార్యలు, రోగగ్రస్తులకునారోగ్యము, బంధితులకు బంధవిముక్తి, అస్పష్టకీర్తియుక్తులకు సుయశము, మూర్ఖులకు బాండిత్యము లభింపగలవు. ప్రాతఃకాలముననే లేచి శుభప్రద మైనయీగంగాస్తోత్రమును బఠించువారికి సర్వశుభములు కల్గును, దుఃస్వప్నములు సుస్వప్నములుగ మాఱగలవు. గంగాస్నానఫలము లభింపగలదు.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! శ్రీకృష్ణపరమాత్మాదేశానుసారముగ భగీరథుడు గంగాదేవి ననేక విధములనారాధించి యామె దివ్యమంత్రమును జపించి విష్ణుప్రదత్తమైనవిష్ణుపదీ స్తోత్రముతో స్తుతించెను. గంగాభవాని భగీరథునియారాధనలకు బ్రసన్నురాలై తదభీష్టానుసారముగ దివినుండి భువికి బ్రవహించెను. ఆత్రిపథగాస్పర్శము లభింపగనే సగరునియఱువదివేలమంది మృతపుత్రులు నుత్తమగతులను బొందిరి. భగీరథు నకుంఠ ప్రయత్నమువలననే సురలోకములందు విహరించు మందాకిని వసుంధరపై బ్రవహించి యావత్ప్రపంచమును బునీతమొనరించెను. అందు వలననే భక్తులు గంగాభవానిని భాగీరథి యని కీర్తించిరి. నారదా! ఈయుపాఖ్యాన మత్యంతపుణ్యప్రదము, మోక్షసాధకము.

**నారదుడు పలికెను :**

సదాశివుని దివ్యసంగీతమాధుర్యముచే నత్యంత ప్రసన్నులై శ్రీరాధాకృష్ణులు ద్రవీభావము నొందిరని వినియున్నాను. దేవా! సకలజగత్కారకులైనవారు ద్రవీభావము జెందగా గోలోకపరంధామములో నేయేసంఘటనలు సంభవించినవో, ఆ పవిత్రచరితమును సవిస్తరముగ వర్ణింప బ్రార్థించు చున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను:**

బ్రహ్మనందనా! ఈయపూర్వసంఘటన మత్యంత ప్రాచీనమైనది. ఒకానొక కార్తికపూర్ణిమాపర్వదినమున దివ్యగోలోకపరంధామములో శ్రీరాధా మహోత్సవము జరుగుచుండగా శ్రీకృష్ణుడే స్వయముగ శ్రీరాధాదేవిని యథావిధి పూజించి యామెతో రాసమండల మధ్యమున విరాజమానుడయ్యెను. తదనంతరము మహర్షులు, సకలదేవతలు, మనువులు మొదలగువారందఱు శ్రీకృష్ణపూజిత యైనరాధను, శ్రీకృష్ణపరమాత్మను బూజించి ధన్యులైరి. ఆసకలదేవతా సభామధ్యమున శ్రీకృష్ణభక్తితో బులకితయై సరస్వతి వీణను ధరించి మీటుచు దివ్యసంగీతము నాలాపించెను. ఆమె సంగీతమాధుర్యమునకు శ్రీరాధాకృష్ణులతోపాటు సకలసభాసదులు బహు ప్రసన్నులైరి.

అపుడు బ్రహ్మ సరస్వతీసంగీతమున కత్యంత ప్రసన్నుఁడై యామెను సర్వోత్తమ రత్నహారముతో సత్కరించెను. శివు డామె కఖిలబ్రహ్మాండమందు నత్యంత దుర్లభమైనదివ్యమణిని, శ్రీకృష్ణపరమాత్మ శ్రేష్ఠమైన కౌస్తుభమణిని, శ్రీరాధాదేవి రత్ననిర్మితమైనయొకయనుపమహారమును, నారాయణుఁడు సుందరదివ్యపుష్పమాలను, శ్రీమహాలక్ష్మి యమూల్యరత్నకుండలములను సరస్వతీదేవికి నుపహారములుగ నర్పించిరి. విష్ణుమాయ, ఈశ్వరి, దుర్గ, నారాయణి, యీశానయను దివ్యనామములతో విఖ్యాతమైన పార్వతీదేవి సరస్వతీదేవి యంతఃకరణములో బరమదుర్లభమైనపరమాత్మానన్యభక్తిని ప్రకటిత మొనరించెను. ధర్మదేవుడు సరస్వతీదేవియందు ధార్మికబుద్ధిని బెంపొందించి జగములో నామెకీర్తిని విస్తృత మొనరించెను. అగ్నిదేవుడు చిన్మయ వస్త్రములను, పవనుడు మణిమయనూపురములను సంప్రీతితో నామె కర్పించిరి.

తదనంతరము సదాశివుడు విధాతృప్రేరితుఁడై, యనన్యభక్తిసమన్వితుఁడై, పులకితగాత్రుఁడై, యానందాశ్రుపూర్ణనయనుఁడై యత్యంతరసోల్లాసభరిత శబ్దములతో దివ్యహరినామ సంకీర్తన మొనరింప నారంభించెను. ఆదివ్యగానము నాలకించి దేవతలు, మహర్షులు మొదలగువారందఱు దివ్యానుభూతితో వివశులైరి. వారు స్మృతినొందిన మఱుక్షణమే సకలరాసమండలము, గోలోకము దివ్యజలాప్లావితమగుట దర్శించిరి. శ్రీరాధాకృష్ణులు వారికి గోచరింపరైరి. అపుడు గోపగోపికలు, దేవతలు మొదలగువారందఱు తమ యారాధ్యదైవములను గానక యత్యంతదుఃఖితులై యుచ్చైస్స్వరములతో విలపింప దొడంగిరి. ఆసకలదేవతా సభామధ్యములో విరాజమానుడై యున్న జగద్విధాత యగుబ్రహ్మ ధ్యానము ద్వారమున శ్రీకృష్ణపరమాత్మ పవిత్రవిచారము తెలిసికొనగలైను. శ్రీరాధాకృష్ణులే శంకరుని దివ్యసంగీతమాధుర్యమునకు ద్రవీభూతులై దివ్యజలములుగ నఖండ గోలోకపరంధామమందు బ్రవహించిరని విధాత గ్రహింపగల్గెను.

అపుడు బ్రహ్మసహితముగ సకలదేవతలు "విభూ! మీసచ్చిదానంద విగ్రహములను మతల దర్శించుటయే మాయేకైకాభీష్టము, శ్రీరాధాసహితముగ దివ్యసందర్శనమును బ్రసాదింపు"మని శ్రీకృష్ణపరమాత్మ ననేకవిధముల

స్తుతించిరి. అపుడు వారల నశరీరవాణి యిట్లాదేశించెను. "నేనే సర్వాత్మనైన శ్రీకృష్ణభగవానుడను. నా స్వరూపశక్తియే శ్రీరాధ. మేమిర్వురము కేవలము భక్తుల ననుగ్రహించుటకే యీజలమయస్వరూపమును ధరించినాము. సురేశ్వరులారా! మాదివ్యసందర్శన మెంతటివారికైన నత్యంత దుర్లభము. మనువులైనను, మహర్షులైనను, దేవతలైనను, దేవేశ్వరులైనను, మానవులైనను నాదివ్యమంత్రోపాసన మొనరించి నాయఖండదివ్యగుణనామ సంకీర్తనముచే బవిత్రులై పరమవైష్ణవులైన యనంతరమే నాపరంధామము జేరి మమ్ము సందర్శింపగలరు. కావున మీరు మాసచ్చిదానంద విగ్రహములను సందర్శింపదలచిన నఖండభక్తియోగమున బ్రయత్నించి సఫలీకృతులగుడు.

జగద్గురూ! బ్రహ్మదేవా! నీవు విధాతవు. వేదముల కంగభూతము, పరమమనోహరము నగువిశిష్టశాస్త్రమును అనగా తంత్రశాస్త్రమును నిర్మింపవలసినదిగా నీవు శంకరునితో జెప్పుము. దానిలో సర్వాభీష్టఫలముల నిచ్చు నెన్నియో యపూర్వమంత్రము లుండవలెను. స్తోత్రములు, ధ్యానములు, పూజావిధులు, మంత్రములు, కవచములు మున్నగువానితో నాతంత్రశాస్త్రము సంపన్నము కావలెను. నామంత్రమును, కవచమును నిర్మించి నీవు వానిని బ్రయత్నపూర్వకముగ గుప్తముగ నుంచవలెను. వానిని నావిముఖుల కుపదేశింపరాదు. నాయనన్యభక్తి సమన్వితులైనవారే నామంత్రోపాసన కర్హులు. విశ్వాసము లేనిదే, యంతరంగములోభక్తియంకురింపనిదే నామంత్రజప మఖండఫలములను బ్రసాదింపలేదు. అట్టి మహాశాస్త్రనిర్మాణ మొనరింతునని సదాశివుడు సుధృఢప్రతిజ్ఞ యొనరించిన మేము మీకు మాదివ్యదర్శన మొసంగగలము".

శ్రీకృష్ణపరమాత్మ గావించిన యాదేశము నశరీరవాణివలన నాలకించి బ్రహ్మ యత్యంతప్రసన్నుడై శంకరునితో నావిషయమును బ్రస్తావించెను. తదనంతరము జ్ఞానులందు శ్రేష్ఠుడు, జ్ఞానమునకే యధిష్ఠాతయునైన శంకరుడు పరమాత్మ నాదేశమును శిరసావహించిదివ్యగోలోకపరంధామమున శ్రీరాధాకృష్ణాంగసంభూతములై ప్రవహించు దివ్యజలములను హస్తముల నిడుకొని భగవంతుని యాజ్ఞ పరిపాలింతునని ప్రతిజ్ఞ యొనరించెను. తత్క్షణమే సదాశివుడు జగదంబయొక్క దివ్యమంత్రములచే నోతప్రోత

మైన యుత్తమభక్తిసమన్వితమగుమహాతంత్రశాస్త్ర నిర్మాణ మొనరించెను. సకలవేదములసార మాశాస్త్రములో నంతర్గతమై యుండెను. పరమేశ్వరుడు ప్రవచించిన యామహామంత్రశాస్త్రమునందలి దివ్యనామములతో, మంత్రములతో, స్తోత్రములతో, గవచములతో భక్తిపరవశులై సకలదేవతలు మహర్షులు శ్రీరాధాకృష్ణుల ననేకవిధముల స్తుతించిరి. శంకరుడు శ్రీరాధాకృష్ణాంగసంభూత యైనగంగాదేవి మాహాత్మ్యము నిట్లు వర్ణించెను,

గఙ్గాతోయ ముపస్పృశ్య మిథ్యా యది వదే జ్జనః ।
స యాతి కాలసూత్రం చ యావద్వై బ్రహ్మణో వయః ॥ (13)

గంగాజలములను హస్తములందు ధరించి యొనరించిన ప్రతిజ్ఞను బాలన మొనరింపనివారు బ్రహ్మయుఃపర్యంతము కాలసూత్ర మనునరక మనుభవింపగలరు.

బ్రాహ్మణోత్తమా! గోలోకములో శ్రీరాధాకృష్ణుల దర్శనార్థమై యనన్యభక్తిసమన్వితులై పరితపించుచున్న సకలదేవతల సభామధ్యమున నకస్మాత్తుగ బరిపూర్ణతముడు, పరబ్రహ్మమునగు శ్రీకృష్ణపరమాత్మ శ్రీరాధతో బ్రత్యక్ష మయ్యెను. వారిని దర్శించి యాసభాసదులందఱు నఖండబ్రహ్మానందభరితులై యనేక విధముల స్తుతించుచు గోలోకములో మహోత్సవ మొనరించిరి.

నారదా! గోప్యమగునీప్రసంగమును శ్రీహరి కనన్యభక్తుడవగు నీ కుప దేశించితిని. ఈ దేవరహస్యము బహుదుర్లభము. పరిపూర్ణుడైన శ్రీకృష్ణపరమాత్మయే శ్రీరాధాసహితముగ జలరూపమున ద్రవించి గంగయైనాడని తెలిసికొనుము. దివ్యగోలోకపరంధామమునుండి యనేకరూపముల ననంతవిశ్వములో బ్రవహించు గంగాదేవీరహస్యప్రాదుర్భావ చరిత మిదియే.

సా చైవం ద్రవరూపా యా గఙ్గా గోలోకసమ్భవా ।
రాధాకృష్ణాఙ్గసంభూతా భుక్తిముక్తిఫలప్రదా ॥
స్థానే స్థానే స్థాపితా సా కృష్ణేన పరమాత్మనా ।
కృష్ణస్వరూపా పరమా సర్వబ్రహ్మాణ్డ పూజితా ॥ (177-178)

నారదా! యిట్లు శ్రీరాధాకృష్ణులు ద్రవరూప మొందగా గంగ గోలోకమునం దుద్భవించెను. రాధాకృష్ణాంగసంభూత మైనయీసురసరిత్తు భుక్తిముక్తి ఫలప్రదాయిని. శ్రీకృష్ణుని వ్యవస్థానుసారముగ నీమె కనేకవిశ్వములలో ప్రవహించు సౌభాగ్యము ప్రాప్తించెను. శ్రీకృష్ణస్వరూపిణియై యత్యంతాదరణీయ మైన గంగను సకలబ్రహ్మాండములందు గలదేహధారులు పూజింతురు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని గంగోపాఖ్యాన
మను పదియవ అధ్యాయము
సంపూర్ణము.

---

## పదునొకండవ అధ్యాయము

## గంగాదేవిరూపముచే మోహితు డగుశ్రీకృష్ణుని శ్రీరాధాదేవి పరుషోక్తులాడుట.

**నారదుడు పలికెను :**

దేవా! కలియుగాంతమువఱకు పాపులను బవిత్రమొనరించుచు నవనిపై విరాజిల్లుగంగ మరల బరంధామమునకు దిరోగమింపగలదా? ఈవిషయములను సవిస్తరముగ వర్ణింప బ్రార్థించుచున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! సరస్వతి లక్ష్మి, గంగ, వీరు ముగ్గురు తమతమశాపకాలములు సమాప్త మగునంతవఱకే భూలోకములో బ్రవహించి తదనంతరము భారత వర్షమును వీడి వైకుంఠము జేరగలరు. గంగ, సరస్వతి, లక్ష్మి, తులసి వీరు నల్వురు శ్రీహరి ప్రియపత్నులుగా వేదములందు వర్ణింపబడిరి.

**నారదుడు పలికెను :**

మునీశ్వరా! శ్రీకృష్ణభగవానుని దివ్యాంగములనుండి యుద్భవించిన గంగాభవానియెట్లు బ్రహ్మలోకమండలమందు వసించెను? శంకరుని శిరమునెట్లలంకరించెను? నారాయణునకు ప్రియపత్ని యెట్లయ్యెను? ఈవిషయముల నన్నింటిని గృపతో నాకు వర్ణింపవలసినదిగ వేడుకొనుచున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! పూర్వకాలములో శ్రీరాధాకృష్ణుల దివ్యాంగములనుండి ప్రాదుర్భవించిన గంగాభవాని వారిదివ్యాంశ యని, సాక్షాత్తు శ్రీరాధాకృష్ణుల స్వరూపమని గ్రహింపుము. గోలోకములో నావిర్భవించిన గంగభవాని సకలపవిత్రద్రవములకు నధిష్ఠాత్రీదేవి, దివ్యలోకములనుండి ప్రాకృతజగములలో కేవలము పాపాత్ములైనజీవుల నుద్ధరించుటకు సరిద్రూపమున ప్రవహించెను. జలస్వరూపిణి యైనగంగాభవాని దివ్యసుందరవిగ్రహముధరించెను. ఆమెరూప లావణ్యములు నిరుపమానములు. ఆమె నిత్యనూతనయౌవనసంపన్నురాలు, దివ్యరత్నమయాభరణవిభూషితురాలు. శరత్కాలములో మధ్యాహ్నమున వికసించు నరవిందమువలె భాసించుముఖారవిందముతో నామె మనోహారిణిగ దర్శన మొసంగెను. ఆమె తప్తసువర్ణదివ్యకాంతిప్రభలతో ప్రకాశింప దొడంగెను. ఆమె యంగకాంతి శరత్పూర్ణిమనాటి చంద్రునిమించి ప్రకాశింప దొడంగెను. ఆమె స్వరూపము శుద్ధసాత్వికము, నేత్రములు సువిశాలములు, కరుణాకటాక్షపరిపూర్ణములు; మాలతీపుష్పముల మాలలను ధరించి, లలాటమందు జందనసిందూరసమ్మిళిత కళ్యాణతిలకమునుదిద్దుకొని, పక్వబింబాధరముతో, దానిమ్మగింజలను దిరస్కరింపగలదంతపంక్తితోగూడి, యగ్నిశుద్ధ దివ్యాంబరములను ధరించి యత్యంత సౌందర్యవతిగ నామె శ్రీకృష్ణపరమాత్మ సమక్షమున ప్రత్యక్షమయ్యెను. ఆ సురసుందరి యనన్యభక్తిసమన్వితయై యత్యంత ప్రసన్నహృదయముతో, ప్రేమతో, శ్రీకృష్ణపరమాత్మ దివ్యసుందరవిగ్రహమునే వీక్షింప దొడంగెను. ఆసర్వేశ్వరేశ్వరుని యలౌకిక రూపమాధుర్యము గంగను నిశ్చేష్టురాలుగనొనరింప నామెదేహమంతయు నలౌకికప్రేమతో బులకింప దొడంగెను.

ఆసమయములోనే శ్రీరాధాదేవి గోపికాపరివేష్టితయై గంగాకృష్ణులు విరాజిల్లియున్నప్రదేశమున కేతెంచెను. ఆమెరాకను గాంచి యచట సమావిష్టులై యున్న పార్షదులు మొదలగువారందఱు గౌరవముగ లేచి నిలువబడి యనేకవందనముల నర్పించిరి. శ్రీకృష్ణదివ్యసౌందర్యామృతమును దననేత్రములతో బానమొనరించుచున్న గంగ రాధాదేవి యాగమనమువలన విచలితురాలై బాహ్యాభావమునొంది వినీతభావముతో రాధకు నమస్కరించెను. ప్రేమపూరితనయనములతో శ్రీకృష్ణుని వీక్షించుచున్న గంగను గాంచి శ్రీరాధాదేవి కోపింపగ నామె భయము నందెను. శ్రీకృష్ణపరమాత్మ యామె కభయప్రదాన మొనరింపగ గంగ సుస్థిరచిత్తత నొంది రత్నసింహాసనము నధిష్ఠించి ప్రకాశించు శ్రీరాధాదేవి దివ్యసుందరవిగ్రహమును వీక్షించెను. శ్రీరాధారూపము చిన్మయము, పరమమనోహరము. ఆదేవి సందర్శన మత్యంత సుఖప్రదము. పరబ్రహ్మతేజముతో నామె శ్రీవిగ్రహము జాజ్వల్యమానముగ బ్రకాశించుచుండెను. ఆసనాతనమాతృదేవతయే సృష్ట్యాది నసంఖ్యాక బ్రహ్మలను రచించినది. ఆమె సదా ద్వాదశవర్ష సంయుక్త, నూతన యౌవనముచే యలరారు శ్రీవిగ్రహముగలది. అఖిల విశ్వములో నామెతో సమానులై నరూపవతులుగాని, గుణవతులుగాని, మఱియెవ్వరును లేరు. ఆమె పరమశాంతస్వరూపిణి, అత్యంతసౌందర్యవతి, పరమసాధ్వీలలామ, ఆదిమధ్యాంతరహిత. ఈమెనే శుభయని, సుభద్రయని, శుభగయని భక్తులు కీర్తింతురు. ఈమె తనప్రాణేశ్వరునివలన నఖండ సౌభాగ్యముచే సంపన్నురాలై యుండును. అలౌకికసౌందర్యముచే శోభించు నీమె సర్వస్త్రీలలో శ్రేష్ఠురాలు, శ్రీకృష్ణపరమాత్మ యర్ధాంగసంభూత మైన యీామె తేజమందు, నవస్థయందు, బ్రకాశమందు శ్రీకృష్ణసమురాలు. విష్ణువు లక్ష్మితోగూడి యీరాధాదేవినే యుపాసించెను. తనసముజ్జ్వలప్రభతో శ్రీరాధాదేవి శ్రీకృష్ణపరమాత్మ సభనే యాచ్ఛాదిత మొనరించెను.

గోపికాసఖు లొసంగిన సుగంధిలతాంబూలము నందుకొని రాధాదేవి రత్నసింహాసనము నలంకరించెను. అజ్ఞాతజని యైన యామె యఖిలజగములకు జనని యని గ్రహింపుము. ఆమె కీర్తిప్రతిష్ఠలు సకలవిశ్వములందు విస్తృతములై యున్నవి. ఆమె శ్రీకృష్ణుని ప్రాణములకే యధిష్ఠాత్రీదేవత, ఆయన బ్రాణములకంటె నధికప్రియురాలు.

నారదా! రాసేశ్వరి యగు శ్రీరాధయొక్క దివ్యసౌందర్యము నెంత వీక్షించినను గంగాదేవి మనస్సు తృప్తి నొందలేదు. ఆమె నిర్నిమేష నేత్రములతో నిరంతరము రాధాసౌందర్యసుధను పానమొనరింప నారంభించెను, మునీశ్వరా! పరమశాంతవిగ్రహ యైన శ్రీరాధ సస్మితముఖారవిందయై మధుర వాణితో జగదీశ్వరుడైన శ్రీకృష్ణపరమాత్మ నుద్దేశించి యిట్లు పల్కెను.

## శ్రీరాధాదేవి పలికెను :

ప్రాణేశ్వరా! మీసచ్చిదానందవిగ్రహమునే వీక్షించు నీకళ్యాణియెవ్వరు? ఈమె వాడిచూపులకు మీరే లక్ష్యము. ఈమె మిమ్ములనే పొందవలెనని ధృఢముగ గాంక్షించుచున్నది. నాథా! మీమనోహరరూప మీమె నచేతను రాలి నొనరించెను. ఈమె సర్వాంగములు పులకితములైనవి. దివ్యచేలాంచలముతో ముఖమును గప్పుకొని మిమ్ములనే మరల మరల వీక్షించుట యీమె స్వభావ మైనది. మీరుకూడ నీమెపై దృష్టిని సారించుచు మధురమధురముగ మందహాసముల నొనరించుచున్నారు. ఎందరో సుందరీమణులు మీ యందు ప్రగాఢప్రేమ కల్గి వర్తించిరి. స్త్రీజాతి స్వాభావికముగ గోమలము కాన నే నాసుందరీమణులను క్షమించెదను.

మీరు విరజా (రజోగుణరహిత) దేవిని మున్ను ప్రేమించితిరి, కాని యేమి ప్రయోజనము? ఆమె తనదివ్యరూపమును త్యజించి యొకదివ్యనదిగా మారిపోయెను. మీసత్కీర్తిస్వరూపిణి యైనయావిరజాదేవి యిప్పటికిని నదీరూపమున గోలోకములో బ్రవహించుచున్నది. ఆమె నుండియే సప్త సముద్రములు మీ కౌరసపుత్రులుగ నావిర్భవించినవి.

తదనంతరము శోభ మిమ్ము బ్రేమించి శరీరత్యాగ మొనరించి చంద్రలోకమున కరిగినది. ఆమె పరమ స్నిగ్ధతేజోమయి, కాగా మీ రామెను గొన్నిభాగములుగ విభజించితిరి. రత్నములు, సువర్ణము, పుష్పములు, మొగ్గలు, సుపక్వఫలములు, పచ్చనిపంటలు, మహోన్నత దివ్యహర్మ్యములు, స్త్రీలముఖకమలములు, క్షీరములు మొదలగు సమస్త శోభాయుక్త పదార్థములు మీవలన నాశోభాదేవినుండి వెలువడినవే. మీరు ప్రభను బ్రేమించుట కూడ నేను గమనించితిని. ఆమె యత్యంత తేజోరూపిణియై సూర్యలోకమును బ్రవేశించెను. ఆప్రభనే మీరు విభజించి వివిధప్రదేశములకు బయనింప

జేసితిరి. శ్రీకృష్ణా! మీనుండి దూరమైన ప్రభ యగ్ని, యక్ష, నరేశ్వర, దైవ, వైష్ణవ, నాగ, బ్రాహ్మణ, ముని, మహర్షులకు, యశస్విపురుషులకు, సౌభాగ్యవతు లగుస్త్రీలు మొదలగువారికి ప్రాప్తించెను.

మీరు శాంతిని ప్రేమించుచుండుటను నేను గాంచలేదని భావింపకుడు. ఆగోపికకూడ శరీరత్యాగ మొనరించి మీయందే లీన మయ్యెను. ఆమె దివ్య శరీరమే యుత్తమగుణరూపములుగ బరిణమించెను. ఆగుణములను విభజించి మీరే సకలవిశ్వములకు ప్రసాదించితిరి. ఆదివ్యగుణముల యధికాంశను నాకు, గొంత యీబృందావన నికుంజములకు, గొంత సద్భక్తులకు, మఱికొంత బ్రాహ్మణులకు, గొంత శుద్ధసత్త్వస్వరూపిణి యైనశ్రీమహాలక్ష్మికి, గొంత నాదివ్యగుణనామ సంకీర్తన మొనరించు నుపాసకులకు, గొంత పరమవైష్ణ వులకు, శేషించినది తపస్వులకు, ధర్మమునకు, ధర్మాత్ము లైనపురుషులకు బ్రసాదించితిరి.

ఓమానినీచిత్తచోరా! ఇంతటితో నాగితిరా? క్షమాదేవినిగూడ మీ రభిమానించుట నా కవగతమే. మీయం దపూర్వానురాగము కల్గినయామె తనదివ్యదేహమును జాలించి యసంఖ్యాకవిశ్వగోళములందు గలపృథ్వులలో బ్రవేశించెను. క్షమాదేవి దివ్యశరీరమును మీరు దివ్యక్షమాగుణముగ రూపొందించి యాగుణమును విభజించి విష్ణువునకు, వైష్ణవులకు, ధర్మమునకు, దాపసులకు, దేవతలకు, విద్వాంసులకు బ్రసాదించితిరి. నాథా! మీయంత రంగము నాకు దెలియదా? జగదానందకారకా! నీ వనన్యప్రేమగుణసం యుక్తుడవు. అనన్యభక్తులను నాకంటెమిన్నగ బ్రేమించుటయే మీ సహజ గుణమని నా కవగతమే.

## శ్రీనారాయణఋషి పలికెను :

నారదా! చిఱుకోపముతో రాధ తనప్రాణేశ్వరుని మందలించి గంగ వైపు దృష్టిని సారించెను. గంగ శ్రీరాధాంతరంగమును దెలిసికొని యామె తనను శపించునని యోగబలముచే గ్రహించి తనదివ్యరూపమును వీడి జలము లందు బ్రవేశించెను. సిద్ధయోగిని యైనరాధ తనయంజలితో సమస్తజలరూప మును బాన మొనరించుట కుద్యుక్తురాలు కాగా గంగాదేవి యామె యభిప్రా యమును గ్రహించి శ్రీకృష్ణుని చరణారవిందములనే యాశ్రయించి యదృ

ళ్ళ్వరా లయ్యెను. రాధాదేవి గంగకొఱకై సకలబ్రహ్మాండములను గాలింపగా నెక్కడను గంగ జాడ తెలియలేదు. విశ్వములందు హఠాత్తుగ జలము లంతర్ధానము కాగా సకలప్రాణికోటి పిపాసకు గుఱియై క్షోభింప దొడంగె. ఆసమయమున బ్రహ్మ, విష్ణువు, శంకరుడు, అనంతుడు, ధర్మము, మహర్షులు, దేవతలు, సిద్ధులు, సాధ్యులు మొదలగువా రందఱు జలాభావమువలన వ్యాకులత నొంది పరమాత్మానుగ్రహము కొఱకై గోలోకమున కరుదెంచిరి. సర్వులు వినీతభావులై యనన్యభక్తియుతులై శ్రీకృష్ణున కనేక ప్రణామము లర్పించి యాయనను వీక్షించిరి. శ్రీకృష్ణపరమాత్మ సర్వపూజ్యుడు, సకలారాధ్యుడు, ఆశ్రితుల ననుగ్రహించుటయే యాయనస్వాభావికగుణము. శ్రీకృష్ణపరమాత్మ సంపూర్ణ గోపికాప్రియుడని, ('గో' అనగా ఇంద్రియములు 'పి' అనగా సకలేంద్రియములచే భగవంతుని ధ్యానించుట, ఆరాధించుట, కీర్తించుట. శ్రీకృష్ణపరమాత్మానన్యభక్తు లందఱు గోపికలే) నిరీహుడని, నిరంజనుడని, నిర్లిప్తుడని, నిరాశ్రయుడని, నిర్గుణుడని, నిర్వికారుడని సదా పరమయోగులు స్తుతింతురు. తన యనన్యభక్తుల ననుగ్రహించుటకొఱకే యీ పరబ్రహ్మ మైనసచ్చిదానందవిగ్రహుడు సాకారుడై సాక్షాత్కరించెను. శ్రీకృష్ణపరమాత్మయే సత్యస్వరూపుడు, సత్యేశ్వరుడు, సకలసాక్షి, సనాతనుడు, పురుషోత్తముడు. ఈయనను మించిన సకలజగచ్ఛాసకుడు మఱియొకడు లేడు. సమస్తదేవగణములు భక్తిభావముతో బులకితగాత్రులై, యశ్రుపూర్ణలోచనులై, నతశిరస్కులై, ముకుళితహస్తులై యీదేవాది దేవు ననేక విధముల స్తుతింపదొడంగిరి.

ఆసర్వేశ్వరేశ్వరుని శ్రీవిగ్రహ మఖండజ్యోతి ర్మయము, సర్వకారణకారణము. ఆసచ్చిదానందవిగ్రహు డమూల్యరత్న ఖచిత చిత్రసింహాసనాసీనుడై సకలదేవతలకు దివ్యదర్శన మొసంగెను. అసంఖ్యాకులైనగోపకుమారులు శ్వేతవింజామరలతో విసరుచుండగ బరమాత్మ గోపిక లొనరించు నృత్యములను, వా రాలాపించు గీతములను ముదముతో వీక్షించుచుండెను. కోటానుకోట్లు గోపగోపికలు పరివేష్టించియుండగ శ్రీకృష్ణుడు చందనచర్చితుడై, రత్నభూషణభూషితుడై, పీతాంబరధారియై, కిశోరవయస్కుడై, నీలనీరదవర్ణముతో బ్రకాశించుచు ద్వాదశవర్షీయబాల రూపధారియై బ్రహ్మాదులకు దర్శన మొసంగెను. ఆయన శ్రీవిగ్రహము కోటాను

కోట్ల చంద్రులప్రభను కోటికన్దర్పసౌందర్యమును తిరస్కరించుచుండెను. ఆయన ముఖచంద్రసౌందర్యసుధను గోపకాంతలు సదా తమలోచన చకోరములతో పానమొనరించుచుందురు. శ్రీకృష్ణపరమాత్మ రాధాప్రదత్త సుగంధిలతాంబూలమును జర్వణ మొనరించుచు సకల సురలకు దివ్యదర్శన మొసంగెను.

పరిపూర్ణతము డైనయాప్రభువును మనువులు, సకలదేవతలు, మహర్షులు, సిద్ధులు మొదలగువారందఱు పరమవిస్మయచకితులై దర్శించిరి. బ్రహ్మండములో జిన్మయలోకములు, ప్రాకృతలోకములు నన్నియు శ్రీకృష్ణమయముగ వారికగుపించెను. అందఱు ద్విభుజులై, మురళీహస్తులై, శ్రీకృష్ణునివలె శ్యామలవర్ణులై, దివ్యాంబరధారులై, వైజయంతీమాలావిభూషితులై, మయూరపింఛచూడులై, వక్షఃస్థలమందు కౌస్తుభమును ధరించి సకలదేవతలకు గోచరించిరి. గోలోకమంతయు శ్రీకృష్ణుడుగనే దేవతలకు గోచరించెను. అట్లగుటచే నెవరు పార్షదులో, యెవరు స్వామియో తుదకు విధాతయైనను గ్రహింపలేకపోయెను.

శ్రీకృష్ణు డొకక్షణము సాకారుడై, మఱియొకక్షణము నిరాకారజ్యోతి స్స్వరూపుడై ప్రకాశించెను. రాధయే శ్రీకృష్ణుడుగ, శ్రీకృష్ణుడే రాధగ, సకలచరాచరములు శ్రీరాధాకృష్ణులుగ బ్రహ్మాదిదేవతలకు గోచరించెను. బ్రహ్మకు సహిత మీశ్రీకృష్ణరహస్య మంతుదొరకినది కాదు. అపుడు బ్రహ్మ యంతర్ముఖుడై తనహృదయకమలమందు విరాజిల్లుచున్న పరబ్రహ్మమైన శ్రీకృష్ణపరమాత్మ నేకాగ్రతతో ధ్యానించెను. జ్ఞానచక్షువుద్వారమున బ్రహ్మ శ్రీకృష్ణుని దర్శింప గల్గెను. తదనంతరము కృపాసాగరు డైన శ్రీకృష్ణుడు తనమాయాలీలలను జాలించి, వారియెదుట సాక్షాత్కరించి, వారి యంతరంగములను గ్రహించి యిట్లు పల్కెను.

## శ్రీకృష్ణభగవానుడు పలికెను :

సమస్తదేవతలారా! నేను మీ యభీష్టమును గ్రహించితిని. గంగాదేవికొఱకై మీరు నన్ను ప్రార్థించుచున్నారు. రాధాదేవి గంగను పానమొనరింపవలెనని తలంపగా గంగ నాదివ్యచరణముల నాశ్రయించినది. మీ

కోర్కెలను మన్నించి నేను మీకు గంగను మరల బ్రసాదింపగలను. కాని మీరు గంగ భయము తొలగుటకొఱకై శ్రీరాధాదేవి నారాధింపుడు.

**శ్రీనారాయణఋషి పలికెను:**

నారదా! శ్రీకృష్ణుని యాదేశానుసారముగ కమలోద్భవుడైన బ్రహ్మ ప్రసన్నచిత్తుడై సర్వారాధ్యయైన, శ్రీకృష్ణపూజితయైన శ్రీరాధామాతను స్తుతింపదొడంగెను. "దేవీ! గంగాభవాని నీదివ్యాంగములనుండి యుత్పన్నమైనది. శంకరుని సంగీతమాధుర్యముచే నీవు ముగ్ధవై ద్రవించి దివ్యగంగగా నవతరించితివి. అందువలన నీయంశసంభూతయైన యీగంగాదేవి నీ కత్యంత ప్రీతిపాత్రురాలు. ఆమె నీదివ్యమంత్రములను జపించి ని న్నారాధింపగలదు. నీ యఖండారాధన ఫలస్వరూపమున నామె విష్ణుదేవునే పతిగా బొంద గలదు.

తదనంతర మామె తనయంశచే నవనిపై బ్రవహించి శ్రీమహావిష్ణు నంశసంభూతుడైనసముద్రుని బతిగా బొందగలదు. దేవేశ్వరీ! నీవు లోక కళ్యాణార్థమై గంగపై గోపము వీడవలసినదిగా బ్రార్థించుచున్నాను".

నారదా! బ్రహ్మాదిదేవతలయొక్క ప్రార్థనలను మన్నించి రాధ శాంతింపగా, గంగాదేవి శ్రీకృష్ణుని చరణ నఖాగ్రమునుండి బయల్వెడలి ప్రవహించెను. ఆజలములనుండి దివ్యరూపముతో నావిర్భవించి గంగ మరల సకల దేవతలకు దర్శనమొసంగెను. బ్రహ్మదేవుడు గంగాజలములను దన కమండలువునందు గ్రహించి యామెను గౌరవించెను. మహాదేవుడు తన జటాజూటములో గంగాదేవికి స్థానము నొసంగి గౌరవించెను. తదనంతరము విధాత గంగాదేవికి రాధామంత్రస్తోత్ర కవచాదులను, బూజావిధానము నుపదేశించి జగజ్జనని నారాధింపవలసినదిగ నాదేశించెను. నారదా! ఈ సమస్తోపాసనాది క్రమము సామవేదమందు వర్ణితము. బ్రహ్మాదేశానుసారముగ గంగాదేవి రాధ నారాధించి శ్రీరాధాకృష్ణుల యనుజ్ఞ గైకొని వైకుంఠమునకు వెడలి పోయెను.

మునీశ్వరా! లక్ష్మి, సరస్వతి, గంగ, విశ్వపావని యగుతులసి యీ నల్వురు నారాయణునకు ప్రియపత్నులైరి. శ్రీకృష్ణపరమాత్మ విధాతతో నిట్లు పల్కెను. "బ్రహ్మదేవా! నీవు గంగాజలములను బొంది యిక సుఖం

వుము. బ్రహ్మవిష్ణుమహేశ్వరులారా! కాలగతిని వర్ణించెద నవధరింపుడు. మీ రందఱు నీసమయములో గోలోకమునం దుపస్థితులై యున్నారు, కావున నింకను సజీవులుగ నున్నారు, ఎందువలననగా గోలోకములో గాలచక్రము పరిభ్రమింపదు. ఈసమయమున మహాకల్పపరిసమాప్తి యైనందువలన బ్రహ్మాండములో బ్రళయము సంభవించెను. సకలజీవులు నాయందే విలీను లైరి. కావున విధాతా! మరల నీవు సృష్టిని చేయుము. మీ రందఱు నిక మీమీ లోకములకు బోవచ్చును." అనియాదేశించి శ్రీకృష్ణు డంతర్ధాన మందెను.

నారదమునీంద్రా! భగవంతుని యాజ్ఞానుసారము బ్రహ్మాది దేవత లందఱు తమతమ లోకముల కరిగి సృష్టికార్యమందు నిమగ్నులైరి. ఏయే లోకములలో బ్రవహింపవలసినదిగ బరమాత్మ గంగ నాదేశించెనో యామె యాలోకములకు బ్రస్థానమొనరించెను.

నిర్గతా విష్ణుపాదాబ్జాత్తేన విష్ణుపదీ స్మృతా ॥ [142]

శ్రీహరి చరణారవిందములనుండి ప్రాదుర్భవించుటచే గంగను భక్తులు విష్ణుపది యని కీర్తించిరి.

నారదా! యిట్లు నేను పవిత్రము, ఉత్తమము నగుగంగాదేవ్యుపాఖ్యానమును వర్ణించితిని. దీని శ్రవణము వలన సుఖము, మోక్షము లభించును.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని గంగోపాఖ్యాన
మను పదునొకండవ
అధ్యాయము
సంపూర్ణము.

—♦—

# పంద్రెండవ అధ్యాయము

## గంగను విష్ణువు గాంధర్వవిధితో వివాహమాడుట.

**నారదుడు పలికెను :**

స్వామీ! లక్ష్మి, సరస్వతి, గంగ, తులసి ఈనల్వురు నారాయణుని ప్రియార్ధాంగులని ప్రవచించియున్నారు. గంగాదేవి వైకుంఠగమనమును మీముఖారవిందమునుండి శ్రవణమొనరించితిని. కాని గంగాదేవి విష్ణుపత్ని యెట్లు కాగల్గెనో ఆ ప్రసంగమును నాకు సవిస్తరముగ వర్ణింప బ్రార్థించుచున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! గంగాదేవి వైకుంఠగమన మొనరించిన యనంతరము బ్రహ్మ కూడ సృష్టి నారంభించు ననుజ్ఞ కొఱకై వైకుంఠమునకు వేంచేసి జగత్ప్రభువైన శ్రీహరికి బ్రణామము లర్పించి యిట్లు పలికెను. "జగన్నాథా! శ్రీరాధాకృష్ణుల దివ్యాంగసంభూతయు, దివ్యద్రవరూపిణియు నగుగంగ సుందరదేవీరూపమును ధరించినది. దివ్యయౌవనసంపన్న యైన కారణమున నామె శ్రీవిగ్రహము పరమమనోహరము. గంగాదేవి పరిశుద్ధురాలు, సత్త్వస్వరూపిణి, సాధ్వీలలామ, పరమశాంతస్వరూపిణి, క్రోధాహంకారరహిత. ఆమె శ్రీరాధాకృష్ణులనుండి సంభవించి పరమసుందరరూపవతియై శ్రీకృష్ణుని ప్రేమించి రాధాదేవియాగ్రహమునకు గుఱియై కృష్ణచరణారవిందముల నాశ్రయించెను. సకలలోకములు స్వాదుజలరహితములు కాగా మేమంద ఱము గంగావతరణార్థమై శ్రీకృష్ణభగవాను నాశ్రయించి తదాదేశానుసారము రాధను బ్రార్థించి యారాధించితిమి. మాప్రార్థనల నాలకించి శ్రీరాధ ప్రసన్నురా లగుటచే మరల గంగాభవాని భగవంతుని పాదాంగుష్ఠనఖాగ్రమునుండి సరిద్రూపమున బ్రాదుర్భవించెను. దేవా! మీరు దయతో గంగాభవానిని గాంధర్వవిధిచే నర్ధాంగిగ స్వీకరింపుడని ప్రార్థించుచున్నాను. దేవదేవేశ్వరా! నీవు పురుషోత్తముడవు, గంగాభవాని స్త్రీరత్నము. నీవు ప్రకృతికే యతీతుడవు, భక్తానుగ్రహవిగ్రహుడవు, సచ్చిదానందమూర్తివి.

పరిపూర్ణుడైన శ్రీకృష్ణపరమాత్మ రెండురూపముల విభక్తుడు కాగా వామ పార్శ్వము శ్రీహరి యయ్యెను, దక్షిణపార్శ్వము ద్విభుజుడగు శ్రీకృష్ణుడుగ శేషించెను. అట్లే యాదేవాదిదేవుని వామభాగమునుండి ప్రాదుర్భవించిన శ్రీరాధ రెండురూపములను దాల్చెను. ఆమెవామభాగము శ్రీమహాలక్ష్మి కాగా, దక్షిణభాగము కేవలము రాధగా శేషించెను. గంగాభవాని కూడ శ్రీరాధకృష్ణుల దివ్యాంగములనుండి సంభవించిన పవిత్రమూర్తియే. కావున గంగాభవాని మిమ్ములనే తన ప్రాణనాథునిగ వరింపవలెనని ప్రగాఢాకాంక్ష కల్గియున్నది.

స్త్రీపుంసౌ వై తథైకాఙ్గ యథా ప్రకృతిపూరుషౌ ॥

ప్రకృతిపురుషులవలె స్త్రీపురుషు లిర్వురు నేకాంగులే యని మీకు దెలియనిది కాదు.

కావున దేవా! తత్క్షణమే యీపవిత్రగంగాభవానిని మీ ర్థాంగిగా స్వీకరించి మమ్ముల నానందింప జేయుడు".

మునీశ్వరా! బ్రహ్మప్రార్థనలను మన్నించి శ్రీహరి గాంధర్వ విధిని గంగాదేవిని బరిణయమాడెను. గంగావిష్ణుల కల్యాణము సకలలోకములకు గళ్యాణప్రదము. తదనంతరము గంగ యవనిపై బ్రవహించి శాపకాలము సమాప్తముకాగా వైకుంఠము చేరగలదు. తదుపరి తులసీదేవికూడ శ్రీమన్నా రాయణుని ప్రియపత్ని కాగలదు. అందువలన శ్రీహరికి దులసీదేవితోగూడ నల్వురుపత్నులని గ్రహింపుము.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
ప్రకృతిఖండములోని గంగోపాఖ్యాన
మను బండ్రెండవ అధ్యాయము
సంపూర్ణము.

# పదమూడవ అధ్యాయము

## తులసీదేవ్యుపాఖ్యానములో వృషధ్వజరాజ చరిత వర్ణనము

**నారదుడు పలికెను :**

మాన్యా! తులసీదేవికి శ్రీహరిపత్ని యగుసౌభాగ్య మెట్లు లభించెను? ఆమె యావిర్భవించిన పవిత్రదేశ మేది? ఆమె పూర్వజన్మమం దెవరు? ఆమె యేవంశమున నవతరించి జగమును బవిత్రమొనరించెను? ధన్యాతిధన్యులైనయామె తలిదండ్రు లెవరు? జగత్పతి యైన శ్రీహరినే పతిగా బొందుట కామె యే యే తపముల నాచరించెను? దివ్యసౌందర్యవతి యైనయామెకు వృక్షరూప మెట్లు ప్రాప్తించెను? అట్టి శ్రీహరి యనన్యభక్తురా లసురుని బరిణయమాడుటకు గలకారణ మేమి? సంపూర్ణముగ నీసంశయములను దూర మొనరింప బ్రార్థించుచున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! నీ వడిగిన ప్రశ్న లత్యంతపుణ్యప్రదములు. సకల జగత్పావని యగుతులసీ పుణ్యాఖ్యానశ్రవణము భవసాగరమును దరించుటకు సులభసాధనము. పూర్వకాలమందు దక్షసావర్ణి యనుమనువు జగత్తును బాలించెను. ఆయన శ్రీహరి యంశసంభూతుడు, పరమపవిత్రుడు, యశస్వి, యపారకీర్తి సమన్వితుడు, శ్రీహరిచరణారవిం దానన్యభక్తిసమన్వితుడు, భాగవతోత్తముడు. ఈయన పుత్రుడే బ్రహ్మసావర్ణి. బ్రహ్మసావర్ణి యంతఃకరణము పరమ స్వచ్ఛము. పరమధార్మికుడైన యీయనకూడ బరమవైష్ణవుడే. బ్రహ్మసావర్ణి కుమారుడే ధర్మసావర్ణి. ఈయన యింద్రియములను జయించిన మహాత్ముడు. ధర్మసావర్ణికి జితేంద్రియుడు, శ్రీకృష్ణభక్తుడు నగురుద్రసావర్ణి పుత్రరూపమున నుద్భవించెను. రుద్రసావర్ణి కుమారుడే దేవసావర్ణి. దేవసావర్ణికి విష్ణుదేవానన్యోపాసకు డైనయింద్రసావర్ణి పుత్రుడయ్యెను. పరమవైష్ణవు డైనయింద్రసావర్ణికి వృషధ్వజు డనుకుమారుడు కల్గెను. ఆపరంపరలో జన్మించినను వృషధ్వజుడు శంకరునకు బరమభక్తుడయ్యెను. భక్తానుగ్రహాకారకు డైనసదాశివు డీభక్తునిగృహమున బుత్ర

వాత్సల్యముతో గొలువుదీరియుండెను. శివకేశవులకు భేదములేదని తెలయని యజ్ఞాని యైనవృషధ్వజుడు తనచిత్తములో విష్ణుద్వేషమున కాశ్రయ మొసంగెను. అన్యదేవతలం దాయనకు శ్రద్ధాగౌరవములు లేశమాత్రమైనను లేవు. అభిమానయుక్తుడై యాత డహంకారమునకు వశుడై భాద్రపదమాసమందు శ్రీమహాలక్ష్మి పూజలకు సహితము విఘ్నము లొనరించెను. మాఘమాసములో శుక్లపంచమీ దినమున సమస్తదేవతలు సరస్వతీదేవి నుపాసింతురు. కాని యీనరనాథుడు సరస్వతీదేవి యారాధనయందుగూడ సమ్మిళితుడు కాలేదు. యజ్ఞయాగాదులను భగ్నమొనరించుట, శ్రీమహావిష్ణువును నిందించుట యీనరేశ్వరుని స్వభావములు. వృషధ్వజుడు కేవలము శివరూపమునే యారాధించి యన్యదేవతల నవమానించెను. జగత్సాక్షి యైనసూర్యభగవానుడు వృషధ్వజుని యీదురహంకారమును సహింపలేక కుపితుడై యైశ్వర్య విహీనుడవు కమ్మని శపించెను. భక్తుడు సంకటమం దుండుట గాంచి యాశుతోషుడై నశంకరుడు త్రిశూలధారియై సూర్యుని దండింప దాడి వెడలెను. సూర్యుడు తనతండ్రి యైనకశ్యపప్రజాపతి నాశ్రయించెను, సూర్యసహితుడై కశ్యపప్రజాపతి బ్రహ్మను శరణువేడగ బ్రహ్మ వీరి నిర్వురను దోడ్కొని వైకుంఠమున కేగి శ్రీహరి నాశ్రయించెను. ప్రళయకాలరుద్రుడైనసదాశివుని యాగ్రహమునకు గురియైనవారలకు శ్రీహరి యభయమొసంగి యిట్లు పల్కెను.

## శ్రీహరి పలికెను :

బ్రహ్మాదులారా! భయమును వీడుడు. నన్ను శరణువేడిన మీ కిక భయము లేదు.

స్మరన్తి యే యత్ర యత్ర మాం విపత్తౌ భయాన్వితాః ।
తాం స్తత్ర గత్వా రక్షామి చక్రహస్త స్త్వరాన్వితః ॥ (21)

విపత్తులందు భయభీతులైనవా రెవ్వరైనను, నెక్కడైనను నన్ను మనసార రక్షింపుమని స్మరించిన నేను సుదర్శనచక్రధారినై సాక్షాత్కరించి వారలను రక్షింపగలను.

**పాతాఽహం జగతాం దేవాః కర్తాఽహం సతతం సదా ।**
**స్రష్టా చ బ్రహ్మరూపేణ సంహర్తా శివరూపతః ॥ (22)**

దేవతలారా! నేను నిఖిలజగములకు గర్తను, బోధకుడను. నేనే బ్రహ్మ రూపమున జగమును సృష్టించెదను, విష్ణురూపమున రక్షించెదను, హరుని రూపమున సంహరించెదను.

శివోఽహం త్వమహం చాపి సూర్యోఽహం త్రిగుణాత్మకః ।
విధాయ నానారూపం చ కుర్యాం సృష్ట్యాదికాః క్రియాః ॥ (23)

నేనే శివుడను, మీరును నా రూపములే. త్రిగుణాత్మకుడైనసూర్యుడను నేనే. నేనే నానారూపములను ధరించి సృష్ట్యాదికార్యములను గ్రియా రూపమున నిర్వర్తించుచున్నాను.

దేవతలారా! మీకు గళ్యాణ మగుగాక. శివునివలన సంభవించిన భయ మును వీడుడు. శంకరుడు సత్పురుషులందు శ్రేష్ఠుడు, భక్తులకు నాత్మ, భక్తవత్సలుడు, భక్తాధీనుడు. బ్రహ్మదేవా! సదాశివుడు, సుదర్శనము నాకు బ్రాణాధికమూర్తులు. బ్రహ్మాండములందు శివుని మించిన తేజస్వి మఱి యొకడు లేడు. ఆయన తనసంకల్పమాత్రముననే కోటానుకోట్ల సూర్యులను, బ్రహ్మలను సృష్టింపగలడు, ఆయన కసాధ్యమనునది యేదియు లేదు.

బాహ్యజ్ఞానం త న్న కించి ద్ధ్యాయతో మాం దివానిశమ్ ।
మన్నామ మద్గుణం భక్త్యా పంచవక్త్రేణ గీయతే ॥

శివుడు బాహ్యజ్ఞానము వీడి యంతర్ముఖుడై సదా నన్నే ధ్యానించు చుండును. ఆయన తన పంచముఖములతో నాదివ్యగుణనామసంకీర్తనము లను సదా గానమొనరించుచుండును.

అహ మేవం చిన్తయామి తత్కల్యాణం దివానిశమ్ ।
యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజా మ్యహమ్ ॥

ఎవరుసదానాధ్యానమందు, సంలగ్నులై నాదివ్యగుణనామసంకీర్తనము లందు లీనులై యుందురో, నే నహర్నిశము వారి కళ్యాణములనే చింతింతును. ఎవ రేయేప్రకారముగ నన్ను ధ్యానించి యుపాసింతురో, నే నాయాప్రకారము గనే వారిని భజింతును.

శివస్వరూపోఽగ భవాన్ శివాధిష్ఠాతృదేవతా ।
శివో భవతి యస్మాచ్చ శివం తేన విదుర్బుధాః ॥

భగవానుడు శివస్వరూపుడు, అధిష్ఠాతృదేవత శివ (శక్తి). అందు వలన ఆయన శివు డగుచున్నాడు, దానిచే బండితు లాయనను శివునిగా దెలిసికొనుచున్నారు.

ఆసమయమున శూలపాణియు, త్రినేత్రుడు నైనశివుడు వృషభవాహనారూఢుడై వైకుంఠము జేరెను, శ్రీహరిని దర్శింపగనే యాయన వృషభవాహనమును డిగ్గి యనన్యభక్తిసమన్వితుడై శాంతస్వరూపుడు, పరాత్పరుడు, లక్ష్మీకాంతుడు నైనశ్రీమన్నారాయణునకు బ్రణమిల్లెను. రత్నసింహాసనారూఢుడు, రత్నాలంకారభూషితుడు, కిరీటమకరకుండలధారియు, చతుర్భుజుడు, శంఖచక్రగదాపద్మధారియు, వనమాలాలంకృతుడు, నవీననీరదశ్యాముడు, చతుర్భుజపార్షదులచే సేవితుడు, చందనచర్చితసర్వాంగుడు, పీతాంబరధారియు, లక్ష్మీప్రదత్తతాంబూలమును భుజించువాడు, విద్యాధరస్త్రీలనృత్యగానములను సంతోషముతో శ్రవణము చేయుచున్నవాడు, భక్తానుగ్రహవిగ్రహుడు, ఈశ్వరుడు, పరమాత్ముడు నగుశ్రీహరికి హరుడు ముకుళితహస్తుడై, భక్తినమ్రాత్మకంధరుడై ప్రణామము లర్పించెను. బ్రహ్మ, కశ్యపప్రజాపతి, సూర్యుడు మొదలగువారందఱు శంకరునకు వినీతులై ప్రణమిల్లి యాయన ననేకవిధముల స్తుతించిరి. సూర్యునిపై నీ వలుగుటకు గారణ మేమని శ్రీహరి ప్రశ్నింపగ మహాదేవు డిట్లు ప్రత్యుత్తరమొసంగెను. "దేవాదిదేవా! సర్వజ్ఞుడ వైన నీకు సర్వము విదితమే. వృషధ్వజమహారాజు నాప్రాణాధికప్రియుడైన పరమభక్తుడు. నాభక్తుని శపించిన సూర్యుని దండింపవలెనని ప్రయత్నించితిని. కాని సూర్యుడు నిన్ను శరణుజొచ్చి నిర్భయత నొందినాడు. నీపాదపంకజముల నాశ్రయించినవారి కెంతటి వారైన నెగ్గుచేయగలరా? దేవా! నీకృపకు బాత్రులైనవారు జన్మజరావ్యాధిమృత్యువులను సహితముజయింపగలరు. పరాత్పరా! నీదివ్యనామస్మరణమాత్రముననే దేహధారియైన జీవుడు నిర్భయుడై, సమస్తమంగళములను బొందగలడు. కాని జగత్ప్రభూ! నన్నాశ్రయించిన నా భక్తుడగు వృషధ్వజుడు సూర్యశాపగ్రస్తుడై, శ్రీహీనుడై, యాలోచనాహీనుడై, విగతజీవుడైనాడు".

శంకరుని వచనముల నాలకించి కాలాతీతుడైనశ్రీహరి యిట్లుపల్కెను. "శంకరా! దైవప్రేరణమువలన నిపు డిరువదియొక్క యుగములు గడచిపోయినవి. కాని వైకుంఠములో నొకయర్ధఘటికమాత్రమే వ్యతీతమయ్యెను. ఎవరును

నిరోధింపలేని మహాబలవత్తర మైనకాలము వృషధ్వజు నెన్నడో కబళించినది. ఆయన కుమారు డైనహంసధ్వజుడుకూడ గాలము వాత బడెను. వాని వంశ ములో శేషించిన కుశధ్వజుడు, ధర్మధ్వజు డను వారలు నాటిసూర్యునిశాపము వలన శ్రీహీనులై రాజ్యభ్రష్టులై దుఃఖించుచున్నారు. శ్రీమహాలక్ష్మి యుపాసనయే వారలకు శరణ్యము. శ్రీమహాలక్ష్మి నారాధించినచో వారికి నామె తన యంశచే గొమార్తెగా జన్మింపగలదు. ఆమె యనుగ్రహమువలన వారు మరల శ్రీసంపన్నులై రాజాధిరాజులు కాగలరు. మహేశ్వరా! నీ భక్తు డైనవృషధ్వజు డిక లేడు. కావున నీవు చింతింపబనిలేదు.” అని పల్కిన శ్రీహరి దివ్యవచనముల నాలకించి బ్రహ్మాదిదేవతలు భగవంతుని యద్భుతలీలల కాశ్చర్యచకితులై తమతమ నిజధామముల కరిగిరి. సదాశివుడు తపమాచరించుటకు శివలోకమునకు వెడలెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణసంవాదమున
తులస్యుపాఖ్యానాంతర్గత ధర్మధ్వజోపాఖ్యాన
మను పదమూడవ అధ్యాయము
సంపూర్ణము.

—♦—

# పదునాల్గవ అధ్యాయము

## వేదవతీసంభవ ప్రసంగమున శ్రీరామచరిత వర్ణనము, సీతాద్రౌపదుల పూర్వజన్మ వృత్తాంతవివరణము.

**శ్రీనారాయణఋషి పలికెను :**

దేవర్షీ! నారదా! ధర్మధ్వజ కుశధ్వజులు, శ్రీమహాలక్ష్మిని గుఱించి ఘోరతప మాచరించి యామెకృపకు పాత్రులై మరల శ్రీమంతులు,

పృథ్వీపతులు సంతానవంతులు నైరి. కుశధ్వజుని సహధర్మచారిణి యగు మాలావతి లక్ష్మీవరప్రభావమున లక్ష్మీపూర్ణాంశ కల్గిన కొమార్తెను బడసెను. ఆబాల యీభూమిపై నవతరించిన క్షణమునుండి దివ్యజ్ఞానసంపన్నయై సూతికాగృహములోనే స్పష్టస్వరముతో వేదముల బఠించెను. ఆకుమారి ప్రాదుర్భవించిన క్షణమందే లేచి నిలువబడెను. అందువలన బుధజను లామెకు వేదవతి యని నామకరణము గావించిరి. జన్మించిన సమయముననే యామె పరిశుద్ధాంతఃకరణయై శ్రీమన్నారాయణుని గుఱించి ఘోరతప మాచరించుటకు వనముల కరిగెను. ఎవ రెంత వారించిన నామె సాంసారిక బంధనముల దగుల్కొనక విరాగిణియై పురుషోత్తముని దివ్య చరణములనే నిశ్చలభక్తితో నాశ్రయించెను. తపోమూర్తి యైనవేదవతి పుష్కరక్షేత్ర ములో నొకమన్వంతరకాలము శ్రీహరిని గూర్చి ఘోరతప మాచరించెను. ఎంతకాలము గతించినను దపశ్శక్తిచే నామె శరీరము దృఢముగ, యౌవన సంపన్నమై, మనోహరముగ బ్రకాశింపదొడంగెను. మఱుజన్మమున శ్రీహరి నీకు బ్రభువు కాగలడని యశరీరవాణి పలుకగా, నాపల్కులకు దృప్తినొందక యామె గంధమాదనపర్వతముపై కేగి యచంచలమనముతో శ్రీహరియఖండా రాధనము కొనసాగించెను. ఒకదినమున బ్రహ్మవంశోద్భవు డైనరావణు డాప్రదేశము వెంట బయనించుచు వేదవతియాశ్రమమున కేతెంచెను. అతిథి ధర్మానుసారముగ వేదవతి కందమూలఫలములను, శీతలజలములను రావణున కర్పించి వానిని సత్కరించెను. రావణుడు వేదవతి యొసంగిన యాతిథ్య మును స్వీకరించి యామె యతిలోకసౌందర్యమునకు ముగ్ధుడై వేదవతిని స్పృశించుట కుద్యుక్తు డయ్యెను. మహాతపస్విని యగు వేదవతి తత్క్షణమే రావణుని దురుద్దేశమును గ్రహించినదై తనయోగబలముచే వానిని నిశ్చేష్టు నిగ నొనరించి 'సబాంధవముగ నాకారణముననే త్వరలో నశింపగల'వని వానిని శపించెను.

రావణుడు కామాతురుడై వీక్షించి తన్ను మైలపఱచినాడని తలంచి యామె తనశరీరమును యోగాగ్నిచే భస్మ మొనరించెను.

తనదుష్కృత్యమువలన వేదవతి శరీరత్యాగ మొనరించుట గాంచి రావణు డెంతయో చింతించుచు దనరాజధాని కరిగెను. ఆవేదవతియే మఱు జన్మమున రాజర్షియగుజనకునకు యజ్ఞవాటికలో నయోనిజయైన కొమార్తెగ

లభించెను. ఆ సాధ్వీలలామయే శ్రీమహాలక్ష్మి యైనసీత. ఆమె కారణముననే సపుత్రమిత్రబాంధవముగ రావణుడు నశించెను. వేదవతి తనయఖండ తపః ప్రభావమువలన బరిపూర్ణతముడు భగవంతుడు నగుశ్రీరామచంద్రునే ప్రాణేశ్వరునిగ బొందగల్గెను. కాన, రాముడు సాక్షాత్తు పరబ్రహ్మమని, సీతగా నవతరించిన వేదవతి మూర్తిభవించిన శ్రీమహాలక్ష్మి యని గ్రహింపుము. సీతగా నావిర్భవించిన యాదిలక్ష్మి శ్రీహరి యైనశ్రీరామచంద్రునితో ననేకదివ్యసుఖముల ననుభవించెను. రఘుకులాన్వయ రత్నదీపకుడు, సత్యసంధుడు నగు శ్రీరామభద్రుడు తండ్రియాజ్ఞను శిరసావహించి వనవాసమున కేగెను. వనవాసమయములో సముద్రతీరమున సీతాసహితుడై శ్రీరామచంద్రుడు విహరించుచుండగా నగ్నిదేవుడు బ్రాహ్మణరూపమును ధరించి శ్రీరాముని దర్శింపవచ్చి యాయనతో నిట్లు పల్కెను. "శ్రీరామచంద్రా! నాప్రార్థనలను మన్నింపుము. దేవా! సీతాపహరణ సమయ మాసన్నమైనది. కావున మాజననియైనసీతాదేవిని నాసంరక్షణమం దుంచి ఛాయాస్వరూపిణి యైనసీతను మీరు గ్రహింపుడు. మరల నగ్నిపరీక్షాసమయమున మీసీత మీకు లభింపగలదు".

అగ్నిదేవుని ప్రార్థనలను మన్నించి రామభద్రుడు సీతాసాధ్వి నగ్నిసంరక్షణమం దుంచెను? అగ్నిదేవుడు శ్రీకృష్ణుని ప్రభావమున ఛాయను సీతగా సృష్టించి రామున కర్పించెను. శ్రీరాముడుయీసీతారహస్యమును లక్ష్మణునకుగూడ వెల్లడింపలేదు. తదనంతరము సీతాపహరణమున కుద్యుక్తుడైన రావణ ప్రేరణన ననుసరించి మారీచుడు మాయామృగరూపమును ధరించి ఛాయాసీతమనస్సు నాకర్షించెను. సీతాదేవి కోర్కెను దీర్చుటకై రామభద్రుడామాయామృగమును వెంబడించెను.

ఆమృగముపై నాయన బాణమును బ్రయోగింపగా 'హా! లక్ష్మణా!' యనుచు మారీచుడు మృగశరీరమును త్యజించి దివ్యరూపధారియై విమానము నధిరోహించి పార్షదులు తోడురాగా వైకుంఠపరంధామము జేరెను. నారదా! ఈమారీచుడు వైకుంఠ ద్వారపాలకుడైనవిజయుని కింకరుడు; జితు డనువాడు. ఇతడు సనకసనందనాదుల శాపవశమున రాక్షసుడై జన్మించి రామబాణముచే నిహతుడై శాపవిమోచనము పొంది జయవిజయులకంటె మున్నే వైకుంఠము జేరెను.

మారీచు డొనరించిన 'హా! లక్ష్మణా!' యనునాక్రందనము నాలకించి రాముడు కష్టముల పాలయ్యెనని ఛాయాసీత భ్రమించి యాయన రక్షణార్థమై లక్ష్మణుని బంపెను. ఆసమయముననే రావణుడు మాయోపాయముచే ఛాయా సీత నపహరించి లంకకు జేర్చెను. ఆశ్రమమున సీతను గానక శ్రీరామ లక్ష్మణులు చింతాక్రాంతులై దుఃఖించుచు నామెను వెదకుచు దక్షిణదిశగా ప్రయాణము సాగించిరి. గోదావరీ తీరములో జటాయువు ముఖమున సీతా సమాచారమును దెలిసికొని, వానరేశ్వరు డైనసుగ్రీవునితో మైత్రియొనరించి, సాగరమునకు సేతువును బంధించి, లంకనుజేరి, రఘుకులశ్రేష్ఠు డైనశ్రీరామ చంద్రుడు రావణుని సబాంధవముగ రణరంగములో సంహరించెను. తదనంత రము సీతాగ్నిపరీక్షాసమయమున నగ్నిదేవుడు నిజసీతను రామున కర్పించి, ఛాయాసీతను దాను గ్రహించెను. అపుడు ఛాయాసీత తన తక్షణ కర్తవ్య మును నిర్దేశింపుడని శ్రీరాముని, నగ్నిదేవుని బ్రార్థించెను. అపుడు శ్రీరామ చంద్రుడు ఛాయాసీత నిట్లాదేశించెను. "దేవి! నీవు పుణ్యప్రదమైనపుష్కర క్షేత్రమున కరిగి ఘోరతప మాచరింపుము. ఆయఖండ తపఃఫలప్రభావమున నీవు స్వర్గలక్ష్మివి కాగలవు".

శ్రీరాము నాజ్ఞానుసారముగ ఛాయాసీత పుష్కరక్షేత్రములో సుదీర్ఘ తప మాచరించి స్వర్గలక్ష్మియై విరాజిల్లెను. ఆమెయే సమయానుసారముగ ద్రుపదుని యజ్ఞవేదికనుండి ద్రౌపదిగా బ్రాదుర్భవించి పంచపాండవులను బతులుగ బడయగల్గెను. ఇట్లాకళ్యాణి సత్యయుగములో గుశధ్వజుని కన్య వేదవతియై, త్రేతాయుగములో శ్రీరాముని సహధర్మచారిణియై, తచ్ఛాయ ద్వాపరయుగములో ద్రుపదకుమారి (ద్రౌపది) యైనది. అందువలననే యామెను 'త్రిహాయణి' యందురు.

**నారదుడు పలికెను :**

సర్వసందేహభంజనా! పరమమహర్షివర్యా! ద్రౌపది కైదుగురు భర్త లెట్లు లభించిరి? నా యీశంకను నివారింపవలసిదిగ బ్రార్థించుచున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! లంకానగరములో సీతాగ్నిపరీక్షానంతరము నిజమైన సీతను శ్రీరాముడు పొందెను. తదనంతరము ఛాయారూపిణి యైనసీత యగ్నిదేవు

నాదేశానుసారము శంకరు నుపాసించి పతిప్రాప్తికొఱకు "పతిం దేహి, పతిం దేహి" యనుచు శివు నైదుపర్యాయము లర్థించెను. ఆమె ప్రార్థనల నాలకించి త్రిలోచనుడు నీకు మఱుజన్మముననైదుగురు భర్తలు లభింపగలరని వరమును బ్రసాదించెను. ఫలస్వరూపముగ త్రేతాయుగమునాటి ఛాయాసీత ద్వాపరయుగములో ద్రౌపదియై పంచపాండవులను భర్తలుగ బొందెను. దేవేంద్రుడె పంచపాండవులరూపమున నవతరించెను. స్వర్గలక్ష్మి యైన ద్రౌపది వారిని భర్తలుగా స్వీకరించెను.

శ్రీరామచంద్రుడు నిజసీత నగ్నిదేవునినుండి స్వీకరించిలంకారాజ్యమునకు విభీషణుని రాజుగ జేసి సీతాసహితుడై యయోధ్యకు జేరెను. అయోధ్య పవిత్రభారతవర్ష మందు విరాజిల్లు దివ్యనగరము.

ఏకాదశసహస్రాబ్దం కృత్వా రాజ్యం చ భారతే ।
జగామ సర్వై ర్లోకైశ్చ సార్థం వై కుణ్ఠమేవ చ ॥ (62)

"నారదా! పదునొకండువేల సంవత్సరములపర్యంతము శ్రీరామచంద్రుడు సమస్తభూమండలము నేకచ్ఛత్రాధిపత్యముతో, శాంతిసౌఖ్యసౌభాగ్యములతో బరిపాలించెను. తదనంతర మాయన త న్ననుసరించు ప్రజ లందఱితో వైకుంఠపరంధామము జేరెను". లక్ష్మియంశచే బ్రాదుర్భవించిన వేదవతి తుదకు లక్ష్మిదేవియందు విలీనమయ్యెను.

నారదా! ఈపవిత్రోపాఖ్యాన శ్రవణ మొనరించిన వారు నిశ్చయముగ సమస్తపాపములనుండి విముక్తులు కాగలరు. నీ కిపుడు ధర్మధ్వజరాజపుత్రీ పవిత్రచరితమును వర్ణించెద నవధరింపుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణసంవాదమున
తులస్యుపాఖ్యానాంతర్గత వేదవతి
ప్రస్తావనమను పదునాల్గవ
అధ్యాయము
సంపూర్ణము.

# పదునైదవ అధ్యాయము

## ధర్మధ్వజుని భార్యకు దులసి జన్మించుట; ఆమెకు విష్ణువుతో సాంగత్యముకలుగు నని బ్రహ్మ వరము నిచ్చుట; బ్రహ్మదేవు డామెకు శ్రీరాధా షోడశాక్షరమంత్రమును, స్తోత్రకవచముల నుపదేశించుట.

**శ్రీనారాయణ ఋషి పలికెను:**

నారదా! ధర్మధ్వజుని ప్రియపత్నినామధేయమే మాధవి. ఆదంపతులు బహుకాలము సాంసారికసుఖముల ననుభవించిరి. కాని వారికి సంతానము లేదయ్యె. ధర్మధ్వజుడు, మాధవి గంధమాదనపర్వతముపై సుదీర్ఘకాలము శ్రీమహాలక్ష్మి నేకాగ్రతతో నారాధించిరి. ఒక శుభముహూర్తమున వారి ప్రాంగణములో లక్ష్మీపూర్ణాంశ గలకన్య శుక్రవారమున నవతరించి పూర్ణిమనాటిచంద్రునికంటె మిన్నగ ప్రకాశింప దొడంగెను. ఆబాలామణి నేత్రములు శరత్కాలవికసిత కమలములవలె సువిశాలములు, బహుసుందరములు, దేహకాంతి శ్వేతచంపకవర్ణసమానము. ఆమె పద్మాంశసంభూత, పద్మిని, సుమనోహారిణి. ఆమె పాదపద్మయుగ్మమున బద్మరాగములు విరాజిల్లుచున్నవి. ఆరాజకుమారి రాజరాజేశ్వరి, సాక్షాత్తు శ్రీమహాలక్ష్మి, సర్వావయవసుందరి, రాజలక్ష్మీలక్ష్మయుక్త, రాజలక్ష్మ్యధిదేవత, పక్వబింబాధరోష్ఠ, సస్మితవదనారవింద, ఆన్యగ్రోధపరిమండలాత్యంతసుచిరశ్యామకుంతల, సకలసుందరీమణులలో శ్రేష్ఠురాలు.

> వరా నార్యశ్చ తాం దృష్ట్వా తులనాం దాతు మక్షమాః ।
> తేన నామ్నా తు తులసీం తాం వదన్తి పురావిదః ॥ (14)

ఆమె దివ్యసౌందర్యమును దిలకించిన స్త్రీ పురుషులెల్ల నామె నెవ్వరితోడను బోల్చలేకపోయిరి. ఈ కారణముననే విద్వాంసు లాకన్యకు తులసి యని నామకరణము గావించిరి.

**పదునాఱు సంవత్సరముల** ప్రాయము గడచిన పిమ్మట తులసి యెవరెంత ప్రాధేయపడినను సాంసారిక బంధనములందు బంధితురాలుగాక బదరికాశ్రమ

మున కేగి శ్రీమన్నారాయణునే ప్రాణేశ్వరునిగ బొందవలెనని దృఢనిశ్చయముతో ఘోరతప మారంభించెను. గ్రీష్మకాలమందు బంచాగ్నుల నడుమను, వర్షాకాల, శీతకాలములలో శీతలజలములనడుమను వసించుచు నామె యఖండతప మాచరించెను. కొన్నివేల సంవత్సరములు కేవలము ఫలములను, జలములను మాత్రమే సేవించెను. మఱికొన్ని వేలసంవత్సరములు వాయుభక్షణముతో శ్రీహర్యారాధన కొనసాగించెను.

మఱికొన్నివర్షములు వాయువును గూడా నిరోధించి నిరాధారమై దృఢచిత్తముతో శ్రీహరిని బ్రార్థించెను. ఏకపాదముపై నిలువబడి యకుంఠదీక్షతో నఖండతప మాచరించుచున్న తులస్యైకాగ్రత కత్యంతప్రసన్నుడై జగద్విధాత బ్రహ్మ యామె ననుగ్రహించుటకు హంసవాహనారూఢుడై బదరికాశ్రమమున కేతెంచి యామెతో నిట్లు పల్కెను. "దేవీ! తులసీ! నీమనోభీష్టములను దెలియజేయుము. అమరత్వమునైనను, శ్రీహరిభక్తినైనను, హరిదాస్యమునైనను నీ కనుగ్రహింపగలను". బ్రహ్మ వాక్కులవిని తులసీదేవి యిట్లు పలికెను. "పితామహా! పూర్వజన్మమందు నేను గోలోకవాసిని యైనతులసి యను గోపికను. సౌభాగ్యవశమున నేను శ్రీకృష్ణభగవానునకు బ్రీతిపాత్రమును గాగల్గితిని. గోవిందనామాంకితుడైనయాపురుషోత్తమునితో నెన్నిదివ్యసుఖముల ననుభవించినను నాకు దృప్తి కలుగదయ్యె. అందువలన శ్రీరాధ నాపై గోపించి నన్ను బృథ్విపై మానవరూపమున నవతరింపుమని శపించెను. ఆసమయమున దయామయుడైన గోపికావల్లభుడు నన్నిట్లూరడించెను. "దేవీ! నీవు భారతవర్షమున నవతరించి నాకై ఘోరతప మాచరింపుము. బ్రహ్మ నీ యెదుట సాక్షాత్కరించి నీ యభీష్టవరమును బ్రసాదింపగలడు. బ్రహ్మవరానుసారముగ మత్స్వరూపాంశజుడు, చతుర్భుజుడు నగుశ్రీవిష్ణువు నీకు బతిరూపమున లభింపగల"డని పలికి శ్రీకృష్ణపరమాత్మ యంతర్హితుడయ్యెను. విధాతా! నే నాక్షణమే గోలోకము వీడి యవనిపై నవతరించితిని. సచ్చిదానందవిగ్రహుడు, శాంతస్వరూపుడు నగుశ్రీమన్నారాయణుడే నన్ను భార్యగ స్వీకరించునట్లు నాకు వరమును బ్రసాదింపుడు".

తులసీదేవి యర్థించిన వరము నాలకించి బ్రహ్మదేవు డిట్లు పల్కెను.

## బ్రహ్మదేవుడు పలికెను:

తులసీ! శ్రీకృష్ణుని దివ్యాంగములనుండి యుద్భవించిన సుదాము డను గోపకుమారుడు శ్రీరాధా శాపవశమున శంఖచూడు డను దైత్యుడుగనీ భూమండలముపై జన్మించెను. శంఖచూడుడు శ్రీకృష్ణాంశోద్భవుడు గావున పూర్వజన్మజ్ఞానసంపన్నుడు. ఈజన్మలో నీ కాతడే పతి కాగలడు. తదనం తరమే శ్రీమన్నారాయణుడు పతిరూపమున సాక్షాత్కరించి లీలావశమున నిన్ను శపింపగలడు. శ్రీహరి శాపవశమున నీవు వృక్షరూప ముతో భారతవర్షమం దుద్భవించి సమస్త జగములను బవిత్రి మొనరింపగల శక్తిసమన్వితవు కాగలవు. దైవమున కర్పించు సంపూర్ణ పుష్పములందు తులసీదళమే యగ్రిగణ్యము కాగలదు. దేవీ! నీ వవశ్యముగ శ్రీహరి యనన్యప్రేమకు బాత్రురాలవై సుఖింపగలవు. నీదళముల నుపయోగింపక శ్రీహరికి నొనర్చుపూజలు నిష్ఫలములు కాగలవు. బృందావనములో వృక్షస్వరూపిణివై యుద్భవించిన కారణమున బ్రజలు నిన్ను బృందావని యని కీర్తింతురు. నీదళములతోనే గోపగోపిక లొనర్చు మాధవుని పూజ సంపన్నము కాగలదు. నావరప్రభావమున నీవు వృక్షముల కధిష్ఠాత్రీ దేవివై గోపబాలకుని రూపమున విరాజిల్లు శ్రీకృష్ణునితో స్వేచ్ఛాపూర్వక ముగా నిరంతర మానందముల ననుభవింపగలవు.

## శ్రీనారాయణఋషి పలికెను :

నారదమునీంద్రా! బ్రహ్మ యనుగ్రహించినవరములకు దులసి యత్యంత సంతుష్టాంతరంగయై యాయన కనేకప్రణామము లర్పించి యిట్లు పల్కెను, "పితామహా! నేను ద్విభుజస్వరూపుడు, శ్యామసుందరుడు నగుశ్రీకృష్ణపర మాత్మను బతిగా బడయవలయునని యభిలషించుచున్నాను. కాని గోవిందుని యాజ్ఞను శిరసావహించి చతుర్భుజుడైనశ్రీహరి కొఱకు మిమ్ములను బ్రార్థించి తిని. ఆహా! ఆగోవిందుడు నాకు బరమదుర్లభుడైనాడుగదా! స్వామీ! రాధాభయమునుండి నాకు విముక్తి లభించునట్లు, మరల గోవిందుడు లభించు నట్లు వరముల నొసంగుడు". తులసి పల్కిన మధురవచనముల నాలకించి బ్రహ్మ యిట్లామె ననుగ్రహించెను. "దేవీ! నేను నీకు శ్రీరాధాషోడశాక్షర మహామంత్రోపదేశ మొనరించెదను. నీ వామన్త్రము నేకాగ్రచిత్తముతో

హృదయమందు ధరింపుము. నావరప్రభావమువలన నీవు రాధకు ప్రాణ ప్రియవు కాగలవు. రాధతో సమముగ గోవిందునకు నీవు ప్రేమపాత్రురాలవు కాగలవు".

మునీశ్వరా! ఇట్లు తులసి ననుగ్రహించి బ్రహ్మ యామెకు శ్రీరాధా షోడశాక్షరమంత్రమును, స్తోత్రమును, కవచము నుపదేశించి సంపూర్ణ పూజావిధానమును వివరించెను. అపుడు తులసీదేవి శ్రీరాధ నుపాసించి యామె దివ్యానుగ్రహమునకు పాత్రురాలై రాధాసమయై సిద్ధినొందెను. కాలానుసారముగ శ్రీరాధామంత్రజపప్రభావమువలన దులసీదేవి మనోభీష్టము లన్నియు గ్రమముగ సిద్ధించెను. తపోజనిత సకలక్లేశములు దూర మైనవి.

సిద్ధే ఫలే నరాణాం చ దుఃఖం తత్ సుఖ ముత్తమమ్ ॥ (50)

ఫలసిద్ధి పొందిన మనుష్యులకు దుఃఖములే యుత్తమ సుఖములుగ బరిణమించగలవు.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
ప్రకృతిఖండములోని తులసీవరప్రదాన
మను పదునైదవ అధ్యాయము
సంపూర్ణము.

# పదునాలవ అధ్యాయము

## తులసికి స్వప్నమున శంఖచూడుడు దర్శన మిచ్చుట; తులసీశంఖచూడుల వివాహము.

**శ్రీనారాయణఋషి పలికెను :**

దేవర్షీ! బ్రహ్మదేవుని దివ్యవరములను బడసిన వృషధ్వజరాజవంశములో ధర్మధ్వజునకు గారాలపట్టిగ నవతరించిన తులసి హంసతూలికాతల్పముపై సుఖనిద్రియం దుండగా స్వప్నములో నామె కత్యంతసుందరాకారుడు, రత్నభూషణభూషితుడు నయిన నవమన్మథాకారుడొకడు గోచరించెను. బదరికాశ్రమములో నామె స్వప్నమున దర్శించిన యానవయావనునే దైవప్రేరణమున బ్రేమించి యతని సమాగమము కొఱకై నిరీక్షింపదొడంగెను. అదే సమయమందు దైత్యేశ్వరు డైనశంఖచూడుడు బ్రహ్మదేశప్రేరితుడై బదరికాశ్రమమున కరుదెంచెను. ఆదైత్యేంద్రుడు జైగీషవ్యమహర్షి శిష్యుడు. మహర్షి కృపకు బాత్రుడై యతడు శ్రీకృష్ణమహామంత్రోపదేశము పొంది పుష్కరక్షేత్రములో నఖండ తపోజపారాధనాదులచే మంత్రసిద్ధి నొంది గోలోకమును సహితము దర్శింపగల్గెను. నారదా! దైత్యేంద్రు డైనశంఖచూడుడు పరమభాగవతోత్తముడని గ్రహింపుము.

బదరికాశ్రమములో దులసి దైవవశమున బరమసుందరాకారు డైన శంఖచూడుని దర్శించెను. అతడు సస్మితవదనారవిందుడు, ప్రఫుల్లారవిందనేత్రుడు, చందనోక్షిత సర్వాంగుడు, పారిజాతపుష్పమాలాధారి, రత్నభూషణవిభూషితుడు, నవయౌవన సంపన్నుడు, తులసి రత్ననిర్మితవిమానారూఢుడునై బదరికాశ్రమమున కఱుదెంచిన శంఖచూడుని గాంచెను. తన్నే వీక్షించుచున్న దివ్యసుందరిని గాంచి శంఖచూడుడు నీ వెవ్వరిదానవు, నీతలిదండ్రులెవ్వరు, నీవంశమేది యని ప్రశ్నించెను. నారదా! ఆదైత్యేంద్రుడు తననిట్లు ప్రశ్నింపగా తులసి లజ్జావశమున ముఖారవిందము నవనత మొనరించుకొని యతనిని బరీక్షించుటకై యిట్లు ప్రత్యుత్తర మొసంగెను. "భద్రపురుషా! నేను ధర్మధ్వజుని కొమార్తెను, ఉత్తమకుల సంజాతను. ఈతపోవనములో తప మాచరించుట కరుదెంచితిని.

కామినీం కులజాతాం చ రహ స్యేకాకినీం సతీమ్।
న పృచ్ఛతి కులే జాత ఏవమేవ శ్రుతౌ శ్రుతమ్ ॥ [42]

'ఉత్తమకులసంజాత మైన కన్యతో నేకాంతమున గులీను డైనపురుషుడు సంభాషింపరాదని శ్రుతి వచనము'. నీచకులోత్పన్నుడు, సదాచార విహీనుడు నగువాడుమాత్రమే కాముకుడై యేకాంతమున బరస్త్రీతో సంభాషింపగలడు. స్త్రీ పురుషుని సంసారకారాగారమ్మునలో శాశ్వతముగ బంధింపగలదు. ఆమె యింద్రజాలము మిథ్యయని గ్రహింపుము. మాయావులైన వ్యక్తులను బంధించుటకొఱకే బ్రహ్మదేవుడు సాక్షాత్తు మాయాస్వరూపిణి యైనస్త్రీని సృజించెను. ముముక్షువు లైనపురుషులకు స్త్రీసాంగత్యము విషతుల్యము. అందువలన మోక్షకాము లెవ్వరు స్త్రీని జూచుటకైన నంగీకరింపరు. కనుక నీ వీప్రదేశమును వీడి పొమ్ము", తులసి పల్కిన మర్మగర్భితము లైన వచనముల నాలకించి శంఖచూడుడు మందహాసము నొనరించుచు నీవిధముగ బ్రత్యుత్తర మొసంగెను. "దేవీ! నీవు ప్రవచించిన విషయము లసత్యములు కావు, కాని నేను పల్కు ధర్మవచనమును గూడ సావధానవై యాలకింపుము. బ్రహ్మ స్త్రీలను రెండువిధములుగ నిర్ణయించెను. ప్రథమశ్రేణికి జెందినస్త్రీ వాస్తవస్వరూపిణి. ద్వితీయశ్రేణికి జెందినస్త్రీ కృత్యాస్వరూపిణి. ఈరెండుశ్రేణులకు జెందినస్త్రీ లత్యంతసుందరీమణులైనను మొదటిశ్రేణికి జెందినస్త్రీయే ప్రశస్తమైనది. రెండవశ్రేణికిజెందిన స్త్రీ యప్రశస్తమైనది. లక్ష్మి, సరస్వతి, దుర్గ, సావిత్రి, రాధ ఈ యైదుగురు శక్తిస్వరూపిణులు, సకలచరాచరసృష్టికి మూలకారణ ప్రకృతులు, ఈయాదిశక్తుల ప్రాదుర్భావమున కేకైక కారణము సృష్టిని వివర్తమొనరించుటయే (పెంపొందింపజేయుట లేక విస్తరింప జేయుట). వీరి యంశములవలన బ్రాదుర్భవించిన గంగ మొదలుగా గలదివ్యాంగనలే వాస్తవరూపిణు లనబడిరి. శతరూప, దేవహూతి, స్వధ, స్వాహా, దక్షిణ, ఛాయ, రోహిణి, వారుణి, శచి, కుబేరపత్ని, యదితి, దితి, లోపాముద్ర, అనసూయ, కోటివి, తులసి, యహల్య, యరుంధతి, మేన, తార, మండోదరి, దమయంతి, వేదవతి, గంగ, మనస, పుష్టి, స్మృతి, మేధ, కాళిక, షష్టి, వసుంధర, మంగళచండి, ధర్మపత్ని యైనమూర్తి, స్వస్తి, శ్రద్ధ, శాంతి, కాంతి, క్షమ, నిద్ర, తంద్ర, క్షుధ, పిపాస, సంధ్య, దివారాత్రులు, సంపత్తి, ధృతి, కీర్తి, క్రియ, శోభ,

ప్రభ, శివ మొదలగు సాధ్వీమణు లందఱు నుత్తమ లైన స్త్రీలని గ్రహింపుము. స్వర్గములం దున్న యప్సరాంగనలే కృత్యాస్వరూపిణులు, వీరే నిఖిల విశ్వములందు పుంశ్చలులుగ విఖ్యాతిచెందుదురు. స్త్రీలలో సాత్వికగుణ సంపన్నలే స్వాభావికముగ నుత్తమస్త్రీలని గ్రహింపుము. విశ్వమం దిట్టివారే ప్రశస్తనారీమణు లనివిద్వాంసు లైనపురుషులు ప్రశం సించెదరు.

కృత్యాస్వరూపిణు లైనస్త్రీలు రెండుశ్రేణులలో నున్నారు. ఒక శ్రేణికి చెందినవారు రజోగుణసంయుక్తలు, రెండవశ్రేణికిజెందినవారు తమోగుణ సంపన్నలు. సుందరీ! రజోగుణము కల్గినస్త్రీలు కేవలము నే నుదాహ రింపబోవు కారణములవలననే సాధ్వీస్త్రీలై మనగల్గెదరు. పరపురుషుని, గలి యుట కనువైనస్థలము, సమయము, మధ్యవర్తుల లభింపకపోవుటవలన, జన సముదాయమున నివసించియుండుటవలన, రోగయుక్త లై యుండుటవలన, శత్రువువలనగాని, రాజువలనగాని భయభీతలై యున్న కారణమువలన మాత్రమే రజోగుణసంపన్న లైనస్త్రీలు తమసతీత్వము రక్షించుకొనగల్గు చున్నారు. ఇట్టిస్త్రీలను మధ్యమ లందురు. తమోగుణసంయుక్త లైన స్త్రీలను దుశ్శీలమునుండి మరలించుట యత్యంత కఠినము. ఇట్టిస్త్రీలనే యధమస్త్రీ లందురు. తులసీదేవీ! నే నుదాహరించిన యీక్రమము పురుషు లకుగూడ వర్తింపగలదు.

సతీ! నేను దేవతలను సహితము నిర్జించగల దనుజవంశకులోత్పన్నుడ నైన శంఖచూడ సార్వభౌముడను. నేను బూర్వజన్మములో శ్రీకృష్ణపర మాత్మ యష్టపార్షదులలో నొకడైనసుదాముడను. రాధ శాపమునకు గుఱియై రాక్షసేంద్రుడనై జన్మించితిని. శ్రీకృష్ణమహామంత్రజపసంపన్నుడ నైననాకు నీపూర్వజన్మవృత్తాంత మంతయు విదితమే. బ్రహ్మదేవుని యాజ్ఞానుసారము నిన్ను నేను గాంధర్వవిధి వివాహమాడెదను. నీవు నాసహ ధర్మచారిణిగ నుండుట కంగీకరింపుము.”

శంఖచూడుని మధురవచనముల నాలకించి తులసి హర్షోల్లసితయై మంద స్మితముఖారవిందముతో నిట్లు పల్కెను. “దైత్యేంద్రా! నీవంటిసదాచార సంపన్ను డైనవిజ్ఞుడైన పురుషునే సదా విద్వాంసులు ప్రశంసింతురు, ప్రీతి

స్త్రీయట్టి సత్పురుషునే భర్తగా బొందవలెనని నిరంతర మాకాంక్షించును. ఎందువలననగా స్త్రీచే జయింపబడిన పురుషు డపవిత్రుడు, నిందాపాత్రుడు నగును. స్త్రీకి లొంగియుండు మనుష్యుడు పితరులచేత, దేవతలచేత తుదకు బంధువులచేతగూడ నిందింపబడగలడు. తలిదండ్రులు, సహోదరులు మొదలగు వారందఱు వానిని దిరస్కరింతురు.

శుద్ధ్యేద్విప్రో దశాహేన జాతకే మృతకే తథా ।
భూమిపో ద్వాదశాహేన వైశ్యః పంచదశాహతః ॥
శూద్రో మాసేన వేదేషు మాతృవద్వర్ణసంకరః ।
అశుచిః స్త్రీజితః శుద్ధ్యేచ్చితాదాహేన కాలతః ॥ (89, 90)

జననమరణాశౌచములయందు బ్రాహ్మణుడు పదిదినములలోను, క్షత్రియుడు పండ్రెండు దినములలోను, వైశ్యుడు పదునైదుదినములలోను శూద్రుడొకమాసములోను, వర్ణసంకరసంజాతులు సమయానుసారముగను బవిత్రులు కాగలరు. కాని స్త్రీజితుడైనపురుషుడు మరణానంతరమే పవిత్రుడు కాగలడు.

అంతియే కాదు, అతనిచే సమర్పింపబడిన పిండములను, దర్పణములను పితృదేవత లిచ్ఛాపూర్వకముగ స్వీకరింపరు. దేవతలు సహితము వారిపూజల నంగీకరింపరు. స్త్రీచే జయింపబడిన మానవుని జ్ఞానము, తపము, జపము, హోమము, విద్య, యశము సర్వము నశింపగలదు. స్త్రీ యొసంగు సదాలోచనలను పురుషు డంగీకరింపవలెను, ఆమె దురాలోచనలను దిరస్కరింపవలెను.

కావున గాంధర్వవిధిని నన్ను వివాహమాడుటకు నీకనుజ్ఞ నొసంగుచున్నాను. కేవలము నిన్ను బరీక్షించుటకే నే నావిధముగ సంభాషించితిని. స్త్రీలు తమ్ము జయింపగల్గిన సమర్థులనే వరింతురు.

కృత్వా పరీక్షాం కాన్తస్య వృణోతి కామినీ వరమ్ ॥ (93)

వరుని బాగుగ బరీక్షించి యుత్తముడుగ నిర్ణయించిన యనంతరమే పతిగా గ్రహించుట యుత్తమస్త్రీల ప్రధానకర్తవ్యము.

వరాయ గుణహీనాయ వృద్ధాయాజ్ఞానినే తథా ।
దరిద్రాయ చ మూర్ఖాయ రోగిణే కుత్సితాయ చ ॥

అత్యన్తకోపయుక్తాయ చాత్యన్తదుర్ముఖాయ చ ।
పఙ్గులాయాఙ్గహీనాయ చాన్ధాయ బధిరాయ చ ॥
జడాయ చైవ మూకాయ క్లీబతుల్యాయ పాపినే ।
బ్రహ్మహత్యాం లభేత్సోఽపి యః స్వకన్యాం దదాతి చ ॥ (94-96)

గుణహీనుడు, వృద్ధుడు, అజ్ఞాని, దరిద్రుడు, మూర్ఖుడు, రోగగ్రస్తుడు, కుత్సితుడు, అత్యంతకోపయుక్తుడు, అత్యంతదుర్ముఖుడు, అంగవిహీనుడు, అంధుడు, బధిరుడు, జడుడు, మూగ, క్లీబతుల్యుడు, (నపుంసకుడు) పాపాత్ముడునైన వరునకు సర్వలక్షణ సంపన్నయైనతనకొమార్తె నిచ్చికళ్యాణ మొనరించువాడు బ్రహ్మహత్యాపాపము నొందగలడు.

శాన్తాయ గుణినే చైవ యూనే చ విదుషేఽపి చ ।
వైష్ణవాయ సుతాం దత్త్వా దశవాజీఫలం లభేత్ ॥ (97)

శాంతస్వభావసంపన్నుడు, విద్వాంసుడు, సద్గుణసమన్వితుడు, శ్రీహరి భక్తుడునగుయువకునకు దనకన్యను దానమొనరించునాతడు దశాశ్వమేధయజ్ఞ ఫలము గాంచును.

యః కన్యాపాలనం కృత్వా కరోతి విక్రయం యది ।
విపదా ధనలోభేన కుమ్భీపాకం స గచ్ఛతి ॥ 98

"తనకూతురును బెంచి పెద్దదానిజేసి యాపదవలననో, ధనలోభము ననో విక్రయించినవాడు కుంభీపాకనరకము పొందగలడు". అట్టిపాపాత్మునకు నరకములో నాహారముగ నాకన్యమలమూత్రము లొసంగబడును. కీటకముల చేతను, గాకములచేతను నాపాపిశరీరము భక్షింపబడును. ఆతడు దీర్ఘ కాలము ఘోరనరక మనుభవించి రోగగ్రస్తుడై మరల జన్మించి దుఃఖంచును.

ఇట్లు పల్కి తులసి మౌనమువహించెను. ఆసమయముననే వారియెదుట బ్రహ్మదేవుడు సాక్షాత్కరించి యిట్లాదేశించెను. "శంఖచూడా! ఏల విలంబ మొనరించెదవు? నీవు పురుషులయందు శ్రేష్ఠుడవు, ఈమె స్త్రీలయం దుత్త మురాలు, తక్షణమే యీకన్యారత్నము యొక్క పాణిని గ్రహింపుము. తులసీ! సకలగుణసంపన్నుడై నశంఖచూడుని కేల యీ పరీక్ష! దేవతలను, మానవులను, దానవులను జయింపగలశక్తి వానియందు గలదు. లక్ష్మి నారా

యణుని, రాధ శ్రీకృష్ణుని, పృథ్వి వరాహమూర్తిని, దక్షిణ యజ్ఞమూర్తిని, అనసూయ అత్రిమహర్షిని, దమయంతి నలుని, రతీదేవి మన్మథుని, అదితి కశ్యపుని, అరుంధతి వశిష్ఠమహర్షిని, అహల్య గౌతముని, దేవహూతి కర్దముని, తార బృహస్పతిని, శతరూప మనువును, శచి యింద్రుని, పుష్టి గణేశ్వరుని, దేవసేన స్కందుని, మూర్తి ధర్మమును పతులుగాబొంది శోభించుచున్నట్లే నీవు కూడ శంఖచూడుని బతిగబొంది శోభిల్లుము.

పశ్చాత్ ప్రాప్స్యసి గోవిన్దం గోలోకే పునరేవ చ ।
చతుర్భుజం చ వైకుణ్ఠే శంఖచూడే మృతే సతి ॥ (114)

దేవీ! శంఖచూడుని మరణానంతరము నీవు గోలోకమందు విరాజిల్లు శ్రీకృష్ణపరమాత్మను జేరగలవు. తదనంతరము వైకుంఠమందు విరాజిల్లు చతుర్భుజుడైన విష్ణువును బొందగలవు.

నారదా! యిట్లు శంఖచూడుని దులసీదేవిని బ్రహ్మ యాదేశించి యంతర్థానమందెను. తదనంతరము శంఖచూడుడు గాంధర్వవిధిని దులసీదేవిని బరిణయమాడి పత్నీసహితముగ దనరాజధాని కరిగెను. తనభార్యయైనతులసీదేవితో నా దైత్యేశ్వరుడు పెద్దకాలము సుఖశాంతులతో రాజ్యమును బరిపాలించెను. దేవతలు, దానవులు, గంధర్వులు, కిన్నరలు, మానవులు మొదలగు వా రందఱు శంఖచూడుని పరిపాలనాకాలమందు శాంతచిత్తులై పరస్పరానురాగముతో జీవించిరి. కాని యధికారచ్యుతులైన దేవతల స్థితి మాత్రము మిక్కిలి శోచనీయమైయుండెను. వా రందఱు బ్రహ్మలోకమున కేగి తమ రాజ్యమిప్పించవలసినదిగ విధాత ననేక విధముల బ్రార్థించిరి.

విధాత దేవతలందఱ దోడ్కొని కైలాసమున కరిగి శంకరు నాశ్రయించెను. శంకరుడు వీరినందఱిని దోడ్కొని శ్రీహరి నాశ్రయించుటకు వైకుంఠమున కరిగెను. నారదా! వైకుంఠము సర్వులకు దుర్లభము. అచటజననమరణములకు, జరావ్యాధులకు దావు లేదు. వైకుంఠమం దున్న షోడశద్వారములను దరించి ద్వారపాలకులైనపార్షదుల యనుమతి పొంది శివబ్రహ్మాది దేవతలు శ్రీహరి దివ్యసభను బ్రవేశించిరి. ఆ దివ్యసభలో దేవర్షులు, శ్రీహరి పార్షదులు విరాజమానులై యుండిరి. వైకుంఠము పరమ మనోహరము. అదిచిన్మయమణులచే నిర్మితము. మణిమయ[illegible],

గోటానుకోట్ల మండలాకారరత్నమయదర్పణములతోను, బద్మరాగమణినిర్మిత పద్మములతోను, శమంతకమణినిర్మిత ప్రదేశములతోను, నింద్రనీలమణియుక్త స్తంభములతోను, నుత్తమకాంతియుక్తములైన సువర్ణములతోను, దివ్య హర్మ్యములతోను, దివ్యపారిజాతపుష్పోద్యానములతోను, సమన్వితమై శోభించుచుండెను.

అచట శ్రీమహావిష్ణువు వేంచేసియున్న దివ్యసభాభవనము పారిజాత పుష్పమాలికలచే నలంకరింపబడియుండెను. కస్తూరీకుంకుమ సమ్మిళితము, సుగంధయుక్తము నగుచందనద్రవముచే నాసభాభవనప్రాంగణము సంస్కృత మైయుండెను. శ్రీహరి తదనుపమ దివ్యసభామధ్యమందు జిన్మయరత్ననిర్మిత సింహాసనారూఢుడై, నక్షత్రములనడుమ జందునివలె పరబ్రహ్మ తేజ ముతో బ్రకాశించుచుండెను. ఆయనను బ్రహ్మాదిదేవత లత్యంతనయనా నందముగ వీక్షించి చరితార్థులైరి. దివ్యకిరీటకుండల వనమాలావిభూషితుడు, చందనచర్చితుడు, శంఖచక్రగదాపద్మధారియు, జతుర్భుజుడు నగుశ్రీహరి సచ్చిదానందవిగ్రహ మత్యంతశాంతమయముగనుండెను. శ్రీమహాలక్ష్మి యా దేవాదిదేవుని పాదపద్మ సేవయందు సంలగ్నురాలై యుండెను. గంగాసరస్వ తులు వింజామరలను విసరుచు శ్రీహరిని సేవించుచుండిరి.

శ్రీమన్నారాయణుని దర్శించి సకలదేవతలు పులకితగాత్రులై యానంద బాష్పనయనములతో శిరములను వంచి వినమ్రభావముతో నాదేవాది దేవు ననేకవిధముల బ్రార్థించిరి. బ్రహ్మదేవుడు సకలదేవతల యేకైకా భీష్ట మైనస్వరాజ్యకాంక్షను శ్రీహరికి విన్నవించెను. సర్వజ్ఞుడైనశ్రీమహా విష్ణువు బ్రహ్మప్రార్థనల నాలకించి సంతుష్టుడై యిట్లు పల్కెను.

**శ్రీహరి పలికెను :**

బ్రహ్మాదిదేవతలారా! శంఖచూడుడు పూర్వజన్మమందు సుదాము డను నాపార్షదుడు, శ్రీరాధాశాపమువలన వర్తమానకాలములో నసురేశ్వరుడై జన్మించినాడు. రాధాశాపము నొక్కక్షణకాల మనుభవింపవలసినదిగ నేను నాపార్షదు డైనసుదాము ననుగ్రహించితిని. గోలోకములో క్షణకాలమనిన భూమండలముపై మన్వంతరమని గ్రహింపుడు. దేవతలారా! నేను మీకొక దివ్యత్రిశూలము ననుగ్రహించుచున్నాను. సదాశివుడే స్వయముగ మంత్రి

దత్తమైనయీదివ్యాయుధముచే శంఖచూడుని సంహరించి వానికి శాపమోపవిచనమనుగ్రహింపగలడు. శంఖచూడుడు సర్వమంగళప్రద మైననాదివ్యకవచమును గంఠమందు ధరించియున్నాడు. నాకవచప్రభావమువలన నత డవధ్యుడై సకల విశ్వమును జయించెను. సమయానుసారముగ నాయనన్యభక్తునకు శాప విమోచన మనుగ్రహించుటకు నేనే స్వయముగ బ్రాహ్మణవేషధారినై నా దివ్యకవచమును యాచించి స్వీకరింపగలను. ఏనాడు శంఖచూడుని యర్థాంగి సతీవ్రతము భంగము కాగలదో యపుడే శంఖచూడుడు మరణింపగలడు. నేనే మాయామానుష వేషధారినై తులసి యొనరించు శంఖచూడ రక్షక మైన సతీవ్రతమునుండి యామెను విరమింపజేసెదను. శంఖచూడుడు మరణింపగలడు. అతని మరణానంతరము తులసీదేవి నన్ను జేరగలదు.

నారదా! ఇట్లు జగత్ప్రభు వైన శ్రీహరి దేవతల ననుగ్రహించి దివ్య త్రిశూలమును శంకరునకు బ్రసాదించెను. త్రిశూలపాణియై రుద్రుడు బ్రహ్మాదిదేవతలతో గూడి శంఖచూడ విమోచనార్థమై యవనికి బయనించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని తులస్యుపాఖ్యానమను
బదునాఱవ అధ్యాయము
సంపూర్ణము.

# పదునేడవ అధ్యాయము

## పుష్పదంతుడు దూతయై శంఖచూడునికడకు వెడలుట, శంఖచూడుడు తులసికి జ్ఞానోపదేశము చేయుట.

**శ్రీనారాయణఋషి పలికెను :**

మహామునీ! బ్రహ్మదేవుడు శంఖచూడ సంహారకార్యమును నిర్వర్తింప వలసినదిగ శివుని బ్రార్థించి స్వాలయమునకు మఱలిపోయెను. చంద్రభాగా నదీతీరమం దున్నయొకవటవృక్షమూలమున మహాదేవుడు సకలదేవతాభ్యు దయముకొఱకు బ్రమథగణములతో గొలువుదీరి యుండెను. శంకరుడు తన భక్తుడైనపుష్పదంతు డనుగంధర్వరాజును దూతగ శంఖచూడుని నగరమునకు బంపెను. పుష్పదంతుడు శీఘ్రముగ బ్రస్థానమొనరించి శంఖచూడుని రాజ ధానికి జేరెను. అది మహేంద్రుని నగరముకంటె బరమోత్కృష్టమైనది. అచట కుబేరభవనములవంటి భవనము లెన్నియో కలవు. ఆనగర మైదు యోజనముల విస్తీర్ణము కలదియై పొడవులో రెండురెట్లధికమై స్ఫటికమణి సమానరత్ననిర్మిత ప్రాకారములతో బరివేష్టింపబడి శోభించుచుండెను. దుస్తర ములైన నేడగడ్తలు కల్గి తన్నగర మత్యంతసురక్షితముగ విరాజిల్లుచుండెను. ప్రజ్వలితాగ్ని సదృశములై నిరంతరము ప్రకాశించు కోటానుకోట్ల రత్నము లతో నానగరము నిర్మింపబడెను. ఆ రాజధానిలో శతాధిక రాజమార్గములు, మణినిర్మిత వేదికలు కలవు. వణిక్ శ్రేష్ఠులచే నిర్మింపబడిన బహుమూల్య ములు నానావస్తుపూర్ణములు నగుభవనములతో నున్నతోన్నత హర్మ్యము లతో నానగరశోభ ద్విగుణీకృత మయ్యెను. సిందూరసమారుణవర్ణ మణి నిర్మితాసంఖ్యాక దివ్యసుందరాశ్రమము లానగర శోభను బెంపొందింప జేయుచున్నవి.

మునీశ్వరా! చిత్రవిచిత్రమైన యానగరశోభ నాశ్చర్యచకితుడై తిల కించుచు గంధర్వేశ్వరుడైనపుష్పదంతుడు శంఖచూడభవనమును సమీపించెను. దైత్యేశ్వరుని రాజధాని వలయాకారముగ నున్నది. ఆనగరమధ్య ప్రదేశమున దైత్యేశ్వరుని దివ్యహర్మ్యము కలదు. ప్రజ్వలితాగ్నిజ్వాలా సదృశములైననాల్గుపరిఖ లాదివ్యభవనమును రక్షించుచున్నవి. శత్రువుల కాభవనప్రవేశము సుదుర్గమము, కాని హితైషుల కత్యంత సుగమము.

అత్యంతోన్నతములైన గగనచుంబిత మణినిర్మితప్రాకారములు దైత్యేంద్రుని గృహమును బరివేష్టించియున్నవి.

సర్వోత్తమమణులతో, నిర్మితములైనననేక మందిరములతో, నసంఖ్యాకమణినిర్మిత సోపానములతో, రత్నఖచితస్తంభములతో శంఖచూడుని యంతఃపురము విరాజిల్లుచుండెను. ఆహర్మ్యమునకు ద్వాదశద్వారములు కలవు. ప్రతిద్వారమందు భయంకరాకారులు, పింగళాక్షులు, తామ్రవర్ణులు, శూలధారులు నగుపురుషులు కావలియున్నారు. అతని రాజధానిని దివ్యాస్త్రధారులు, మహాబలపరాక్రమ సంపన్నులు నగుపదికోట్లదానవులు రక్షించుచున్నారు. పుష్పదంతుడు హరునిదూత యని యెఱింగి యాద్వారపాలకులు వానికి ప్రవేశానుమతి నొసంగిరి. ద్వాదశద్వారములను దాటి తుదకు పుష్పదంతుడు శంఖచూడ సభాభవనము జేరెను. సకలదానవశ్రేష్ఠులు ఏకత్రితులై యున్నయామహాసభామధ్యమున నక్షత్రములనడుమ పూర్ణచంద్రునివలె రత్నమయసింహాసనాధీశుడై యున్న దానవేంద్రుని శివదూత గాంచి యచ్చెరువొంది మహాదేవుని సందేశము నిట్లు నివేదించెను. "దానవేంద్రా! నేను శంకరుని దూతను; పుష్పదంతు డనుగంధర్వేశ్వరుడను. పరమేశ్వరునియాదేశానుసారముగ దేవతలకు స్వరాజ్యమును బ్రకటించి వారియధికారములను దిరిగి వారి కప్పగింపుము. ఎందువలన ననగ నీచే బరాజితులైన దేవతలు శ్రీహరి దివ్యచరణముల నాశ్రయించి యభయమును బొందిరి. శ్రీహరి ప్రదత్తమైనదివ్యత్రిశూలమును ధరించి హరుడు చంద్రభాగానదీతీరమందున్న వటవృక్షమూలమున ప్రమథగణపరివేష్టితుడై నీ ప్రత్యుత్తరముకొఱకె ఎదురు చూచుచున్నాడు. కావున శంఖచూడా! దేవతల రాజ్యమును బరిత్యజించెదవా? లేక కాలాంతకునితో సంగ్రామ మొనరించెదవా? ఏది నీ నిర్ణయమో తేటతెల్ల మొనరించిన దానిని గిరిజానాథునకు విన్నవింపగలను".

నారదమునీంద్రా! పుష్పదంతుని సందేశము నాలకించి సకలదనుజాధిపతియైనశంఖచూడసార్వభౌముడు మందహాసముల నొనరించినవాడై మఱునాటి ప్రాతఃకాలమున స్వయముగ మహాదేవుని దర్శింపగలనని నీవింక నిష్క్రమింపవచ్చునని ప్రత్యుత్తర మొసంగెను. పుష్పదంతుడు శీఘ్రముగ భూతనాథుని సమ్ముఖమున కేగి శంఖచూడుని సైన్యపాటవమును గుఱించి, యుద్ధోపకరణములను గుఱించి వర్ణించి దానవేశ్వరుని సందేశమును విన్నవించెను.

శంకరుడు సంకల్పింపగనే గార్త్తికేయుడు, వీరభద్రుడు, నందీశ్వరుడు, మహాకాలుడు, సుభద్రుడు, విశాలాక్షుడు, పింగళాక్షుడు, వికంపనుడు, విరూపాక్షుడు, వికృతి, మణిభద్రుడు, కపిలాక్షుడు, దీర్ఘదంష్ట్రుడు, వికటుడు, తామ్రలోచనుడు, కాలకంఠుడు, బలిభద్రుడు, కాలజిహ్వుడు, కుటీచరుడు, బలోన్మత్తుడు, దుర్జయుడు, రణశ్లాఘీ, దుర్గముడు మొదలగు ప్రమథగణేశ్వరులు, అష్టభైరవులు, ఏకాదశరుద్రులు, అష్టవసువులు, ఇంద్రాది దేవతలు, ద్వాదశాదిత్యులు, హుతాశనుడు, చంద్రుడు, విశ్వకర్మ, అశ్వినీ దేవతలు, కుబేరుడు, యముడు, జయంతుడు, నలకూబరుడు, వాయువు, వరుణుడు, బుధుడు, మంగళుడు, ధర్మదేవత, శని, యీశానుడు, మహావీరుడు, కామదేవుడు మున్నగువారందఱు శివసన్నిధానమున కేతెంచిరి.

ఉగ్రదంష్ట్ర, దీర్ఘదంష్ట్ర, కోటకీ, కైటభీ ప్రభృతి శక్తులచే బరివేష్టితయై మహోగ్రస్వరూపిణి యైనభద్రకాళి శివాజ్ఞచే సకలప్రమథగణ దేవతా మధ్యమున సాక్షాత్కరించెను. ఆదిశక్తికళాసంభూత యైనభద్రకాళిని నే నేమని వర్ణింపగలను?

స్వయం శతభుజా దేవీ భద్రకాలీ భయంకరీ ।
రత్నేన్ద్రరాజఖచితవిమానోపరిసంస్థితా ॥
రక్తవస్త్రపరీధానా రక్తమల్యానులేపనా ।
నృత్యన్తీ చ హసన్తీ చ గాయన్తీ సుస్వరం ముదా ॥
అభయం దదాతీ భక్త మభయా సా భయం రిపుమ్।
బిభ్రతీ వికటాం జిహ్వాం సులోలాం యోజనాయతామ్ ॥
ఖర్పరం వర్తులాకారం గమ్భీరం యోజనాయతమ్।
త్రిశూలం గగనస్పర్శిశక్తిం వై యోజనాయతామ్ ॥
శంఖం చక్రం గదాం పద్మం శరాం శ్చాపం భయంకరమ్ ।
ముద్గరం ముసలం వజ్రం ఖడ్గం ఫలక ముజ్జ్వలమ్ ॥
వైష్ణవాస్త్రం వారుణాస్త్ర మాగ్నేయం నాగపాశకమ్ ।
నారాయణాస్త్రం బ్రహ్మాస్త్రం గాంధర్వం గారుడం తథా ॥
పార్జన్యం వై పాశుపతం జృమ్భణాస్త్రం చ పార్వతమ్।
మాహేశ్వరాస్త్రం వాయవ్యం దణ్డం సంమోహనంతథా॥
అవ్యర్థ మస్త్రశతకం దివ్యాస్త్రశతకం పరమ్ ।
ఆగత్య తత్ర తస్థౌ సా యోగినీనాం త్రికోటిభిః ॥ (39-48)

నారదా! శతభుజములు కల్గి ప్రకాశించు భద్రకాళి మహాభయంకరి. రత్నేంద్రరాజఖచిత విమానము నధిరోహించి యామె యరుదెంచెను. ఆమె రక్తవస్త్రములను ధరించి రక్తమాల్యానులేపనములతో నలంకరించుకొని యత్యంత ముదాన్వితయై యట్టహాసము లొనరించుచు నాట్యమాడుచు భగవంతుని దివ్యగుణములను గాన మొనరింపదొడంగెను. ఆ జనని యభయముద్రాసమన్వితయై భక్తుల కభయమును బ్రసాదించును, రిపులకు భయము నొసంగును. ఆమె జిహ్వా వికరాలము, యోజనదీర్ఘము. ఆమె యొక హస్తమందు వర్తులాకారమై యోజనాయుతమైన గంభీర ఖర్పరమును ధరించి యుండెను. మఱియొక హస్తమందు గగనచుంబిత త్రిశూలమును మఱియొకహస్తమందు యోజనప్రమాణశక్తిని ధరించి యుండెను. ఆమె వివిధ హస్తములలో శంఖచక్రగదాపద్మములు, భయంకర శరచాపములు, ముద్గరము, ముసలము, వజ్రము, ఉజ్జ్వల ఖడ్గాయుధము విరాజిల్లుచున్నవి. వైష్ణవాస్త్రము, వారుణాస్త్రము. ఆగ్నేయాస్త్రము, నాగపాశము, నారాయణాస్త్రము, బ్రహ్మాస్త్రము. గాంధర్వాస్త్రము, గారుడాస్త్రము, పార్జన్యాస్త్రము, పాశుపతాస్త్రము, జృమ్భణాస్త్రము, పార్వత్యాస్త్రము, మాహేశ్వరాస్త్రము, వాయవ్యాస్త్రము, సంమోహనాస్త్రము మున్నగు శతాధిక దివ్యాస్త్రములను ధరించి యాపరమయోగిని మూడుకోట్ల యోగినులు వెంటరాగా శంకరుని సమ్ముఖమున కరుదెంచెను. ఆమె ననుసరించి యసంఖ్యాక ఢాకినులు, మూడుకోట్ల వికటలు నరుదెంచిరి. వారి వెనుక భూతప్రేతపిశాచఢాకిన్యాదిగాగల కూష్మాండబ్రహ్మరాక్షస భేతాళాది గణము లన్నియు నరుదెంచెను. వీరేగాక యక్షులు, రాక్షసులు, కిన్నరలు మొదలగువారందఱు మహాదేవునాజ్ఞ శిరవసావహించి యాప్రదేశమున సమావేశమైరి. ఈయసంఖ్యాకగణము లన్నింటికి నేకైక సైన్యాధ్యక్షుడైనకార్తికేయుడు చంద్రశేఖరునకు వినీతభావముతో సాష్టాంగ దండప్రణామము లర్పించి జనకుని యాజ్ఞకొఱకై నిరీక్షింపదొడంగెను.

పుష్పదంతుడు నిష్క్రమించిన తరువాత శంఖచూడుడు సభను జాలించి యంతఃపురమున కరిగి జరిగినవిషయముల నన్నింటిని దనసహధర్మచారిణి యైన తులసికి వివరించెను. మహాదేవుడే యుద్ధమునకు దరలివచ్చెనని తెలియగనే తులసీదేవి యోష్ఠములు, తాలుకములు శుష్కించినవి. ఆమె హృదయ

మత్యంతసంతప్త మయ్యెను. ఆపరమసాధ్వి యగుతులసి భర్త నుద్దేశించిమధుర ముగ నిట్లు పల్కెను. "ప్రాణబంధూ! నాథా! మీరే నా ప్రాణముల కధిష్ఠాతృదైవము. నాప్రాణములను రక్షింపుము, క్షణమాగుము, కొంతతడవు మిమ్ముల నాదరపూర్వకముగ దర్శించుకొననిండు. నాథా! నాప్రాణములు కంపించుచున్నవి. ఎందువలననగా నేను రాత్రి యంతిమక్షణములో నొక దుస్స్వప్నమును గాంచితిని." మహారాజగు శంఖచూడుడు మహాజ్ఞాని. ఆతడు తులసి పల్కినవచనముల నాలకించి చలింపక భోజనపానీయాదులను స్వీకరించి సుఖాసీనుడై తులసితో సత్యములు, హితములు నగుయథార్థవచనముల నిట్లు పల్కెను.

## శంఖచూడుడు పలికెను :

కాలేన యోజితం సర్వం కర్మభోగనిబద్ధనమ్ ।
శుభం హర్షం సుఖం దుఃఖం భయం శోక మమఙ్గలమ్॥ (౮౮)

"కర్మభోగబంధనములన్నియు కాలసూత్రమందు బంధింపబడియున్నవి. శుభము, హర్షము, సుఖము, దుఃఖము, భయము, శోకము, మంగళము మొదలగున వన్నియు గాలాధీనములే." సమయానుసారముగ బీజమంకురించి వృక్షమై శాఖలతో విస్తరించి పుష్పసంపన్నమై ఫలములను బ్రసాదించి తుదకు గాలప్రభావమువలన నశించునట్లు సమయానుసారముగ విశ్వము లుత్పన్నములై కాలము సమాప్తము కాగానే నశింపగలవు. కాలాధీనుడై బ్రహ్మ సృష్టింపగలడు, విష్ణువు పరిపాలింపగలడు, రుద్రుడు సంహరింపగలడు. జగములను పాలించు వీ రందఱు కాలమున కధీనులే యని తెలిసికొనుము. కాలమువలననే భూతము లుత్పన్నములై కాలమాసన్నమైనపుడు లయింపగలవు.

బ్రహ్మవిష్ణుశివాదీనా మీశ్వరః ప్రకృతేః పరః ।
స్రష్టా పాతా చ సంహర్తా స కృష్ణస్తంసేన సర్వదా ॥
కాలే స ఏవ ప్రకృతిం నిర్మాయ స్వేచ్ఛయా ప్రభుః ।
నిర్మాయ ప్రాకృతా న్సర్వా న్విశ్వస్థాంశ్చ చరాచరాన్ ॥
ఆబ్రహ్మస్తమ్బపర్యన్తం సర్వం కృత్రిమ మేవ చ ।
ప్రవదన్తి చ కాలేన నశ్యత్యపి హి నశ్వరమ్ ॥

భజ సత్యం పరం బ్రహ్మ రాధేశం త్రిగుణాత్పరమ్ ।
సర్వేశం సర్వరూపం చ సర్వాత్మానం త మీశ్వరమ్ ॥
జనం జనేన సృజతి జనం పాతి జనేన యః ।
హరే జ్జనం జనేనైవ తం కృష్ణం భజ సంతతమ్ ॥ (61 - 65)

బ్రహ్మవిష్ణుశివాది సకలదేవతలకు శ్రీకృష్ణపరమాత్మయే యధీశ్వరుడు, ప్రకృతి కతీతుడు. ఆయననే స్రష్టయని, పాలించువాడని, సంహర్తయని కీర్తింతురు. ఆయన సదా తన సంపూర్ణాంశచే విరాజమానుడై యుండును. ఆయనయే సమయానుసారముగ స్వేచ్ఛాపూర్వకముగ ప్రకృతిని ప్రాదుర్భవింపజేసి విశ్వములలో సకలచరాచరపదార్థములను రచించును. బ్రహ్మమొదలు స్తంబపర్యంతముగల సర్వజగములు కృత్రిమములే. కాలమువలననే యవి యావిర్భవించి కాల మాసన్నమైనపుడు నశింపగలవు. కావున సర్వేశ్వరుడు, సర్వస్వరూపుడు, సర్వాత్మకుడు, సత్యస్వరూపుడు, పరబ్రహ్మమూర్తి, త్రిగుణాతీతుడునైన రాధేశుని భజింపుము. ఆయన జనులచే జనులను సృష్టించును, రక్షించును, సంహరించును, కాన శ్రీకృష్ణపరమాత్మనే సతతము భజింపుము.

ఆయన యాజ్ఞవలననే శీఘ్రగామియై పవనుడు వీచుచున్నాడు' సూర్యు డాకాశములో ప్రకాశించుచున్నాడు, ఇంద్రుడు సమయానుసారముగ వర్షించుచున్నాడు, మృత్యువు ప్రాణులందు విహరించుచున్నది, అగ్ని దహింపగలుచున్నది, చంద్రాదిగ్రహములు భయభీతములై యాకాశమండలములోని రాశిచక్రములో బరిభ్రమించుచున్నవి.

మృత్యోర్మృత్యుం కాలకాలం యమస్య చ యమం పరమ్ ।
విభుం స్రష్టుశ్చ స్రష్టారం పాతుః పాలకమేవ చ ॥
సంహర్తారం చ సంహర్తు స్తం కృష్ణం శరణం వ్రజ ।
కో బన్ధుశ్చైవ కేషాం వా సర్వబన్ధుం భజ ప్రియే ॥ (67, 68)

ప్రియా! మృత్యువునకు మృత్యువు, కాలమునకు గాలము, యమునకు యముడు, బ్రహ్మకు బ్రహ్మ, సకలజగములకు జననియు, సంహారకారకులకు సంహారకుడు నగు నాపరమప్రభువయిన శ్రీకృష్ణపరమాత్మను శరణు జొచ్చుము. దేవీ! నశ్వరజగములలో నెవ రెవరికి బంధువులు? సర్వులకు నేకైకబంధు వగు శ్రీకృష్ణునే యుపాసింపుము. *

విధాత మన నిర్వైర నొకసూత్రమున బంధించెను, కావుననే నేను నీ వలన నీమాయాజగద్వ్యవహారములందు దగుల్కొంటిని. మరల భవబంధ విముక్తి విధీచ్ఛపై నాధారపడియున్నది.

అజ్ఞానీ కాతరః శోకే విపత్తౌ చ న పణ్డితః ।
సుఖం దుఃఖం భ్రమత్యేవ చక్రనేమిక్రమేణ చ ॥ (79)

"శోకములు సంభవించినపు డజ్ఞాని మాత్రమే దుఃఖించును, ఎన్ని విపత్తులు కల్గినను బండితుడు చలింపడు. సుఖములు, దుఃఖములు కాలచక్రానుసారముగ జీవులం దొకదానివెంట మఱియొకటి భ్రమించుచుండగలవు". కావున దేవీ! నీవు మున్ను బదరికాశ్రమములో నొనరించిన తపఃఫలప్రభావమువలన యథార్థముగ సర్వేశ్వరుడైన శ్రీమన్నారాయణుడే యచిరకాలములో నీకు గాంతుడుగ లభింపగలడు. నేనుగూడ నీనశ్వరదానవదేహమును బరిత్యజించి గోలోకము జేరగలను. దేవీ! గోలోకములో విరాజిల్లు బృందావనమున ననతికాలములోనే నీవు గోవిందుని బొందగలవు. రాధాజనని శాపవశమున పరమదుర్లభమైనపవిత్రభారతవర్షముపై నే జన్మించితిని. మరల నాగోలోకగమనము సునిశ్చితము, కావున నీవు శోకింపబనిలేదు.

ఇట్లు శంఖచూడుడు తనకు భాండీరవనములో శ్రీకృష్ణు డుపదేశించిన దివ్యకాలజ్ఞానమును దులసి కుపదేశించెను. కాలజ్ఞానము నాలకించిన తులసి సర్వజగములు నశాశ్వతములని, గ్రహించి దుఃఖమును వీడి సుస్థిరచిత్త యయ్యెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని తులసీశంఖచూడుల
సంవాదమను పదునేడవ అధ్యాయము
సంపూర్ణము.

# పదునెనిమిదవ అధ్యాయము

## శంఖచూడుడు పుష్పభద్రనదీ తటమునకు వెడలుట, అచట నతడు శంకరుని దర్శించి, ఆయనతో సంభాషించుట.

శ్రీనారాయణఋషి పలికెను :

నారదా! శ్రీకృష్ణపరమభక్తు డైనశంఖచూడుడు బ్రహ్మముహూర్త మందే శయ్యనుండి లేచి శ్రీకృష్ణుని మనసార ధ్యానించి నిత్యనైమిత్తిక కార్యములను నిర్వర్తించుకొని, మరల నేకాగ్రతతో భగవంతుని యారాధన సంపన్న మొనరించెను. తదనంతరము బహుమూల్యరత్నములను, మణులను నమూల్యవస్త్రములను, గోవులను, సువర్ణములను, గ్రామములను సద్బ్రాహ్మణులకు, యాచకులకు దానము లొనరించి, తనకుమారుని బట్టాభిషిక్తుని గావించి, మూడుకోట్లాశ్వికదళములు, ననేకగజబలములు, బదివేలరథములు, మూడుకోట్లు ధనుర్ధారులు, మూడుకోట్లు శూలపాణు లైనకాల్బలము వెంట రాగా గవచశిరస్త్రాణాదులను ధరించి యుత్తమవిమాన మధిష్ఠించి కులగురువులను ముందుంచుకొని యుమాపతిని దర్శించుటకై బయలుదేరెను.

దేవర్షీ! చంద్రభాగానదీతటమందు సుందరము, విశాలము నగునక్షయ వటవృక్షము కలదు. ఆపరిసరములలో బెక్కు సిద్ధాశ్రమములు విరాజిల్లి యున్నవి. కావుననే యీపవిత్రప్రదేశమును సిద్ధక్షేత్రమని కీర్తింతురు. సిద్ధక్షేత్రము పవిత్ర భారతవర్షములో నలరారు పావన ప్రదేశము. దీనినే కపిల మునీశ్వరుని తపోభూమి యందురు. ఇది పశ్చిమసముద్రమునకు బూర్వభాగమున, మలయపర్వతమునకు బశ్చిమమున నున్నది. ఇది శ్రీశైలపర్వతమున కుత్తర దిశయం దున్నది, గంధమాదన పర్వతమునకు దక్షిణదిశయం దున్నది. ఈప్రదేశములో బ్రవహించుచున్న స్వచ్ఛజలయుక్త పుణ్యనదినే పుష్పభద్రయనియు, చంద్రభాగయనియు నందురు. ఈపుణ్యనదీ జననస్థానము హిమాలయపర్వతము. కొంతదూరము ప్రవహించిన పిదప చంద్రభాగా నదియందు శరావతి యను నది సంగమించుచు. పుష్పభద్రానది గోమంత పర్వతమునకు వామపార్శ్వము నుండి ప్రవహించుచు బశ్చిమసముద్రాభి

ముఖుడై ప్రస్థానమొనరించును. ఆపవిత్రప్రదేశమం దున్నవటవృక్షమూల ములో ననేకకోటిగ్రీష్మసూర్యకాంతిసమప్రభుడు, బ్రహ్మతేజోమండలోద్భాసితుడు, త్రిశూలడమరుకధారి, భస్మాంగచర్చితుడు, వ్యాఘ్రచర్మాంబరధారి, తప్తకాంచన వర్ణసన్నిభుడు, జటాజూటధారి, పంచవక్త్రుడు, నాగయజ్ఞోపవీత సమన్వితుడు, మృత్యుంజయుడు, కాలమృత్యుస్వరూపుడు, సకలవిశ్వాలయ కారుడు, భక్తానుగ్రహవిగ్రహుడు, భక్తమృత్యుహారుడు, శాంతస్వరూపుడు, మనోహరుడు, గౌరీకాంతుడు, తాపసతపఃఫలప్రదాత, సకలసమ్పత్ప్రదాత, శీఘ్ర సంతుష్టుడు ప్రసన్నముఖారవిందుడు నగుమహాదేవు డాసీనుడై యుండెను.

విశ్వనాథం విశ్వరూపం విశ్వబీజం చ విశ్వజమ్ ।
విశ్వమ్భరం విశ్వవరం విశ్వసంహారకారణమ్ ॥
కారణం కారణానాం చ నరకార్ణవతారణమ్ ।
జ్ఞానప్రదం జ్ఞానబీజం జ్ఞానానన్దం సనాతనమ్ ॥ (26, 27)

ఆయన విశ్వమునకు నాథుడు, విశ్వరూపుడు, విశ్వమునకు బీజరూపుడు, విశ్వజుడు, విశ్వంభరుడు, విశ్వములందు శ్రేష్ఠుడు, విశ్వసంహారకారణుడు, భవుడు, కారణములకు గారణమూర్తి, నరకార్ణవతారణసమర్థుడు, జ్ఞాన ప్రదాత, జ్ఞానబీజస్వరూపుడు, జ్ఞానానందుడు, సనాతనుడు.

ఆజగదీశ్వరుని యనంతవిభూతిని గనులారదర్శించి దైత్యేంద్రుడైన శంఖ చూడుడు రత్ననిర్మితవిమానమును డిగ్గి సపరివారముగ శిరమును వంచి ముకు ళితహస్తుడై, యనన్యభక్తిసమన్వితుడై, సాశ్రుపూర్ణనయనుడై యనేకవిధ ముల ఆయనను స్తుతించి ప్రణామము లర్పించెను. శివుని వామభాగమందు భద్రకాళి విరాజిల్లి యుండెను. సమక్షములో గార్తికేయుడు సకలప్రమథ గణసేనాధ్యక్ష పరివేష్టితుడై శివాజ్ఞకొఱకు వేచియుండెను. ఈశ్వరుడు శంఖ చూడు నాశీర్వదించి యుచితాసన మొసంగి యిట్లు పలికెను.

**మహాదేవుడు పలికెను :**

దైత్యేంద్రా! ఈనిఖిలజగములకు స్రష్ట యైనబ్రహ్మధర్మజ్ఞుడు. ఆయన ధర్మమునకే జనకుడు, బ్రహ్మకుమారుడు మరీచి, మరీచికుమారుడు కశ్యపుడు, కశ్యపునకు బ్రజాపతి యగుదక్షుడు తన ముప్పదిమూడుకన్యల నర్పించెను. ఆముప్పది

యాం దొకసాధ్వినామధేయమే 'దనువు'. ఆమెకు పరాక్రమవంతులైన నలువదిమంది కుమారులు జన్మించిరి.

వారిలో శ్రేష్ఠుడైనవాడు విప్రచిత్తుడు. అతడు మహాబలపరాక్రమసంపన్నుడు. వాని కుమారుడైనదంభుడు ధర్మాత్ముడు, జితేంద్రియుడు, పరమవైష్ణవుడు. దంభుడు శుక్రాచార్యుని గురుదేవునిగ జేసికొని పుష్కరక్షేత్రములో శ్రీకృష్ణమహామంత్రమును జపించుచు నాపతితపావను నొకలక్షవర్షము లారాధించెను. ఆతపఃఫలప్రభావముననే శ్రేష్ఠపురుషుడవైన నీవు పుత్రరూపమున దంభున కుదయించితివి. రాజా! శ్రీకృష్ణపరాయణుడవైన నీవు పూర్వజన్మములో నష్టగోపులలో నొక గోపకుమారుడవు. శ్రీరాధా శాపవశమున దానవేశ్వరుడవై జన్మించినావు. దైత్యసింహమా! వైష్ణవపురుషులు పిపీలికాదిబ్రహ్మపర్యంతము గలసకలజగములను నశ్వరములని తలంచెదరు. వారికి శ్రీహర్యనన్యభక్తి, తద్దాస్యసౌభాగ్యమే యేకైకధ్యేయము. శ్రీహరిసేవను వీడి వారు సాలోక్యమునుగాని, సార్షినిగాని, సాయుజ్యమునుగాని, సారూప్యమునుగాని యాకాంక్షింపరు. వైష్ణవులు బ్రహ్మత్వమును, ఇంద్రత్వమును, అమరత్వమును, మఱి యితరోన్నత పదవులవేనినైనను శ్రీకృష్ణపదసేవముందు తుచ్ఛముగా భావించెదరు. శంఖచూడా! నీవు శ్రీకృష్ణభక్తుడవైనపరమవైష్ణవుడవు. నీకు దేవతలరాజ్యము సహితము భ్రమస్వరూపమే, కావున వారిరాజ్యముతో నీ కేమిపని? వారియధికారములను వారికి దిరిగి యప్పగింపుము.

దానవేశ్వరా! నీవు సామ్రాజ్యమును బోగొట్టుకొనుచున్నట్లు భ్రమనొందెదవేమో; కాని యొకపర్యాయము యోచింపుము. ఈపాంచభౌతికజగమునందు శాశ్వతముగ నున్నదేహధారి యొక్కడైనను గలడా? బ్రహ్మసహితము కాలమాసన్నమైనపుడు నశింపగలడు. సృష్టిసమయమున దేవాదిదేవుని సంకల్పముచే విధాత యుద్భవించి, తపమాచరించి, భక్తిజ్ఞానములను బొంది సృష్టిరచన యారంభింపగలడు. శంఖచూడా! సత్యయుగములో ధర్మము తనపరిపూర్ణస్వరూపముతో విరాజిల్లి నాల్గుపాదములతో యథేచ్ఛగా సంచరించును. ధర్మమున కాధారము కేవలము సత్యమే యని గ్రహింపుము.

ఆధర్మమే త్రేతాయుగమందు మూడుపాదములతోను, ద్వాపరయుగమందు రెండుపాదములతోను, గలియుగమునం దేకపాదముతోను విరాజిల్లుచు గలియుగాంతమున క్షీణించి లుప్తమగును. మరల సత్యయుగారంభమున బరిపూర్ణమగును. సూర్యుడు సైతము ప్రాతఃకాలమున నుదయించి, మధ్యాహ్నసమయమున ప్రచండుడై సాయంసమయమున నస్తమింపగలడు. గ్రహణమాసన్నమైన నదృశ్యుడుకూడ గాగలడు. చంద్రుడును బూర్ణిమనాడు పరిపూర్ణుడై, యమావాస్యనా డదృశ్యుడగును. అట్లే యెట్టివారైనను గాలమున కధీనులు కాక తప్పదు. బలిచక్రవర్తి జగత్తునకు నింద్రుడు కావలసిన సమర్థుడు, కాని వర్తమాన మహాకాలప్రభావముచే బాతాళమందు నివసించి యున్నాడు. ఈసర్వజగములు కాలానుసారముగ నుత్పన్నములై, కాల మాసన్నము కాగానే నశింపగలవు.

కేవలము శ్రీకృష్ణపరమాత్మయే కాలాతీతుడు, సర్వేశ్వరేశ్వరుడు. ఆ దేవాదిదేవుని గృపవలన నేను మృత్యుంజయుడనై యసంఖ్యాకప్రాకృత ప్రళయములను గాంచితిని, వర్తమానకాలమున బ్రళయములను వీక్షించుచున్నాను, భవిష్యత్కాలములో శాశ్వతుడ నైననే నసంఖ్యాకప్రళయములను వీక్షింపగలను.

స చ ప్రకృతిరూపశ్చ స ఏవ పురుషః స్మృతః ।
స చాఽఽత్మా సర్వజీవశ్చ నానారూపధరః పరః ॥
కరోతి సతతం యో హి తన్నామగుణకీర్తనమ్ ।
కాలం మృత్యుం స జయతి జన్మరోగం జరాం భయమ్॥ (60-61)

“ఆపరమేశ్వరుడైన శ్రీకృష్ణుడే ప్రకృతియనియు, బురుషుడనియు జెప్పబడినాడు. ఆయనయే ఆత్మ, నానారూపధారి, పరుడునై యున్నాడు. సర్వకాలసర్వావస్థలయందు శ్రీకృష్ణుని దివ్యగుణనామ సంకీర్తన మొనరించువాడు కాలమును, మృత్యువును, జన్మమును, రోగములను, భయజ్వరాదులను నవలీలగ జయింపగలడు”. శ్రీహరియే బ్రహ్మను సృష్టికర్తగను, విష్ణువును పాలనకర్తగను, నన్ను సంహారకర్తగను జగములో నియమించెను.

ఆ పురుషోత్తముని గృపవలనే త్రిమూర్తుల మైనమేము జగత్తునకు శాసకుల మైనాము. ఇట్టి జగము లసంఖ్యాకములు కలవు. రాజా! శ్రీకృష్ణపరమాత్మయందు గలయనన్యభక్తిచే నేను జగత్సంహార కార్యమును మదంశజు

డైనకాలాగ్నిరుద్రుని కప్పగించి స్వయముగ దద్దివ్యగుణనామసంకీర్తనల యందు సతతము సంలగ్నుడనై యుందును. కావుననే మృత్యుప్రభావము నాపై బ్రసరింపదు. శ్రీకృష్ణ భక్తిజ్ఞానవైరాగ్య సంపన్నుడనై యున్నందు వలన నేను నిర్భయుడను. గరుత్మంతుని గాంచి సర్పములు పాఱిపోవు నట్లు నన్ను గాంచి మృత్యువుగూడ తొలగిపోవును.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! మహాదేవుని దివ్యోపదేశయుక్తమైనయాదేశము నాలకించి దైత్యేశ్వరు డైనశంఖచూడుడు వినీతభావముతో సర్వేశ్వరుడు, సర్వజ్ఞుడు, సర్వభావనుడు నగునీశ్వరున కిట్లు ప్రత్యుత్తరమొసంగెను.

**శంఖచూడుడు పలికెను :**

సదాశివదేవా! నీవు ప్రవచించిన దంతయు బరమసత్యమే. అయినను నాప్రార్థనలనుగూడ నొకింత శ్రవణమొనరింపుము. నీ వుపదేశించిన విషయము లన్నియు దేవతలకు వర్తింపవా? వర్తించుచో దేవతలు బలిచక్రవర్తినుండి సర్వస్వము నపహరించి వానిని పాతాళమున కేల పంపిరి? మహేశ్వరా! నే నీసమస్తైశ్వర్యసంపన్నమైన మహాసామ్రాజ్యమును శ్రీకృష్ణపరమాత్మానుగ్రహదత్తమైననాబలపరాక్రమములవలన సముపార్జించితిని. దానవుల పూర్వవైభవమును బునఃప్రతిష్ఠిత మొనరించితిని. సోదరులను హింసించుట పాపకార్యమైనచో దేవతలు హిరణ్యాక్ష హిరణ్యకశిపు ముఖ్యుల నేల వధింప జేసితిరి. పూర్వకాలములో క్షీరసాగరమథనమున నుత్పన్న మైనయమృతము నందు దానవులకు భాగమొసంగక కేవలము దేవత లేలపాన మొనరించిరి?

> క్రీడాభాణ్డ మిదం విశ్వం కృష్ణస్య పరమాత్మనః ।
> యదా దదాతి యస్మై స తస్యైశ్వర్యం భవే త్తథా ॥ (72)

ఈసమస్తజగములు శ్రీకృష్ణపరమాత్మ క్రీడాక్షేత్రములే. ఆయన యెవరి ననుగ్రహించిన వారే యైశ్వర్య సంపన్నులై సదా వర్తింపగలరు.

దేవతలకు దానవులకు ననాదికాలమునుండి యీ రాజ్యవివాదము కలదు. కొంతకాలము దేవతలు, మఱికొంతకాలము మేము పరాజయము లను బొందితిమి. ఆజన్మవిరోధుల మైన మాయెడల మీరు పక్షపాతము

వహించుట పాడిగాదు. శంకరా! నీవు మా యుభయపక్షములవారిపై సమానకృప కల్గిన దైవమవు. దైత్యుల మైనమాతో మాత్రమే కలహించుట సకలారాధ్యుడవైన నీకు గౌరవప్రదము కాదు. శివా! దైవవశమున నీవు రణమునం దోడిన నెంత యపకీర్తి కల్గునోగదా!

**శ్రీనారాయణఋషి పలికెను :**

మునీశ్వరా! శంఖచూడుని యుక్తియుక్తము, సమయోచితము నగు సమాధానము నాలకించి పరమేశ్వరుడు సస్మితముఖారవిందుడై యిట్లు పల్కెను.

**మహాదేవుడు పలికెను :**

రాజా! నీవు సామాన్యుడవు కావు. బ్రహ్మకుల సంభవుడవైన నీతో రణ మొనరించిన మా కేల యపకీర్తి కలుగును? పూర్వకాలమున మధుకైటభులతో స్వయముగ శ్రీహరి కలహింపలేదా? నేను త్రిపురాసురులను మున్ను సంగరములో మడియింపలేదా? ప్రకృతిస్వరూపిణి యైన జగదంబ శుంభనిశుంభు లనుదైత్యులను సంహరింపలేదా? శంఖచూడా! దివ్యబల పరాక్రమసంపన్నుడ వైననీవు శ్రీకృష్ణాంశోద్భవుడ వైనపార్షదుడవు. ఇంతవఱకు సంహరింపబడిన దైత్యు లెవ్వరును నీతో సమానబలపరాక్రమసంపన్నులు కారు. దానవేంద్రా! నీకంటె ప్రప్రథమమున దేవతలు శ్రీహరి చరణారవిందముల నాశ్రయించి యభయమును బొందిరి. ఆ జగన్నాథుడే నన్నిదైవకార్యమునకై వినియోగించియున్నాడు. ఈవృథావార్తాలాపముల వలన ప్రయోజన మేమి? శంఖచూడా! తక్షణమే దేవతల యధికారమును దిరిగి వారి కర్పించెదవా? లేక యుద్ధమునకు సంసిద్ధుడ వయ్యెదవా? నిర్ణయించుకొనుము.

నారదా! సదాశివు డిట్లు పల్కగా శంఖచూడుడు యుద్ధ మనివార్యమని గ్రహించి తనమంత్రులతోగూడ నాసనములపైనుండి దిగ్గున లేచి నిలువబడెను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
ప్రకృతిఖండములోని శివశంఖచూడ
**సంవాద మనుపదునెనిమిదవ**
**అధ్యాయము**
సమాప్తము.

# పందొమ్మిదవ అధ్యాయము

## శంఖచూడుడు దేవతలతోయుద్ధము చేయుట.

**శ్రీనారాయణఋషి పలికెను:**

నారదమునీంద్రా! మహాప్రతాపబలసంపన్నుడైన దానవచక్రవర్తి తల వంచి శివున కనేకప్రణామము లర్పించి యా ప్రదేశమును వీడి తన సైన్యము జేరెను. తదనంతరము సురాసురుల మధ్య ఘోరసంగ్రామ మారంభ మయ్యెను. దేవసేనాని యైన కార్తికేయుడు విజృంభించి తన యపారశక్తిచే నసంఖ్యాక దానవులను నిర్జింపదొడంగెను. స్కందుని ప్రళయసదృశ పరాక్రమమును గాంచి యనేక విధముల గీర్తించుచు విమానారూఢు డైయున్న శంఖచూడు డసంఖ్యాక నిశిత శరములను వర్షముగ దేవతల సైన్యముపై బ్రయోగించెను. శంఖచూడ విసర్జితా ప్రతిహత బాణములచే నావరింపబడి రణరంగమంతయు ఘోరాంధకారముచే నావృతమయ్యెను. దైత్యేంద్రుని యస్త్రశస్త్రములచే నిర్గత మైనయగ్ని వర్షమువలె వర్షించుచు దేవసైన్యమును బీడింపదొడంగెను. శంఖచూడుని దివ్యపరాక్రమమును నిలువరించి యుద్ధ మొనరింపలేక సకలదేవతలు పలాయనము చిత్తగించిరి. కేవలము కార్తికేయుడే రణరంగమున శేషించెను. శంఖచూడుడు కార్తికేయునిపై బర్వతములను, సర్పములను, శిలలను, వృక్షములను వర్షమువలె బ్రయోగించెను. మేఘములు సూర్యునావరించినట్లు శంఖచూడుని శరవర్షము శివకుమారు డైన కార్తికేయునియావరించెను. దైత్యేంద్రుడు కార్తికేయుని ధనుస్సును భంగ మొనరించి రథమును ఛిన్నాభిన్న మొనరించెను. ఆయన వాహన మైన మయూరమును దివ్యాస్త్ర ప్రయోగముచే మూర్ఛిల్ల జేసెను. తదనంతరము ప్రాణఘాతుకమై సూర్యునివలె జాజ్వల్యమానమైన శక్తిని గార్తికేయుని వక్షఃస్థలముపై దానవేశ్వరుడు ప్రయోగింపగ నాశస్త్రాఘాతముచే స్కందుడు క్షణకాలము మూర్ఛిల్లి మరల సంగరమునకు సంసిద్ధుడయ్యెను. అపుడు శరవణభవుడు విష్ణు ప్రదత్త మైనధనుర్బాణములను ధరించి యభేద్య రథము నధిరోహించి దివ్యాస్త్రశస్త్రసంపన్నుడై మరల యుద్ధములో శంఖచూడు నస్త్రహా

నని గాంచి దివ్యాస్త్రప్రహారముచే వానిని మూర్ఛిల్ల జేసెను. సకలదానవ సైన్యములు భయపడి రణాంగమును వీడి పాఱిపోవదొడంగెను.

శ్రీకృష్ణకవచమును గళమున ధరించియున్న శంఖచూడు డాకవచ ప్రభావమున దుర్భిటికాలములో మేల్కాంచి విష్ణుప్రదత్తమై, సహస్రసూర్య సమానప్రకాశవంతమై, ప్రళయాగ్నిశిఖాసమమైనవిష్ణుశక్తిని గార్తికేయునిపై బ్రయోగించెను. ఆ మహాస్త్రఘాతమువలన శివకుమారు డచేతనుడు కాగా శంకరుని యనుగ్రహామువలన మరల జేతనత్వము నొంది యతడు సంకుల సమర మారంభించెను.

ఇంద్రుడు వృషపర్వునితోను, సూర్యుడు విప్రచిత్తునితోను, చంద్రుడు దంభునితోను, గాలపురుషుడు కాళేశ్వరునితోను, అగ్ని గోకర్ణునితోను, గుబేరుడు కాలకేయులతోను, విశ్వకర్మ మయాసురునితోను, మృత్యుదేవత భయంకరు డనుదానవశ్రేష్ఠునితోను, యముడు సంహారకుడను రాక్షసునితోను, వరుణుడు కలవింకునితోను, వాయువు చంచలునితోను, బుధుడు ఘృతపృష్ఠునితోను, శనైశ్చరుడు రక్తాక్షునితోను, జయంతుడు రత్న సారునితోను, వసువులు వర్చోగణములతోను, అశ్వినీకుమారుడు దీప్తిమంతునితోను, నలకూబరుడు ధూమ్రునితోను, ధర్మదేవత ధనుర్ధరునితోను, మంగళుడు మండూకాక్షునితోను, ఈశానుడు శోభాకరునితోను, మన్మథుడు పీఠరునితోను యుద్ధము చేయదొడంగిరి. ఉల్కాముఖుడు, ధూమ్రుడు ఖడ్గధ్వజుడు, కాంచీముఖుడు, పిండుడు, పలా శుడు మొదలగు రాక్షసులు నాదిత్యులతో దలపడిరి. ఏకాదశమహారుద్రులు పదునొకండు గురుదైత్యసైన్యాధ్యక్షులతో దలపడిరి. ఉగ్రదండాదిరాక్షసు లతో మహామారి మొదలగు వ్యాధులు యుద్ధమొనరింపదొడంగినవి. నందీశ్వ రాది ప్రమథగణములు పాల్గొనిన యాయుద్ధము ఘోరప్రళయమువలె బరిణ మించెను. ఆమహాయుద్ధములో శంకరునిచే వినియోగింపబడిన సమస్త దేవ సైన్యము పరాజయ మొంది రణరంగమునువీడి పాఱిపోవదొడంగెను.

దేవసైన్యమునకు దాపురించిన యీ ఘోరపరాజయమును గాంచి యత్యంత క్రుద్ధుడై స్కందుడు దేవగణముల కభయ మొసంగి మహాకాళితో గూడి మరల యుద్ధ మారంభించెను.

శివకుమారు డాఘోరభీకరసంగ్రామములో నూఱక్షౌహిణులదానవసైన్యమును సంహరించెను. కమలలోచని యైనభద్రకాళి రణరంగమందు స్వైరవిహార మొనరించుచు దానవులను జీల్చిచెండాడి మ్రింగదొడంగెను. అసంఖ్యాక దానవవీరు లామె మహోగ్రపరాక్రమమువలన క్షతగాత్రులై వీరస్వర్గమలంకరించిరి. భద్రకాళి యగ్నిశిఖలనే శరములుగ దానవసైన్యములపై బ్రయోగింపగా వానినెల్ల శంఖచూడుడు పర్జన్యాస్త్రప్రయోగముచే నిగ్రహించెను. కాళి ప్రయోగించిన వారుణాస్త్రమును మార్గమధ్యముననే దానవేంద్రుడు గాంధర్వాస్త్రముతో ఖండించెను. మహాకాళి కోపించి మాహేశ్వరాస్త్రమును బ్రయోగింపగా నాదానవ కులశిఖామణి వైష్ణవాస్త్రమును సంధించి దానిని నిలువరించెను. భద్రకాళి మఱియొక మార్గము గానక మంత్రోచ్చారణ మొనరించి దివ్యనారాయణాస్త్రమును ప్రయోగింపగా నా మహాస్త్రము ప్రళయకాలాగ్నివలె బ్రజ్వరిలుచు దానవులను సమూలముగ దహింప వచ్చుచుండెను. ఆదివ్యాస్త్రమును దర్శింపగనే శంఖచూడుడు సకలదానవ సహితముగ బోరును నిల్పి రథము డిగ్గి యాదివ్యాస్త్రమునకు సాష్టాంగదండప్రణామము లరిప్పెను. వెనువెంటనే యప్రతిహతమైననారాయణాస్త్రము శాంతించి యంతరిక్షములో నంతర్హితమగుట గాంచి మహాకాళి బ్రహ్మాస్త్రమును బ్రయోగించెను. దానవేంద్రుడు తాను గూడ బ్రహ్మాస్త్రము నభిమంత్రించి నామె బ్రహ్మాస్త్రముమ దిరోగమింప జేసెను. తన దివ్యాస్త్రము లన్నియు శంఖచూడుని సమక్షమున నిష్ఫలము లగుటగాంచి భద్రకాళి తుదకు వేఱొక యుపాయము గానక మహాశక్తిమంతమైన, సాక్షాత్ శివశక్తి సదృశ మైనపాశుపతాస్త్రమును బ్రయోగించుటకు సంసిద్ధురాలు కాగా నశరీరవాణి యిట్లు హెచ్చరించెను. "భద్రకాళీ! ఈదానవేశ్వరుడు శ్రీకృష్ణపరమాత్మున కనన్యభక్తుడు. పాశుపతాస్త్రము సహితము వీనిని నిర్జింప లేదు. శంఖచూడుడు తన గళమున శ్రీహరి దివ్యమంత్రకవచమును ధరించి యున్నాడు. ఆదివ్యకవచము వాని కంఠమున విరాజిల్లి యున్నంత వఱకు నెవ్వరైనను వానిని సంహరింపలేరు. శంఖచూడుని యర్థాంగి యైన తులసి తన ప్రాణేశ్వరుని ప్రాణరక్షణార్థమై సతీవ్రత మొనరించుచున్నది. ఆమె ఆదివ్యవ్రతమందు సంలగ్నురాలై యున్నంతవఱకు హరిహరాదులైనను శంఖచూడుని సంహరింపలేరు. ఇది బ్రహ్మ ప్రసాదించిన దివ్యవరము". అశరీరవా

న్యాదేశము నాలకించి భద్రకాళీ సంగ్రామము చాలించి శంకరుని సమ్ముఖ మున కేగి జరిగినదంతయు నివేదించెను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణ మందలి
ప్రకృతిఖండములోని కాళీశంఖచూడ యుద్ధ
మను పందొమ్మిదవ అధ్యాయము
సంపూర్ణము.

—♦—

## ఇరువదియవ అధ్యాయము

### శంకరశంఖచూడులయుద్ధము, శంకరుని త్రిశూలముచే శంఖచూడుడు భస్మమై సుదాముడను గోపుని స్వరూపముతో గోలోకమునకు వెడలుట.

**శ్రీనారాయణఋషి పలికెను :**

శ్రీకృష్ణానుగ్రహపాత్రుడైన శంఖచూడుని పరాక్రమమునకు సకలదేవ సైన్యము పరాజయమొందుట గాంచి మహాదేవుడే స్వయముగ రణరంగమును ప్రవేశించెను. ఆభూతపతిని గాంచి దైత్యేంద్రుడైన శంఖచూడుడు విమానమునుండి దిగి శివునకు సాష్టాంగదండప్రణామము లాచరించెను. హరుని యాశీర్వచనము పొంది యపారతేజముతో ప్రజ్వరిల్లుచు శంఖచూడుడు మహాదేవునితో రణ మారంభించెను. అసంఖ్యాక దివ్య శస్త్రాస్త్ర ప్రయోగములచే సకల వసుంధర కంపించెను. చాలకాలమునుండి వీరిద్దరు ఘోరసంగ్రామ మొనరించుచున్నను నొక్కరును బరాజయ మొందరైరి. అపుడు శ్రీహరియే స్వయముగ వృద్ధబ్రాహ్మణ వేషధారియై రణరంగమునకు వచ్చి శంఖచూడుని

సంరక్షించుచున్న శ్రీకృష్ణదివ్యకవచమును యాచించెను. సర్వజ్ఞుడైనశంఖచూడుడు తన్నర్థింపవచ్చిన దేవరో గ్రహించి పరమానందభరితుడై శుక్రాచార్యుడు మొదలుగాగల వారందఱెంతవారించినను సరకుగొనక తన ప్రాణాధిక మైనశ్రీకృష్ణదివ్యకవచమును మనఃపూర్వకముగ బ్రాహ్మణ రూపధారి యైనశ్రీహరి చరణారవిందములం దుంచి సాష్టాంగదండప్రణామము లర్పించెను. నారదా! శంఖచూడుని జన్మమే జన్మము. పరమాత్మకే దాన మొనరించి యాదైత్యాగ్రణి చరితార్థు డయ్యెను. బలిచక్రవర్తి వలె దానవ వంశప్రతిష్ఠను ద్విగుణీకృత మొనరించెను.

నారదా! తదనంతరము స్వయముగ శ్రీహరి శంఖచూడుని రూపము ధరించి తులసీదేవి యంతఃపురమును బ్రవేశించెను. శంఖచూడుని ప్రాణరక్షణార్థమై వానివిజయము కొఱకై సతీవ్రత మాచరించుచున్న తులసీదేవి తన ప్రాణేశ్వరుని శుభాగమనమును గాంచి శంఖచూడుడే విజయలక్ష్మితో మరలి వచ్చినాడని భ్రమించి తా నొనరించు సతీవ్రతమును బరిపూర్ణ మొనరింపకయే విసర్జించి నాథునకు స్వాగతము పల్కుటకై బయలుదేరెను. అదేసమయమున రణరంగమున మహాదేవుడు శంఖచూడునిపై నమోఘమునప్రతిహతము బ్రళయకాలసన్నిభము, ననంతకోటి సూర్యప్రకాశసమన్వితము, శ్రీహరిప్రదత్తము నైనత్రిశూలమును బ్రయోగించెను. ప్రళయకాలమం దుద్భవించిన ప్రళయాగ్నివలె గ్రీష్మకాలమధ్యాహ్నసమయమున బ్రకాశించు ననంతకోటి సూర్యులవలె బ్రజ్వరిల్లుచు మహేశ్వర వినిర్గత త్రిశూలము శంఖచూడుని సంహరింప బయలుదేరెను. దేవర్షీ! ఆత్రిశూలము సుదర్శనచక్రసమము. అఖిలబ్రహ్మాండములను క్షణకాలములో భస్మీపటల మొనరింపగల యఖండ శక్తి తద్దివ్యాయుధమందు నిక్షిప్తమై యున్నది.

దైత్యేంద్రు డైనశంఖచూడు డాకాశమార్గమున దన్ను సంహరించుటకై బ్రహ్మతేజముతో బ్రకాశించుచు వచ్చు త్రిశూలమును గాంచి సర్వమును గ్రహించినవాడై సర్వాస్త్రశస్త్రసన్న్యాస మొనరించి పద్మాసనాసీనుడై యింద్రియములను జయించి యంతర్ముఖుడై తనహృదయకమలముపై విరాజిల్లియున్న శ్రీకృష్ణపరమాత్మరూపమునె దర్శించుచు శ్రీకృష్ణదివ్యమంత్రమును జపింపదొడంగెను. నారదా! త్రిశూలము తాకినవెంటనే వినూనపహితముగ శంఖచూడుని పాంచభౌతికదేహము భస్మమయ్యెను.

దానవశరీరము భస్మముకాగా శంఖచూడుడు దివ్యశరీరధారియై గోప సుదాముడుగా మారిపోయెను. అతడు ద్విభుజుడు, కిశోరవయస్కుడు, మురళీ హస్తుడు, రత్నమయభూషణ విభూషితుడు. ఆక్షణముననే దివ్యగోలో కమునుండి మణిరత్ననిర్మితవిమానము గోపగోపికా పరివేష్టితమై యాప్రదేశ మున కరుదెంచెను. శంఖచూడుడు మహాదేవునకు నమస్కరించి తద్దివ్య విమానారూఢుడై గోలోకము జేరెను. మునీశ్వరా! ఆసమయములో శ్రీకృష్ణపరమాత్మ రాధతో గూడి బృందావన రాసమండలమధ్యమున విరాజమానుడై యుండెను. ఆప్రదేశము జేరగనే సుదాము డనన్యభక్తి సమన్వితుడై శ్రీరాధాకృష్ణుల చరణకమలముల నాశ్రయించెను. తమ ప్రియ సేవకుడైనసుదాముని గాంచి శ్రీరాధాకృష్ణు లత్యంత ప్రసన్నులైరి.

నారదా! శంఖచూడుని యస్థికలనుండి మహాశంఖ మావిర్భవించెను. ఆశంఖమునే యనేకరూపముల సర్వులు దేవతా పూజలందు వినియోగింప దొడంగిరి.

ప్రశస్తం శంఖతోయం చ దేవానాం ప్రీతిదం పరమ్ ।
తీర్థతోయస్వరూపం చ పవిత్రం శంకరం వినా॥
శంఖశబ్దో భవే ద్యత్ర తత్ర లక్ష్మీశ్చ సుస్థిరా ।
సుస్నాతః సర్వతీర్థేషు యః స్నాతః శంఖవారిణా ॥
శంఖో హరే రధిష్ఠానం యత్ర శంఖ స్తతో హరిః ।
తత్రైవ సతతం లక్ష్మీః దూరీభూత మమఙ్గలమ్ ॥ (27-29)

నారదా! శంఖమం దుంచబడిన జలము లత్యంతశ్రేష్ఠములు, ఎందువలన ననగా నాతోయములు దేవతలను ప్రసన్నమొనరించుట కప్రతిహతసాధన ములు. ఆపవిత్ర జలములు సాక్షాత్తుగ దీర్థస్వరూపములు. శంఖము శంకరు నికే కాదు, తదితర దేవతల కందఱకును ప్రియతమమేయైయున్నది. శంఖము ప్రతిధ్వనించు ప్రదేశమున శ్రీమహాలక్ష్మి సుస్థిరముగ విరాజిల్లగలదు. శంఖ జలములచే స్నానమొనరించువారు సకలతీర్థస్నాన ఫలప్రాప్తినొందినట్లే భావింప వలెను. శంఖము సాక్షాత్తుగ శ్రీహరి కధిష్ఠానము. శంఖము గౌరవింపబడు ప్రదేశమున శ్రీహరి లక్ష్మీసహితముగ విరాజిల్లును. అమంగళము లాప్రదేశ మును వీడి పోగలవు.

శంఖచూడుని సంహారానంతరము విజయోత్సాహులైన దేవతలు మహాదేవునిపై బుష్పవృష్టి వర్షించి, విజయదుందుభులను బ్రయోగించిరి. వృషభారూఢుడైనసదాశివుని దేవతలు, మహర్షులు, మనువులు, మానవులు నత్యంత హర్షసంయుక్తులై యనేక స్తోత్రములద్వారమున స్తుతించిరి. శివు డత్యంత ప్రసన్నుడై సకలప్రమథగణములు వెంటరాగా గైలాసము జేరెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని శంఖచూడవధ
యను ఇరువదియవ అధ్యాయము
సంపూర్ణము.

---

## ఇరువదియొకటవ అధ్యాయము

### శంఖచూడవేషధారి యగుశ్రీహరి తులసీసతీవ్రతమును భంగమొనరించుట, ఆమె వృక్షముగ జన్మించుట, తులసీ మాహాత్మ్యము.

**నారదుడు పలికెను :**

ప్రభూ! శ్రీమన్నారాయణు డేయుపాయముచే దులసీసతీవ్రతమును భంగమొనరించెనో వివరింపవలసినదిగ బ్రార్థించుచున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! శ్రీహరి వైష్ణవమాయను వ్యాపింపజేసి శంఖచూడుని ప్రాణములను రక్షించుచున్న శ్రీకృష్ణకవచమును గ్రహించెను. తదనంతరము తానే స్వయముగ శంఖచూడుని రూపము ధరించి విజయుడై మరలివచ్చినటుల దులస్యంతఃపురమును బ్రవేశించెను. తననాథుడే విజయలక్ష్మితో మరలివచ్చి

నాడని భ్రమించి తులసి తా నొనరించుచున్న సతీవ్రతమును సంపూర్ణ మొనరింపకయే వ్రతమును సగముననే విసర్జించి శంఖచూడునకు స్వాగతము పల్కుటకై యరుదెంచెను. ఆసమయముననం దే రణరంగమధ్యమున శంఖచూడుడు శంకరునిచే సంహరింపబడి దివ్యశరీరధారియై గోలోకము జేరెను. శంఖచూడుని రూపములో దులసీవ్రతమును భంగమొనరించుట కేతెంచిన శ్రీహరి ప్రవర్తనము ననుమానించి యామె యిట్లు పల్కెను. "మాయావీ! నీవెవ్వరో తత్క్షణము తెల్పుము. నీవు నాప్రాణేశ్వరుడవు కావు. నీవు నా సతీవ్రతమును గపటరూపధారివై వచ్చి భంగమొనరించినావు కావున నేను నిన్ను శపించెదను".

నారదా! తులసీదేవి పల్కినవచనముల నాలకింపగనే యామాయా రూపధారి యైనశ్రీహరి లీలాపూర్వకముగ దన మనోహరదివ్యసుందరరూపమున సాక్షాత్కరించెను. తులసీదేవి తనయెదుట సనాతనుడు, దేవదేవేశ్వరుడు నైనశ్రీహరి విరాజమానుడై యుండుట గాంచి యాశ్చర్యచకితురాలయ్యెను. భగవంతుని దివ్యవిగ్రహము నవీననీరదమేఘశ్యామలవర్ణము. నేత్రములు శరత్కాల ప్రఫుల్లకమలములవలె విశాలములు. ఆయన కందర్పకోటి కమనీయవిశేషశోభాసమన్వితుడు, రత్నభూషణభూషితుడు, వనమాలాధారి, ప్రసన్నముఖారవిందుడు, దివ్యపీతాంబరధారుడు. ఆసచ్చిదానందవిగ్రహుని దన సమక్షమున దర్శించి తులసీదేవి తనపతి యీలోకమును వీడెనని గ్రహించి క్షణకాలము మూర్ఛనొంది మరల చైతన్యము పొంది శ్రీహరి నుద్దేశించి యిట్లు శపించెను. "ప్రభూ! నీవు దయారహితుడవు, నీ హృదయము పాషాణ సదృశము. దేవాదిదేవా! ఈదినము నాసతీవ్రతమును గపటోపాయముచే భంగమొనరించి నాప్రాణేశ్వరుని మరణమునకు గారణమైతివి. దేవా! నీహృదయము నిజముగ బాషాణమే, కావుననే నీ విట్లు నిర్దయుడవై ప్రవర్తించినావు. ఏయపరాధము లేనిదే నీభక్తు నేల నిర్దాక్షిణ్యముగ సంహరింపజేసితివి? కావున నీవు నాశాపమునకు గురియై పాషాణరూపమున బృథ్విపై బడియుండుము." ఇట్లు శపించి తులసి శోకసంతప్తయై యనేకవిధముల దుఃఖింప దొడంగెను. ఆమె దారుణదుఃఖదశ గాంచి కరుణారససాగరు డైనకమలాపతి శ్రీహరి యత్యంత కరుణాపీక్షణములతో దులసిని వీక్షించుచు నిట్లు పలికెను.

**శ్రీహరి పలికెను :**

తులసీ! పూర్వము నీవు భారతవర్షములో జిరకాలము నన్నారాధించితివి. మదంశసంభూతు డైనశంఖచూడుడు కూడ నీప్రసన్నతార్థమై యఖండతప మాచరించి నీపాతివ్రత్యమాహాత్మ్యమువలన నీకుప్రాణేశ్వరు డైనగారణమున భవబంధవిముక్తుడై గోలోకపరంధామము జేరెను. పతివ్రతాశిరోమణీ! నీ యఖండ తపఃఫలప్రభావమున నీ వీపాంచభౌతికదేహమును వీడి దివ్యశరీరధారిణివై మద్ధామము జేరి రమాసమవై నాకత్యంతప్రేమపాత్రురాలవై విరాజిల్లెదవు గాక. నీ యీప్రాకృత శరీరము పవిత్రనదిగా బరిణమించి గండకి యనునామముతో బుణ్యప్రదాయినియై పవిత్రభారతవర్షమున బ్రవహింపగలదు.

> తవ కేశసమూహాశ్చ పుణ్యవృక్షా భవన్త్వితి ।
> తులసీకేశసమ్భూతా తులసీతి చ విశ్రుతా ॥ 33

దేవీ! నీ కేశసమూహములు పవిత్రవృక్షములు కాగలవు. నీ కేశములనుండి ప్రాదుర్భవించిన కారణమున నావృక్షములు తులసీనామమున బ్రసిద్ధిగాంచగలవు.

> త్రిషు లోకేషు పుష్పాణాం పత్రాణాం దేవపూజనే ।
> ప్రధానరూపా తులసీ భవిష్యతి వరాననే ॥ 34

వరాననా! త్రిలోకములలో దైవపూజార్థమై వినియోగించు సకల పుష్పములలో బత్రములలో దులసీపత్రమే శ్రేష్ఠముగ బరిగణింపబడగలదు.

> స్వర్గే మర్త్యే చ పాతాలే వైకుణ్ఠే మమ సంనిధౌ ।
> భవన్తు తులసీవృక్షా వరాః పుష్పేషు సున్దరి ॥ 35

స్వర్గ, మర్త్య, పాతాళలోకములోను, వైకుంఠములో నా సామీప్యమునందు విరాజిల్లగలవు. సుందరీ! తులసీదళము సకలపుష్పములందు శ్రేష్ఠపూజాకుసుమమై విరాజిల్లగలదు.

> గోలోకే విరజాతీరే రాసే బృన్దావనే భువి ।
> భాణ్డీరే చమ్పకవనే రమ్యే చన్దనకాననే ॥

మాధవీకేతకీకున్దమల్లికామాలతీవనే ।
భవన్తు తరవ స్తత్ర పుణ్యస్థానేషు పుణ్యదాః।(36,37)

గోలోకములోను, విరజానదీతటముపైనను, రాసమండలములోను, బృందావనములోను, భూలోకములోను, భాండీరవనములోను, జంపకవనము లోను, మనోహరచందనకాననములోను, మాధవీ కేతకీ కుంద మల్లికాది వనములలోను, సకలపుణ్యప్రదేశములలోను బుణ్యప్రదమైన యీవృక్షము లుత్పన్నములై విరాజిల్లును.

తులసీతరుమూలే చ పుణ్యదేశే సుపుణ్యదే ।
అధిష్ఠానం తు తీర్థానాం సర్వేషాం చ భవిష్యతి ॥ 38

తులసీతరుమూలము పరమపవిత్రము నఖండ పుణ్యదాయకముకాగలదు. కావున నాప్రదేశములో సమస్త దేవతలు, పుణ్యతీర్థములు నివసింపగలవు.

తత్రైవ సర్వదేవానాం సమాధిష్ఠానమేవ చ ।
తులసీపత్రపతనప్రాప్త్యే చ వరాననే ॥ 39

వరాననా! తమపై దులసీపత్రము పడవలెననెడి ప్రగాఢకాంక్షతో సకలపుణ్యతీర్థములు దేవతలు తులసీతరుమూలమున నివసింపగలరు.

స స్నాతః సర్వతీర్థేషు సర్వయజ్ఞేషు దీక్షితః ।
తులసీపత్రతోయేన యోఽభిషేకం సమాచరేత్ ॥ 40

తులసీపత్రస్పర్శము కల్గినజలములలో స్నానమాడువాడు సర్వతీర్థము లందు స్నానమాచరించిన వాడు సమస్తయజ ములందు దీక్షవహించిన వాడు కాగలడు.

సుధాఘటసహస్రేణ సా తుష్టి ర్న భవే ద్ధరేః ।
యా చ తుష్టిర్భవే న్నృణాం తులసీపత్రదానతః ॥ 41

సాధ్వీ! మనుష్యు లనన్యభక్తితో దులసీదళమునర్పించిన శ్రీహరి కెంత తృప్తిలభించునో, వేనవేలమృతభాండముల నర్పించినను నంతటి తృప్తి కలుగదు.

గవామయుతదానేన యత్ఫలం లభతే నరః ।
తులసీపత్రదానేన తత్ఫలం లభతే సతి ॥ 42

సతీ! పదివేల గోవులను దానమొనరించిన మానవుల కేఫలము ప్రాప్తించునో, యాఫలమే కేవలము తులసీదళదానముచే లభింపగలదు.

తులసీపత్రతోయం చ మృత్యుకాలే చ యో లభేత్ ।
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం స గచ్ఛతి॥ 43

ఏ దేహధారి కాసన్నకాలమున దులసీదళజలము పానమొనరించుట లభించునో, యాతడు సర్వపాపములనుండి విముక్తుడై విష్ణులోకమునకు బ్రస్థాన మొనరింపగలడు.

నిత్యం య స్తులసీతోయం భుజ్తే భక్త్యాచ మానవః ।
స ఏవ జీవన్ముక్తశ్చ గంగాస్నానఫలం లభేత్ ॥ 44

ఏమనుష్యుడు నిత్యము భక్తిపూర్వకముగా దులసీతీర్థమును స్వీకరించునో వానికి గంగాస్నానఫలము లభించును. ఆతడు నిశ్చయముగ జీవన్ముక్తుడు కాగలడు.

నిత్యం య స్తులసీం దత్వా పూజయే న్మాంచ మానవః ।
లక్షాశ్వమేధజం పుణ్యం లభతే నాత్ర సంశయః॥ 45

ఏమనుష్యుడు ప్రతిదినము తులసీదళముల నర్పించి న న్ననన్యభక్తితో బూజించునో వానికి లక్షాశ్వమేధయజ్ఞము లొనరించిన పుణ్యము నిస్సంశయముగ లభింపగలదు.

తులసీం స్వకరే కృత్వా దేహే ధృత్వా చ మానవః ।
ప్రాణాం స్త్యజతి తీర్థేషు విష్ణులోకం స గచ్ఛతి॥ 46

ఏమానవుడు తులసీదళమును హస్తమందుంచుకొని, తులసీపత్రములను దన శరీరముపై నిడుకొని పుణ్యతీర్థములలో బ్రాణత్యాగ మొనరించునో యతడు నిస్సందేహముగ విష్ణులోకమునకు బ్రస్థానమొనరింపగలడు.

తులసీకాష్ఠనిర్మాణమాలాం గృహ్ణాతి యో నరః ।
పదే పదేఽశ్వమేధస్య లభతే నిశ్చితం ఫలమ్ ॥ 47

తులసీకాష్ఠముచే నిర్మింపబడిన మాలను గళమందు ధరించు నరుడడుగడుగున నిస్సందేహముగ నశ్వమేధయజ్ఞ ఫలప్రాప్తి నొందగలడు.

తులసీం స్వకరే ధృత్వా స్వీకారం యో న రక్షతి ।
స యాతి కాలసూత్రం చ యావచ్చన్ద్రదివాకరౌ ॥ 48

ఎవడు తులసీపత్రమును హస్తమునందుంచుకొని ప్రతిజ్ఞ యొనరించి దానిని బరిపాలింపడో, యతడు సూర్యచంద్రులుండు పర్యంతము కాలసూత్రమను నరకమున బడి యాతనల ననుభవింపగలడు.

కరోతి మిథ్యా శపథం తులస్యా యో హి మానవః ।
స యాతి కుమ్భీపాకం చ యావదిన్ద్రాశ్చతుర్దశః ॥ 49

ఏమనుష్యుడు తులసీపత్రమును హస్తమందుంచుకొని యసత్యప్రతిజ్ఞ యొనరించునో యతడు పదునల్వురింద్రుల యాయుఃపర్యంతము కుంభీపాక నరక మనుభవింపగలడు.

తులసీతోయకణికాం మృత్యుకాలే చ యో లభేత్ ।
రత్నయానం సమారుహ్య వైకుణ్ఠం స ప్రయాతి చ ॥ 50

మృత్యుసమయమం దెవనిముఖములో దులసీసమ్మిళిత మైనజలకణ మొకటైనను లభించునో యతడు నిశ్చయముగ రత్నవిమానము నధిరోహించి వైకుంఠమునకు బ్రస్థాన మొనరింపగలడు.

పూర్ణిమాయా మమాయాం చ ద్వాదశ్యాం రవిసంక్రమే ।
తైలాభ్యఙ్గే చాస్నాతే చ మధ్యాహ్నే నిశి సన్ధ్యయోః
అశౌచేఽశుచికాలే వా రాత్రివాసోఽన్వితా నరాః ।
తులసీం యే విచిన్వన్తి తే ఛిన్దన్తి హరేః శిరః ॥ 51

పూర్ణిమాదినమున నమావాస్యాదినమున, ద్వాదశీతిథిని, సూర్య సంక్రమణదినమున, మధ్యాహ్నకాలమున, రాత్రివేళ, ద్విసంధ్యలందు, నాశౌచ సమయములందు, శరీరమునకు దైలమును మర్దించుకొని స్నానమాచరింపక, రాత్రిధరించిన వస్త్రములను ద్యజింపక తులసీపత్రములను దుంచిన హరిశిరమును ఖండించినట్లే యగును.

త్రిరాత్రం తులసీపత్రం శుద్ధం పర్యుషితం సతి ।
శ్రాద్ధే వ్రతే చ దానే చ ప్రతిష్ఠాయాం సురార్చనే ॥ 52

సాధ్వీ! శ్రాద్ధములందు, వ్రతములందు, దానములందు, ప్రతిష్ఠాది

కార్యములందు, దేవార్చనలందు దులసీపత్రము శుష్కించినను మూడు రాత్రులకాలమువఱకు బవిత్రముగ దానిని వినియోగింపవచ్చును.

భూగతం తోయపతితం యద్దత్తం విష్ణవే సతి ।
శుద్ధం చ తులసీపత్రం క్షాలనా దన్యకర్మణి ॥ 57

పృథ్విపై బడినను, జలములలో దడిసినను, శ్రీవిష్ణువున కర్పించినను, ఆతులసీపత్రములను బ్రక్షాళన మొనరించిన నవి మఱియొకకార్యములో విని యోగించుటకు శుద్ధములే.

దేవీ! నీవు నిరామయగోలోకములో దులసీవృక్షమున కధిష్ఠాత్రి దేవివై నా స్వరూపభూతు డైన శ్రీకృష్ణునితో నిరంతరము క్రీడింపగలవు. నీ దేహమునుండి యుత్పన్నమైన నది పుణ్యప్రదయై భారతవర్షములో బ్రవ హించి మదంశసంభూతు డైనక్షారసముద్రునకు బత్ని కాగలదు. స్వయముగ మహాసాధ్వి వైననీవు తులసీరూపమున వైకుంఠములో సదా నాసామీప్య మున విరాజిల్లగలవు. శ్రీమహాలక్ష్మితో సమముగ నీకు గౌరవము లభింప గలదు. గోలోకములో నిస్సంశయముగ మహారాసక్రీడలో నీవు సదా విరాజిల్లగలవు.

అహం చ శైలరూపేణ గణ్డకీతీరసన్నిధౌ ।
అధిష్ఠానం కరిష్యామి భారతే తవ శాపతః ॥ 58

తులసీ! నీశాపమును సత్యమొనరించుటకు స్వయముగ నేనే పాషాణ (సాలగ్రామ)మై పవిత్రభారతవర్షములో గండకీనదీతటముపై నివ సించెదను.

వజ్రకీటాశ్చ కృమయో వజ్రదంష్ట్రాశ్చ తత్ర వై ।
తచ్ఛిలాకుహరే చక్రం కరిష్యన్తి మదీయకమ్॥ 59

ఆగండకీనదీతటమున నుండు కోట్లకొలదికీటకములు తమ తీక్ష్ణము లైనదంతము లనునాయుధములతో దొలచి యాపాషాణమున నాచక్రాది చిహ్నములను జేయును.

ఏకద్వారే చతుశ్చక్రం వనమాలావిభూషితమ్ ।
నవీననీరదశ్యామం లక్ష్మీనారాయణాభిధమ్ ॥ 60

ఏసాలగ్రామముపై నొకద్వారము, నాల్గుచక్రిచిహ్నములు, వనమాలా రేఖలు గుర్తులుగా నుండి నవీననీరదశ్యామలకాంతితో బ్రకాశించునో యా పాషాణమును లక్ష్మీనారాయణమూర్తిగా భావింపవలెను.

ఏకద్వారే చతుశ్చక్రిం నవీనజలదోపమమ్ ।
లక్ష్మీజనార్దనం జ్ఞేయం రహితం వనమాలయా ॥ 61

ఏ సాలగ్రామముపై నొకద్వారము నాల్గుచక్రముల చిహ్నములుండి వన మాలాచిహ్నము లేకుండ నవీననీరదవర్ణముగ విరాజిల్లునో, యాసాలగ్రామ మును లక్ష్మీజనార్దనరూపమని గ్రహింపవలెను.

ద్వారద్వయే చతుశ్చక్రిం గోష్పాదేన సమన్వితమ్ ।
రఘునాథాభిదం జ్ఞేయం రహితం వనమాలయా ॥ 62

ఏ సాలగ్రామముపై రెండుద్వారములు, నాల్గుచక్రిములు నొక గోష్పాదచిహ్నము నుండి వనమాలాచిహ్న ముండదో దానిని రఘునాథ మూర్తిగా దెలిసికొనవలెను.

అతిక్షుద్రం ద్విచక్రిం చ నవీనజలదప్రిభమ్ ।
దధివామ నాభిధం జ్ఞేయం గృహిణాం చ సుఖప్రిదమ్ ॥ 63

ఏ సాలగ్రామముపై నత్యంతసూక్ష్మము లైన రెండుచక్రచిహ్నము లుండునో, వనమాలా రేఖలు విరాజిల్లునో, నవీనజలదప్రభతో విరాజిల్లునో యట్టిసాలగ్రామము దధివామనమూర్తిగ గ్రహింపవలెను; ఈసాలగ్రామా రాధన గృహస్థుల కత్యంతసుఖప్రదము.

అతిక్షుద్రం ద్విచక్రిం చ వనమాలావిభూషితమ్ ।
విజ్ఞేయం శ్రీధరం దేవం శ్రీప్రిదం గ్రిహిణాం సదా ॥ 64

ఏ సాలగ్రామముపై నతిసూక్ష్మద్విచక్రచిహ్నము లుండి, వనమాలా రేఖలతో విరాజిల్లునో, యాసాలగ్రామము శ్రీధరుని మూర్తిగా గ్రహింప వలెను. శ్రీధరసాలగ్రామారాధన గృహస్థుల కఖండశ్రీప్రదము.

స్థూలం చ వర్తులాకారం రహితం వనమాలయా ।
ద్విచక్రిం స్ఫుట మత్యన్తం జ్ఞేయం దామోదరాభిదమ్ । 65

ఏ సాలగ్రామము వర్తులాకారముగ, స్థూలముగ, వనమాలచిహ్న

రహితముగ, ద్విచక్రాత్యంత స్ఫుటచిహ్నములతో విరాజిల్లునో, యాసాలగ్రామమును దామోదరుని మూర్తిగ గ్రహింపవలెను.

మధ్యమం వర్తులాకారం ద్విచక్రం బాణవిక్షతమ్ ।
రణరామాభిధం జ్ఞేయం శరతూణ సమన్వితమ్ ॥ 66

ఏ సాలగ్రామమునకు మధ్యమభాగము వర్తులాకారముగ నుండి రెండు చక్రచిహ్నములతో, ధనుర్బాణచిహ్నములతో, బాణముఖమున వీక్షింపబడిన చిహ్నములు విరాజిల్లునో, యాసాలగ్రామము రణరాముని మూర్తిగ భావింపవలెను.

మధ్యమం సప్తచక్రం చ ఛత్రతూణసమన్వితమ్ ।
రాజరాజేశ్వరం జ్ఞేయం రాజసమ్పత్ప్రదం నృణామ్ ॥ 67

ఏ సాలగ్రామ మధ్యభాగము సప్తచక్రచిహ్నములతో, ఛత్రచిహ్నములతో, ధనుశ్చిహ్నముతో బ్రకాశించునో యాసాలగ్రామమును రాజరాజేశ్వరునిమూర్తిగ భావింపవలెను. ఈసాలగ్రామారాధన మొనరించిన మనుష్యునకు రాజ్యసంపత్తి సులభముగ లభించును.

ద్విసప్తచక్రం స్థూలం చ నవీనజలదప్రభమ్।
అనన్తాఖ్యం చ విజ్ఞేయం చతుర్వర్గఫలప్రదమ్॥ 68

ఏ సాలగ్రామము బహువాల్గు చక్రచిహ్నములతోను, నవీనమేఘసమానశ్యామలవర్ణముతోను బ్రకాశించునో, యాస్థూలపాషాణమునే యనంతుని విగ్రహముగ దెలిసికొనవలెను, అనంతుని సాలగ్రామారాధన మొనరించిన ధర్మార్థకామమోక్షము లనెడి చతుర్విధ పురుషార్థములు నిశ్చయముగ లభించును.

చక్రాకారం ద్విచక్రం చ సశ్రీకం జలదప్రభమ్ ।
సగోష్పాదం మధ్యమం చ విజ్ఞేయం మధుసూదనమ్ ॥ 69

ఏ సాలగ్రామాకృతి చక్రమువలె నుండి రెండు చక్రచిహ్నములతో నొక శ్రీచిహ్నముతో, మధ్యలోనొకగోష్పాద చిహ్నముతో నంకితమై నవీన మేఘమువలె బ్రకాశించునో యాసాలగ్రామమును మధుసూదనుని శ్రీవిగ్రహముగ గ్రహింపవలెను.

సుదర్శనం చైకచక్రం గుప్తచక్రిం గదాధరమ్ ।
ద్విచక్రం హయవక్త్రాభం హయగ్రీవం ప్రకీర్తితమ్ ॥ 70

కేవల మొకచక్రచిహ్నము కల్గిన సాలగ్రామమును సుదర్శనమూర్తి యనియు, గుప్తచక్రచిహ్నాంకిత మైనసాలగ్రామము గదాధరుని మూర్తియనియు, ద్విచక్రచిహ్నాంకితమై యశ్వముఖాకృతియుక్తమైనసాలగ్రామము హయగ్రీవ విగ్రహమనియు భక్తజనులు కీర్తించిరి.

అతీవ విస్తృతాస్యం చ ద్విచక్రిం వికటం సతి ।
నరసింహాభిధం జ్ఞేయం సద్యోవైరాగ్యదం నృణామ్ ॥ 71

సాధ్వీ! ఏ సాలగ్రామముఖ మత్యంతవిస్తృతముగనుండునో, దేనిపై ద్విచక్రచిహ్నములుండునో, యెయ్యది యత్యంతవికటముగా దర్శన మొసంగునో, యాసాలగ్రామమును నృసింహభగవద్విగ్రహముగా గ్రహింపవలెను. నృసింహమూర్తిసాలగ్రామారాధన మనుష్యులకు వైరాగ్యము నతి శీఘ్రముగ బ్రసాదింపగలదు.

ద్విచక్రం విస్తృతాస్యం చ వనమాలా సమన్వితమ్ ।
లక్ష్మీనృసింహం విజ్ఞేయం గృహిణాం సుఖదం సదా ॥ 72

ఏ సాలగ్రామము విస్తృతరూపము గల్గి ద్విచక్రచిహ్నములతో వనమాలా రేఖలతో విరాజిల్లునో యది సాక్షాల్లక్ష్మీనృసింహుని విగ్రహముగా దెలిసికొనవలెను. శ్రీలక్ష్మీనృసింహసాలగ్రామారాధన గృహస్థులకు సదా యఖండసుఖములను బ్రసాదించును.

ద్వారదేశే ద్విచక్రం చ సశ్రీకం చ సమం స్ఫుటమ్ ।
వాసుదేవం చ విజ్ఞేయం సర్వకామఫలప్రదమ్ ॥ 73

ఏ సాలగ్రామద్వారప్రదేశములో రెండుచక్రములచిహ్నము లుండి శ్రీచిహ్నము స్పష్టముగ గోచర మగునో యది వాసుదేవుని విగ్రహముగా దెలిసికొనవలెను. వాసుదేవ సాలగ్రామార్చన వలన సర్వాభీష్టములు సిద్ధింపగలవు.

ప్రద్యుమ్నం సూక్ష్మచక్రం చ నవీననీరదప్రభమ్ ।
సుషిరే ఛిద్రబహులం గృహిణాం చ సుఖప్రదమ్ ॥ 74

ఏసాలగ్రామము సూక్ష్మచక్రచిహ్నయుక్తమై నవీననీరదశ్యామల వర్ణముతో ముఖముపై సుషిరచ్ఛిద్రచిహ్నములు శోభించునో, దానిని ప్రద్యుమ్నుని స్వరూపముగా దెలిసికొనవలెను. ప్రద్యుమ్న సాలగ్రామారాధనవలన గృహస్థులు సుఖములను బొందగలరు.

ద్వే చక్రే చైకలగ్నే చ పృష్ఠే యత్ర తు పుష్కలమ్
సంకర్షణం తు విజ్ఞేయం సుఖదం గృహిణాంసదా ॥ 75

రెండుచక్రచిహ్నము లుండి విశాలపృష్ఠభాగముతో విరాజిల్లుచు సదా గృహస్థులకు సుఖములను బ్రసాదించు సాలగ్రామమును సంకర్షణ మూర్తిగ దెలిసికొనవలెను.

అనిరుద్ధం తు పీతాభం వర్తులం చాతిశోభనమ్ ।
సుఖప్రదం గృహస్థానాం ప్రవదన్తి మనీషిణః॥ 76

ఏ సాలగ్రామ మత్యంత సుందరవర్తులాకారముగా నుండి పీతవర్ణముతో శోభించుచు గృహస్థులకు సదా సుఖములను బ్రసాదించునో యాసాలగ్రామ మనిరుద్ధ స్వరూపమని విద్వాంసులు కీర్తించిరి.

సాలగ్రామశిలా యత్ర తత్ర సంనిహితో హరిః ।
తత్రైవ లక్ష్మీ ర్వసతి సర్వతీర్థసమన్వితా ॥
యాని కాని చ పాపాని బ్రహ్మహత్యాది కాని చ ।
తాని సర్వాణి నశ్యని శాలగ్రామశిలార్చనాత్ ॥ (77, 78)

ఏప్రదేశములో సాలగ్రామశిల యారాధింపబడునో యాప్రదేశములో శ్రీహరియే స్వయముగా విరాజిల్లగలడు. ఆప్రదేశములోనే సర్వ పుణ్యతీర్థములతో గూడ శ్రీమహాలక్ష్మి నివసింపగలదు. బ్రహ్మహత్యాదిపాతకము లన్నియు కేవలము సాలగ్రామ శిలార్చనచే నిశ్చయముగ నశింపగలవు.

ఛత్రాకార సాలగ్రామములో రాజ్యప్రదశక్తి కలదు. వర్తులాకార సాలగ్రామములో సంపదలను బ్రసాదింపగల యోగ్యత కలదు. శకటాకార పాషాణారాధనము దుఃఖములను, శూలకోణమువలెనున్న శిలారాధనము మరణమును, వికృతాకారము కల్గియున్న శిల దారిద్ర్యమును, పింగళవర్ణయుక్తమైన

పాషాణము హానిని, భగ్నచక్రములు కల్గిన శిల వ్యాధులను గలిగింప గలదు. భగ్నసాలగ్రామారాధన నిశ్చయముగ మరణ ప్రదముకాగలదు.

వ్రతం దానం ప్రతిష్ఠా చ శ్రాద్ధం చ దేవపూజనమ్ ।
సాలగ్రామశిలాయాశ్చైవాధిష్ఠానాత్మ శస్తకమ్ ॥ 81

వ్రతములు గాని, దానములుగాని, ప్రతిష్ఠాదికార్యములుగాని, శ్రాద్ధాది కార్యములు గాని, సాలగ్రామసన్నిధానములో నొనరించిన సర్వోత్తమములు కాగలవు. ఎవరు సాలగ్రామశిలాతీర్థమును సంప్రోక్షణ మొనరించుకొందురో, వారు సకలతీర్థస్నాన ఫలమును, సమస్త యజ్ఞఫలమును బొందగలరు.

సాధ్వీ! నాల్గువేదములను బఠించినగాని, తప మొనరించినగాని యే పుణ్యము లభించునో యది కేవలము సాలగ్రామ శిలోపాసనచే సులభముగా లభించును. ఎవరు నిరంతరము తమపై సాలగ్రామ శిలోదకములను సంప్రోక్షణ మొనరించుకొందురో వారు సకలదానముల పుణ్యమునకు, భూప్రదక్షిణాద్యుత్తమ ఫలములకు నధికారులు కాగలరు. సాలగ్రామ శిలాజలములను నిరంతరము పానమొనరించు పురుషుడు నిస్సంశయముగ దేవత లభిలషించు ప్రసాదమును బొందగలడు. ఆతడు జన్మమృత్యుజరావ్యాధులనుండి విముక్తి పొందగలడు. సర్వతీర్థము లాపుణ్యాత్ముని స్పర్శము నాకాంక్షింపగలవు. ఆ సాలగ్రామ చరణోదకపానయుక్తుడు జీవన్ముక్తుడై, పరమపవిత్రుడై శ్రీహరిపదమును బొందగలడు. భగవంతుని పరంధామములో నా భగవంతుని సన్నిధానమున నాభక్తునకు బ్రళయకాలపర్యంతము నివసించు సౌభాగ్యము కలుగగలదు. ఆ భక్తునకు భగవంతుడు తనదాస్యసౌభాగ్యమును బ్రసాదించును. గరుడుని గాంచి పాఱిపోవు సర్పములవలె నాభక్తుని గాంచి బ్రహ్మహత్యాది పాతకములు పాఱిపోగలవు. ఆభాగవతోత్తముని చరణ రజస్స్పర్శముచే బృథ్వీసహితము పవిత్రము కాగలదు. అట్టి పరమభక్తుడు జన్మింపగనే తద్వంశములోని లక్షల తరములవా రుద్ధరింపబడగలరు.

అవసానకాలములో సాలగ్రామచరణోదకమును బానమొనరించు వారు సర్వపాపములనుండి ముక్తులై విష్ణులోకమును జేరగలరు. వారికి నిర్వాణముక్తి యత్యంత సులభము కాగలదు. వారు నిస్సంశయముగ గర్మభోగముల నుండి విముక్తులై శ్రీహరి దివ్యచరణారవిందములందు విలీనము

కాగలడు. సాలగ్రామమును హస్తమునం దుంచుకొని యసత్యము పల్కిన వ్యక్తి బ్రహ్మాయుర్దాయ పర్యంతము కుంభీపాక నరక మనుభవింపగలడు. సాలగ్రామమును హస్తమునం దుంచుకొని ప్రతిజ్ఞ యొనరించి దానిని బరిపాలింపనివారు లక్ష మన్వంతరములకాల మసిపత్ర నరక మనుభవింపగలరు. కాంతామణీ! ఏమనుష్యుడు సాలగ్రామమునుండి తులసీపత్రములను దూర మొనరించునో యాతనికి మఱుజన్మములో స్త్రీ సహాకరింపదు. శంఖముచే దులసీపత్రములను విచ్ఛేద మొనరించు వ్యక్తి భార్యావిహీనుడై యేడుజన్మముల వఱకు రోగియై దుఃఖింపగలడు.

సాలగ్రామం చ తులసీం శంఖ మేకత్ర ఏవ చ ।
యో రక్షతి మహాజ్ఞానీ స భవే చ్ఛ్రీహరిప్రియః ॥ 97

మహాజ్ఞాని యైనపురుషుడు సాలగ్రామమును, దులసిని, శంఖమును నేకత్రిత మొనరించి రక్షించుచు ప్రతినిత్యము నారాధించిన యతడు శ్రీహరి కత్యంత ప్రియపాత్రుడు కాగలడు.

నారదా! ఇట్లు తులసీదేవికి సాలగ్రామమహాత్మ్యమును వర్ణించి యామె ననేకవిధముల ననుగ్రహించి శ్రీహరి మౌనము వహించెను. పరమాత్ముని యాజ్ఞానుసారముగ తులసీదేవి శరీరమును జాలించి దివ్యరూప సంపన్నయై శ్రీహరి వక్షఃస్థలముపై శ్రీమహాలక్ష్మివలె విరాజిల్లెను. రమాపతి యగుశ్రీహరి దులసీదేవిని దోడ్కొని వైకుంఠమున కరిగెను. నారదా! లక్ష్మి, సరస్వతి, గంగ, తులసి యీనల్వురు శ్రీహరికి బ్రియపత్ను లైరి. తులసీదేహమునుండి గండకి యనునది ప్రాదుర్భవించి పవిత్రభారతవర్షములో బుణ్యప్రదతీర్థమై ప్రవహించెను. శ్రీహరి తుల శాపమును సంపన్న మొనరించుటకై యనేకసాలగ్రామ శిలారూపములతో బవిత్రగండకీనదీజలములలో నివసింప నారంభించెను. పవిత్రగండకీ నదీజలములలో విరాజిల్లు సాలగ్రామ పాషాణముల నారాధించిన నిశ్చయముగ నుత్తమఫలములు గలుగును. కాని జలములలోగాక భూమిపై బడి సూర్యతాపముచే బింగళవర్ణ యుక్తము లైనశిల లారాధన కుత్తమములు కావు.

నారదా! ఇట్లు నేను తులసీప్రసంగమును సాంగోపాంగముగ వర్ణించితిని.

ఇంక నీ వేవిషయములను శ్రవణ మొనరింప గోరుచున్నావో తెల్పిన బ్రివచింపగలను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణ మందలి
ప్రకృతిఖండములోని తులస్యుపాఖ్యానమను
ఇరువదియొకటవ అధ్యాయము
సంపూర్ణము.

—♦—

# ఇరువదిరెండవ అధ్యాయము

## తులసీధ్యానము, స్తవనము, పూజావిధి.

**నారదుడు పలికెను :**

ప్రభూ! తులసీదేవి శ్రీమన్నారాయణుని కత్యంతప్రేమపాత్రురాలు కావున బరమపునీత. ఆ దేవి నిఖిలజగములను వందనీయురాలు, పూజనీయురాలు, కాని దేవా! ఆతులసీమాత పూజావిధాన మేమి? ఈమె నేస్తోత్రముతో స్తుతింపవలెను? ఏదివ్యమంత్రముతో జపింపవలెను? మునీశ్వరా! ప్రప్రథమమున తులసిదేవి నెవరు స్తుతించి యారాధించిరి? ఏకారణమువలన నామె మీకును బూజనీయురా లయ్యెను? ఈవిషయముల నన్నింటిని గృపతో నుపదేశింప బ్రార్థించుచున్నాను.

**సూతుడు పలికెను :**

శౌనకాది మహర్షులారా! నారదుని ప్రశ్నముల నాలకింపగనే శ్రీనారాయణఋషి ముఖారవిందము ప్రసన్నత్వముతో వికసించెను. సకల పాపముల భస్మమొనరింపగల తులసీదివ్యమంత్రమును, ధ్యానమును, స్తోత్రము నాయన నారదున కుపదేశింప నారంభించెను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

మునీశ్వరా! శ్రీహరి తులసిని గ్రహించి శ్రీమహాలక్ష్మితో వైకుంఠములో సానందముగ విరాజిల్లెను. ఆయన తులసీదేవికి శ్రీమహాలక్ష్మితో సమాన గౌరవము, నఖండసౌభాగ్యమును బ్రసాదించెను. నారదా! శ్రీమహాలక్ష్మియు, గంగాదేవియు, తులసీ సాహచర్యమును సాదరముగ సహించిరి. కాని సరస్వతీదేవి క్రోధవశయై తదాధిక్యతను సహింపలేదు. సరస్వతీదేవివలన దన కవమానము సంభవించుట గాంచి తులసి యంతర్హితురాలయ్యెను. అఖండ జ్ఞానసంపన్నయైనతులసి సిద్ధయోగిని, సర్వసిద్ధేశ్వరి. కావున నామె శ్రీహరి దృష్టిపథమునుండి గూడ నదృశ్య కాగల్గెను. తులసీదేవిని గాంచలేక సరస్వతి ననేకవిధముల సమాధానపఱచి యామె యనుజ్ఞ గైకొని శ్రీహరి తులసీదేవిని బ్రసన్నురాలుగ జేసికొనుటకు బృందావనమునకు బయన మొనరించెను. బృందావనము జేరి శ్రీహరి పరిశుద్ధుడై శ్రీ తులసీ దశాక్షరమహామంత్రము నుచ్చరింపదొడంగెను. లక్ష్మీబీజమే శ్రీం, మాయాబీజమే హ్రీం, కామబీజమే క్లీం, వాణీబీజమే ఐం. ఈబీజములను బ్రప్రథమమున గ్రమముగ నుచ్చరించి బృందావనీ శబ్దమునకు జివర చతుర్థీవిభక్తిని జోడించి చిట్టచివరకు వహ్నిజాయ యగుస్వాహా శబ్దోచ్చారణ మొనరింపవలెను.

'శ్రీం హ్రీం క్లీం ఐం బృన్దావనై్యస్వాహా'

నారదా! ఈదశాక్షర మహామంత్రము మంత్రరాజము, తదుపాసకులకు సాక్షాత్కల్పతరు సదృశము. ఎవరీ మహామంత్రము నుచ్చరించుచు దులసీదేవిని విధిపూర్వకముగ నారాధించి పూజింతురో వారికి నిశ్చయముగ సర్వసిద్ధులు లభింపగలవు. షోడశోపచారముల నర్పించి, మంత్రముతో నుపాసించి స్తోత్రముతో స్తుతించిన తులసి యత్యంత ప్రసన్నురాలు కాగలదు. ఇట్లే శ్రీహరి యాదేవి నారాధింపగా నామె తులసీవృక్షమునుండి బయల్వెడలి ప్రసన్నురాలై శ్రీహరి చరణముల నాశ్రయించెను. కృపాసాగరుడైన శ్రీహరి యామెనిట్లను గ్రహించెను. "దేవీ! నీవు సర్వపూజ్యురాల వయ్యెదవు గాక. నేనే స్వయముగ నిన్ను నాశిరముపై, నా వక్షఃస్థలమందు ధరించి గౌరవింతును. నేనే కాదు సకలదేవతలు నిన్ను దమతమ మస్తకములపై ధరించి యారాధింపగలరని" తులసి ననుగ్రహించి శ్రీహరి యామెతో గూడి వైకుంఠము జేరెను.

**నారదుడు పలికెను :**

దేవా! తులసీదేవి ధ్యానమును, స్తవమును, పూజావిధిక్రమమును సవిస్తరముగా కృపతో వ్యాఖ్యానింపుడు.

**శ్రీనారాయణఋషి పలికెను :**

అంతర్హితాయాం తస్యాం చ గత్వా చ తులసీవనమ్ ।
హరిః సమ్పూజ్య తుష్టావ తులసీం విరహాతురః ॥ 17

మునీశ్వరా! తులసి యంతర్ధానము కాగనే శ్రీహరి విరహసంతప్తుడై బృందావనమున కరిగి తులసీమంత్రమును జపించి యామె నిట్లు స్తుతింప నారంభించెను.

తులసీ స్తోత్రమ్

బృన్దారూపాశ్చ వృక్షాశ్చ యదైకత్ర భవన్తి చ ।
విదు ర్బుధా స్తేన బృన్దాం మత్ప్రియాం తాం భజా మ్యహమ్॥
పురా బభూవ యా దేవీ త్వాదౌ బృన్దావనే వనే ।
తేన బృన్దావనీ ఖ్యాతా సౌభాగ్యం తాం భజా మ్యహమ్ ॥
అసంఖ్యేషు చ విశ్వేషు పూజితా యా నిరన్తరమ్ ।
తేన విశ్వపూజితాఖ్యాం జగత్పూజ్యాం భజా మ్యహమ్॥
అసంఖ్యాని చ విశ్వాని పవిత్రాణి యయా సదా ।
తాం విశ్వపావనీం దేవీం విరహేణ స్మరా మ్యహమ్ ॥
దేవా న తుష్టాః పుష్పాణాం సమూహేన యయా వినా।
తాం పుష్పసారాం శుద్ధాం చ ద్రష్టు మిచ్ఛామి శోకతః ॥
విశ్వే యత్ప్రాప్తి మాత్రేణ భక్తానన్దో భవేద్ ధ్రువమ్।
నన్దినీ తేన విఖ్యాతా సా ప్రీతా భవితా హి మే॥
యస్యా దేవ్యా స్తులా నాస్తి విశ్వేషు నిఖిలేషు చ ।
తులసీ తేన విఖ్యాతా తాం యామి శరణం ప్రియామ్ ॥
కృష్ణజీవనరూపా యా శశ్వత్ప్రియతమా సతీ ।
తేన కృష్ణజీవనీతి మమ రక్షతు జీవనమ్ ॥ (18-25)

"బృందారూపవృక్షములు, తదితరవృక్షము లేకములై యెచట విరా

జిల్లునో యావృక్షసముదాయమును విద్వాంసులైనబుధజనులు బృందావన మని కీర్తింతురు. బృందానామముచే ప్రసిద్ధిగాంచినదియు, నాకు ప్రియయు నగుతులసీదేవిని భజించెదను.

ప్రాచీనకాలములో బృందావనములో ప్రాదుర్భవించిన కారణమున బృందావని యనునామమున విఖ్యాతిగాంచిన సౌభాగ్యవతి యగుతులసిని భజించెదను. తులసీవృక్ష మసంఖ్యాక వృక్షసముదాయములలో నిరంతరము పూజనీయురాలై విరాజిల్లుచున్న కారణమున నావృక్షనామధేయము విశ్వపూజితయని గణుతి కెక్కెను. నే నట్టి జగత్పూజ్యను భజించెదను. అనంతవిశ్వములను బవిత్రమొనరించునదియు, విశ్వపావనియైనదియు నగునా దేవిని విరహాతురుడనై స్మరించెదను. అన్యపుష్పసమూహము లెన్నియున్నను నేదిలేనిచో దేవతలు ప్రసన్నులు కారో, యట్టి పుష్పసారయు, శుద్ధస్వరూపిణియు నగుతులసిని శోకముచే వ్యాకులుడనై దర్శింప గాంక్షించుచున్నాను. ఏదేవి అనుగ్రహప్రాప్తిమాత్రముననే భక్తుడు పరమానంద మొందుచున్నాడో యాదేవి దివ్యనామమే నందినియని ప్రసిద్ధిగాంచెను, ఆతులసి యిక నాపై బ్రసన్నురా లగుగాక. అఖిలవిశ్వములందు నాదేవికి సమానులు మఱియొకరు లేరు, కావుననే యామె నామము తులసి యయ్యెను. నా కత్యంత ప్రేమపాత్రురాలైనయాదేవిని శరణు జొచ్చెదను. ఆతులసి బృందారూపమున శ్రీకృష్ణునకు జీవనస్వరూపిణి యయ్యెను. శ్రీకృష్ణునకు సదా ప్రియతమ కావున నామె నామధేయము కృష్ణజీవని యని విఖ్యాతిగాంచెను. ఆతులసి నాజీవనమును రక్షించుగాక".

ఇట్లనేకవిధముల స్తుతించి శ్రీలక్ష్మీకాంతుడైన శ్రీహరి తులసీదేవి సాక్షాత్కారముకొఱకై నిరీక్షింప దొడంగెను. భగవంతుని ప్రార్థనల కత్యంత ప్రసన్నురాలై తులసీదేవి శ్రీహరియెదుట సాక్షాత్కరించి తత్క్షణమే యాయన దివ్యచరణములకు బ్రణమిల్లెను. తనప్రియాతిప్రియతమ యైన తులసికి శ్రీహరి తనహృదయమందు స్థాన మొసంగెను. సరస్వతి, తులసి యిర్వురు మరల భగవంతుని యారాధనలం దెట్టి భేదాభిప్రాయములు లేక యేకమైరి. వైరభావము వారిమనములనుండి తొలగిపోయెను. శ్రీహరి ప్రసన్నుడై దేవీ! నీవు సర్వపూజ్యురాలవు, సర్వులకు శిరోధార్యవు,

సకలజనులకు నాదరణీయవు, మాన్యవు గమ్మని తులసీదేవి నను గ్రహించెను.

> బృన్దా బృన్దావనీ విశ్వపూజితా విశ్వపావనీ ।
> పుష్పసారా నన్దినీ చ తులసీ కృష్ణజీవనీ ॥
> ఏతన్నామాష్టకం చైవ స్తోత్రం నామార్థసంయుతమ్ ।
> యః పఠేత్ తాం చ సమ్పూజ్య సోఽశ్వమేధఫలం లభేత్॥ (32,33)

బృంద, బృందావని, విశ్వపూజిత, విశ్వపావని, పుష్పసార, నందిని, తులసి, కృష్ణజీవని యనునవే తులసీదేవి యష్టనామములు. ఈనామాష్టక మైనస్తోత్రము నర్థసంయుతముగా బఠించి తులసీదేవిని బూజించు వారి కశ్వ మేధయజ్ఞ ఫలము కలుగును.

కార్తికపూర్ణిమాతిథియందు తులసీమంగళమయావిర్భావము సంభ వించెను. సర్వప్రథమమున స్వయముగా శ్రీహరియే తులసీపూజ సంపన్న మొనరించెను.

> తస్యాం యః పూజయేత్తాం చ భక్త్యాచవిశ్వపావనీమ్।
> సర్వపాపా ద్వినిర్ముక్తో విష్ణులోకం స గచ్ఛతి ॥
> కార్తికే తులసీపత్రం విష్ణవే యో దదాతి చ ।
> గవా మయుతదానస్య ఫల మాప్నోతి నిశ్చితమ్ ॥
> అపుత్రో లభతే పుత్రం ప్రియాహీనో లభేత్ప్రియామ్ ।
> బన్ధుహీనో లభే ద్బన్ధుం స్తోత్రస్మరణమాత్రతః॥
> రోగీ ప్రముచ్యతే రోగా ద్బద్ధో ముచ్యేత బన్ధనాత్ ।
> భయా న్ముచ్యేత భీత స్తు పాపా న్ముచ్యేత పాతకీ॥ (35-38)

"కార్తికపూర్ణిమా శుభదినమున విశ్వపావని యగుతులసీదేవిని భక్తిభావముతో పూజించు వారు సర్వపాపములనుండి విముక్తులై విష్ణు లోకమునకు బ్రస్థాన మొనరింపగలరు. విష్ణువునకు దులసీపత్రములను నిత్య మనన్యభక్తి సమన్వితులై యర్పించు వారలకు బదివేలగోవులను దాన మొనరించిన యఖండఫలము నిశ్చయముగా లభింపగలదు. ఈ తులసీ నామాష్టకస్తోత్ర స్మరణమాత్రముననే సంతానహీను లైనవారు పుత్రవంతులు కాగలరు. ప్రియాహీనులకు బ్రియపత్నులు లభింపగలరు. బంధుహీనుల

కసంఖ్యాకబంధువులును లభింపగలరు. ఈస్తోత్రస్మరణ మాత్రముననే రోగగ్రస్తుడు రోగములనుండి, బంధితుడు బంధములనుండి, పాపాత్ముడు పాపములనుండి విముక్తి పొందగలడు, భయభీతు డైనపురుషుడు నిర్భయుడు కాగలడు".

నారదా! పవిత్ర తులసీస్తోత్రమును నీ కుపదేశించితిని. ఇప్పుడు ధ్యానపూజావిధానములను ప్రవచించెద శ్రవణ మొనరింపుము. కుమారా! కణ్వశాఖయందు ప్రతిపాదింపబడిన తులసీదేవి ధ్యానము నీకు విదితమే. తులసీధ్యానమందు సకలపాపములను భస్మీపటల మొనరింపగల యమోఘశక్తి కలదు. ధ్యానానంతర మావాహన మొనరింపకయే పవిత్రతులసీవృక్షమునకు భక్తిపూర్వకముగ షోడశోపచారముల నర్పించి తులసీదేవి యారాధన సంపన్న మొనరింపవలెను.

తులసీం పుష్పసారాం చ సతీం పూజ్యాం మనోహరామ్।
కృత్స్నపాపేధ్మదాహాయ జ్వలదగ్నిశిఖోపమామ్॥
పుష్పేషు తులనా ప్యస్యా నాసీద్ దేవీషు వా మునే।
పవిత్రరూపా సర్వాసు తులసీ సా చ కీర్తితా॥
శిరోధార్యాం చ సర్వేషా మీప్సితాం విశ్వపావనీమ్।
జీవన్ముక్తాం ముక్తిదాం చ భజే త్వాం హరిభక్తిదామ్॥ (41-43)

నారదా! పరమసాధ్వి యగుతులసి సకలపుష్పసారస్వరూపిణి, అత్యంత పూజనీయురాలు, పరమమనోహారిణి, సర్వపాపరూపము లైనయింధనములను భస్మ మొనరించుటకు ప్రజ్వలితాగ్నిజ్వాలాశిఖాస్వరూపిణి, పుష్పములందుగాని, దేవాంగనలందుగాని, యెవరినిగూడ నీమెతో బోల్చలేము, కావుననే సర్వులయందు బరమపవిత్రస్వరూపిణి యైనయీదేవినామము తులసిగా ప్రసిద్ధిగాంచెను. సర్వులకు దులసీదేవి మస్తకముపై ధరించుటకు సుయోగ్యురాలు. అందఱు నీమె యనుగ్రహము పొందవలెనని యభిలషింతురు. విశ్వమునే పవిత్ర మొనరింపగల యీదేవి జీవన్ముక్తురాలు. ముక్తిని, శ్రీహరియం దనన్య భక్తిని బ్రసాదించుటయే యీమె స్వభావములు. తులసీదేవిని సదా నే నుపాసించెదను.

విద్వాంసు లైనపురుషు లీప్రకారముగ ధ్యానించి, పూజించి, స్తవన

మొనరించి, ప్రణామము లర్పించి తులసీదేవి యారాధన సంపన్న మొనరింప వలెను. నారదా! తులసీ పవిత్రాఖ్యానమును విని పునీతుడ వైతివి. నీ వింక నే యే విషయముల వినగోరుచున్నావో తెల్పిన ప్రవచింపగలను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని తులస్యుపాఖ్యాన
మను ఇరువదిరెండవ అధ్యాయము
సంపూర్ణము.

---

# ఇరువదిమూడవ అధ్యాయము

## అశ్వపతిరాజునకు పరాశరుడు సావిత్రీవ్రతమును వివరించుట.

**నారదుడు పలికెను :**

దేవా! సుధాభరిత తులసీజనని దివ్యచరితమును మీకృపాకటాక్షము వలన శ్రవణ మొనరింపగల్గితిని. సకల సందేహభంజనా! మీరు నన్ననుగ్రహించి నాకు సావిత్రీదేవి పవిత్రోపాఖ్యానము నుపదేశింపుడని ప్రార్థించుచున్నాను. వేదములకే మాతృదేవత యైన సావిత్రి యావిర్భావ మెట్లు సంభవించెను? సర్వప్రథమముగ నామె నుపాసించిన ధన్యు లెవరు? అవనిపై సావిత్రి నుపాసించి భవసాగరమును దరించిన చరితార్థు డెవరు? ఈవిషయముల నన్నింటిని సవిస్తరముగ వర్ణింపుడు,

**శ్రీనారాయణఋషి పలికెను:**

బ్రహ్మకులైక పావనా! ప్రప్రథమమున స్వయముగా జగద్విధాతయగు బ్రహ్మయే వేదజనని యైనసావిత్రి నారాధించి పూజించెను. బ్రహ్మ తరువాత సకల దేవతలు నీమెపూజలను సాంగోపాంగముగ సంపన్న మొనరించిరి. అవ

నిపై పవిత్ర భారతవర్షములో నశ్వపతి యనుచక్రవర్తి ప్రప్రథమమున వేద మాత నుపాసించెను. తదనంతరము సకలమానవులు సావిత్రీదేవి నుపాసింప నారంభించిరి.

అపుడు నారదమహర్షి "దేవా! అశ్వపతిమహారా జెవరు? ఆయన యే కాంక్షతో సావిత్రీదేవి నారాధించెను" అని ప్రశ్నించెను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

మునీశ్వరా! అశ్వపతిమహారాజు మద్రదేశాధీశుడు. శత్రువులశక్తి క్షీణింపజేయుట, మిత్రుల కష్టములను నివారించుట యాయనస్వభావములు. ధర్మము దప్పక చరించు రాణి మాలతి తదర్థాంగి. శ్రీమన్నారాయణుని ప్రియపత్నియగుశ్రీమహాలక్ష్మివలె ఆసాధ్వినశ్వపతిరాజు పట్టపుదేవేరియైశోభించి నది. నారదా! ఆసాధ్వీలలామ వశిష్ఠమహర్షి యాదేశానుసారము సత్సంతానము కొఱకు భక్తిపూర్వకముగ సావిత్రీదేవి నారాధించెను. కాని సావిత్రీదేవి కరుణ ప్రాప్తింపని కారణమున మాలతీదేవి యత్యంత దుఃఖిత యయ్యెను. ధర్మపత్ని నూరడించి యశ్వపతిరాజు పుష్కరక్షేత్రము జేరి సావిత్రీ కరుణా కటాక్షముల కొఱకై ఘోరతప మారంభించెను. ఆనరేశ్వరు డింద్రియము లను వశమం దుంచుకొని బహుకాలము సావిత్రీదేవి నారాధించెను. పది లక్షలు గాయత్రీజప మాచరించిన సావిత్రి ప్రసన్నురాలు కాగలదని యశరీర వాణి యతని నాదేశించెను. ఆసమయముననే దైవప్రేరితుడై పరాశరమహర్షి యశ్వపతిరాజాశ్రమమున కేతెంచగా రాజు మహర్షి నాహ్వానించి యనేకవిధ ముల బూజించెను. అశ్వపతి యొసంగిన స్వాగతమునకు సంతుష్టుడై పరాశర మహర్షి సాక్షాత్సావిత్రీస్వరూప మైన దివ్యగాయత్రీ మహామంత్రమాహాత్మ్య మును గుఱించి యిట్లు ప్రవచింప నారంభించెను.

పరాశరమహర్షి పలికెను :

సకృజ్జపశ్చ గాయత్ర్యాః పాపం దినకృతం హరేత్ ।
దశధా ప్రజపో నృణాం దివారాత్ర్యఘమేవ చ ॥

శతధా చ జపాచ్చైవం పాపం మాసార్జితం పరమ్ ।
సహస్రధా జపాచ్చైవం కల్మషం వత్సరార్జితమ్ ॥

లక్షం జన్మకృతం పాపం దశలక్షం త్రిజన్మనః।
సర్వజన్మకృతం పాపం శతలక్షే వినశ్యతి।
కరోతిముక్తిం విప్రాణాం జపో దశగుణస్తతః ॥ (14-16)

గాయత్రీమహామంత్రమును మనసార నొక్కపర్యాయమే జపించినను బగలుచేసిన పాప మంతయు నశింపగలదు. పదిపర్యాయము లీమహా మంత్రము నుచ్చరించిన పగలు రాత్రి యాచరించిన పాపము లన్నియు నశింప గలవు. నూఱుపర్యాయములు జప మాచరించిన నొకమాసమం దొనరించిన పాపము లన్నియు భస్మములు కాగలవు. వేయిపర్యాయములు జపించిన సంవత్సరకృత పాపములనుండి విముక్తి లభింపగలదు. ఒకలక్షపర్యాయములు జపించిన నొకజన్మమునజేసిన పాపములు తొలగిపోగలవు. పదిలక్షలపర్యాయ ములు జపించిన మూడుజన్మములలో నొనర్చిన పాపములు నశింపగలవు. ఒక కోటిపర్యాయములు గాయత్రి జప మాచరించిన సర్వజన్మముల పాపములు నశింపగలవు. పదికోట్లగాయత్రిజప మాచరించిన బ్రాహ్మణుడు జన్మరాహి త్యము నొందగలడు.

> కరం సర్పఫణాకారం కృత్వా తద్రన్ధ్రిముద్రితమ్ ।
> ఆనమ్రమూర్ధ మచలం ప్రజపేత్ ప్రాఙ్ముఖో ద్విజః ॥
> అనామికామధ్యదేశా దధోవామక్రమేణ చ ।
> తర్జనీమూలపర్యన్తం జపస్యైష క్రమః కరే ॥ (17-18)

ద్విజులు దక్షిణహస్తమును సర్పఫణాకారముగ ముద్ర యొనరించి కొంచెము వంచి యనామికను మధ్య నిడుకొని పర్వమునుండి యారంభించి క్రిందినుండి యెడమవైపుగా దర్జనీమూలభాగమువఱకు నంగుష్ఠమును స్పృశిం చుచు గాయత్రీజప మొనరింపవలెను.

శ్వేతకమలబీజములను గాని, స్ఫటికమణులనుగాని మాలగా నొన రించి వీలున్న బవిత్రతీర్థప్రదేశములోనో లేక దేవాలయములోనో పద్మాసనా సీనులై యనన్యభక్తిభావముతో గాయత్రిమంత్రజప మొనరించు టత్యంత శ్రేష్ఠము. సప్తాశ్వత్థ పత్రములపై సంయమపూర్వకముగ జపమాల నుంచి గోరోచనముతో మాల ననులిప్త మొనరించి తదనంతరము నూఱుపర్యాయము లైనను విధిగా గాయత్రిజప మాచరింపవలెను. గోరోచనము లభింపనిచో బంచగవ్యములచే గాని లేక గంగాజలములచేగాని జపమాలను సంస్కరింప వచ్చును. సంస్కరించిన జపమాలతోనే గాయత్రి జప మొనరింప వలెను.

రాజర్షీ ! నే నుపదేశించిన ప్రకారము పదిలక్షలపర్యాయములు గాయత్రీ జప మాచరింపుము. ఈదివ్యజపఫలప్రభావమున నీమూడుజన్మలపాపములు నశించి సావిత్రీదేవి ప్రసన్నురాలై నీయెదుట సాక్షాత్కరింపగలదు. రాజా! ప్రతిదినము త్రికాలములందు బవిత్రుడవై సంధ్యావందన మాచరింపుము. ఎందువలన ననగా సంధ్యావందన మాచరింపని మానవుడు సదా యపవిత్రుడై సకలశుభకార్యముల కనధికారి కాగలడు. దినమునం దాతడేయేసత్కర్మముల నాచరించునో యవియన్నియు గేవలము సంధ్యావందన మాచరింపని కారణమున నిష్ఫలములు కాగలవు. త్రిసంధ్యల నాచరింపని బ్రాహ్మణుడు బ్రాహ్మణోచిత సకల కర్మములనుండి బహిష్కరింపబడగలడు. ప్రాతఃకాలముననైనను సంధ్యావందన మాచరింపని బ్రాహ్మణుడు శూద్రునితో సమానుడు. జీవితపర్యంతము త్రికాలసంధ్యోపాసన మొనరించిన బ్రాహ్మణుడు సూర్యసమాన తేజస్వి కాగలడు. అట్టి ద్విజోత్తముని చరణరజస్పర్శమాత్రముననే వసుంధరయు బవిత్ర కాగలదు. నిరంతర సంధ్యోపాసనాపరుడైన బ్రాహ్మణుడు సకలపాపవిముక్తుడై నిశ్చయముగ భవసాగరమును దరింపగలడు సంధ్యాపూజితుడైనబ్రాహ్మణుని స్పర్శమాత్రముననే తీర్థములును బవిత్రములు కాగలవు. గరుత్మంతుని గాంచి పలాయనము చిత్తగించుసర్పములవలె సంధ్యాపూజితుడైనద్విజుని గాంచి సకలపాపములు తొలగిపోగలవు. సంధ్యావందన మాచరింపని వా రర్పించిన తర్పణములను దేవత లంగీకరింపరు, వా రర్పించిన శ్రాద్ధకర్మములను బితృదేవతలు స్వీకరింపరు.

ఇట్లు సంధ్యోపాసన మాహాత్మ్యమును వర్ణించి యశ్వపతికి గాయత్రీ విధి నుపదేశించి పరాశరమహర్షి తన నిజాశ్రమమునకు బ్రస్థాన మొనరించెను. పరాశరమహర్షి యుపదేశించిన యుపదేశానుసారముగ నశ్వపతిప్రభువు సావిత్రీదేవి నుపాసించి, గాయత్రీజప మాచరించి, జనని యనుగ్రహమునకు బాత్రుడై యభీష్టసిద్ధి నొందెను.

**నారదుడు పలికెను :**

పరాశరమహర్షి యశ్వపతిరాజున కుపదేశించిన సావిత్రీధ్యానమును, బూజావిధానమును, మూలమంత్రమును, స్తోత్రమును నా కుపదేశించి నన్ను ధన్యుని జేయవలసినదిగా బ్రార్థించుచున్నాను. ఎట్లామహారాజు సావిత్రినుపా

సించి యామె యనుగ్రహముచే నేయేవరములను బొందెనో యావిషయముల నన్నింటిని వర్ణింపుడు.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! జ్యేష్ఠశుక్లత్రయోదశీదినమున శుభముహూర్తములో సంయమపూర్వకముగనుండి చతుర్దశీదినమున భక్తిభావముతో వ్రత మారంభించి సావిత్రీదేవిపూజ సంపన్న మొనరింపవలెను. సావిత్రీవ్రతము పదునాల్గు సంవత్సరములాచరింపవలెను. ఈవ్రతములో బదునాల్గువిధము లైనఫలములను, పదునాల్గు విధము లైననైవేద్యములను సావిత్రి కర్పింపవలెను. పుష్పములతో, ధూపదీపములతో, యజ్ఞోపవీతముతో, నైవేద్యాదిసర్వోపచారములతో జనని యగుసావిత్రిని విధిపూర్వకముగ నారాధింపవలెను. ప్రథమమున నొకమంగళకలశమును స్థాపించి యాకలశముపై ఫలమును, బల్లవముల నుంచవలెను. గణేశ్వరుని, సూర్యుని, నగ్నిదేవుని, విష్ణుదేవుని, శివుని, పార్వతిని విధిగా బూజించి తదనంతరము సావిత్రి నావాహనము చేసి కలశస్థితయై విరాజిల్లునా జనని ననన్యభక్తిభావముతో నారాధింపవలెను. యజుర్వేదమందు మాధ్యందినశాఖలో బ్రతిపాదింపబడిన సావిత్రి దివ్యధ్యానము నుపదేశించెద నవధరింపుము.

తప్తకాంచనవర్ణాభాం జ్వలన్తీం బ్రహ్మతేజసా ।
గ్రీష్మమధ్యాహ్నమార్తాణ్డసహస్రసమసుప్రభామ్ ॥
ఈషద్ధాస్యప్రసన్నాస్యాం రత్నభూషణభూషితామ్ ।
వహ్నిశుద్ధాంశుకాధానాం భక్తానుగ్రహకారికామ్ ॥
సుఖదాం ముక్తిదాం శాన్తాం కాన్తాం చ జగతాం విధేః ।
సర్వసమ్పత్స్వరూపాం చ ప్రదాత్రీం సర్వసమ్పదామ్ ॥
వేదాధిష్ఠాతృదేవీం చ వేదశాస్త్రస్వరూపిణీమ్ ।
వేదే బీజస్వరూపాం చ భజే త్వాం వేదమాతరమ్ ॥ (47-50)

"సావిత్రీదేవి వర్ణము తప్తకాంచన సదృశము. ఆమె యఖండబ్రహ్మతేజముతో సదా ప్రజ్వరిల్లుచుండును. గ్రీష్మకాలములో మధ్యాహ్న సమయమున బ్రకాశించు సహస్రమార్తాండుల ప్రకాశముతో సమముగ నీమె ప్రకాశించుచుండును. రత్నభూషణములతో విభూషితయై, వహ్నిశుద్ధ దివ్యవస్త్రములను ధరించి నగుమోముతో భక్తుల ననుగ్రహించుటకే యీమె

సాకారమున సాక్షాత్కరించెను. జగద్విధాతకు ప్రేమపాత్రురాలైనయాభగవతి సుఖప్రదాయిని, ముక్తిప్రదాయిని, శాంతి ప్రదాయిని, సర్వసంపత్ప్రదాయిని, సర్వసంపత్స్వరూపిణి. సకల వేదములకు నధిష్ఠాత్రియు, వేదశాస్త్ర స్వరూపిణియు, వేదబీజస్వరూపిణియు, వేదమాతయు నగుసావిత్రిని భజించెదను".

ఇట్లు సావిత్రీదేవిని ధ్యానించి తమశిరములపై బుష్పముల నుంచుకొన వలెను. మంగళకలశముపై నావాహన మొనరింపబడి విరాజిల్లియున్న సావిత్రీదేవిని వేదోక్త మంత్రముల నుచ్చరించుచు షోడశోపచారములచే బూజింపవలెను. విధిపూర్వకముగ నామె యారాధన సంపన్నమొనరించి స్తుతించి సాష్టాంగ దండప్రణామము లర్పింపవలెను. ఆసనము, పాద్యము, అర్ఘ్యము, స్నానము, అనులేపనము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, శీతలజలము, వస్త్రము, భూషణములు, పుష్పమాలలు, చందనము, ఆచమనము, మనోహరశయ్య–అనునవి షోడశోపచారములు.

దారుసారవికారం చ హేమాదినిర్మితం చ వా ।
దేవాధారం పుణ్యదం చ మయా తుభ్యం నివేదితమ్ ॥
తీర్థోదకం చ పాద్యం చ పుణ్యదం ప్రీతిదం మహత్ ।
పూజాఙ్గభూతం శుద్ధం చ మయా భక్త్యా నివేదితమ్ ।
పవిత్రరూపమర్ఘ్యం చ దూర్వాపుష్పాక్షతాన్వితమ్ ।
పుణ్యదం శఙ్ఖతోయాక్తం మయా తుభ్యం నివేదితమ్ ॥
సుగన్ధిధాత్రీతైలం చ దేహసౌన్దర్యకారణమ్ ।
మయా నివేదితం భక్త్యా స్నానీయం ప్రతిగృహ్యతామ్ ॥
మలయాచలసమ్భూతం దేహశోభావివర్ధనమ్ ।
సుగన్ధయుక్తం సుఖదం మయా తుభ్యంనివేదితమ్ ॥
గన్ధద్రవ్యోద్భవః పుణ్యః ప్రీతిదో దివ్యగన్ధదః ।
మయానివేదితో భక్త్యా ధూపోఽయం ప్రతిగృహ్యతామ్ ॥
జగతాం దర్శనీయం చ దర్శనం దీప్తికారణమ్ ।
అన్ధకారధ్వంసబీజం మయా తుభ్యం నివేదితమ్ ॥
తుష్టిదం పుష్టిదం చైవ ప్రీతిదం క్షుద్వినాశనమ్ ।
పుణ్యదంస్వాదురూపం చ నైవేద్యం ప్రతిగృహ్యతామ్ ॥

తామ్బూలం చ వరం రమ్యం కర్పూరాదిసువాసితమ్,
తుష్టిదం పుష్టిదం చైవ మయా భక్త్యా నివేదితమ్॥
సుశీతలం వాసితం చ పిపాసానాశకారణమ్।
జగతాం జీవరూపం చ జీవనం ప్రతిగృహ్యతామ్।
దేహశోభాస్వరూపం చ సభాశోభావివర్ధనమ్।
కార్పాసజం చ కృమిజం వసనం ప్రతిగృహ్యతామ్॥
కాంచనాదివినిర్మాణం శ్రీయుక్తం శ్రీకరం సదా।
సుఖదం పుణ్యదం చైవ భూషణం ప్రతిగృహ్యతామ్॥
నానాపుష్పవినిర్మాణం బహుశోభాసమన్వితమ్।
ప్రీతిదం పుణ్యదంచైవమాల్యం చ ప్రతిగృహ్యతామ్॥
సర్వమఙ్గలరూపశ్చ సర్వమఙ్గలదో వరః।
పుణ్యప్రదశ్చ గన్ధాఢ్యో గన్ధశ్చ ప్రతిగృహ్యతామ్॥
శుద్ధం శుద్ధిప్రదం చైవ శుద్ధానాం ప్రీతిదం మహత్।
రమ్యమాచమనీయంచ మయా దత్తం ప్రగృహ్యతామ్॥
రత్నసారాదినిర్మాణం పుష్పచన్దనసంయుతమ్।
సుఖదం పుణ్యదం చైవ సుతల్పం ప్రతిగృహ్యతామ్॥
నానావృక్షసముద్భూతం నానారూపసమన్వితమ్।
ఫలస్వరూపం ఫలదం ఫలం చ ప్రతిగృహ్యతామ్॥
సిన్దూరం చ వరం రమ్యం ఫాలశోభావివర్ధనమ్।
భూషణం భూషణానాం చ సిన్దూరం ప్రతిగృహ్యతామ్॥
విశుద్ధగ్రన్థిసంయుక్తం పుణ్యసూత్రవినిర్మితమ్।
పవిత్రం వేదమన్త్రేణ యజ్ఞసూత్రం చ గృహ్యతామ్॥ (55-73)

"దారుసారవికారము, సువర్ణాదులచే నిర్మితము, దేవతలకాధారము, పుణ్యప్రదము నగునుత్తమాసనమును నీకు సమర్పించుచున్నాను. పుణ్యప్రదములు, ప్రీతిప్రదములు, పరిశుద్ధములు, పూజాంగభూతము లైనశుద్ధతీర్థోదకములను నేను భక్తిభావముతో నీ కర్పించుచున్నాను. దూర్వాపుష్పాక్షతాన్వితము, పుణ్యప్రదము, శంఖతోయయుతము, పవిత్రము నగునర్ఘ్యమును నీ కర్పించుచున్నాను. దేహసౌందర్యమును పెంపొందింపజేయగల సుగంధిల ధాత్రీతైలమును, స్నానముకొఱకు శుద్ధజలములను నేను భక్తితో నీకు నివేదించుచున్నాను. దేవీ! నీవు దయతో నీస్నానీయములను స్వీకరింపుము.

దేహశోభావివర్ధకము, సుగంధసంయుక్తము, సుఖదము, మలయపర్వతోత్పన్నము నైనదివ్యచందనమును నీ కనులేపనముగ సమర్పించుచున్నాను. సుగంధద్రవ్యనిర్మితము, పుణ్యప్రదము, ప్రీతిదాయకము, దివ్యసుగంధయుక్తము నగు ధూపమును అనన్యభక్తితో సమర్పించుచున్నాను స్వీకరింపుము. జననీ! జగమునకు దర్శనీయము, సృష్టికి సహాయకము, ప్రకాశమునకు గారణము, అంధకారవినాశము, బీజస్వరూపము నగుదివ్యదీపమును నివేదించుచున్నాను. తుష్టిని, బుష్టిని, బ్రీతిని గలిగించునదియు, నాకలిని దీర్చునదియు, బుణ్యప్రదమైనదియు, స్వాదువైనదియు నగునైవేద్యమును సమర్పించుచున్నాను, స్వీకరింపుము. దేవేశ్వరీ! సుందరము, రమణీయము, సంతోషప్రదము, పుష్టికారకము, కర్పూరాదిసువాసితము నగుతాంబూలమును భక్తిభావముతో నర్పించుచున్నాను, స్వీకరింపుము. సుశీతలములు, సువాసితములు, పిపాసానాశకారణములు, జగజ్జీవనరూపములు నైనజలములను సమర్పించుచున్నాను, అనుగ్రహముతో స్వీకరింపుము. దేహశోభాస్వరూపము, సభాశోభావివర్ధనము, కార్పాసజము (నూలుచే చేయబడినది), కృమిజము (పట్టు) నైనవస్త్రమును సమర్పించుచున్నాను, స్వీకరింపుము. సువర్ణాదులచే నిర్మితము, శ్రీయుక్తము, శ్రీకరము, సుఖప్రదము, పుణ్యప్రదము నగుభూషణములను స్వీకరింపుము. నానాపుష్పములచే నిర్మితము, నత్యంత మనోహరము, ప్రీతిప్రదము, పుణ్యప్రదము నగుపుష్పమాలను స్వీకరింపుము. దేవీ! సర్వమంగళస్వరూపము, సర్వమంగళదాయకము, శ్రేష్ఠము, పుణ్యప్రదము, సుగంధిలము నగు గంధమును గరుణతో స్వీకరింపుము. శుద్ధములు, శుద్ధిప్రదములు, మహాప్రీతిప్రదములు నైనయాచమనీయజలములు నేను నీ కరించుచున్నాను, స్వీకరింపుము. రత్నసారాది నిర్మితము, పుష్పచందనసంయుతము సుఖప్రదము, పుణ్యప్రదము నగుసుతల్పమును స్వీకరింపుము. దేవేశ్వరీ! అనేకవృక్షములచే నుత్పన్నము నానారూపసమన్వితము, ఫలస్వరూపము, ఫలప్రదము నగుఫలమును స్వీకరింపుము. దేవీ! సుందరము శ్రేష్ఠము ఫాలశోభావివర్ధనము, సకలభూషణములకు భూషణము నగుసిందూరమును స్వీకరింపుము. జననీ! పవిత్రసూత్రముచే నిర్మితము విశుద్ధగ్రంథియుక్తము, వేదమంత్రములచే బవిత్రము నగుయజ్ఞసూత్రమును స్వీకరింపుము".

విద్వాంసు లైనబుధజను లిట్లు వేదమంత్రోచ్చారణ మొనరించుచు సావిత్రీ దేవికి షోడశోపచారముల నర్పింపవలెను. తదనంతరము భక్తి పూర్వకముగ బురోహితునకు దక్షిణ నొసంగి సావిత్రీదివ్యమహామంత్రజప మొనరింపవలెను. సావిత్రీశబ్దమునకు జతుర్థీవిభక్తిని జోడించి చివరకు స్వాహా శబ్ద ప్రయోగ మొనరింపవలెను. ప్రప్రథమమున లక్ష్మీ మాయా కామబీజాక్షరముల నుచ్చరింపవలెను.

"శ్రీం హ్రీం క్లీం సావిత్ర్యై స్వాహా"

ఇదియే సావిత్రీ దేవి మూలమంత్రము. సంపూర్ణాభీష్టములను బ్రసాదింపగల వేదములో మాధ్యందినశాఖయందు బ్రతిపాదింపబడిన సావిత్రీస్తోత్ర ముతో సావిత్రీ దేవిని స్తుతింపవలెను. నారదా! బ్రాహ్మణులకు సాక్షాజ్జీవన స్వరూప మైనయాదివ్యస్తోత్రము నుపదేశించెద, సావధానుడవై శ్రవణ మొనరింపుము. పూర్వకాలములో గోలోకపరంధామమందు శ్రీకృష్ణపరమాత్మ సావిత్రిని బ్రహ్మ ననుసరింపవలసినదిగా నాజ్ఞాపించెను. కాని సావిత్రీ దేవి బ్రహ్మ ననుసరించుటకు సంసిద్ధురాలు కాలేదు. అపుడు శ్రీకృష్ణుని యాదేశానుసారముగ విధాత భక్తి పూర్వకముగ సావిత్రిని స్తుతించెను. తదనంతర మామె సంతుష్టురాలై బ్రహ్మదేవు ననుసరించెను.

## బ్రహ్మకృత శ్రీసావిత్రీ స్తోత్రమ్

నారాయణస్వరూపే చ నారాయణి సనాతని ।
నారాయణా త్సముద్భూతే ప్రసన్నా భవ సున్దరి ॥
తేజఃస్వరూపే పరమే పరమానన్దరూపిణి ।
ద్విజాతీనాం జాతిరూపే ప్రసన్నా భవ సున్దరి ॥
నిత్యే! నిత్యప్రియే దేవి నిత్యానన్దస్వరూపిణి ।
సర్వమఙ్గలరూపేణ ప్రసన్నా భవ సున్దరి ॥
సర్వస్వరూపే విప్రాణాం మన్త్రసారే పరాత్పరే ।
సుఖదే మోక్షదే దేవి ప్రసన్నా భవ సున్దరి ॥
విప్రపాపేధ్మదాహాయ జ్వలదగ్నిశిఖోపమే ।
బ్రహ్మతేజఃప్రదే దేవి ప్రసన్నా భవ సున్దరి ॥
కాయేన మనసా వాచా య త్పాపం కురుతే ద్విజః ।
తత్తే స్మరణమాత్రేణ భస్మీభూతం భవిష్యతి ॥

దేవీ! నారాయణస్వరూపిణీ! నారాయణి! సనాతని! శ్రీమన్నారాయణసంభూతా! సుందరీ! ప్రసన్నురాలవు గమ్ము. దేవీ! నీవు తేజః స్వరూపిణివి, పరమానందరూపిణివి, ద్విజాతులకు నీవు సాక్షాజ్జాతిస్వరూపిణివి, సుందరీ! నీవు నాపై ప్రసన్నురాలవు గమ్ము. దేవీ! నీవు నిత్యవు, నిత్యప్రియవు, నిత్యానందస్వరూపిణివి. సుందరీ! ప్రసన్నురాలవు గమ్ము. శోభనా! నీవు బ్రాహ్మణులకు సర్వస్వరూపివి, సర్వోత్తమరాలవు, సకలమంత్రముల సారతత్త్వస్వరూపిణివి. నిన్నుపాసించిన సుఖములు, మోక్షము సులభములు కాగలవు. సుందరీ! నాపై బ్రసన్నురాలవు గమ్ము. దేవీ! బ్రాహ్మణుల పాపము లనెడు నింధనములను దగ్ధమొనరించు ప్రజ్వలితాగ్ని స్వరూపిణివి. బ్రహ్మతేజమును భక్తులకు బ్రసాదించుట నీసహజగుణము. సుందరీ! నాపై బ్రసన్నురాలవు గమ్ము. మనోవాక్కాయకర్మములచే సంభవించు సమస్తపాపములు కేవలము నీదివ్యనామసంస్మరణము వలన భస్మములు కాగలవు.

మునీశ్వరా! ఇట్లు సావిత్రిని బ్రహ్మదేవుడు గోలోకములో స్తుతింపగా నామె ప్రసన్నురాలై విధాత ననుసరించుటకు సంసిద్ధురాలయ్యెను.

నారదా! ఈస్తోత్రరాజమూలమున నశ్వపతిమహారాజు సావిత్రీదేవిని స్తుతించి యామెను యథావిధిగ నారాధించెను. అపుడు దేవి ప్రసన్నురాలై యానరేశ్వరు నెదుట సాక్షాత్కరింపగా నశ్వపతి యామెవలవ దనమనోభీష్ట వరములను బొంది ధన్యుడయ్యెను.

స్తవరాజ మిదం పుణ్యం త్రిః సన్ధ్యాయాం చ యః పఠేత్ ।
పాఠే చతుర్ణాం వేదానాం యత్ఫలం తల్లభే ద్ధ్రువమ్ ॥ 87

ఈ పరమపవిత్రమైనస్తవరాజమును మూడుసార్లు సంధ్యాకాలములందు బఠించిన నాల్గువేదములను బఠించిన యఖండఫలము లభించును.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణ
సంవాదమున సావిత్రీ పూజావిధాన
మనునిరువదిమూడవఅధ్యాయము
సంపూర్ణము.

# ఇరువదినాల్గవ అధ్యాయము

## సావిత్రి యవతరించుట, ఆమెను సత్యవంతుడు వివాహ మాడుట. అపమృత్యువుచే సత్యవంతుడు మృతిచెందుట, యమసావిత్రీ సంవాదము.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! అశ్వపతిరాజు అనన్యభక్తితో ఘోరతపము చేసి సావిత్రీ దేవిని విధిపూర్వకముగ నారాధింపగా నామె యానరేశ్వరుని యెదుట సాక్షాత్కరించెను. ఆమె శ్రీవిగ్రహము సహస్రార్కసమప్రభాసమన్వితము. ఆమె యత్యంత ప్రసన్నురాలై సస్మితవదనారవిందముతో తల్లి తన బిడ్డను గాంచి ప్రేమతో మధురముగ బల్కునట్లు యశ్వపతితో నిట్లు పలికెను. "మహారాజా! నీమనోభీష్టము, నీసహధర్మచారిణి యభిలాష నాకు విదితమే. నీ యర్థాంగి కన్యారత్నమును బడయవలెనని యభిల షించుచున్నది. నీవు పుత్రసంతానము నాకాంక్షించుచున్నావు. కావున క్రమముగ మీయిర్వురి మనోభీష్టములు నావరప్రభావమువలన సంపన్నములు కాగలవు". ఇట్లు వరములను బ్రసాదించి సావిత్రీదేవి యంతర్హిత యయ్యెను. తదనంతరము సమయానుసారముగ నశ్వపతిమహారాజ గృహ ములో నొక దివకన్య యావిర్భవించెను. సావిత్రీదేవి యారాధన ఫలముగ సాక్షాచ్ఛ్రీమహాలక్ష్మి కళాస్వరూపమున దమకుగల్గినకన్యకారత్నమున కారాజ దంపతులు సావిత్రి యని నామకరణ మొనరించిరి.

శుక్లపక్షచంద్రునివలె సావిత్రి దినదిన ప్రవర్ధమానయై నవయౌవన సౌందర్యసంపన్న యయ్యెను. సావిత్రి ద్యుమత్సేన కుమారుడైన సత్యవంతుని బతిగా వరించెను. ఎందువలన ననగా సత్యవంతుడు సత్య వాక్పరిపాలకుడు, శీలసంపన్నుడు, నానాసద్గుణసమన్వితుడు. ఆదంపతు లిర్వురు కొంతకాల మఖండసుఖముల ననుభవించిరి. విధ్యనుసారముగా ద్యుమత్సేనుడు రాజ్యభ్రష్టుడై సకుటుంబముగ వనవాస మొనరింప నారం భించెను. సత్యవంతుడు తలిదండ్రుల ననుసరింపగా సావిత్రి తనభర్త ననుస రించెను. వనములో నొకదినమున బిత్రాజ్ఞానువర్తియై సత్యవంతుడు ఫలము

లను, నింధనములను సంగ్రహించుట కరణ్యమున బ్రవేశింపగా నాయనను సావిత్రికూడ ననుసరించెను. విధాత నిర్ణయించిన కాలానుసారముగ సత్యవంతుని యాయుర్దాయ మాదినముతో సమాప్తము కాగా సత్యవంతుడు వృక్షము పైనుండి క్రిందపడి ప్రాణముల గోల్పోయెను. నారదా! స్వయముగ యమధర్మరా జాప్రదేశమున కరుదెంచి సత్యవంత జీవున కంగుష్ఠసదృశ సూక్ష్మశరీరము నొసంగి దానిని పాశముచే బంధించి సంయమపురికి గొనిపో బయలుదేరెను. మహాపతివ్రత యగుసావిత్రి తన పాతివ్రత్య మహాత్మ్యమున యమధర్మరాజును సాక్షాత్తుగ దర్శించి తన నాథుని ప్రాణములు ననుగ్రహింపుమని యాయన ననుసరింప దొడంగెను, బ్రహ్మతేజముతో బ్రజ్వరిల్లుచు తనను వెన్నంటి యరుదెంచుచున్న సావిత్రిని గాంచి యమధర్మరా జత్యంతాశ్చర్య చకితుడై మధురవచనములతో నిట్లు పల్కెను.

## యమధర్మరాజు పలికెను :

సావిత్రీ! నీవు మానవదేహముతో నేల నన్ననుసరించుచున్నావు? నీవు భర్తతో బ్రస్థాన మొనరించుటకే సంకల్పించిన నీపాంచభౌతిక దేహమును ద్యజింపవలెను. మర్త్యలోకవాసులైన ప్రాణులీపాంచభౌతికశరీరముతో నాలోకమును బ్రవేశింపలేరు. సాధ్వీ! భారతవర్షములో జన్మించిన నీభర్తయొక్క యాయుర్దాయము పరిపూర్ణమైనది. కావున నితడు స్వకర్మఫలమనుభవించుటకు నాలోకమునకు వచ్చుచున్నాడు.

కర్మణా జాయతే జన్తుః కర్మణైవ ప్రలీయతే ।
సుఖం దుఃఖం భయం శోకం కర్మణైవ ప్రపద్యతే ॥ 17

“ఏప్రాణికేని కర్మమువలననే జన్మము సంభవించును. ఆకర్మమువలననే మృత్యువు సంభవించును, సుఖములు, దుఃఖములు, భయశోకాదులు మొదలగునవన్నియు స్వకర్మానుసారముగనే సంభవించుచున్నది.

కర్మవలననే జీవు డింద్రుడు, బ్రహ్మపుత్రుడు కాగలడు, స్వకర్మము వలననే హరిదాస్యము లభించి యతడు జన్మరాహిత్యము పొందగలడు. స్వకర్మమువలననే జీవునకు సర్వసిద్ధులు, నమరత్వము, శ్రీమహావిష్ణువుయొక్క సాలోక్యాదిముక్తులు, బ్రాహ్మణత్వము, దేవత్వము, మనుజత్వము, రాజేంద్ర

త్వము, మునీంద్రత్వము, తపోధనము, క్షత్రియత్వము, వైశ్యత్వము, శూద్రత్వము, మ్లేచ్ఛత్వము, జంగమత్వము, స్థావరత్వము, శైలత్వము, వృక్షత్వము, పశుత్వము, పక్షిజన్మము, క్షుద్రజంతుజన్మములు, క్రిమికీటకాది జన్మములు, సర్పజన్మము, గంధర్వ రాక్షస కిన్నర యక్ష కూష్మాండ ప్రేత బేతాళ భూత పిశాచ డాకినీ దైత్య దానవాసురజన్మములు లభింప గలవు. కర్మమువలననే జీవుడు పుణ్యవంతుడు, మహాపాపి, సౌందర్యవంతుడు, రోగి కాగలడు. కర్మమువలననే యంగవిహీనత్వము, బధిరత్వము, అంధ త్వము, నరకము, స్వర్గము, సూర్యలోకము, చంద్రలోకము, వహ్నిలోకము, వాయులోకము, కుబేరలోకము, ధ్రువలోకము, శివలోకము, నక్షత్రాదిలోక ములు, సత్యలోకము. జనలోకము, తపోలోకము, మహర్లోకము, పాతాళ లోకము, బ్రహ్మలోకము సంప్రాప్తింపగలవు. సత్కర్మములవలన జీవులకు పవిత్రభారతవర్షములో జన్మము లభింపగలదు. దుర్లభమైన భారతవర్ష ములో మానవజన్మ పొందినజీవుడు భక్తిజ్ఞాన వైరాగ్యము లనెడు పవిత్ర కర్మముల నాచరించి యీప్రాకృతికలోకసముదాయములను దరించి దివ్యదేహ ధారియై చిన్మయవ్యోమమందు విరాజిల్లు నిరామయము లైననిత్యము లైన వైకుంఠగోలోకాది దివ్యలోకముల జేరగలడు. చిరంజీవియు, అల్పాయుష్కు డును, దీర్ఘాయుష్మంతుడును నగును. స్వకర్మమువలననే జీవునకు మాతృ గర్భము, దుర్భరజన్మములు, ననివార్య మృత్యువు క్రమముగ లభింపగలవు. దేవీ! స్వకర్మానుసారము నీభర్తయైనసత్యవంతునకు మరణము సంభవించినది. కావున కుమారీ! న న్ననుసరింపక సుఖముగా మరలిపొమ్ము.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణ మందలి
ప్రకృతిఖండములోని యమసావిత్రీసంవాదమున
గర్మకు సర్వహేతుత్వప్రదర్శన మను
నిరువదినాలుగవ అధ్యాయము
సంపూర్ణము.

# ఇరువదియైదవ అధ్యాయము

## యమసావిత్రి సంవాదము.

**శ్రీనారాయణఋషి పలికెను :**

మునీశ్వరా! పతివ్రతయగుసావిత్రి యమధర్మరాజు ప్రవచించినవాక్కుల నాలకించి పరమభక్తిసమన్వితయై సంయమినీపురీశ్వరు ననేకవిధముల స్తుతించి మరల నిట్లు పలికెను.

**సావిత్రి పలికెను :**

దేవా! కర్మ మనగా నేమి? ఏయేకర్మములప్రభావమున నేయేవిషయములు సంభవించును? ఎట్టి ఫలముల కెట్టి కర్మములు హేతువులు కాగలవు? శుభకర్మములనగా నేవి? అశుభకర్మములనగా నేవి? దేహి యెవరు? దేహ మనగా నేమి? సంసారమందు జీవు డెవరిప్రేరణమున గర్మముల నాచరించుచున్నాడు? జ్ఞానము, బుద్ధి, దేహధారుల ప్రాణములు, ఇంద్రియములు, వాని లక్షణములు, దేవతలు, భోక్తలు, భోజయితలు, భోగములు, నిష్కృతి, జీవాత్మపరమాత్మలు మున్నగువానిని గురించి నాకు గృపతో వివరింపవలసినదిగా గోరుచున్నాను.

**యమధర్మరాజు పలికెను :**

వేదేన విహితం కర్మ తన్మన్యే మఙ్గలం పరమ్ ।
అవైదికం తు యత్కర్మ తదే వాశుభమేవ చ ॥
అహైతుకీ విష్ణుసేవా సంకల్పరహితా సతామ్ ।
కర్మనిర్మూలనాత్మా వై సాచైవ హరిభక్తిదా ॥
హరిభక్తో నరో యశ్చ స చ ముక్తః శ్రుతౌ శ్రుతమ్ ।
జన్మమృత్యుజరావ్యాధిశోకభీతివివర్జితః ॥ (7-9)

సావిత్రీ! కర్మములు శుభములనియు నశుభములనియు రెండువిధములు. వేదోక్తములే శుభకర్మములనియు తెలిసికొనుము. వేదోక్తకర్మాచరణము వలన బ్రాణి పరమకళ్యాణసంపన్నుడు కాగలడు. అవైదికకర్మములను

అశుభకర్మములని గ్రహింపుము. అశుభకర్మాచరణము ఘోరనరకప్రదము. సంకల్పరహితము నహైతుకము నగుశ్రీమహావిష్ణువు సేవ కర్మనిర్మూల మొన రించును. కేవలము శ్రీహరిదాస్యమే జీవుని సర్వకర్మములను నిర్మూల మొనరింపగలదని భావము. అట్టి యహైతుక శ్రీహరిసేవయే యనన్యభక్తిని బ్రసాదింపగలదు. ఎవరు కర్మఫలములకు భోక్తలు, ఎవరు నిర్లిప్తులు-అను నీ ప్రశ్నములకు సమాధానముగ శ్రీహరిభక్తులు, తద్దాస్యసౌభాగ్యసంప న్నులు నగువారే కర్మఫలములనుండి ముక్తులు కాగలరని శ్రుతులు నొక్కి వక్కాణించినవి. జన్మమృత్యుజరావ్యాధి శోకభయాదులు శ్రీహరియనన్య భక్తులపై దమప్రభావములను బ్రసరింప జేయలేవు.

ముక్తిశ్చ ద్వివిధా సాధ్వి శ్రుత్యుక్తా సర్వసమ్మతా ।
నిర్వాణపదదాత్రీ చ హరిభక్తిప్రదా నృణామ్ ॥
హరిభక్తిస్వరూపాం చ ముక్తిం వాంఛన్తి వైష్ణవాః ।
అన్యే నిర్వాణరూపాం చ ముక్తి మిచ్ఛన్తి సాధవః ॥
కర్మణో బీజరూపశ్చ సంతతం తత్ఫలప్రదః ।
కర్మరూపశ్చ భగవాన్ శ్రీకృష్ణః ప్రకృతేః పరః ॥
సోఽపి తద్ధేతురూపశ్చ కర్మ తేన భవే త్సతి ।
జీవః కర్మఫలం భుఙ్క్తే ఆత్మా నిర్లిప్త ఏవ చ ॥ (10-13)

సాధ్వీ! ముక్తులు కూడ రెండుతెగలని శ్రుతులు ప్రవచించినవి. శ్రుతి ప్రవచనము సర్వసమ్మతమని గ్రహింపుము. ఒకముక్తి నిర్వాణప్రదము, రెండవది హరిభక్తి ప్రదము. జీవు లీరెండు ముక్తులను బొందుటకు నధి కారులే. వైష్ణవపురుషులు హరిభక్తిపద మనెడు ముక్తి నాకాంక్షించెదరు. అన్యసాధుజనులు నిర్వాణముక్తిని గోరుకొందురు. కర్మబీజమే సతతము కర్మ ఫలములను బ్రసాదించునని తెలిసికొనుము, కర్మమనగా నేదో రెండవవస్తు వని భావింపకుము. సాధ్వీ! కర్మము సాక్షా చ్ఛ్రీకృష్ణపరమాత్మ రూపమే. ఆయనయే ప్రకృతికి సహిత మతీతుడు. కర్మ మీయననుండియే యుద్భ వించును, ఎందువలన ననగా నీయన సకలకర్మములకు నేకైకహేతురూపము కదా! జీవుడు మాత్రమే కర్మఫలముల ననుభవించును, ఆత్మ సదా కర్మముల నంటక సాక్షియై విరాజిల్లును.

ఆత్మనః ప్రతిబిమ్బం చ దేహీ జీవః స ఏవ చ ।
పాంచభౌతికరూపశ్చ దేహో నశ్వర ఏవ చ ॥
పృథివీ వాయు రాకాశో జలం తేజ స్తథైవ చ ।
ఏతాని సూత్రరూపాణి సృష్టిః సృష్టివిధౌ హరేః ॥
కర్తా భోక్తా చ దేహీ చ సాత్మా భోజయితా సదా ।
భోగో విభవభేదశ్చ నిష్కృతి ర్ముక్తి రేవ చ ॥ (14-16)

దేహి (దేహమును ధరించినవాడు) యాత్మకు బ్రతిబింబము. అతడే జీవు డనబడెను. పాంచభౌతిక దేహము సదా నశ్వరమని గ్రహింపుము. పృథ్వి, తేజము, వాయువు, జలము, ఆకాశము- అను నీపంచభూతము లీపృథ్విపై గలసకలదేహములకు నుపాదానములు. పరమాత్మ సృష్టికార్యమం దీపంచభూతములే సూత్రరూపములు. కర్మము లొనరించు జీవుడే దేహధారి యని గ్రహింపుము. ఆతడే భోక్తయు, నంతర్యామిరూపమున భోజయితయు నై యున్నాడు. సుఖదుఃఖముల సాక్షాత్స్వరూపవైభవముయొక్క రెండవ నామమే భోగము. ముక్తినే నిష్కృతి యందురు.

సదసద్భేదబీజం చ జ్ఞానం నానావిధం భవేత్ ।
విషయాణాం విభాగానాం భేదబీజం చ కీర్తితమ్॥
బుద్ధి ర్వివేచనారూపా జ్ఞానసాన్దీపనీ శ్రుతౌ।
వాయుభేదాశ్చ వై ప్రాణా బలరూపాశ్చ దేహినామ్॥
ఇన్ద్రియాణాం వై ప్రవర మీశ్వరాణాం సమూహకమ్।
ప్రేరకం కర్మణాం చైవ దుర్నివార్యం చ దేహినామ్॥
అనిరూప్య మదృశ్యం చ జ్ఞానభేదం మనః స్మృతమ్ ॥

సదసత్సంబంధ వివేకమున కాదికారణమే జ్ఞానము. ఈజ్ఞానమునం దనేకభేదములు కలవు. ఘటపటాది విషయములు, నావిషయముల భేదములు జ్ఞానభేదములకు గారణములని చెప్పబడినవి. వివేచనామయ మైనశక్తినే బుద్ధి యందురు. దానినె శ్రుతులు జ్ఞానబీజమని బ్రవచించినవి. వాయువు యొక్క విభిన్నరూపములే ప్రాణములు, ప్రాణరూప వాయు ప్రభావమువల ననే శరీరములందు శక్తి సంచార మగును. సకలేంద్రియములందు బ్రముఖము పరమాత్మనంశము, సంశయాత్మకము, కర్మములకు బ్రేరకము, ప్రాణులకు

దుర్నివార్యము, అనిరూప్యము, అదృశ్యము, బుద్ధిభేదము నగు దానినె మనస్సందురు.

> లోచనం శ్రవణం ఘ్రాణం త్వగ్జిహ్వాదిక మిన్ద్రియమ్ ॥
> అజ్గినా మజ్గరూపం చ ప్రేరకం సర్వకర్మణామ్ ।
> రిపురూపం మిత్రరూపం సుఖదం దుఃఖదం సదా ॥ (20,21)

ఈ మనస్సే లోచనము, శ్రవణము, ఘ్రాణము, త్వక్కు, జిహ్వ మొదలగు నింద్రియములందు ప్రధానాంగరూపమై సర్వకర్మములను బ్రేరేపించును. అదియే యింద్రియములను విషయముల వైపునకు ద్రిప్పి దుఃఖములపాలు చేయుకారణమున శత్రురూపము కాగలదు. సత్కర్మములందు దేహధారిని బ్రేరేపించుటచే నదియే మిత్రరూప మనబడును.

> సూర్యో వాయుశ్చ పృథివీ వ్యాణ్యాద్యా దేవతాః స్మృతాః ॥
> ప్రాణదేహాదిభృ ద్యో హి స జీవః పరికీర్తితః ।
> పరమాత్మా పరం బ్రహ్మ నిర్గుణః ప్రకృతేః పరః ॥
> కారణం కారణానాం చ శ్రీకృష్ణో భగవాన్ స్వయమ్ ।
> ఇత్యేవం కథితం సర్వం మయా పృష్టం యథాగమమ్ ॥ (22-24)

"సూర్యుడు, వాయువు, పృథ్వి, వాక్కు మొదలగు నవియే యింద్రియముల కధిష్ఠాత లైన దేవత లనబడిరి. ప్రాణములను దేహాదులను ధరించు వారినే జీవు లనిరి. ప్రకృతి కతీతుడు, సర్వవ్యాపియు నగునిర్గుణపరబ్రహ్మమునే పరమాత్మయని కీర్తించిరి. కారణములకే కారణమైన యాయన స్వయముగ శ్రీకృష్ణుడే యని గ్రహింపుము. కుమారీ! నీవు ప్రశ్నించిన ప్రశ్నముల కన్నింటికి శాస్త్రానుసారము సమాధానములను జెప్పితిని". ఈవిషయములు జ్ఞానులకు గూడ బరమజ్ఞానమయములై యున్నవి. సావిత్రీ! నీ విక సంతుష్టురాలవై సుఖముగా మరలిపొమ్ము.

**సావిత్రి పలికెను :**

ప్రభూ! నీవు జ్ఞానసముద్రుడవు. ఇపుడు నేను నాప్రాణనాథుని, మిమ్ములను వీడి యెట్లు మరలి పోగలను? నేను బ్రశ్నింపబోవు నాసకలసందేహతాపముల నఖండ బోధనామృతసేచనమున నివారింపవలసినదిగా మిమ్ము

లను బ్రార్థించుచున్నాను. జీవు డేయేకర్మముల ప్రభావమున నేయేయోను లందు జన్మింపగలడు? ఎట్టి కర్మములు స్వర్గప్రదములు? ఎట్టి కర్మములు నరక ప్రదములు? ఏకర్మములప్రభావమువలన జీవుడుముక్తి పొందగలడు? శ్రీహరియం దనన్యభక్తి యుదయించుట కేయే కర్మములు కారణములు కాగలవు? ఏకర్మ ఫలస్వరూపమున జీవుడు రోగగ్రస్తుడు, రోగరహితుడు కాగలడు? దేహధారి చిరంజీవి, లేక యల్పజీవి యగుట కేయేకర్మములు కారణములు కాగలవు? ఏకర్మప్రభావమున జీవుడు సుఖింపగలడు? ఏకర్మప్రభావమున జీవుడు దుఃఖింప గలడు? ఎట్టి కర్మములవలన దేహధారు లంగహీనులు, నేకాక్షులు, బధిరులు, నంధులు, పంగులు, నున్మాదులు, లోభులు, నరఘాతుకులునై దుఃఖింపగలరు? ఏసత్కర్మములవలన సిద్ధులై ముక్తి నొందగలరు? సాలోక్యాది ముక్తులను బడయుటకు జీవున కెట్టి కర్మములు సహాయక ములు కాగలవు? ఏకర్మప్రభావమున జీవుడు బ్రాహ్మణుడు కాగలడు? ఏ కర్మ ప్రభావమున దపస్వి కాగలడు? స్వర్గాదిభోగములను బొందుట కేకర్మములు సాధనములు కాగలవు? ఏకర్మములవలన జీవుడు వైకుంఠము జేరగలడు? దేవా! నిరామయమైన, నిత్యమైన గోలోకము సంపూర్ణస్థానములం దుత్తమో త్తమ పరంధామము. ఎట్టి కర్మముల ప్రభావమున గోలోకప్రాప్తి లభింప గలదు? ఎన్నివిధములైన నరకములు గలవు? వానిసంఖ్య యెంత? ఆనరకముల నామధేయము లేవి? జీవు లేయేనరకముల బడి యెంతెంతకాలము యమయాత నల ననుభవింపగలరు? ఏయేకర్మముల ఫలస్వరూపమున బాపాత్ముల శరీరములం దేయేవ్యాధులు లుత్పన్నములు కాగలవు? స్వామీ! నాయీసంశయముల నన్నింటిని గృపతో నివారింపుడని ప్రార్థించుచున్నాను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని యమసావిత్రీసంవాద
మను నిరువదియైదవ అధ్యాయము
సంపూర్ణము.

# ఇరువదియాఱవ అధ్యాయము

## కర్మవిపాకమువలన జీవుని కర్మానురూప స్థాన గమనము.

**శ్రీనారాయణఋషి పలికెను:**

నారదా! సావిత్రి ప్రశ్నించిన ప్రశ్నల నాలకించి యమధర్మరాజత్యంతాశ్చర్యచకితుడై సస్మితవదనముతో ప్రాణుల కర్మవిపాకప్రకరణమును వర్ణించుట కుద్యుక్తుడై సావిత్రి నిట్లు ప్రశంసించెను.

**యమధర్మరాజు పలికెను :**

కుమారీ! నీ వత్యంతాల్పవయస్కురాలవైనను నీయందు విద్వాంసులను, జ్ఞానులను, యోగులను మించిన జ్ఞానము విరాజిల్లుచున్నది. సావిత్రీదేవి వరప్రభావమున నావిర్భవించిన నీవు సరిగా నాదేవి కళాస్వరూపిణివే. నీతండ్రి యశ్వపతిభూపతి యఖండతపఃప్రభావమున సాక్షాత్సావిత్రీస్వరూపిణివైన నిన్ను గౌమార్తెగా బడసి తరించినాడు. లక్ష్మి విష్ణువునకు, భవాని శంకరునకు, రాధ శ్రీకృష్ణునకు, సావిత్రి బ్రహ్మదేవునకు, మూర్తి ధర్మదేవతకు, శతరూప మనువునకు, దేవహూతి కర్దమునకు, నరుంధతి వశిష్ఠునకు, నదితి కశ్యపునకు, నహల్య గౌతమునకు, శచి యింద్రునకు, రోహిణి చంద్రునకు, రతి కామదేవునకు, స్వాహా యగ్నిదేవునకు స్వధ పితరులకు, సంధ్య సూర్యునకు, వారుణి వరుణునకు, దక్షిణ యజ్ఞమునకు, పృథ్వి వరాహమూర్తికి, దేవసేన కార్తికేయునకు ప్రియతమలై శోభిల్లునట్లు నీవుకూడ సత్యవంతున కత్యంత ప్రేమపాత్రురాలవు కమ్ము. ఇదే నీకు నేను వరమును బ్రసాదించుచున్నాను. పతివ్రతాశిరోమణీ! నీ కేయే యభీష్టములు కలవో కోరుకొనిన నేను వానిని బ్రసాదించుటకు సంసిద్ధుడనుగ నున్నాను.

**సావిత్రి పలికెను :**

యమధర్మరాజా! సత్యవంతున కౌరసులుగ నాయన యంశచే నాకు నూర్గురు పుత్రులు కలుగవలెను. అట్లే పుత్ర సంతానము లేని నాతండ్రికి నూర్గురు పుత్రులు కలుగవలెను. అంధుడైన రాజ్య

భ్రష్టులైననామామగారికి నేత్రలాభము కల్గి మరల రాజ్యశ్రీ ప్రాప్తింపవలెను. జగత్ప్రభూ! సత్యవంతునితో నేను చిరకాలము సౌభాగ్యవతిగా జీవనము గడపి యంత్యకాలమందు శ్రీహరి పరంధామము జేరవలెను. నా కీవరములను గృపతో బ్రసాదింపవలసినదిగ బ్రార్థించుచున్నాను. ప్రభూ! జీవుల కర్మవిపాకములను, వారు భవసాగరము నుండి తరించు నుపాయమును దెలిసికొనవలెనని నాకత్యంత కుతూహలముగా నున్నది. కావున గృపతో నా కావిషయముల నుపదేశింపవలసినదిగా బ్రార్థించుచున్నాను.

**యమధర్మరాజు పలికెను :**

మహాసాధ్వీ! నీ మనోరథము లన్నియు నావరప్రభావమున బరిపూర్ణము లగుగాక! ఇక నేను జీవుల కర్మవిపాక వర్ణన మొనరించెద నవధరింపుము. భారతవర్షములోనే కర్మములు శుభాశుభములుగ విభజింపబడినవి. ఈభారత వర్ష మంతయు బుణ్యక్షేత్రమని గ్రహింపుము. అన్యప్రదేశములందు జీవులు కర్మఫలముల ననుభవింపగలరు. పతివ్రతా! దేవతలు, దైత్యులు, దానవులు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, మానవులు మొదలగు సర్వదేహధారులు కర్మఫల మనుభవింపక తప్పదు, కాని యందఱి జీవనము సమముగ నుండదు. వారిలో గేవలము మానవుడె కర్మములకు జన్మస్థానము కాగలడు. అనగా మనుష్యుడుగా జన్మించి జీవుడు శుభాశుభకర్మము నొనరింపగలడు. ఆకర్మముల ఫలములను సర్వత్ర సర్వయోనులం దనుభవించుచు భ్రమించుచునుండును. విశిష్టజీవధారి యనగా విశేషముగ మానవజన్మ మెత్తిన జీవుడే సర్వయోనులందు జన్మించి తన స్వకర్మ ఫలముల ననుభవించుచు జనన మరణచక్రమున భ్రమింపగలడు. ఆతడు పూర్వజన్మములం దొనరించిన శుభాశుభకర్మముల ననుభవించుచుండును. జీవు డొనర్చు శుభకర్మముల ప్రభావమున స్వర్గాదిలోకములలో సుఖింపగలడు. అశుభకర్మముల ప్రభావమున నరకములలో దుఃఖింపగలడు.

> కర్మనిర్మూలనే ముక్తిః సా చోక్తా ద్వివిధా మతా ।
> నిర్వాణరూపా సేవా చ కృష్ణస్య పరమాత్మనః॥ 20

కర్మనిర్మూలన మొనరించిన ముక్తి లభింపగలదు. సాధ్వీ! ముక్తులు

రెండువిధములని ప్రవచింపడినది-ఒకటి నిర్వాణస్వరూపముక్తి, రెండవది పరమాత్మ యగుశ్రీకృష్ణుని యనన్యసేవాసౌభాగ్యముక్తి.

దుష్కర్మములవలననే జీవుడు రోగి కాగలడు, సత్కర్మములవలననే యారోగ్యవంతుడు కాగలడు. ఆతడు తా నొనరించిన శుభాశుభకర్మముల ఫలానుసారముగ జిరంజీవియో లేక యల్పాయుష్కుడో లేక సుఖియో లేక దుఃఖియో కాగలడు. కుత్సిత కర్మములవలననే జీవు డంగహీనుడై, యంధుడై, బధిరుడై యనేకవిధముల దుఃఖింపగలడు. ఉత్తమకర్మములఫల స్వరూపమున జీవునకు సిద్ధి మొదలగు సుఖములు సంప్రాప్తింపగలవు. దేవీ! సామాన్యవిషయములను బ్రవచించితిని. ఇక విశేషవిషయముల నుపదేశించెద నవధరింపుము. సుందరీ! ఈదుర్లభవిషయములు శాస్త్రములందు, బురాణములందు వర్ణింపబడినవి. ఈ జ్ఞానము నందఱి యెదుట బహిర్గత మొనరింపరాదు.

దుర్లభా మానవీ జాతిః సర్వజాతిషు భారతే ।
సర్వాభ్యో బ్రాహ్మణః శ్రేష్ఠః ప్రశస్తః సర్వకర్మసు ॥
విష్ణుభక్తో ద్విజశ్చైవ గరీయా న్భారతే తతః।
నిష్కామశ్చ సకామశ్చ వైష్ణవో ద్వివిధస్స్మృతి॥
సకామశ్చ ప్రధానశ్చ నిష్కామో భక్త ఏవ చ ।
కర్మభోగీ సకామశ్చ నిష్కామో నిరుపద్రవః॥
స యాతి దేహం త్యక్త్వాచ పదం విష్ణోర్నిరామయమ్
పునరాగమనం నాస్తి తేషాం నిష్కామినాం సతి॥ (24-27)

సకలజన్మములందు భారతవర్షములో మనుష్యజన్మము కల్గుట జీవులకు బరమదుర్లభము. సర్వకర్మములందు శ్రేష్ఠమైన, ప్రశస్తమైన బ్రాహ్మణ విహితకర్మమే యత్యంత శ్రేష్ఠమని తెలిసికొనుము. భారతవర్షములో విష్ణుభక్తుడై పవిత్రబ్రాహ్మణ కర్మముల నాచరించు దేహధారియే యందఱిలోను శ్రేష్ఠుడు. పతివ్రతా! విష్ణుభక్తు లందుగూడ రెండుభేదములు కలవు. వారే సకాములు, నిష్కాములని గ్రహింపుము. సకాములైనవిష్ణుభక్తులు కర్మ ప్రధానులు కాగలరు. నిష్కాములైనవిష్ణుభక్తులు కేవలము శ్రీహరి యనన్యభక్తులై విరాజిల్లగలరు. సకాములైనవిష్ణుభక్తులు కర్మములఫలముల ననుభవింపక తప్పదు. నిష్కాములైనవిష్ణుభక్తులు సదా శుభాశుభభోగము

లనెడు నుపద్రవములనుండి దూరముగ నుండగలరు. సాధ్వీ! అట్టి నిష్కామి యైనవిష్ణుభక్తుడు శరీరత్యాగ మొనరించి శ్రీహరి నిరామయపదము నొంద గలడు. అతడు మరల నీసంసారములో బునరాగమన మొనరింపడు.

యే సేవన్తే చ ద్విభుజం కృష్ణ మాత్మాన మీశ్వరమ్।
గోలోకం యాన్తి తే భక్తా దివ్యరూపానుధారిణః॥
యే చ నారాయణం భక్తాః సేవన్తే చ చతుర్భుజమ్ ।
వైకుణ్ఠం యాన్తి తే సర్వే దివ్యరూపవిధారిణః ॥
సకామినో వైష్ణవాశ్చ గత్వా వైకుణ్ఠమేవ చ ।
భారతం పున రాయాని తేషాం జన్మ ద్విజాతిషు ॥
కాలేన తే చ నిష్కామా భవిష్యన్తి క్రమేణ చ ।
భక్తిం చ నిర్మలాం బుద్ధిం తేభ్యో దాస్యతి నిశ్చితమ్ ॥ (28-81)

ఏనిష్కామభక్తు లనన్యభక్తితో ద్విభుజు డైనశ్రీకృష్ణపరమాత్మను సేవింతురో వారు దివ్యరూపధారులై గోలోకము జేరగలరు. చతుర్భుజస్వరూపు డైనశ్రీమన్నారాయణు ననన్యభక్తితో సేవించువారు దివ్యరూపధారులై వైకుంఠము జేరగలరు. సకామి యైనవిష్ణుభక్తుడు వైకుంఠము చేరినను సమయానుసారముగ మరల భారతవర్ష మందు ద్విజాతీయుడై జన్మింపగలడు. ఆతడు కూడ గ్రమముగ నిష్కామభక్తి పొందగలడు. భగవంతుడు వానికి నిర్మలమైన బుద్ధిని, ననన్యభక్తిని, దనసేవాసౌభాగ్యమును నిశ్చయముగ బ్రసాదింపగలడు.

విష్ణుభక్తులు కాక యన్యసకాము లైనమనుష్యు లేజన్మమందును విశుద్ధబుద్ధిని బొందలేరు? సాధ్వీ! తీర్థస్థానమందు నివసించుచు దప మొనరించు వారు బ్రహ్మలోకము జేరి పుణ్యఫలభోగముల ననుభవించి మరల భారతవర్షమందు మానవులై జన్మింపగలరు. భారతవర్షములో నివసించుచు స్వకర్తవ్యకర్మములందు సంలగ్నులై సూర్యు నారాధించు సూర్యభక్తుడు శరీర త్యాగానంతరము సూర్యలోకము జేరి తన సుకృతఫలముల ననుభవించి మరల భారతవర్షమందు జన్మింపగలడు. తమతమ ధర్మములందు సదా నిరతులై శివుని, శక్తిని, గణేశ్వరుని, గార్తికేయుని నారాధించు భక్తులు శివలోకమున పెక్కుకాలము నివసించి మరల భారతవర మున

జన్మింపగలరు. స్వధర్మ నిరతులై యన్యదేవతల నారాధించు వారు స్వర్గములో నిందద్రిభోగముల ననుభవించి తమ సుకృతము క్షీణింపగనే మరల భారతవర్షములో జన్మింపగలరు. కాని స్వధర్మ రహితులైనను నిష్కామ భావముతో శ్రీహరిని సదా భజించు వారు భక్తిబలముచే శ్రీహరి పరంధామము జేరగలరు.

సాధ్వీ! తమతమ ధర్మములను బాలింపని యాచారహీనులు, కాములోలురు తప్పక నరకము జేరగలరు. తమతమ స్వధర్మములను బాగుగా నాచరించు వారే శుభకర్మఫలముల ననుభవించుట కధికారులు కాగలరు. తమ కర్తవ్యకర్మములను బరిపాలింపని వా రవశ్యముగ నరక మనుభవింపగలరు. కావున సకల దేహధారులు తమతమ వేదవిహిత ధర్మములబాలన మొనరించుట యత్యంతావశ్యకము. స్వధర్మమందు సంలగ్నుడై యుండు సద్బ్రాహ్మణుడు స్వధర్మనిరతుడైనవిప్రునకు దన కన్య నొసంగిన దత్ఫల స్వరూపముగ జంద్రలోకము జేరి పదునల్వురు మనువుల యాయుర్దాయపర్యంతము సుఖింపగలడు. సాధ్వీ! కన్యను బాగుగా నలంకరించి సత్పాత్రునకు దాన మొనరించిన దాతకు బైజెప్పిన ఫలముకంటె రెండురెట్లధికఫలము లభింపగలదు. సకామభావముతో గన్యాదాన మొనరించిన జంద్రలోక ప్రాప్తి కల్గును, నిష్కామభావముతో గన్యాదాన మొనరించిన విష్ణుదేవుని పరంధామము లభించును.

గవ్యపదార్థములను (పాలు, పెరుగు మొదలగునవి) గాంచనమును, సువర్ణమును, వస్త్రములను, ఘృతమును, ఫలములను, జలములను దానమొనరించు పుణ్యాత్ములు చంద్రలోకము జేరి యొక మన్వంతరకాల మత్యంతసుఖముగ నివసింపగలరు. పతివ్రతా! పవిత్రుడైన బ్రాహ్మణునకు వసుర్ణమును, రాగిని, గోవును ద్రవ్యములను దానమొనరించిన సత్పురుషుడు సూర్యలోకము జేరి భయబాధాశూన్యుడై దీర్ఘకాలము సుఖింపగలడు. సద్బ్రాహ్మణులకు, యాచకులకు, బృథ్వినిగాని, ప్రచురధాన్యములనుగాని దానమొనరించు వారు విష్ణుదేవుని సుందరశ్వేతద్వీపము జేరి దీర్ఘకాలము సుఖింపగలరు. భక్తిపూర్వకముగ సద్బ్రాహ్మణునకు గృహదాన మొనరించు పురుషుడు స్వర్గలోకము జేరి తాను దానమొరించిన గృహములో నెన్ని రజఃకణములు

కలవో యన్నిసంవత్సరములు సుఖింపగలడు. మనుష్యుడేయే దేవతల ప్రీత్యర్థము గృహదాన మొనరించునో యాగృహామునందు గల రజఃకణ సంఖ్యాకసంవత్సరము లాయాదేవతల లోకములలో సుఖింపగలడు. తమతమ స్థానములలో దాన మొనరించుటకంటె దైవస్థానములో దాన మొనరించిన నాల్గురెట్లు ఫలము లభించును. వాపీకూపతటాకాదులను మానవాభ్యుదయము కొఱకై నిర్మించిన ధర్మాత్ములకు నూఱురెట్లధిక ఫలము లభింపగలదు. ఈ పూర్వోక్తకర్మములనే తీర్థప్రదేశములలో నొనరించిన నెనిమిదిరెట్లు ఫలము లభింపగలదని బ్రహ్మదేవుడు ప్రవచించెను.

సమస్తప్రాణుల యుపకారార్థమై తటాకమును నిర్మించిన సత్పురుషుడు పదివేల సంవత్సరములు జనలోకమందు వసింపగలడు. తటాకప్రమాణము నాల్గువేల ధనువుల పొడవు, అంతయే వెడల్పుగూడ నుండవలెను. (ధనుః ప్రమాణ మనగా నాల్గు హస్తముల పొడవు). ఆ తటాకమే ప్రమాణములో నల్పమైనచో దానిని 'వాపి' యందురు. వాపిని నిర్మించిన మనుష్యుడు తపోలోకమున నూఱుసంవత్సరములు నివసింపగలడు. సత్పాత్రునకు గన్యాదాన మొనరించిన బదిజలాశయములను నిర్మించిన పుణ్యము లభించును. ఆకన్య నలంకరించి దాన మొనరించిన బూర్వోక్త ఫలముకంటె ద్విగుణీకృత ఫలము లభించును.

తటాకదానముచే లభించు ఫలము తటాకమును శుభ్ర మొనరించిన లభింపగలదు. పతివ్రతా! అశ్వత్థవృక్షమును నాటి యది వృద్ధినొందువఱకు గాపాడిన యతడు వేయివర్షముల పర్యంతము తపోలోకమందు నివసింపగలడు. సావిత్రీ! సర్వుల కొఱకు బుష్పోద్యానవనములను నిర్మించువారు పదివేల వర్షముల పర్యంతము ధ్రువలోకమందు విరాజిల్లగలరు. విష్ణుభగవత్ప్రీత్యర్థ మాలయ విమాన నిర్మాణ మొనరించుదాత యొక మన్వంతర కాలము విష్ణులోకమందు నివసింపగలడు. ఆవిమానమే విస్తృతమై చిత్రములచే నలంకరింపబడిన నాల్గురెట్లధిక ఫలము ప్రాప్తించును. శిబికా దాన మొనరించిన నర్థఫలము లభించుట నిశ్చితము. భక్తిపూర్వకముగా శ్రీహరి ప్రీత్యర్థము మందిరాకారము గల యూయలను దాన మొనరించు నాతడు దీర్ఘకాలపర్యంతము విష్ణులోకమందు నివసింపగలడు,

పూజ్యా! ప్రజల సౌకర్యార్థమై బాటలను నిర్మించి ధర్మశాలలను గట్టించిన సత్పురుషుడు వేనవేలు సంవత్సరము లింద్రలోకమం దుండగలడు. బ్రాహ్మణులకు గాని, యార్తులకుగాని యొనరించిన దానము లఖండఫలములను బ్రసాదింపగలవు. పూర్వజన్మములో నొనరించిన దానములే మానవున కీజన్మములో నైశ్వర్యములై లభింపగలవు. దానముల నొనరింపనిచే ఫలము లెట్లు లభింపగలవు? పుణ్యవంతు డైనపురుషుడు స్వర్గసుఖముల ననుభవించి మరల మానవుడై జన్మింపగలడు. శూద్రులైనను, వైశ్యులైనను, క్షత్రియులైనను దమ సత్కర్మాచరణమువలన బ్రాహ్మణత్వము నొందగలరని శ్రుతులు నొక్కి వక్కాణించుచున్నవి. ధర్మరహితు డైనచో బ్రాహ్మణు డనేక క్షుద్ర యోనులందు భ్రమింపగలడు.

నాఽభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి।
అవశ్యమేవ భోక్తవ్యంకృతం కర్మ శుభాశుభమ్॥ 70

అనుభవింపనిదే కోటానుకోట్ల కల్పములు గతించినను గర్మలు క్షీణింపవు. తా నొనరించిన శుభాశుభకర్మముల జీవు డవశ్య మనుభవింపక తప్పదు.

దేవతలయు బుణ్యతీర్థములయు సేవనముచే గాయవ్యూహమునుండి జీవుడు పరిశుద్ధుడు కాగలడు. సాధ్వీ! నీ వడిగిన కొన్ని విషయములను బ్రవచించితిని. నీ విక నేవిషయములను శ్రవణ మొనరింప గోరుచున్నావో తెల్పిన వానిని వర్ణింపగలను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని యమసావిత్రీ సంవాదమున
కర్మ విపాకవివరణకర్మానురూపస్థానగమన
మనుఇరువదియాఱవఅధ్యాయము
సంపూర్ణము.

# ఇరువదియేడవ అధ్యాయము

## పుణ్యకర్మ ఫలములను వివరించుట.

**సావిత్రి పలికెను :**

యమధర్మరాజా! ఏయే కర్మముల ప్రభావమువలన మనుష్యుడు పుణ్యాత్ముడై స్వర్గాది దివ్యలోకములను బొందగలడు? ఆసత్కర్మముల నన్నింటి నుపదేశింప బ్రార్థించుచున్నాను.

**యమధర్మరాజు పలికెను :**

సాధ్వీ! అన్నార్తుల కన్నదాన మొనరించిన పురుషుడు తాను దాన మొనరించిన యన్నములో నెన్ని మెతుకులు కలవో యన్ని సంవత్సరము లింద్రలోకము జేరి స్వర్గసుఖము లనుభవింపగలడు,

అన్నదానాత్ పరం దానం న భూతం న భవిష్యతి ।
నాత్ర పాత్రపరీక్షా స్యా న్న కాలనియమః క్వచిత్॥ 3

అన్నదానమును మించిన దానము మఱియొకటి లేదు, ఉండదు, ఉండబోదు. అన్నదాన మొనరించుటకు నిర్ణీతసమయముగాని, పాత్రాపాత్రపరీక్షగాని యవసరము లేదు. అనగా నన్నదానము నెవరికైన, నెచ్చటనైన, నెప్పుడైనను జేయవచ్చును.

సాధ్వీ! బ్రాహ్మణులకుగాని లేక దేవతలకుగాని యాసనదాన మొసంగిన బహుసహస్రవర్షములపర్యంత మగ్నిదేవునిదివ్యలోకమందు నివసించు సౌభాగ్యము ప్రాప్తించును. పాలిచ్చుగోవును సద్బ్రాహ్మణునకు దాన మొనరించు వా డాగోవుశరీరమం దెన్ని రోమములు కలవో యన్నివర్షములు వైకుంఠవాస మొనరింపగలడు. ఈగోదానము సాధారణ దినములలోకంటె పర్వదినములలో నాల్గురెట్లు, తీర్థప్రదేశములలో నూఱురెట్లు శ్రీనారాయణ క్షేత్రములో గోటిరెట్లు ఫలమును బ్రసాదింపగలదు.

పవిత్రభారతవర్షములో నివసించుచు భక్తిపూర్వకముగ సద్బ్రాహ్మణునకు గోదానమొనరించు నాతడు వేనవేలుసంవత్సరముల పర్యంతము చంద్రలోకములో నివసించుట కధికారి కాగలడు. (చంద్రలోక మనగా జంద్ర

గోళము కాదు). సద్బ్రాహ్మణునకు వస్త్రములను సమర్పించి సాలగ్రామశిలను దాన మొనరించువారు సూర్యచంద్రుల స్థితిపర్యంతము వైకుంఠమందు విరాజిల్లగలరు. సద్బ్రాహ్మణునకు సుందరస్వచ్ఛచ్ఛత్రమును దాన మొనరించిన వ్యక్తి బహుసహస్రసంవత్సరముల పర్యంతము వరుణలోకవాసి కాగలడు. పతివ్రతా! పాదరక్షలను దాన మొనరించు దాత పదివేల సంవత్సరముల పర్యంతము వాయులోకమం దుండగలడు. గృహదాన మొనరించిన దీర్ఘకాలము చంద్రలోకవాసము చేయగలడు. దీపదాన మొసంగిన బ్రహ్మలోకము ప్రాప్తించును. దీపదాన పుణ్యముచే దాత నేత్రముల జ్యోతి సదా విరాజిల్లగలదు. ఆతనికి యమలోకము కలుగదు. సద్బ్రాహ్మణునకు వాహనదాన మొనరించిన నింద్రాయుఃపర్యంతము స్వర్గ మనుభవింపగలడు. పవిత్రభారతవర్షములో సద్బ్రాహ్మణులకు, యాచకులకు ధనదాన మొనరించువారు విష్ణులోకము జేరగలరు.

సతతం శ్రీహరే ర్నామ భారతే యో జపే న్నరః।
స ఏవ చిరజీవీ చ తతో మృత్యుః పలాయతే ॥ 21

పవిత్రభారత వర్షములో నిరంతరము శ్రీహరి దివ్యగుణనామసంకీర్తన మొనరించువారు చిరంజీవులై విరాజిల్లగలరు. అట్టివారిని గాంచిన మృత్యువు సహితము పలాయనము చిత్తగింపగలదు.

భారతవర్షములో పూర్ణిమనాటిరాత్రియందు డోలోత్సవ మొనరించు మానవు డీలోకమందు సుఖముల ననుభవించి, యంత్యకాలమందు జీవన్ముక్తుడై విష్ణుపరంధామము జేరగలడు. ఈడోలోత్సవ ముత్తరఫాల్గున మాసములో నొనరించిన పైని ప్రవచించిన ఫలము కంటె రెండురెట్లధికఫలము లభించును. భారతవర్షములో సద్బ్రాహ్మణునకు దిల దానమొసంగు వారా తిలసంఖ్యతో సమముగ నన్నిసంవత్సరముల పర్యంతము విష్ణుపరంధామమందు నివసింపగలరు. రాగిపాత్రలో దిలల నుంచి దాన మొనరించిన ద్విగుణీకృత ఫలము లభించును. ఫలములతో నలరారు వృక్షమును దానమొనరించిన, నావృక్షములో నెన్నిఫలములు కలవో దాత యన్నిసంవత్సరముల పర్యంత మింద్రలోక మనుభవింపగలడు. సద్బ్రాహ్మణున కొకఫలమును బ్రసాదించినను దాత దీర్ఘకాలము స్వర్గవాస మనుభవించి మరల

బవిత్ర భారతవర్షములో మానవుడై జన్మింపగలడు. భారతవర్షములో నివసించు పురుషు డనేకద్రవ్యములతో, ధాన్యములతో బరిపూర్ణ మైనగృహ మును దాన మొనరించిన దద్దానఫల స్వరూపముగ దీర్ఘ కాలము కుబేరలోక ములో సుఖింపగలడు. తదనంతర ముత్తమయోనియందు జన్మించి ధన వంతుడై విరాజిల్లగలడు. సాధ్వీ! పచ్చని పంటలచే విరాజిల్లు సుందర భూమిని దాన మొనరించిన వాడు నిశ్చయముగ వైకుంఠము జేర గలడు. జనాభ్యుదయము కొఱకై గోశాల నిర్మాణ మొనరించు మానవుడు వైకుంఠము జేరగలడు. ఉత్తమ ప్రజలు సస్యశ్యామల భూములు, అనేక ప్రకారము లైనపుష్కరిణులు, ఫలవృక్షములు, లతలుగల్గిన శ్రేష్ఠనగరము నేప్రభువు జనాభ్యుదయము కొఱకై దాన మొనరించునో యతడు దీర్ఘ కాలము వైకుంఠమందు నివసింప గలడు. తదనంతరము మరల భారతవర్షములోజన్మించి నరేశ్వరుడు కాగలడు. అతడు సకలైశ్వర్యములతో దులదూగగలడు. సప్తద్వీపవతి యగుపృథ్విని దాన మొనరించు వారు, సర్వతీర్థములందు నివసించువారు, సమస్తతపములందు సంలగ్నులై యుండువారు, సంపూర్ణోపవాసవ్రతములను బాలించువారు, తమ సర్వస్వమును దాన మొనరించువారు నగు శ్రీహరి యనన్యభక్తులు జన్మరాహి త్యము నొందగలరు. అసంఖ్యాకు లైన బ్రహ్మలు విలయ మొందినను వారు నిత్యులై శ్రీహరి పరంధామమందు నివసింపగలరు.

విష్ణుమన్త్రోపాసకశ్చ విహాయ మానవీం తనుమ్ ।
బిభర్తి దివ్యరూపం చ జన్మమృత్యుజరాపహమ్ ॥
లబ్ధ్వా విష్ణోశ్చ సారూప్యం విష్ణుసేవాం కరోతి చ ।
స చ పశ్యతి గోలోకే హ్యసంఖ్యం ప్రాకృతం లయమ్
నశ్యన్తి దేవాః సిద్ధాశ్చ విశ్వాని నిఖిలాని చ ।
కృష్ణభక్తా న నశ్యన్తి జన్మమృత్యుజరాహరాః॥ [54-56]

విష్ణుమంత్రోపాసన యొనరించువారు తమమానవ శరీరములను త్యాగ మొనరించినపిదప జన్మమృత్యు జరారహిత మైనదివ్య దేహమును ధరింపగలరు. వారు శ్రీమహావిష్ణు సారూప్య మోక్షమును బొంది విష్ణుసేవ లొనరింప గలరు. శ్రీహరిసేవాసౌభాగ్య సంపన్ను లైనయాభక్తులు గోలోకవాసులై యసంఖ్యాకము లైనప్రాకృతప్రళయములను వీక్షింపగలరు. దేవతలు,

సిద్ధులు, సకల విశ్వములు సర్వులు నశించినను శ్రీకృష్ణానన్యభక్తులు నశింపరు. జన్మమృత్యుజరావస్థలు వారిని సమీపింపలేవు.

కార్తికమాసములో దులసీపత్రముల నర్పించి శ్రీహరిని బూజించువాడాతులసీపత్రసంఖ్యాసమముగ నన్నియుగముల పర్యంతము భగవంతుని దివ్య పరంధామమందు విరాజిల్లగలడు. తదనంతర మత డుత్తమకులములో జన్మించి శ్రీహరి యనన్యభక్తుడై భారతవర్షములో జిరంజీవియై విరాజిల్లగలడు. కార్తికమాసములో శ్రీహరిని గోఘృతదీపముతో నారాధించు భక్తులు వారు వెలిగించిన దీపము లెన్నిక్షణములు ప్రజ్వరిల్లునో యన్నిసంవత్సరములు శ్రీహరి పరంధామమం దఖండానంద మనుభవింపగలరు. తదనంతరము మరల మానవుడై జన్మించి విష్ణుభక్తియుక్తుడై మహాధనసంపన్నుడై, సదా నేత్రజ్యోతియుక్తుడై, దీప్తిమంతుడై విరాజిల్లగలడు. మాఘమాసములో నరుణోదయకాలమున బ్రయాగలో బవిత్రగంగాజలస్నాన మాచరించు వారు దీర్ఘకాలము శ్రీహరి దివ్యధామమున వసించి మరల మానవులై జన్మించి శ్రీహరిభక్తులై, శ్రీహరి దివ్యమంత్రసంపన్నులై, జితేంద్రియశిరోమణులై, శరీరత్యాగానంతరము శాశ్వతముగ భగవద్ధామమున నివసింపగలరు. ఆ భక్తులు సారూప్యముక్తి పొంది శ్రీహరి దాస్యసౌభాగ్య సంపన్నులుకాగలరు. నిత్యము పవిత్రగంగాజలములలో స్నానమొనరించువారీభూమిపై సూర్యునివలె బవిత్రులై విరాజిల్లగలరు. వారి కడుగడుగున నిశ్చయముగ నశ్వమేధయజ్ఞఫలము ప్రాప్తించును. వారి చరణరజస్స్పర్శమువలననే పృథ్వీ సహితము పవిత్రురాలు కాగలదు. వారు వైకుంఠలోకమందు విరాజిల్లగలరు. సకల తాపసులచే సమ్మానితులగు నాభక్తులు జీవన్ముక్తులని గ్రహింపవలెను.

పవిత్రభారతవర్షములో మీనరాశి, కర్కటరాశిమధ్యకాలములో సువాసిత జలదాన మొనరించువారు దీర్ఘకాలము వైకుంఠమందు నివసించి మరల మానవులై జన్మించి రూపవంతులై, సుఖవంతులై, శివభక్తులై, తేజోవంతులై, వేదవేదాంగపారంగతులై, విద్వాంసులై విరాజిల్లగలరు. వైశాఖమాసమందు సద్బ్రాహ్మణులకు స్వయంపాకము దాన మొనరించిన దాత లాస్వయంపాకములో నెన్నికణములు కలవో యన్నిసంవత్సరముల పర్యంతము శ్రీమహావిష్ణు పరంధామమందు నివసింపగలరు.

కరోతి భారతే యో హి కృష్ణజన్మాష్టమీవ్రతమ్ ।
శతజన్మకృతా త్పాపా న్ముచ్యతే నాత్ర సంశయః ॥
వైకుణ్ఠే మోదతే సోఽపి యావదిన్ద్రా శ్చతుర్దశ ।
పునః స్వయోనిం సంప్రాప్య కృష్ణభక్తిం లభే ద్ధ్రువమ్ ॥ (74, 75)

భారతవర్షములో శ్రీకృష్ణజన్మాష్టమీ వ్రత మాచరించు వారు తాము నూఱుజన్మములలో నొనరించిన పాపములనుండి నిస్సంశయముగ విముక్తులు కాగలరు. ఆ వ్రతానుష్ఠానపరాయణులు పదునల్వు రింద్రుల యాయుర్దాయ పర్యంతము విష్ణులోకములో విరాజిల్లి మరల నుత్తమమానవులై జన్మించి నిశ్చయముగ శ్రీకృష్ణున కనన్యభక్తులు కాగలరు.

భారతవర్షములో శివరాత్రివ్రత మొనరించువారు సప్తమన్వంతరముల పర్యంతము శివలోకమందు నివసింపగలరు. శివరాత్రిదినమున శంకరుని బిల్వపత్రములతో బూజించుభక్తు లాబిల్వపత్ర సంఖ్యాసమయ పర్యంతము కైలాసమందు సుఖముల ననుభవించి మరల నుత్తమమానవులై జన్మించి శివుని పరమభక్తులు కాగలరు. విద్య, పుత్రులు, సంపదలు, భూమి, సౌభాగ్యము మొదలగునవి వారికి సులభములు కాగలవు. చైత్రమాసమందుగాని, మాఘమాసమందుగాని శంకరుని బూజించి హస్తములో దండమును ధరించి యొక యహర్నిశము భక్తిపూర్వకముగ నృత్య మొనరించు భక్తు లొకయుగ పర్యంతము శివలోకవాసులు కాగలరు. సాధ్వీ! భారతవర్షములో శ్రీరామనవమీవ్రత మొనరించువారు సప్తమన్వంతరములకాలము విష్ణుపరంధామమం దానందముల ననుభవించి మరల మానవులై జన్మించి రామభక్తులై జితేంద్రియ శిరోమణులు కాగలరు.

శరత్కాలములో భగవతీమహాపూజ సంపన్న మొనరించి నృత్యగీత వాద్యాదులతో దివ్యనామ సంకీర్తనములతో మహోత్సవముల నొనరించువారు దీర్ఘకాలము శివలోకమందు విరాజిల్లగలరు. తదనంతరము వారు శ్రేష్ఠయోనులందు జన్మించి నిర్మలబుద్ధిసంపన్నులు కాగలరు. అతులసంపత్తి. పుత్రపౌత్రాభివృద్ధి, మహాప్రభావాదు లన్నియు వారికి సంప్రాప్తింపగలవు, ఆభక్తులు నిస్సంశయముగ రాజరాజేశ్వరులు కాగలరు.

భారతవర్షములో భాద్రపదమాసశుక్లాష్టమీ దినమునుండి యొక పక్షము నిత్యము శ్రీమహాలక్ష్మిని భక్తిభావముతో నుపాసించువారు, షోడశోపచారముల నర్పించి సేవించువారు దీర్ఘకాలము వైకుంఠవాసులుకాగలరు. కార్తికపూర్ణిమాదినమున గోపగోపికలతోగూడి రాసమండల మహోత్సవ మొనరించుట యత్యంత మహిమాన్వితము. ఆదినమున శ్రీరాధాకృష్ణుల విగ్రహములకు షోడశోపచారముల నర్పించి, యారాధనాదిపూజలను నిర్వర్తించినవారు శ్రీకృష్ణుని పరమభక్తులై శ్రీకృష్ణదివ్యనామజప మొనరించుచు శ్రీకృష్ణ సారూప్యముక్తి పొంది భగవంతునకు బ్రిముఖపార్షదులై గోలోకమందు నివసింపగలరు. మృత్యువును జయించిన యాశ్రీకృష్ణదాస్య సౌభాగ్యసంపన్నులకు మరల జన్మము సంభవింపదు. శుక్లపక్షమందుగాని, లేక కృష్ణపక్షమందుగాని యేకాదశీవ్రత మొనరించుభక్తులు వైకుంఠ వాసులు కాగలరు. వారు మరల భారతవర్షములో జన్మించి శ్రీకృష్ణభగవదనన్యోపాసకులై, సుదృఢభక్తిసంయుక్తులై నశ్వరదేహమును త్యజించి గోలోకపరంధామము జేరి శ్రీకృష్ణసారూప్యముక్తిసంపన్నులై తత్పార్షదులు కాగలరు. వారికి మరల సంసారములో జన్మ సంభవింపదు. భాద్రపద మాసములో శుక్లపక్ష ద్వాదశీతిథిదినమున నింద్రు నారాధించువారు స్వర్గము జేరగలరు. భారతవర్షములో నాదివారమునాడుగాని, సంక్రాంతి దినమునగాని, శుక్లపక్షసమాప్తిదినమునగాని, సూర్యుని బూజించి హవిష్యాన్నమును భుజించువారు సూర్యలోకవాసులై మరల భారతవర్షములో జన్మించి యారోగ్యవంతులై, ధనవంతులై విరాజిల్లగలరు.

జ్యేష్ఠమాసములో చతుర్దశీ దినమున సావిత్రీదేవి నారాధించువారు బ్రహ్మలోకవాసులై, మరల మానవులై జన్మించి శ్రీమంతులై, పరాక్రమవంతులై, జ్ఞానులై, వైభవసంపన్నులై విరాజిల్లగలరు. మాఘమాసములో శుక్లపక్షపంచమీదినమున సంయమపూర్వకముగ నుత్తమభక్తిసమన్వితులై షోడశోపచారముల నర్పించి సరస్వతి నర్చించువారు దీర్ఘకాలము వైకుంఠమందు నివసింపగలరు. భారతవర్షములో సద్బ్రాహ్మణులకు నిత్యము గోదాన సువర్ణదానాదుల నొనరించువారు వైకుంఠము నొందగలరు. బ్రాహ్మణుల కన్నదాన మొనరించినవా రాబ్రాహ్మణుల రోమసంఖ్యాసమ సంవత్సరములపర్యంతము విష్ణులోకమందు విరాజిల్లగలరు.

యో వక్తి వా దదాత్యేవ హరే ర్నామాని భారతే ।
యుగం నామప్రమాణం చ విష్ణులోకే మహీయతే ॥ (109)

భారతవర్షములో స్వయముగ శ్రీహరి సంకీర్తన మొనరించుచు నితరులచేత హరినామసంకీర్తన మొనరింప జేయువా రొనరించిన నామసంఖ్యాసమయుగములపర్యంతము వైకుంఠమందు విరాజిల్లగలరు.

నారాయణక్షేత్రములో శ్రీహరినామసంకీర్తన మొనరించిన గోటి రెట్లధికఫలము లభించును.

నామ్నాం కోటిం హరే ర్యో హి క్షేత్రే నారాయణే జపేత్ ।
సర్వపాపవినిర్ముక్తో జీవన్ముక్తో భవేద్ ధ్రువమ్ ।
లభతే న పునర్జన్మ వైకుణ్ఠే స మహీయతే ॥ (110-111)

నారాయణక్షేత్రములో శ్రీహరి దివ్యనామమును గోటిపర్యాయములు జపించు వారు నిశ్చయముగ సర్వపాపవిముక్తులై జీవన్ముక్తులు కాగలరు. వారికి బునర్జన్మము లభింపదు. వారు సదా విష్ణులోకమందు విరాజిల్ల గలరు.

ప్రతిదినము పార్థివమూర్తి నొనరించి శివలింగము నర్చించుచు జీవితపర్యంత మీనియమమును బాలించువారు దీర్ఘకాలము శివుని పరంధామమందు నివసించి మరల భారతవర్షములో రాజేంద్రులై జన్మింపగలరు.

నిరంతరము సాలగ్రామమును బూజించి సాలగ్రామ చరణామృతపాన మొనరించు పుణ్యాత్ము లతిదీర్ఘకాలము వైకుంఠములో విరాజిల్లగలరు. దుర్లభానన్యభక్తి సులభమై వారు జీవన్ముక్తులు కాగలరు. సంపూర్ణ తపములను, వ్రతములను, బాలించువా రాసత్కర్మముల ఫలప్రభావమున జన్మరాహిత్యము నొంది వైకుంఠము జేరగలరు. సర్వతీర్థములందు స్నానమాచరించుచు భూప్రదక్షిణ మొనరించువారు మఱుజన్మములేక నిర్వాణపదము నొందగలరు. అశ్వమేధయజ్ఞ మాచరించువారు దీర్ఘకాలము స్వర్గములో నింద్రుని యర్ధాసనముపై విరాజిల్లగలరు. రాజసూయయజ్ఞ మొనరించిన నాల్గురె ట్లధికఫలము లభించును.

సుందరీ! సర్వయజ్ఞములందు విష్ణుదేవుని యజ్ఞ మత్యంత శ్రేష్ఠము.

పూర్వకాలములో బ్రహ్మ యత్యంత సమారోహముతో నీమహావిష్ణు యజ్ఞానుష్ఠాన మొనరించెను. పతివ్రతా! ఈయజ్ఞ మాచరించు సమయములోనే దక్షునకు శంకరునకు గలహము సంభవించినది. బ్రాహ్మణులు కోపించి నందిని శపింపగా నందీశ్వరుడు మరల బ్రాహ్మణులను శపించెను. అపుడే శంకరుడు దక్షయజ్ఞభంగ మొనరించెను. పూర్వకాలములో దక్షుడు, ధర్మదేవత, కశ్యపుడు, ఆదిశేషుడు, కర్దముడు, స్వాయంభువమనువు, తత్కుమారు డైనప్రియవ్రతుడు, శివుడు, సనత్కుమారుడు, కపిలుడు, ధ్రువుడు, ఈవిష్ణుయజ్ఞమునే యొనరించిరి. విష్ణుయజ్ఞానుష్ఠానమువలన వేనవేలురాజసూయ యజ్ఞఫలములు నిశ్చయముగ లభింపగలవు. విష్ణుయజ్ఞ మొనరించిన పురుషు డవశ్య మనేక కల్పముల పర్యంతము జీవించి తుదకు జీవన్ముక్తుడు కాగలడు.

భామినీ! దేవతలందు విష్ణువు, వైష్ణవపురుషులందు శివుడు, శాస్త్రములందు వేదము, వర్ణములందు బ్రాహ్మణవర్ణము, తీర్థములందు గంగ, పుణ్యాత్ములందు వైష్ణవులు, వ్రతములం దేకాదశీవ్రతము, పూజాకుసుమములందు దులసీదళము, నక్షత్రములందు జంద్రుడు, విహంగములందు గరుత్మంతుడు, స్త్రీలందు భగవతి మూలప్రకృతి రాధ, యాధారములందు వసుంధర, చంచలస్వభావము లగునింద్రియములందు మనస్సు, ప్రజాపతులందు బ్రహ్మ, ప్రజేశ్వరులందు బ్రజాపతి, వనములందు బృందావనము, వర్షములందు భారతవర్షము, శ్రీమంతులందు లక్ష్మి, విద్వాంసులందు సరస్వతి, పతివ్రతలందు భగవతి దుర్గ, సౌభాగ్యవతు లైనశ్రీకృష్ణుని ధర్మపత్నులందు శ్రీరాధ సర్వశ్రేష్ఠులుగ బ్రవచింపబడిరి. అట్లే సమస్తయజ్ఞములందు విష్ణుయజ్ఞ మత్యంత శ్రేష్ఠము.

స్నానం చ సర్వతీర్థేషు సర్వయజ్ఞేషు దీక్షణమ్ ।
సర్వేషాం చ వ్రతానాం చ తపసాం ఫలమేవ చ ॥
పాఠ శ్చతుర్ణాం వేదానాం ప్రాదక్షిణ్యం భువ స్తథా ।
ఫలం బీజ మిదం సర్వం ముక్తిదం కృష్ణసేవనమ్ ॥ (39, 40)

సర్వతీర్థస్నానములు, నిఖిలయజ్ఞదీక్షలు, వ్రతములు, తపములు, చతుర్వేదపఠనములు, పృథ్వీపరిక్రమాదులు నగుసకల సత్కర్మములకు ఫలము ముక్తిప్రదాయిని యైనశ్రీకృష్ణుని దాస్యసౌభాగ్యమే.

పురాణేషు చ వేదేషు చేతిహాసేషు సర్వతః ।
నిరూపితం సారభూతం కృష్ణపాదామ్బుజార్చనమ్ ॥
తద్వర్ణనం చ తద్ధ్యానం తన్నామగుణకీర్తనమ్ ।
తత్స్తోత్రం స్మరణం చైవ వన్దనం జప ఏవ చ ॥
తత్పాదోదకనైవేద్యభక్షణం నిత్యమేవ చ ।
సర్వసమ్మత మిత్యేవం సర్వేప్సిత మిదం సతి ॥
భజ కృష్ణం పరం బ్రహ్మ నిర్గుణం ప్రకృతేః పరమ్ ॥ [41-43]

సకల పురాణములు, వేదములు, నితిహాసములు, మొదలగున వన్నియు కేవలము శ్రీకృష్ణపాదాంబుజార్చనమే సకలసారమని నిరూపణ మొనరించి నవి. భగవంతునిదివ్యమంగళవిగ్రహమును వర్ణించుట, యాయనను ధ్యానించుట, యాయన దివ్యనామగుణసంకీర్తన మొనరించుట, యాయనను స్తుతించుట, స్మరించుట, యాయనకు వందనముల నర్పించుట, యాయన దివ్యనామమును జపించుట, పాదోదకములను స్వీకరించుట, నైవేద్యమును భక్షించుట, నిత్యము సకలదేహధారులకు బరమ కర్తవ్యమని తెలిసికొనుము. సాధ్వీ! ఈసౌభాగ్యమునే సకలజీవు లాకాం క్షింతురు. ఇదియే సర్వసమ్మత మైనయేకైకమతమని గ్రహింపుము. కావున కుమారీ! నీ విక ప్రకృతి కతీతుడు, ప్రాకృతగుణరహితుడు, పరబ్రహ్మము, పరమాత్మయు నగుశ్రీకృష్ణభగవానుని నిరంతర ముపాసింపుము.

సాధ్వీ! నీ యెడల నే నత్యంత ప్రసన్నుడనైతిని. నీకు నీనాథుని ప్రాణములను బ్రసాదించుచున్నాను. నీభర్తను బొంది నీ విక సుఖముగ మరలి పొమ్ము. దేహధారులకు మంగళప్రద మైనయీకర్మవిపాకప్రకరణమును నేను నీ కుపదేశించితిని. ఈప్రసంగము సర్వేప్సితము, సర్వసమ్మతము, తత్త్వజ్ఞాన ప్రదాయకము.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణ మందలి
ప్రకృతిఖండములోని యమసావిత్రీసంవాదమున
పుణ్యకర్మఫలకథనమను
నిరువదియేడవ అధ్యాయము
సంపూర్ణము.

# ఇరువదియొనిమిదవ అధ్యాయము

## సావిత్రి యొనరించిన యమధర్మరాజస్తోత్రము.

**శ్రీనారాయణఋషి పలికెను:**

నారదా! సంయమినీపురాధీశ్వరు డైన యమధర్మరాజుపదేశించిన మహాజ్ఞానశక్తి నాలకింపగనే సావిత్రి దేహము పులకించెను. ఆమె నయనము లానందాశ్రుపూర్ణము లయ్యెను. ఆసాధ్వి యమధర్మరాజును మరల నిట్లు ప్రశ్నించెను.

**సావిత్రి పలికెను :**

యమధర్మరాజా! వేదవేత్తలందు శ్రేష్ఠుడ వైనప్రభూ! నే నెట్లు ప్రకృతికి సైత మతీతు డైనశ్రీకృష్ణపరమాత్మ నారాధింపవలెను? మహాను భావా! మీ యనుగ్రహమువలన మనుష్యుల శుభకర్మవిపాకములను శ్రవణ మొనరింపగల్గితిని. ఇక మీరు నా కశుభకర్మవిపాకములను వివరింప బ్రార్థించుచున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

దేవర్షీ! సావిత్రి యీప్రకారముగ యమధర్మరాజు నర్థించి యత్యంతనమ్రాత్మకంధరయై వేదోక్తస్తుతిద్వారమున నిట్లు ప్రార్థింప నారంభించెను.

యమధర్మరాజస్తోత్రము :

తపసా ధర్మ మారాధ్య పుష్కరే భాస్కరా పురా ।
ధర్మాంశం యం సుతం ప్రాప ధర్మరాజం నమామ్యహమ్॥

సమతా సర్వభూతేషు యస్య సర్వస్య సాక్షిణః।
అతో యన్నామ శమన ఇతి తం ప్రణమా మ్యహమ్ ॥

యేనాన్తశ్చ కృతో విశ్వే సర్వేషాం జీవినాం పరమ్ ।
కర్మానురూపకాలేన తం కృతాన్తం నమా మ్యహమ్ ॥

బిభర్తి దణ్డం దణ్డాయ పాపినాం శుద్ధహేతవే ।
నమామి తం దణ్డధరం యః శాస్తా సర్వకర్మణామ్ ॥

విశ్వం యః కలయత్యేవ సర్వాయుశ్చాపి సన్తతమ్ ।
అతీవ దుర్నివార్యం చ తం కాలం ప్రణమా మ్యహమ్॥
తపస్వీ వైష్ణవో ధర్మీ సంయమీ విజితేన్ద్రియః ।
జీవినాం కర్మఫలదం తం యమం ప్రణమా మ్యహమ్॥
స్వాత్మారామశ్చ సర్వజ్ఞో మిత్రం పుణ్యకృతాం భవేత్।
పాపినాం క్లేశదో యశ్చ పుణ్యమిత్రం నమామ్యహమ్॥
య జ్జన్మ బ్రహ్మణో వంశే జ్వలన్తం బ్రహ్మతేజసా ।
యో ధ్యాయతి పరం బ్రహ్మ బ్రహ్మవంశం నమామ్యహమ్॥ (8-15)

పూర్వము సూర్యభగవానుడు పుష్కరక్షేత్రమున నఖండతపమున ధర్మదేవు నారాధించెను. తత్తపఃఫలప్రభావమున సాక్షా ద్ధర్మాంశముతో ధర్మమే స్వయముగ సూర్యపుత్రరూపమున నుదయించెను. నే నాధర్మరాజు నకు బ్రణామము లర్పించెదను. సర్వులకు సాక్షియై, సకలభూతములందు సమత్వము కల్గి వర్తించు కారణమున నే దేవుని నామము శమను డయ్యెనో నే నాశమనునకు బ్రణామము లర్పించెదను. కర్మానురూపముగ గాలసహా యోగముచే విశ్వమందు గల సర్వప్రాణుల నంత మొనరించు కృతాంతునకు నేను బ్రణామము లర్పించెదను. కేవలము పాపాత్ములు బరిశుద్ధులగునట్లు వారిని దండించుటకే హస్తమందు దండమును ధరించువాడు, సమస్తకర్మము లకు నుపదేష్టయై విరాజిల్లువాడు నగు నా దండధరునకు నేను బ్రణామము లర్పించెదను. సతతము విశ్వమునందు గల సర్వప్రాణుల యాయుర్దాయము పరిగణన మొనరించునదియు, యత్యంత దుర్నివార్యమైనదియు నగుగాలము నకు బ్రణామము లర్పించెదను. తపస్వియు, వైష్ణవుడు, ధర్మాత్ముడు, సంయమియు, జితేంద్రియుడు, జీవకర్మఫలప్రదాతయు నగుయమునకు నేను బ్రణామము లర్పించెదను. స్వాత్మారాముడు, సర్వజ్ఞుడు, పుణ్యాత్మమిత్రుడు పాపాత్మక్లేశప్రదుడు,పుణ్యమిత్రు డనునామమున బ్రసిద్ధుడు నగుయమధర్మరాజు నకు బ్రణామము లర్పించెదను. బ్రహ్మవంశమున సంభవించినవాడు, బ్రహ్మ తేజముతో బ్రజ్వరిల్లువాడు, పరబ్రహ్మమును ధ్యానించుచుండువాడు నగు యమధర్మరాజునకు బ్రణామము లర్పించెదను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

మునీశ్వరా! యిట్లు సావిత్రి యనేకవిధముల యమధర్మరాజును స్తుతించి ప్రణమిల్లగా, ఆయ నామెకు విష్ణుభజనమును, గర్మవిపాకప్రసంగములను నుపదేశించెను.

ఇదం యమాష్టకం నిత్యం ప్రాత రుత్థాయ యః పఠేత్।
యమా త్తస్య భయం నాస్తి సర్వపాపా త్ప్రముచ్యతే॥
మహాపాపీ యది పఠే న్నిత్యం భక్త్యా చ నారద।
యమః కరోతి తం శుద్ధం కాయవ్యూహేన నిశ్చితమ్ ॥ (17-18)

ప్రాతఃకాలమున నిద్రిమేల్కాంచి ప్రతినిత్యము నీయమాష్టకమును బఠించువానికి యమభయ ముండదు. ఆతడు సర్వపాపములనుండి విముక్తుడు కాగలడు. నారదా! మహాపాపాత్ముడైనను భక్తిసమన్వితుడై నిరంతర మీయమాష్టకమును బఠించిన యమధర్మరాజు కాయవ్యూహద్వారమున వానిని నిశ్చయముగ బరిశుద్ధు నొనరింపగలడు.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
ప్రకృతిఖండములోని సావిత్రీకృతయమ
స్తోత్ర మనునిరువదియేనిమిదవ
అ ధ్యా య ము
సంపూర్ణము.

# ఇరువదిరెండవ అధ్యాయము

## యముడు సావిత్రికి నరకకుండములగూర్చి వివరించుట.

**శ్రీనారాయణఋషి పలికెను:**

నారదా! రవినందను డైనయమధర్మరాజు సావిత్రీదేవికి విధిపూర్వకముగ విష్ణుమహామంత్రోపదేశ మొనరించి యశుభకర్మవిపాకములను వర్ణింప నారంభించెను.

**యమధర్మరాజు పలికెను :**

సతీ! నానావిధము లైనశుభకర్మవిపాకములను శ్రవణ మొనరించితివి. అశుభకర్మవిపాకములను వర్ణించెద నవధరింపుము.

> నానాప్రకారం స్వర్గం చ యాతి జీవః స్వకర్మణా ।
> కుకర్మణా చ నరకం యాతి నానావిధం నరః॥ 3

పతివ్రతా! జీవుడు సత్కర్మములవలన నానాప్రకారము లైనస్వర్గముల బొందుచున్నాడు. ఆత డొనరించినకుకర్మములవలన నరకముల పొందుచున్నాడు.

నరకములలో ననేకకుండములు కలవు. విభిన్నపురాణములం దీకుండములను విభిన్ననామములతో బ్రవచించిరి. ఈకుండము లన్నియు నత్యంత విస్తృతములు. పాపులచే దుఃఖముల ననుభవింపజేయుటయే యీనరకకుండముల ప్రయోజనములు. కుమారీ! ఈభయంకరనరకకుండము లత్యంతభయప్రదములు, కుత్సితములు. సంయమనీపురములో గలయసంఖ్యాకనరకకుండములలో నెనుబదియారు కుండములు ప్రసిద్ధములు. సాధ్వీ! ఈనరకకుండముల నామములను బ్రవచించెద నాలకింపుము.

1 వహ్నికుండము, 2 తప్తకుండము, 3 భయంకరక్షారకుండము, 4 విట్కుండము, 5 మూత్రకుండము, 6 దుస్సహశ్లేష్మకుండము, 7 గరకుండము, 8 నేత్రమలకుండము, 9 దూషికాకుండము, 10 వసాకుండము,

11 శుక్రకుండము, 12 అశ్రుకుండము, 13 కుత్సితాసృక్కుండము, 14 గాత్ర మలకుండము, 15 కర్ణవిట్కుండము, 16 మజ్జాకుండము, 17 మాంస కుండము, 18 దుస్తరనఖకుండము, 19 లోమకుండము, 20 కేశకుండము, 21 దుఃఖప్రదాస్థికుండము, 22 ప్రతప్తతామ్రకుండము, 23 మహాక్లేశప్రదా యక మైనప్రతప్తలోహకుండము, 24 తీక్ష్ణకంటకకుండము, 25 విషప్రదవిష కుండము, 26 చర్మకుండము, 27 తప్తసురాకుండము, 28 ప్రతప్త తైల కుండము, 29 దుర్వాహదంతకుండము, 30 క్రిమికుండము, 31 పూయ కుండము, 32 దురన్త సర్పకుండము, 33 మశకకుండము, 34 దంశకుండము, 35 భయంకరగరళకుండము, 36 వజ్రదంష్ట్రకుండము, 37 వృశ్చికకుండము, 38 శరకుండము, 39 శూలకుండము, 40 భయంకరఖడ్గకుండము, 41 గోల కుండము, 42 శోకప్రదకాకకుండము, 43 సంచాలకుండము, 44 వాజ కుండము, 45 దుస్తరవజ్రకుండము, 46 బంధకుండము, 47 తప్తపాషాణ కుండము, 48 తీక్ష్ణపాషాణకుండము, 49 లాలాకుండము, 50 మషీకుండము, 51 సుదారుణచూర్ణకుండము, 52 చక్రకుండము, 53 వజ్రకుండము, 54 మహోల్బణకూర్మకుండము, 55 జ్వాలాకుండము, 56 భస్మకుండము, 57 పూతికుండము, 58 తప్తసూర్యమషీపత్రకుండము, 59 క్షురధారీకుండము, 60 సూచీముఖకుండము, 61 గోదాముఖకుండము, 62 నక్రముఖకుండము, 63 గజదంశకుండము, 64 గోముఖకుండము, 65 కుమ్భీపాకకుండము, 66 అవటోదకుండము, 67 అసంతుదకుండము, 68 పాంశుభోజకుండము, 69 పాశవేష్టకుండము, 70 శూలప్రోతకుండము, 71 ప్రకంపనకుండము, 72 ఉల్కాముఖకుండము, 73 అంధకూపకుండము, 74 వేధనకుండము, 75 దణ్డతాడనకుండము, 76 జాలబంధనకుండము, 77 దేహచూర్ణకుండము, 78 దలనకుండము, 79 శోషణకుండము, 80 శూర్పకుండము, 81 జ్వాలా ముఖకుండము, 82 జింభకుండము, 83 ధూమాంధకుండము, 84 నాగవేష కుండము, 85 కాలసూత్రకుండము, 86 ఘర్మకుండము.

సావిత్రీ! ఈనరకము లన్నియు పాపుల కసంఖ్యాకక్లేశములను గల్గించు టకే నిర్మింపబడినవి. పదిలక్షలకింకరగణములు సదా యీనరకకుండముల పాలనమందు నియుక్తులై యుందురు. వారు హస్తములందు దండపాశాదు లను ధరించి మహాభయంకరులై, భయంకరగదాయుధములతో, శస్త్రలతో,

బాపులను హింసింతురు. వారి నెవ్వరు నడ్డగింపలేరు, వారియందు దయ నామమాత్రమైన నుండదు. మహాతేజస్వులు, నిర్భీకులునై యాయమకింకరులు ప్రతప్తతామ్రసదృశరక్తవర్ణనయనములు కలవారై, నల్లని దేహములు కలవారై పాపులకు మహాభయంకరముగ దర్శనమొసంగెదరు. దేవీ! వారు యోగసిద్ధులు, నానారూపములను ధరింప సమర్థులు. మృత్యుకాల మాసన్నమైనసమయముననే సమస్తపాపాత్ములకు నీభయంకరయమకింకరులు దర్శనమొసంగెదరు. శివుని, ఆదిశక్తిని, సూర్యుని, గణేశ్వరుని, శ్రీకృష్ణుని, విష్ణుమూర్తిని నారాధించుచు దమనిజధర్మములందు సంలగ్నులై విరాజిల్లుసిద్ధయోగిపురుషుల సమ్ముఖమునకు యమకింకరులు పోజాలరు. పుణ్యాత్ములకు, స్వధర్మపాలకులకు, విశాలహృదయసంపన్నులకు, దైవారాధకులకు, దీనజనసేవాపరాయణులకు, వైష్ణవులకు, మహాబలసంపన్నులు, నిశ్శంకులైనయమకింకరులు స్వప్నములందైనను గోచరింపరు.

సాధ్వీ! నరకకుండములసంఖ్యానిరూపణ మొనరించితిని. ఇక నేయేపాపు లేయేనరకముల ననుభవింపవలెనో వర్ణించెద నవధరింపుము.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణ మందలి
ప్రకృతిఖండములోని నరకకుండసంఖ్యాన
మను నిరువదితొమ్మిదవ
అ ధ్యా య ము
సంపూర్ణము.

—♦—

# ముప్పదియవ అధ్యాయము

## దుష్కర్మలవలన బాపులకు సంభవించు నరకముల వర్ణన.

**యమధర్మరాజు పలికెను :**

హరిసేవారత శ్శుద్ధో యోగీ సిద్ధో వ్రతీ సతి ।
తపస్వీ బ్రహ్మచారీ చ న యాతి నరకం యతిః ॥ 1

సాధ్వీ! శ్రీహరిసేవలందు సంలగ్నులై చరించుపుణ్యాత్ములు, యోగులు, సిద్ధులు, వ్రతులు, సుకృతులు, తాపసులు, బ్రహ్మచర్యాపరులు, యతులు నరకములకు బోరు. ఇది సత్యము.

కటువాచా బాన్ధవాంశ్చ ఖలత్వేన చ యో నరః ।
దగ్ధా న్కరోతి బలవా న్వహ్నికుణ్డం ప్రయాతి సః ॥
గాత్రలోమప్రమాణాబ్దం తత్ర స్థిత్వా హుతాశనే ।
పశుయోని మవాప్నోతి రౌద్రే దగ్ధ స్త్రిజన్మసు॥ 2, 3

ఖలులై, కటువచనములతో బరులమనములను దగ్ధమొనరించు వారగ్నికుండమనునరక మనుభవింపగలరు. శరీరముపై నెన్నిరోమములు కలవో యన్నివర్షములపర్యంతము వారగ్నితప్తులగుచు ఘోరనరక మనుభవించి తుదకు మూడుసార్లు భయంకరమైనపశుయోనులందు జన్మించి దుఃఖింపగలరు.

తనగృహమున కేతెంచినయన్నార్తునకు, బ్రాహ్మణునకు భోజనమొసంగక నిరాదరించు మూర్ఖమానవుడు తప్తకుండ మనునరకమున బడగలడు. తన శరీరమం దెన్నిరోమములు కలవో యన్నిసంవత్సరము లాతడు దుఃఖప్రదనరక మనుభవించి తుద కేడుజన్మములవఱకు బక్షియోనులందు బరిభ్రమింప గలడు. ఆదివారము, సూర్యసంక్రాంతి, యమావాస్య, శ్రాద్ధాదిదినములందు, వస్త్రములను క్షారపదార్థములతో క్షాళన మొనరించువా డావస్త్రములలో నెన్నిదారములు గలవో యన్నిసంవత్సరములు క్షారకుండ మనునరక మనుభవించి యేడు జన్మములపర్యంతము చాకలిగ జన్మింపగలడు. తా మొసంగినట్టివో లేక పరు

లోసంగినట్టివో బ్రాహ్మణవృత్తుల నపహరించువాడును, భగవంతునిసంపదలను హరించువాడును, నలువదివేలసంవత్సరములపర్యంతము విట్కుండ మనునరక మనుభవించి తుదకు బృథ్విపై నన్నిసంవత్సరములు విష్ఠాకీటకమై దుఃఖింప గలడు. మానవులు త్రాగుట కుపయోగించు జలాశయములను మలమూత్రా దులచే మలినమొనరించుపాపి మూత్రకుండ మనునరక మనుభవింపగలడు. ఆనరకములో వానికి మలమూత్రాద్య పవిత్రపదార్థములే యాహారములుగ నీయబడగలవు. ఇతరులకు బెట్టక మధురపదార్థములను దానే భుజించులోభి శ్లేష్మకుండ మనునరక మనుభవించి ప్రేతమై సంచరింపగలడు.

పితరం మాతరం చైవ గురుం భార్యాం సుతం సుతామ్।
యో న పుష్ణా త్యనాథం చ గరకుణ్డం ప్రయాతి సః॥
పూర్ణమబ్దసహస్రం చ తద్భోజీ తత్ర తిష్ఠతి ।
తతో వ్రజే ద్భూతయోనిం శతవర్షం తతః శుచి॥ 14,15

తలిదండ్రులను, గురువులను, సహధర్మచారిణిని, బుత్రులను, బుత్రిక లను, అనాథలను, పోషింపనివారు గరలకుండ మను (విషకుండమను) నరక మనుభవింపగలరు. ఆనరకములో నొకవేయిసంవత్సరములు వారు భుజించుటకు విషమే లభించును. అనంతర మాపాపులు వందసంవత్సరములు భూతయోనులందు భ్రమించి తుదకు పాపవిముక్తులు కాగలరు.

దృష్ట్వాఽతిథిం వక్రచక్షు ర్మానవో యః కరోతి హి ।
పితృదేవా స్తస్య జలం న గృహ్ణన్తి చ పాపినః॥
యాని కాని చ పాపాని బ్రహ్మహత్యాదికాని చ।
ఇహైవ లభతే చాన్తే దూషికాకుణ్డ మావ్రజేత్ ॥
పూర్ణమబ్దశతం చైవ తద్భోజీ తత్ర తిష్ఠతి ।
తతో నరో భవే ద్భూమౌ దరిద్రః సప్త జన్మసు॥ 16,18

అతిథిని వక్రదృష్టితో వీక్షించు పాపి తా నర్పించిన తర్పణములను బితరులు, దేవతలు స్వీకరింపరు. ఆపాపాత్ము డొనరించినయతిథితిరస్కా-ర రూపఘోరబ్రహ్మహత్యాపాపమువలన నంత్యకాలములో దూషికాకుండ మను నరకమున బడి నూఱుసంవత్సరములు దూషితపదార్థములను భుజించి తదుపరి

భూతయోనులందు బరిభ్రమించి యేడుజన్మములవఱకు దరిద్రుడై జన్మించును. తుద కాతడాపాపములనుండి విముక్తినొందగలడు.

దత్త్వా ద్రవ్యం చ విప్రాయ చాన్యస్మై దీయతే యది।
స తిష్ఠతి వసాకుణ్డే తద్భోజీ శతవత్సరమ్॥ 19

బ్రాహ్మణున కొసంగిన వస్తువులను మరల గ్రహించి మఱొకరి కిచ్చువాడు నూఱుసంవత్సరములు వసాకుండ మనునరక మనుభవింపగలడు.

పుమాంసం కామినీ వాఽపి కామినీం వా పుమాంస్తథా।
యః శుక్రం పాయయత్యేవ శుక్రకుణ్డం ప్రయాతి సః॥
పూర్ణ మబ్దశతం చైవ తద్భోజీ తత్ర తిష్ఠతి ।
యోనిక్రిమిః శతాబ్దం చ భవే ద్భువి తతశ్శుచి॥ 20,21

స్త్రీ పరపురుషునితోగాని, పురుషుడు పరస్త్రీతోగాని యక్రమసంబంధము గల్గియున్నను లేదా శుక్రపానమొనరించినను మానవుడు శుక్రకుండ మను నరకమున బడి నూఱుసంవత్సరములవఱకు నాశుక్రమునే పానముచేయును. తుదకు నూఱుసంవత్సరములు కీటయోనులం దుండి పిమ్మట శుద్ధుడగును.

సంతాడ్య చ గురుం విప్రం రక్తపాతం చ కారయేత్।
సచ తిష్ఠ త్యసృక్కుణ్డే తద్భోజీ శతవత్సరమ్ ॥
తతో భవే ద్వ్యాధజన్మ సప్తజన్మసు భారతే ।
తతః శుద్ధి మవాప్నోతి మానవశ్చ క్రమేణ చ॥ 22,23

సద్బ్రాహ్మణుని లేదా ఆచార్యుని హింసించి రక్తము చిందించువాడు అసృక్ (రక్త) కుండ మనునరకమున బడి రక్తమునే యాహారముగ గ్రహించి నూఱుసంవత్సరములు దుఃఖింపగలడు. తదుపరి భారతవర్షములో నేడుజన్మములవఱకు వ్యాధాదిహింసకజన్మములను బొంది తుదకు గ్రమముగ బాపవిముక్తుడు కాగలడు.

అశ్రు ప్రవన్తం గాయన్తం భక్తం దృష్ట్వా చ గద్గదమ్।
శ్రీకృష్ణగుణసంగీతే హసత్యేవ హి యో నరః ॥
స వసే దశ్రుకుణ్డే చ తద్భోజీ శతవత్సరమ్ ।
తతో భవే త్స చణ్డాలస్త్రిజన్మని తతః శుచిః॥ 24, 25

శ్రీకృష్ణదివ్యగుణనామసంకీర్తనములందు సంలగ్నులై పులకితగాత్రిముతో గద్గదస్వరముతో నానందాశ్రువులను గార్చుచు గానమొనరించుచు నృత్యమొనరించుభాగవతోత్తములను గాంచి పరిహాసించునరు డాఘోరపాప ఫలముగ నూఱుసంవత్సరము లశ్రుకుండ మనునరకమున బడి యశ్రువులనే పానమొనరించుచు దుఃఖింపగలడు. తదనంతరము మూడుజన్మములవఱకు జండాలుడై జన్మించి పాపవిముక్తుడు కాగలడు.

కరోతి ఖలతాం శశ్వ దశుద్ధహృదయో నరః ।
కుణ్డం గాత్రమలానాం చ స యాతి దశాబ్దకమ్ ॥
తతః స గార్దభీం యోని మవాప్నోతి త్రిజన్మసు ।
త్రిజన్మ చ సార్గాలీం తతః శుద్ధో భవే ద్ధ్రువమ్॥ 26, 27

శుద్ధహృదయము కల్గినవారలతో నే ఖలుడు (అంతరంగమున నొకటి భావించుచు బహిర్గతముగ మఱియొకటి పల్కుటయే ఖలత్వము) మూర్ఖతతో బ్రవర్తించునో యతడు పదిసంవత్సరములు గాత్రమలకుండ మనునరక మనుభవింపగలడు. పిదప మూడుజన్మములవఱకు గార్దభీయోనులందు బుట్టి, మఱి మూడుజన్మములవఱకు సృగాలయోనులందు జన్మించి తుదకు బాపవిముక్తుడు కాగలడు.

బధిరం యో హసత్యేవ నిన్దత్యేవ హి మానవః।
స వసే త్కర్ణవిట్కుణ్డే తద్భోజీ శతవత్సరమ్।
తతో భవే త్స బధిరో దరిద్రః సప్తజన్మసు ।
సప్తజన్మ స్వఙ్గహీన స్తతః శుద్ధిం లభే ద్ధ్రువమ్॥ [29-30]

బధిరులు (చెవిటివారు) మొదలుగాగల యంగవిహీనులను గాంచి పరిహాసించు వారు నూఱేండ్లు కర్ణమల మారగించుచు గర్ణవిట్కుండ మనునరక మనుభవింపగలరు. తదుపరి బధిరులై దరిద్రులై యేడుజన్మములవఱకు దుఃఖించి మఱియేడుజన్మములవఱకు నంగవిహీనులై కష్టముల ననుభవించి తుదకు విముక్తినొందగలరు.

లోభా త్స్వపాలనార్థాయ జీవినం హన్తి యో నరః ।
మజ్జాకుణ్డే వసే త్సోఽపి తద్భోజీ లక్షవర్షకమ్ ॥

తతో భవే త్స శశకో మీన స్స్వాత్సప్త జన్మ సు।
ఏణాదయశ్చ కర్మభ్య స్తతః శుద్ధిం లభేద్ధ్రువమ్॥ 32

లోభవశులై తన యుదరపోషణార్థ మితరప్రాణులను హింసించుమానవుడు లక్షసంవత్సరములు మజ్జా (కండమాంసము) భక్షకుడై మజ్జాకుండ మను నరక మనుభవింపగలడు. పిదప నేడుజన్మములవఱకు శశకము (కుందేలు) గను, మీనము (చేప)గను జన్మించి తనపాపఫలానురూపముగ జింకగ బుట్టి తుదకు నిశ్చయముగ నాపాపమునుండి విముక్తుడు కాగలడు.

స్వకన్యాపాలనం కృత్వా విక్రీణాతి హి యో నరః ।
అర్థలోభా న్మోహమూఢో మాంసకుణ్డం ప్రయాతి సః॥
కన్యాలోమప్రమాణాబ్దం తద్భోజీ తత్ర తిష్ఠతి।
తం చ కుణ్డే ప్రహారం చ కరోతి యమకింకరః॥
మాంసభారం మూర్ధ్ని కృత్వా రక్తధారాంలిహేత్ క్షుధా।
తతో హి భారతే పాపీ కన్యావిట్సు క్రిమి ర్భవేత్॥
షష్టివర్షసహస్రాణి వ్యాధశ్చ సప్త జన్మసు ।
త్రిజన్మని వరాహశ్చ కుక్కురః సప్త జన్మసు॥
సప్త జన్మసు మణ్డూకో జలూకః సప్త జన్మసు ।
సప్త జన్మసు కాకశ్చ తతః శుద్ధిం లభే ద్ధ్రువమ్ ॥ (33-37)

అర్థలోభమోహాదులకు వశుడై మూఢుడై తాను కని, పెంచి పెద్ద చేసినకొమార్తెను విక్రయించువాడు (ఈభావమును గుమారులకుగూడ నన్వయింపవలెను. ఎందువలన ననగా బురుషునకు బ్రకృతికి భేదము లేదు) మాంసకుండ మనునరకమున బడగలడు. ఆకన్య వెండ్రుకలసంఖ్యావత్సరములు కన్యామాంసమునే భుజించుచు యమకింకరులు ప్రహారము లొనరించుచుండగ బీడితుడై దుఃఖింపగలడు. ఆనరకములో మాంసఖండములను మోయుచు నాకలిగల్గిన రక్తధారలను ద్రాగుచు ననేక కష్టముల ననుభవించి యరువదివేలసంవత్సరములు కన్యామలకీటకములై జన్మించి యేడుజన్మములు కిరాతుడై దుఃఖించి, మూడుజన్మములు పందులై జన్మించి, యేడుజన్మములు కుక్కలై దుఃఖింపగలరు. మఱియేడుజన్మములవఱకు గప్పలై, యేడుజన్మములు జలగలై, యేడుజన్మములు కాకియై తుదకు వధూవిక్రయాదిపాపములనుండి విముక్తుడై శుద్ధుడు కాగలడు.

వ్రత, శ్రాద్ధ, ఉపవాస, నియమదినములందు క్షురకర్మ మొనరించుకొను మానవుడు సర్వకర్మములకు నపవిత్రుడు కాగలడు. సాధ్వీ! అట్లొనరించు వ్యక్తి నఖకుండ మనునరక మనుభవింపగలడు. భారతవర్షములో కేశ యుక్తమైనపార్థివ లింగము నారాధన మొనరించువాడు దీర్ఘకాలము కేశ కుండ మనునరక మనుభవించును. అతడు మహాదేవుని యాగ్రహమునకు గుఱియై యవనుడై జన్మించి నూఱుసంవత్సరములు దుఃఖించి తుదకు పాప విముక్తుడు కాగలడు. విష్ణుపద మనుతీర్థములో బితరులకు బిండముల నర్పింపని వా డస్థికుండ మనునరకమున బడగలడు. ఏడుజన్మములపర్యంత మంగ హీనుడై, దరిద్రుడై దుఃఖించి తుదకు పాపవిముక్తుడు కాగలడు. పూర్ణగర్భ వతితో బలవంతముగ సమాగమ మొనరించువాడు ప్రజ్వలితతామ్రకుండ మనునరకమున బడగలడు. అవీరాన్నమును (భర్త బిడ్డలులేనిస్త్రీ పెట్టు అన్న మును) ఋతుస్నాతయైనస్త్రీ పెట్టుఅన్నమును భుజించుమానవుడు నూఱుసంవ త్సరములు ప్రతప్తలోహకుండ మనునరక మనుభవింపగలడు. తదుపరి వానికి రజకజన్మము, చర్మకారజన్మము ప్రాప్తింపగలదు. అపవిత్రహస్తములతో దేవద్రవ్యములను స్పృశించు పాపి చర్మకుండ మనునరక మనుభవింపగలడు.

యః శూద్రే ణాభ్యనుజ్ఞాతో భుంక్తే శుద్రాన్నమేవ చ ।
స చ తప్తసురాకుణ్డే శతాబ్దం తిష్ఠతి ద్విజః॥ 48

శూద్రునిచే గోరబడి శూద్రాన్నమును భుజించుబ్రాహ్మణుడు తప్త సురాకుండ మనునరకమును నూఱుసంవత్సరము లనుభవింపగలడు.

వాగ్దుష్టా కటువాచా యా తాడయేత్స్వామినం సదా ।
తీక్ష్ణకణ్టకకుణ్డే సా తద్లోమీ తత్ర తిష్ఠతి ॥
తాడితా యమదూతేన దణ్డేన చ చతుర్యుగమ్ ।
తత ఉచ్చైఃశ్రవాః సప్తజన్మః స్వేవ తతః శుచిః॥50,51

కఠినముగ మాట్లాడుచు, పూజ్యులను సదా హింసించువాడు తీక్ష్ణకంటక కుండ మనునరకమున బడి కంటకభోజియై దుఃఖింపగలడు. ఆనరకములో నాల్గుయుగములపర్యంతము యమదూతలచే దండింపబడి తుద కేడుజన్మములు ఉచ్చైఃశ్రవోజాతి అశ్వమై జన్మించి పాపవిముక్తుడు కాగలడు.

నిర్దయుడై మఱియొకప్రాణికి విష మొసంగి సంహరించుపాపి వేయి

సంవత్సరములు విషకుండ మనునరకమున బడి విషమునే భుజింపగలడు. దీర్ఘ కాలము కఠినాత్ముడై, నరఘాతకుడై, కుష్ఠరోగియై, శరీరమం దంతట వ్రణ ములు కల్గి దుఃఖింపగలడు. ఇంతపాపఫల మనుభవించినపిదపనే వాడు పరి శుద్ధుడు కాగలడు. పుణ్యక్షేత్రమైనభారతవర్షములో జన్మించి వృషభము లను గోవులను హింసించుచు లేక హింసింపజేయుచుండు పాపాత్ముడు తప్త తైల మనునరకమున బడగలడు. గోలోమప్రమాణాబ్దము లాపాపాత్ముడు వృషభమై జన్మించి దుఃఖింపగలడు. సావిత్రీ! దండముతోగాని, తీక్ష్ణాయు ధములతోగాని యితరప్రాణుల నకారణముగ హింసించుపాపాత్ముడు యుగ ములపర్యంతము దంతకుండ మనునరక మనుభవించి మానవుడై జన్మించి యుదరరోగముచే దుఃఖింపగలడు.

యో భుంక్తే చ వృథా మాంసం మత్స్యభోజీ చ బ్రాహ్మణః ।
హరే రనైవేద్యభోజీ కృమికుణ్డం ప్రయాతి సః ॥
స్వలోమమానవర్షం చ తద్భోజీ తత్ర తిష్ఠతి ।
తతో భవే న్మ్లేచ్ఛజాతి స్త్రిజన్మసు తతః శుచిః॥ (57, 58)

ఏప్రయోజనము లేకయే (కేవల ముదరపోషణార్థము) మాంసమును భుజించువాడు, మత్స్యములను భుజించుబ్రాహ్మణుడు, శ్రీహరి కర్పింపనిదే పదార్థములను భుజించు కృతఘ్నుడు కృమికుండ మనునరక మనుభవింప గలడు. ఆపాపాత్ములు స్వలోమసంఖ్యాకవర్షములు క్రిమికీటకములను భుజించుచు నరక మనుభవించి తుదకు మూడుజన్మములు మ్లేచ్ఛులై జన్మించి పాపవిముక్తు లయ్యెదరు.

అకారణముగ సర్పములను హింసించుమానవుడు సర్పకుండ మనునరక మున బడి సర్పములచే బాధింపబడగలడు. అల్పాయుష్కుడై నమానవునిగా బుట్టి చర్మరోగముల ననుభవించి సర్పదష్టుడై మరణింపగలడు. అకారణముగ క్రిమికీటకాదులను క్షుద్రజంతువులను హింసించుమానవులు దంశకుండ, మశక కుండము లనునరకముల ననుభవింపగలరు. మధువును సంగ్రహించుచున్న మధుపముల నకారణముగ సంహరించుమానవుడు దీర్ఘకాలము గరళకుండనరక మనుభవింపగలడు.

అర్థలోభేన యో భూపః ప్రజాదణ్డం కరోతి చ ।
వృశ్చికానాం చ కుణ్డేషు తల్లోమాబ్దం వసేద్ధ్రువమ్ ॥ (73)

ధనలోభుడై సదా ప్రజలను బన్నులభారముతో బీడించుపరిపాలకుడు దీర్ఘకాలము వృశ్చికకుండ మనునరక మనుభవింపగలడు. ఇది నిజము. వా డేడుజన్మములపర్యంతము వృశ్చికముగ బుట్టి తుదకు మనుష్యుడై జన్మించి యంగహీనుడు రోగగ్రస్తుడునై దుఃఖింపగలడు. శస్త్రములను ధరించి ఇతరులను బాధించు బ్రాహ్మణుడు, పరులజీవనముల నపహరించు దుష్టులు, సంధ్యాహీనుడు, మూఢుడు, హరిభక్తివిముఖుడు మొదలుగాగల పాపాత్ములు స్వలోమాబ్దములపర్యంతము శరాదికుండముల బడి బాణఘాతములచే హింసింపబడి దుఃఖింపగలరు. మదోన్మత్తులై పరిపాలకు లల్పాపరాధములకు ఘోరదండనములను విధించి ప్రజలను బాధించిన వారు గోలకుండ మనుభయంకరాంధకారబంధురనరకమున బడి తీక్ష్ణదంతములు గలకీటకములు పీడించుచుండగ బ్రతప్తజలములబడి దుఃఖింపగలరు. తదుపరి మానవులై జన్మించి ప్రజలకు భృత్యులై జీవింపగలరు. జలచరములైన నక్రాదిజంతువుల నకారణముగ సంహరించుమానవుడు నక్రకుండ మనునరక మనుభవింపగలడు.

వక్షఃశ్రోణీస్తనాస్యం చ యః పశ్యతి పరస్త్రియాః ।
కామేన కాముకో యో హి పుణ్యక్షేత్రే చ భారతే ॥
స వసే త్కాకకుణ్డే చ కాకైశ్చ క్షుణ్ణలోచనః ।
తతః స్వలోమమానాబ్దం తత శ్చాన్ధ స్త్రిజన్మసు ॥ (80, 81)

పుణ్యక్షేత్రమైనభారతవర్షములో జన్మించి కామభావముతో బరస్త్రీవక్షఃస్థలమును (స్తనములను), శ్రోణీప్రదేశమును, ముఖమును వీక్షించుపాపాత్ముడు స్వలోమమానాబ్దములు కాకకుండ మనునరకములో బడి కాకములు తనలోచనములను బొడువగా దుఃఖించును. తుదకు వాడు మూడుజన్మముల పర్యంత మంధుడై పుట్టి పిదప బాపవిముక్తుడు కాగలడు.

పవిత్రభారతవర్షములో జన్మించి రాగి మొదలగు లోహములను దొంగిలించుపాపి బాజకుండ మనునరకమున బడగలడు. నాకింకరులు తీక్ష్ణబాణములచే నాపాపాత్ముని నేత్రములను బెకలించి దండప్రహారములచే బాధిం

తురు. తుద కాపాపాత్ముడు మూడుజన్మములపర్యంతము, నేత్రహీనుడై యేడుజన్మములవఱకు దరిద్రుడై దుఃఖించి పాపవిముక్తుడు కాగలడు. దైవ ప్రతిమలను, దైవద్రవ్యముల నపహరించుమానవుడు దుస్తరవజ్రకుండ మను నరకమును నిశ్చయముగ ననుభవింపగలడు. దేవతలయొక్క బ్రాహ్మణుల యొక్క రజతగవ్యవస్త్రాదిపదార్థములను దొంగిలించువ్యక్తి నిశ్చయముగ దప్తపాషాణ మనునరక మనుభవింపగలడు. తర్వాత ననేక జన్మములపర్యంతము నీచజంతుయోనులందు బుట్టి యల్పాయువగు మానవుడై జన్మించి రక్తవికారాద్యసహ్య రోగములచే బీడింపబడి తుదకు బాపవిముక్తుడు కాగలడు.

పుంశ్చల్యన్నం చ యో భుంక్తే పుంశ్చలీజీవ్యజీవనః ।
స్వలోమమానవర్షం చ లాలాకుణ్డే వసే ద్ధ్రువమ్ ॥ (94)

కులట యొసంగిన యాహారమును భుజించువాడామె సముపార్జించినట్టి ద్రవ్యముచే జీవించువాడు స్వలోమమానవర్షములు లాలాకుండ మనునరకములో బడి నిశ్చయముగ దుఃఖింపగలడు. తదనంతరము వాడు మానవుడై జన్మించి నేత్రరోగయుక్తుడై శూలాదిరోగములచే బీడింపబడగలడు.

సావిత్రీ! దేవ బ్రాహ్మణుల ధాన్యాదులచే సంపన్నమైనక్షేత్రములనుగాని, యాసనశయ్యాదులనుగాని, యపహరించువాడు చూర్ణకుండ మనునరకమున బడగలడు. బ్రాహ్మణులధన మపహరించి యాద్రవ్యముతో జక్రమును నిర్మించుమానవుడు చక్రకుండ మనునరకమును బొందగలడు. వందలకొలది సంవత్సరములు యమయాతనల ననుభవించి మూడుజన్మములవఱకు రోగియై నిస్సంతానుడై దుఃఖింపగలడు. సోదరులను, బంధువులను, బ్రాహ్మణులను గూరదృష్టితో వీక్షించుమానవుడు దీర్ఘకాలము వక్రకుండ మనునరక మనుభవించి యేడుజన్మములవఱకు నంగహీనుడై, దరిద్రుడై దుఃఖింపగలడు. దేవతలయొక్క, బ్రాహ్మణులయొక్క ఘృతమును దైలాదికముల నపహరించు పాపముచే జ్వాలాకుండ మనునరక మనుభవింపగలడు. దేవతలయొక్క సుగంధపదార్థముల నపహరించుమానవుడు దుర్గంధకుండ మనునరకమున బడి యహర్నిశలు దుస్సహదుర్గంధము ననుభవింపగలడు. సాధ్వీ! బలవంతుడైన వ్యక్తి మదాంధుడై యితరుల పైతృకభూమ్యాదులను బలముచేగాని, మోసముచేగాని, హింసించిగాని తనవశ మొనర్చుకొనిన నాతడు తప్తశూల మను

నరకకుండమున బడగలడు. ప్రతప్తతైలములో బడినజీవి జ్వలించునట్లు పాపాత్ముడు తప్తశూలనరకమున బడి నిరంతరము జ్వాలల కాహుతి కాగలడు, కాని యతని శరీరము భస్మము కాదు. ఎందువలన ననగా భోగదేహము (యాతనాశరీరము) నశింపదు. తదనంతర మాతడు నీచయోనులందు భ్రమించి తుదకు దరిద్రుడై జన్మించి భూహీనుడై దుఃఖింపగలడు.

సావిత్రీ! అత్యంతదారుణప్రవర్తనము గల్గి నిర్దయుడై ఖడ్గముచే జంతువులను ఖండించువాడు, ధనలోభమునకు వశుడై నరహంతకుడుగా మాఱి తోడి మానవుని సంహరించుపాపాత్ము డసిపత్రనరకమున బడగలడు. ఆనరకకుండములో నాకింకరు లీపాపాత్ముల యంగములను నిశితకరవాలములచే నిరంతరము ఖండించెదరు. ఆయాతనాదేహధారు లాహారముకొఱకు క్రాకందన మొనరింపగా భయంకరులైనయమదూతలు వారిని గదాప్రహారములచే హింసించెదరు. పిదప నాపాపులు నూఱులకొలదిజన్మములవఱకు జండాలురు, సూకరములు, కుక్కలు, మఱి యేడుజన్మములవఱకు శృగాలములు, వ్యాఘ్రములు మఱిమూడు జన్మములవఱకుతోడేళ్ళునై దుఃఖింపగలరు. పతివ్రతా! గృహములకు, గ్రామములకు, నగరములకు నిప్పంటించు పాపాత్ముడు మూడుయుగములపర్యంతము క్షురధార యనునరకమున బడి యమకింకరులచే హింసింపబడగలడు. పిదప నాతడు ప్రేతమై ముఖమునుండి యగ్నిజ్వాలలను గ్రక్కుచు జగములో బరిభ్రమింపగలడు. మఱి యేడుజన్మములవఱ కనేకఘోరరోగములచే బీడింపబడగలడు.

పరకర్ణోపజాపేన పరనిన్దాం కరోతి యః ।
పరదోషే మహాతోషీ దేవబ్రాహ్మణనిన్దకః ॥
సూచీముఖే స చ వసే త్సూచీవిద్ధో యుగత్రయమ్ ।
తతో భవేద్ వృశ్చికశ్చ సర్పః స్యా త్సప్తజన్మసు ॥ (126-127)

ఇతరులకర్ణములచెంత మోముంచి పరనింద నొనర్చువాడు ఇతరుల దోషములను దెలిసికొనుటలో విశేషస్పృహ కల్గి ప్రవర్తించువాడు, దేవతలను, బ్రాహ్మణులను నిందించువాడు మూడుయుగములపర్యంతము సూచీముఖమనునరక మనుభవింపగలడు. ఆనరకకుండములో వానియంగములు ఖండింపబడును. పిదప నాపాపాత్ము డేడేడుజన్మములపర్యంతము వృశ్చికము, సర్పము,

వజ్రకీటకము, అగ్నివర్షించుకీటకము నై నీచయోనులందు బరిభ్రమింప గలడు.

గృహములకు గన్నము వేసి వస్తువులనుగాని లేక గో ముఖ్యజీవులను గాని యపహరించువాడు గోధాముఖ మనునరకమున బడగలడు. నాకింకరులవలన హింసల ననుభవించుచు నాపాపాత్ముడు మూడుయుగములపర్యంత మానరకమున నుండవలెను. సాధారణవస్తువుల నపహరించువ్యక్తి నక్రముఖ మనునరకమున బడి యమయాతనల ననుభవించి పిడప బరిశుద్ధుడు కాగలడు. అశ్వములను, గోవులను, గజములను హింసించువ్యక్తి, యకారణముగ వృక్షములను ఖండించు పాపాత్ముడు గజదంశ మనునరకమున దీర్ఘకాలము యమయాతనల ననుభవింపగలడు. దప్పికగొని జలములను ద్రాగుచున్నగోవు నదలించుపాపాత్ముడు గోముఖ మనునరకమున బడి ప్రతప్తజలములలో యమయాతనల ననుభవించి తుదకు దరిద్రుడై, దీర్ఘరోగియై దుఃఖింపగలడు. గోవును, బ్రాహ్మణుని, స్త్రీని, యాచకుని, హత్యయొనరించువాడు, గర్భపతన మొనరించువాడు, నగమ్యయైనస్త్రీతో సమాగమ మొనరించువాడు ఘోరపాతకములకు గుఱియై కుంభీపాకనరక మనుభవింపగలడు. నాకింకరు లాపాపాత్ములను నిరంతరము తాడన మొనరించి, చూర్ణ మొనరించి, కంటకములచే బాధించి, ప్రజ్వలితతైలభాండములో బడవైచి, ప్రజ్వలితలోహదండములతో సదా హింసించెదరు. తదనంతరము వారు గ్రద్దలై, సూకరములై, కాకములై, సర్పములై, విష్టాకీటకములై యనేకనీచయోనులందు బరిభ్రమించి తుదకు దరిద్రులై, కుష్ఠరోగయుక్తులై దుఃఖించెదరు. వంశహీనులై, భార్యాహీనులై యక్ష్మరోగగ్రస్తులై తుదకు పాపవిముక్తులు కాగలరు.

**సావిత్రి పలికెను :**

దేవా! బ్రహ్మహత్య, గోహత్య, మొదలగుమహాపాపము లెట్లు సంభవించును? సంధ్యావిహీనులు నగమ్యాస్త్రీలతో సమాగమ మొనరించువారు, నదీక్షితులైనవారు నేయేపాపములకు గుఱి కాగలరు? వేదవిదాంవరా! ఈ విషయముల నన్నింటి నుపదేశింపుము.

**యమధర్మరాజు పలికెను :**

శ్రీకృష్ణే చ తదర్చాయాం మృణ్మయ్యాం ప్రకృతౌ తథా
శివే చ శివలిఙ్గే వా సూర్యే సూర్యమణౌ తథా ॥

గణేశే వా తదర్చాయా మేవం సర్వత్ర సున్దరి ।
కరోతి భేదబుద్ధిం యో బ్రహ్మహత్యాం లభేత్తు సః ॥ (149, 150)

సావిత్రీ! శ్రీకృష్ణపరమాత్మకు, తత్ప్రతిమకు, నన్యదేవతలకు, వారి వారివిగ్రహములకు, శివునకు, శివలింగమునకు, సూర్యునకు, సూర్యకాంతమణులకు, గణేశ్వరునకు, తత్ప్రతిమకు, భేదము కల్పించి భేదబుద్ధితో వర్తించువాడు శాస్త్రాజ్ఞానుసారముగ బ్రహ్మహత్యాపాతకమునకు గుఱికాగలడు.

ఆచార్యునందు, నిష్టదైవమందు, జన్మదాత్రియగు మాతయందు భేదబుద్ధి కల్గి వర్తించు వానికి బ్రహ్మహత్యా పాతకము సంభవించును. విష్ణుభక్తుల నన్యదేవతాభక్తులతో సమముగ భావించువాడు, బ్రాహ్మణులను, బ్రాహ్మణేతరులతో బోల్చువాడు బ్రహ్మహత్యాపాతకమునకు గుఱికాగలడు. విష్ణునైవేద్యమును, నన్యదేవతలనైవేద్యములను, హరిపాదోదకమును, నన్యదేవతల పాదోదకములను సమములని భావించువ్యక్తి బ్రహ్మహత్యాపాతకమునకు గుఱికాగలడు.

సర్వేశ్వరేశ్వరే కృష్ణే సర్వకారణకారణే ।
సర్వాద్యే సర్వదేవానాం సేవ్యే సర్వాన్తరాత్మని ॥
మాయయాఽనేకరూపే వాఽప్యేక ఏవ హి నిర్గుణే ।
కరోత్యన్యేన సమతాం బ్రహ్మహత్యాం లభేత్తు సః ॥ (154-155)

పరిపూర్ణతము డైన శ్రీకృష్ణపరమాత్మయే సర్వేశ్వరేశ్వరుడని తెలిసికొనుము. ఆయనయే సర్వకారణములకు గారణము. ఆసర్వాంతర్యామియైనయాదివ్యపురుషునే సకలదేవతలు సదా యుపాసింతురు. స్వయముగ ప్రాకృతికనిర్గుణు డైనయాపరబ్రహ్మ మాత్మమాయచే ననేకరూపధారియైనాడు. స్వతః శ్రీకృష్ణపరమాత్మ సచ్చిదానందవిగ్రహుడు. ఈపరబ్రహ్మము నితరులతో సమముగ బోల్చువారికి బ్రహ్మహత్యాపాతకము సంభవింపగలదు.

వేదములందు నిర్దేశించిన దేవతలయు బితరులయు బరంపరాగత పూజలనెవరు నిషేధింతురో వారు నిశ్చయముగ బ్రహ్మహత్యాపాతకమునకు గుఱికాగలరు.

యే నిన్దన్తి హృషీకేశం తన్మన్త్రోపాసకం తథా।
పవిత్రాణాం పవిత్రం చ బ్రహ్మహత్యాం లభన్తి తే॥ 57

పవిత్రులలో బరమపవిత్రు డైనహృషీకేశునిగాని, తన్మంత్రోపాసకు లనుగ్గాని. నిందించువారు బ్రహ్మహత్యాపాతకమునకు గుఱికాగలరు.

శివం శివస్వరూపం చ కృష్ణప్రాణాధికం ప్రియమ్।
పవిత్రాణాం పవిత్రం చ జ్ఞానానన్దం సనాతనమ్ ॥
ప్రధానం వైష్ణవానాం చ దేవానాం సేవ్య మీశ్వరమ్।
యే నార్చయన్తి నిన్దన్తి బ్రహ్మహత్యాం లభన్తి తే॥ [158-159]

కళ్యాణరూపుడు, కృష్ణప్రాణాధికప్రియుడు, పవిత్రులందు బరమ పవిత్రుడు, జ్ఞానానందస్వరూపుడు, సనాతనుడు, వైష్ణవప్రధానుడు, దేవతలచే సదా సేవింపబడువాడు నైనసీశ్వరు నర్చింపక ఆయనను నిందించు పాపాత్ములు బ్రహ్మహత్యాపాతకమునకు గుఱికాగలరు.

యే విష్ణుమాయాం నిన్దన్తి విష్ణుభక్తి ప్రదాం సతీమ్।
సర్వశక్తి స్వరూపాం చ ప్రకృతిం సర్వమాతరమ్ ॥
సర్వదేవీస్వరూపాం చ సర్వాద్యాం సర్వవన్దితామ్ ।
సర్వకారణరూపాం చ బ్రహ్మహత్యాం లభన్తి తే॥ (160-161)

విష్ణుమాయ, విష్ణుభక్తిప్రదాయిని, సాధ్వి, సర్వశక్తిస్వరూపిణి, సర్వ మాతయు, సర్వదేవీస్వరూపిణి, సర్వాద్యురాలు, సర్వవందితురాలు, సర్వ కారణస్వరూపిణి యైనప్రకృతిని నిందించువారు బ్రహ్మహత్యాపాతకమును బొందగలరు.

శ్రీకృష్ణజన్మాష్టమి, శ్రీరామనవమి, యేకాదశి, శివరాత్రి, రవివార వ్రతములు మానవుల కత్యంతపుణ్యప్రదములు. ఈపరమపవిత్రము లైనవ్రత ముల నాచరింపనిమానవుడు బ్రహ్మహత్యకు గుఱికాగలడు. భారతవర్షములో నివసించు వా రంబువాచీయోగములో ననగా నార్ద్రానక్షత్రప్రథమచరణ ములో బృథ్విని ద్రవ్వినను, జలములో మలమూత్రములను విసర్జించినను బ్రహ్మ హత్యాపాతకమునకు గుఱికాగలరు.

గురుం చ మాతరం తాతం సాధ్వీం భార్యాం సుతం సుతామ్ ।
అనాథా న్యో న పుష్ణాతి బ్రహ్మహత్యాం లభేత్తు సః ॥ [165]

సమర్థుడై యుండి గురువును, దల్లిని, దండ్రిని, సాధ్వియైనభార్యను, సుతుని, గోమార్తైను, ననాథ బంధువులను బోషింపనివానికి బ్రహ్మహత్య లభింపగలదు.

హరిభక్తివిహీనో యో బ్రహ్మహత్యాం లభేత్తు సః ।
హరే ర్నైవేద్యభోజీ నిత్యం విష్ణుం న పూజయేత్ ।
పుణ్యం పార్థివలిఙ్గం వా బ్రహ్మహత్యాం లభేత్తు సః [166, 167]

"హరిభక్తివిహీనులకు బ్రహ్మహత్యాపాతకము లభించును. శ్రీహరి కర్పింపనిదే భుజించువానికి, విష్ణుశ్రీవిగ్రహమును బుణ్యమయ పార్థివేశ్వరలింగమును బూజింపనివానికి బ్రహ్మహత్యామహాపాతకము సంభవించును".

గోవును హింసించుచున్నవారిని గాంచి నివారింపనివారు, గోబ్రాహ్మణులమధ్యనుండి వెడలిపోయెడివారు, గోహత్యాపాతకమునకు గుఱికాగలరు. గోవును దండములచే మోది పీడించువారలకు, వృషభముపై నధిరోహించి చరించువారలకు బ్రతిదినము గోహత్యాపాతకము లభింపగలదు. పాదములచే నగ్నిని స్పృశించినను, గోవుపై బొరపాటున జరణప్రహార మొనరించినను, బరిశుద్ధముగ స్నాన మాచరింపనిదే, పాదప్రక్షాళన మొనరింపనిదే గృహమును బ్రవేశించినను గోవధపాపము సంభవించును. స్త్రీసతీత్వమును విక్రయించి జీవించుభర్తకు, సంధ్యావిహీనునకు నిశ్చయముగ గోహత్యాపాతకము సంభవించును.

స్వభర్తరి చ కృష్ణే చ భేదబుద్ధిం కరోతి యా ।
కటూక్త్యా తాడయేత్కాన్తం సా గోహత్యాం లభేద్ ధ్రువమ్॥ 176

ఏస్త్రీ తనభర్తను, శ్రీకృష్ణుని వేఱుగ భావించి ప్రవర్తించునో, కఠోర వచనములచే భర్తహృదయమును నొప్పించి వానిని బీడించునో యట్టిస్త్రీకి ధ్రువముగ గోహత్యాపాతకము లభించును.

గోవు లాహారమును స్వీకరించు హరితక్షేత్రములను ద్రవ్వి మార్గమును నిర్మించినవారలకును, నాప్రదేశములో వ్యవసాయ మొనరించువారలకును గోహత్యాపాతకము లభింపగలదు. రాజకీయోపద్రవసమయములలో, ప్రాకృతిక ప్రకోపావసరములలో గోసముదాయముల రక్షింపక గోవులకు దుఃఖములను

గల్గించుమూఢపాలకు లవశ్యము గోహత్యాపాతకమునకుగురికాగలరు. దైవవిగ్ర హాభిషేకజలములను, నైవేద్యమును. నిర్మాల్యపుష్పములను దాటిన గోహత్యా పాతకము లభింపగలదు. అతిథులకు సదా లేదని చెప్పువారలకు, నసత్యము లాడువారలకు, నితరులను మోసగించువారలకు, దైవమును గురువును ద్వేషించువారలకు గోహత్యాపాతకము లభించుట నిస్సంశయము. దైవప్రతి మను, నాచార్యుని, సద్బ్రాహ్మణుని బరమభాగవతోత్తముని గాంచగనే వేగముగ శిరమును వంచి ప్రణామము లర్పింపనివానికి నిశ్చయముగ గోహత్యాపాతకము లభించును. తనకు బ్రణమిల్లినవ్యక్తిని క్రోధమువలన వశుడై యాశీర్వదింపని బ్రాహ్మణునకు, విద్యార్థికి విద్య నొసంగనియాచార్యు నకు నిస్సంకోచముగ గోహత్యాపాతకము సంభవింపగలదు.

గురుపత్ని, రాజపత్ని, సవతితల్లి, గర్భధాత్రి, కుమార్తె, కుమారుని భార్య, కన్య నొసంగినయత్త, సోదరి, సహోదరుని పత్ని, మేనత్త, పెంచిపెద్ద చేసినదాది, నాయనమ్మ,అమ్మమ్మ,చిన్నమ్మ(తల్లి సోదరి),సోదరునికోమార్తె సోదరునిభార్య, శిష్యురాలు, శిష్యునిపత్ని, సోదరకుమారునిపత్ని, వీరి నందరి నగమ్యలుగ బ్రహ్మదేవుడు నిర్ణయించెను. వీరిపై గామభావముతో దృష్టి సారించువారి నధమమానవు లందురు. వారినే మాతృగాములని వేదములు నొక్కి వక్కాణించినవి. బ్రహ్మహత్యాపాతకము సంభవించి వారు సర్వసత్కర్మములకు ననర్హు లయ్యెదరు. ఆమహాపాపులు దుస్తర కుంభీపాకనరకమున బడి దీర్ఘకాల మనేకదుఃఖము లనుభవించి తదనంతర మసంఖ్యాకనీచయోనులందు జన్మింపగలరు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని పాపులయాతనాదులను
నిరూపించుట యను ముప్పదియవ
అధ్యాయము
సంపూర్ణము.

—♦—

# ముప్పదియొకటవ అధ్యాయము

## పాపుల నరకకుండముల నిర్ణయము.

**యమధర్మరాజు పలికెను :**

> హరిసేవాం వినా సాధ్వీ న లభే త్కర్మఖణ్డనమ్ ।
> శుభకర్మ స్వర్గబీజం నరకం చ కుకర్మతః ॥ [1]

సాధ్వీ! శుభకార్యములు స్వర్గములకు బీజములు, దుష్కర్మములు నరకప్రదములు. శ్రీహరిని సేవించి యనన్యభక్తితో నారాధింపని దేహధారికి గర్మఖండనము లభింపదని గ్రహింపుము.

పుంశ్చలి, వేశ్య యొసంగినయన్నమును భుజించి వారితో సమాగమ మొనరించుబ్రాహ్మణుడు దేహత్యాగానంతరము కాలసూత్ర మనునరకమున బడి మరల మానవజన్మములో నసంఖ్యాకరోగములతో దుఃఖింపగలడు. ఒక భర్తనే సేవించు స్త్రీరత్నమే పతివ్రత యనబడును. రెండవవానితో సంబంధము కల్గినస్త్రీ కులట యనబడును. మూడవవానితో సంపర్కమేర్పఱచు కొనినస్త్రీ ధర్షిణి యని తెలిసికొనుము. నాల్గవవానితో జరించుస్త్రీయే పుంశ్చలి యనబడును. ఐదవవానితో, నాఱవవానితో సమాగమ మొనరించు స్త్రీయే వేశ్య యని గ్రహింపుము. ఏడవవానితో, ఎనిమిదవవానితో సంపర్కముగల్గినస్త్రీ యుగ్మి యనబడును. అంతకంటె ననేకపురుషులతో సంబంధము కల్గినస్త్రీయే మహావేశ్య. ఈమహావేశ్య సర్వులకు నస్పృశ్యురాలు. ఈక్రమమే పురుషులకుగూడ వర్తించునని గ్రహింపుము. కులటతోగాని, ధర్షిణితోగాని, పుంశ్చలితోగాని, యుగ్మితోగాని, వేశ్యతోగాని, మహావేశ్యతోగాని సమాగమ మొనరించినద్విజుడు నిశ్చయముగ నవటోద మను నరకమున బడగలడు. కులటాగామి నూఱుసంవత్సరములు, ధర్షిణీగామి నాల్గువందలసంవత్సరములు, పుంశ్చలీగామి యాఱువందలసంవత్సరములు, వేశ్యాగామి యెనిమిదివందలసంవత్సరములు, యుగ్మిగామి వేయిసంవత్సరములు, మహావేశ్యాగామి లక్షసంవత్సరములు అవటోదనరకమున బడి యమయాతనల ననుభవింపగలరు. తదనంతరము వీరు నీచజంతుయోనులందు

బరిభ్రమించి దుఃఖింపగలరు. మహావేశ్యాగామి యేడుజన్మములవఱకు వృక్షమై పడియుండగలడు.

సూర్యగ్రహణ సమయమున, నథవా చంద్రగ్రహణసమయమున భుజించుజ్ఞానహీను డై నమానవు డరుంతుద మనునరకమున బడగలడు. అతడు భుజించినయన్నకణము లెన్నియో యన్నిసంవత్సరము లానరకమందు దుఃఖ మనుభవించి మరల మానవుడై జన్మించి యుదరరోగముచే బీడింపబడగలడు. తదుపరి కర్ణహీనుడై, దంతహీనుడై, గుల్మరోగియై యిడుమలబడగలడు. కన్యసమ్మతి ననుసరించి యొకని కిత్తునని పలికి ఆ కన్యను మఱియొకనికి దాన మొసరించువ్యక్తి పాంసుభోజ మనునరకము జేరును. సాధ్వీ! దాన మొసంగి హరించిన వస్తువును మరల బరిగ్రహించువాడు పాశవేష్ట మనునరకమున నివసింప గలడు. ఆనరకములో పాపులు శయనించుట కంపశయ్యాలు లభించును. నాకింకరులదండప్రహారము లనహర్నిశము వారనుభవింపవలసివచ్చును. ఏదుష్టా త్ముల భయముచే సద్బ్రాహ్మణుడు కంపించునో, యెవరు సద్బ్రాహ్మణుని నిష్కారణముగ దండింతురో, యాశాసకులు ప్రకంపన మనునరకమున బడగలరు.

పతికోపవదనా కోపా త్స్వామినం యా చ పశ్యతి ।
కటూక్తిం చ వదతి యాతి చోల్కాముఖం చ సా॥ [19]

క్రోధభరితముఖముతో, రోషముతో దనపతిని వీక్షించి కఠినోక్తులాడు స్త్రీ యుల్కాముఖ మనునరక మనుభవింపగలదు.

నాకింకరు లాకఠినాత్మురాలిముఖములో నుల్కల నుంచి దండములచే నామె తలమీద ప్రహరించెదరు. తుద కాపాపిని మానవస్త్రీయై జన్మించి, రోగిణియై, విధవరాలై దుఃఖింపగలదు.

వేశ్య వేధనకుండమున బడగలదు, యుగ్మి దండతాడనకుండమున బడ గలదు, మహావేశ్య జాతిబంధనకుండమున బడగలదు, కులట దేహచూర్ణ కుండమున బడగలదు, స్వైరిణి దలనకుండమున బడగలదు, ధృష్టా శోష కుండమున బడగలదు. ఈపాపులను నిరంతరము నాకింకరులు హింసించుచు మల మూత్రములు మొదలగు నపవిత్ర పదార్థములను వారి కాహారముగ నొసంగెదరు.

తులసిని హస్తములో ధరించి యొనరించినప్రతిజ్ఞ పాలింపనివారు, నసత్యము బల్కువారు జ్వాలాముఖ మనునరక మనుభవింపగలరు. హస్తములో గంగాజలములనో లేక సాలగ్రామప్రతిమనో ధరించి యొనరించినప్రతిజ్ఞ పరిపాలింపనిమూర్ఖునకుగూడ జ్వాలాముఖనరకమే తప్పదు. దక్షిణహస్తమును పైకెత్తి ప్రతిజ్ఞయొనరించి పరిపాలింపనివారలకుగూడ జ్వాలాముఖనరకమే గమ్యము. దేవమందిరములోగాని లేక గోబ్రాహ్మణుల స్పృశించిగాని యొనరించినప్రతిజ్ఞను బాలింపనివారలకుగూడ నీనరకమే ప్రాప్తించును.

మిత్రద్రోహులు, కృతఘ్నులు, విశ్వాసఘాతకులు, కూటసాక్షులు మొదలగువారందఱు జ్వాలాముఖనరకము ననుభవింపక తప్పదు. ఆనరకములో బాపులకు బ్రితప్తాగ్నికణము లాహారముగ నీయబడును. నిరంతరము నాకింకరు లాపాపులను బహుయాతనలపాలు చేసెదరు. తులసిని స్పృశించి యసత్యశపథ మొనరించుపాపి యేడుజన్మములవఱకు జండాలయోనియందు జన్మింపగలడు. గంగాజలమును హస్తమునందు ధరించి యొనరించినప్రతిజ్ఞ పాలించని మానవుడైదుజన్మములవఱకు మ్లేచ్ఛుడై జన్మింపగలడు. దేవీ! సాలగ్రామమును స్పృశించి యొనరించిన ప్రతిజ్ఞను బరిపాలింపని దేహధారి యేడుజన్మములవఱకు మలకీటకమై దుఃఖింపగలడు. దైవప్రతిమను స్పృశించి యసత్యశపథ మొనరించువ్యక్తి వ్రణకీటకమై దుఃఖింపగలడు. దేవమందిరములో నసత్యము లాడువా రేడుజన్మములవఱకు నీచజన్మము లందగలరు. సద్బ్రాహ్మణునియెదుట బ్రతిజ్ఞ నొనరించి పరిపాలింపనివాడు మూడుజన్మములవఱకు మూగవాడై, బధిరుడై దుఃఖంపగలడు. మిత్రద్రోహి ముంగిసయై జన్మించును. కృతఘ్నుడు ఖడ్గమృగమై జన్మించును, విశ్వాసఘాతి వ్యాఘ్రమై జన్మించును, సభలో నసత్యసాక్ష్యములు బల్కువ్యక్తి భల్లూకమై జన్మించును. ఈపాపాత్ములు తాము నరకమునబడుటయేగాక తమ రేడేడుతరముల వారినిగూడ నరకమున బడవేయగలరు. అలసత్వముతో ధర్మవిహితనిత్యక్రియావిహీనుడైనవాడు, వేదవచనములందు శ్రద్ధలేక నిరంతరము కపటవృత్తితో శ్రుతులను బరిహసించువాడు, వ్రతోపవాసరహితుడు, నుత్తమసద్వాక్యసంపన్నులను నిందించువాడు, జింభము, హిమోదక మనునరకముల ననుభవింతును. దేవబ్రాహ్మణుల ధనాపహారులు తాము నరకమున బడుటయేగాక పదిపదితరముల తమపితరులను నరకమున బడద్రోయగలరు,

ఆపాపాత్ములు ధూమాంధకారముచే నిండియుండుధూమాంధనరక మనుభ వించెదరు. ఇట్లు ఘోరనరకముల ననుభవించివా రేడుజన్మములవఱకు మూషికములై, పక్షులై, కీటకములై పశువులై తుదకు వృక్షములై పరిత పించి యెట్టకేలకు బాపవిముక్తులు కాగలరు.

సావిత్రీ! యిట్లు నేను సువిఖ్యాతము లై ననరకకుండములను వర్ణించి తిని, ఇవిగాక యనేకనరకకుండములు గలవు. తమతమదుష్కర్మఫలముల ననుభవించుటకు బాపు లానరకములలో గ్రిక్కిరిసి దుఃఖించుచుందురు. కర్మ ఫలముల ననుభవించుటకే జీవులు నానావిధయోనులందు బరిభ్రమించు చుందురు. కర్మజన్యఫలముల ననుభవించు క్రమము నే నెంతవఱకు వర్ణింపగలను?

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణ మందలి
ప్రకృతిఖండములోని నారదనారయణసంవాదమున
సావిత్ర్యుపాఖ్యానమున నరకుండనిర్ణయ మను
ముప్పదియొకటవ అధ్యాయము
సంపూర్ణము.

---

# ముప్పదిరెండవ అధ్యాయము

## శ్రీహరిభక్తుల ప్రశంస, పాంచభౌతికదేహ నిరూపణము, యాతనాదేహ వర్ణనము.

**సావిత్రి పలికెను :**

యమధర్మరాజా! మహాభాగా! వేదవేదాంగపారంగతా! నానాపురా ణేతిహాసపాంచరాత్రప్రదర్శకా! సర్వులకు సారభూతము, సర్వసమ్మతము,

సర్వాభీష్టము, కర్మములను ఖండించుటలో గారణభూతము, సర్వశ్రేష్ఠము, మానవులకు సుఖప్రదము, యశోవర్ధకము, ధర్మప్రదము, సర్వమంగళ ప్రదము సర్వమానవదుఃఖనివారకమునైన కర్మమేది? యమయాతన లను నివారింపగల్గినది, నరకకుండదర్శనమును నరకకుండవాసములను దప్పింప గల్గినది, జన్మాదివికారములను నొందింపజాలనిది యగునుత్తమకర్మ మేది? సువ్రతా! జననమరణచక్రమునుండి జీవుల నుద్ధరింపగల యట్టిదివ్యకర్మమును గృపతో నా కుపదేశింపవలసినదిగా బ్రార్థించుచున్నాను. యమధర్మరాజా! నరకకుండముల యాకార మెట్లుండును? అవి యెట్లు నిర్మింపబడినవి? ఏయే పాపు లేయేరూపముల నరకముల ననుభవించెదరు? పృథ్విపై దేహము భస్మమైన తర్వాత మానవు డెట్టిదేహమును ధరించి లోకాంతరప్రయాణము సాగించి తనశుభాశుభకర్మఫలముల ననుభవింపగలడు? నరకములో నత్యంత క్లేశము ననుభవించినను బాపులదేహ మేల నశింపదు? ఆయాతనాశరీరము లెట్లు నిర్మింపబడినవి? సూర్యనందనా! నాయీసందేహముల నన్నింటి నత్యంతకరుణతో నివారింపుడని ప్రార్థించుచున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదమునీంద్రా! సావిత్రిపల్కిన ప్రశ్నముల నాలకించి యమధర్మ రాజు శ్రీహరిని స్మరించి గురువునకు నమస్కరించి తనప్రవచనమును నిట్లు కొనసాగించెను.

**యమధర్మరాజు పలికెను :**

వత్సే౽చతుర్షు వేదేషు ధర్మే వై సంహితాసు చ ।
పురాణే ష్వితిహాసేషు పాంచరాత్రాదికేషు చ ॥
అన్యేషు సర్వశాస్త్రేషు వేదాఙ్గేషు చ సువ్రతే॥
సర్వేష్టం సారభూతం చ మఙ్గలం కృష్ణసేవనమ్॥ (9-10)

కుమారీ! సువ్రతా! నాల్గువేదములు, సకలధర్మశాస్త్రములు, సంహితలు, పురాణములు, నితిహాసములు, పాంచరాత్రములు, సకలధర్మగ్రంథములు, నన్యధర్మశాస్త్రములు, వేదాంగములు మొదలగునవన్నియు కేవలము శ్రీకృష్ణపరమాత్మ సేవయే సర్వులకునేకైకాభీష్టము, సకలసారభూతము, మంగళ ప్రదమునని నొక్కి వక్కాణించినవి.

జన్మమృత్యు జరారోగ శోకసన్తాప తారణమ్ ।
సర్వమఙ్గలరూపం చ పరమానన్దకారణమ్ ॥
కారణం సర్వసిద్ధీనాం నరకార్ణవతారణమ్ ।
భక్తివృక్షాఙ్కురకరం కర్మవృక్షనికృన్తనమ్ ॥
గోలోకమార్గసోపాన మవినాశిపదప్రదమ్ ।
సాలోక్యసార్ష్టిసారూప్యసామీప్యాదిప్రదం శుభే ! ॥ (11-13)

కల్యాణీ ! శ్రీకృష్ణసేవ జన్మమృత్యుజరారోగసంతాపములనుండి దేహధారుల నుద్ధరింపగలదు. ఆహరిసేవాసౌభాగ్యము సర్వమంగళరూపము, పరమానందమున కేకైకకారణము. శ్రీకృష్ణారాధనము జీవులను నరకార్ణవమును దరింపజేసి వారిసర్వసిద్ధులకు గారణము కాగలదు. సాధ్వీ ! శ్రీకృష్ణసేవ కర్మవృక్షమును ఖండించి భక్తివృక్షాంకురకరమై విరాజిల్లును. శ్రీకృష్ణభక్తి గోలోకమార్గమునకు సోపానసదృశము, అక్షరపదప్రదము. తదారాధనము సాలోక్య, సార్ష్టి, సారూప్య, సామీప్యాది మోక్షప్రదమని గ్రహింపుము.

అనగా కేవలముశ్రీహరిసేవయే యీభవసాగరమును దరించుట కేకైక సాధనమని తెలిసికొనుము. శ్రీకృష్ణానన్యభక్తియోగమే సర్వకర్మములందు శ్రేష్ఠకర్మమని గ్రహింపుము.

సాధ్వీ! శ్రీకృష్ణకింకరులు నరకకుండములనుగాని, యమదూతలనుగాని, నన్నుగాని (యమధర్మరాజునుగాని) స్వప్నమందైనను దర్శింపరు.

నిరంతర మేకాదశీవ్రతమును బరిపాలించువారు, వైష్ణవతీర్థములందు జితేంద్రియులై స్నానమాచరించెడివారు, నిత్యము శ్రీహరి కనన్యభక్తితో బ్రణామము లర్పించి పూజించువారు, భయంకర మైననాసంయమనీపురమునకు రావలసినపనిలేదు. గరుత్మంతుని గాంచి కంపించుసర్పములవలె హరిభక్తులను గాంచి నాకింకరులు భయమొందెదరు. నాదూతలు పాశహస్తులై మర్త్యలోకమునకు బయలుదేరుసమయమున వారలకు నే నిట్లా దేశింతును. "దూతలారా ! శ్రీకృష్ణభగవానునిభక్తులయాశ్రమములుదక్క నన్యప్రదేశములందు సంచరింపుడు". శ్రీకృష్ణమంత్రోపాసకులనామము వినినంతమాత్రముననే యమలోకవాసులు భయభీతులయ్యెదరు. శ్రీహరిభక్తులకు జిత్రగుప్తుడైనను రెండుహస్తములను ముకుళించి స్వాగతము పల్కవలసినదే. బ్రహ్మలోకమును దాటి గోలోకమునకు బ్రస్థానమొనరించుశ్రీకృష్ణభక్తులకు స్వయముగ విధాత

మధుపర్కముల నర్పించి సత్కరించును. సావిత్రీ! ప్రజ్వలితాగ్నిజ్వాలలలో బడి తృణములు, శుష్కకాష్ఠములు భస్మములగునట్లు శ్రీకృష్ణభక్తునిస్పర్శమాత్రమునసే దేహధారుల సకల పాపపుంజములు భస్మీపటలములు కాగలవు. హరిసేవకులను గాంచిన మోహముసహిత మత్యంతభీతయై సమ్మోహము నొందగలదు. కామము, క్రోధము, లోభము, మృత్యువు, శోకము, జర, భయము, కాలము, శుభాశుభకర్మములు, హర్షము, భోగము మొదలగున వన్నియు శ్రీహరిభక్తులను గాంచగనే ప్రభావశూన్యములై యదృశ్యములు కాగలవు.

పతివ్రతాశిరోమణీ! యమయాతనలకు గుటికానివారిప్రవృత్తి నిట్లు వర్ణించితిని. జీవుడు ధరించు దేహము నాగమానుసారముగ వర్ణించెద నాలకింపుము. పృథ్వి, జలము, తేజము, వాయువు, ఆకాశము- అనునీపంచతత్త్వములే స్రష్టయొక్కసృష్టివిధానములో దేహధారుల దేహముల కుపాదానకారణములు. పృథివ్యాదిపంచభూతములచే నిర్మింపబడిన జీవుల దేహములు కృత్రిమములుగావున నిశ్చయముగ నశింపగలవని తెలిసికొనుము. కావున జీవుల దేహములవనిపైనే భస్మములు కాగలవు. జీవుడు పాంచభౌతిక దేహమును త్యజించిన పిదప నాసంకల్పముచే సూక్ష్మశరీరమును (యాతనాదేహమును) ధరించును. ఆయాతనాదేహము నాలోకములో నరకప్రజ్వలితాగ్నిజ్వాలలందు బడవైచినను నశింపదు. జలములందు బడవైచినను, దీర్ఘకాలము ప్రహారములచే హింసించినను విఘటితముకాదు. అస్త్రములు, శస్త్రములు, తీక్ష్ణకంటకములు, ప్రతప్తతైలము లేక జలములు, ప్రజ్వలితలోహము, తపించుపాషాణములు, ప్రతప్తలోహప్రతిమలు, జీవులయాతనాదేహమును నశింపజేయలేవు. వా రెన్ని సంతాపముల ననుభవించినను వారిదేహములు నశింపవు. పాపకర్మఫలములను సంపూర్ణముగ ననుభవించనంతవఱకు జీవుని యాతనాశరీరము వీడదు. సతీ! యాతనాశరీరవృత్తాంత మిట్లువర్ణించితిని, ఇక నీకు నరకకుండములలక్షణములను వర్ణించెద నాలకింపుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణసంవాదమున
సావిత్ర్యుపాఖ్యానమున యాతనాదేహ
నిరూపణ మనుముప్పదిరెండవ
అ ధ్యా య ము
సంపూర్ణము.

# ముప్పదిమూడవ అధ్యాయము

## యమలోకస్థ నరకకుండ
## లక్షణ వర్ణనము.

**యమధర్మరాజు పలికెను :**

సావిత్రీ ! అన్ని నరకకుండములు పూర్ణిమాచంద్రునివలె గుండ్రముగ నుండును. అవి యనేకపాషాణకంటకయుక్తములై చాలలోతుగ నుండును. ప్రళయకాలమునగూడ నీనరకకుండములు నశింపవు. పాపాత్ములైనజీవులకు క్లేశములను గల్గించుటకే శ్రీహరి యీభయంకరనరకకుండములను నానారూపముల నిర్మింపజేసెను. శతహస్తపరిమితప్రజ్వలచ్ఛిఖాన్వితమై, జ్వాలదంగార రూపమై, మహావిస్తృతమై, భయభీతులై యేడ్చు నసంఖ్యాక పాపులతో మహాభయంకరముగ గోచరించునరకప్రదేశమే యగ్నికుండనరక మనబడును. సదా నాదూతలు పాపులపై ప్రహారము లొనరించుచు నరకకుండముల రక్షణమందు దత్పరులై యుందురు. ప్రతప్తోదకపూర్ణమై, హింస్రజంతుసమన్వితమై, మహాఘోరాంధకారభరితమై, పాపులసంఘములచే సంకులమై, యత్యంతవిస్తృతమై మహాభయంకరముగ గోచరించునరకప్రదేశమునే ప్రతప్తోదకకుండమందురు. ఆనరకములోని పాపులు నాకింకరులకఠినప్రహారములకు గుఱియై హెచ్చుగ దుఃఖింతురు. తప్తక్షారోదకపరిపూర్ణమై, నఖములచే బరివేష్టితమై,యసంఖ్యాక పాపులతో నిండి, యత్యంతవిస్తృతమై, భయంకరముగ గోచరించునరకప్రదేశమునే తప్తక్షారోదకకుండ మందురు. ఆహారములేక శుష్కకంఠోష్ఠతాలువులతో నటునిటు పరుగిడుచు నాదూతలప్రహారములకు దటుకొనలేక త్రాహి, త్రాహి యని యాక్రందించుస్థలమునే విణ్మూత్రకుండ మందురు. ఆదారుణ నరకము మలమూత్రములచే బహుదుర్గంధయుక్తము, ఆనరకవాసులయాతనా దేహములను సదా కీటకములు బాధించుచుండగలవు.ప్రతప్తమూత్రముచే,నసంఖ్యాకమూత్రకీటకములచే బహువిస్తృతమై భయంకరముగ గోచరించు నరకమే మూత్రకుండనరకము. ఆనరకములో బాపాత్ములు విషకీటకములపాల్బడి దుఃఖింతురు. శ్లేష్మపూర్ణమై, విస్తృతమై, యసంఖ్యాకకీటకభరితమై యుండునరకమునే శ్లేష్మకుండమందురు. ఈనరకములోనిపాపులకు శ్లేష్మాద్యపవిత్రపదార్థములాహారముగ నీయబడును. ఆదుర్గంధాహారమును భుజింపలేక పాపులు శుష్క-

కంఠోష్ఠతాలువులతో శోకించెదరు. వారిశరీరమును గీటకములు తొలిచి బాధిం
చును. విషభక్షకు లైనపాపులతో, విషకీటకములతో నిండి, మిగులవిస్తృతమై
భయంకరముగ నుండునరకప్రదేశమే గరకుండ మనబడును. సర్పాకారము గల్గి
వజ్రదంతములు గల్గి క్షుధాశుష్కకంఠము లగుభయంకర జంతువులానరకము
లోనిపాపులను హింసించును. నేత్రమలయుక్తమై, యత్యంతవిస్తృతమై,
పాపుల కనంతక్లేశములనుగూర్చునరకప్రదేశమునే నేత్రమలకుండ మందురు.

వసారసముతో నిండి విస్తృతమై బహుదుస్సహమైననరకప్రదేశమునే
వసాకుండ మందురు. ఆనరకములో యమదూతలచే దండింపబడుచు దుఃఖిం
చుచు వసారసమునే ద్రావుచు బాపాత్ములు యమయాతనల ననుభవింతురు.
శుక్రపూర్ణమై, శుక్రకీటకభరితమై భయంకరముగ గోచరించునరకమునే శుక్ర
కుండ మందురు. ఆనరకములో శుక్రకీటకములు భక్షించుచుండగ బాపాత్ము
లత్యంతవ్యాకులతతో నాక్రందనముల నొనరింతురు. దుర్గంధరక్తపూర్ణమై,
వాపీగంభీరమై పాపసమూహములచే సంకులమై యుండుభయంకరనరకమునే
రక్తకుండ మందురు. ఆనరకములో రక్తమును బీల్చుప్రాణులు, భక్షించుకీటక
ములు, పాపులను హింసింపగలవు. అసంఖ్యాక పాపిజనసంకులమై తదశ్రుధారా
పరిపూర్ణమైన భయంకరనరకమునే యశ్రుకుండనరక మందురు. ఆకుండములోని
కీటకములు తమదేహములను భక్షించుచుండగ బాపు లత్యంతక్లేశములకు
గుఱియై దుఃఖింతురు. శరీర మలమును భక్షించుపాపాత్ములచే నిండియున్న
నరకమునే గాత్రమలకుండనరక మందురు. కీటకములు హింసించుచుండ నాకిం
కరులు ప్రహరించుచుండ జీవు లానరకములోబడి దుఃఖింతురు. కర్ణమలభక్షకు
లైనపాపులచే సంకులమై విస్తృతమై యుండునరకమును గర్ణవిట్కుండ
మందురు. విషకీటకములకు గుఱియై యేడ్చుపాపులచీత్కారములచే నానరకము
ప్రతిధ్వనించును. అత్యంతదుర్గంధయుక్తమై మహాపాపులచే సంకులమై భయం
కరముగ గోచరించునరకమునే మజ్జాకుండ మందురు. నాదూతలచే బీడింపబడు
పాపాత్ములతో నిండి మాంససమన్వితమైన నరకమును మాంసకుండ మందురు.
బహువిస్తృతమైనయీనరకములో భయంకరప్రాణులు పాపులను హింసించును.
వధువునుగాని, వరునిగాని విక్రయించినపాపాత్ము లీనరకమున బడి మాంసభక్ష
కులై తమదేహములను గీటకములు భక్షించుచుండ నాబాధను భరింపలేక
త్రాహి త్రాహి యని ఆక్రందనముల నొనరింతురు. వాపీసమప్రమాణములై

నఖాదులతో నిండిననాల్గునఖకుండములు కలవు. ఈనాల్గునరకములలోని పాపులు నాకింకరులచే హింసింపబడెదరు.

జ్వలించుతామ్రసదృశ మైననరకమే ప్రతప్తతామ్రకుండము. ప్రజ్వలితాసంఖ్యాకతామ్రప్రతిమ లానరకమం దంతట నిండియుండగలవు. పాపులనాప్రతప్తతామ్రప్రతిమలతో గలిపి యమదూతలు బంధింతురు. తాపమునకు దాళలేక పాపు లాక్రందన మొనరింతురు. ప్రజ్వలితలోహదండములతో, నగ్నికణములతో బరిపూర్ణమై యుండునరకమునే ప్రతప్తలోహకుండ మందురు. ఆనరకము బహులక్షప్రజ్వలితలోహప్రతిమచే బరిపూర్ణము. పాపులను యమకింకరులు ప్రజ్వలితలోహప్రతిమలతో గలిపి బంధింతురు. నిరంతరము నిష్ఠురతాపమును భరింపలేక చీత్కారము లొనరించుచు 'త్రాహి త్రాహి'యని పాపులు దుఃఖింతురు. అత్యంతాంధకారసమన్వితమై, చర్మభక్షకులచే సురాపాన మొనరించుపాపులచే సంకులమై యుండునరకములను జర్మకుండనరకమని లేదా తప్తసురాకుండనరకమనియందురు. శాల్మలీవృక్షముక్రింద దీక్ష్ణకంటకములచే నిండినభయంకరనరకకుండము కలదు. ఆవిస్తృతనరకములో లక్షలకొలదిపాపులు వృక్షముపైనుండి తమపై దీక్ష్ణకంటకములు వర్షింపగా నాబాధకు దాళరేక దుఃఖింతురు. ఆ తీక్ష్ణకంటకములు తమసర్వాంగములను ఛేదింపగా శుష్కోష్ఠతాలుకాదులచే మహార్తులై భయభీతులై పాపులు తమ్ము సంహరింపుడని యేడ్తురు. తక్షకుడు మొదలుగా గలవిషసర్పసమూహములచే బరిపూర్ణమై, యసంఖ్యాకపాపులచే సంకులమై భయంకరముగ గోచరించునరకమునే ప్రతప్తవిషకుండమందురు. ఈనరకములో నాకింకరులు హింసింపగా బాపులు విషమునే యాహారముగ భుజింతురు. ప్రతప్తతైలముచే నిండియున్న భయంకరనరకమునే ప్రతప్తతైలకుండ మందురు. ప్రతప్తతైలము నానరకములోనిపాపులు త్రాగవలెను. సదా జ్వలించుచున్న కారణమున నానరకములోనికీటకము లేని నివసింపలేవు. కాని నాకింకరు లొసంగు యమయాతనలకు గుఱియై పాపు లానరకమున నివసింపవలయును.

త్రిశూలములవలె నత్యంతతీక్ష్ణము లైనకోణములు కల్గి లోహమయశస్త్రములతో నిండియున్న నరకమే శస్త్రకుండము. అత్యంతవిస్తృత మైన యానరకకుండము చూచుటకు శస్త్రములశయ్యవలె గోచరించును. బల్లెములచే ఛేదింపబడినశరీరములతో నసంఖ్యాకు లైనపాపు లందు నిండియుందురు.

సాధ్వీ! సర్పసదృశము లైనయెన్నో భయంకరకీటకములచే నిండియున్న నరకమే కృమికుండము. వికృతవదనములు గల్గినయాకీటకములదంతము లత్యంత తీక్ష్ణములు. ఆనరకము మహాంధకారబంధురము. పూయభక్షకు లైనబహు ప్రాణులచే నిండి పాపులను హింసించునరకమే పూయకుండము. పెక్కు సర్పములచే నిబిడమై చాలభయంకరముగ లోతుగనుండి పాపుల యేడ్పులతో బ్రతిధ్వనించునరకమే సర్పకుండము. సర్పకుండనరక మత్యంత విస్తృతము, హిమజలభరితము. సర్పము లందలి పాపులయాతనాదేహములకు జుట్టుకొని విషమును గ్రక్కుతమవాడికోరలతో బాపులను హింసించును. మశకాదిక్రూర జంతువులతో నిండి పాపులను హింసించునరకములే మశకకుండము, దంశ కుండము, గోలకుండము. హస్తముల బంధించి నాకింకరులు పాపులను క్షత గాత్రుల నొనరించెదరు, పాపులు రక్తసిక్తదేహులై చీత్కారము లొన రించెదరు. వజ్రములచే, వృశ్చికములచే సందులేకుండునరకములనే వజ్ర దంష్ట్రకుండ, వృశ్చికకుండము లందురు. అత్యంతవిస్తృతమై లైనయానర కములలో బాపులు వజ్రములచే వృశ్చికములచే బీడింపబడెదరు. నిశితాయు ధములచే వ్యాప్తమై పాపులయాతనాశరీరములను జీల్చిచెండాడునరకములే శర కుండ, శూలకుండ, ఖడ్గకుండనరకములు. రక్తసిక్తదేహులై పాపు లీనర కములలో నరుణవర్ణయుక్తులై గోచరింతురు. ఘోరాంధకారవ్యాప్తమై, సంతప్తపంకిలపూర్ణమై యుండునరకమే గోలకుండము. భయంకరకీటకము లీనరకములోనిపాపులశరీరమును దొలిచి పీడింపగలవు. నాకింకరులప్రహారము లకు దాళలేక కీటకములహింసను భరింపలేక పాపులు నిరంతర మీనరకములో దుఃఖముల ననుభవింతురు.

అత్యంతదుర్గంధభరితమై పాపులకు నిరంతరము దుఃఖములను గల్గించు నరకమే నక్రకుండము. ఆనరకములో వికృతాకారము కల్గినభయంకర నక్రాదిజంతువులు పాపులను హింసించగలవు. మలమూత్రములచే, భయం కరకాకములచే, శ్లేష్మభక్షకు లగుపెక్కురుపాపులచే సంకులమై యున్ననరకమే కాకకుండము. వికృతాకారములు గల్గిన లెక్కలేనన్ని పెద్దకాకము లీనరకము లోనిపాపులను బాధించును. సంచానములను, బాజము లనెడిభయంకరపక్షులచే నిండి యవి హింసింపగానేడ్చు పాపులచీత్కారములచే బ్రతిధ్వనించువిస్తృత నరకములే సంచానకుండము, బాజకుండము. వజ్రసమానదంతములు గల్గిన

భయంకరజంతువులచే నిండి యంధకారబంధుర మైననరకమే వజ్రకుండము. ప్రతప్తపాషాణములచే వ్యాప్తమై, ప్రజ్వలితాగ్నికీలాభరితమై పాపుల యేడ్పులచే మార్మ్రోగునరకమే తప్తపాషాణకుండము, మహాపాపులచే సంకులమై, తీక్ష్ణపాషాణభరితమై యున్ననరకమే తీక్ష్ణపాషాణకుండము. రక్తసిక్తదేహులైనపాపుల సంకులమైయున్న నరకమే లాలకుండము, నాదూతలచే వంతప్తులై ప్రాణు లీనరకమం దంతట నిండి దుఃఖించుచుందురు. కాటుకవంటి వర్ణము గల్గినసంతప్తపాషాణములచే నిర్మింపబడిన నరకమే మసీకుండము. కాలినయిసుకతో నిండి విస్తార మైననరకమే చూర్ణకుండము. ఆనరకములో జ్వలించుచున్నయిసుకలో బడి పాపులు నిరంతరము దుఃఖింతురు. కుమ్మరి వానిచక్రమువలె గిరగిర భ్రమించునరకమే చక్రకుండము. ఈనరకములో బదునాఱుకోణములు గలచక్రములు పాపులయంగములను ఖండింపగలవు. అత్యంతవక్రముగ, ద్విగవ్యూతిప్రమాణమై, కందుకాకారమున నిర్మింపబడి తప్తోదకసమన్వితమై, ఘోరజలజంతువులచే భక్షింపబడుమహాపాతకులతో యుక్తమై, మహాంధకారబంధురమై యున్ననరకమే కూర్మకుండము. ఈనరకములో లెక్కింపరానన్ని కూర్మములు పాపుల యాతనాదేహములను గబళింపగలవు.

ప్రజ్వలజ్జ్వాలలచే వ్యాపించియున్ననరకమే జ్వాలాకుండము. జ్వలించు భస్మముతో నిండి యత్యంతవిస్తృత మైననరకమే భస్మకుండము. ఈనరకములలోబడి తాపమునకు దాళలేక ప్రజ్వలితభస్మమును భుజింపలేక పాపులు దుఃఖింతురు. ప్రతప్తలోహముచే బరిపూర్ణమై, కాలినగాత్రములు గల్గిన పాపులచే సంకులమై యుండునరకమే దుగ్ధకుండము. సర్వత్ర అంధకారబంధుర మైనయీనరకములోనిపాపులు మండెడిలోహమును ద్రాగవలెను. పెద్దతరంగములు గల్గి సలసలకాగినతూరతోయసంయుతమై, నానావికృతజలజంతుసమన్వితమై, భయంకరమై గోచరించునరకమే తప్తోర్మికుండము. బహువిస్తృతమై, చిమ్మచీకటితోనుండి పాపులను హింసించునరకమే ప్రతప్తసూచీకుండము. ఈభయానకనరకములలో నొకరినొకరు గానలేక యమయాతనలకు దాళలేక పాపులు సదా యేడ్చుచుందురు. ఖడ్గములవలె తీక్ష్ణములై పత్రములు గల్గిన తాటిచెట్లచే నిండియున్ననరకమే యసిపత్రకుండము. యమకింకరులు పాపుల నాచెట్లపై బడద్రోయ క్షతగాత్రులై రక్తసిక్తదేహ

ములతో వారు దుఃఖింతురు. అత్యంతవిస్తృతమై, యంధకారబంధురమై రక్తకీటకములచే నిండి ఖడ్గసమతీక్ష్ణాస్త్రసమన్వితమై భయంకరముగా నున్న నరకమే క్షురధారాకుండము. సూదిమొనలుగల యస్త్రములచే బాపులీనరకములో బీడింపబడెదరు. పాపుల కత్యంతదుఃఖముల గలిగించుచు. వారిరక్త ధారలచే నిండియున్న నరకమే సూచీముఖము. గోధాసదృశముఖద్వారము కల్గి మహాంధకారబంధుర మైనబావివలె లోతుగా నున్న నరకమే గోధాముఖ కుండము. నక్రకీటకములచే నిండి పాపుల కనేకదుఃఖములను గల్గించుకుండమే నక్రకుండము. కుండాకృతి గల్గి గజేంద్రసమూహములచే వ్యాప్తమై గజ దంతహతు లైనపాపులచే బరిపూర్ణమై వారియాక్రందనములచే బ్రతిధ్వనించు నరకమే గజదంశకుండము.

గోముఖాకృతి గల్గి, కూపరూపమై గంభీరమై పాపుల కెన్నోదుఃఖముల నొసంగగల నరకమే గోముఖకుండము. అత్యంత భయంకరమై సతతము కాల చక్రప్రేరితమై భ్రమించుకుంభాకారము గల్గినఘోరవిస్తృతనరకమే కుంభీపాక నరక మనబడెను. మహాంధకారబంధుర మైనయీనరకము లక్షనిలువుల లోతు గలది. ఈనరకములోనే తప్తతైలము, తామ్రకుండము మొదలుగాగల యనేకవిభాగములు కలవు. మహాపాపులు నరకయాతనల ననుభవింపలేక యీనరకములో స్పృహదప్పి పడియుందురు. భయంకరకీటకములు పీడింపగా నార్తనాదము లొనరించుచు నొకరినొకరు గానలేక క్షణక్షణము మూర్ఛిల్లుచు నెల్లెడల దొర్లెదరు. పతివ్రతాశిరోమణీ! అన్ని నరకములలో నెందఱుపాపులు కలరో వా రందఱిదశ యిట్లే యుండును. నాకింకరులతాడనముచే గ్రింద బడుచు లేచుచు బాపు లేడ్చుచుందురు. కుంభీపాకనరకములో నంతర్గత ములై యున్న పెక్కునరకములు దానికంటె నాల్గురెట్లుకష్టప్రదములు. సుదీర్ఘ కాలము హింసింపబడినను యాతనల ననుభవించు యాతనాదేహములు నశిం పవు. కుంభీపాకనరకమే సకలనరకకుండములందు బ్రధానమని తెలిసికొనుము. కాలనిర్మిత మైనసుదృఢకాలసూత్రముచే బంధింపబడినపాపులు నివసించు నరక మునే కాలసూత్రనరకకుండ మందురు. నాకింకరు లీనరకములోని పాపులను సలసలగ్రాగుజలములలో బడవైచి సదా హింసించెదరు. సాధ్వీ! నరక మను భవించుప్రాణుల కీనరక మత్యంతదుస్సహము. అవటకుండము, మత్స్యోద కుండ మనునరకములు బహువిస్తృతములై సంతప్తజలపూర్ణములై యుండును.

నాదూతలచే సదా తాడింపబడునరకమే యవటోదకుండము. ఈనరకజలముల స్పర్శము గలుగగనే పాపులను సకలవ్యాధు లావహింపగలవు.

అసంతుదమను లనుకీటకములచే హింసింపబడి 'హాహా'కారము లొనరించు పాపులచే సంకులమై యుండునరకమే యసంతుదకుండము. అగ్నివలె మండు చున్నధూళితో వ్యాప్తమై యున్ననరకమే పాంసుకుండము. ఈనరకములోని పాపులశరీరము సదా జ్వాలల కాహుతికాగలదు. వారు భుజించుటకు కేవల మగ్నివలె మండుచున్నధూళి లభింపగలదు. ఏనరకములోబడగనే పాపులు పాశములచే బంధింపబడి హింసింపబడెదరో యానరకమునే పాశవేష్టకుండ మందురు. ఏనరకములో బడగనే పాపాత్ములు తీక్ష్ణశూలములకు గురియై దుఃఖింతురో యానరకమే శూలప్రోతకుండము. హిమసదృశజలభరితమై యతిశీతలత్వముచే గంపించుపాపులతో నిండియుండునరకమే ప్రకంపనకుండము. జ్వలించుచున్న యుల్కలను బలవంతముగా బాపులచే మింగించునరకమే యుల్కాముఖకుండము. చిమ్మచీకటితో నిండి లక్షనిలువులలోతు కల్గి యెంతో విస్తృతమై, కూపసదృశమై, భయంకరకీటభరితమై యున్ననరకమే అంధకూపనరకము. కీటకములు బీడించుచుండగా నిరంతర మీనరకములోని పాపులు దుఃఖింతురు. వారు త్రాగుటకు బ్రతప్తజలములే లభించును. ఏనర కములోనిపాపు లనేకశస్త్రములచే ఖండింపబడెదరో యానరకమునే వేధనకుండ మందురు. యమకింకరుల దండప్రహారములచే నిరంతర మాక్రోశించుపాపు లతో సంకులమై యున్ననరకమును దండతాడనకుండ మందురు. ఏనరకములో బడగనే పాపులు మీనములవలె వలలలో జిక్కుకొందురో యానరకమును జాల రంధ్రకుండ మందురు. ఏనరకములో బడగనే పాపులదేహములు చూర్ణము లగునో దానిని దేహచూర్ణకుండ మనిరి. ఎన్నియో నిలువులలోతై మిగుల విస్తృతమై, ప్రకాశరహితమై, యమకింకరులచే బీడింపబడుపాపులచే సంకులమై యుండుఘోరనరకమే దలనకుండ మనబడెను.

ఏనరకములో బడగనే పాపుల కంఠోష్ఠతాలుకాదుల్లు శుష్కము లగునో, తప్తవాలుకావ్యాప్తమగునో, విస్తృతమో, శతమానవమానమో, ఘోరాంధకారబంధురమో, పాపుల కతిదుఃఖప్రదమో, దానినే శోషణకుండ మందురు. నానాచర్మకాషాయోదకములచే నిండి విస్తృతము శతమానవ మానము, గంభీరము, దుర్గంధయుక్తము, యనేకపాపులచే సంకులమునై

యుండునరకమే కుపకుండనరకము. సాధ్వీ! ఏనరకముఖము శూర్పాకారమో, తప్తలోహవాలుకా (యిసుక) మయమో, పాపాత్ములచే బరిపూర్ణమో, చాలవిస్తృతమో యానరకమే శూర్పకుండము. దుర్గంధయుక్తమైనయా నరకములో బ్రతప్తలోహవాలుకముల దినుచు దుర్గంధము భరింపలేక, తాప మును సహింపలేక పాపులు దుఃఖింతురు. అగ్నిజ్వాలాభరితము, సంతప్తరేణు సమన్వితము, మహాబాపులచే సంకులమునై యుండునరకమే జ్వాలాముఖ కుండము. ఈనరకములో జ్వాలలకు గుఱియై పాపులు యమయాతనల ననుభ వింతురు. ఏనరకములో బడగనే పాపులు మూర్ఛిల్లెదరో, యేదిదప్తేష్ట కాభ్యంతరమో దానినే జింభకుండ మందురు. ధూమాంధకారనిబిడము, పొగచే నేత్రముల బోగొట్టుకొనినపాపులచే సంకులమునై యుండునదియే ధూమాంధకుండ మనబడెను. ఏనరకములో బడగనే పాపులను సర్పములు బంధించి హింసించునో యాఘోరనరకమునే నాగవేష్టకుండ మందురు. దేవీ! సకలనరకకుండములందు నాకింకరులు పాపులను దండించుచు ననేకవిధముల హింసించెదరు. పాపులకొఱకై నిర్మింపబడిన యీఘోరనరకము లసంఖ్యా కములని తెలిసికొనుము. నే నెనుబదియాఱుప్రధాననరకములను వర్ణించి వాని లక్షణముల విశదీకరించితిని. సాధ్వీశిరోమణీ! మఱియేవిషయములను శ్రవణమొనరింపగోరుచున్నావో తెల్పుము.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణ మందలి
ప్రకృతిఖండములోని సావిత్ర్యుపాఖ్యానమున
యమలోకస్థనరకకుండలక్షణ
వివరణ మనుముప్పదిమూడవ
అధ్యాయము
సంపూర్ణము.

—♦—

# ముప్పదినాల్గవ అధ్యాయము

## శ్రీకృష్ణ స్వరూపమహత్త్వగుణనిరూపణము.

**సావిత్రి పలికెను :**

హరిభక్తిం దేహి మహ్యం సారభూతాం సుదుర్లభామ్ ।
త్వత్తః సర్వం శ్రుతం దేవ నావశిష్టోఽవరో మమ ॥ [1]

దేవా! సకలసారభూతము, పరమదుర్లభము నైన శ్రీహరిదివ్యభక్తియోగము నుపదేశింపుడు. అన్యవిషయముల నన్నిటిని సాంగోపాంగముగ మీ దివ్యముఖారవిందమునుండి యవధరించితిని. నేను శ్రవణమొనరించుటకు మఱియొకవిషయ మేదియు శేషింపలేదు.

కించిత్కథయ మే ధర్మ! శ్రీకృష్ణగుణకీర్తనమ్ ।
పుంసాం లక్షోద్ధారబీజం నరకార్ణవతారణమ్ ॥
కారణం ముక్తికార్యాణాం సర్వాశుభనివారణమ్ ।
దారణం కర్మవృక్షాణాం కృతపాపౌఘహారకమ్ ॥ 2,3

"దేవా! శ్రీకృష్ణదివ్యగుణనామసంకీర్తనరూప మైనపరమధర్మమును గించిన్మాత్రమైనను నా కుపదేశింపుడు. శ్రీకృష్ణగుణనామసంకీర్తనమే యనేకలక్షలమానవులను భవసాగరమునుండి యుద్ధరించుట కేకైకబీజము. ఆభక్తియోగమే నరకార్ణవమును దరింపజేయగల యేకైకసాధనము. శ్రీకృష్ణగుణనామసంకీర్తనము ముక్తికార్యములకే యేకైకకారణము, సర్వాశుభనివారణము. అదికర్మమయవృక్షములను బెరికివేయగలదు. పాపసమూహములను బరిపూర్ణముగ హరింపగలదు". ప్రభూ! ముక్తి యెన్నివిధములు? హానిలక్షణము లెవ్వి? హరిభక్తిస్వరూప మెట్లుండును? హరిభక్తిలక్షణము లేవి? హరిభక్తి యెన్నివిధములు? నిషేకములలక్షణములుకూడ నెట్లుండును? సకలసారభూత మైనతత్త్వజ్ఞాన మనగా నేమి? ఈవిషయముల నన్నింటిని కృపతో నా కనుగ్రహింపవలసినదిగ బ్రార్థించుచున్నాను.

సర్వదానం హ్యనశనం తీర్థస్నానం వ్రతం తపః ।
అజ్ఞానే జ్ఞానదానస్య కలాం నార్హన్తి షోడశీమ్ ॥ (6)

తమసర్వస్వమును దాన మొనరించుట, యుపవాసవ్రతాదుల నాచరించుట, తీర్థములందు స్నానము లాచరించుట, తప మొనరించుట మొదలగుసత్కర్మముల నన్నింటివలన లభించుపుణ్య మొక్కజ్ఞానహీనునకు జ్ఞానము ప్రసాదించినపుణ్యములో బదునాఱవయంశమున కైనను సరిరాదు.

పితుః శతగుణం మాతా గౌరవే ణాతిరిచ్యతే ।
మాతుః శతగుణైః పూజ్యో జ్ఞానదాతా గురుః ప్రభో॥ (7)

ప్రభూ! గౌరవవిషయములో దండ్రికంటె దల్లిస్థానము నిశ్చయముగ నూఱురెట్లధికము, కాని జ్ఞానదాత యైనయాచార్యుడు మాతృదేవతకంటె నూఱురెట్లధికపూజనీయుడు.

**యమధర్మరాజు పలికెను :**

పూర్వం సర్వో వరో దత్తో యస్తే మనసి వాంఛితః।
అధునా హరిభక్తిస్తే వత్సే! భవతు మద్వరాత్ ॥
శ్రోతు మిచ్ఛసి కల్యాణి శ్రీకృష్ణగుణకీర్తనమ్ ।
వక్తౄణాం ప్రశ్నకర్తౄణాం శ్రోతౄణాం కులతారకమ్ ॥ (8, 9)

కుమారీ! మొదటనే నేను నీకు నీమనోవాంఛితము లైనసకలవరములను బ్రసాదించితిని. నీవు తెలిసికొనగోరుచున్న శ్రీకృష్ణభక్తియోగము నుపదేశించెదను. సతీ! నీకు నావరమువలన శ్రీకృష్ణపరమాత్మయం దనన్యభక్తి ప్రాప్తించుగాక. కళ్యాణీ! శ్రీకృష్ణపరమాత్మ దివ్యగుణనామసంకీర్తనముల నవధరింపవలెనని నీవు ప్రశ్నించిన విషయము సర్వోత్తమము. ఈప్రశ్నార్థము ప్రశ్నించినవారిని, బ్రత్యుత్తర మొసంగినవారిని శ్రోతలను సముద్ధరించుటయే గాక వారివంశముల నన్నింటినిగూడ నుద్ధరింపగలదు.

శేషో వక్త్రసహస్రేణ నహి యద్వక్తు మీశ్వరః ।
మృత్యుంజయో న క్షమశ్చ వక్తుం పంచముఖేన చ ॥
ధాతా చతుర్ణాం వేదానాం విధాతా జగతామపి ।
బ్రహ్మా చతుర్ముఖేనైవ నాలం విష్ణుశ్చ సర్వవిత్ ॥
కార్తికేయః షణ్ముఖేన నాపి వక్తు మలం ధ్రువమ్ ।
న గణేశః సమర్థశ్చ యోగీన్ద్రాణాం గురో ర్గురుః ॥ (10-12)

శ్రీహరిదివ్యగుణనామములను వర్ణించుట బహుదుష్కరము. సహస్రముఖుడైనయాదిశేషుడుకూడ శ్రీహరిగుణములను వర్ణించుటలో నసమర్థుడే. మృత్యుంజయుడైనశంకరుడును దనపంచముఖములతో సదా వర్ణించినను దరుగని పరమతత్త్వమది. అఖిలజగత్స్రష్ట, చతుర్వేదకర్త యైనబ్రహ్మయు దన చతుర్ముఖములతో శ్రీకృష్ణునిదివ్యగుణనామములను వర్ణించుటలో నసమర్థుడే. సర్వజ్ఞుడైనవిష్ణుభగవానుడుకూడ శ్రీకృష్ణునిదివ్యతత్త్వము నుపదేశించుట కసమర్థుడే.

కార్తికేయుడేని దనషణ్ముఖములతో సదావర్ణించినను దరుగనిది శ్రీకృష్ణభక్తితత్త్వము. యోగీంద్రులగురువులకే గురుడైనశ్రీగణేశ్వరుడు కూడ శ్రీకృష్ణదివ్యగుణనామములను బరిపూర్ణముగ వర్ణించుట కసమర్థుడే.

సారభూతాశ్చ శాస్త్రాణాం వేదా శ్చత్వార ఏవ చ।
కలామాత్రం యద్గుణానాం న వదన్తి బుధాశ్చ యే ॥
సరస్వతీ జడీభూతా నాలం యద్గుణవర్ణనే ।
సనత్కుమారో ధర్మశ్చ సనకశ్చ సనాతనః ॥
సనన్దః కపిల స్సూర్యో యే చాన్యే బ్రహ్మణః సుతాః ।
విచక్షణా న యద్వక్తుం కే వాఽన్యే జడబుద్ధయః ॥
న యద్వక్తుం క్షమాః సిద్ధా మునీన్ద్రా యోగిన స్తథా ।
కే వాఽన్యే చ వయం కే వా భగవద్గుణవర్ణనే ॥ (13-16)

సర్వశాస్త్రములసారమే నాల్గువేదములు. ఆవేదములు, సకలబుధజనులు శ్రీకృష్ణభగవానుని దివ్యగుణముల నొకకళామాత్రమైనను (16 వ వంతు) వర్ణింపలేకపోయిరి. శ్రీకృష్ణదివ్యమహిమలను వర్ణించుటలో సాక్షాత్తుగ సరస్వతియైనను జడురాలు కాగలదు. సనత్కుమారుడు, ధర్మదేవత, సనకమహర్షి, సనాతనుడు, సనందుడు, కపిలుడు, సూర్యుడు, బ్రహ్మకుమారు లందఱును శ్రీకృష్ణుని మాహాత్మ్యవర్ణన మొనరించుటలో గృతకృత్యులు కాలేకపోయిరి. అట్టిచో నన్యులు, జడబుద్ధులైనవా రాపరబ్రహ్మము నేమని తెలిసికొనగలరు. శ్రీకృష్ణదివ్యగుణనామసంకీర్తన వ్యాఖ్యానములను సిద్ధులైనను, మునీంద్రులైనను, యోగీంద్రులైనను, సాంగోపాంగముగ నొనరింపలేరు. అట్టియెడ నన్యు లెట్లు వర్ణింపగలరు? నే నేమి వర్ణింపగలను?

ధ్యాయన్తి యత్పదామ్భోజం బ్రహ్మవిష్ణుశివాదయః ।
అతిసాధ్యం స్వభక్తానాం తదన్యేషాం సుదుర్లభమ్ ॥
కశ్చిత్కించి ద్విజానాతి మహత్తద్గుణకీర్తనమ్ ।
అతిరిక్తం విజానాతి బ్రహ్మా బ్రహ్మవిశారదః ॥
తతోఽతిరిక్తం జానాతి గణేశో జ్ఞానినాం గురుః ।
సర్వాతిరిక్తం జానాతి సర్వజ్ఞః శమ్భురేవ చ ॥
తస్మై దత్తం పురా జ్ఞానం కృష్ణేన పరమాత్మనా ।
అతీవ నిర్జనే రమ్యే గోలోకే రాసమణ్డలే ॥
తత్రైవ కథితం కించి ద్యద్గుణోత్కీర్తనం పునః ।
ధర్మాయ కథయామాస శివలోకే శివః స్వయమ్ ॥
ధర్మ స్త త్కథయామాస పుష్కరే భాస్కరాయ చ ।
పితా మమ య మారాధ్య మాం ప్రాప తపసా సతి ॥
పూర్వం స్వవిషయం చాహం న గృహ్ణాతి ప్రయత్నతః
వైరాగ్యయుక్తస్తపసే గన్తు మిచ్ఛామి సువ్రతే ॥
తదా మాం కథయామాస పితా తద్గుణకీర్తనమ్ ।
యథాగమం త ద్వదామి నిబోధాతీవ దుర్గమమ్ ॥
తద్గుణం స న జానాతి తదన్యస్య చ కా కథా ?
యథాఽఽకాశో న జానాతి స్వాన్తమేవ వరాననే ॥ [17-25]

బ్రహ్మవిష్ణుశివాది దేవత లెవని యేచరణారవిందములను సదా ధ్యానింతురో యవి పరమభక్తుల కత్యంత సులభములు, కాని భక్తిహీనులకు దుర్లభములని తెలిసికొనుము. సాధ్వీ! శ్రీకృష్ణదివ్యగుణానువాదములు పరమ పవిత్రములు. కొందఱు మహాత్ములు కొంతమాత్రమే తెలిసికొనగల్గిరి. పరమబ్రహ్మజ్ఞానసంపన్ను డైనబ్రహ్మ, తత్పుత్రాదులు మఱికొంత యధికముగ తెలిసికొనగల్గిరి. వీరుగాక జ్ఞానులకే యాచార్యు డైనశ్రీగణేశ్వరుడు కూడ దెలిసికొనగల్గినాడు. అందఱికంటె యధికముగ భక్తితత్త్వజ్ఞానమును శంకరుడు తెలిసికొనగల్గెను, ఎందువలన ననగ బరబ్రహ్మ మైనశ్రీకృష్ణపరమాత్మ పూర్వకాలములో నీయఖండభక్తిజ్ఞానమును స్వయముగ శంకరున కుపదేశించెను. గోలోకపరంధామములో నత్యంతరమణీయనిర్జనరాసమండల మధ్యమున శ్రీకృష్ణభగవానుడు తనదివ్యగుణనామకీర్తనమాహాత్మ్యముల నుపదేశించెను. సదాశివుడు తన నిజధామములో నట్టియఖండజ్ఞానమును ధర్మ

దేవున కొకింతమాత్రమే యుపదేశించెను. సూర్యదేవుడు ప్రార్థింపగా ధర్ముడు పవిత్రపుష్కరక్షేత్రములో దానినే వ్యాఖ్యానించెను. సాధ్వీ! నాపితృదేవు డైనసూర్యభగవాను డఖండతపస్సుచే ధర్మము నారాధించి ఫలస్వరూపముగ నన్ను బుత్రునిగ బడసెను. సువ్రతా! పూర్వకాలములో నాతండ్రి నాకు యమపురీసామ్రాజ్యమును బ్రసాదింపగా నేను వైరాగ్య మూని తపమొన రించుటకు సంకల్పించి రాజ్యభారమును స్వీకరించుటకు నిరాకరించితిని. అపుడు నాపితృదేవులు నాకు భగవంతునియద్భుతదివ్యగుణనామముల నుపదే శించెను. అత్యంత దుర్జ్ఞేయము లైనపరమాత్మదివ్యగుణనామముల నాగ మానుసారముగ నా కవగతమైనంతవఱకు వర్ణించెద సావధానురాలవై యవ ధరింపుము. వరాననా! శ్రీకృష్ణునియం దసంఖ్యాకదివ్యగుణములు కలవు. స్వయముగ దన గుణములను దానే తెలిసికొనలేకపోయెను, అట్టిచో మఱి యొక వాని నేమని వర్ణింపగలడు? ఆకాశ మెట్లు తనయంతమును స్వయముగ దానే తెలిసికొనలేదో, అట్లే భగవంతుడుకూడ తనదివ్యగుణముల యంత మును దెలిసికొనలేడు.

సర్వాన్తరాత్మా భగవాన్ సర్వకారణకారణమ్ ।
సర్వేశ్వరశ్చ సర్వాద్యః సర్వవి త్సర్వరూపధృక్ ॥
నిత్యరూపీ నిత్యదేహీ నిత్యానన్దో నిరాకృతిః ।
నిరంకుశః నిర్విశఙ్కో నిర్గుణశ్చ నిరాశ్రయః॥
నిర్లిప్తః సర్వసాక్షీ చ సర్వాధారః పరాత్పరః।
ప్రకృతి స్తద్వికారా చ ప్రాకృతా స్తద్వికారజాః ॥
స్వయం పుమాంశ్చ ప్రకృతిః స్వయంచ ప్రకృతే పరః
రూపం విధత్తేఽరూపశ్చ భక్తానుగ్రహహేతవే॥ (26-29)

సాధ్వీశిరోమణీ! ఆభగవంతుడు సర్వాంతరాత్మ, సర్వకారణకారణుడు, సర్వేశ్వరుడు, సర్వులకు నాద్యుడు, సర్వబీజస్వరూపుడు, సర్వరూపధారి, నిత్యస్వరూపుడు, నిత్యవిగ్రహుడు, నిత్యానందమయుడు, నిరాకారుడు, నిరంకుశుడు, నిశ్శంకుడు, నిరాశ్రయుడు, ప్రాకృతగుణరహితుడు, నిరామ యుడు, నిర్లిప్తుడు, సర్వసాక్షి, సర్వాధారుడు, పరాత్పరుడు. ప్రకృతి యాతని నుండే ప్రాదుర్భవించినదే. మఱియు ప్రాకృతపదార్థము లన్నియు బ్రకృతి నుండి యుద్భవించినవే. స్వయముగ బరమపురుషుడైన శ్రీకృష్ణపర

పరమాత్మయే ప్రకృతి యని తెలిసికొనుము. ఆయన ప్రకృతికిస్సైత మతీతుడని కూడ గ్రహింపుము. ప్రాకృతికరూపహీనుడైనను తత్పరబ్రహ్మము కేవలము భక్తుల ననుగ్రహించుటకొఱకే దివ్యసచ్చిదానందవిగ్రహరూపమున సాక్షాత్కరించెను.

అతీవ కమనీయం చ సున్దరం సుమనోహరమ్।
నవీననీరదశ్యామం కిశోరం గోపవేషకమ్ ॥
కన్దర్పకోటిలావణ్యలీలాధామ మనోహరమ్ ।
శరన్మధ్యాహ్నపద్మానాం శోభామోచకలోచనమ్॥
శరత్పార్వణకోటీన్దుశోభాసంశోభితాననమ్ ।
అమూల్యరత్నఖచితం రత్నాభరణభూషితమ్ ॥
సస్మితం శోభితం శశ్వ దమూల్యం పీతవాససా ।
పరబ్రహ్మస్వరూపం చ జ్వలన్తం బ్రహ్మతేజసా ॥
సుఖదృశ్యం చ శాన్తం చ రాధాకాన్త మనన్తకమ్ ।
గోపీభి ర్వీక్ష్యమాణం చ సస్మితాభిః సమన్తతః॥
రాసమణ్డలమధ్యస్థం రత్నసింహాసనస్థితమ్।
వంశీం క్వణన్తం ద్విభుజం వనమాలావిభూషితమ్ ॥
కౌస్తుభేన మణీన్ద్రేణ సున్దరం వక్షసోజ్జ్వలమ్ ।
కుఙ్కుమాగరుకస్తూరిచన్దనార్చితవిగ్రహమ్ ॥
చారుచమ్పకమాలాబ్జమాలతీమాల్యమణ్డితమ్ ।
చారుచమ్పకశోభాఢ్యచూడావిక్రమరాజితమ్ ॥
ధ్యాయన్తి చైవం భూతం వై భక్తా భక్తిపరిప్లుతాః ।
యద్భయా జ్జగతాం ధాతా విధత్తే సృష్టిమేవచ॥ (30-38)

సావిత్రీ! భక్తులకొఱకు సాక్షాత్కరించిన శ్రీకృష్ణపరమాత్మ దివ్యసచ్చిదానందచిన్మయస్వరూపుడు, అత్యంతసుందరుడు, కమనీయుడు, పరమమనోహరుడు, నవీననీరదశ్యామలవర్ణుడు, గోపవేషధారి, నిత్యకిశోరుడు, కందర్పకోటిలావణ్యలీలాధామమనోహరుడు, శరత్కాల మధ్యాహ్నసమయమున పూర్ణముగ వికసించినకమలములమించి ప్రకాశించు నేత్రములుగలవాడు, కోటానుకోట్లపూర్ణిమాచంద్రులశోభనే తిరస్కరింపగల ముఖముగలవాడు, అమూల్య రత్నములచే నిర్మింపబడినదివ్యభూషణములచే భూషితుడు.

అమూల్యపీతాంబరములచే శోభితుడు, సస్మితముఖారవిందుడు, బ్రహ్మతేజముతో ప్రకాశించుచున్నవాడు, పరమశాంతస్వరూపుడు, రాధావల్లభుడు. అనంతగుణసమన్వితుడు, మహామహిమోపేతుడు, పరబ్రహ్మస్వరూపుడు, దివ్యప్రేమమూర్తులైన గోపికలచే నన్నివైపులనుండి వీక్షింపబడువాడు, రాసమండలమధ్యభాగములో రత్నసింహాసనముపై విరాజిల్లువాడు, వనమాలా విభూషితుడు, ద్విభుజుడు, మురళిపై మధురగాంధర్వగీతమాలాపించుచున్నవాడు, మణిరాజమైనకౌస్తుభముచే శోభిల్లు వక్షఃస్థలముగలవాడు, కుంకుమాగరుకస్తూరీచందనాభ్చితదివ్యవిగ్రహుడు, మనోహరచంపకమాలను, గమలమాలలను, మాలతీమాలలను, నలంకరించుకొనియున్నవాడు, చారుచంపకపుష్పసుశోభిత మగుచూడామణి (మకుటము)చే వృద్ధిపొందుసౌందర్యము గలవాడు నగుశ్రీకృష్ణునిఅనన్యప్రేమభక్తితో బెనవేసికొనిపోయిన భక్తజనులు సదా ధ్యానింతురు. జగద్విధాత యగుబ్రహ్మ యీయన యాజ్ఞానుసారముగనే సృష్టికార్యము నిర్వర్తించుచున్నాడు.

కరోతి లేఖనం కర్మానురూపం సర్వకారణమ్।
తపసాం ఫలదాతా చ కర్మణాం చ యదాజ్ఞయా ॥
విష్ణుః పాతా చ సర్వేషాం యద్భయా త్పాతిసంతతమ్।
కాలాగ్నిరుద్రః సంహర్తా సర్వవిశ్వేషు యద్భయాత్ ॥
శివో మృత్యుంజయశ్చైవ జ్ఞానినాం చ గురో ర్గురుః।
యద్ జ్ఞానదాతాత్సిద్ధేశో యోగీశః సర్వవి త్స్వయమ్ ॥
పరమానన్దయుక్తశ్చ భక్తివైరాగ్యసంయుతః ।
యత్ప్రసాదా ద్వాతి వాతః ప్రవరః శీఘ్రగామినామ్॥
తపనశ్చ ప్రతపతి యద్భయా త్సంతతం సతి॥
యదాజ్ఞయా వర్షతీన్ద్రో మృత్యు శ్చరతి జన్తుషు ॥
యదాజ్ఞయా దహే ద్వహ్ని ర్జలమేవ సుశీతలమ్ ।
దిశో రక్షన్తి దిక్పాలా మహాభీతా యదాజ్ఞయా॥
భ్రమన్తి రాశిచక్రాణి గ్రహా వై యద్భయేన చ ।
భయా త్ఫలన్తి వృక్షాశ్చ పుష్పన్త్యపి చ యద్భయాత్॥
భయా త్ఫలాని పక్వాని నిష్ఫలాస్తరవో భయాత్ ।
యదాజ్ఞయా స్థలస్థాశ్చ న జీవన్తి జలేషు చ ॥

తథా స్థలే జలస్థాశ్చ న జీవన్తి యదాజ్ఞయా ।
అహం నియమకర్తా చ ధర్మాధర్మే చ యద్భయాత్ ॥

కాలశ్చ కలయే త్సర్వం భ్రమత్యేవ యదాజ్ఞయా ।
అకాలే న హరే త్కాలో మృత్యుర్వై యద్భయేన చ॥

జ్వలదగ్నౌ పతన్తం చ గభీరే చ జలార్ణవే ।
వృక్షాగ్రా త్తీక్ష్ణఖడ్గే చ సర్పాదీనాం ముఖేషు చ ॥
నానాశస్త్రాస్త్ర విద్ధం చ రణేషు విషమేషు చ।
పుష్పచన్దనతల్పే చ బన్ధువర్గైశ్చ రక్షితమ్ ॥

శయనం తన్త్రమన్త్రైశ్చ కాలే కాలో హరే ద్భయాత్ ।
ధత్తే వాయు స్తోయరాశిం తోయం కూర్మం యదాజ్ఞయా॥
కూర్మోఽనన్తం స చ క్షోణీం సముద్రా న్సప్తపర్వతాన్।
సర్వాంశ్చైవ క్షమారూపో నానారూపం బిభర్తి సః ॥ (39-52)

శ్రీకృష్ణపరమాత్మభయమువలననే విధాత సర్వప్రాణులభాగ్యమును వారివారి కర్మానుసారముగ లిఖించుచున్నాడు. తదాజ్ఞానుసారముగనే తాపసులకు ఫలదాతయు సర్వులకర్మములకు ఫలదాతయునై విరాజిల్లియున్నాడు. ఆయన భయమువలననే పాలకుడైనవిష్ణువు సంతతము సర్వులను బాలించుచున్నాడు. పరమాత్మభయమువలననే కాలాగ్నిరుద్రులు సకలవిశ్వములందు సంహారకార్యములను నిర్వర్తించుచున్నారు. జ్ఞానుల గురువులకే యాచార్యుడై మృత్యుంజయు డనుదివ్యనామప్రసిద్ధుడైనసదాశివుడుకూడ నాపరబ్రహ్మమును దెలిసికొని పరమాత్మ యొసంగినయఖండజ్ఞానముచే సిద్ధేశ్వరుడై, యోగీశ్వరుడై, సర్వజ్ఞుడైనాడు. అనన్యభక్తిజ్ఞానయుక్తుడై శంకరుడు శ్రీకృష్ణపరమాత్మానుగ్రహమువలననే పరమానందసంపన్నుడైనాడు. సాధ్వీ! ఆభగవంతుని యనుగ్రహమువలననే శీఘ్రగాములందు బవనుడు శ్రేష్ఠుడైనాడు. సతీ! భగవంతునిభయమువలననే సతతము తపనుడు (అగ్ని) జ్వలించుచున్నాడు. ఇంద్రుడు వర్షింపగల్గుచున్నాడు, మృత్యువు సకలజంతువులందు జరింపగల్గుచున్నది, వహ్నికి దహింపశక్తి కల్గినది, జలములకు శీతలత్వము సహజమైనది. ఆయన యాజ్ఞవలననే మహాభయభీతులై దిక్పాలకులు దిశలను రక్షించుచున్నారు. పతివ్రతా! ఆభగవంతుని భయమువలననే సర్వగ్రహములు, నానారాశిచక్రములు నిఖిలవిశ్వములందు

బరిభ్రమించుచున్నవి. ఆయనభయమువలననే వృక్షములు పుష్పించుచున్నవి, ఫలభరితము లగుచున్నవి, గాలానుసారముగ నిష్ఫలములగుచున్నవి. ఆయనభయానుసారముగనే స్థలముపై నివసించుజీవరాశి జలములందు బ్రతుక లేవు. అట్లే జలములలో జీవించుప్రాణులు స్థలముపై జీవింపలేవు. దేవీ! వేయిమాటలేల! ధర్మాధర్మనియమకర్తనైననేనే యా శ్రీకృష్ణపరమాత్మా జ్ఞానువర్తిని. తదా జ్ఞానుసారముగనే కాలము సర్వులను గబళించుచు సర్వత్ర భ్రమింపగల్గుచున్నది. మృత్యువు కాలము నెవరినైన నకాలములో మరణింపజేయలేవు. జ్వలించుచున్న భయంకరాగ్నిజ్వాలలలో బడవైచినను లేక గంభీర జలార్ణవములో ద్రోసినను, సమున్నతవృక్షముపైనుండి క్రిందబడి నను, దీక్ష్ణఖడ్గప్రహారములకు గుఱియైనను, మహాసర్పములవాతబడినను, నానా శస్త్రాస్త్రములచే ఖండింపబడినను, విషమపరిస్థితులాసన్నమైవరణమధ్యమున నున్నను దేహధారుల ప్రాణములను గాలమైనను, మృత్యువైనను బరమాత్మ నిర్ణయించినకాల మాసన్నముకానిదే హరిపలేవు. పుష్పచందనములచే నలంకరింపబడినశయ్యపై శయనించియున్నను, మంత్రతంత్రములచే, సోదర బంధుజనులచే సంరక్షింపబడుచు నిద్రించువ్యక్తియైనను గాల మాసన్నమై నపుడు మృత్యువు పరమాత్మసంకల్పానుసారము సంహరింపగలదు. ఆభగ వంతుడే సర్వోత్కృష్టుడని తెలిసికొనుము. ఆయన భయముననే కాలము సర్వమును సంపన్న మొనరింపగల్గుచున్నది. వాయువు జలరాశిని, జలరాశి యాదికూర్మమును, ఆదికూర్మ మాదిశేషుని, ఆదిశేషుడు పృథ్విని క్షమా స్వరూపిణి యైనపృథ్వి సప్తసముద్రములను, బర్వతములను, నానారూపముల నున్నచరాచరజగమును ధరింపగల్గుచున్నారు.

యతః సర్వాణి భూతాని లీయన్తే ఽన్తే చ తత్ర వై ॥ (50)

శ్రీకృష్ణపరమాత్మనుండియే సర్వభూతములు ప్రకటితములై యంత్య కాలమున నాయనయందే లీనము కాగలవు.

ఇన్ద్రాయుశ్చైవ దివ్యానాం యుగానా మేకసప్తతిః ॥
అష్టావింశ చ్ఛక్రపాతే బ్రహ్మణః స్యాదహర్నిశమ్ ।
షష్ట్యాఽధికే పంచశతే సహస్రే పంచవింశతౌ ॥
యుగే నరాణాం శక్రాయు రేవం సంఖ్యావిదో విదుః ।
ఏవం త్రింశ ద్దినై ర్మాసో ద్వాభ్యాం తాభ్యా మృతుః స్మృతః ॥
ఋతుభిః షడ్భిరే వాబ్దం శతాబ్దం బ్రహ్మణో వయః ।
బ్రహ్మణశ్చ నిపాతే వై చక్షు రున్మీలనం హరేః ॥

చక్షుర్నిమీలనే తస్య లయం ప్రాకృతికం విదుః ।
ప్రలయే ప్రాకృతాః సర్వే దేవాద్యాశ్చ చరాచరాః॥
లీనా ధాతరి ధాతా చ శ్రీకృష్ణో నాభిపంకజే।
విష్ణుః క్షీరోదశాయీ చ వైకుణ్ఠే యశ్చతుర్భుజః ॥
విలీనా వామపార్శ్వే చ కృష్ణస్య పరమాత్మనః।
ఇన్ద్రాద్యా భైరవాద్యాశ్చ యావన్తశ్చ శివానుగాః॥
శివాధారే శివే లీనా జ్ఞానానన్దే సనాతనే।
జ్ఞానాధిదేవః కృష్ణస్య మహాదేవస్య చాఽత్మనః॥
తస్య జ్ఞానే విలీనశ్చ బభూవావథ క్షణం హరేః ।
దుర్గాయాం విష్ణుమాయాయాం విలీనాఃసర్వశక్తయః ॥
సా చ కృష్ణస్య బుద్ధౌ చ బుద్ధ్యాధిష్ఠాతృదేవతా।
నారాయణాంశః స్కన్దశ్చ లీనో వక్షసి తస్య చ ॥
శ్రీకృష్ణాంశశ్చ తద్బాహౌ దేవాధీశో గణేశ్వరః ।
పద్మాంశభూతా పద్మాయాం సా రాధాయాం చ సువ్రతే॥
గోప్యశ్చాపి చ తస్యాం చ సర్వా వై దేవయోషితః ।
కృష్ణప్రాణాధిదేవీ సా తస్య ప్రాణేషు సా స్థితా ।
సావిత్రీ చ సరస్వత్యాం వేదశాస్త్రాణి యాని చ
స్థితా వాణీ చ జిహ్వాయాం తస్యైవ పరమాత్మనః ॥
గోలోకస్థస్య గోపశ్చ విలీనా స్తస్య లోమసు।
తత్ప్రాణేషు చ సర్వేషాం ప్రాణా వాతా హుతాశనః ॥
జఠరాగ్నౌ విలీనశ్చ జలం తద్రసనాగ్రతః ।
వైష్ణవా శ్చరణామ్భోజే పరమానన్దసంయుతాః॥
సారాత్సారతరా భక్తిరసపీయూషపాయినః।
విరాట్ క్షుద్రశ్చ మహతి లీనః కృష్ణే మహాన్విరాట్ ॥
యస్యైవ లోమకూపేషు విశ్వాని నిఖిలాని చ।
యస్య చక్షుర్నిమేషేణ మహాంశ్చ ప్రలయో భవేత్ ॥
చక్షురున్మీలనే సృష్టి ర్యస్యైవ పరమాత్మనః ।
యావన్నిమేషే సృష్టిః స్యాత్తావ దున్మీలనే వ్యయః ॥
బ్రహ్మణశ్చ శతాబ్దేన సృష్టి స్తత్ర లయః పునః

బ్రహ్మసృష్టిలయానాం చ సంఖ్యా నాస్త్యేవ సువ్రతే! ॥
యథా భూరజసాం చైవ సంఖ్యానాం చ నిశామయ ।
చక్షుర్నిమేషే ప్రలయో యస్య సర్వాన్తరాత్మనః ॥
ఉన్మీలేన పునః సృష్టి ర్భవే దేవేశ్వరేచ్ఛయా ।
తద్గుణోత్కీర్తనం వక్తుం బ్రహ్మాణ్డేషు చ కః క్షమః॥ [53-73]

డెబ్బదియొక్క దివ్యయుగము లిందురిని పూర్ణాయుర్దాయమునకు సమానములు. ఇరువదియెనమండుగు రిందురిలు పతనమైన బ్రహ్మకొకదినము, రాత్రి కాగలవు. ఇరువదియైదు వేలమైదువందలయరువదినరులయుగము లిందురిని పూర్ణాయుర్దాయమ నకు సమాన మని సంఖ్యావిదులు ప్రవచించిరి. ఇట్లు ముప్పదిదినము లొకమాసము, రెండుమాసము లొకఋతువు, ఆఱుఋతువు లొకవర్షము, అట్టి నూఱువర్షము లొకబ్రహ్మాయుర్దాయము కాగలదు. బ్రహ్మాయుఃపర్యంతము పరమాత్మనేత్రము తెఱచియే యుండును. ఎపుడు భగవంతుడు నేత్రములను మూయునో యపుడే బ్రహ్మాయుర్దాయము పరిపూర్ణమై ప్రళయము సంభవించును. ఆప్రళయమునే ప్రాకృతికప్రళయ మందురు, ఆప్రాకృతిక ప్రళయములో ప్రాకృతికపదార్థములన్నియును, దేవతలుమున్నగాగల చరాచరప్రాణు లందఱును బ్రహ్మదేవునియందు లీనమయ్యెదరు. బ్రహ్మ శ్రీకృష్ణ పరమాత్మనాభికమలమందు లీనమగును. క్షీరసాగరములో శయనించియున్న శ్రీవిష్ణువు పరబ్రహ్మ మైనశ్రీకృష్ణునివామపార్శ్వమందు లీనమగును. రుద్రులు, భైరవులు, మొదలగు సకలశివానుచరులు, మంగళాధారుడు, సనాతనుడు, జ్ఞానానందస్వరూపుడు నైనశివునియందు లీనమయ్యెదరు. సర్వజ్ఞానములకు నధిష్ఠాత యైనశివుడు మహాదేవుడైన శ్రీకృష్ణపరమాత్మజ్ఞానమందు విలీనుడు కాగలడు. విశ్వమందు గలసర్వశక్తులు విష్ణుమాయాస్వరూపిణి యైనదుర్గాదేవి యందు దిరోహితములు కాగా నావిష్ణుమాయ శ్రీకృష్ణునిబుద్ధిలో స్థానము గ్రహింపగలదు. ఎందువలన ననగా నామె పరమాత్మబుద్ధి కధిష్ఠాతృదేవత. నారాయణాంశసంభూతు డైనకార్తికేయుడు భగవంతునివక్షఃస్థలమందు లీనము కాగలడు. సువ్రతా! గుణములకు స్వామి, దేవేశ్వరు డైనగణేశ్వరుడు శ్రీకృష్ణాంశోద్భవుడే, కావున నాయన భగవంతుని రెండుభుజములందు బ్రవిష్టుడు కాగలడు. లక్ష్మ్యంశసంభూతు లైనశక్తులు లక్ష్మీదేవియందు, లక్ష్మీదేవి శ్రీరాధాదేవియందు లీనము కాగలదు. గోపికలు, సకలదేవపత్నులు

కూడ శ్రీరాధాదేవియందు లీనము కాగలరు. శ్రీకృష్ణునిప్రాణముల కధీశ్వరి యైనశ్రీరాధాదేవి యాయన ప్రాణములలో నివసింపగలదు. సావిత్రి, నాల్గు వేదములు, సర్వశాస్త్రములు భగవతి యగుసరస్వతిలో బ్రవేశింపగా నామె పరబ్రహ్మ మైన శ్రీకృష్ణపరమాత్మజిహ్వాగ్రమందు విలీనము కాగలదు. గోలోకమునందు విరాజిల్లు గోపకుమారు లెల్లరు శ్రీకృష్ణుని రోమకూపములందు లీనమయ్యెదరు. సర్వప్రాణులకు బ్రాణస్వరూప మైనవాయు వాప్రభునిప్రాణములందు లీనము కాగలదు. భగవంతుని జఠరాగ్నియందు సమస్తాగ్నులు, జిహ్వాగ్రమందు జలములు లయింపగలవు. బహుసారసంపన్నులు, అనన్యభక్తిరసామృతపానమత్తులు నగునాభక్తవైష్ణవజను లత్యంతాఖండానంద సంపన్నులై శ్రీకృష్ణపరమాత్మ చరణారవిందములందు విలీనమయ్యెదరు. క్షుద్రవిరాట్పురుషులు మహావిరాట్పురుషునిలో లయమొందగా మహావిరాట్పురుషుడు శ్రీకృష్ణునియందు విలీనుడు కాగలడు. ఎవని రోమకూపములందు నిఖిలవిశ్వములు వర్తమానములై యున్నవో యాయన చక్షుర్నిమేషణ (కనురెప్పపాటులో) కాలములో మహాప్రళయము సంభవించును. మరల పరమాత్మచక్షువులు తెఱవగనే సృష్టికార్య మారంభమగును. భగవంతుని రెప్పపాటుకాలములో సకలసృష్టి యావిర్భవించి మరల లయమొందగలదు. సృష్టి యెంతకాల ముండునో ప్రళయముకూడ నంతకాలమే యుండగలదు. ఒకబ్రహ్మకు నూఱుసంవత్సరముల యాయుర్దాయము పరిపూర్ణమైన నొకవిశ్వమందు గలసృష్టి లయింపగలదు. అంతకాలమే లయము తాండవించి మరల బరమాత్మాజ్ఞచే సృష్టి సంభవింపగలదు. సువ్రతా! భూమియందు గలరజఃకణములను లెక్కింపలేనట్లు అసంఖ్యాకులైనబ్రహ్మలను, విశ్వములను, సృష్టిలయములను గణింపలేము. సర్వాంతరాత్మయైన శ్రీకృష్ణపరమాత్మ కనుఱెప్పపాటులో జగములు ప్రళయమునకు గుఱియై మరల గనుఱెప్ప తెఱచుకొనగనే పరమేశ్వరుని యిచ్ఛచే బ్రాదుర్భవించి సృష్టిచే సంపన్నములు కాగలవు. ఆసర్వేశ్వరేశ్వరుని, దివ్యగుణనామసంకీర్తన మొనరించుట(వర్ణించుటలో) కెవరు సమర్థులు?

యథాశ్రుతం పితు ర్వక్త్రాత్తథోక్తం చ యథాగమమ్ ।
ముక్తయశ్చ చతుర్వేదై ర్నిరుక్తాశ్చ చతుర్విధా ॥

తత్ప్రిధానా హరే ర్భక్తి ర్ముక్తేరపి గరీయసీ ।
సాలోక్యదా హరే రేకా చాన్యా సారూప్యదాఽపరా ॥
సామీప్యదా చ నిర్వాణదాత్రీ చైవ మితి స్మృతిః ।
భక్తా స్తాన హి వాంఛన్తి వినా తత్సేవనాదికమ్ ॥
సిద్ధత్వ మమరత్వం చ బ్రహ్మత్వం చావహేలయా ।
జన్మమృత్యుజరావ్యాధిభయశోకాదిఖణ్డనమ్॥
ధారణం దివ్యరూపస్య విదు ర్నిర్వాణమోక్షదమ్ ।
ముక్తిశ్చ సేవారహితా భక్తిః సేవావివర్ధినీ ॥ [74-78]

నాపితృదేవునిముఖారవిందమునుండి శ్రవణమొనరించినట్లు యాగమాను సారముగ దత్త్వరహస్యమును వర్ణించితిని. నాల్గువేదములు ముక్తులు నాల్గు విధములని ప్రవచించినవి. కాని దేవీ! అన్నింటికంటె, ముక్తులకంటె భగవంతునియం దనన్యభక్తియే యత్యంతశ్రేష్ఠము, ఎందువలననగా ననన్యభక్తి సమక్షములో నన్నియు దుచ్ఛములే. ఒకముక్తి సాలోక్యమును, రెండవది సారూప్యమును, మూడవది సామీప్యమును, నాల్గవది నిర్వాణమును బ్రసాదింపగలవు. సావిత్రీ! అనన్యభక్తుడైనపురుషుడు పరమప్రభువైనపరమాత్మ సేవాసౌభాగ్యమునుగాక యాముక్తులనువాంఛింపడు. ఆయనసిద్ధత్వమునుగాని, యమరత్వమునుగాని, తుదకు బ్రహ్మత్వమునుగాని తుచ్ఛముగ భావించును. శ్రీకృష్ణపరమాత్మసేవాసౌభాగ్యము జన్మమృత్యుజరావ్యాధిశోకాదులను ఖండింపగలదని, దివ్యరూపమును బ్రసాదించి మోక్షము నొసంగగలదని గ్రహింపుము. దేవీ! ముక్తి సేవారహితము, కాని యనన్యభక్తిలో నిరంతరము సేవాభావము విరాజిల్లును. కావున ననన్యభక్తిసేవాసౌభాగ్యమే మోక్షములకంటె నత్యంతశ్రేష్ఠమని తెలిసికొనుము.

భక్తిముక్త్యో రయం భేదో నిషేకలక్షణం శృణు ।
విదు ర్బుధా నిషేకం చ భోగం చ కృతకర్మణామ్ ॥
తత్ఖణ్డనం చ శుభదం వరం శ్రీకృష్ణసేవనమ్ ।
తత్త్వజ్ఞాన మిదం సాధ్వి! సారం వై లోకవేదయోః ।
విఘ్నఘ్నం శుభదం చోక్తం గచ్ఛ వత్సే! యథాసుఖమ్ ॥ (79-80)

దేవీ! యిదియే భక్తిముక్తులయందు గలభేదము. ఇపుడు నిషేకలక్షణముల వర్ణించెద నవధరింపుము. తా నొనరించిన కర్మములభోగమే నిషేక

మని విద్వాంసులైన సత్పురుషులు నొక్కి వక్కాణించిరి. ఆకర్మభోగాదులను, ప్రారబ్ధమునుగూడ సమూలముగ ఖండించి దివ్యకళ్యాణమును బ్రసాదింపగలది కేవలము సర్వోత్తమ మైనశ్రీకృష్ణపరమాత్మసేవ యని తెలిసికొనుము. సాధ్వీ! సకలతత్త్వజ్ఞానము సకలవేదసారము ఈ జ్ఞానమే యని తెలిసికొనుము. శ్రీకృష్ణపరమాత్మసేవయే సర్వోత్కృష్టమని తెలిసికొనెడిజ్ఞానమే సకలవిఘ్న నాశనము, అఖండశుభప్రదాయకము. కుమారీ! నీవు సుఖముగా మరలి పొమ్ము.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదమునీంద్రా! ఇట్లు సూర్యనందను డైనయమధర్మరాజు సావిత్రి కఖండతత్త్వజ్ఞానోపదేశ మొనరించి యనేకశుభాశీర్వాదముల నొసంగి, సత్య వంతుని మరల బునర్జీవితు నొనరించెను. తదనంతరము యమధర్మరాజు సంయమనీపురమునకు బ్రస్థాన మొనరించుటకు సంసిద్ధుడు కాగా సావిత్రి యాయన చరణారవిందములందు తనమస్తకము నుంచి యమ్మహాత్ముని వీడలేక దుఃఖింప నారంభించెను. సత్పురుషుల వియోగ మత్యంతదుఃఖప్రద మనుట పరమసత్యము. నారదా! తనపాదములపై బడి దుఃఖించు సావిత్రిని గాంచ గనే యమధర్మరాజు హృదయము సైత మార్ద్రమైనది, ఆకృపానిధియత్యంత సంతుష్టుడై సావిత్రి నిట్లాదేశించెను.

**యమధర్మరాజ ఉవాచ :**

లక్షవర్షం సుఖం భుక్త్వా పుణ్యక్షేత్రే చ భారతే ।
అన్తే యాస్యసి గోలోకే శ్రీకృష్ణభవనం శుభే॥
గత్వా చ స్వగృహం భద్రే సావిత్ర్యాశ్చ వ్రతంకురు।
ద్విసప్తవర్షపర్యన్తం నారీణాం మోక్షకారణమ్ ॥
జ్యేష్ఠే శుక్లచతుర్దశ్యాం సావిత్ర్యాశ్చ వ్రతం కురు ।
శుక్లాష్టమ్యాం భాద్రపదే మహాలక్ష్మ్యా వ్రతం తథా ॥
ద్వ్యష్టవర్షం వ్రతం చేదం ప్రత్యబ్దం పక్షమేవ చ ।
కరోతి పరయా భక్త్యా సా యాతి చ హరేః పదమ్॥
ప్రతిమఙ్గలవారే చ దేవీం మఙ్గలచణ్డికామ్।
ప్రతిమాసంశుక్ల షష్ఠ్యాం షష్ఠీం మఙ్గలదాయికామ్।

తథా చాఽఽషాఢసంక్రాన్త్యాం మనసా సర్వసిద్ధిదామ్ ।
రాధాంరాసే చ కార్తిక్యాం కృష్ణప్రాణాధికాం ప్రియామ్॥
ఉపోష్య శుక్లాష్టమ్యాం చ ప్రతిమాసం వరప్రదామ్ ।
విష్ణుమాయాం భగవతీం దుర్గాం దుర్గతినాశనీమ్ ॥
ప్రకృతిం జగదమ్బాం చ పతిపుత్రవతీషు చ ।
పతివ్రతాసు శుద్ధాసు యన్త్రేషు ప్రతిమాసు చ ॥
యా నారీ పూజయేద్భక్త్యా ధనసన్తానహేతవే।
ఇహలోకే సుఖం భుక్త్వా యాత్యన్తే శ్రీహరేః పదమ్॥ (85-93)

సావిత్రీ! నీవు పుణ్యక్షేత్ర మైనభారతవర్షములో లక్షసంవత్సరములు సుఖముల ననుభవించి తదనంతరము శ్రీకృష్ణపరమాత్మదివ్యగోలోకపరంధామ మును జేరగలవు. ఇక నీవు స్వగృహమునకు మరలిపోయి సావిత్రీ వ్రత మాచరింపుము. భద్రా! పదునాల్గుసంవత్సరము లీసావిత్రీవ్రత మాచ రించిననారీమణులకు మోక్షము లభించును. జ్యేష్ఠమాసములో కృష్ణపక్ష ములో చతుర్దశితిథిని సావిత్రీవ్రత మాచరింపవలెను. భాద్రపదమాస శుక్ల పక్షములో సప్తమీతిథియందు శ్రీమహాలక్ష్మీ వ్రత మొనరింపవలెను. ఈమహాలక్ష్మీవ్రతము పదునాఱుసంవత్సరములు ప్రతిసంవత్సరము భాద్రపద మాసములో శుక్లపక్షమం దాచరింపవలెను. అనన్యభక్తిపూర్వకముగ నీ మహాలక్ష్మీవ్రత మాచరించు వా రఖండసౌభాగ్యసంపన్నలై శ్రీహరిపరమ పదమును జేరగలరు. ప్రతిమంగళవారము మంగళములను ప్రసాదింపగల మంగళచండికాదేవిని బూజింపవలెను. ప్రతిమాసమందు శుక్లపక్షములో షష్ఠీదినమున మంగళప్రదాయిని యైన షష్ఠీదేవిని (దేవసేన) నుపాసింపవలెను అట్లే యాషాఢమాసములో సంక్రాంతిసమయమున సంపూర్ణ సిద్ధులను బ్రసా దింపగల మనసాదేవిని బూజింపవలెను. కార్తికమాసములో పూర్ణిమాదిన మున రాసమణ్డలములో విరాజమానురాలును, శ్రీకృష్ణపరమాత్మప్రాణాధి కయు నగుశ్రీరాధ నుపాసింపవలెను. ప్రతిమాసమందు శుక్లపక్షాష్టమీ దినమున నుపవాస మొనరించి దుర్గతినాశని యైనవిష్ణుమాయ యగుదుర్గాదేవి వ్రత మాచరింపవలెను. విశుద్ధపతివ్రత లందు, శ్రీయంత్రాదులందు, ప్రతిమ లందు, పతిపుత్రవతి యగుసతియందు ప్రకృతిస్వరూపిణి యైనజగదంబికను భావించి ధనసంతానప్రాప్తికొఱకు భక్తిపూర్వకముగ బూజించుకాంత మనో

రథసిద్ధి పొంది యిహలోకములో ననేకసుఖముల ననుభవించి యంత్యకాలమున నిశ్చయముగ బతీపుత్రసహితముగ శ్రీహరిదివ్యపరంధామము జేరగలదు.

## శ్రీనారాయణఋషి పలికెను:

నారదా! యమధర్మరాజిట్లు సావిత్రి నాదేశించి నిజధామమునకు బ్రస్థాన మొనరించెను. సావిత్రికూడ సజీవుడైనభర్తతో గూడి నిజగృహము జేరి జరిగినవృత్తాంత మంతయు బంధుజనుల యెదుట వర్ణించెను. యమధర్మరాజొసంగినవరముల ప్రభావమువలన సావిత్రి తలిదండ్రులకు గ్రమముగ నూర్గురుపుత్రులు కల్గిరి. ఆమె మామగారికి దృష్టి కల్గి పోయినసామ్రాజ్యము తిరిగి లభించెను. స్వయముగ సావిత్రి సంతానమును గని పుణ్యక్షేత్రమైన భారతవర్షములో బహుకాలము సుఖముల ననుభవించి తుదకు బతితోగూడి దివ్యగోలోకపరంధామము జేరెను.

సవితు శ్చాధిదేవీ యా మన్త్రాధిష్ఠాతృదేవతా ।
సావిత్రీ చాపి వేదానాం సావిత్రీ తేన కీర్తితా॥ 98

సవితకు (చతుర్ముఖునకు) నధిదేవియు, గాయత్రీప్రభృతిమంత్రముల కధిష్ఠాత్రియు, వేదములకు సావిత్రి(జనని)యు నైనగారణమున నామెను సావిత్రి యని కీర్తించిరి.

కుమారా! నే నిప్పటికి సావిత్రీ శ్రేష్ఠోపాఖ్యానమును, ప్రాణులకర్మవిపాకాదిప్రసంగములను, శ్రేష్ఠతత్త్వజ్ఞానభక్త్యాదులను నీ కుపదేశించితిని. నీ విక నేవిషయములను శ్రవణ మొనరింపగోరెదవో ప్రశ్నింపుము.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణ మందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణసంవా
దమున సావిత్ర్యుపాఖ్యానమున యమోప
దేశ మను ముప్పదినాల్గవ
అ ధ్యా య ము
సంపూర్ణము.

—♦—

# ముప్పదియైదవ అధ్యాయము

## శ్రీ మహాలక్ష్మి స్వరూప పూజాదివర్ణనము.

**నారదుడు పలికెను :**

దేవా! నేను మీదివ్యముఖారవిందమునుండి యమసావిత్రీ సంవాద రూపమున నిర్గుణుడు, నిరాకారు డైన శ్రీకృష్ణపరమాత్మ సువిమల యశమును శ్రవణ మొనరించి కృతార్థుడనైతిని. సత్యముగ శ్రీకృష్ణపర మాత్మదివ్యగుణనామసంకీర్తనము మంగళములకే మంగళప్రదము. ప్రభూ! కృపతో నాకు శ్రీమహాలక్ష్మిదివ్యోపాఖ్యానోపదేశ మొనరింపుడు. ఓ వేద విదాంవరా! సర్వప్రథమమున శ్రీమహాలక్ష్మి నెవరు పూజించి ధన్యులైనారు? శ్రీమహాలక్ష్మిదివ్యస్వరూప మెట్లుండును? ఏమూలమంత్రముచే సకలసంపత్ప్ర దాత్రి యైన శ్రీమహాలక్ష్మిసమారాధన మొనరింపవలెను? ఆదేవిదివ్యగుణము లను గృపతో వర్ణించి నన్ను జరితార్థునిగ నొనరింపుము.

**శ్రీనారాయణఋషి పలికెను :**

బ్రహ్మకులపావనా! ఈవిషయ మత్యంతప్రాచీనము. సృష్ట్యాదిలో దివ్య గోలోకపరంధామమున రాసమండలమధ్యములో శ్రీకృష్ణపరమాత్మ వామ భాగమునుండి శ్రీరాధాదేవి ప్రాదుర్భవించెను. ఆదివ్యసుందరి యత్యంత కిశోరవయస్కురాలు. ఆజవ్వని సదా ద్వాదశవర్షీయకన్యవలె దర్శన మొసంగును. ఆమెదివ్యవిగ్రహకాంతి శ్వేతచంపకపుష్పమువలె సముజ్జ్వ లము. ఆమనోహారిణిదివ్యసందర్శనము పరమసుఖప్రదము. ఆమె ప్రసన్న ముఖము కోటానుకోట్ల శరత్పూర్ణిమా చంద్రప్రభతో బరిపూర్ణము. ఆమె విశాలనేత్రములు శరత్కాలమధ్యాహ్నమున నిండుగవికసించిన కమలములను మించి శోభించుచున్నవి. పరబ్రహ్మ మైన శ్రీకృష్ణపరమాత్మతో విరాజిల్లు శ్రీరాధాదేవి పరమాత్మేచ్ఛచే రెండురూపముల సాక్షాత్కరించెను. రూప మందు, వర్ణమందు, తేజమందు, నవస్థయందు, గాంతియందు, యశమందు, వేషభూషలందు, నాకృతియందు, గుణములందు, వాణియందు, గతియందు, మధురస్వరమందు ననునయవినయములందు వారిర్వురు సమానులే. శ్రీరాధా

దేవి వామాంశముచే శ్రీమహాలక్ష్మి ప్రాదుర్భవింపగా నామె దక్షిణాంశము స్వయముగ శ్రీరాధాదేవిగనే ప్రకాశించెను.

ప్రప్రథమమున శ్రీరాధ పరాత్పరుడు, ద్విభుజుడు నైన శ్రీకృష్ణపరమాత్మను దన హృదయేశ్వరునిగ స్వీకరించెను. భగవంతుని యా సచ్చిదానందదివ్యవిగ్రహ మత్యంత కమనీయము. శ్రీమహాలక్ష్మి కూడ బరమాత్మదివ్యసుందరస్వరూపమును గాంచి యాయననే ప్రాణపతిగా వరింపవలెనని సంకల్పించెను. అపుడు శ్రీకృష్ణపరమాత్మ శ్రీమహాలక్ష్మి సంకల్పమును గ్రహించి యామె కఖండగౌరవమును బ్రసాదింపవలెనని తానే స్వయముగ రెండురూపముల విభక్తుడయ్యెను. ఆయన తన దక్షిణాంశముచే ద్విభుజుడై శేషించి వామాంశముచే జతుర్భుజుడైన శ్రీమహావిష్ణురూపమున సాక్షాత్కరించెను. శ్రీకృష్ణుడే స్వయముగ శ్రీమహాలక్ష్మిని విష్ణుదేవునిదివ్యసేవలందు సమర్పించెను.

లక్ష్యతే దృశ్యతే విశ్వం స్నిగ్ధదృష్ట్యా యయాఽనిశమ్
దేవీషు యా చ మహతీ మహాలక్ష్మీశ్చ సా స్మృతా॥ 13

ఏదేవి స్నేహాభరితకరుణామయదృక్కులతో విశ్వములను మాతృదేవతవలె నిరంతరము వీక్షించుచు రక్షించుచుండునో, ఆమెయే సకల దేవీమణులందు శ్రేష్ఠమైనకారణమున శ్రీమహాలక్ష్మి యనునామమున బ్రసిద్ధిగాంచెను.

ఈప్రకారముగ శ్రీకృష్ణపరమాత్మ శ్రీరాధాప్రాణవల్లభుడు కాగా శ్రీవిష్ణువు లక్ష్మీకాంతుడైనాడు. చతుర్భుజుడైన శ్రీవిష్ణువు శ్రీమహాలక్ష్మితో గూడి వైకుంఠపరంధామమునకు బ్రస్థానమొనరించెను. శ్రీవిష్ణువు, శ్రీకృష్ణుడు వీరిర్వురు సమస్తాంశములందు సరిసమానులు.

మహాలక్ష్మీశ్చ యోగేన నానారూపా బభూవ సా ।
వైకుణ్ఠే చ మహాలక్ష్మీః పరిపూర్ణతమాఽపరా ॥
శుద్ధసత్త్వస్వరూపా చ సర్వసౌభాగ్యసంయుతా ।
ప్రేమ్ణా సా వై ప్రధానా చ సర్వాసు రమణీషు చ ॥
స్వర్గే చ స్వర్గలక్ష్మీశ్చ శక్రసమ్పత్స్వరూపిణీ ।
పాతాలేషు చ మర్త్యేషు రాజలక్ష్మీశ్చ రాజసు ॥

గృహలక్ష్మీర్గృహేష్వేవ గృహిణీ చ కలాంశయా ।
సమ్పత్స్వరూపా గృహిణాం సర్వమఙ్గలమఙ్గలా ॥
గవాం ప్రసూః సా సురభి ర్దక్షిణా యజ్ఞకామినీ।
క్షీరోదసిన్ధుకన్యా సా శ్రీరూపా పద్మినీషు చ॥
శోభారూపా చ చన్ద్రే సా సూర్యమణ్డలమణ్డితా ।
విభూషణేషు రత్నేషు ఫలేషు జలజేషు చ॥
నృపేషు నృపపత్నీషు దివ్యస్త్రీషు గృహేషు చ ।
సర్వసస్యేషు వస్త్రేషు స్థానే సా సంస్కృతే తథా ॥
ప్రతిమాసు చ దేవానాం మఙ్గలేషు ఘటేషు చ।
మాణిక్యేషు చ ముక్తాసు మాల్యేషు చ మనోహరా ॥
మణీన్ద్రేషు చ హారేషు క్షీరే వై చన్దనేషు చ।
వృక్షశాఖాసు రమ్యాసు నవమేఘేషు వస్తుషు॥

శ్రీమహాలక్ష్మి తనయోగబలముచే నానారూపముల విరాజమానురాలయ్యెను. ఆమె సంపూర్ణ సౌభాగ్యములతో సంపన్నమై పరమశుద్ధసత్త్వస్వరూపముతో పరిపూర్ణురాలై, శ్రీమహాలక్ష్మి యనుదివ్యనామమున వైకుంఠపరంధామములో విరాజిల్లెను. ప్రేమయే మూర్తీభవించినవిగ్రహమైనకారణమున సమస్తనారీసముదాయములం దామె ప్రధానురాలైనది. ఆమెయే స్వర్గములో నిందునిసంపత్తిస్వరూపిణి యైస్వర్గలక్ష్మి యనునామమున బ్రసిద్ధిగాంచెను. పాతాళలోకములలో, మర్త్యలోకములో నరేశ్వరులచెంత రాజలక్ష్మి యైనది. గృహస్థుల గృహములలో గృహలక్ష్మినామమున పూజింపబడి, యాజనని తనకలాంశముచే గృహిణియని కీర్తింపబడినది. ఆమె గృహస్థులకు సకలసంపత్స్వరూపిణి, సర్వమంగళమంగళ. గోజనని, సురభి, యజ్ఞపత్ని దక్షిణకూడ నీమె స్వరూపములే. క్షీరసాగరములో నీమెయే యాయన కన్యారత్నము. పద్మములందు శ్రీరూపమున నీదేవియే విరాజిల్లును. చంద్రునందు, సూర్యునందు, శ్రీలక్ష్మియే శోభారూపమున నివసించును. భూషణములందు, రత్నములందు, ఫలములందు, జలములందు, రాజులందు, రాణులందు, దివ్యనారీమణులందు, గృహములందు, సర్వధాన్యములందు, వస్త్రములందు, పవిత్రస్థానములందు, దేవతాప్రతిమలందు, మంగళకలశమందు, మాణిక్యము

లందు, ముత్యములమాలలందు, బహుమూల్యవజ్రములందు, జందనమందు, వృక్షశాఖలందు, నవమేఘాదిసకలవస్తుసముదాయములందు శ్రీమహాలక్ష్మి తన వివిధాంశములలో విరాజిల్లుచున్నది.

మునీశ్వరా! దివ్యవైకుంఠపరంధామములో సర్వప్రథమమున స్వాయముగ శ్రీమన్నారాయణుడే శ్రీమహాలక్ష్మి దివ్యారాధనము సాంగోపాంగముగ సంపన్న మొనరించెను. తదనంతరము స్వాయముగ బ్రహ్మ యత్యంతభక్తితో శ్రీమహాలక్ష్మి నర్చించెను. తదుపరి శ్రీమహాదేవు డక్లే పూజించెను. మునీశ్వరా! క్షీరసాగరములో విష్ణువు శ్రీమహాలక్ష్మి నారాధించెను. తదనంతరము స్వాయంభువమనువు, మానవేంద్రులు, ఋషీశ్వరులు, మునీశ్వరులు. సాధువులు, గృహస్థులు, మొదలగువారందఱు నామె నుపాసించి ధన్యులైరి. గంధర్వులు, నాగులు మొదలగువారు పాతాళలోకములలో లక్ష్మీదేవియారాధన మొనరించిరి. భాద్రపదమాసములో శుక్లాష్టమీ శుభదినమున జగత్స్రష్ట యగుబ్రహ్మచే శ్రీమహాలక్ష్మిసుపూజితురాలయ్యెను. నారదా! ఆనాటినుండి నేటి వఱకు భాద్రపదమాసములో శుక్లపక్షాష్టమీశుభదినమునుండి తత్పక్షాంతము వఱకు త్రిలోకములలో సకలదేహధారులు భక్తిపూర్వకముగ నామె నారాధించుచుండిరి. చైత్రభాద్రపద పౌష్యమాసములలో బ్రతిమంగళవారమున విష్ణువు భక్తిపూర్వకముగ త్రిలోకములలో శ్రీలక్ష్మిపూజామహోత్సవములను బ్రారంభించెను. వర్షాంతమందు పౌష్యమాససంక్రాంతిదినమున స్వాయముగ మనువే తనప్రాంగణములో శ్రీమహాలక్ష్మిప్రతిమలో నామె నావాహన మొనరించి తత్పూజ సంపన్న మొనరించెను. తదనంతరము నాటినుండి త్రిలోకములలో నాపూజావిధానము ప్రచలితమైనది. దేవర్షీ! సకలరాజేంద్రులు, మంగళుడు, కేదారుడు, నీలుడు, నలుడు, సుబలుడు, ఉత్తానపాదనందను డైన ధ్రువుడు, ఇంద్రుడు, బలి, కశ్యపుడు, దక్షుడు, మనువు, వివస్వానుడు (సూర్యుడు), ప్రియవ్రతుడు, చంద్రుడు, కుబేరుడు, వాయువు, యముడు, అగ్ని, వరుణుడు మొదలగువా రందఱు సకలమంగళప్రదాయిని యైనశ్రీమహాలక్ష్మి యుపాసన మొనరించి ధన్యులైరి. ఇట్లు శ్రీమహాలక్ష్మి సర్వత్ర సర్వులచే సదా సుపూజితురా లైనది.

సర్వైశ్వర్యాధిదేవీ సా సర్వసమ్పత్స్వరూపిణీ ॥ (34)

శ్రీమహాలక్ష్మి సర్వైశ్వర్యములకు నధిష్ఠాత్రీదేవి, సమస్తసంపదలు నీమె స్వరూపములే యని గ్రహింపుము.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణ
సంవాదమున లక్ష్మీస్వరూపనిరూపణ
మను ముప్పదియైదవ అధ్యాయము
సంపూర్ణము.

—♦—

## ముప్పదియాఱవ అధ్యాయము

### శ్రీమహాలక్ష్మీదేవ్యుపాఖ్యానాంతర్గత మైనశ్రీదూర్వాసేంద్ర సంవాదము.

**నారదుడు పలికెను :**

పూజ్యా! శ్రీమహాలక్ష్మి శ్రీమన్నారాయణునిప్రియార్థాంగియై సదా వైకుంఠములో విరాజిల్లెనని ప్రవచించితివి. ఆసనాతని యగులక్ష్మీదేవి వైకుంఠపరంధామమున కధిష్ఠాత్రీదేవి యనియు నీవు ప్రవచించితివి. అయినచో నాజనని పృథ్విపై సింధుకన్యారూపమున నెట్లు ప్రాదుర్భవించెను? ఆమె ధ్యానమును, గవచనమును, పూజావిధానమును నా కుపదేశింప బ్రార్థించుచున్నాను. పూర్వకాలములో శ్రీమహాలక్ష్మిని సర్వప్రథమమున నేస్తోత్రముతో నెవరు స్తుతించిరి? సకలసందేహభంజనా! నాయీసందేహముల నన్నింటిని నివారింప వలసినదిగ బ్రార్థించుచున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! అత్యంతప్రాచీన మైనయీదివ్యచరితమును బ్రవచించెద శ్రవణ మొనరింపుము. పూర్వకాలములో దూర్వాసమహర్షి యొసంగినశాపమునకు

గుణికిమై యింద్రుడు, సకలదేవతలు, మర్త్యలోకవాసులు నందఱు శ్రీహీనులై పరితపించిరి. ఆగ్రహించిన స్వర్గలక్ష్మి స్వర్గాదులను త్యజించి యత్యంతదుఃఖితురాలై వైకుంఠమును జేరి మూలవిరాట్టైన శ్రీమహాలక్ష్మిలో విలీనమయ్యెను. లక్ష్మి యనుగ్రహమునకు దూరస్థులై దేవత లందఱుమహాశోకార్ణవమగ్నులై బ్రహ్మలోకము జేరి బ్రహ్మదేవు నాశ్రయించిరి. బ్రహ్మ శ్రీహీను లైన దేవతలను దోడ్కొని శ్రీమన్నారాయణుడు విరాజిల్లు వైకుంఠము జేరి యాపరంధాముని దివ్యచరణములను శరణు వేడెను. శ్రీహీనులై శుష్కకంఠోష్ఠతాలువులచే బరితపించు దేవతలు తమసౌభాగ్యవశమున శ్రీమన్నారాయణునివలన నభయము నొంది ధన్యులైరి. అపుడు పరమపురుషు డైన శ్రీమన్నారాయణుని యాజ్ఞానువర్తినియై యింద్రసంపత్స్వరూపిణి యైనస్వర్గలక్ష్మి తన కళతో సింధుకన్యయై మరల బ్రాదుర్భవించెను. దేవతలు, దానవులు కలిసి క్షీరసాగరమథన మొనరింపగా దానిలోనుండి మహాలక్ష్మి ప్రాదుర్భవించెను. దేవీ దివ్యసందర్శన మొనరించి దేవతలు చరితార్థులై తదనుగ్రహమును మరల బొందగల్గిరి. దేవతల ననేకవరములతో ననుగ్రహించి ప్రసన్నవదన యైన శ్రీమహాలక్ష్మి క్షీరసాగరశయను డైనవిష్ణువును వరమాలతో వరించి యాయన సేవలందు నిమగ్నురా లయ్యెను. నారదా! ఆజగజ్జనని కృపాకటాక్షములవలన దేవతలు తాము కోల్పోయిన దేవసామ్రాజ్యము నసురులనుండి తిరిగి పరిగ్రహించిరి. తదనంతరము సకలదేవతలు బాగుగ శ్రీమహాలక్ష్మి ననేకవిధముల బూజించి, స్తుతించి సర్వత్ర నిరపాయులై సుఖించిరి.

**నారదుడు పలికెను :**

దూర్వాసమహర్షి యఖండబ్రహ్మనిష్ఠాసంపన్నుడు, దివ్యతత్త్వజ్ఞానయుక్తుడు. ఆమహర్షి యెప్పు డెందుల కేయపరాధకారణముగ దేవపతి నింద్రుని శపింపవలసివచ్చెను? దేవతలు మొదలగువారందఱు నెట్లు సముద్రమథన మొనరింపగల్గిరి? ఏస్తోత్రములవలన ప్రసన్నురాలై శ్రీమహాలక్ష్మి యింద్రునకు సాక్షాత్కరించెను? ప్రభూ! ఇంద్రదుర్వాసుల నడుమ నేసంవాదము సంభవించెను? ఈవిషయముల నన్నింటిని విపులముగ వివరింప బ్రార్థించుచున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను:**

నారదమునీంద్రా! ఈవిషయ మత్యంతప్రాచీనము. దుర్వాసమహర్షి వైకుంఠమునుండి కైలాసమునకు ప్రస్థానమొనరించుచుండగ మార్గమధ్యములో నింద్రు డామహర్షిని దర్శించెను. మునీశ్వరుని శరీర మఖండబ్రహ్మతేజముతో ప్రదీప్తమగుచున్నది. గ్రీష్మర్తువులో మధ్యాహ్నమున ప్రకాశించు ప్రచండభానునివలె దుర్వాసమహర్షి ప్రకాశించుచుండెను. ఆయన జటాజూటము ప్రతప్తసువర్ణమువలె మెఱయుచుండెను. శ్వేతయజ్ఞోపవీతధారియై, హస్తములందు దండకమండలములను ధరించి, లలాటమందు జంద్రునివలె శోభించుతిలకమును ధరించి, వేదవేదాంగపారంగతు డైనయామహర్షి యసంఖ్యాక శిష్యకోటి పరివేష్టితుడై యుండగా మహేంద్రుడు దర్శించి తల వంచి నమస్కరించెను. మహర్షి శిష్యులనుగూడ దేవపతి ప్రణామములచే సంతుష్టుల నొనరించెను. అపుడు మహర్షి యింద్రునకు శుభాశీర్వాదమొసంగి విష్ణుదేవు ననుగ్రహమున దనకు బ్రాప్తించిన శ్రీహరిపూజాకుసుమమైన మనోహరపారిజాతము నింద్రున కొసంగెను.

రాజశ్రీగర్వముచే గర్వాంధుడై యింద్రుడు మృత్యుశోకాదుల నశింపజేయగల్గి మోక్షప్రద మైనయాకుసుమమునుసామాన్యపుష్పముగభావించి అలంకారముగ తా నధిష్ఠించియున్న ఐరావతశిరముపై నలంకరించెను. ఆ దివ్యపుష్పస్పర్శము గలుగగనే యైరావతము రూపగుణతేజస్సంపన్నమై విష్ణుసమానశక్తిమంతమయ్యెను. తదనంతర మాగజరా జింద్రుని బడవైచి ఘోరవనములకు యథేచ్ఛగా బయనించెను. మునీశ్వరా! అఖండతేజస్సమన్విత మైనయాగజరాజమును దేవపతియే శాసింపలేకపోయెను. తా నొసంగిన దివ్యపారిజాతకుసుమము నింద్రుడు పరిత్యజించి తిరస్కరించుట గాంచి దుర్వాసమహర్షి యత్యంతకుపితుడై యిట్లు శపించెను.

**దుర్వాసమహర్షి పలికెను:**

ఓరీ! ఇంద్రా! సామ్రాజ్యశ్రీ గలదనునభిమానముతో ప్రమత్తుడవై నీ వేల న న్నవమానించితివి? నేను నీ కొసంగిన శ్రీహరిపూజాపుష్పము నేల గర్వాంధుడవై స్వయముగ మస్తకముపై ధరింపక, నీగజరాజుశిరముపై నుంచితివి?

విష్ణోర్నివేదితం పుష్పం నైవేద్యం వా ఫలం జలమ్।
ప్రాప్తిమాత్రేణ భోక్తవ్యం త్యాగేన బ్రహ్మహా జనః ॥
భ్రష్టశ్రీ ర్భష్టబుద్ధిశ్చ భ్రష్టజ్ఞానో భవే న్నరః ।
య స్త్యజే ద్విష్ణునైవేద్యం భాగ్యే నోపస్థితం శుభమ్ ॥ (28, 29)

శ్రీవిష్ణువునకు సమర్పించిననైవేద్యము, ఫలములు, పుష్పములు, జలములు లభింపగనే వాని నుపభోగమొనరింపవలెను. అట్లొనరింపక త్యజించిన యెడల బ్రహ్మహత్యాపాతక సదృశ మైనదోషము సంభవించును. సౌభాగ్య వశమున బ్రాప్తించిన విష్ణుదేవునిపావననైవేద్యము పరిత్యజించువారు శ్రీహీనులు, బుద్ధిహీనులు, జ్ఞానహీనులు, భ్రష్టులు కాగలరు.

ప్రాప్తిమాత్రేణ యో భుంక్తే భక్త్యా విష్ణునివేదితమ్ ।
పుంసాం శతం సముద్ధృత్య జీవన్ముక్త స్స్వయం భవేత్ ॥
విష్ణునైవేద్యభోజీ యో నిత్యం తు ప్రణమే ద్ధరిమ్।
పూజయే త్స్తౌతి వా భక్త్యా స విష్ణుసదృశో భవేత్ ॥
తత్స్పర్శవాయునా సద్య స్తీర్థౌఘశ్చ విశుద్ధ్యతి ।
తత్పాదరజసా మూఢః సద్యః పూతా వసున్ధరా ॥ [30-32]

విష్ణుదేవున కర్పించినవస్తువును బడసినభాగ్యశాలి యైనదేహధారి యా నైవేద్యమును భుజించిన దాను జీవన్ముక్తు డగుటయేగాక తననూఱుతరముల వారినిగూడ నుద్ధరింపగలడు. ఏపురుషుడు నిత్యము శ్రీహరినైవేద్యమును భుజించుచు శ్రీహరిని భక్తిపూర్వకముగ బూజించి స్తుతించునో, యతడు విష్ణుసముడు కాగలడు. అట్టి భక్తుని స్పృశించి వీచువాయుసంయోగమాత్రముననే సకలతీర్థములు పవిత్రములు కాగలవు. ఆభాగవతోత్తముని చరణ రజస్స్పర్శముచే బృథ్వియు బునీత కాగలదు.

శ్రీహరి కర్పింపనిపదార్థములు మాంససమానములై యభక్ష్యములు కాగలవు. కన్యను విక్రయించి జీవించువానియన్నము, యోనిపై జీవించు కులటయన్నము, చల్లారిపాసిన యన్నము, సర్వులుభుజింపగ మిగిలినయన్నము, శూద్రీపతి యైనద్విజు డొసంగినయన్నము, అదీక్షితు డొసంగినయన్నము, శవదాహి యొసంగినయన్నము, అగమ్యాగామి, మిత్రద్రోహి, విశ్వాసఘాతకుడు, కృతఘ్నుడు, అసత్యవాది మొదలగు వా రొసంగినయన్నము నత్యంత

దూషితములుగ దెలిసికొనవలెను. కాని యట్టిపదార్థములుకూడ విష్ణువున కర్పించిన బరిశుద్ధములై భోజనయోగ్యములు కాగలవు. చండాలుడైనను విష్ణుదేవు నుపాసించినచో జీవన్ముక్తుడై తనవంశజుల నెల్ల నుద్ధరింపగలడు. శ్రీహరిభక్తివిముఖుడైనమానవుడు స్వయముగ దన్ను తానే రక్షించుకొనలేడని తెలిసికొనుము. అజ్ఞానమునందైన విష్ణుదేవున కర్పించిన నైవేద్యమును భుజించిన పురుషుడు తా నేడుజన్మముల జేసినపాపపుంజములనుండి విముక్తుడు కాగలడు. తెలిసి భక్తిపూర్వకముగ శ్రీహరి నైవేద్యమును భుజించువారు తా మొనరించిన యసంఖ్యాకజన్మములపాపములనుండి నిశ్చయముగ విముక్తులు కాగలరు.

ఇంద్రా! నీవైశ్వర్యమదాంధుడవై భగవంతుని ప్రసాద మైనపారిజాత పుష్పమును స్వీకరింపక గజరాజు మస్తకమున నలంకరించితివి. ఈయపరాధ ఫలముగ స్వర్గలక్ష్మి నిన్ను వీడి శ్రీహరిని జేరగలదు. నేను శ్రీమన్నారాయణుని యనన్యభక్తుడను. కావున శివుడైనను, బ్రహ్మయైనను నాకు కించిన్మాత్రమైనను భయము లేదు. కాలము, మృత్యువు, జరాదులను గాంచి కూడ నేను జలింపను. అట్టిచో మఱియొకరు నా కేలెక్కలోనివారు! నీతండ్రి యైనకశ్యపప్రజాపతి కూడ న న్నేమియు జేయలేడు. నీయాచార్యుడైనబృహస్పతియు నిశ్శంకపురుషుడ నైననానాశాపమును నివారింపలేడు. ఈదివ్యపారిజాతకుసుమ మెవరిశిరమున నలంకరింపబడునో, వారే సర్వులందు ప్రథమపూజ నొందగలరు. శివకుమారుని శిరము ఖండింపబడగా వాని పునర్జీవనము కొఱకీగజరాజుమస్తకమే యాయన శరీరమునకు శ్రీహరిచే జోడింపబడగలదు.

## శ్రీనారాయణఋషి పలికెను :

మునీశ్వరా! ప్రచండభానునివలె ప్రకాశించు దుర్వాసమహర్షి యొసంగిన శాపము నాలకింపగనే శుష్కకంఠోష్ఠతాలు యుక్తుడై దేవపతి యగునింద్రుడు పశ్చాత్తప్తహృదయముతో మహర్షిచరణములపై బడెను. భయకారణమున శరీరము కంపించుచుండగ నుచ్చైస్స్వరముతో దుఃఖించుచు దేవేంద్రుడు మహర్షి నిట్లు ప్రార్థింప నారంభించెను.

**ఇంద్రుడు పలికెను:**

మహర్షి! ఈమదాంధుని మీ రిట్లు శపించు టత్యంతోచితమే. నాసకల సంపదలను హరించినను మీరు కృపామయులై నాకు దత్త్వజ్ఞానోపదేశ మొనరింపుడు.

> ఐశ్వర్యం విపదాం బీజం జ్ఞానప్రచ్ఛన్నకారణమ్।
> ముక్తిమార్గార్గలం దార్ఢ్యం హరిభక్తివ్యపాయకమ్॥
> జన్మమృత్యుజరారోగశోక దుఃఖకరం పరమ్।
> సమ్పత్తితిమిరాన్ధశ్చ ముక్తిమార్గం న పశ్యతః॥ (48-49)

ఐశ్వర్యమే విపత్తులకు బీజము, ధనము జ్ఞానమునకు బ్రచ్ఛన్న కారణము కాగలదు, కావుననే సంపదలు ముక్తిమార్గమున కవరోధములని చెప్పబడినవి. ఈకారణమువలననే హరిభక్తియం దడుగడుగున నంతరాయము లుపస్థితములు కాగలవు. సంపద మరణమునకు, బునర్జన్మమునకు, జరాశోకరోగాదులకు బ్రధానకారణము కాగలదు. ధనమదముచే నంధుడైనమానవుడు ముక్తిమార్గమును వీక్షింపలేడు.

సంపదలచే బ్రమత్తులైన వారిని మదిరామత్తులుగ భావింపవలెను. ధనమదాంధుని స్వబాంధవులు పరివేష్టించియున్నను నతడు వారినే ద్వేషించును. వైభవమత్తుడై, విషయాంధుడై, విహ్వలుడై మహాకామి యైనరాజసవ్యక్తికి సత్త్వమార్గావలోకన మొనరించుయోగ్యత నశించును. విషయాంధులు రెండువిధములుగ నుందురు. కొందఱు రాజసులు మఱికొందఱు తామసులు. శాస్త్రజ్ఞానవిహీనులై ధనమదాంధులైనవారిని దామసులందురు. శాస్త్రజ్ఞాన మున్నను నజ్ఞానులై ధనమునకు దాసులైనవారినే రాజసు లనిరి. మునిశ్రేష్ఠా! శాస్త్రము మానవులకు రెండే రెండుమార్గములను జూపెను. మొదటిది ప్రవృత్తిమార్గము, రెండవది నివృత్తిమార్గము. ప్రవృత్తిమార్గ మసంఖ్యాకదుఃఖములకుమూలము, కాని క్లేశములందే సుఖములు కలవని భ్రమించి మానవులు మొదట బ్రవృత్తిమార్గముపై బ్రస్థాన మొనరింతురు. ఈప్రవృత్తిమార్గము స్వచ్ఛందము, ప్రసన్నతాపూర్ణము,

విరోధశూన్యము, ఆపాతమధురము, అయినను బరిణామములో నీమార్గగమనము సర్వనాశమునకు బీజము, జన్మమృత్యుజరాచక్రప్రదము.

అనేకజన్మపర్యంతం కృత్వా చ భ్రమణం ముదా।
స్వకర్మ-విహితాయాం చ నానాయోన్యాం క్రమేణ చ॥
తతః కృష్ణానుగ్రహాచ్చ సత్సఙ్గం లభతే జనః ।
సహస్రేషు శతే ష్వేకో భవాబ్ధేః పారకారణమ్ ॥
సాధుః సత్త్వప్రదీపేన ముక్తిమార్గం ప్రదర్శయేత్ ।
తదా కరోతి యత్నం చ జీవీ బన్ధనఖణ్డనే॥
అనేకజన్మయోగేన తపసా ఽనశనేన చ ।
తదా లభే న్ముక్తిమార్గం నిర్విఘ్నం సుఖదం పరమ్॥ [56-59]

జీవు డనేకజన్మములపర్యంతము తా నొనరించినకర్మముల పరిణామముగ నానావిధయోనులందు క్రమముగ పరిభ్రమింపగలడు. జననమరణచక్రమున బరిభ్రమించి, యెట్టకేలకు జీవునకు సుదుర్లభమానవజన్మము లభించును. ఆ మానవజన్మములో శ్రీకృష్ణుని యనుగ్రహమువలన సత్సాంగత్యము లభించును. వేనవేలు మానవులలో నొకానొకసాధుపురుషుడు భవసాగరమును దరించుటలో గృతకృత్యుడు కాగలడు. సాధుపురుషులు తమలో బ్రకాశించుసత్త్వగుణదీపప్రకాశముచే ముక్తిమార్గమును బాగుగ దర్శింపగలరు. అపుడు జీవునిహృదయములో భవబంధములను ఖండించుకొనవలెనని దృఢసంకల్ప ముత్పన్నముకాగా నందుల కాతడు ప్రయత్నించును. అనేకజన్మసముపార్జితపుణ్యము, తపఉపవాసాదులు సహాయపడగా మానవుడు నిర్విఘ్నముగ బరమసుఖప్రద మైనముక్తిమార్గమును బొందగలడు. మహర్షీ! ఈ విషయములను నేను విభిన్నప్రసంగావసరములలో నాగురుదేవుని (బృహస్పతి) ముఖారవిందమునుండి శ్రవణ మొనరించితిని. విధాత యీవిపత్సమయములో నా కఖండజ్ఞానసాగరు లైనమిమ్ములను బ్రసాదించినాడు. న న్నుద్ధరించుటకు శాపరూపమున మీ రొసంగిన యీవిపత్తులు వాస్తవముగ నా కఖండసంపత్స్వరూపములు. జ్ఞానసింధూ! దీనబంధూ! దయానిధీ! మీచరణముల నాశ్రయించిన యీదీనాతిదీనునకు భవసాగరమును దరింపజేయగల యఖండతత్త్వజ్ఞానోపదేశ మొనరింపుడు.

**శ్రీనారాయణఋషి పలికెను :**

దేవర్షీ! ఇందుడొనరించినప్రార్థనల నాలకించి జ్ఞానులకే యాచార్యుడైనదుర్వాసమహర్షి యత్యంతసంతుష్టుడై సస్మితముఖారవిందముతో దివ్య తత్త్వజ్ఞానము నిట్లుపదేశింప నారంభించెను.

**దుర్వాసమహర్షి ఉవాచ :**

అహో! మహేన్ద్ర మాఙ్గల్య మాత్మానం ద్రష్టు మిచ్ఛసి ।
ఆపాతతో దుఃఖబీజం పరిణామసుఖావహమ్ ॥
స్వగర్భయాతనానాశపీడాఖణ్డనకారణమ్ ।
దుష్పారాపారదుర్వారసంసారార్ణవతారకమ్ ॥
కర్మవృక్షాఙ్కురచ్ఛేదకారణం సర్వతారకమ్ ।
సంతోషసంతతికరం ప్రవరం సర్వవర్త్మనామ్ ॥ [64-66]

ఓహో! మహేంద్రా! అభీష్టమోక్షమార్గమును బొందవలె ననెడి నీ యాకాంక్ష మహామంగళవిషయము. ఈమహాజ్ఞానమార్గము మొదట గొంత దుఃఖమునకు (కష్టములకు) గారణముగ గోచరించినను బరిణామములో నఖండ సుఖప్రదాయకమని గ్రహింపుము. ఈజ్ఞానము మాతృగర్భవాస మనెడి యాతనను మృత్యు వనెడి పీడను నిశ్చయముగ ఖండింపగలదు. ఎవరును దరింపలేనిదుర్వారాపారసంసారపారావారమునుండి నిన్నీ జ్ఞానము సులభముగ నుద్ధరింపగలదు. ఈజ్ఞానప్రాప్తి కర్మరూప వృక్షాంకురములను ఖండించి యందఱ నుద్ధరింపగలదు. సర్వమార్గములందు నేను బ్రవచింపబోవుజ్ఞాన మార్గమే యత్యంత శ్రేయము, సంతోషప్రదము, సంతతికరము.

దానేవ తపసా వాఽపి వ్రతే నానశనాదినా ।
కర్మణా స్వర్గభోగాదిసుఖం భవతి జీవినామ్ ॥
కామ్యానాం కర్మణాం చైవ మూలం సంఛిద్య యత్నతః।
అదునేదం మోక్షబీజం సంకల్పాభావ ఏవ చ ॥
యత్కర్మ సాత్త్వికం కుర్యా దసంకల్పితమేవ చ।
సర్వం కృష్ణార్పణం కృత్వా పరే బ్రహ్మణి లీయతే ॥ [67-69]

దానములు, తపములు, వ్రతములు, ఉపవాసములు మొదలగు సత్కర్మలవలన జీవులకు స్వర్గభోగాదిసుఖము లుపలబ్ధములు కాగలవు. నేను ప్రవచింపబోవు నీమహాజ్ఞానము మొదట యత్నపూర్వకముగ సకామకర్మల మూలములను ఖండించి హృదయక్షేత్రములో మోక్షబీజమును నాటగలదు. ఇంద్రా! ఎట్టిసంకల్పములు లేకుండుటే మోక్షమున కేకైకబీజ మని గ్రహింపుము. మానవు డేసాత్త్వికకర్మముల నాచరించినను నిచ్ఛారహితుడై, సంకల్పశూన్యుడై యాచరింపవలెను. సర్వకర్మములను శ్రీకృష్ణపరమాత్మ చరణారవిందములందు సమర్పించిన జ్ఞానియైనపురుషు డాపరబ్రహ్మమునందే విలీనుడు కాగలడు.

సాంసారికాణా మేతత్తు నిర్వాణం మోచకం విదుః ।
నేచ్ఛన్తి వైష్ణవా స్తత్తు సేవావిరహకాతరాః ॥
సేవాం కుర్వన్తి తే నిత్యం విధాయోత్తమదేహకమ్।
గోలోకే వాஉపి వైకుణ్ఠే తస్యైవ పరమాత్మనః ॥
హరిసేవాదిరూపాం చ ముక్తి మిచ్ఛన్తి వైష్ణవాః ।
జీవన్ముక్తాశ్చ తే శక్ర! స్వకులోద్ధారకారిణః ॥ (70-72)

ఈసంసారములో బడినవారికి నేను ముందు ప్రవచించినదే నిర్వాణ మోక్షమార్గమని విద్వాంసులు నొక్కి వక్కాణించిరి. కాని వైష్ణవులైన వారు భగవత్సేవావిరహకాతరులై యానిర్వాణమోక్షమును వాంఛింపరు. వారు దివ్యదేహధారులై గోలోకమునో వైకుంఠమునో చేరి నిత్యము తత్పరమాత్మసేవాసౌభాగ్యసంపన్ను లయ్యెదరు. ఇంద్రా! వైష్ణవజనులు కేవలము భగవత్సేవారూపమైనముక్తి నిమాత్రమే యభిలషింతురు. వారు తాము జీవన్ముక్తు లగుటయేగాక తమవంశము నంతయు నుద్ధరింపగలరు.

స్మరణం కీర్తనం విష్ణో రర్చనం పాదసేవనమ్ ।
వన్దనం స్తవనం నిత్యం భక్త్యా నైవేద్యభక్షణమ్ ॥
చరణోదకపానం చ తన్మన్త్రజపనం పరమ్ ।
ఇదం నిస్తారబీజం చ సర్వేషా మీప్సితం భవేత్ ॥
ఇదం మృత్యుంజయజ్ఞానం దత్తం మృత్యుంజయేన మే ।
తచ్ఛిష్యోஉహం చ నిఃశఙ్క స్తత్ప్రసాదాచ్చ సర్వతః ॥ [73-75]

శ్రీహరిస్మరణము, కీర్తనము, అర్చనము, పాదసేవనము, వందనము, స్తవనము, నిత్యభక్తిభావముతో దన్నైవేద్యభక్షణము, చరణోదకపానము, తద్దివ్యనామజపము—ఇవియే సర్వజీవుల నుద్ధరింపగల యభీష్టబీజములని తెలిసికొనుము. ఈమహామృత్యుంజయజ్ఞానమును స్వయముగ భగవానుడగుమృత్యుంజయుడే నా కుపదేశించెను. నే నాయనశిష్యుడను కావున దత్కృపకు పాత్రుడనై సర్వత్ర నిర్భీకుడనై చరింపగల్గుచున్నాను.

స జన్మదాతా స గురుః స చ బన్ధుః సతాం పరః ।
యో దదాతి హరే ర్భక్తిం త్రైలోక్యే చ సుదుర్లభమ్ ॥
దర్శయే దన్యమార్గం చ వినా శ్రీకృష్ణసేవనమ్ ।
స చ తం నాశయ త్యేవ ధ్రువం తద్వధభా గ్భవేత్ ॥ (76, 77)

ఎవరుత్రిలోకములలో పరమదుర్లభ మైనశ్రీహరిభక్తిని ప్రసాదింతురో వారే జన్మదాత యైనతండ్రియని, జ్ఞానదాత యగునాచార్యుడని, బంధువులని, సత్పురుషులయందు శ్రేష్ఠులని తెలిసికొనుము. శ్రీకృష్ణసేవామార్గమునుదక్క నితరమార్గములను శిష్యుల కుపదేశించునాచార్యుడు తనశిష్యులను వినాశ మొనరింపగలడని గ్రహింపుము. నిశ్చయముగ నట్టిగురువునకు శిష్యుని వధించినపాపము సంభవింపగలదు.

సంతతం జగతాం కృష్ణనామ మఙ్గలకారణమ్ ।
మఙ్గలం వర్ధతే నిత్యం న భవే దాయుషో వ్యయః ॥
తేభ్యోఽప్యపైతి కాలశ్చ మృత్యుశ్చ రోగ ఏవ చ ।
సంతాపశ్చైవ శోకశ్చ వైనతేయా దివోరగాః ॥
కృష్ణమన్త్రోపాసకశ్చ బ్రాహ్మణః శ్వపచోఽపి వా ।
బ్రహ్మలోకం సముల్లఙ్ఘ్య యాతి గోలోక ముత్తమమ్ ॥
బ్రహ్మణా పూజితః సోఽపి మధుపర్కాదినా చ యః ।
స్తుతః సురైశ్చ సిద్ధైశ్చ పరమానన్దభావనః ॥ (78-81)

శ్రీకృష్ణపరమాత్మదివ్యనామమే సదా సమస్తలోకములకు మంగళప్రదము. శ్రీకృష్ణనామసంకీర్తన మొనరించు వారికి మంగళములు సదా వృద్ధినొందగలవు. వారి యాయుర్దాయము క్షీణింపదు. గరుత్మంతుని

గాంచినపాములు పలాయనము చిత్తగించు నట్లు శ్రీకృష్ణభక్తులను గాంచిన కాలము, మృత్యువు, రోగములు, సంతాపములు, శోకములు నిశ్చయముగ బారిపోగలవు. శ్రీకృష్ణమంత్రోపాసకుడు బ్రాహ్మణుడైనను లేక చండాలుడైనను నత డణుసమ్మిళితప్రాకృతబ్రహ్మాదిలోకములను దాటి నిత్యమైన, సత్యమైన బహూత్తమమైన గోలోకపరంధామము జేరగలడు. బ్రహ్మ సైతమాభాగవతోత్తముని మార్గమధ్యములో మధుపర్కాదుల సమర్పించి గౌరవింపగలడు. ఆభక్తుడు దేవతల, సిద్ధులముఖములనుండి తనప్రశంసల నాలకించుచు బరమానందానుభవముతో గోలోకపరంధామమునకు బోగలడు.

జ్ఞానసారం తపస్సారం బ్రహ్మసారం పరం శివమ్।
శివేనోక్తం యోగసారం శ్రీకృష్ణపదసేవనమ్॥
బ్రహ్మాదితృణపర్యన్తం సర్వం మిథ్యైవ స్వప్నవత్।
భజ సత్యం పరం బ్రహ్మ రాధేశం ప్రకృతేః పరమ్ ॥
అతీవసుఖదం సారం భక్తిదం ముక్తిదం పరమ్ ।
సిద్ధియోగప్రదం చైవ దాతారం సర్వసంపదామ్ ॥ 82-84

శ్రీకృష్ణచరణారవిందానన్యసేవాసౌభాగ్యమే నిజమైనజ్ఞానమని, తపమని, వేదమని, సకలయోగసారమని, పరమకళ్యాణస్వరూపమని మహాదేవుడు నొక్కివక్కాణించెను. బ్రహ్మమొదలు తృణమువఱకుగల సర్వజగములు స్వప్నములవలె మిథ్యలని తెలిసికొనుము. దేవేంద్రా! కేవలము ప్రకృతికిగూడ నతీతుడు, రాధావల్లభుడు, పరబ్రహ్మము నగుశ్రీకృష్ణపరమాత్మయే పరమ సత్యమని గ్రహింపుము. నీ వా పరబ్రహ్మమునే భజించి చరితార్థుడవు గమ్ము. శ్రీకృష్ణపరమాత్మయే యత్యంతసుఖదాయకుడు, సకలతత్త్వసారస్వరూపుడు, ననన్యభక్తిప్రదాత,సకలమోక్షప్రదాత, సిద్ధిప్రదాత, యోగప్రదాత, సంపూర్ణసంపత్ప్రదాత.

యోగినామపి సిద్ధానాం యతీనాం చ తపస్వినామ్ ।
సర్వేషాం కర్మభోగోఽస్తి న నారాయణసేవినామ్ ॥
భస్మసాచ్చ భవే త్పాపం యదుపస్పర్శమాత్రతః।
జ్వలదగ్నౌ పాతితం చ యథా శుష్కేన్ధనం తథా ॥

తతో రోగా హి వేపన్తే పాపాని చ భయాని చ ।
దూరతశ్చ పలాయన్తే యామదూతా స్తతో భయాత్ ॥ 85-87

యోగులకైనను, యతులకైనను, సిద్ధులకైనను, తాపసులకైనను స్వకర్మఫలభోగ మనివార్యము, కాని శ్రీమన్నారాయణు ననన్యభక్తులైనసేవకులకు గర్మఫలభోగము లంటవు. జ్వలించు నగ్నిలో బడవైచినశుష్కేంధనములు శీఘ్రముగ భస్మమగునట్లు భగవద్భక్తుని స్పర్శమాత్రముననే దేహధారి సకలపాపములు తత్కాలమందే భస్మములు కాగలవు. శ్రీకృష్ణభక్తుని గాంచిన రోగములు, పాపములు, భయాదులన్నియు గంపించును. యమదూతలైనను హరిభక్తుని గాంచిన భయభీతులై దూరముగ బాఱిపోగలరు.

తావ న్నిబద్ధః సంసారే కారాగారే విధే ర్జనః ।
న యావత్కృష్ణమన్త్రం చ ప్రాప్నోతి గురువక్త్రతః॥
కృతకర్మోపభోగాఖ్యనిగడచ్ఛేదకారణమ్ ।
మాయాజాలోచ్ఛేదకరం మాయాపాశనికృన్తనమ్॥
గోలోకమార్గసోపానం నిస్తారే బీజకారణమ్ ।
భక్త్యఙ్కురస్వరూపం చ నిత్యం వృద్ధ మనశ్వరమ్॥
సారం చ సర్వతపసాం యోగానాం సాధనం తథా।
సిద్ధీనాం వేదపాఠానాం వ్రతాదీనాం చ నిశ్చితమ్ ॥
దానానాం తీర్థస్నానానాం యజ్ఞాదీనాం పురందర। ।
పూజానా ముపవాసానా మిత్యాహ కమలోద్భవః ॥ (88-92)

సద్గురునిముఖారవిందమునుండి శ్రీకృష్ణమహామంత్రోపదేశ మొందనంతవఱకే మానవుడు విధాతయొక్క కారాగార మైనయీసంసారములో బంధింప బడియుండగలడు. అనగా శ్రీకృష్ణనామమంత్రగ్రహణమాత్రముననే జీవునకు భవబంధములు తొలగిపోగలవని భావము. శ్రీకృష్ణదివ్యనామము స్వయంకృతకర్మభోగము లనెడినిగడములను (సంకెళ్ళను), మాయాజాలమును, మాయాపాశాదులను త్రెంపగలదు. శ్రీహరిదివ్యనామసంకీర్తనమే గోలోకమార్గమునకు సోపానపంక్తి, భవసాగరమునుండి యుద్ధరించు బీజస్వరూపము, నిత్యము భక్తిని వృద్ధియొనరించు నక్షరాంకురము. పురందరా! శ్రీకృష్ణదివ్యగుణనామ సంకీర్తనమే సర్వతపములయు, యోగములయు, సిద్ధ

లయు, వేదాధ్యయనములయు, వ్రతములయు, దానములయు, దీర్థస్నానము లయు, యజ్ఞములయు, బూజోపవాసాదులయు బరిబూర్ణసారమని బ్రహ్మ దేవుని యనన్యమతము.

పుంసాం లక్షం పితౄణాం చ శతం మాతామహస్య చ
పూర్వం పరంచ తత్సంఖ్యం పితరంమాతరం గురుమ్॥
సహోదరం కలత్రం చ బన్ధుం శిష్యం చ కింకరమ్ ।
సముద్ధరేచ్ఛ శ్వశురం శ్వశ్రూం కన్యాం చ తత్సుతమ్
స్వాత్మానం చ సతీర్థ్యం చ గురుపత్నీం గురోః సుతమ్ ।
ఉద్ధరే ద్బలవా న్భక్తో మన్త్రగ్రహణమాత్రతః ॥ 93-95

శ్రీకృష్ణమహామంత్రోపాసకుడు, భక్తిబలసంపన్నుడు నగుననన్యభక్తుడు తాను దరించుటయేగాక లక్షాధికు లగుతనపితృదేవతలను, మాతామహు లను, పూర్వీకులను, దనతరువాతజన్మింపబోవుతరములవారలను, దల్లిని, దండ్రిని, గురువులను, సహోదరులను, భార్యను, బంధువులను, శిష్యులను, సేవకులను, మామను, మామకొమార్తెలను, మామకుమారులను, గురుపత్నిని గురువులసంతానమును నవలీలగ నుద్ధరింపగలడు.

మన్త్రగ్రహణమాత్రేణ జీవన్ముక్తో భవే న్నరః।
తత్స్పర్శపూత స్తీర్థౌఘః సద్యఃపూతా వసున్ధరా॥ 96

శ్రీకృష్ణమంత్రగ్రహణమాత్రమున నే మానవుడు జీవన్ముక్తుడు కాగలడు. అట్టి పరమభక్తు నిస్పర్శామాత్రముననే సకలతీర్థసముదాయములు, పృథ్వియు దత్కాలముననే పవిత్రములు కాగలవు.

అనేకజన్మపర్యన్తం దీక్షాహీనో భవే న్నరః ।
తదన్యదేవమన్త్రం చ లభతే పుణ్యలేశతః॥
సప్తజన్మసు దేవానాం కృత్వా సేవాం స్వకర్మతః ।
లభతే చ రవే ర్మన్త్రం సాక్షిణః సర్వకర్మణామ్ ॥
జన్మత్రయం భాస్కరం చ సేవిత్వా మానవః శుచిః ।
లభే ద్గణేశమన్త్రం చ సర్వవిఘ్నహరం పరమ్॥
జన్మత్రయం తం నిషేవ్య నిర్విఘ్నశ్చ భవేన్నరః ।
విఘ్నేశస్య ప్రసాదేన దివ్యజ్ఞానం లభే న్నరః॥ 97-100

మానవు డనేకజన్మలపర్యంతము దీక్షాహీనుడై జన్మించి యెట్టకేలకు దానొనరించిన లేశమాత్రపుణ్యప్రభావమున నన్యదేవతామంత్రము నొంద గలడు. అనేకజన్మములపర్యంత మన్యదేవతలను సేవించిన ఫలస్వరూపమున మానవునకు సకలకర్మసాక్షి యైనశ్రీసూర్యభగవానునిమంత్రము లభించును. మూడుజన్మములపర్యంతము సూర్యోపాసన మొనరించిన మానవుడు పరి శుద్ధుడై సర్వవిఘ్నహారి యైనశ్రీగణేశ్వరుని దివ్యమంత్రోపదేశము నొంద గలడు. మూడుజన్మములపర్యంతము గణేశ్వరుని యారాధనమున సంలగ్నుడు కాగా వాని సకలవిఘ్నములు దూరములు కాగలవు. తదనంతరము శ్రీ గణేశ్వరుని కృపాప్రసాదముచే నాసాధకునకు దివ్యజ్ఞానము లభింప గలదు.

తదా జ్ఞానప్రదీపేన సమాలోచ్య మహామతిః ।
అజ్ఞానాన్ధతమ శ్ఛిత్వా మహామాయాం భజే న్నరః ॥
ప్రకృతిం విష్ణుమాయాం చ దుర్గాం దుర్గతినాశినీమ్ ।
సిద్ధిదాం సిద్ధిరూపాం చ పరమాం సిద్ధియోగినీమ్॥
వాణీరూపాం చ పద్మాం చ భద్రాం కృష్ణప్రియాత్మికామ్।
నానారూపాం తాం నిషేవ్య జన్మనాం శతకం నరః ॥
తత్ప్రసాదా ద్భవేద్ జ్ఞానీ జ్ఞానానన్దం సదా భజేత్ ।
కృషం జ్ఞానాధిదేవం చ మహాదేవం సనాతనమ్ ॥ 101-104

శ్రీగణేశ్వరప్రదత్త మైనజ్ఞానప్రకాశములో బాగుగ నాత్మానాత్మవిచా రణ మొనరించుకొని యజ్ఞానాంధకారనివారణ మొనరించుకొనినయనంతరము మానవుడు విష్ణుమాయాస్వరూపిణి, యాద్యప్రకృతి, దుర్గతినాశిని యైనదుర్గను భజింపగలడు. ఆమె యఖండసిద్ధిప్రదాయిని, యఖిలసిద్ధిస్వరూపిణి, పరమ సిద్ధయోగిని. వాణి, లక్ష్మి, శ్రీకృష్ణప్రియ యైనరాధ మొదలగు ననేకరూపము లీయీశ్వరివే యని తెలిసికొనుము. నూఱుజన్మములవఱకు మానవు డీజనని నానారూపముల నారాధింపగలడు. ఈప్రకృతిమాతకృపకు పాత్రుడై మను ష్యుడు జ్ఞానానందస్వరూపుడు, శ్రీకృష్ణ జ్ఞానాధిదైవము, సనాతనుడు, మహా దేవకళ్యాణస్వరూపుడు, నగుశివుని సేవాసౌభాగ్యవంతుడు కాగలడు.

శివం శివస్వరూపం చ శివదం శివకారణమ్ ।
పరమానన్దరూపం చ పరమానన్దదాయినమ్ ॥

సుఖదం మోక్షదం చైవ దాతారం సర్వసంపదామ్ ।
అమరత్వపదం చైవ దీర్ఘ మాయుష్ప్రదం పరమ్॥
ఇన్ద్రత్వం చ మనుత్వం చ దాతుం శక్తం చ లీలయా ।
రాజేన్ద్రత్వప్రదం చైవ జ్ఞానదం హరిభక్తిదమ్ ।
జన్మత్రయం త మారాధ్య చాऽऽశుతోషప్రసాదతః ।
సర్వదస్య ప్రసాదేన శంకరస్య మహాత్మనః ॥
వరదస్య వరేణైవ హరిభక్తిం లభే ద్ధ్రువమ్।
తదా తద్భక్త సంసర్గా త్కృష్ణమన్త్రం లభే ద్ధ్రువమ్॥ 105-109

మహాదేవుడు మంగళదాయకుడు, కళ్యాణస్వరూపుడు, శివప్రదుడు, శుభకారణుడు, పరమానన్దస్వరూపుడు, పరమానందప్రదాయకుడు, శివుడు, సుఖదుడు, మోక్షప్రదుడు, సర్వసంపత్ప్రదాత, అమరత్వమును, దీర్ఘాయుర్దాయమును, నిందద్రత్వమును, మనుత్వమును నవలీలగ బ్రసాదింపగలసమర్థుడు, రాజేంద్రపదమును, నఖండజ్ఞానమును, శ్రీహరియనన్యభక్తిని బ్రసాదింపగల దాత. మూడుజన్మములపర్యంతము మహాదేవు నారాధించి మానవు డాశుతోషు డైనయామహాత్మునికరుణాకటాక్షములకు బాత్రుడై తుదకు నిశ్చయముగ శ్రీహరి భక్తిసామ్రాజ్యము నొందగలడు. తదనంతరము శ్రీకృష్ణానన్యభక్తులసంసర్గముచే మానవునకు శ్రీకృష్ణదివ్యమంత్రప్రాప్తి కల్గును.

నిర్మలజ్ఞానదీపేన ప్రదీప్తేన చ తత్త్వవిత్ ।
బ్రహ్మాదితృణపర్యన్తం సర్వం మిథ్యైవ పశ్యతి ॥
దయానిధేః ప్రసాదేన నిర్మలం జ్ఞాన మాప్నుయాత్ ।
వరదాతా వరేణైవ హరిభక్తిం లభేద్ ధ్రువమ్
తదా నివృత్తి మాప్నోతి సారా త్సారం పరాత్పరమ్।
యత్ర దేహే లభే న్మన్త్రం తద్దేహావధి భారతే॥
తత్పాంచభౌతికం త్యక్త్వా బిభర్తి దివ్యరూపకమ్ ।
కరోతి దాస్యం గోలోకే వైకుణ్ఠే వా హరేః పదే ॥
పరమానన్దసంయుక్తో మోహాదిషు వివర్జితః।
న విద్యతే పునర్జన్మ పునరాగమనం హరేః॥
పునశ్చ న పిబే త్క్షీరం ధృత్వా మాతృస్తనం పరమ్। 110-114

తత్త్వజ్ఞుడైనమానవుడు తనలో శ్రీకృష్ణమంత్రమహిమచే నిర్మలజ్ఞాన దీపము ప్రకాశింపగ నాప్రకాశములో బ్రహ్మ మొదలుతృణమువఱకు గలసర్వ జగములు మిథ్యగా దర్శింపగలడు. దయానిధి యైనశంకరుని ప్రసాదము వలన మానవునకు నిర్మలజ్ఞానము లభించును. వరదాత యైనశివునివరప్రభా వమువలన వానికి ధ్రువముగ శ్రీహరిభక్తి లభించును. అపుడు సారములకే సార మైనపరాత్పరునివృత్తిభావమును మానవుడు పొందగలడు. ఏ జన్మ ములో మానవునకు శ్రీకృష్ణమంత్రము లభించునో, యాశరీర మున్నంత వఱకే యతడు భారతవర్షములో నివసింపగలడు. ఆపాంచభౌతికశరీరత్యాగ మొనరించిన క్షణమందే యతడు దివ్యరూపధారియై శ్రీహరిపదము లైనగోలో కముగాని, వైకుంఠముగాని చేరి భగవంతునిపార్షదుడై యఖండసేవాసౌభాగ్య సంపన్నుడు కాగలడు. మోహాదిరహితుడు, పరమానందసంపన్నుడు నైన యాభక్తుడు మరల నీప్రాకృతికజగములలో బునర్జన్మ మొందడు. అనగా వానికి బునర్జన్మములేదు. వానికి మఱియెప్పుడు దల్లిస్తన్యపాన మొనరింపవల సినయవసరము కలుగదు.

విష్ణుమన్త్రోపాసకానాం గఙ్గాదితీర్థసేవినామ్॥
స్వధర్మిణాం చ భిక్షూణాం పునర్జన్మ న విద్యతే ।
తీర్థే పరిత్యజే త్పాపం క్రియాం కృత్వా హరిం భజేత్॥
అయం నిరూపితో ధాత్రా స్వధర్మ స్తీర్థసేవినామ్ ।
తన్నామమన్త్రం ప్రజపే త్తత్సేవాదిషు తత్పరః ॥
తద్వ్రతోపవాసరత ఇత్యుక్తో విష్ణుసేవినామ్ ।
సదన్నే వా కదన్నే వా లోష్టే వా కాంచనే తథా॥
సమబుద్ధి ర్యస్య శశ్వ త్స సన్న్యాసీతి కీర్తితః।
దణ్డం కమణ్డలుం రక్తవస్త్రమాత్రం చ ధారయేత్ ॥
నిత్యం ప్రవాసీ నై కత్ర స్యా త్సన్న్యాసీతి కీర్తితః । 115–119

విష్ణుమంత్రోపాసకులకు, గంగాదితీర్థసేవకులకు, స్వధర్మపరాయణు లైన భిక్షుకసన్న్యాసులకు, బునర్జన్మసంభవింపదు. మానవులు తీర్థములను సేవించి తమపాపములను బరిత్యాగమొనరించి పుణ్యకర్మానుష్ఠానసంపన్నులై సదా శ్రీహరిని భజింపవలెను. తీర్థసేవకు లైనపురుషుల కిదియే ధర్మమని విధాత

ప్రవచించియున్నారు. విష్ణుదేవుని దివ్యనామమంత్రజప మొనరింపవలెను, ఆయనసేవలందే తత్పరులై యుండవలెను, ఆయనవ్రతోపవాసములందే సంలగ్నులై యుండవలెను. ఇవియే విష్ణుసేవకులైనవారిధర్మములని విధాత ప్రవచించెను. సదన్నమందు, కదన్నమందు, మట్టియందు, సువర్ణమందు సదా సమభావము కల్గి వర్తించు వారే సన్న్యాసులని తెలిసికొనుము. దండకమండలములను గాషాయవస్త్రములను ధరించి ప్రతిదినము ప్రవాసమం దుండుట, యొకస్థానమం దెక్కువదినములు నివసింపకుండుట మొదలగునవియే సన్న్యాసిధర్మములు.

శుద్ధాచారద్విజాన్నం చ భుంక్తే లోభాదివర్జితః ॥
కింతు కించి న్న యాచేత స సన్న్యాసీతి కీర్తితః ।
న వ్యాపారీ నాఽఽశ్రమీ చ సర్వకర్మవివర్జితః
ధ్యాయే న్నారాయణం శశ్వ త్స సన్న్యాసీతి కీర్తితః ।
శశ్వన్మౌనీ బ్రహ్మచారీ సంభాషాపరివర్జితః ॥
సర్వం బ్రహ్మమయం పశ్యే త్స సన్న్యాసీతి కీర్తితః ।
సర్వత్ర సమబుద్ధిశ్చ హింసామాయావివర్జితః॥
క్రోధాహంకారరహితః స సన్న్యాసీతి కీర్తితః।
అయాచితోపస్థితం చ మిష్టామిష్టం చ భుక్తవాన్ ॥
న యాచతే భక్షణార్థీ స సన్న్యాసీతి కీర్తితః ।
న చ పశ్యే న్ముఖం స్త్రీణాం న తిష్ఠే త్తత్సమీపతః
దారవీమపి యోషాం చ న స్పృశే ద్యః స భిక్షుకః ।
అయం సన్న్యాసినాం ధర్మ ఇత్యాహ కమలోద్భవః ॥ 120–126

లోభాద్యపేతులై సదాచారసంపన్నులైనద్విజు లొసంగిన యన్నమునే భుజించుచు నెవ్వరిని యాచింపక చరించువారే సన్న్యాసులనబడు దురు. వ్యాపార మొనరింపక, యాశ్రమములను నిర్మింపక సమస్తవైదికకర్మములను వీడి నిరంతరము శ్రీమన్నారాయణ ధ్యానమందు సంలగ్నులై యుండు మహాత్ములనే నిజమైన సన్న్యాసు లనిరి. సదా మౌనములో నుండి బ్రహ్మచర్యపాలన మొనరించుచు, నితరులతో మాటలాడక సకలమును బ్రహ్మమయముగ దర్శించువారినే సన్న్యాసు లందురు. సర్వత్ర సమబుద్ధి కల్గి హింసామాయాదులనువర్జించి క్రోధాహంకారరహితులై చరించువారినే సన్న్యా

సులని కీర్తింతురు. యాచింపక లభించినపదార్థము మధురమైనను లేక స్వాదు రహితమైనను సమభావము గల్గి భుజించుచు మఱిమెవ్వరిని యాచింపక జీవించు వారలనే సన్న్యాసులని కీర్తింతురు. స్త్రీలముఖమైనను గాంచక వారియొద్ద నివసింపక కాష్ఠముతో నిర్మింపబడినస్త్రీమూర్తినైనను స్పృశింపక నిగ్రహము కల్గియున్నమహాత్ములనే నిజమైనభిక్షుకులందురు. బ్రహ్మదేవు డీధర్మములనే సన్న్యాసు లాచరింపదగినవని ప్రవచించెను.

విపర్యయే వినాశశ్చ జన్మ యామ్యం భయం భవేత్ ।
జన్మదుఃఖం యామ్యదుఃఖం జీవినా మతిదారుణమ్ ॥ (127)

పైన ప్రవచించినధర్మములకు విరుద్ధముగ ప్రవర్తించిన సన్న్యాసుల శిరముపై జననమరణయాతనాదిభయము లధిష్ఠింపగలవు. వారు మానవ జన్మమునుండి పతితులై క్షుద్రజంతుయోనులందు బరిభ్రమింపగలరు.

మాతృగర్భనరక మనుభవించి మాయామోహితుడై
హరినామసంకీర్తన మొనరింపక తనయలభ్య
మానవజన్మమును వృథా యొనరించు
జీవుని వర్ణనము.

గర్భేస్మరన్తి సర్వే తే కర్మ జన్మ శతోద్భవమ్ ।
విస్మరేన్నిర్గతో జీవో గర్భాద్వై విష్ణుమాయయా ॥ (129)

మాతృగర్భవాసములో నున్నంతవఱకు సకలప్రాణులు తమయసంఖ్యాక జన్మకర్మములను స్మరించుకొని దుఃఖింతురు. కాని గర్భమునుండి యవనిపై బడగనే జీవుడు విష్ణు మాయామోహితుడై సర్వమును మఱువగలడు.

స్వదేహం పాతి యత్నేన సురో వా కీట ఏవ వా। (129ఏ)

దేవతలైనను లేక కీటకములైనను నందఱు తమతమ శరీరములను యత్నపూర్వకముగ రక్షించుకొందురు.

యోనేరభ్యన్తరే శుక్రే పతితే పురుషస్య చ ।
శుక్రం శోణితయుక్తం చ సహసా తత్క్షణం భవేత్ ॥
రక్తాధిక్యే మాతృసమ శ్చేతరే పితు రాకృతిః ।
యుగ్మాహే చ భవే త్పుత్రః కన్యకాతద్విపర్యయే ॥

రవిభౌమగురూణాం చ వారే చేత్తద్ధ్రువే త్సుతః।
అయుగ్మాహే తదితరే వారే వై కన్యకా భవేత్ ॥ [130-132]

స్త్రీయోనియందు బురుషునివీర్యము ప్రవేశింపగనే యావీర్యకణములు తత్కాలమే స్త్రీ శోణితాండమును బ్రవేశింపగలవు. మాతృరక్తమాయండములో నధికముగ నున్నచో సంతానము తల్లివలె నుండగలదు, లేక పురుషవీర్య మధికముగ నున్నచో దండ్రియాకృతి సంతానమునకు లభించును. ఋతుకాలానంతరము యుగ్మదినములందు గర్భాధాన మొనరించిన బుత్రప్రాప్తి యగును లేక యయుగ్మదినములం దాధాన మొనరించిన గన్య జన్మింపగలదు. యుగ్మదినములం దథవా రవిమంగళగురువారములం దాధాన మొనరించిన బుత్రుడు జన్మించును. అన్యవారములందు విషమదినములందు గర్భాధాన మొనరించిన గన్య జన్మించును.

ప్రథమప్రహరే జన్మ యస్య సోఽల్పాయురేవ చ ।
ద్వితీయే మధ్యమశ్చైవ తృతీయే తత్పరో భవేత్ ॥
చతుర్థే చిరజీవీ స్యా త్క్షణానా మనురూపకః ।
దుఃఖీ వాఽపి సుఖీ వాఽపి పూర్వకర్మానురూపతః ॥ 133-134

ఎవనిపుట్టుక మొదటిజామునందు సంభవించునో యతడల్పాయువు కాగలడు, రెండవజాములో జన్మించిన వాని యాయుర్దాయము మధ్యమముగ నుండగలదు, మూడవజాములో జన్మించినవాడు దీర్ఘాయుష్కుడు కాగలడు. నాల్గవజాములో జన్మించినవాడు చిరంజీవి కాగలడు. ఏలగ్నములో శిశువు జన్మించునో యాసమయములో గలగ్రహస్థితి కనురూపముగ వానిభావిజీవన ముండగలదు. అతడు తనపూర్వకర్మానుసారముగ దుఃఖి లేక సుఖి కాగలడు.

యాదృశే చ క్షణే జన్మ ప్రసవ స్తాదృశే భవేత్।
ప్రసూతిక్షణచర్చాం చ కుర్వ న్త్యేవం విచక్షణాః ॥
కలలం త్వేకరాత్రేణ ప్రవృద్ధః స్యా ద్దినే దినే।
సప్తమే బదరాకారో మాసే గణ్డసమో భవేత్ ॥
మాసత్రియే మాంసపిణ్డో హస్తపాదాదివర్జితః ।
సర్వావయవసంపన్నో దేహీ మాసే చ పంచమే ॥

భవేత్తు జీవసంచారః షణ్మాసే సర్వతత్త్వవిత్ ।
దుఃఖీ స్వల్పస్థలస్థాయీ శకున్త ఇవ పంజరే ॥
మాతృజగ్ధాన్నపానం చ భుంక్తేఽమేధ్యస్థలే స్థితః ।
హాహేతి శబ్దం కృత్వా చ చిన్తయే దీశ్వరం పరమ్॥
ఏవం చ చతురో మాసా న్భుక్త్వా పరమయాతనాత్॥
ప్రేరితో వాయునా కాలే గర్భాద్వై నిర్గతో భవేత్ ॥ 135—140

ఎట్టిక్షణములో జన్మము సంభవించునో, యట్టిక్షణములో మాతృగర్భమునుండి శిశువు బయల్పడగలదు. విచక్షణతా సంపన్ను లైనవిద్వాంసులే ప్రసవక్షణముల నిట్లు నిర్ణయించిరి. స్త్రీ శోణితము, పురుషవీర్యము పరస్పరము సంయుక్తములై యొకదినములో గలలాకారము నొంది, యది దినదినప్రవర్ధమానమై యేడవదినమునకు రేగుపండంతదై, యొకమాసములో వది గుండ్రముగా బరిణమించును. ఇట్లు మూడుమాసములు గడచిన పిదప నాగుండ్రని యాకారము గలపిండము హస్తములు, పాదములు లేనిమాంస పిండరూపమున బరిణామ మొందును. ఐదవమాసములో దేహధారి యైన జీవునకు సకలావయవములు నమరగలవు. ఆఱవమాసములో శరీరమందు జీవ సంచారము సంభవించును. అత్యంతస్వల్పస్థల మైనమాతృగర్భములో నివసించుచు, శయనించుచు బంజరమందు బంధింపబడిన పక్షివలె నాజీవుడు దుఃఖించును. ఆయపవిత్రస్థానములో నివసించుచు దనతల్లి భుజించిన యన్నపానాదులసారమునే యాహారముగ గ్రహించుచు 'హా, హా' యనుచు సదా పరమేశ్వరుని స్మరింప నారంభించును. ఇట్లు నాలుమాసములు దుస్సహ మాతృగర్భనరకవాసయాతనల ననుభవించి సమయ మాసన్నమైనపుడు వాయుప్రేరితుడై యాశిశువు మాతృగర్భమునుండి బహిర్గతుడు కాగలడు.

దిగ్దేశకాలావ్యుత్పన్నో విస్మృతో విష్ణుమాయయా
శశ్వద్విణ్మూత్రసంయుక్తః శిశుః స్యాచ్చైశవావధి॥
పరాయత్తోఽప్యశక్తశ్చ మశకాదినివారణే ।
కీటాదిభుక్తో దుఃఖీ చ రౌతి చోచ్చైః పునఃపునః ॥
స్తనాన్ధోఽప్యసమర్థశ్చ యాచ్ఞాం కర్తు మభీప్సితామ్ ।
న వాణీ నిస్సరే త్తస్య పౌగణ్డావధి సుస్ఫుటా ॥ 141—143

మాతృగర్భమునుండి బయల్వెడలుసమయమున జీవునకు దిగ్దేశకాల జ్ఞానాదులు నశించును. విష్ణుమాయామోహితుడై యతడు సర్వమును విస్మరింపగలడు. శైశవకాలమంతయు నాతడు సదా మలమూత్రములందు బడి నివసింపగలడు. ఇతరులపై నాధారపడి జీవించునాతడు మశకాదికీటకములను గూడ నివారించుట కశక్తుడై దుఃఖించును. మశకాదికీటకములు వానిని బీడింపగా నతడు మఱలమఱల బెద్దగ నేడ్చును. మాతృస్తన్యపాన మొనరించుటకుగూడ నసమర్థుడై వలయువస్తువులను యాచించుటకు మాటరాక వివశుడై జీవించును.

> పౌగణ్డే యాతనాం భుక్త్వా ప్రాప్యతే యౌవనంపునః।
> న స్మరే న్మాయయా దేహీ గర్భాదే ర్యాతనాం పునః॥
>
> ఆహారమైథునార్తశ్చ నానామోహాదివేష్టితః ।
> పుత్రం కలత్రి మనుగం యత్నేన పరిపాలయేత్॥
>
> ఏవం యావత్సమర్థశ్చ తావదేవ హి పూజితః ।
> అసమర్థం చ మన్యన్తే బాన్ధవా గోజరాంయథా॥ 144—146

శైశవావస్థయందు దేహధారి స్పష్టముగ బలుకనైనను బలుకలేడు. పౌగండావస్థయందుగూడ ననేకయాతనల ననుభవించి యతడు యౌవన సంపన్నుడగును. ఆసమయమున మాయామోహితుడై దేహధారి యైన జీవుడు మాతృగర్భపౌగండాది యాతనాదులను విస్మరించి చరించును. నిత్యము నాత డాహారమైథునములనే చింతించుచు నానామోహములు బరివేష్టింపగ దనపుత్రులను, బత్నిని, ననుచరులను బాలించిపోషించుటలో దనదుర్లభ మానవజన్మము నంతయు వృథాగావించును. ఏసమయమువఱకు దేహధారి తనవారలను బోషించుటలో సమర్థుడై యుండునో యాసమయమువఱకే గృహములోని వారు వానిని బూజించి యాదరించి సత్కరింపగలరు. అసమర్థుడైనమఱుక్షణమే బంధువులు వానిని ముసలియెద్దునువలె వ్యర్థునిగ భావించి, తమపై బడిన భారముగ భావింతురు.

> యదాఽతీవ జరాయుక్తో జడోఽతిబధిరో భవేత్ ।
> కఫశ్వాసాదియుక్తశ్చ పరాయత్తోఽతి మూఢవత్ ॥
>
> తదన్తరేఽనుతాపం చ కురుతే సంతతం పునః ।
> న సేవితం హరే స్తీర్థం సత్సఙ్గశ్చేతి తాపనః ॥

పునశ్చ మానవీం యోనిం లభేయం భారతే యది ।
తదా తీర్థం గమిష్యామి భజే వై కృష్ణ మిత్యహో ॥ 147–149

తాను దనసర్వస్వముగ భావించి యమితముగ ప్రేమించినయీ దేహము జరాయుక్తము, జర్జరము, బధిరము, కఫశ్వాసాదియుక్తము నై నానారోగములచే బీడింపబడుచు జడమై కదలలేక యితరులయధీన మగునో యపుడు దేహధారి సదా యిట్లు పశ్చాత్తాపపడ నారంభించును. "అహో! నాశరీరము నాయధీనములో నుండగ, బలసంపన్నమై యుండగ శ్రీహరి నారాధింపక పుణ్యతీర్థములను సేవింపక, సత్సాంగత్య మొనరింపక వ్యర్థవిషయములందు నాజన్మ నంతయువ్యర్థముగ వెచ్చించితిని. మరల నేను భారతవర్షములో మనుష్యుడనై జన్మించి, శ్రీకృష్ణుని సేవించి, పుణ్యతీర్థదర్శన మొనరించి, తరించెదను.

ఇత్యేవమాది మనసి కుర్వ న్తం తంజడం సుర ।
గృహ్ణాతి యమదూతశ్చ కాలే ప్రాప్తేఽతిదారుణః॥
దుర్నివార్య పుమాయైశ్చ బలిష్ఠం చ భయంకరమ్ ।
దుర్దృశ్యం సర్వసిద్ధజ్ఞం సర్వాదృష్టం పురఃస్థితమ్ ॥
దృష్టమాత్రాన్మహాభీతో విణ్మూత్రం చ సముత్సృజేత్
తదా ప్రాణాంస త్యజేత్సద్యో దేహం వై పాంచభౌతికమ్॥ 150–152

దేవేంద్రా! ఇట్లాతడు పశ్చాత్తాప మొనరించు సమయమున గాలమాసన్నము కాగానే భయంకరు లైనయమదూత లాజడ దేహధారి, బాశబద్ధునిగ నొనరించెదరు. ఆ దేహధారి యైనజీవుడు యమదూతలను దర్శించును; వారు హస్తములలో బాశదండములను ధరించి, రక్తపంకజ క్రోధయుక్త లోచనులై యత్యంత వికరాలాకృతి కల్గి మహాభయంకరులై గోచరింతురు. వారిని నిరోధించు టత్యంతకఠిన మగును. యమకింకరులు మహాబలిష్ఠులు, భయంకరులు, దుర్దర్షులు, సంపూర్ణ సిద్ధిజ్ఞానసంపన్నులు, కాల మాసన్నమైనవానికి దక్క నన్యులకు వారు గోచరింపరు. సమయమున యమదూతలను గాంచగనే దేహధారి యత్యంత భయభీతుడై మలమూత్రములనువిడువ నారంభించును. తదనంతర మతడు తనప్రాణములను బాంచభౌతిక దేహమునుగూడ త్యజించును.

అఙ్గుష్ఠమాత్రం పురుషం గృహీత్వా యమకింకరః।
వినమ్య భోగదేహే చ స్వస్థానం ప్రాపయేద్ ధ్రుతమ్॥
జీవో గత్వా యమం పశ్యే త్సర్వధర్మజ్ఞమేవ చ । (153)

యమదూత లంగుష్ఠాకారసంపన్నుడైనజీవుని బంధించి వానికి భోగ దేహము ప్రసాదింతురు. ఆయాతనాశరీరధారి నీడ్చుకొనుచు దీవ్రగతితో సంయమనీపురి జేరెదరు. అచట జీవుడు సకలధర్మజ్ఞుడైనయమధర్మరాజును దర్శించును.

రత్నసింహాసనస్థం చ సస్మితం సుస్థిరం పరమ్।
ధర్మాధర్మవిచారజ్ఞం సర్వజ్ఞం సర్వతోముఖమ్॥
విశ్వేష్వేకాధికారం చ విధాతా నిర్మితం పురా ।
వహ్నిశుద్ధాంశుకాధానం రత్నభూషణభూషితమ్॥
వేష్టితం పార్షదగణైః దూతైశ్చాపి త్రికోటిభిః ॥
జపన్తం శ్రీకృష్ణనామ శుద్ధస్ఫటికమాలయా।
ధ్యాయమానం తత్పదాబ్జం పులకాఙ్కితవిగ్రహమ్॥
సగద్గదం సాశ్రునేత్రం సర్వత్ర సమదర్శినమ్ ।
అతీవ కమనీయం చ శశ్వత్సుస్థిరయౌవనమ్ ॥
స్వతేజసా ప్రజ్వలన్తం సుఖదృశ్యం విచక్షణమ్ ।
శరత్పార్వణచన్ద్రాభం చిత్రగుప్తపురఃస్థితమ్।
పుణ్యాత్మనాం శాన్తరూపం పాపినాం చ భయంకరమ్ । 154—159

యమధర్మరాజు సుస్థిరభావముతో రత్నసింహాసనాసీనుడై మందస్మిత ముఖారవిందుడై దర్శనమొసంగును. ఆయన సర్వజ్ఞుడు, ధర్మాధర్మవిచార జ్ఞానసంపన్నుడు, సర్వతోముఖుడు. పూర్వకాలములో విధాత యమునకు సర్వవిశ్వమునందలి పాపులను శిక్షించుట కేకమాత్రాధికారము నొసంగెను. ఆసంయమినీ పురాధీశ్వరు డగ్నిశుద్ధదివ్యవస్త్రములను ధరించి, రత్నాభరణ భూషితుడై మూడుకోట్లపార్షదులు, కింకరులు పరివేష్టించి యుండగా గొలువు దీరియుండును. యమధర్మరాజు హస్తములో స్ఫటికమణిమాలను ధరించి శ్రీకృష్ణదివ్యనామజప మొనరించుచు బులకాంకితవిగ్రహుడై మనస్సునందే పరమాత్మదివ్యచరణారవిందములను ధ్యానించుచుండును. ఆసమయమున యమునివాణి గద్గదమై నేత్రములనుండి యశ్రుధారలు ప్రవహించును.

యమధర్మరాజు సర్వత్రసమదర్శి, బహుకమనీయుడు, సుస్థిరయౌవన సంపన్నుడు. ఆయన స్వతేజముతో ప్రజ్వరిల్లుచు, జూపరులకు సుఖపూర్వకమైనదర్శన మొసంగును. శరత్పూర్ణిమాచంద్రునివలె బ్రకాశించుచు యమధర్మరాజు యమపురములో చిత్రగుప్తుని సమక్షమున విరాజిల్లును. పుణ్యాత్ములకాయనరూప మత్యంత శాంతముగను పాపాత్ములకత్యంత భయంకరముగను గోచరించును.

తం దృష్ట్వా ప్రణమే ద్దేహీ మహాభీతశ్చ తిష్ఠతి ॥
చిత్రగుప్త విచారేణ యేషాం య దుచితం ఫలమ్ ।
శుభాశుభం చ కురుతే తదేవ రవినన్దనః॥
ఏవం తేషాం గతా యాతే నివృత్తి ర్నాస్తి జీవినామ్।
నివృత్తి హేతురూపం చ శ్రీకృష్ణపదసేవనమ్ ॥
ఇత్యేవం కథితం సర్వం వరం ప్రార్థయ వాంఛితమ్
సర్వం దాస్యామి తే వత్స! న మేఽసాధ్యం చ కించన॥ 160—163

యమధర్మరాజును దర్శింపగనే దేహధారి యైనజీవు డత్యంతభీతుడై ప్రణామము లర్పించి నిలువబడును. సూర్యనందనుడైనయముడు చిత్రగుప్తునితో విచారించి యెవరికి నేదండనము లుచితములో వానిని విధించి జీవులకు శుభాశుభఫలముల బ్రసాదించును. ఇట్లు జీవులు నివృత్తిభావరహితులై జన్మించుచు, మరణించుచు, యమయాతనల ననుభవించుచు జననమరణచక్రమున బడి దుఃఖింతురు. దేవేంద్రా! కేవలము శ్రీకృష్ణపరమాత్మపాదపంకజసేవయే నివృత్తి హేతు వని తెలిసికొనుము. దేవరాజా! ఈతత్త్వజ్ఞానమును నేను నీ కానుషంగికరూపమున నుపదేశించితిని. ఇక నీవు వాంఛితవరముల నర్థింపుము. కుమారా! నేను నీకు సర్వమును బ్రసాదింపగలను. నా కసాధ్య మనునది కించిన్మాత్రమైనను లేదు.

## మహేంద్రుడు పలికెను :

కల్పవృక్షస్వరూపా! మునిశ్రేష్ఠా! నాయింద్రత్వమే నాకు దుర్లభమైన విప్రులైశ్వర్యాదులతో నేమి ప్రయోజనము? దేవా! నాకు బరమపదమును బ్రసాదింపుము.

## శ్రీనారాయణఋషి పలికెను :

మహేంద్రుడు పల్కినవచనముల నాలకించి సస్మితవదనారవిందుడై యామునిపుంగవుడు సత్యము, వేదసారము నైనవిషయము నిట్లు ప్రవచింప నారంభించెను.

## దుర్వాసమహర్షి పలికెను :

పరం పదం విషయిణాం మహేన్ద్రాతిసుదుర్లభమ్ ।
ముక్తి ర్యుష్మద్విధానాం చ న లయే ప్రాకృతేఽపి చ ॥
ఆవిర్భావః సృష్టివిధౌ తిరోభావో లయేఽపి చ।
యథా జాగరణం సుప్తి ర్భవ త్యేవక్రమేణ చ ॥
యథా భ్రమతి కాలశ్చ తథా విషయిణో ధ్రువమ్ ।
చక్రనేమిక్రమేణైవ నిత్యమే వేశ్వరేచ్ఛయా॥ 166-168

మహేంద్రా! ఐహికవిషయాసక్తు లగుజీవులకు బరమపద మత్యంత దుర్లభము, నీవంటివారలకు బ్రాకృతప్రళయకాలమందైనను ముక్తి లభింపదు. ప్రాతఃకాలమున బ్రాణులు మేల్కొని రాత్రియందు శయనించుకట్లు సృష్టి కాలమందు జీవు లావిర్భవించి ప్రళయకాలమందు దిరోగమించగలరు. కాలచక్రము భ్రమించుచుండునట్లు నిశ్చయముగ విషయాసక్తులైన జీవులుకూడ నీశ్వరేచ్ఛచే బండిచక్రమువలె సదా జననమరణములందు భ్రమింపగలరు.

పల మేకం భవేదేవ యథా విపలషష్టిభిః ।
షష్టిభిశ్చ పలై ర్దణ్డో ముహూర్తో ద్విగుణ స్తతః ॥
త్రింశద్భిశ్చ ముహూర్తైశ్చ భవేదేవ దివానిశమ్ ।
దశపంచ దివా రాత్రిః పక్ష మేకం విదు ర్బుధాః ॥
పక్షాభ్యాం శుక్లకృష్ణాభ్యాం మాస ఏవ విధీయతే ।
ఋతు ర్ద్వాభ్యాం చ మాసాభ్యాం సంఖ్యావిద్భిః ప్రకీర్తితః॥
ఋతుత్రయే ఽయనం చ తాభ్యాం ద్వాభ్యాం చవత్సరః।
త్రింశత్సహస్రాధికైశ్చ త్రిచత్వారింశలక్షకైః॥
వత్సరై ర్నరమానైశ్చ యుగానాం చ చ తుష్టయమ్।
షష్ట్యాధికే పంచశతే సహస్రే పంచవింశతౌ ॥

యుగే నరాణాం శక్రాయు ర్మనో రాయుః ప్రకీర్తితమ్।
దిగ్గజేన్ద్రనిపాతేఽష్టసహస్రాధిక ఏవ చ ॥
నిపాతో బ్రహ్మణ స్తత్ర భవే త్ప్రాకృతికో లయః।
లయే ప్రాకృతి కే వత్స! కృష్ణస్య పరమాత్మనః॥
చక్షుర్నిమేషః సృష్టిశ్చ పునరున్మీలనే తథా।
బ్రహ్మసృష్టిలయానాం చ సంఖ్యా నాస్తి శ్రుతౌ శ్రుతమ్॥ 169—176

అఱువదివిపలము లొకపల మగును, అఱువదిపలము లొకదండ మగును, రెండుదండము లొకముహూర్తమగును. ముప్పదిముహూర్తము లొక దినము రాత్రి కాగలవు. అట్టి పదునైదు దివారాత్రు లొకపక్షమగునని విద్వాంసులు ప్రవచించిరి. శుక్లపక్ష, కృష్ణపక్షములు రెండు నొకమాస మగును. రెండుమాసము లొకఋతువు కాగా మూడుఋతువు లొకయయన మగును. రెం డయనము లొకసంవత్సరమని సంఖ్యావిదులు ప్రవచించిరి. నలువది వేలమూడులక్షలముప్పది వేల సంవత్సరములు మానవులకు నాల్గు యుగము లగును. ఇరువదియైదు వేల యైదువందలయాఱునరులయుగము లొకయిందుని యాయుర్దాయమునకు లేక యొకమనువునాయుర్దాయమునకు సమమని కాలవిదులు ప్రవచించిరి. పదిలక్షల యెనిమిది వేలయింద్రులు గతించిన బ్రహ్మదేవు నాయుర్దాయము పరిపూర్ణము కాగలదు. అప్పుడే ప్రాకృతికప్రళయము సంభవించును. వత్సా! సర్వ మాప్రాకృతికప్రళయములో శ్రీకృష్ణపరమాత్మయందు లయింపగలదు. ప్రాకృతికప్రళయము శ్రీకృష్ణ పరమాత్మ రెప్పపాటుకాలములో సంభవించును. ఆయన మరల గన్నుల దెఱవగనే సకలసృష్టి సంభవించును. బ్రహ్మలచే సృష్టింపబడు నీయసంఖ్యాక సృష్టిక్రమములను, ప్రాకృతిక లయములను లెక్కింప నసాధ్యమని శ్రుతులు ప్రవచించినవి.

యదా పృథివ్యాం రేణూనా మిత్యూచే చన్ద్రశేఖరః।
ఏతేషాం మోక్షణం నాస్తి కథితాని చ యాని తు ॥ 177

పృథ్వియందుగల ధూళికణములను లెక్కింపజాలనట్లు సృష్టి ప్రళయములసంఖ్యను గణించుట యసంభవమని చంద్రశేఖరుని కథనము. విషయాసక్తులైనయీయింద్రులకైనను మోక్షము లేదు. కావున దేవ రాజా! సృష్టిసూత్రానురూపముగ నీవు మఱియొక వర మేదైనను కోరు కొనుము.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదమునీంద్రా! దుర్వాసమహర్షి యుపదేశించిన యీమహాతత్త్వ జ్ఞానము నాలకించి దేవేంద్రు డత్యంతాశ్చర్య చకితుడైనాడు. ఆతడు మహర్షి ని దన పూర్వైశ్వర్యాదులనే ప్రసాదింపవలసినదిగ వర మర్థించెను. నీకు నీపూర్వైశ్వర్యము ప్రాప్తించుగాక యని దుర్వాసమహర్షి దేవేంద్రుని దీవించి కైలాసమునకు బ్రస్థానమొనరించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణసంవాద
మున శ్రీమహాలక్ష్మీదేవ్యుపాఖ్యానమున
దుర్వాసేంద్రసంవాద మను
ముప్పది యాఱవ
అధ్యాయము
సంపూర్ణము.

—♦—

# ముప్పదియేడవ అధ్యాయము

## బృహస్పతి మహేంద్ర సంవాదమున కర్మఫల నిరూపణము.

**నారదుడు పలికెను :**

శ్రీహరిదివ్యగుణనామగానమును మహేంద్రుడు దుర్వాసమహర్షి ముఖారవిందమునుండి శ్రవణమొనరించి జ్ఞానసంపన్నుడై యమరావతి జేరి యేమిచేసెనో, నాకు గృపతో వివరింప బ్రార్థించుచున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను:**

మహర్షీ! శ్రీకృష్ణునిదివ్యగుణగానము నాలకించినయింద్రుడు సంసారమందును నైశ్వర్యాదిభోగములందును విరక్తుడై వైరాగ్యదీపికను వెలిగించుకొని దినదిన మాత్మప్రకాశమును వృద్ధినొనరింప నారంభించెను. దుర్వాసమహర్షి శాపమువలన దుర్భేద్య మగు నమరావతీనగర మసురులపాలైనది. సకలదేవత లన్యాక్రాంతులై దుఃఖింప నారంభించిరి. ఇది గాంచి మహేంద్రుడు దేవాచార్యుడైనబృహస్పతి యాశ్రమమునకు జనెను. ఆసమయములో నఖండాధ్యాత్మికశక్తిసంపన్నుడైనబృహస్పతి మందాకినీతటముపై బద్ధాసనాసీనుడై పరబ్రహ్మధ్యానమందు సంలగ్నుడైయుండగ నింద్రు డాయనను దర్శించెను. ఆయన నేత్రము లశ్రుపూర్ణములై దేహము పులకింపగ నఖండానందభరితుడై శ్రీకృష్ణపరమాత్మదివ్యమంత్రజప మొనరించుచుండెను. బృహస్పతి పరమశ్రేష్ఠుడు, మహాగాంభీర్యసంపన్నుడు, ధర్మాత్ముడు, శ్రేష్ఠపురుషులచే సేవలొందు నాచార్యుడు, బంధువర్గములకు బరమాదరణీయుడు, భాతృసముదాయములందు జ్యేష్ఠుడు, దేవశత్రువుల కనిష్టకారి. దేవేంద్రుడు తన గురుదేవుని దివ్యవిగ్రహమును వీక్షించుచు ముకుళితహస్తుడై వినీతభావముతో నిలువబడెను. ఆచార్యుడు ధ్యానము చాలింపగా గాంచి మహేంద్రు డాయనచరణకమలములపై శిరము నుంచి దుఃఖించుచు దుర్వాసమహర్షి యొసంగిన శాపవృత్తాంత మంతయు నాచార్యునకు విన్నవించెను. ఇంద్రుని దుఃఖభరితచరితము నాలకించి పరమబుద్ధిశాలి, వక్తృశ్రేష్ఠు డైన బృహస్పతి యిట్లు పల్కెను.

**బృహస్పతి పలికెను :**

సురశ్రేష్ఠా! నేను సర్వము నవధరించితిని, నీవు విషాద మొందక నా యుపదేశామృతమును గ్రోలుము.

న కాతరో హి నీతిజ్ఞో విపత్తౌ స్యాత కదాచన ॥
సమ్పత్తిర్వా విపత్తిర్వా నశ్వరా స్వప్నరూపిణీ।
పూర్వస్వకర్మాయత్తా చ స్వయం కర్తా తయోరపి॥
సర్వేషాం చ భవత్యేవ శశ్వ జ్జన్మని జన్మని।
చక్రనేమిక్రమేణైవ తత్ర కా పరిదేవనా॥ 14-16

"నీతిజ్ఞుడు విపత్తులు సంభవించినసమయములో నెప్పుడును గాతరుడు కాడు. ఏలయన సంప ద్విపత్తులునశ్వరములు, స్వప్న సదృశములు .ఈసంపత్తులు, విపత్తులు జీవుడు తన పూర్వజన్మములో నొనరించిన కర్మములకు ఫలములే. జీవుడే స్వయముగ నీరెండిఁటి నిర్మాత యని గ్రహింపుము. రమారమి సర్వజీవులకు ప్రత్యేక జన్మములో దమస్వయం కృతకర్మఫలానుభవము నియతముగ చక్రమువలె సదా భ్రమించుచునే యుండగలదు. కావున నీవిషయమున నీకు విచార మెందులకు?" తా నొనరించిన శుభాశుభకర్మముల ఫలముల ననుభవించుటకే జీవునకు మరల శరీర మేర్పడును. శతకోటికల్పములు వ్యతీతములైన ననుభవింపనిదే కర్మములు నశింపవు, తా నొనరించినశుభాశుభ కర్మములఫలము జీవు డవశ్య మనుభవింపకతప్పదు. ఈవిషయముల నన్నింటిని శ్రీకృష్ణపరమాత్మ బ్రహ్మదేవునకు సామవేదములోని కౌథూమీ శాఖలో బోధించెను. తా మొనరించినసంపూర్ణ కర్మములభోగములు శేషించిన కర్మానుసారముగ జీవులు భారతవర్ష మందుగాని, లేక యన్యత్ర గాని, జన్మింతురు. కోటానుకోట్లజన్మములనుండి యొనరించినకర్మము లను భవింపనిదే జీవుని వీడవు. పురందరా! అవి ఛాయవలె జీవు ననుసరించుచు బూర్ణముగ ననుభవించిన యనంతరమే నశింపగలవు. కాల, దేశ, పాత్ర భేదములచే గర్మములందు న్యూనత్వాధికత్వములు సంభవింపగలవు. దండముతో, సూత్రముతో, జలముతో, చక్రముతో గుశలుడైన కుమ్మరి కుండలను నిర్మించునట్లు విధాత కర్మసూత్రానుసారముగ బ్రాణులకు ఫలములను బ్రసాదించును. కావున దేవరాజా! ఎవని సంకల్పమాత్రముననే యీజగ మావిర్భవించెనో యా శ్రీమన్నారాయణు నకుంఠితదీక్షతో నుపాసింపుము. ఆప్రభువు సకలలోకములందు గలవిధాతలకే విధాత, రక్షకులకే రక్షకుడు, స్రష్టలకే స్రష్ట, సంహారకర్తలకే సంహారకర్త, కాలమునకే కాలము.

మహావిపత్తౌ సంసారే యః స్మరే న్మధుసూదనమ్ ।
విపత్తౌ తస్య సమ్పత్తి ర్భవే దిత్యాహ శంకరః ॥ (40)

మహావిపత్తులు సంభవించినపుడు మధుసూదనుని స్మరించువారి కావిపత్తులే యఖండసంపదలుగా బరిణామ మొందగలవని శంకరు డాదేశించెను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! ఇట్లు బృహస్పతి యింద్రునకు దత్త్వజ్ఞానము నుపదేశించి యత నాలింగన మొకరించుకొని తత్క్షణకర్తవ్యమును నిర్దేశించెను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని లక్ష్మీదేవ్యుపాఖ్యానమున
బృహస్పతిమహేంద్ర సంవాదమున
కర్మఫల నిరూపణమను
ముప్పదియేడవ అధ్యాయము
సంపూర్ణము.

—♦—

## ముప్పదియెనిమిదవ అధ్యాయము

### క్షీరసాగరమథనము, శ్రీ మహాలక్ష్మీ ప్రాదుర్భావము

**శ్రీ నారాయణఋషి పలికెను :**

నారదా! తదనంతరము మహేంద్రుడు మనసార శ్రీహరిని ధ్యానించి సర్వదేవతలను దోడ్కొని బృహస్పతి వెంట రాగా బ్రహ్మలోకము జేరి బ్రహ్మదేవుని చరణముల నాశ్రయించెను. బృహస్పతి జరిగినవృత్తాంత మంతయు బ్రహ్మదేవునకు విన్నవించి తరణోపాయమును బ్రసాదింపవలసి నదిగ బ్రార్థించెను. వాని విన్నపముల నాలకించి సస్మితముఖారవిందుడై బ్రహ్మ దేవేంద్రుని సంబోధించుచు నిట్లు పల్కెను.

**బ్రహ్మ పలికెను :**

వత్సా! ఉత్తమబుద్ధిసంపన్నుడ వైనసీవు నావంశజుడవు, నాప్రపౌత్రుడవు. సకలదేవతలకు స్వామి వైనసీకు బృహస్పతియే యాచార్యుడు. మహాప్రతాపసంపన్నుడు, శ్రీహరిభక్తుడు నైనదక్షప్రజాపతి నీమాతామహుడు.

త్రిలోకములందు బవిత్రుడవు, యోగ్యపురుషుడవు నైననీ కహంకార మెట్లుదయించెను? ఎవనితల్లి పరమపతివ్రతయో, తండ్రి పరిశుద్ధుడో మాతా మహమాతులాదులు జితేంద్రియులో యట్టివ్యక్తి యహంకారమునకు వశు డగుట యెట్లు సంభవించెను? ఎందువలన ననగా దండ్రి మాతామహుడు, ఆచార్యుడు-ఈముప్వురు దోషులైన, వీరిదోషములతో గూడిన దేహధారి శ్రీహరికి ద్రోహి కాగల డనుట నిశ్చితవిషయము. దేవేంద్రా! సర్వాంత రాత్మ యైన శ్రీహరి సకలప్రాణులశరీరములలో విరాజమానుడై యున్నాడు. ఆయన దేహమును వీడి మఱలిపోయిన క్షణమందే ప్రాణి శవము కాగలడు. ఆయన స్వామి, మన మందఱ మాయన కనుచరులము మాత్రమే. నేను ప్రాణులశరీరములో నింద్రియస్వామి యైనమనమునై యుందును. శంక రుడు జ్ఞానరూపము ధరించి దేహధారులందు విరాజిల్లును. విష్ణువు ప్రాణ ముల కధిష్ఠాతయై యుండును. శ్రీకృష్ణప్రాణాధిష్ఠాత్రి దేవి యగుశ్రీరాధ దేహములో బ్రకృతిరూపమున నివసించును. జీవుని బుద్ధియే దుర్గాదేవి స్వరూపము. నిద్ర, క్షుధ, పిపాస, తంద్రి మొదలగునవి యన్నియు ప్రకృతి మాత కళలని గ్రహింపుము. బుద్ధిలో బ్రతిబింబించు నాత్మ ప్రతిబింబమే జీవుడు. ఆతడే యీభోగశరీరమును ధరింపగలడు. శరీరస్వామి యైనయాత్మ దేహ మును వీడి చనగా నీశక్తు లన్నియు దత్క్షణమే యాయన ననుసరింపగలవు. నేను, శివుడు, ఆదిశేషుడు, విష్ణువు, ధర్మము, మహావిరాట్పురుషుడు, నీవు- అందఱు నెవని యంశజులమో, భక్తులమో నీవు నాశ్రీకృష్ణపరమాత్మ నిర్మాల్యరూప మైనపవిత్రపూజాకుసుమమునే యహంకార వశుడవై యవహేళన మొనరించితివి. శంకరభగవాను డేపుష్పముతో శ్రీహరిచరణ కమలములను బూజించునో, యాపుష్పమే సౌభాగ్యవశమున దుర్వాసమహర్షి కృపవలన నీకు లభించెను. కాని నీ వా పూజాకుసుమమును సమ్మా నింపక యవహేళన మొనరించితివి.

తత్పుష్పం మస్తకే యస్య కృష్ణపాదాబ్జతశ్చ్యుతమ్ ।
సర్వేషాం వై సురాణాం చ తత్పూజా పురతో భవేత్ 14

"శ్రీకృష్ణపరమాత్మచరణకమలములనుండి జాఱినపుష్ప మెవని మస్త కము నలంకరించునో, యాసౌభాగ్యశాలియే సర్వదేవతలందు ప్రధానుడై

ప్రథమపూజకు నర్హుడు కాగలడు". దేవేంద్రా! దైవమే నిన్నువంచించినాడు. దైవఘటన మనివార్యము, దైవబలము ప్రబలము. శ్రీకృష్ణనిర్మాల్యమును బరిత్యజించితివని నీపై గోపించి శ్రీదేవి నిన్ను వీడిపోయెను. మీరు నాతో గూడి వైకుంఠమునకు బయలుదేరుడు. నావరప్రభావమున మీరు లక్ష్మీ కాంతు డైన శ్రీహరిని సేవించి తదనుగ్రహమునకు బాత్రులై మరల నవ శ్యము శ్రీమహాలక్ష్మీ కటాక్షము నొందగలరు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా! యిట్లు దేవతలనూఱడించి బ్రహ్మ దేవతల నందఱ దోడ్కొని వైకుంఠము జేరి పరబ్రహ్మమైన, సనాతనుడైన శ్రీహరిని దర్శించెను. ఆ సమయమున నఖండ తేజఃపుంజస్వరూపు డైనప్రభువు తన తేజముతో నుద్భా సితు డగుచున్నాడు. గ్రీష్మర్తుమధ్యాహ్నమున బ్రకాశించు ననంతకోటి సూర్యులకాంతితో శ్రీమన్నారాయణుని శ్రీవిగ్రహము ప్రజ్వరిల్లుచుండెను. ఆదిమధ్యాంతరహితు డైనలక్ష్మీకాంతుడు శాంతస్వరూపుడై విరాజిల్లు చుండెను. ఆయన చతుర్భుజపార్షదపరివేష్టితుడై, సరస్వతీయుక్తుడై యుండగా నాలుగువేదములు గంగ యనన్యభక్తిసమన్వితులై తత్సమక్షములో ముకుళిత హస్తులై యుండిరి. శ్రీహరిదివ్యసందర్శన మొనరింపగనే బ్రహ్మసహితముగ సకలదేవతలు కంపితగాత్రులై యశ్రుపూర్ణనయనులై, భక్తిభావసమన్వి తులై శ్రీహరి ననేకవిధముల స్తుతించిరి. బ్రహ్మ దేవతలకు సంభవించిన విపత్తులను శ్రీహరికి నివేదించి రక్షింపవలసినదిగ బ్రార్థించెను. శ్రీవిహీను లైనదేవతలు రత్నాభరణశూన్యులై వాహనాదివివర్జితులై, శోభా శూన్యులై శోచనీయస్థితిలోనున్నారు. ఆదేవతలను గాంచి విపన్నభయ భంజను డైనశ్రీహరి యిట్లు పల్కెను.

శ్రీహరిభగవానుడు పలికెను :

బ్రహ్మాదిదేవతలారా! భయము నొందకుడు, నే నుండగ మీ కేల భయము? నేను మీకు బరమైశ్వర్యవృద్ధిదాయని యైనయచలలక్ష్మిని బ్రసా దింతును, కాని నేను ప్రవచింపబోవువిషయములను సావధానచిత్తులై శ్రవణ మొనరింపుడు. నావచనములు పరమహితకరములు, సత్యములు, సకలసార స్వరూపములు, పరిణామములో సుఖప్రదములు. అఖిలవిశ్వములందుగలసర్వ

ప్రాణులు నిరంతరము నాయధీనులై యుండునట్లు నేనుగూడ సదా నా యనన్య భక్తాధీనుడనైయుందును.

యో యో రుష్టో హి మద్భక్తో మత్పరే హి నిరంకుశః ।
తద్ గృహేఽహం న తిష్ఠామి పద్మయా సహ నిశ్చితమ్॥ (31)

"సదా నాభజనచింతనామలందు సంలగ్నులై యుండునానిరంకుశభక్తు లెవనిపై గోపింతురో వానిగృహములో లక్ష్మిసహితముగ నేను నివసిపంను. ఇది నిశ్చితవిషయము". దుర్వాసమహర్షి శంకరునియంశజుడైనవైష్ణవపురుషుడు. ఆయనహృదయములో నాయెడల నచంచలశ్రద్ధ కలదు. ఆమహర్షి నిన్ను శపించినకారణమున నీగృహమును నేను లక్ష్మిసహితముగ బరిత్యజించితిని. శంఖము ధ్వనింపనిచోట, తులసివృక్షము పూజింపబడనిచోట, శంకరునిపూజ యొనరింపబడనిచోట, బ్రాహ్మణులకు, నతిథులకు భోజనమొసంగబడనిచోట లక్ష్మి నివసింపదు. బ్రహ్మాది దేవతలారా! నాభక్తులు నిందింపబడు ప్రదేశమును మహాలక్ష్మి కోపించి వీడిపోవును. నన్నుపాసింపక యేకాదశీ, జన్మాష్టమీదినములందు భుజించు మూర్ఖులగృహమును వీడి లక్ష్మి మరలిపోగలదు. నానామములను, దమకన్యలను విక్రయించువారు లక్ష్మికృపాహీనులు కాగలరు, అతిథికి భోజనము లభింపని గృహమును వీడి లక్ష్మి పోగలదు. పుంశ్చలి భార్యగ గల్గినవారి గృహములో లక్ష్మి నివసింపదు. ఏబ్రాహ్మణుడు వృషభములను బూన్చునో, యతడు లక్ష్మియనుగ్రహమునకు బాత్రుడు కాలేడు.

అపవిత్రహృదయుని, గ్రూరుని, హింసకుని, సజ్జననిందకుని, సంధ్యాశూన్యుడైనబ్రాహ్మణుని లక్ష్మి పరిత్యజింపగలదు. శూద్రులచే యజ్ఞమొనరించువారు, ధైర్యవిహీనులైనవారియన్నము భుజించువారు, నిష్ప్రయోజనముగ దృణములను, దరువులను ద్రుంచువారు, నఖములచే బృథ్విని బెళ్ళగించువారు, నిరాశావాదులు, సూర్యోదయసమయమున భుజించువారు, బగలు నిద్రించువారు, పగలు మైథునమొనరించువారు, సదాచారహీనులు నగుమానవులు గృహములను మహాలక్ష్మి వీడిపోగలదు. తడిసినపాదములతో నిద్రించువారు, వివస్త్రులై శయనించువారు, దలకిందుగ మాట్లాడువారు, శిరమునకు నూనె రాచుకొని యాహస్తములచే నితరుల యంగములను

స్పృశించువారు అనగా దమతల కంటుకొనిననూనె నితరుల కంటువారు నగు మానవులగృహమును లక్ష్మి వీడిపోగలదు. వ్రతోపవాస, సంధ్యా, విష్ణు భక్తిహీను డై నయపవిత్రి ద్విజునిగృహమునుగూడ లక్ష్మి వీడిపోగలదు.

బ్రాహ్మణులను, నాభక్తులను నిందించి సదాద్వేషించువారు, జీవ హింస యొనరించువారు, దయారహితులు నగువారిగృహములను జగజ్జనని యగులక్ష్మి పరిత్యజింపగలదు.

యత్ర యత్ర హరేరర్చా హరే రుత్కీర్తనం శుభమ్।
తత్రి తిష్ఠతి సా దేవీ కమలా సర్వమఙ్గలా ॥
యత్రి ప్రశంసా కృష్ణస్య తద్భక్తస్య పితామహః ।
సా చ కృష్ణప్రియా దేవీ తత్ర తిష్ఠతి సంతతమ్॥
యత్ర శంఖధ్వనిః శంఖః శిలా చ తులసీదలమ్ ।
తత్సేవా వన్దనం ధ్యానం తత్ర సా తిష్ఠతి స్వయమ్॥
శివలిఙ్గార్చనం యత్ర తస్య చోత్కీర్తనం శుభమ్ ।
దుర్గార్చనం తద్గుణాశ్చ తత్ర పద్మనివాసినీ ॥
విప్రాణాం సేవనం యత్ర తేషాం వైభోజనం శుభమ్।
అర్చనం సర్వదేవానాం తత్ర పద్మముఖీ సతీ॥

50—54

ఏస్థానములో శ్రీహరి దివ్యచరితములు చర్చింపబడునో, తద్గుణకీర్తన మొనరింపబడునో యాప్రదేశములోనే మంగళములకెల్ల మంగళములను బ్రసాదింపగల శ్రీమహాలక్ష్మి విరాజిల్లగలదు. పితామహా! శ్రీకృష్ణపర మాత్మ యశస్సు, తద్భక్తులప్రశంస లొనరింపబడు స్థానములోనే శ్రీకృష్ణ ప్రాణప్రియురా లైనలక్ష్మీదేవి సదా నివసింపగలదు. శంఖధ్వని ప్రతిధ్వనించు చోట, శంఖము, సాలగ్రామము, తులసి విరాజిల్లుచోట, నాదివ్యవస్తువులు సేవింపబడి, ధ్యానింపబడి, వందనము లర్పింపబడుచోట లక్ష్మి సదా విరాజిల్ల గలదు. శివలింగము పూజింపబడి కీర్తింపబడుచోట, దుర్గాదేవి పూజా కీర్తనము లొనరింపబడుచోట, ద్విజులు సేవింపబడుచోట, ద్విజు లుత్తమభోజనములను భుజించుచోట, సర్వదేవతలు గౌరవింపబడుచోట శ్రీమహాలక్ష్మి విరాజిల్లగలదు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా! రమాపతి శ్రీహరి సర్వదేవతలతో నిట్లు పలికి శ్రీమహాలక్ష్మి

నీవిధముగ నాదేశించెను. "దేవీ! నీవు నీకళతో క్షీరసాగరము జేరి క్షీర సాగర మథనసమయమున నావిర్భవించి దేవతల ననుగ్రహింపుము". తదనంతరము శ్రీహరి బ్రహ్మాది దేవతల నిట్లాదేశించెను. "పద్మజా! నీవు దేవతలచే క్షీరసాగరమథన మొనరింపజేయుము. అపుడు క్షీరసాగరమునుండి శ్రీమహాలక్ష్మి యావిర్భవించి దేవతల ననుగ్రహింపగలదు." బ్రహ్మాది దేవతలందఱు శ్రీహరి కనేకప్రణామము లర్పించి యాయన యనుజ్ఞ గైకొని క్షీరసాగరమథనము కొఱకై క్షీరసాగరము జేరిరి. బ్రహ్మదేవుని యాదేశానుసారముగ దేవతలు, దానవులు నేకమై మందారాచలమును మంథనకాష్ఠముగ నొనరించి మహాకూర్మమును బాత్రగ జేసి యాదిశేషుని మంథనరజ్జువుగ నొనరించి క్షీరసాగరమును మథింప నారంభించిరి. ఫలస్వరూపమున ధన్వంతరి, ఉచ్చైశ్శ్రవ మనెడియశ్వరాజము, వివిధరత్నములు, ఐరావతము, సుదర్శన చక్రము, వనమాల, అమృతము మొదలగు ననేకదివ్యవస్తువులు క్షీరసాగరమునుండి ప్రాదుర్భవించి తుదకు శ్రీమహాలక్ష్మి యనంతకోటిచంద్రప్రభాసమన్వితయై సింధురాజకన్యయై సాక్షాత్కరించెను. మునీశ్వరా! ఆ త్రిజగన్మోహిని యగు శ్రీమహాలక్ష్మి విష్ణుదేవునందుబరిపూర్ణప్రేమ గలదియై, క్షీరసాగరశయనుడై, సర్వేశ్వరుడైన శ్రీహరిగళమును వనమాలతో నలంకరించి యాయననే తనప్రాణేశ్వరునిగ వరించెను. తదనంతర మింద్రాది దేవతలు, బ్రహ్మ, శంకరాదులు పూజించి స్తుతింపగా లక్ష్మి ప్రసన్నురాలై దేవతలను కేవలము తనకటాక్షములచే వీక్షించెను. శ్రీమహాలక్ష్మి ప్రసరించినకరుణాకటాక్షములఫలస్వరూపముగ దేవత లందఱు నాక్షణమునందే దుర్వాసమహర్షి శాపమునుండి విముక్తులై, శ్రీసంపన్నులై యసురులను నిర్జించి దైవరాజ్యమును మరల స్థాపించిరి. నారదా! యిట్లు శ్రీమహాలక్ష్మికృపకు బాత్రులై దేవతలు పరమసుఖముల ననుభవించిరి. దేవర్షీ! సర్వసారభూత మైనయీ శ్రీమహాలక్ష్మ్యుపాఖ్యానమును శ్రవణమొనరించినవారికి సమస్తసుఖములు లభింపగలవు.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
ప్రకృతిఖండములోని లక్ష్మ్యుపాఖ్యానమున
లక్ష్మి దేవి యావిర్భావమను
ముప్పదియెనిమిదవ అధ్యాయము
సంపూర్ణము.

# ముప్పదితొమ్మిదవ అధ్యాయము

## శ్రీమహాలక్ష్మీ పూజావిధానము, ధ్యానము, స్తోత్రము.

**నారదుడు పలికెను :**

భద్రపురుషా! ఉత్తమతత్త్వజ్ఞానస్వరూప మైనశ్రీహరిదివ్యగుణకీర్తనమును, లక్ష్మ్యుపాఖ్యానమును శ్రవణ మొనరించితిని. పూర్వము బ్రహ్మాదిదేవతలు శ్రీహరిప్రేరితులై యేపూజావిధానముతో శ్రీమహాలక్ష్మి నుపాసించి, ధ్యానించి, స్తుతించి, తదనుగ్రహమును బొందగల్గిరి? ఏధ్యానస్తోత్రములను బఠించి యింద్రాదిదేవతలు కోల్పోయిన తమసర్వస్వమును మరల బొందగల్గిరి?

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! దేవరా జైనయింద్రుడు క్షీరసముద్రతటముపై స్నానమొనరించి స్వచ్ఛవస్త్రములను ధరించి పరిశుద్ధుడై మంగళకలశమును స్థాపించి షడ్దేవతల నారాధించెను. వారే శ్రీగణేశ్వరుడు, సూర్యభగవానుడు, అగ్నిదేవుడు, విష్ణుదేవుడు, మహాదేవుడు, దుర్గాదేవి. వీరి కావాహనగంధపుష్పాది షోడశోపచారముల నర్పించి భక్తిసమన్వితుడై బాగుగ బూజించి తదనంతరము మహేంద్రుడు పరమైశ్వర్యస్వరూపిణి యైన శ్రీమహాలక్ష్మి నావాహన మొనరించి తనపురోహితు డైనబృహస్పతి, బ్రహ్మదేవుడు నిర్దేశించినవిధానముతో శ్రీమహాలక్ష్మీపూజ సంపన్న మొనరించెను. మునీశ్వరా! ఆసమయమున నాపవిత్రక్షేత్రములో ననేకమహర్షులు, బ్రాహ్మణులు, ఆచార్యులు, శ్రీహరి, బృందాదేవి, సకలదేవతలు నానందమయుడు జ్ఞానస్వరూపుడు నైనశంకరు డుపస్థితులై యున్నారు. నారదా! దేవరాజు చందనచర్చితము లైనపారిజాతపుష్పములతో శ్రీమహాలక్ష్మిని బూజించి యేకాగ్రచిత్తముతో ధ్యానించెను. పూర్వకాలమందు శ్రీహరి బ్రహ్మ కుపదేశించిన ధ్యానముతోనే మహేంద్రుడు శ్రీమహాలక్ష్మిని జింతించెను. ఆధ్యానమునే యుపదేశించెద సావధానుడవై యవధరింపుము.

## శ్రీ మ హా ల క్ష్మీ ధ్యా న ము

సహస్ర దలపద్మస్య కర్ణికావాసినీం పరామ్ ।
శరత్పార్వణకోటీన్దుప్రభాజుష్టవరామ్బరామ్ ॥
స్వతేజసా ప్రజ్వలన్తీం సుఖదృశ్యాం మనోహరామ్ ।
ప్రతప్తకాంచననిభాం శోభాం మూర్తిమతీం సతీమ్ ॥
రత్నభూషణభూషాఢ్యాం శోభితాం పీతవాససా ।
ఈషద్ధాస్యప్రసన్నాస్యాం శశ్వత్సుస్థిరయౌవనామ్ ॥
సర్వసమ్పత్ప్రదాత్రీం చ మహాలక్ష్మీం భజే శుభామ్ (10-12)

పరమపూజ్యురాలైన శ్రీమహాలక్ష్మి సహస్రదళములు గలకమలము యొక్క కర్ణికలపై విరాజమానురాలై యున్నది. ఆమె సుందరాంబరములు శరత్పూర్ణిమనాటికోటానుకోట్లచంద్రికలశోభతో సంపన్నములై యున్నవి. ఈ స్వతేజముతో ప్రజ్వరిల్లు శ్రీమహాలక్ష్మి దర్శనము పొంది మనస్సుఖండా నందపరిపూర్ణమగుచున్నది. ఈమె యంగకాంతి ప్రతప్తసువర్ణసమానము, అఖండశోభ మూర్తిభవించిన సతియే ఈమె. రత్నాభరణభూషణములను ధరించి పీతాంబరములతో శోభించుచు సుస్థిరయౌవనసంపన్నయై, మందహాస ప్రసన్నాస్యయై ప్రకాశించుచున్నది. సర్వసంపదలను బ్రసాదింపగల కళ్యాణ స్వరూపిణి యగునీమెను నేను భజించెదను.

నారదా! యిట్లు ధ్యానించి యింద్రుడు బ్రహ్మదేవు నాదేశానుసార ముగ షోడశోపచారములచే ననంతగుణసంపన్న యగు శ్రీమహాలక్ష్మిపూజ సంపన్న మొనరించెను. అత్యంతభక్తిపూర్వకముగ మంత్రోచ్చారణ మొనరించుచు బూజావిధ్యనుసారముగ నింద్రుడు ప్రతివస్తువును శ్రీమహా లక్ష్మి కర్పించెను. ఆపూజావిధి నుపదేశించెద శ్రవణ మొనరింపుము.

## శ్రీ మహాలక్ష్మి పూజావిధి

అమూల్యరత్నసారం చ నిర్మితం విశ్వకర్మణా ।
ప్రశంస్యాని ప్రకృష్టాని వరాణి దుర్లభాని చ।
ఆసనం చ విచిత్రం చ మహాలక్ష్మి! ప్రగృహ్యతామ్ ॥
శుద్ధం గఙ్గోదక మిదం సర్వవన్దిత మీప్సితమ్
పాపేధ్మవహ్నిరూపం చ గృహ్యతాం కమలాలయే!॥

పుష్పచన్దనదూర్వాదిసంయుతం జాహ్నవీజలమ్ ।
శఙ్ఖగర్భస్థితం శుద్ధం గృహ్యతాం పద్మవాసిని! ॥
సుగన్ధిపుష్పతైలం చ సుగన్ధామలకీఫలమ్।
దేహసౌన్దర్యబీజం చ గృహ్యతాం శ్రీహరేః ప్రియే! ॥
వృక్షనిర్యాసరూపం చ గన్ధద్రవ్యాదిసంయుతమ్ ।
శ్రీకృష్ణకాన్తే! ధూపం చ పవిత్రం ప్రతిగృహ్యతామ్॥
మలయాచలసమ్భూతం వృక్షసారం మనోహరమ్।
సుగన్ధయుక్తం సుఖదం చన్దనం దేవి! గృహ్యతామ్॥
జగచ్చక్షుఃస్వరూపం చ ధ్వాన్తప్రధ్వంసకారణమ్।
ప్రదీపం శుద్ధరూపం చ గృహ్యతాం పరమేశ్వరి! ॥
నానోపహారరూపం చ నానారససమన్వితమ్ ।
నానాస్వాదుకరం చైవ నైవేద్యం ప్రతిగృహ్యతాం॥
అన్నం బ్రహ్మస్వరూపం చ ప్రాణరక్షణకారణమ్।
తుష్టిదం పుష్టిదం చైవ దేవ్యన్నం ప్రతిగృహ్యతామ్॥
శాల్యక్షతసుపక్వం చ శర్కరాగవ్యసంయుతమ్ ।
స్వాదుయుక్తం మహాలక్ష్మి పరమాన్నం ప్రగృహ్యతామ్॥
శర్కరాగవ్యపక్వం చ సుస్వాదు సుమనోహరమ్।
మయా నివేదితం లక్ష్మి! స్వస్తికం ప్రతిగృహ్యతామ్॥
నానావిధాని రమ్యాణి పక్వాని చ ఫలాని చ।
స్వాదుయుక్తాని కమలే! గృహ్యన్తాం ఫలదాని చ ॥
సురభిస్తనసమ్భూతం సుస్వాదు సుమనోహరమ్ ।
మర్త్యామృతం సుగవ్యం చ గృహ్యతా మచ్యుతప్రియే!॥
సుస్వాదు రససంయుక్తం మిక్షువృక్షసముద్భవమ్ ।
అగ్నిపక్వ మతిస్వాదు గుడం చ ప్రతిగృహ్యతామ్॥
యవగోధుమ-సస్యానాం చూర్ణరేణుసముద్భవమ్ ।
సుపక్వం గుడగవ్యాక్తమిష్టాన్నం దేవి! గృహ్యతామ్॥
సస్యచూర్ణోద్భవం పక్వం స్వస్తికాదిసమన్వితమ్।
మయా నివేదితం దేవి పిష్టకం ప్రతిగృహ్యతామ్॥
పార్థివో వృక్షభేదశ్చ వివిధద్రవ్యకారణమ్।
సుస్వాదురససంయుక్తమిక్షుశ్చప్రతిగృహ్యతామ్ ॥
శీతవాయుప్రదం చైవ దాహే చ సుఖదం పరమ్।
కమలే! గృహ్యతాం చేదం వ్యజనం శ్వేతచామరమ్।

తామ్బూలం చ వరం రమ్యం కర్పూరాదిసువాసితమ్ ।
జిహ్వాజాడ్య చ్ఛేదకరం తామ్బూలం దేవి గృహ్యతామ్॥
సువాసితం శీతలం చ పిపాసానాశకారణమ్ ।
జగజ్జీవనరూపం చ జీవనం దేవి! గృహ్యతామ్ ॥
దేహసౌన్దర్యబీజం చ సదా శోభావివర్ధనమ్ ।
కార్పాసజం చ కృమిజం వసనం దేవి గృహ్యతామ్ ॥
రత్నస్వర్ణవికారం చ దేహభూషావివర్ధనమ్ ।
శోభాధానం శ్రీకరం చ భూషణం ప్రతిగృహ్యతామ్॥
నానాకుసుమనిర్మాణం బహుశోభాప్రదం పరమ్ ।
సురభూపప్రియం శుద్ధం మాల్యం దేవి ప్రగృహ్యతామ్॥
పుణ్యతీర్థోదకం చైవ విశుద్ధం శుద్ధిదం సదా ।
గృహ్యతాం కృష్ణకాన్తే త్వం రమ్య మాచమనీయకమ్॥
రత్నసారాదినిర్మాణం పుష్పచన్దనసంయుతమ్।
రత్నభూషణభూషాఢ్యం సుతల్పం దేవి!గృహ్యతామ్॥
యద్యద్ ద్రవ్యమపూర్వం చ పృథివ్యామపి దుర్లభమ్ ।
దేవభూషార భోగ్యం చ తద్ద్రవ్యం దేవి!గృహ్యతామ్ (15—40)

జననీ! శ్రీమహాలక్ష్మీ! అమూల్యము, శ్రేష్ఠము, నత్యంతదుర్లభము, ననర్ఘరత్నసారాదులచే విశ్వకర్మనిర్మించిన యీావిచిత్రాసనమును సమర్పించుచున్నాను, కృపతో స్వీకరింపుము. కమలాలయా! సర్వవందితమై, సర్వేప్సితమై, పాపేంధనములను దహించుటలో నగ్నిస్వరూపమైనయీాశుద్ధగంగోదకమును పాద్యరూపమున స్వీకరింపుము. పద్మవాసినీ! పుష్పచందనదూర్వాదులచే సమ్మిళితమైనశుద్ధగంగాజలములను శంఖమునందుంచి యర్ఘ్యరూపమున సమర్పించుచున్నాను కృపతో స్వీకరింపుము. శ్రీహరిప్రియా! ఈ యుత్తమసుగంధయుక్తమైనపుష్పతైలము, సుగంధపూర్ణామలకీఫలము శరీరసౌందర్యమును వృద్ధినొనరించు పరమసాధనములు. దేవీ! ఈస్నానోపయోగకరములైనవస్తువులను స్వీకరింపుము. శ్రీకృష్ణకామినీ! వృక్షనిర్యాసరూపగంధద్రవ్యాదిసంయుతమైనపవిత్రధూపమును గృపతో స్వీకరింపుము. దేవీ! ఈమనోహరచందనము మలయాచలములో నుత్పన్నమైన చందనవృక్షసారతత్త్వము. సుగంధయుక్తము, సుఖప్రదము నైన దీనిని సమర్పించు

చున్నాను, కరుణతో స్వీకరింపుము. పరమేశ్వరీ! జగమునకు జక్షుస్స్వరూపమై యంధకారమును నశింపజేయగల్గి శుద్ధరూప మైనయీప్రదీపమును స్వీకరింపుము. దేవీ! నానాప్రకారోపహారపూర్ణమైన యీనైవేద్యము నానాప్రకారరసములచే బూర్ణమై వివిధరుచియుక్తమై యున్నది. ఈనైవేద్యమును స్వీకరింపుము. దేవీ! అన్నమే బ్రహ్మస్వరూపము, ప్రాణరక్షణకారణము, తుష్టిని, పుష్టిని బ్రసాదింపగలదు, కావున దేవీ! ఈదివ్యాన్నమును బరమాన్నమును గ్రహింపుము. మహాలక్ష్మీ! ఈయుత్తమపక్వాన్నము చక్కెరతో, ఘృతముతో, సిద్ధపఱుపబడినది. మాధురీయుక్తమైన యీపరమాన్నమును గృపతో స్వీకరింపుము. చక్కెరతో, ఘృతముతో నిర్మింపబడి సుమనోహరమై, సుస్వాద్యమైనయీస్వస్తిక మనుమృష్టాన్నమును నీకు నివేదించుచున్నాను. జననీ! లక్ష్మీ! కరుణతో స్వీకరింపుము. కమలా! రమ్యములు, సుస్వాదుయుక్తములు, బాగుగ బండిన నానావిధఫలములను నీకు నివేదించుచున్నాను. ఈరమ్యఫలములను స్వీకరింపుము. అచ్యుతప్రియా! కామధేనుస్తనసంభూతములు, మనోహరములు, సుస్వాదుసంపన్నములు మానవులకమృతతుల్యములు నైనయీశుద్ధక్షీరములను స్వీకరింపుము. ఇక్షు (చెఱకు) వృక్షసముద్భవ మైనసుస్వాదురసములను, నగ్నితో బక్వమొనరించి గుడ (బెల్లము) రూపమున నీకు సమర్పించుచున్నాను, మాతా! స్వీకరింపుము. యవగోధుమాదిసస్యములచూర్ణముతో గుడమును, క్షీరములను కలిపిబాగుగ వండి నీకు సమర్పించుచున్నాను, దేవీ! స్వీకరింపుము. సస్యచూర్ణోద్భవములై, బాగుగవండిన, స్వస్తికాదిసమన్వితములైన పిష్టకములను నివేదించుచున్నాను, దయతో స్వీకరింపుము. దేవీ! ఇక్షువృక్ష మీభూతలముపై నొక విశిష్టవృక్షము. ఈవృక్షరసముచే గుడశర్కరాద్యనేకమధురపదార్థములను నిర్మింపవచ్చును. సుస్వాదురససంపన్న మైనయీయిక్షువులను (చెఱకు గడలను) స్వీకరింపుము. కమలా! శీతలవాయువులను బ్రసాదించుచు దేహమునకు సుఖప్రదమై, పరమమనోహరమైన యీవింజామరము స్వీకరింపుము. కర్పూరాదులచే సువాసితమై, యత్యంతరమ్యమై, జిహ్వాజాడ్యచ్ఛేదకమైనయీశ్రేష్ఠ తాంబూలమును కృపతో స్వీకరింపుము. తల్లీ! దప్పికను దీర్పకారణములై, జగజ్జీవనరూపము లైనయీసువాసితశీతలజలముల సర్పించుచున్నాను దయతో స్వీకరింపుము. అమ్మా! దేహసౌందర్యబీజమములై

సదా శోభను వృద్ధినొందింపగల నూలుపట్టువస్త్రములను స్వీకరింపుము. రత్న స్వర్ణాదులచే నిర్మింపబడి, దేహభూషావివర్ధనములై, శోభను బ్రసాదింపగల్గి నవై శ్రీకరములై నయిాభూషణములను గృపతో స్వీకరింపుము. అత్యంతశోభను బ్రసాదింపగల నానాపుష్పములచే నిర్మింపబడి సురలకు, నరేశ్వరుల కత్యంతప్రియము లై నయిాపరమశుద్ధకుసుమమాలికలను స్వీకరింపుము. శ్రీకృష్ణకాన్తా! ఈపవిత్రతీర్థ జలములు స్వయంశుద్ధములు అన్యములను గూడ సదా శుద్ధముల నొనరింపగలవు. ఈరమ్యశుద్ధజలముల నాచమనీయరూపమున స్వీకరింపుము. దేవీ! ఈ యమూల్యరత్ననిర్మితసుందరశయ్య వస్త్రభూషణాదులచే నలంకరింపబడి పుష్పచందనచర్చితమై యున్నది. కృపతో నీరమ్యశయ్యను స్వీకరింపుము. దేవీ! ఇవియేగాక శరీరసౌందర్యవర్ధకములై, యలంకరణ యోగ్యములై, పృథ్వియం దలభ్యములై, దేవేంద్రున కైనను యోగ్యములైనవస్తువులను నీసేవలందు సమర్పించుచున్నాను, కృపతో నీద్రవ్యములను స్వీకరింపుము.

నారదమునీంద్రా! దేవేంద్రు డీమూలమంత్రముల నుచ్చరించుచు బహుపూజ్య యగుశ్రీమహాలక్ష్మికి బైనబేర్కొనిన ద్రవ్యములను సమర్పించి భక్తి పూర్వకముగ, విధిసహితముగ దన్మూలమంత్రమును బదిలక్షలపర్యాయములు జపించి ఫలస్వరూపమున మంత్రసిద్ధి పొందగల్గెను. ఈమూలమంత్రము సర్వులకు గల్పవృక్షసదృశము. స్వయముగ బ్రహ్మదేవుడే కృపతో శ్రీమహాలక్ష్మిమూలమంత్రమును మహేంద్రున కుపదేశించెను.

## శ్రీ మ హా ల క్ష్మి మూ ల మ ం త్ర ము

లక్ష్మీ ర్మాయా కామవాణీ తతః కమలవాసినీ,
స్వాహాన్తో వైదికో మన్త్ర రాజోఽయం ద్వాదశాక్షరః ॥
ఓం హ్రీం క్లీం ఐం కమలవాసిన్యై స్వాహా । (43)

ద్వాదశాక్షరసంయుక్త మైనయిావైదికమంత్రరాజమును మొదట శ్రీబీజమును (శ్రీం), మాయాబీజమును (హ్రీం), కామబీజమును (క్లీం). వాణీబీజమును (ఐం) బలికి కమలవాసిని యనుశబ్దమునకు విభక్తిని జోడించి అంతములో స్వాహాశబ్దము నుచ్చరింపవలెను.

'శ్రీం హ్రీం క్లీం ఐం కమలవాసిన్యై స్వాహా' ఇదియే మంత్రరాజ స్వరూపము.

కుబేరు డీమంత్రమును జపించియే శ్రీమహాలక్ష్మి నారాధించి పరమై శ్వర్యసంపన్ను డైనాడు. ఈమంత్రప్రభావమువలననే దక్షసావర్ణి యను మనువు రాజాధిరాజై సప్తద్వీపములకు జక్రవర్తియైనాడు. నారదా! ప్రియ వ్రతుడు, ఉత్తానపాదుడు, కేదారప్రభుడు మొదలగుసిద్ధపురుషు లీమంత్ర జపమువలననే పునీతులై శ్రీమహాలక్ష్మి యనుగ్రహమునకు పాత్రులై రాజాధిరాజు లైనారు.

మంత్రసిద్ధినొందగనే దేవరాజుసమక్షమున శ్రీమహాలక్ష్మి సాక్షాత్క రించెను. ఆవరదాయిని సర్వోత్తమ రత్ననిర్మితదివ్యవిమానారూఢయై, తన ప్రజ్వలిత బ్రహ్మ తేజముచే సప్తద్వీపవతి యగుపృథ్వినంతయు నాచ్ఛాదించెను. ఆమె శ్రీమదంగకాంతి శ్వేతచంపకపుష్పసముజ్జ్వలము. సస్మితముఖారవింద ముతో భక్తుల ననుగ్రహించుటకు బరమకాతరురాలై, రత్నభూషణవిభూషి తయై గళమునందు రత్నహారముల నలంకరించుకొని కోటానుకోట్లచంద్రుల ప్రభతో బ్రకాశించుచు శాంతస్వరూపిణియు, జగదంబయు నగుశ్రీమహాలక్ష్మి దేవపతి యగునింద్రునకు దనదివ్యదర్శనము నొసంగెను. నారదా! జగజ్జ నని యగుశ్రీమహాలక్ష్మి దివ్యానుగ్రహమునకు పాత్రు డైనయింద్రుని జన్మము సఫలము. ఆసమయమున తనసర్వాంగములు భక్తిభావముచే బుల కింపగ నశ్రుపూర్ణలోచనుడై, ముకుళితహస్తుడై మున్ను దనకు బ్రహ్మ దేవు డుపదేశించిన సంపూర్ణాభీష్టప్రద మైనశ్రీమహాలక్ష్మి స్తోత్రరాజముతో జగదంబను స్తుతింప నారంభించెను.

## శ్రీమహాలక్ష్మి స్తోత్రము

మహేంద్ర ఉవాచ :

'ఓం నమః శ్రీ మహాలక్ష్మ్యై

ఓం నమః కమలవాసిన్యై నారాయణ్యై నమో నమః।
కృష్ణప్రియాయై సారాయై పద్మాయై చ నమో నమః ॥
పద్మపత్రేక్షణాయై చ పద్మాస్యాయై నమో నమః।
పద్మాసనాయై పద్మిన్యై వైష్ణవ్యై చ నమో నమః ॥

సర్వసమ్పత్స్వరూపాయై సర్వదాత్ర్యై నమోనమః ।
సుఖదాయై మోక్షదాయై సిద్ధిదాయై నమోనమః ॥

హరిభక్తిప్రదాత్ర్యై చ హర్షదాత్ర్యై నమోనమః।
కృష్ణవక్షఃస్థితాయై చ కృష్ణేశాయై నమోనమః ॥

కృష్ణశోభాస్వరూపాయై రత్నపద్మే చ శోభనే ।
సమ్పత్త్యధిష్ఠాతృదేవ్యై మహాదేవ్యై నమోనమః॥

సస్యాధిష్ఠాతృదేవ్యై చ సస్యాయై చ నమోనమః ।
నమో బుద్ధిస్వరూపాయై బుద్ధిదాయై నమోనమః ॥

వై కుణ్ఠే యా మహాలక్ష్మీ ర్యా లక్ష్మీః క్షీరసాగరే ।
స్వర్గలక్ష్మీ రిన్ద్రగేహే రాజ్యలక్ష్మీ ర్నృపాలయే ॥

గృహలక్ష్మీ శ్చ గృహిణాం గేహే చ గృహదేవతా ।
సురభిః సా గవాం మాతా దక్షిణా యజ్ఞకామినీ ॥

అదితి ర్దేవమాతా త్వం కమలా కమలాలయే ।
స్వాహా త్వం చ హవిర్దానే కవ్యదానే స్వధా స్మృతా ॥

త్వం హి విష్ణుస్వరూపా చ సర్వాధారా వసుంధరా ।
శుద్ధసత్త్వస్వరూపా త్వం నారాయణపరాయణా ॥

క్రోధహింసావర్జితా చ వరదా చ శుభాననా ।
పరమార్థప్రదా త్వం చ హరిదాస్యప్రదా పరా ॥

యయా వినా జగ త్సర్వం భస్మీభూత మసారకమ్ ।
జీవన్మృతం చ విశ్వం చ శవతుల్యం యయా వినా॥

సర్వేషాం చ పరా త్వం హి సర్వబాన్ధవరూపిణీ ।
యయా వినా న సమ్భాష్యో బాన్ధవై ర్బాన్ధవః సదా ॥

త్వయా హీనో బన్ధుహీన స్త్వయా యుక్తః సబాన్ధవః ।
ధర్మార్థకామమోక్షాణాం త్వం చ కారణరూపిణీ ॥

యథా మాతా స్తనన్ధానాం శిశూనాం శైశవే సదా ।
తథాత్వం సర్వదా మాతా సర్వేషాం సర్వవిశ్వతః॥

మాతృహీనః స్తనాన్ధశ్చ సచే జ్జీవతి దైవతః ।
త్వయా హీనో జనః కోఽపి న జీవత్యేవ నిశ్చితమ్ ॥

సుప్రసన్నస్వరూపా త్వం మే ప్రసన్నా భవామ్బికే।
వైరిగ్రస్తం చ విషయం దేహి మహ్యం సనాతని॥
వయం యావత్ త్వయా హీనా బన్ధుహీనాశ్చ భిక్షుకాః ।
సర్వసమ్పద్విహీనాశ్చ తావదేవ హరిప్రియే॥
రాజ్యం దేహి శ్రియం దేహి బలం దేహి సురేశ్వరి॥
కీర్తిం దేహి ధనం దేహి యశో మహ్యం చ దేహి వై॥
కామం దేహి మతిం దేహి భోగాన్ దేహి హరిప్రియే ।
జ్ఞానం దేహి చ ధర్మం చ సర్వసౌభాగ్య మీప్సితమ్ ॥
ప్రభావం చ ప్రతాపం చ సర్వాధికారమేవ చ
జయం పరాక్రమం యుద్ధే పరమైశ్వర్యమేవ చ ॥ (52-72)

ఓంకారస్వరూపిణీ! నమస్కారము. భగవతీ! శ్రీమహాలక్ష్మి! నీకు నమోవాకము.

కమలవాసినికి నమస్కారము. నారాయణిదేవికి ననేకనమస్కారములు. సంసారమునకే సారమైనకృష్ణప్రియకు, బద్మకు, పద్మపత్రములవంటి విశాల నేత్రములు కల్గిన కమలముఖికి, మహాలక్ష్మికి, పద్మాసన, పద్మిని, వైష్ణవి, మొదలగుదివ్యనామముల ప్రసిద్ధిగాంచిన శ్రీమహాలక్ష్మికి, సర్వసంపత్స్వరూపిణియై సర్వమునుప్రసాదింపగలమహాదేవికి, సుఖదాయని, మోక్షదాయని, సిద్ధిదాయిని యైనశ్రీమహాలక్ష్మికి, శ్రీహరిభక్తిని బ్రసాదింపగలదేవికి, హర్ష ప్రదాత్రికి,శ్రీకృష్ణవక్షఃస్థలమందు విరాజిల్లు తద్హృదయేశ్వరికి, అనేకనమస్కారములు .రత్నపద్మే! శోభనే! నీవు శ్రీకృష్ణునకేశోభాస్వరూపిణివి, సర్వసంపదల కధిష్ఠాత్రివి, మహాదేవివి, నీకు నేను మరల మరల బ్రణామముల నర్పించుచున్నాను. దేవీ! నీవు సస్యముల కధిష్ఠాత్రివి, సస్యస్వరూపిణివి, బుద్ధిస్వరూపిణివి, బుద్ధిప్రదాయినివి, దేవీ! నీవు వైకుంఠములో మహాలక్ష్మివి, క్షీరసాగరములో లక్ష్మివి, ఇందునిస్వర్గమందు స్వర్గలక్ష్మివి, రాజేంద్రులభవనములందు రాజ్యలక్ష్మివి. మాతా! నీవు గృహస్థుల గృహములలో గృహలక్ష్మివి ప్రతిగృహమందు గృహదేవతవు. గోమాత సురభిరూపమున, యజ్ఞపత్నియగుదక్షిణారూపమున నీవే విరాజిల్లుచున్నావు. దేవమాత యైనయదితివి నీవే, కమలములందు నివసించు కమలవు నీవే. హవ్యప్రదాన సమయములందు స్వాహా యని, కవ్యప్రదానసమయమందు స్వధా యని యుచ్చరింపబడు ఆ

నామములు నీనామములే. సర్వులకు నాధారమైన విష్ణుస్వరూపిణివి వసుంధరవు నీవే. శ్రీమన్నారాయణుని యుపాసనయందు సదా తత్పరవై విరాజిల్లు దేవీ నీవే శుద్ధసత్త్వస్వరూపిణివి. నీలో క్రోధమునకుగాని, హింసకుగాని కించిన్మాత్రముగూడ స్థానము లేదు. అనగా నీవు క్రోధహింసాదివర్జితవు, వరదాయినివి, శుభాననవు. జననీ! నీవే పరమార్థమును బ్రసాదింపగలవు, హరిదాస్యసౌభాగ్యము ననుగ్రహింపగలవు. నీవు లేనిచో సకలజగములు భస్మీభూతములు నిస్సారములు కాగలవు, నీవు లేనివిశ్వము బ్రతికియున్నను మరణించినట్లే భావింపవలెను. నీవు సకలప్రాణులకు మాతృస్వరూపిణివి, సర్వబాంధవరూపిణివి. నీవు లేనిచో సోదరునితోనైనను సహోదరబాంధవులు పలుకనైనను బలుకరు, అనగా లక్ష్మీకటాక్షము లేనివారిని బంధువులైన నాదరింపరని భావము. నీ యనుగ్రహము లేనివారు బంధుహీనులు కాగలరు, నీకృపకు బాత్రులైనవారు సబాంధవులు కాగలరు. నీకృపాకటాక్షములవలననే ధర్మార్థకామమోక్షములుసులభములు కాగలవు. శైశవావస్థలో శిశువుల నెట్లు తల్లి స్తన్యము నొసంగి పాలించునో, యట్లే నీవు సదా సర్వవిశ్వములకు మాతృదేవతవై రక్షించుచున్నావు. స్తన్యపానమొనరించు శిశువైనను, దల్లి లేకపోయినను భాగ్యవశమున జీవింపగలదు, కాని నీవు లేనిచో నెవరును జీవింపలేరనెడువాక్యము నిశ్చయముగ సత్యము. సుప్రసన్నస్వరూపిణీ! మాతా! అంబికా! నాపై బ్రసన్నురాలవు కమ్ము. సనాతనీ! నారాజ్యసంపదలు శత్రువులపరమైనవి; అవి మరల నాకు లభించునటుల ననుగ్రహింపుము. హరిప్రియా! నీయనుగ్రహము లభింపనంతవరకు నేను బంధహీనుడనై, భిక్షుకుడనై, సంపత్తివిహీనుడనై దుఃఖింపగలను. సురేశ్వరీ! నీవు కరుణతో నాకు రాజ్యమును, శ్రీని, బలమును, కీర్తిని, ధనమును, యశమును బ్రసాదింపుము. హరిప్రియా! నాకు వాంఛితవస్తువులను, బుద్ధిని, జ్ఞానమును, ధర్మమును బ్రసాదింపుము, నే నభిలషించు సకలసౌభాగ్యముల నిమ్ము. ఇవియేగాక మాతా! నాకు బ్రభావమును బ్రతాపమును, సర్వాధికారములను, యుద్ధములందు విజయములను, బరాక్రమమును, బరమైశ్వర్యాదులను నొసంగుము.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా! యిట్లు స్తుతించి సర్వదేవతలతో నిందుడు తలవంచి పులకిత

గాత్రముతో ప్రేమానందాశ్రుపూర్ణ నయనములతో శ్రీమహాలక్ష్మిని స్తుతించి యనేకప్రణామము లర్పించెను. దేవ కళ్యాణార్థమై బ్రహ్మ, శంకరుడు, ఆదిశేషుడు, ధర్మదేవత, కేశవుడు మొదలుగాగల మహానుభావు లందఱు శ్రీమహాలక్ష్మిని ప్రార్థించిరి. ఆ దేవసభామధ్యమున నఖండ కాంతితో ప్రకాశించు శ్రీమహాలక్ష్మి యత్యంత ప్రసన్నురాలై దేవతల కీప్సిత వరముల నొసంగి శ్రీకృష్ణుని మనోహరపుష్పమాలతో నలంకరించి, యంత స్థితురాలయ్యెను. తదనంతరము సకలదేవతలు సంతుష్టులై తమతమ ధామముల కరిగిరి. స్వయముగ మహాలక్ష్మి యానాటినుండి క్షీరసాగరశయను డైన శ్రీహరి వక్షఃస్థలములో ప్రసన్నురాలై విరాజిల్ల నారంభించెను. మునీశ్వరా! బ్రహ్మశంకరాది దేవతలు శ్రీమహాలక్ష్మి కనేకశుభాశీర్వాదముల నొసంగి తమ తమ లోకములకు మరలిపోయిరి.

ఇదం స్తోత్రం మహాపుణ్యం త్రిసన్ధ్యం యః పఠే న్నరః ।
కుబేరతుల్యః స భవే ద్రాజరాజేశ్వరో మహాన్ ॥
సిద్ధస్తోత్రం యది పఠేత్సోఽపి కల్పతరు ర్నరః।
పంచలక్షజపేనైవ స్తోత్రసిద్ధి ర్భవే న్నృణామ్ ॥
సిద్ధం స్తోత్రం యది పఠే న్మాస మేకం చ సంయతః॥
మహాసుఖీ చ రాజేన్ద్రో భవిష్యతి న సంశయః॥ (79-81)

నారదా! మహాపవిత్రమైన, మహాపుణ్యప్రదమైన యీస్తోత్రమును నిత్యము త్రిసంధ్యలందు పఠించు వారు కుబేరతుల్యులు రాజాధిరాజులు కాగలరు. అయిదులక్షలు జపించిన గల్పతరుస్వరూప మైనయీ సిద్ధస్తోత్రము సిద్ధింపగలదు. ఈ సిద్ధస్తోత్రము యమనియమసంపన్నులై యొక మాసపర్యంతము పఠించిన వారు మహాసుఖములను బొంది నిశ్చయముగ రాజేంద్రసములై విరాజిల్లగలరు.

**నారదుడు పలికెను :**

ఆహా! భగవంతునిదివ్యచరితము లెంతయద్భుతములు! ప్రభూ! దుర్వాసమహర్షి యొసంగిన శ్రీహరిపూజాకుసుమము గజరాజుశిరముపై నుంచగా

దానిశిరము ప్రథమపూజ కర్హమయ్యెను. అనంతరమా గజ మింద్రుని ధిక్కరించి వనముల కరిగెను. తదనంతరము శనిదృష్టిపాతమువలన గణేశ్వరుని శిరము ఛిన్నభిన్నము కాగా శ్రీహరి యీగజరాజుమస్తకమునే గణేశ్వరున కమర్చెను. దేవేంద్రుడు సకలదేవతలతో గూడి దేవషట్కమును బూజించి తదనంతరము లక్ష్మి నారాధించి తదనుగ్రహమునకు బాత్రుడై ధన్యు డయ్యెను. ఓ వేదవిదాంవరా! నీదివ్యముఖారవిందమునుండి సువ్యక్తసిద్ధాంతస్వరూపము లైనదుర్గాహ్యాపురాణముల నాలకించి ధన్యుడనైతిని.

## శ్రీనారాయణఋషి పలికెను :

నారదా! యిట్లు దుర్వాసమహర్షి శాపమునకు గుఱియైన యింద్రాదిదేవతలు శ్రీమహాలక్ష్మి నారాధించి తదనుగ్రహమునకు బాత్రులై బ్రాహ్మణ శాపవిముక్తి నొంది సుఖించిరి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణసంవాద
మున శ్రీమహాలక్ష్మిపూజావిధానమను
ముప్పది తొమ్మిదవ
అధ్యాయము
సంపూర్ణము.

# నలుబదియవ అధ్యాయము

## స్వాహాదేవి సంభవకథనము

**నారదుడు పలికెను :**

స్వామీ! శ్రీమన్నారాయణ ఋషీంద్రా! మహాభాగా! నీవు రూప గుణయశస్తేజఃప్రకాశములందు సాక్షాచ్ఛ్రీమన్నారాయణసముడవు. జ్ఞాను లందు, సిద్ధులందు, యోగులందు, వేదవేత్తలందు, తపస్వులందు, శ్రేష్ఠుడవు. నీ యనన్యకృపాకటాక్షములకు బాత్రుడనై నేను మహాద్భుత శ్రీమహాలక్ష్మి దివ్యోపాఖ్యానమును శ్రవణ మొనరింపగల్గితిని. దేవా! నిగూఢములు, పురాణములందును నప్రకాశితములు, బహుగోపనీయములు, సర్వోపయుక్తములు, వేదోక్తములు, ధర్మసంయుతములు నైనవివిధశక్తుల యుపాఖ్యానములనుగూడ వర్ణింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను:**

బ్రహ్మకులసంభవా! ప్రకృతిప్రభావమును దెల్పు వివిధోపాఖ్యానములు పురాణములం దప్రకాశితములే కాని శ్రుతులం దాదుర్లభోపాఖ్యానములు గూఢరూపమున నున్నవి. నారదమునీంద్రా! ఆజనని యుపాఖ్యాము లనంత ములు, కావున నీ వేయుపాఖ్యానముల శ్రవణ మొనరింపగోరుచున్నావో తెల్పిన బ్రవచింపగలను.

**నారదుడు పలికెను :**

దేవతలకు హవిస్సు నర్పించుటలోను సకలకర్మలందు స్వాహాదేవి, పితృ దేవతా ప్రీత్యర్థకకర్మములందు స్వధాదేవి, సర్వకర్మములందు దక్షిణాదేవి శ్రేష్ఠురాండ్రు. కావున స్వాహా, స్వధా, దక్షిణామాతలయుపాఖ్యాన ములను గ్రమముగ వర్ణించి నన్ను జరితార్థుని జేయుము.

**సూతమహర్షి పలికెను :**

శౌనకాదిమహర్షులారా! నారదునభ్యర్థనల నాలకించి యామహర్షి పుంగవుడు సస్మితముఖారవిందుడై యత్యంత ప్రాచీనములైనయుపాఖ్యానముల నిట్లు ప్రవచింప నారంభించెను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

దేవర్షీ! సృష్టిప్రారంభసమయమున సంభవించిన స్వాహాదేవి యావిర్భావ ప్రసంగమును వర్ణించెద సావధానుడవై యవధరింపుము. సకలదేవతలు తమ యాహారవ్యవస్థకై బ్రహ్మలోకమును బ్రవేశించి బ్రహ్మదేవుని శరణు వేడి తమకాహారమును నిర్ణయించి యది లభించునటుల యనుగ్రహింపవలసి నదిగ బ్రార్థింపగా బ్రహ్మదేవుడు వారి కభయము నొసంగి శ్రీహరి దివ్యచరణ కమలముల నారాధించెను. అపుడు స్వయముగ శ్రీహరియే యజ్ఞరూపమున బ్రహ్మసమక్షమున నవతరించెను. యజ్ఞములందు సమర్పింపబడు హవిస్సా హుతులనే బ్రహ్మదేవుడు దేవతల కాహారముగ నిర్ణయించెను. కాని బ్రాహ్మణక్షత్రియాదివర్ణములు భక్తిపూర్వకముగ యజ్ఞములం దర్పించిన హవిస్సాహుతులు యజ్ఞాగ్నిలో దాహికాశక్తి లేనందువలన దేవతలను జేర లేదు. మరల సకలదేవతలు నుదాసీనులై బ్రహ్మదేవుని జేరి తమ కాహారము లభింపలేదని విన్నవించిరి. బ్రహ్మదేవుడు దేవతల ప్రార్థనల నాలకించి యీ సమస్యను బరిష్కరింపవలసినదిగ శ్రీకృష్ణపరమాత్మను బ్రార్థింపగ భగవంతుడు మూలప్రకృతి యగునీశ్వరి నారాధింపుమని యాదేశించెను. భగ వదాజ్ఞనుసారము విధాత యేకాగ్రతతో మూలప్రకృతి నారాధించెను. అపుడు సర్వశక్తిస్వరూపిణి యగుమూలప్రకృతి ప్రసన్నురాలై యగ్నికిదాహికా శక్తి యైనస్వాహాదేవిరూపమున నవతరించెను. ఆమె శ్రీవిగ్రహకాంతి శ్యామలవర్ణము. ఆమె సస్మితముఖారవిందమై గ్రీష్మమధ్యాహ్నమార్తాండ తేజముతో బ్రజ్వరిల్లుచు భక్తానుగ్రహకారిణియై బ్రహ్మయెదుట సాక్షాత్క రించి 'పద్మయోనీ! మనోభీష్టవరము నర్థింపు'మని యాదేశించెను. జగద్విధాత భగవతీ కరుణాపూరిత వచనముల నాలకించి సంభ్రమపూర్వకముగ నిట్లు వరముల నర్థించెను. "దేవీ! నీ వగ్నికి దాహికాశక్తివై తత్పరమ సుందరపత్నివై మమ్ములను గరుణింపుము. నీవు లేనిదే యగ్ని యాహుతు లను భస్మ మొనరించుటలో నసమర్థుడు. ఏమానవుడు ప్రతిమంత్రాంత మందు నీదివ్యనామోచ్చారణ మొనరించి దేవతలకు నాహవనీయపదార్థముల నర్పించునో యాహవిస్సాదులు సునాయాసముగ దేవతల కుపలబ్ధములు కాగలవు. అంబికా! అగ్నిదేవునకు నీవు సర్వసంపత్స్వరూపిణివై, శ్రీరూపి

ణివై, గృహస్వామినివై విరాజిల్లుము. దేవతలు, మానవులు, సదా ని న్నారాధించెదరు".

బ్రహ్మదేవుని యభ్యర్థన నాలకించి స్వాహాదేవి యత్యంతోదాసీనురాలై విధాతతో దనయభిప్రాయము నిట్లు విశదీకరించెను. "బ్రహ్మదేవా! నేను దీర్ఘకాల మఖండతప మాచరించి శ్రీకృష్ణపరమాత్మసేవాసౌభాగ్యమును బొందెదను. ఆపరబ్రహ్మ మైనశ్రీకృష్ణపరమాత్మదక్క నన్యములన్నియు స్వప్నసదృశములు, భ్రమమాత్రములు, నశ్వరములు. ఆసచ్చిదానందవిగ్రహుడే నిత్యసత్యమూర్తి. బ్రహ్మదేవా! నీవు జగమును సృష్టింపగల్గుట, శంకరుడు మృత్యుంజయుడగుట, ఆదిశేషు డఖిలవిశ్వమును ధారణమొనరింపగల్గుట, ధర్మము సమస్తదేహధారులకర్మములకు సాక్షి యగుట, గణేశ్వరుడు సర్వదేవసమాజమందు ప్రథమపూజ కర్హుడగుట, జగదంబ యగు ప్రకృతి సర్వపూజ్యురాలగుట కేవలము శ్రీకృష్ణపరమాత్మకృపాప్రసాదఫలమే యని తెలిసికొనుము. శ్రీకృష్ణసేవాసౌభాగ్యసంపన్నులైనచో ఋషులు, మానివర్యులు, సర్వత్ర సమ్మానింపబడగలరు. కావున పద్మజా! నేనుగూడ నీయేకైకపరమప్రభు వైనశ్రీకృష్ణుని చరణకమలధ్యానమందే సంలగ్నురాలనయ్యెదను".

విధాతతో నిట్లు పల్కి కమలాముఖి యగుస్వాహాదేవి నిరామయు డైన శ్రీకృష్ణభగవదనుగ్రహార్థము తపమాచరించుటకు బ్రస్థాన మొనరించెను. స్వాహాదేవి నిర్జనప్రదేశములో నసంఖ్యాక సంవత్సరములపర్యంత మేకపాదముపై నిలువబడి శ్రీకృష్ణుని ధ్యానించుచు నఖండతప మాచరించెను. అపుడు ప్రకృతికి సహిత మతీతుడు, నిర్గుణపరబ్రహ్మ మైనశ్రీకృష్ణపరమాత్మ యామెయెదుట సాక్షాత్కరించెను. భగవంతుని గాంతునిగ వరించిన స్వాహాదేవి యాయన పరమకమనీయరూపమును దర్శించి ప్రేమవిహ్వలయై మూర్ఛిల్లెను. చిరకాలము ఘోరతప మాచరించి క్షీణశరీరయైన స్వాహాదేవి యభిప్రాయమును సర్వజ్ఞు డైనప్రభువు గ్రహించి తనచరణములపై బడిన యామెను లేవనెత్తి యాలింగన మొనరించుకొని తన యంకముపై గూర్చుండబెట్టుకొని మధురవచనములలో నిట్లు పల్కెను. "కాంతామణీ! వరాహకల్పములో నీవు నీయభీష్టానుసారము నాగ్నజితునికొమార్తె నాగ్నజితిగ నవత

రించి నాసహధర్మచారిణివి కాగలవు. కాని దేవీ! యీసమయమున మాత్రము నాస్వరూప మైనయగ్నిదేవు ననుగ్రహించి దాహికాశక్తి రూపమున దత్ప్రియపత్నివి కమ్ము, నావరప్రసాదమువలన నీవు మంత్రముల కంగభూతురాలవై పరమపవిత్రురాలవు కాగలవు. అగ్నిదేవుడు నిన్ను దన గృహస్వామినిగ నొనరించుకొని భక్తిభావముతో బూజింపగలడు".

నారదా! స్వాహాదేవి నిట్లాదేశించి యామెకు నాశ్వాసనమొసంగి శ్రీకృష్ణపరమాత్మ యంతర్హితు డయ్యెను. తదనంతరము బ్రహ్మదేశాను సారముగ వహ్ని సామవేదోక్తవిధితో స్వాహాదేవిని ధ్యానించి, స్తుతించి యామెపూజ సంపన్నమొనరించెను. అగ్నిదేవునకు భగవతి ప్రసన్నురాలుకాగా మంత్రోచ్చారణపూర్వకముగ నగ్నిదేవుడు స్వాహాదేవి పాణిగ్రహణ మొన రించెను. అగ్నితేజమువలన స్వాహాదేవినుండి క్రమముగ దక్షిణాగ్ని, గార్హాప త్యాగ్ని, ఆహవనీయాగ్ని యను మువ్వురు పరమసుందరకుమారు లుద్భవించిరి. ఆనాటినుండి మహర్షులు, మునులు, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు మొదలగువర్ణములవారు స్వాహాంతమంత్రముల నుచ్చరించుచు నగ్నియందు హవిస్సులను హవనమొనరింప నారంభించిరి. వా రర్పించిన హవిస్సులు దేవతల కాహారరూపమున సంప్రాప్తించుచుండెను. స్వాహాయుక్తప్రశస్త మంత్రోచ్చారణ మొనరించు వానికి కేవలము మంత్రము పఠనమాత్రముననే మంత్రసిద్ధి లభించును. విషహీన మైనసర్పము, దేవహీను డైన బ్రాహ్మణుడు, పతిసేవావిహీనురా లైనస్త్రీ, విద్యాహీను డైనపురుషుడు, ఫలశాఖాహీన మైనవృక్షము నింద్యములగునట్లు స్వాహాహీన మైనమంత్రము కూడ నింద్యమని తెలిసికొనుము. స్వాహాను స్వాహాహీనముగ మంత్రము ముచ్చరించి హవనమొనరించిన హవిస్సులు దేవతలను జేరి ఫలములను బ్రసాదింపవు. సకలాహుతులు స్వాహాదేవి కరుణవలన నాటినుండి నేటి వఱకు సక్రమముగ దేవతలకు లభించుచున్నవి. స్వాహాంతమంత్రోచ్చారణ ముచే మానవులసకలకర్మములు సఫలములు కాగలవు. మునీశ్వరా! స్వాహా దేవి శ్రేష్ఠోపాఖ్యానము నీయెదుట వర్ణించితిని. ఈసారభూతప్రసంగము శ్రోతలకు, వ్యాఖ్యాతకు నఖండసుఖములను, మోక్షమును బ్రసాదింప గలదు.

నా ర దు డు ప లి కె ను :

దేవా! నాకు మున్నగ్ని దేవు డొనరించిన, స్వాహాదేవిపూజావిధానమును, ధ్యానమును, స్తోత్రమును నుపదేశింపవలసినదిగ బ్రార్థించుచున్నాను.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదమునీంద్రా! స్వాహాదేవిధ్యానము, స్తోత్రము, పూజావిధానము, మంత్రము సామవేదమందు వర్ణింపబడినవి. ఆసామవేదోక్తము లైన ధ్యానమంత్ర స్తోత్రాదులనే నీ కుపదేశించెద, సావధానుడవై యవధరింపుము. ఫలము లభింపవలెనన్న సర్వయజ్ఞారంభములందు సాలగ్రామప్రతిమలోగాని లేక కలశములోగాని స్వాహాదేవి నావాహనమొనరించి తత్పూజను సంపన్న మొనరించియే యజ్ఞమారంభింపవలెను. స్వాహాదేవి నిట్లు ధ్యానింపవలెను.

స్వా హా దే వి ధ్యా న ము

స్వాహాం మంత్రాఙ్గభూతాం చ మన్త్ర సిద్ధిస్వరూపిణీమ్।
సిద్ధాం చ సిద్ధిదాం నృణాం కర్మణాం ఫలదాం భజే ॥ 48

స్వాహాదేవీ మంత్రముల కంగభూతురా లైనకారణమునబరమపవిత్రురాలు. ఈమె సాక్షాన్మంత్రసిద్ధిస్వరూపిణి, సిద్ధురాలు, సిద్ధి ప్రదాయిని, మానవులకు సర్వకర్మఫలములను బ్రసాదింపగలజనని. నే ననన్యభక్తితో స్వాహాదేవిని ధ్యానించెదను.

మునీశ్వరా! యిట్లు ధ్యానించి మూలమంత్ర ముచ్చరించుచు బాద్యాదిషోడశోపచారముల నర్పించి స్వాహాదేవిని స్తుతించిన మనుష్యునకు సర్వసిద్ధులు సులభములు కాగలవు.

'ఓం హ్రీం శ్రీం వహ్నిజాయాయై దేవ్యై స్వాహా'

ఈమూలమంత్రమునే యుచ్చరించుచు స్వాహాదేవిపూజ సంపన్న మొనరించు వారి సకలమనోరథము లవశ్యము పరిపూర్ణములు కాగలవు, దేవర్షీ! అగ్నిదేవుడు స్తుతించిన స్వాహాదేవి స్తోత్రము నుపదేశించెద నాలకింపుము.

## స్వాహాదేవీ స్తోత్రము

**వహ్ని రువాచ :**

స్వాహాఽఽద్యా ప్రకృతేరంశా మన్త్రతన్త్రాఙ్గరూపిణీ ।
మన్త్రాణాం ఫలదాత్రీ చ ధాత్రీ చ జగతాం సతీ॥

సిద్ధిస్వరూపా సిద్ధా చ సిద్ధిదా సర్వదా నృణామ్ ।
హుతాశదాహికాశక్తి స్తత్ప్రాణాధికరూపిణీ॥

సంసారసారరూపా చ ఘోరసంసారతారిణీ ।
దేవజీవనరూపా చ దేవపోషణకారిణీ॥

షోడశై తాని నామాని యః పఠే ద్భక్తిసంయుతః ।
సర్వసిద్ధి ర్భవే త్తస్య ఇహలోకే పరత్ర చ॥

నాఙ్గహీనో భవే త్తస్య సర్వకర్మసు శోభనమ్।
అపుత్రో లభతే పుత్ర మభార్యో లభతే ప్రియామ్॥ 51-55

భక్తిపూర్వకముగ పైనిసూచించిన షోడశనామములను బఠించు వారికిహ పరలోకములలో సర్వసిద్ధులు ప్రాప్తింపగలవు. వారొనర్చుకర్మములేవియు సంగవిహీనములు కాజాలవు, వారికి సర్వకర్మములందు శుభఫలము లభించును. ఈషోడశనామజపప్రభావమున బుత్రహీనులకు బుత్రులు, భార్యాహీనులకు బ్రియభార్యలు లభింపగలరు.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణ
సంవాదమున స్వాహాదేవిజన్మాది
కథనమను నలుబదియవ
అ ధ్యా య ము
సంపూర్ణము.

# నలుబదియొకటవ అధ్యాయము

## స్వధాదేవి ప్రాదుర్భావకథనము

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదమునీంద్రా! స్వధా దేవియుత్తమోపాఖ్యానము వర్ణించెద నవధరింపుము. ఈయుపాఖ్యానశ్రవణము శ్రోతలకు పితరులకు తృప్తిప్రదము శ్రాద్ధఫలవర్ధకము. జగత్స్రష్టయైన బ్రహ్మదేవుడు సృష్ట్యారంభములో సప్తపితృదేవతలను సృజించెను. వారిలో నల్వురు మూర్తిసంపన్నులు, మఱి ముప్వురు కేవలము తేజస్స్వరూపులు. సిద్ధిస్వరూపులైనయాసప్తపితరుల కాహారార్థమై శ్రాద్ధమును, తర్పణపూర్వకముగ నర్పించిన పదార్థములను విధాత నిర్ణయించెను. తర్పణాంతమున స్నానము, శ్రాద్ధపర్యంతము దేవపూజనము, త్రికాలసంధ్యాంతమున నాహ్నికకర్మాదులు బ్రాహ్మణుల పరమ కర్తవ్యమని తెలిసికొనుము. ఈవిషయము శ్రుతియందు ప్రసిద్ధము.

> నిత్యం న కుర్యా ద్యో విప్రః త్రిసంధ్యం శ్రాద్ధతర్పణమ్ ।
> బలిం వేదధ్వనిం సోఽపి విషహీనో యథోరగః ॥
>
> హరిసేవావిహీనశ్చ శ్రీహరే రనివేద్యభుక్ ।
> జన్మాన్తం సూతకం తస్య న కర్మార్హః స నారద॥ (5-6)

నిత్యము త్రికాలసంధ్యను, శ్రాద్ధమును, తర్పణములను, బలిని, వేదాధ్యయనము నొనరింపనిబ్రాహ్మణుని విషహీనమైనసర్పమునిగ శక్తిహీనునిగ దెలిసికొనవలెను. నారదా! శ్రీహరిసేవావిహీనులై భగవంతున కర్పింపనిదే భుజించు మనుష్యులు బ్రతికినంతవఱ కపవిత్రులై సత్కర్మాచరణముల కనధికారులు కాగలరు.

బ్రహ్మదేవు డిట్లు పితరుల యాహారార్థము శ్రాద్ధాదులను నిర్ణయించి యంతర్హితు డయ్యెను. కాని బ్రాహ్మణాదులు పితరుల కర్పించినపదార్థములు పితరులకు లభింపలేదు. కావున వారు క్షుధాకారణమున దుఃఖితులై బ్రహ్మసభను ప్రవేశించి జరిగిన విషయమును విధాతకు విన్నవించిరి. అపుడు బ్రహ్మదేవుడు పరమసౌందర్యసంపన్నురాలైనమానసీకన్యను సృజించెను. పూర్ణిమాచంద్రశతప్రభాసమానముఖము కల్గిన యాదేవి రూపయౌవన సంప

న్నురాలు. ఆసాధ్విలో విద్య, గుణములు, బుద్ధి, రూపము సమానములుగ విరాజిల్లుచున్నవి. వివిధరత్నమయ భూషణములచే విభూషితురాలైన యామె వర్ణము శ్వేతచంపక సమానోజ్జ్వలము. మూలప్రకృతి యంశ సంభూతయైనయామె శుద్ధస్వరూపిణి, మందస్మితముఖారవింద, వరదాత్రి, కళ్యాణస్వరూపిణి. యాదివ్యసుందరిని 'స్వధా' యని బ్రహ్మాదులు కీర్తించిరి. శ్రీమహాలక్ష్మియొక్క సర్వశుభలక్షణములు నీమెలో విరాజమానములై యున్నవి. ఆమె తనచరణకమలములను శతదళపద్మముపై నుంచి దర్శనమొసంగెను. ఆమెముఖము, నేత్రములు వికసితకమల సదృశసుందరములు. నారదా! బ్రహ్మదేవుడు స్వధాదేవిని పితృదేవతలకు పత్నిగా నిర్ణయించెను. విధాత పితృదేవతలను సంతుష్టులుగ నొనరించుట కీతుష్టిస్వరూపిణి యైనపత్నిని వారి కప్పగించెను. విధాత మంత్రాంతమున స్వధానామము జోడించి మంత్రముల నుచ్చరించుచు పితరులప్రసన్నతార్థమై పదార్థముల నర్పింపవలె ననెడుగోపనీయవిషయములను బ్రాహ్మణుల కుపదేశించెను. అప్పటినుండి బ్రాహ్మణులు విధాత నాజ్ఞానుసారముగ పితరుల కవ్యప్రధానసమయమందు స్వధాదేవినామ ముచ్చరింప నారంభించిరి. ఇట్లు దేవతలకు పదార్థముల నర్పించుసమయమున 'స్వాహా' యని, పితరుల కర్పించు సమయమున 'స్వధా' యని యుచ్చరించుట శ్రేష్ఠము. సర్వకర్మములందు దక్షిణాహీన మైనయజ్ఞము వ్యర్థము కాగలదు. నారదా! అపుడు దేవతలు, పితరులు, బ్రాహ్మణులు, మహర్షులు మొదలగు వా రందఱు నత్యంతాదరముతో, భక్తితో పరమశాంతస్వరూపిణి యైనస్వధాదేవిని పూజించి స్తుతించిరి. దేవీవరప్రసాదమున నందఱు పరమసంతుష్టులై సకలమనోభీష్ట సిద్ధి నొందిరి.

మునీశ్వరా! సర్వులకు దుష్టికర మైనస్వధాదేవిసంపూర్ణోపాఖ్యానమును బ్రవచించితిని.

నా ర దు డు ప లి కె ను :

వేదవిదాంవరా! స్వధాదేవి పూజావిధానమును, ధ్యానమును, మంత్రమును, స్తోత్రమును గృపతో నా కుపదేశింపుడు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

దేవర్షీ! స్వధాదేవి ధ్యానస్తవనాదులు వేదములందు వర్ణితములు కావున సర్వులకు మాన్యములు. శరత్కాలములో నాశ్వయుజమాసకృష్ణపక్ష త్రయోదశీదినమున మఘానక్షత్రసమయములోగాని లేక శ్రాద్ధదినమందు గాని స్వధాదేవిని బూజింపవలెను. స్వధాదేవి నారాధించిన పిదపనే శ్రాద్ధ మొనరింపవలెను. అభిమానయుక్తులై స్వధాదేవిని బూజింపక శ్రాద్ధ కార్యములను నిర్వర్తించు వారికి శ్రాద్ధతర్పణాదుల ఫలము లభింపదు.

స్వ ధా దే వి ధ్యా న ము :

బ్రహ్మణో మానసీం కన్యాం శశ్వత్సుస్థిరయౌవనామ్ ।
పూజ్యాం పితౄణాం దేవానాం శ్రాద్ధానాం ఫలదాం భజే ॥ (23)

'స్వధాదేవి బ్రహ్మదేవునిమానసకన్య, సదా సుస్థిరయౌవన. ఈమె పితరులకు, దేవతలకు సదా పూజనీయురాలు. శ్రాద్ధఫలముల నొసంగు స్వధాదేవిని భజించెదను'. నారదా! ఇట్లు ధ్యానమొనరించి సాలగ్రామశిలయందు గాని, మంగళకలశమందుగాని స్వధాదేవి నావాహన మొనరించి మూల మంత్రము నుచ్చరించుచు పాద్యాదిషోడశోపచారముల నర్పించి పూజింపవలెను.

'ఓం హ్రీం శ్రీం క్లీం స్వధాదేవ్యై స్వాహా' యను నీమూల మంత్రము నుచ్చరించుచు స్వధాదేవిని బూజించి స్తుతించి ప్రణామము లర్పింపవలెను. బ్రహ్మపుత్రా! నారదా! సకలమానవులకు సర్వాభీష్టములను సిద్ధింపజేయగల్గినట్టి, పూర్వము బ్రహ్మదేవుడు స్తుతించినట్టి స్వధాదేవిస్తోత్రము నుపదేశించెద నవధరింపుము.

## శ్రీస్వధాదేవీ స్తోత్రము

బ్రహ్మ పలికెను :

స్వధోచ్చారణమాత్రేణ తీర్థస్నాయీ భవేన్నరః ।
ముచ్యతే సర్వపాపేభ్యో వాజపేయఫలం లభేత్॥

స్వధా స్వధా స్వధేత్యేవం యది వారత్రయం స్మరేత్।
శ్రాద్ధస్య ఫల మాప్నోతి బలేశ్చ తర్పణస్య చ ॥

శ్రాద్ధకాలే స్వధాస్తోత్రం యః శృణోతి సమాహితః।
లభే చ్ఛ్రాద్ధశతానాం చ పుణ్యమేవ వ సంశయః॥
స్వధా స్వధా స్వధేత్యేవం త్రిసంధ్యం యః పఠే న్నరః ।
ప్రియాం వినీతాం స లభే త్సాధ్వీం పుత్రం గుణాన్వితమ్॥

పితౄణాం ప్రాణతుల్యా త్వం ద్విజజీవనరూపిణీ।
శ్రాద్ధాధిష్ఠాతృదేవీ చ శ్రాద్ధాదీనాం ఫలప్రదా ॥
బహి ర్మన్మనసో గచ్ఛ పితౄణాం తుష్టిహేతవే ।
సంప్రీతయే ద్విజాతీనాం గృహిణాం వృద్ధిహేతవే ॥

నిత్యా త్వం నిత్యరూపాసి గుణరూపాసి సువ్రతే ।
ఆవిర్భావ స్తిరోభావః సృష్టౌ చ ప్రలయే తవ ॥
ఓం స్వస్తి శ్చ నమః స్వాహా స్వధా త్వం దక్షిణా తథా ।
నిరూపితా శ్చతుర్వేదైః షట్ప్రశస్తాశ్చ కర్మిణామ్॥ 27_34

స్వధా శబ్దోచ్చారణమాత్రముననే మానవుడు తీర్థస్నానఫలమును బొంది సర్వపాపములనుండి విముక్తుడై వాజపేయయజ్ఞఫలసిద్ధి నొందగలడు. స్వధా స్వధా స్వధా యనుచు మూడుసార్లు స్మరించిన శ్రాద్ధబలితర్పణాదుల ఫలము మానవులకు సులభముగ లభించును. శ్రాద్ధసమయమున సావధానచిత్తులై స్వధాదేవీస్తోత్రమును శ్రవణ మొనరించువారు నూఱుశ్రాద్ధముల ఫలమును బొందగలరు. ఇందు లేశమైనను సంశయము లేదు. ఏమానవుడు స్వధా, స్వధా, స్వధా యను నీపవిత్రనామములను త్రిసంధ్యములలో బఠించునో వానికి వినీతురాలు పతివ్రత సాధ్వి యగుపత్నియు, సద్గుణసంపన్నుడైన పుత్రుడును లభింపగలరు. దేవీ! నీవు పితృదేవతలకు ప్రాణతుల్యవు, బ్రాహ్మణులకు జీవనస్స్వరూపిణివి, నీవే శ్రాద్ధాదికర్మముల కధిష్ఠాత్రివి. నీకృపవలననే మానవులకు శ్రాద్ధతర్పణాదికర్మములఫలము లభించును. నీవు పితరుల తుష్టికొఱకు, ద్విజాతీయులప్రీతికొఱకు, గృహస్థులయభివృద్ధికొఱకు నామనము నుండి (బ్రహ్మనుండి) బహిర్గతమై ప్రాదుర్భవించినావు. సువ్రతే! నీవు నిత్యురాలవు, నీస్వరూపము నిత్యము, నీవు సకలసద్గుణసంపన్నవు. సృష్టిసమయమున ప్రాదుర్భవించి, ప్రళయకాలమున దిరోగమింపగలవు. ఓంకారస్వరూపిణీ! నీకు నమస్కారము. స్వస్తి, స్వాహా, స్వధా, దక్షిణా నమస్కారములు నీరూపములే. నీయీనాలుగురూపములను నాల్గువేదములు నిరూ

పించినవి. కర్మకాండ మొనరించువారలకు ఈయాఉరూపములు అత్యంత మాన్యములు.

స్వధాదేవి గోలోకమందు విరాజిల్లుశ్రీరాధాసఖి. కృష్ణపరమాత్మ యీసౌభాగ్యవతిని దన వక్షఃస్థలముపై ధరించినాడు కావున నీమెను స్వధా యని కీర్తించిరి. పూర్వ మీదేవి శ్రీకృష్ణుని యాలింగన సౌభాగ్యమనుభ వించుచుండగ గోలోకబృందావనములో శ్రీరాధాదేవి గాంచి యీమెను శపింపగ స్వధాదేవి గోలోకమునుండి యీవిశ్వమందు కృష్ణాలింగన మహా పుణ్యప్రభావమున బ్రహ్మమానసపుత్రికయై యావిర్భవించెను.

స్వాహాదేవికూడ గోలోకమందు విరాజిల్లుపరమసౌందర్యవతి యైనశ్రీరాధికాసఖి. మహారాసక్రీడలో దనకు దృప్తికలుగలేదని స్వయ ముగ శ్రీకృష్ణునితో బల్కినది గావున (స్వఆహా) ఈమెను స్వాహా యని ప్రస్తుతించిరి. రుచిరవసంతకాలములో స్వాహాదేవి యేకాంతముగ రాసమండ లములో శ్రీకృష్ణునిగూడి రాసక్రీడలందు నిమగ్నురాలై యుండగ శ్రీరాధా దేవి గాంచి యీమెను శపించెను, ఆమెశాపవశమున నీసౌభాగ్యవతి గోలో కమును వీడి కృష్ణాలింగన మహాపుణ్యప్రభావమున వహ్నికామినియై యీ విశ్వమును బావనమొనరించెను. స్వాహాదేవి పరమపవిత్రస్వరూపిణి, దేవ తలు, మానవులు మొదలగు వారందఱచే వందనముల గొను దివ్యసతి. ఈమె నామోచ్చారణమాత్రముననే మానవులు సకలపాతకములనుండి విముక్తులు కాగలరు. పూర్వము గోలోకములో సుశీల యను గోపిక మహాత్ముడైన శ్రీకృష్ణునిదక్షిణపార్శ్వమందు విరాజిల్లియుండగా శ్రీరాధాదేవి శాపమునకు గుఱియై కృష్ణాలింగనమహాపుణ్యప్రభావమున గోలోకమునుండి యీవిశ్వ ములో దక్షిణాదేవిగ నావిర్భవించెను. ఈమె రాసక్రీడయందు బ్రణయ సంబంధమైనసకలకర్మములందు నత్యంతదక్షురాలు కావున, దనహృదయేశ్వరు దక్షిణపార్శ్వమున నివసించినకారణమున నీమెనామధేయము దక్షిణయయ్యెను స్వధా, స్వాహా, దక్షిణలను నీమువ్వురు గోలోకవాసినులైనగోపికలు, తమ కర్మానురూపముగ బరమేశ్వరుని సంకల్పముచే జీవులను దరింపజేయుటకు ఈ ప్రాకృతవిశ్వములో నవతరించిరి.

**శ్రీనారాయణఋషి పలికెను :**

ఇట్లు బ్రహ్మదేవుడు స్వధాదేవిని స్తుతింపగ నామె యాసభలో నావిర్భ వించి బ్రహ్మాదిదేవతల కత్యంతప్రసన్నురాలయ్యెను. బ్రహ్మదేవుడు స్వధా దేవిని పితృదేవతల కర్పించి వారిని సంతుష్టుల నొనరించెను.

స్వధాస్తోత్ర మిదం పుణ్యం యః శృణోతి సమాహితః।
స స్నాతః సర్వతీర్థేషు వేదపాఠ ఫలం లభేత్॥　(48)

స్వధాదేవీస్తోత్రమును సమాహితులై శ్రవణమొనరించువారికి సర్వ తీర్థస్నానఫలము, వేదాధ్యయనఫలము లభింపగలవు.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణ
సంవాదమున స్వధాదేవిజన్మాదికథనమను
నలుబదియొకటవ అధ్యాయము
సంపూర్ణము.

—♦—

## నలుబదిరెండవ అధ్యాయము

### దక్షిణాదేవి సంభవ కథనము

**శ్రీనారాయణఋషి పలికెను:**

మునీశ్వరా! స్వాహా స్వధాశక్తుల యుత్తమోపాఖ్యానములను వినిపించి తిని. ఇపుడు దక్షిణాదేవిదివ్యచరితమును వర్ణించెద నవధరింపుము. ఈచరిత మత్యంతప్రాచీనము. గోలోకములో శ్రీకృష్ణపరమాత్మ కత్యంతప్రియురా లైనసుశీల యనుగోపిక కలదు. ఆమెను శ్రీరాధాదేవి ప్రధానసఖి యగు సౌభాగ్యము ప్రాప్తించెను. సుశీల ధన్యురాలు, మాన్యురాలు, మనోహ

రాంగసంపన్నురాలైనపరమసుందరి, సౌభాగ్యమందు శ్రీమహాలక్ష్మిసమాన. ఆమెలో బరమపతివ్రతయందు గలసర్వశుభలక్షణములు నిండియున్నవి. ఆ గోపిక విద్యాగుణోత్తమరూపాదులచే సదా శోభితురాలై యుండును. ఆ సుశీల కళావతి, కోమలాంగి, కాంతామణి, కమలలోచన, సుశ్రోణి, సుస్తని, శ్యామ, న్యగ్రోధపరిమండల, మదగజగామిని. ఆమె సస్మితముఖారవిందము సదా ప్రసన్నతతో వికసించియుండును. రత్నాభరణవిభూషిత మైనయామె లలితాంగములకాంతి శ్వేతచంపకపుష్పసమానగౌరవర్ణము. సుశీల, మృగలోచని, కామశాస్త్రనిష్ణాత, బింబోష్ఠి, కామిని, కలహంసగామిని. ఆమె తనమనోవాక్కాయకర్మలచే శ్రీకృష్ణునియందే యనురక్తురాలై యుండును. ఆమె సదా శ్రీకృష్ణుని మనోభావముల నెఱింగి యాయనకు బ్రియకృత్యములనే యాచరించును.

ఒక సమయమున సుశీలాశ్రీకృష్ణుల నేకాంతమున గాంచి శ్రీరాధ గోలోకమును వీడుమని సుశీల నాదేశించెను. తన భక్తురాలికి సంప్రాప్తమైనశ్రీరాధాశాపమునకు బరమాత్మ కినుక వహించి యంతర్ధాను డయ్యెను. అపుడు దేవదేవేశ్వరి యగుశ్రీరాధ రాసమండలమధ్యములో రాసేశ్వరు డైన శ్రీకృష్ణుని బునర్దర్శనము ప్రసాదింపుమని యనేకవిధముల నుచ్చస్వరముతో నర్థించెను. కాని భగవంతు డామెకు దర్శనసౌభాగ్య మొసంగలేదు. కృష్ణుని వీడిన ప్రతిక్షణము విరహిణి యగురాధకు నొక్కొక్క యుగసమాన మయ్యెను. ఆమె యత్యంత విరహకాతరయై శ్రీకృష్ణు నిట్లు ప్రార్థించెను.

హేకృష్ణ! హేప్రాణనాథాఽఽగచ్ఛ ప్రాణాధికప్రియ॥
ప్రాణాధిష్ఠాతృదేవేహ ప్రాణా యాన్తి త్వయా వినా॥
స్త్రీగర్వః పతిసౌభాగ్యా ద్వర్ధతే చ దినే దినే।
సుస్త్రీచే ద్విభవో యస్మాత్తం భజే ద్ధర్మతః సదా॥
పతి ర్బన్ధుః కులస్త్రీణా మధిదేవః సదా గతిః।
పరం సమ్పత్స్వరూపశ్చ సుఖరూపశ్చ మూర్తిమాన్॥
ధర్మదః సుఖదః శశ్వ త్ప్రీతిదః శాన్తిదః సదా।
సమ్మానదో మానదశ్చ మాన్యో వై మానమణ్డనః॥
సారా త్సారతమః స్వామీ బన్ధూనాం బన్ధువర్ధనః।
న చ భర్తృసమో బన్ధుః సర్వబన్ధుషు దృశ్యతే॥ 19-23

కృష్ణా! ప్రాణనాథా! నా ప్రాణాధికప్రియా! దర్శనమొసంగుము. నేను నిన్ను నాప్రాణముకంటె నధికముగ ప్రేమించుచున్నాను గావున శీఘ్రముగ కృపతో దయచేయుము. నీవు లేనిదే నాప్రాణములు నిలువవు. నీవే నాప్రాణాధిష్ఠుడవైన దైవము. స్త్రీ పతి సేవాసౌభాగ్యముపై గర్వించును. పతితో ప్రతిదిన మామె సుఖసౌభాగ్యములు దినదినప్రవర్థమానములు కాగలవు. కావున సాధ్వి యగుస్త్రీ ధర్మపూర్వకముగ సదా పతిసేవా తత్పరయై యుండవలెను. పతియే కులస్త్రీలకు బంధువు, అధిదైవము, నిత్యాశ్రయము, పరమసంపత్స్వరూపము మూర్తీభవించిన సుఖరూపము. పతియే ధర్మమును, సుఖమును, నిరంతరప్రీతిని, సదాశాంతిని, సమ్మానమును, మానమును ప్రసాదించును. కావుననే పతి మాననీయుడు, ఆతడే యామె మానమును (ప్రణయకోపమును) శాంతింపజేయువాడు. స్వామియే స్త్రీకి సారతమమైనవస్తువు, ఆతడే బంధువులలో బంధుభావము నభివృద్ధియొనరించువాడు, సకలబంధుజనములలో పతిసమమైనబంధువు మఱియొకడు గోచరింపడు.

> భరణాదేవ భర్తాఽయం పాలనా త్పతి రుచ్యతే।
> శరీరేశాచ్చ స స్వామీ కామదః కాన్త ఏవ చ॥
> బన్ధుశ్చ సుఖబన్ధాచ్చ ప్రీతిదానా త్ప్రియః పరః
> ఐశ్వర్యదానా దీశశ్చ ప్రాణేశా త్ప్రాణనాయకః॥
> రతిదానాచ్చ రమణః ప్రియో నాస్తి ప్రియా త్పరః।
> పుత్రస్తు స్వామినః శుక్రా జ్జాయతే తేన స ప్రియః॥ 24-26

ఆతడు స్త్రీని భరించుకారణమున భర్తయని, పాలించుకారణమున పతియని, శరీరమునకు స్వామి యైనకారణమున స్వామి యని, కామనలను పరిపూర్ణ మొనరించుకారణమున కాంతుడని, సుఖమును వృద్ధినొందించుకారణమున బంధువని, ప్రీతిని ప్రసాదించుకారణమున ప్రియుడని, ఐశ్వర్యదాత యైనకారణమున నీశుడని, ప్రాణములకు స్వామి యైనకారమున ప్రాణనాథుడని, రతిసుఖమును ప్రసాదించుకారణమున రమణుడని చెప్పబడెను. కావున స్త్రీకి పతికంటె ప్రియపాత్రులు మఱియొకరు లేరు. పతిశుక్రదానమువలననే స్త్రీకిపుత్రోత్పత్తి సంభవించును. ఈకారణమువలననే స్త్రీకి భర్తయే ప్రియు డనబడెను.

శతపుత్రా త్పరః స్వామీ కులజానాం ప్రియః సదా।
అసత్కులప్రసూతా యా కాన్తం విజ్ఞాతు మక్షమా॥
స్నానం చ సర్వతీర్థేషు సర్వయజ్ఞేషు దీక్షణమ్।
ప్రాదక్షిణ్యం పృథివ్యాశ్చ సర్వాణి చ తపాంసి వై॥
సర్వాణ్యేవ వ్రతాదీని మహాదానాని యాని చ।
ఉపోషణాని పుణ్యాని యాన్యన్యాని చ విశ్వతః॥
గురుసేవా విప్రసేవా దేవసేవాదికం చ యత్।
స్వామినః పాదసేవాయాః కలాం నార్హన్తి షోడశీమ్॥
గురువిప్రేష్టదేవేషు సర్వేభ్యశ్చ పతి ర్గురుః।
విద్యాదాతా యథా పుంసాం కులజానాం తథా ప్రియః॥ 27-31

కులాంగనలదృష్టిలో పతి నూర్గురుపుత్రుల కంటె నధికప్రియుడు. అసత్కులసంజాత లైనస్త్రీలుమాత్రమే పతిమాహాత్మ్యమును దెలిసికొనుటలో నసమర్థు లయ్యెదరు. సర్వతీర్థస్నానము, సర్వయజ్ఞములందు దక్షిణాదానము, పృథ్వీప్రదక్షిణము, అనేకతపములు, సకలవ్రతములు, అమూల్యవస్తుదానములు, పవిత్రోపవాసములు, గురుదేవతాబ్రాహ్మణులసేవ మొదలగు కార్యము లన్నియు నత్యంతప్రశంసనీయములు, కాని యీసకలకర్మములు స్వామి చరణసేవాసౌభాగ్యమందు బదునాఱవయంశమునకైనను సరిరావు. పురుషులకు విద్యాప్రదాత యైనయాచార్యు డాదరణీయుడైనట్లే కులీనురాలైనస్త్రీకిని బతియే పరమగురుడు. భార్యకు, గురువిప్రాదులందు, సర్వులయందు బతియే యాచార్యుడు.

ఆహా! ఏదేవాదిదేవుని కృపాప్రసాదమున నేను గోపగోపికలకు, సకలబ్రహ్మాండములకు, వానిలో నివసించుప్రాణులకు, రమాదిదేవాంగనలకు, నఖిలబ్రహ్మాండములనుండి గోలోకపర్యంతము గలసకలదివ్యలోకములకు నధీశ్వరినైతిని. ఆప్రాణవల్లభునిదివ్యతత్త్వమునే తెలిసికొనలేకపోయితిని. వాస్తవములో స్త్రీస్వభావము నధిగమించు టత్యంతకఠినముగదా.

**శ్రీనారాయణఋషి పలికెను :**

ఇట్లు శ్రీరాధాదేవి శ్రీకృష్ణపరమాత్మను భక్తిపూర్వకముగ ననేకవిధముల స్తుతించి ధ్యానింపగా భగవంతుడు ప్రసన్నుడై సాక్షాత్కరించి యామె ననుగ్రహించెను. మునీశ్వరా! గోలోకమును వీడి గోపికా

సుశీల దక్షిణానామమున ప్రసిద్ధిగాంచి దీర్ఘకాలము ఘోరతప మాచరించి లక్ష్మీవిగ్రహమును ప్రవేశించి యంతర్ధానమయ్యెను. అప్పటినుండి యజ్ఞముల నొసరించినను దేవతాదు లాయజ్ఞఫలముల బొందలేకపోయిరి. వారందఱు నుదాసీనులై బ్రహ్మ నాశ్రయించిరి. బ్రహ్మదేవుడు దేవతల ప్రార్థనల నాలకించి సమస్యాపరిష్కారమునకై జగత్ప్రభు వైన శ్రీహరిని భక్తిసమన్వితుడై దీర్ఘకాలము ధ్యానించెను. శ్రీహరి ప్రసన్నుడై శ్రీమహా లక్ష్మి దివ్యవిగ్రహమునుండి మర్త్యలక్ష్మిని ప్రాదుర్భవింపజేసి యామెకు దక్షిణ యని నామకరణముగావించి యామెను బ్రహ్మదేవున కర్పించెను. పర మాత్మాదేశానుసారముగ విధాత యజ్ఞసంబంధము లైనసమస్తకార్యములను సంపన్న మొనరించుటకు దక్షిణాదేవిని యజ్ఞపురుషున కర్పించెను. ఆసమయ మున యజ్ఞపురుషుడు మహోదనంభరితుడై దక్షిణాదేవిని విధిపూర్వకముగ బూజించి స్తుతించెను.

దక్షిణాదేవి వర్ణము ప్రతప్తసువర్ణసదృశము. ఆమె చంద్రకోటిసమ ప్రభాసంపన్న, బహుకమనీయురాలు, సుమనోహారిణి, పరమసుందరి, కమలమువంటి ముఖము కల్గినది, అత్యంత కోమలాంగి, కమలాయతవిశాల లోచన. లక్ష్మినుండి ప్రాదుర్భవించినదేవిదక్షిణకు కమలమే యాసనము. వహ్నిశుద్ధవస్త్రములను ధరించి, బింబాధరములు కల్గినదియై, మాలతీమాలా విభూషితయై యాసతి ప్రకాశించెను. మహర్షులమానసములనే మోహింప జేయగల దక్షిణాదేవి సుస్నాత, సువేషధారిణి, యీషత్స్మితప్రసన్నాస్య, రత్నాభరణభూషిత, సుందరనితంబ, బృహచ్ఛ్రోణి, విశాలవక్షఃస్థలసంపన్న. బ్రహ్మాజ్ఞానుసారముగ పరమసౌందర్యవతి యైన దక్షిణాదేవిని శ్రీహర్యంశ సంభూతు డైనయజ్ఞపురుషుడు తనసహధర్మచారిణిగ గ్రహించెను. ఆ దివ్య దంపతులకు సర్వకర్మఫలు డనుశ్రేష్ఠపుత్రు డుదయించెను. ఆతడే సకలయజ్ఞ కర్మములకు ఫలప్రదాత. కర్మపరాయణు లైనసత్పురుషులకు దక్షిణాదేవియే ఫలము ప్రసాదింపగలదు. కర్మము పూర్ణమైనపిదప నామెకుమారు డైన సర్వకర్మఫలుడు ఫలప్రదాత కాగలడు. భగవానుడు యజ్ఞము, దక్షిణాదేవి తనపుత్రు డైనఫలముతో గూడియున్నపుడే కర్మఫలములను బ్రసాదింపగలడని వేదజ్ఞు లైనపురుషులు ప్రవచించిరి.

నారదా! యిట్లు యజ్ఞపురుషుడు దక్షిణదేవిని సహధర్మచారిణిగ, ఫల

దాత యైనపుత్రుని బుత్రినిగ బడసి సర్వకర్మములకు ఫలములకు బ్రసాదింప నారంభించెను. దేవత లత్యంత ప్రసన్నులై సఫలమనోరథులై తమతమ నిజ ధామముల కరిగిరి. కావున నారదా! కర్మ మొనరింపగనే కర్త దక్షిణ నొసంగవలెను. అపుడే యాకర్మఫల మాతనికి బ్రాప్తించునని వేదముల స్పష్టప్రవచనము. దైవవశమున యజ్ఞకర్త కర్మసంపన్న మొనరించి బ్రాహ్మణునకు దక్షిణ నొసంగలేకపోయిన నాదక్షిణ సంఖ్యాకాలముతో సమముగ వృద్ధినొంద నారంభించును. యజ్ఞకర్త కర్మములు దక్షిణారహితము లైన నిష్ఫలములు కాగలవు. బ్రాహ్మణుని సత్త్వ మపహరించిన కారణమున నాయపవిత్రమానవుడు మఱియేకర్మములకు నధికారి కాలేడు. దక్షిణ నొసంగని కారణమున శ్రీమహాలక్ష్మి వానిని శపించి మఱలిపోగలదు. ఆతడు దరిద్రుడై రోగియై చిరకాలము దుఃఖించును. అత డర్పించిన శ్రాద్ధతర్పణా దులను బితృదేవతలు గ్రహింపరు. అట్లే యాతడు దేవతాప్రీత్యర్థ మొనరించిన పూజలను, నగ్నియం దిడినయాహుతులను దేవతలు స్వీకరింపరు. యజ్ఞ సమయమున గర్త సంకల్పించినదక్షిణ యొంపగనియెడల బ్రతిగ్రహించు పురోహితుడు దక్షిణ నర్థింపనియెడల వా రిర్వురు త్రాడుతెగిన ఘటమువలె నరకమున బడగలరు. నారదమునీంద్రా! యిట్లు నే నత్యంతరహస్యమయ మైనదక్షిణోపాఖ్యానమును బ్రవచించితిని.

**నారదుడు పలికెను :**

మునీశ్వరా! దక్షిణరహిత మైనకర్మఫలము నెవ రనుభవించెదరు? మహాభాగా! యజ్ఞపురుషుడు దక్షిణాదేవి నెట్లు పూజించెనో, యేస్తోత్రముతో స్తుతించెనో కృపతో బ్రవచన మొనరింపవలసినదిగ బ్రార్థించుచున్నాను.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! దక్షిణరహిత మైనకర్మమునకు ఫల మెట్లు సంభవించును? ఎందువలన ననగా ఫలములను బ్రసాదింపగలయోగ్యత కేవలము దక్షిణయుక్త కర్మమందే కలదు. మునీశ్వరా! దక్షిణ యొసంగక యొనరించిన కర్మములు బలిచక్రవర్తికి జెందగలవు. పూర్వకాలములో వామనమూర్తి దక్షిణరహిత కర్మములను బలిచక్రవర్తి కాహారరూపమున ననుగ్రహించెను. దేవర్షీ!

శ్రోత్రియులు, శ్రద్ధాహీనులు నగువారు శ్రాద్ధాదికర్మములం దర్పించినవస్తువు లన్నియు భోజనరూపమున బలిచక్రవర్తిని జేరగలవు. ఆచరణహీను లైన బ్రాహ్మణు లొనరించిన పూజాదికర్మములు గురువు నందు భక్తిలేని మానవుల కర్మములు నిస్సంశయముగ బలిచక్రవర్తి కాహారరూపమున లభింపగలవు. మునీశ్వరా! దక్షిణాదేవి ధ్యానము, స్తోత్రము, పూజావిధి, మంత్రము కణ్వ శాఖయందు వర్ణింపబడినవి. ఆస్తోత్రమంత్రాదుల నుపదేశించెద, సావధాను డవై యవధరింపుము. యజ్ఞపురుషు డత్యంతభక్తితో దక్షిణాదేవిని స్తుతించినస్తోత్రము నాలకింపుము.

## దక్షిణాదేవి స్తోత్రము.

**యజ్ఞ ఉవాచ :**

పురా గోలోకగోపీ త్వం గోపీనాం ప్రవరా పరా।
రాధాసమా తత్సఖీ చ శ్రీకృష్ణప్రేయసీ ప్రియే॥
కార్తికే పూర్ణిమాయాం తు రాసే రాధామహోత్సవే।
ఆవిర్భూతా దక్షిణాంశా త్కృష్ణస్యాతో హి దక్షిణా॥
పురా త్వం చ సుశీలాఖ్యా శీలేన సుశుభేన చ।
కృష్ణదక్షాంశవాసాచ్చ రాధాశాపాచ్చ దక్షిణా ॥
గోలోకా త్త్వం పరిధ్వస్తా మమ భాగ్యా దుపస్థితా।
కృపాంకురు త్వ మేవాద్య స్వామినం కురు మాం ప్రియే॥
కర్తౄణాం కర్మణాం దేవీ త్వమేవ ఫలదా సదా।
త్వయా వినా చ సర్వేషాం సర్వం కర్మ చ నిష్ఫలమ్॥
ఫలశాఖావిహీనశ్చ యథా వృక్షో మహీతలే।
త్వయా వినా తథా కర్మ కర్తౄణాం చ న శోభతే॥
బ్రహ్మావిష్ణుమహేశాశ్చ దిక్పాలాదయ ఏవ చ।
కర్మణశ్చ ఫలం దాతుం న శక్తాశ్చ త్వయా వినా॥
కర్మరూపీ స్వయం బ్రహ్మా ఫలరూపీ మహేశ్వరః।
యజ్ఞరూపీ విష్ణు రహం త్వ మేషాం సారరూపిణీ
ఫలదాతా పరం బ్రహ్మ నిర్గుణః ప్రకృతేః పరః।
స్వయం కృష్ణశ్చ భగవా న్న చ శక్త స్త్వయా వినా.

త్వమేవ శక్తిః కాన్తే మే శశ్వ జ్జన్మని జన్మని।
సర్వకర్మణి శక్తోఽహం త్వయా సహ వరాననే॥ 72—81

**యజ్ఞదేవుడు పలికెను :**

ప్రియా! దేవీ! పూర్వకాలములో నీవు గోలోకవాసిని యైనయొకగోపికవు, గోపికలయందు ప్రముఖురాలవు, రాధాసమముగ శ్రీకృష్ణసఖివి, శ్రీకృష్ణునకు ప్రేయసివి. కార్తికపూర్ణిమాదినమున రాధామహోత్సవసమయములో శ్రీకృష్ణుని దక్షిణభాగమునుండి నీ వావిర్భవించితివి, కావున నీనామధేయము దక్షిణ యయ్యెను. శోభనా! నీవు మొదట బరమశీలవతి వైనకారణమున సుశీలయని కీర్తింపబడితివి. అత్యంతయోగ్యవతి వైననీవు రాధాశాపము వలన గోలోకమును వీడి దక్షిణానామమున బ్రసిద్ధిగాంచి సౌభాగ్యవశమున నాకు లభించితివి. శుభాగా! నీవు నన్ను గృపతో నీస్వామిగ స్వీకరింపుము. దేవీ! నీవే యజ్ఞసంపన్నులైనపురుషులకర్మములకు గర్మఫలమును బ్రసాదించు నాదరణీయురాలవు, నీవు లేనిచో సర్వప్రాణులసకలకర్మములు నిష్ఫలములు కాగలవు. నీ యనుపస్థితిలో గర్మ మొనరించువారికర్మములుకూడ శోభింపవు. బ్రహ్మవిష్ణుమహేశాదులు, దిక్పాలాదు లందఱు నీవు లేనిచో కర్మములకు ఫల మొసంగుటలో నసమర్థులే. ఫలశాఖావిహీనము లైనవృక్షములు మహీతలముపై శోభిల్లనట్లు నీవు లేకుండగ నొనరింపబడినకర్మములు కర్తలకు శోభింపవు. అనగా నాకర్మఫలము కర్తలకు లభింపదు. స్వయముగ బ్రహ్మయే కర్మరూపము, శంకరుడే ఫలరూపు డనబడెను, విష్ణువునైననేనే స్వయముగ యజ్ఞరూపమున నవతరించితిని. మాయందఱియందు సారరూపము నీవే. ప్రాకృతగుణరహితుడు, ప్రకృతికే యతీతుడు సమస్తఫలప్రదాతయు సాక్షాత్పరబ్రహ్మము, పరమాత్మయు నగుశ్రీకృష్ణుడైనను నీవు లేనిచో సర్వకర్మములందు నశక్తుడు కాగలడు. కాంతామణీ! సదా జన్మజన్మములందు నీవే నా శక్తివి గమ్ము. వరాననే! నీవు నాతో విరాజిల్లిన నేను సమస్తకర్మములందు సమర్థుడను గాగలను.

**శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :**

ఇట్లు యజ్ఞపురుషుడు దక్షిణాదేవిని స్తుతించి ముకుళితహస్తుడై తత్సమక్షములో నిలువబడగా దక్షిణాదేవి ప్రసన్నురాలై యాయనను దనహృదయేశ్వరునిగ వరించెను. దక్షిణాదేవీ స్తోత్రమును యజ్ఞసమయమున బఠించు

వారికి నిస్సంశయముగ సర్వయజ్ఞఫలములు సులభములు కాగలవు. సకలయజ్ఞారంభసమయములం దీస్తోత్రమును బఠించు వాని సకలయజ్ఞములు నిర్విఘ్నముగ సంపన్న మగుననుట ముమ్మాటికి సత్యము.

నారదా! విద్వాంసు లైనవారు సాలగ్రామమూర్తియందుగాని, మంగళ కలశమందుగాని దక్షిణాదేవి నావాహన మొనరించి షోడశోపచారములచే బూజించి యిట్లు ధ్యానింపవలెను.

దక్షిణాదేవి ధ్యానము

లక్ష్మీదక్షాంశసమ్భూతాం దక్షిణాం కమలాకలామ్ ।
సర్వకర్మసు దక్షాం చ ఫలదాం సర్వకర్మణామ్ ॥
విష్ణోః శక్తిస్వరూపం చ పూజితాం వన్దితాం శుభామ్ ।
శుద్ధిదాం శుద్ధిరూపాం చ సుశీలాం శుభదాం భజే॥ (90-91)

శ్రీమహాలక్ష్మి దక్షిణపార్శ్వమునుండి ప్రాదుర్భవించిన కారణమున దక్షిణాదేవి యనునామమున విఖ్యాతిగాంచిన యీదేవి సాక్షాత్తుగ శ్రీమహాలక్ష్మికళ. సర్వయజ్ఞయాగాదిసకలకర్మములందు ఫలములను బ్రసాదించుటయే యీమె సహజగుణము. దక్షిణాదేవి శ్రీవిష్ణుభగవానుని శక్తిస్వరూపిణి. నే నీమె నారాధించెదను. శుభా, శుద్ధిదా, శుద్ధిరూపా, సుశీలాదినామములతో బ్రసిద్ధిగాంచిన దక్షిణాదేవిని నే భజించెదను.

నారదా! ఈమంత్రమును బఠించుచు భగవతిని ధ్యానించి వేదోక్త మూలమంత్రోచ్చారణ మొనరించుచు అర్ఘ్యపాద్యాదుల నర్పించి పూజింపవలెను.

'ఓం శ్రీం క్లీం హ్రీం దక్షిణాయై స్వాహా,

ఇదియే దక్షిణాదేవి మూలమంత్రము. సజ్జనులు సర్వపూజితురాలైన దక్షిణాదేవిని భక్తిపూర్వకముగ మూలమంత్రమును బల్కుచు బూజింపవలెను. దేవర్షీ! ఈయుపాఖ్యానశ్రవణము సుఖమును, బ్రీతిని, సర్వకర్మముల ఫలములను బ్రసాదింపగలదు. ఈదక్షిణాదేవీ పావనచరితమును సావధానులై శ్రవణ మొనరించు వా రొనరించిన యేకర్మములు నంగవిహీనములు కావు. ఈయుపాఖ్యానశ్రవణమువలన బుత్రహీను డైనవానికి సద్గుణసంపన్ను డైన పుత్రుడు, భార్యాహీనుడైనవానికి బ్రియవాదిని, వినీత, పుత్రవతి, సాధ్వియగు

భార్య లభింపగలదు. వానికి నుత్తమవ్రతపాలకురాలై నశుద్ధాచారసంపన్న మైన, కులీనురాలైనకౌమార్తె కల్గును. ఈయధ్యాయశ్రవణమాత్రమున విద్యాహీనునకు విద్య, ధనహీనునకు ధనము, భూహీనునకు భూమి, ప్రజా హీనునకు ప్రజలు నిశ్చయముగ లభించెదరు. సంకటములందుగాని, బంధు వియోగమందుగాని, విపత్తులందుగాని, బంధనమందుగాని చిక్కినవా రొకమాసపర్యంతము దక్షిణాదేవీదివ్యచరిత్రశ్రవణ మొనరించిన నిస్సంశయ ముగ నాసంకటములనన్నింటినుండి విముక్తులు కాగలరు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణసంవాద
మున దక్షిణోపాఖ్యానమున దక్షిణోత్పత్తి,
తత్పూజావిధాన మను నలుబదిరెండవ
అ ధ్యా య ము
సంపూర్ణము.

—♦—

## నలుబదిమూడవ అధ్యాయము

### షష్ఠీదేవసేనా సంభవకథనము

**నారదుడు పలికెను :**

ప్రభూ! భగవతీషష్ఠి, మంగళచండిక, మనసాదేవి మూలప్రకృతిమూల కళలు. దేవా! వీరిదివ్యచరితములను క్రమముగ వర్ణింపుడని ప్రార్థించు చున్నాను.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

దేవర్షీ! మూలప్రకృతి యాఱవయంశమునుండి ప్రాదుర్భవించిన కార

ణమున నీమెను షష్ఠీదేవి యనిరి. విష్ణుమాయ, బలద యనునామములు ప్రస్తుతింపబడు షష్ఠీదేవి శిశువుల కధిష్ఠాత్రి. ఉత్తమవ్రత పరిపాలకురాలైన యీమెకు కార్తికేయునిపత్ని యగుసౌభాగ్యము ప్రాప్తించెను. శరవణభవుడు షష్ఠీదేవిని దనప్రాణములకంటె మిన్నగ ప్రేమించును. శిశువులను దీర్ఘాయుష్మంతులుగ నొనరించుట, వారిని భరించి పోషించుట, రక్షించుట యీమె స్వాభావికగుణములు. సిద్ధయోగిని యైనయీమె తనయోగప్రభావముతో శిశువులచెంతనే విరాజమానురాలై యుండి వారిని రక్షించుచుండును. బ్రహ్మనందనా! షష్ఠీదేవియొక్క ప్రాచీనోత్తమేతిహాసమును వర్ణించెద నవధరింపుము. పుత్రులను బ్రసాదింపగల యీపరమసుఖప్రదోపాఖ్యానమును నేను ధర్మదేవుని ముఖారవిందమునుండి శ్రవణమొనరించితిని.

పూర్వకాలమున బ్రియవ్రతు డనునొక రాజాధిరాజు కలడు. ఈతని తండ్రి స్వాయంభువమనువు. ప్రియవ్రతుడు యోగిరాజైనకారణమున వివాహమాడక తపమునందే సంలగ్నుడై యుండెను. కాని బ్రహ్మదేవుని యాదేశానుసారము ప్రియవ్రతరాజు మాలిని యనుసాధ్విని పాణిగ్రహణమొనరించెను. వివాహానంతరము సుదీర్ఘకాలము గతించినను నాదంపతులకు సంతానము కలుగలేదు. అపుడు కశ్యపుడు వారిచే బుత్రకామేష్టి యజ్ఞమాచరింప జేసి యజ్ఞఫలమును (చారు) మాలినికి బ్రసాదించెను. ఆయజ్ఞఫలమును భక్షించి రాణి మాలిని గర్భవతియై తదనంతరము సువర్ణసమప్రభాసంపన్నుడైనపుత్రుని బ్రసవించెను. కాని సర్వాంగములతో సంపన్నుడైన యాకుమారుడు మృతశిశువుగ జన్మించెను. ఆమృతశిశువును గాంచి రాణితోపాటు సకలబంధువులు ననంతదుఃఖసాగరములో మునిగిరి. పుత్రశోకమును భరింపలేక రాణి మాలిని మూర్ఛితురాలయ్యెను. సామ్రాజ్యమంతయును శోకముతో నావరింపబడెను.

మునీశ్వరా! ప్రియవ్రతమహీశుడు మూర్తీభవించిన శోకస్వరూపుడై హృదయమును రాయిచేసికొని మృతశిశువును దీసికొని శ్మశానమునకు జని యొక యేకాంతప్రదేశములో గుమారుని హృదయమునకు హత్తుకొని పుత్రవియోగమును భరింపలేక నయనయములనుండి యశ్రుధారల బ్రవహింపజేయుచు దుఃఖింపదొడంగెను. ఆసమయమునందే ప్రియవ్రతునకు నాకాశములో నొకదివ్యవిమానము గోచరించెను. శుద్ధస్ఫటికమణివలె బ్రకాశించు

నావిమాన మమూల్యరత్నసారనిర్మితము, పట్టువస్త్రములచే నలంకరింబడి స్వతేజముతో నావిమానము ప్రకాశింపదొడంగెను. పుష్పమాలికలతో నలంక రింపబడి చిత్రవిచిత్రములతో విరాజిల్లు నాదివ్యవిమానమున మనమునే మోహింపజేయగల యొకపరమదివ్యసుందరి యధిష్టించియుండుట ప్రియ వ్రతరాజు గాంచెను. శ్వేతచంపకపుష్పసమముగ నామెవర్ణ మత్యంతోజ్జ్వ లము, సుస్థిరయౌవనసంపన్నము. ఆమెసస్మితముఖారవింద, రత్నభూషణ విభూషిత, పరమకృపామయి, యోగసిద్ధ, భక్తానుగ్రహకారిణి. ఆదివ్యసుందర స్వరూపిణి నెదుట దర్శించి ప్రియవ్రతుడు మృతశిశువును భూమిపై నుంచి యత్యంతభక్తితో నాదేవిని బూజించి, స్తుతించి యనేకప్రణామము లర్పిం చెను. నారదా! యీసమయములో స్కందునిప్రియురాలైన షష్ఠీదేవి స్వతే జముతో దేదీప్యమానముగ బ్రకాశించుచుండెను. ఆమెశాంతవిగ్రహము గ్రీష్మకాలచండభానునిప్రభతో దీప్తమానమై యుండెను. ప్రసన్నురాలైన దేవిని దర్శించి ప్రియవ్రతప్రభు డామె నిట్లు ప్రశ్నించెను. "సుశోభనా! సువ్రతా! వరారోహా। కాంతా। నీ వెవ్వరవు? నీ హృదయేశ్వరు డెవ్వడు? నీ వెవ్వరి కొమార్తెవు? దేవీ! నిశ్చయముగ నీవు సకలస్త్రీ సముదాయముల ధన్యవాదములకు, నాదరమునకు నత్యంతపాత్రురాలవు", నారదా! జగమునకు మంగళములను బ్రసాదించుటలో షష్ఠీదేవి ప్రవీణురాలు, దేవతలకు రణములో సహాయమొనర్చించిన కారణమున నామె నామధేయము దేవసేన యని ప్రసిద్ధి గాంచెను. పూర్వకాలమున నొకప్పుడు దేవతలు దైత్యులచే పీడింపబడు చుండగ నీదేవి స్వయముగ సైన్యము నాయుత్తపఱచి దేవతలపక్షమున నిలిచి దైత్యులతో యుద్ధమొనరించెను. షష్ఠీదేవి కరుణాకటాక్షముల ప్రభావము ననే దేవతలు రణములందు విజయలక్ష్మిని వరించిరి. కావున నాటినుండి షష్ఠీదేవి దేవసేన యను నామమున బ్రసిద్ధిగాంచెను. ప్రియవ్రతుని ప్రశ్నల నాలకించి షష్ఠీ దేవసేన యత్యంతమధురవచనములతో నిట్లు పలుక నారంభించెను.

**దేవసేన పలికెను :**

రాజా! బ్రహ్మమానసపుత్రికనై యావిర్భవించి జగమునే శాసించు నన్ను దేవసేన యందురు, విధాత నాకు జన్మమును బ్రసాదించి నన్ను

స్వామి కార్త్తికేయున కర్పించిరి. సకలమాతృకలయందు ప్రసిద్ధురాల నైన నాకు స్కందునిభార్య కాగల్గిన గౌరవము ప్రాప్తించెను. భగవతి మూల ప్రకృతి యొక్క అవయవాంశమునుండి ప్రాదుర్భవించిన కారణమున విశ్వములో నేను షష్ఠీదేవి యనునామమున ప్రసిద్ధిగాంచితిని. రాజా! నాయనుగ్రహమువలన పుత్రహీను లైనవారికి సుయోగ్యు లైనపుత్రులు, ప్రియాహీను లైనవారికి ప్రియులు, దరిద్రులకు ధనము, కర్మశీలురగు పురుషులకు గర్మములయుత్తమ ఫలము ప్రాప్తింపగలవు. మనుజేంద్రా! సుఖములు, దుఃఖములు, భయము, శోకము, హర్షము, మంగళము, సంపద్విపత్తులు మొదలగునవి యన్నియు జీవునకు స్వకర్మానుసారముగనే సంభవింపగలవు. తా మొనరించినకర్మప్రభావము ననే కొందఱు పుత్రవంతు లయ్యెదరు, మఱికొందఱు పుత్రహీను లయ్యెదరు. ఒకనికి అల్పాయుష్కుడగు పుత్రుడు జన్మించుట, మఱియొకనికి దీర్ఘాయుష్మంతుడైన కుమారుడు కల్గుట కేవలము స్వకర్మలఫలమే యని గ్రహింపుము. జీవుడు గుణవంతు డగుటకు, నంగహీను డగుటకు, ననేకప్రియపత్నులస్వామి యగుటకు, భార్యారహితు డగుటకు, రూపసి, రోగి ధార్మికు డగుటకు ముఖ్య కారణము యతడ నొనరించిన పూర్వకర్మఫలమే. కర్మానుసారము గనే వ్యాధులు సంభవించును. దేహధారి యారోగ్యవంతుడుకూడ గాగలడు. కావున రాజా! కర్మము లన్నింటికంటె మహాబలవత్తర మని శ్రుతిప్రవచనము.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

మునీశ్వరా! యిట్లు పల్కి షష్ఠీదేవి యమ్మృతబాలకుని దనయొడిలోనికి దీసికొని తనమహాజ్ఞానప్రభావముతో లీలగ జీవనదాన మొనరించెను. అపుడు ప్రియవ్రతప్రభువు దేవసేన యొడిలో బ్రతప్తకాంచనసన్నిభు డైనబాలకుని చిఱునవ్వులు చిందించుచుండగ జూచి యఖండానందభరితు డయ్యెను. రాజు తనబిడ్డను గాంచుచుండగనే దేవసేన బాలకునితోగూడ నాకాశమందు బయ లుదేరుటకు సంసిద్ధురాలయ్యెను. నారదా! అది గాంచిన రాజు కంఠోష్ఠతాల్వా దులు శుష్కించెను. ప్రియవ్రతుడు పుత్రభిక్ష నర్థించుచు షష్ఠీదేవసేన ననేకవిధముల బ్రార్థించి స్తుతించెను. అత్యంతసంతుష్టురాలై భగవతి రాజు నుద్దేశించి యిట్లు వేదోక్తవచనముల బల్కెను. "రాజా! త్రిలోకాధిపతి

దైనసీవు స్వాయంభువమనుపుత్రుడవు. సీవు సర్వత్ర నాపూజల నొనరింపజేసి స్వయముగ నన్నారాధింపుము. అపుడు నేను కమలముఖుడైనయీయమనో హరకుమారుని నీ కొసంగెదను. ఈబాలకుని నామము సువ్రతుడు ఈతడు సర్వగుణములతో, వివేకశక్తితో సంపన్నుడు కాగలడు. సువ్రతుడు శ్రీమన్నారాయణునికళాసంభవుడు, పరమయోగి. ఈయనకు పూర్వజన్మ జ్ఞానము కల్గును. ఈబాలకుడు క్షత్రియులందు శ్రేష్ఠుడై యశ్వమేధయజ్ఞ మొనర్పింపగలడు. సర్వులు సువ్రతుని సమ్మానింపగలరు. లక్షగజ సమూహములనడుమ సింహము శోభించునట్లె యీబాలకు డుత్తమబల సంపన్నుడై నకారణమున సకల రాజన్యులనడుమ ప్రకాశించును. ఈతడు ధనవంతుడై, గుణవంతుడై, పరిశుద్ధుడై విద్వాంసులచే ప్రేమింపబడి జ్ఞాను లలో, యోగులలో, దపోధనులలో, సిద్ధస్వరూపుడు కాగలడు. సర్వులకు సకలసంపదలను బ్రసాదింపగల సువ్రతునికీర్తి త్రిలోకములందు వ్యాపింప గలదు." ఇట్లు దేవసేన యీబాలకుని నాశీర్వదించి ప్రియవ్రతున కొసంగెను. ప్రియవ్రతుడు భగవతి యాజ్ఞను శిరోధార్యముగ నెంచి తదారాధన తా నొన రించి యన్యులచే నొనరింపజేయుగలవాడ నని ప్రతిజ్ఞ యొనరించెను. అపుడు దేవసేన ప్రియవ్రతుని, సువ్రతు నాశీర్వదించి యంతర్హితురా లయ్యెను. నారదా! అఖండానందభరితుడై ప్రియవ్రతావనీశుడు కుమారునితో గూడ రాజధాని చేరి జరిగిన దంతయు సంభ్రమాశ్చర్యములతో దనబంధుజనుల యెదుట వర్ణింపగ సకలరాజపరివారము, ప్రజలు నత్యంత సంతుష్టులై యానందించిరి.

ప్రియవ్రతప్రభువు తనపుత్రప్రాప్తిసమయమున సకలమాంగలికకార్య ములు నొనర్చించి షష్ఠీదేవసేనారాధన స్వయముగ నొనరించి తనసకలప్రజలచే నాపూజల నొనరింపజేసి బ్రాహ్మణులకు, యాచకులకు ననేకదానముల నొసంగి మహోత్సవ మొనరించెను. అప్పటినుండి ప్రతిమాసములో శుక్లపక్ష షష్ఠీ దినమున షష్ఠీదేవసేనావ్రతము విశ్వమం దంతట సర్వజనులు భక్తితో నాచరింప నారంభించిరి. శిశువులప్రసవగృహములో నాఱవదినమున నిరువదియొకటవదిన మైనబారసాలదినమున, నన్నప్రాశనశుభసమయమునందు సకల మానవసముదాయము యత్నపూర్వకముగ షష్ఠీదేవసేనాపూజ లొనరింప నారంభించిరి.

నారదా! దేవసేనధ్యానమును, బూజావిధిని, మూలమంత్రమును, స్తోత్రమును నీ కుపదేశించెద సావధానుడవై యవధరింపుము. కౌథుమా శాఖలో వర్ణింపబడిన భగవతీస్తోత్రాదులను నేను ధర్మదేవుని ముఖారవిందము నుండి శ్రవణ మొనరించితిని. మునీశ్వరా! సాలగ్రామప్రతిమయందుగాని, మంగళకలశమందుగాని, వటవృక్షమూలభాగమందుగాని, విగ్రహమును నిర్మించి దేవి నావాహన మొనరించి ప్రకృతియాఅవయవాంశమునుండి ప్రాదుర్భవించిన శుద్ధస్వరూపిణి నీషష్ఠీ దేవసేనను బూజింపవలెను. దేవీధ్యానము నుపదేశించెద శ్రవణ మొనరింపుము.

## షష్ఠీ దేవసేనా ధ్యానము

షష్ఠాంశాం ప్రకృతేః శుద్ధాం సుప్రతిష్ఠాం చ సువ్రతామ్ ।
సుపుత్రదాం చ శుభదాం దయారూపాం జగత్ప్రసూమ్ ॥
శ్వేతచంపకవర్ణాభాం రత్నభూషణభూషితామ్ ।
పవిత్రరూపాం పరమాం దేవసేనాం పరాం భజే ॥ (49-50)

షష్ఠీదేవి ప్రకృతి యాఅవయవాంశమునుండి ప్రాదుర్భవించిన పరిశుద్ధురాలు, సుప్రతిష్ఠురాలు. సుపుత్రులను బ్రసాదింపగల యాభగవతి సువ్రత, శుభప్రద, దయాస్వరూపిణి జగములకే జనని. శ్వేతచంపకసమానవర్ణసముజ్జ్వలయు, రత్నభూషణభూషితయు, పరమపవిత్రస్వరూపిణియు నగుషష్ఠీదేవసేననే నే భజించెదను.

ఇట్లు ధ్యానించి భగవతికి బుష్పాంజలులను సమర్పింపవలెను. మరల ధ్యానించి మూలమంత్రము నుచ్చరించుచు షోడశోపచారముల నర్పించి దేవిని బూజింపవలెను.

ఉపచారముల నర్పించు సమయమున :

'ఓం హ్రీం షష్ఠీదేవ్యై స్వాహా' యను నీమూలమంత్రము నుచ్చరింపవలెను. పూజకు డైనపురుషుడు యథాశక్తి యీయష్టాక్షరమహామంత్రజప మొనరింపవలెను.

తదనంతరము మనమును శాంతపరచుకొని భక్తిపూర్వకముగ భగవతిని స్తుతించి దేవికి బ్రణామము లర్పింపవలెను. అఖండఫలములను బ్రసా

దింపగల యీమంత్రము సామవేదమందు వర్ణింపబడెను. ఏపురుషుడు ఉప ర్యుక్తమగు షష్ఠీదేవ్యష్టాక్షరమూలమంత్రము నొకలక్షపర్యాయములు జపించునో వానికి నిశ్చయముగ నుత్తమపుత్రప్రాప్తి కల్గునని బ్రహ్మదేవుడు ప్రవచించిరి. మునీశ్వరా! సకలమనోరథములను బరిపూర్ణ మొనరింపగల ప్రియవ్రతునిచే స్తుతింపబడినసకలశుభప్రదమైన షష్ఠిదేవసేనాస్తోత్రమును బ్రివచించెద సావధానుడవై శ్రవణమొనరింపుము.

## షష్ఠీదేవసేనాస్తోత్రము

**ప్రియవ్రతరాజోవాచ :**

నమో దేవ్యై మహాదేవ్యై సిద్ధ్యై శాన్త్యై నమో నమః ।
శుభాయై దేవసేనాయై షష్ఠీదేవ్యై నమో నమః ॥

వరదాయై పుత్రదాయై ధనదాయై నమో నమః।
సుఖదాయై మోక్షదాయై షష్ఠీదేవ్యై నమో నమః ॥

శక్తేః షష్ఠాంశరూపాయై సిద్ధాయై చ నమో నమః।
మాయాయై సిద్ధియోగిన్యై షష్ఠీదేవ్యై నమో నమః॥

పారాయై పారదాయై చ షష్ఠీదేవ్యై నమో నమః ।
సారాయై శారదాయై చ పారాయై సర్వకర్మణామ్॥

బలాధిష్ఠాతృదేవ్యై చ షష్ఠీదేవ్యై నమో నమః॥
కళ్యాణదాయై కల్యాణ్యై ఫలదాయై చ కర్మణామ్ ॥

ప్రత్యక్షాయై చ భక్తానాం షష్ఠీదేవ్యై నమో నమః ।
పూజ్యాయై స్కన్దకాన్తాయై సర్వేషాం సర్వకర్మసు ॥
దేవరక్షణకారిణ్యై షష్ఠీదేవ్యై నమో నమః॥

శుద్ధసత్త్వస్వరూపాయై వన్దితాయై నృణాం సదా।
హింసాక్రోధైర్వర్జితాయై షష్ఠీదేవ్యై నమో నమః॥

ధనం దేహి ప్రియాం దేహి పుత్రం దేహి సురేశ్వరి ।
ధర్మం దేహి యశో దేహి షష్ఠీదేవ్యై నమో నమః ॥

భూమిం దేహి ప్రజాం దేహి దేహి విద్యాం సుపూజితే॥
కల్యాణం చ జయం దేహి షష్ఠీదేవ్యై నమో నమః॥ 57—66

దేవికి నమస్కారము, మహాదేవికి నమస్కారము, భగవతీసిద్ధికి, శాంతికి నమస్కారము. శుభా! దేవసేనా! షష్ఠీదేవీ! నీ కనేకానేకనమస్కారములు. వరదాయనీ, పుత్రిదాయనీ, ధనప్రదాయనీ, సుఖదాయనీ, మోక్షప్రదాయనీ, భగవతీషష్ఠీదేవీ! నీ కనేకానేకప్రణామములు. ఆదిశక్తియొక్క ఆరవ యంశమునుండి ప్రాదుర్భవించిన సిద్ధికి నమస్కారము. మాయ, సిద్ధయోగిని, సార, శారద, పరాదేవి యనునామములతో శోభించు షష్ఠీదేవికి నమస్కారములు. బాలకుల కధిష్ఠాత్రి దేవి, కళ్యాణప్రదాయిని, కళ్యాణరూపిణి, కర్మఫలప్రదాయిని యగుషష్ఠీదేవి కనేకానేకనమస్కారములు. భక్తులకు బ్రత్యక్షముగ దర్శనమొసంగు షష్ఠీదేవి కనేకప్రణామములు. సర్వకర్మలందు బూజ్యురాలు, స్కందునికాంతామణి, దేవరక్షణకారిణియగు షష్ఠీదేవి కనేకానేకనమస్కారములు. మానవులే దేవికి సదావందనము లర్పింతురో యాశుద్ధసత్త్వస్వరూపిణియు హింసాక్రోధరహితురాలు నగుషష్ఠీదేవి కనేకానేకనమస్కారములు. సురేశ్వరీ! నాకు ధనము నిమ్ము, ప్రియపత్ని నిమ్ము, పుత్రు నిమ్ము. మాహేశ్వరీ! నాకు ధర్మము నిమ్ము, యశము నిమ్ము, షష్ఠీదేవీ! నీ కనేకానేకనమస్కారములు. మాతా! నాకు భూమిని బ్రసాదింపుము, సంతానము నిమ్ము, విద్య నిమ్ము. సుపూజితా! నాకు గళ్యాణమును, జయమును ననుగ్రహింపుము. షష్ఠీదేవసేనా! నీకు బహు నమస్కారములు.

## శ్రీనారాయణఋషి పలికెను :

నారదా! యిట్లు భగవతిని స్తుతింపగనే ప్రియవ్రతరాజునకు షష్ఠీదేవి ప్రభావమున మరణించినపుత్రుడు సజీవుడై మహాయశస్వి యయ్యెను. బ్రహ్మనందనా! షష్ఠీదేవీస్తోత్రము నొకసంవత్సరపర్యంతము శ్రవణమొనరించిన వారపుత్రులైనచో వారికి దీర్ఘాయుష్మంతుడైనసుందరపుత్రుడు లభింపగలడు. ఒకసంవత్సరపర్యంతము భక్తిపూర్వకముగ దేవిని బూజించి ఈస్తోత్రమును బఠించు వారి సర్వపాపములు నశింపగలవు, మహావంధ్యయు నీస్తోత్రప్రభావమున సంతానవతి కాగలదు. ఆమె దేవసేనాకృపవలన గుణవంతుడు, విద్వాంసుడు, యశస్వి, చిరంజీవి, శ్రేష్ఠుడు నగుపుత్రునకు జనని కాగలదు. కాకవంధ్యయైనను, మృతవత్సయైనను నొకసంవత్సర

పర్యంత మీస్తోత్రమును శ్రవణమొనరించు నామె నిశ్చయముగ బుత్రవతి కాగలదు. శిశువు రోగగ్రస్తుడైన వానిమాతాపిత లొకమాసపర్యంత మీస్తోత్రశ్రవణ మొనరించిన నాబాలకు డారోగ్యవంతుడు కాగలడు.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణ
సంవాదమున షష్ఠీ దేవ్యుత్పత్తి, తత్పూజా
స్తోత్రకథనమను నలుబదిమూడవ
అ ధ్యా య ము
సంపూర్ణము.

—♦—

## నలుబదినాలుగవ అధ్యాయము

### మంగళచండికోపాఖ్యానము

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

బ్రహ్మకుమారా! నారదా! ఆగమానుసారముగ షష్ఠీదేవిదివ్యచరితమును వర్ణించితిని. ఇపుడు మంగళచండికోపాఖ్యానము నవధరింపుము. ఆమెయుపాఖ్యానమును, నామెమంత్రస్తోత్రములను నేను నాపితృదేవులైన ధర్మదేవుని ముఖారవిందమునుండి శ్రవణమొనరించితిని. ఈశ్రుతిసమ్మతమైన యుపాఖ్యానము గొప్పవిద్వాంసులకుగూడ నభీష్టమే.

చణ్డా యా వర్తతే చణ్డీ జాగర్తి శత్రుమణ్డలే ।
మఙ్గలేషు చ యా దక్షా మఙ్గలా చైవ చణ్డికా॥
దుర్గాయాం విద్యతే చణ్డీ మఙ్గలోఽపి మహీసుతః।
మఙ్గలాఽభీష్టదేవీ యా సా శ్యాన్మఙ్గలచణ్డికా ॥

మఙ్గలో మనువంశశ్చ సప్తద్వీపా వనీపతిః ।
తస్య పూజ్యాఽభీష్టదేవీ తేన మఙ్గలచణ్డికా ॥
మూర్తిభేదేన సా దుర్గా మూలప్రకృతి రీశ్వరీ।
కృపారూపాఽతిప్రత్యక్షా యోషితా మిష్టదేవతా॥ 3—6

శత్రుమండలమధ్యములో జండప్రచండముగ విజృంభించును. కావున నీభగవతిని జండిక యనిరి. చండీశబ్దము దక్ష (చతురురాలు) యనునర్థమున బ్రయోగింపబడెను. మంగళశబ్దము కళ్యాణవాచకము. ఏదేవి మంగళము లను, గళ్యాణమును బ్రసాదించుటలో దక్షురాలో యామెనే మంగళచండిక యని కీర్తించిరి. దుర్గ యను నర్థములోగూడ జండికాశబ్దము ప్రయోగింప బడెను. మంగళశబ్దము భూమిపుత్రుడైనమంగళునకు వాచకము. ఏదేవి సాక్షాద్దుర్గాస్వరూపిణియో, మంగళున కభీష్టదేవియో యామెనే మంగళ చండిక యని ప్రస్తుతించిరి. మనువంశమందు మంగళు డనురా జుద్భవించి సప్తద్వీపవతి యగుపృథ్వినంతయు శాసించెను. ఆయన యీదేవినే తన యభీష్టదేవతగ బూజించి యారాధించెను. ఈకారణమువగూడ భగవతి మంగళచండిక యనునామమున విఖ్యాతి నొందినది. మూలప్రకృతి జగదీశ్వరి యగుభగవతి యగుదుర్గ రూపాంతరమే ఈమె. మంగళచండిక కృపాస్వరూపమును ధరించి తన సర్వభక్తులయెదుట బ్రత్యక్షమైనది. ఈభగ వతి సకలస్త్రీలకు నిష్టదేవత.

ప్రప్రథమమున శంకరుడే యీసర్వశ్రేష్ఠస్వరూపిణి యైనభగవతి నారాధించెను. నారదా! త్రిపురు డనుమహాదైత్యునివధసమయమున శివుడు మంగళచండిక నారాధించి విజయము నొందెను. త్రిపురాసురసంగ్రా మములో దైత్యులు విజృంభించి మహాదేవుని రథమును ధ్వంసమొనరించి నిశిత శరములచే బీడించిరి. శంకరభగవానుడు సంకటములో బడుట గాంచి బ్రహ్మ దేవుడు, విష్ణుదేవుడు దుర్గను స్తుతింపవలసినదిగ నాదేశించిరి. ఆమహాను భావుల నుపదేశానుసారముగ శంకరుడు దుర్గ ననేకవిధముల స్తుతించెను. దుర్గయే మంగళచండిక. కేవలము భగవతి దుర్గ మంగళచండికగా నవత రించెనని గ్రహింపుము. సదాశివుడు స్తుతింపగా భగవతి మహాదేవునెదుట సాక్షాత్కరించి యిట్లనుగ్రహించెను. "ప్రభూ! భయము నొందకుము,

స్వయముగ సర్వేశ్వరుడైన శ్రీహరి వృషభరూపమును ధరించి నిన్నుద్ధరింప గలడు. వృషధ్వజా! నేను ప్రచండయుద్ధశక్తిస్వరూపిణినై నీతో గలసి దానవులను జీల్చిచెండాడెదను. శ్రీహరిసహాయమువలన నాసహాయోగమువలన దేవతలను రాజ్యభ్రష్టులుగ నొనరించిననీఘోరశత్రువైనత్రిపురాసురు నవలీలగ సంహరింపగలవు."

మునీశ్వరా! ఇట్లు పల్కి భగవతి యంతర్ధానమయ్యెను. ఆక్షణము ననే శక్తిస్వరూపిణి యైనమంగళచండికాప్రభావమున శివు డఖండశక్తిసంపన్నుడైనాడు. శ్రీహరి వృషభరూపధారియై శంకరుని సంగ్రామమధ్యములో నుద్ధరించెను. శ్రీమన్నారాయణ ప్రదత్తమైనదివ్యాస్త్రముచే శంకరు డప్రతిహతుడైనత్రిపురాసురుని సంహరించి విజయము నొందెను. దైత్యపీడ తొలగిపోగా సకలదేవతలు, మహర్షులు నత్యంతప్రసన్నులై శంకరు ననేకవిధముల స్తుతించిరి. ఆకసమునుండి కుసుమములు వర్షించినవి, బ్రహ్మవిష్ణ్వాదులు పరమసంతుష్టులై శంభుని శుభాశీర్వాదములచే నాశీర్వదించి విజయమునకు గారణస్వరూపిణి యైనమంగళచండిక నారాధింపవలసినదిగా నాదేశించిరి.

అపుడు శంకరుడు గంగాజలములలో స్నానమాచరించి పరిశుద్ధుడై భక్తిసమన్వితుడై మంగళచండికారాధన ప్రారంభించెను. పాద్యార్ఘ్యాచమన, వివిధవస్త్ర, పుష్ప, చందన, నైవేద్యాలంకారమాలాదుల నర్పించి పిష్టకమధుసుధాదినైవేద్యముల నివేదించి భగవతిని భక్తిపూర్వకముగ బూజించెను. అఖండసంకీర్తన మొనరించి హరుడు వేదమునందు గలమాధ్యందిన శాఖలో బ్రవచింపబడినధ్యానమంత్రాదులద్వారమున భక్తిపూర్వకముగ మంగళచండికను ధ్యానించెను. నారదా! మహాదేవుడు మూలమంత్రము నుచ్చరించుచు భగవతికి సకలద్రవ్యములను సమర్పించెను. 'ఓం హ్రీం శ్రీం క్లీం సర్వపూజ్యే దేవి మఙ్గలచణ్డికే ఐం క్రూం ఫట్ స్వాహా' యిరువది యొక్క యక్షరములు గల యీమంత్రముతో భగవతిని జపించిన మంగళచండిక భక్తులసర్వాభీష్టములను గల్పవృక్షస్వరూపిణియై పరిపూర్ణ మొనరింపగలదు. పదిలక్షలపర్యాయములు జపించిన నీమంత్రము సిద్ధించును.

బ్రహ్మనందనా! సర్వసమ్మతము, వేదప్రణీతము నైనమంగళచండికా ధ్యానము నుపదేశించెద నవధరింపుము.

మంగళచండికా ధ్యానము :

దేవీం షోడశవర్షీయాం రమ్యాం సుస్థిరయౌవనామ్।
సర్వరూపగుణాఢ్యాం చ కోమలాఙ్గీం మనోహరామ్॥
శ్వేతచమ్పకవర్ణాభాం చన్ద్రకోటిసమప్రభామ్।
వహ్నిశుద్ధాంశుకాదానాం రత్నభూషణభూషితామ్॥
బిభ్రతీం కబరీభారం మల్లికామాల్యభూషితమ్ ।
బిమ్బోష్ఠీం సుదతీం శుద్ధాం శరత్పద్మనిభాననామ్॥
ఈషద్ధాస్యప్రసన్నాస్యాం సునీలోత్పలలోచనామ్।
జగద్ధాత్రీం చ దాత్రీం చ సర్వేభ్యః సర్వసంపదామ్॥
సంసారసాగరే ఘోరే తపోరూపాం పరాం భజే॥ 23-27

సుస్థిరయౌవనసంపన్నురాలైనమంగళచండిక సదా షోడశవర్షసంపన్నురాలై విరాజిల్లును. ఈమె సంపూర్ణరూపగుణసంపన్న, కోమలాంగి, మనోహారిణి. శ్వేతచంపకపుష్పసమాన గౌరవర్ణురాలు, కోటానుకోటిచంద్రసమ ప్రభాశతి. ఈమె యగ్నిశుద్ధవస్త్రములను ధరించి రత్నభూషణవిభూషితయై సదా ప్రకాశించును. ఈభగవతి మల్లికాపుష్పహారములచే సమలంకృత కేశపాశములు ధరించును. ఈమె పెదవులు బింబఫలసదృశములు, సుందర దంతపంక్తి కల్గి, శుద్ధశరత్పద్మనిభాననయై, ప్రసన్నవదనారవిందముపై మందహాసములు చిందులాడగ సునీలోత్పలలోచనములతో మంగళచండిక దర్శనమొసంగును. సకలజగద్ధాత్రి, సర్వసంపత్ప్రదాత్రి, ఘోరసంసారసాగరము తరింపజేయుటకు నౌకాస్వరూపిణి, తపోరూపిణి, యగుటమంగళచండికన్ను సదా భజించెదను.

మునీశ్వరా! యిట్లు మహాదేవు డొనరించిన స్తవముచే భగవతిని స్తుతింపవలెను. ఆస్తోత్రము నుపదేశించెద నాలకింపుము.

## మంగళచండికా స్తోత్రమ్

**శంకర ఉవాచ :**

రక్ష రక్ష జగన్మాత ర్దేవి మఙ్గలచణ్డికే ।
సంహర్త్రి విపదాం రాశే ర్హర్షమఙ్గలకారికే ॥
హర్షమఙ్గలదక్షే చ హర్షమఙ్గలచణ్డికే।
శుభే మఙ్గలదక్షే చ శుభమఙ్గలచణ్డికే॥
మఙ్గలే మఙ్గలార్హే చ సర్వమఙ్గలమఙ్గలే।
సతాం మఙ్గలదే దేవీ సర్వేషాం మఙ్గలాలయే॥
పూజ్యా మఙ్గలవారే చ మఙ్గలాభీష్టదేవతే।
పూజ్యే మఙ్గలభూపస్య మనువంశస్య సంతతమ్॥
మఙ్గలాధిష్ఠాతృదేవీ మఙ్గలానాం చ మఙ్గలే।
సంసారమఙ్గలాధారే మోక్షమఙ్గలదాయినీ ॥
సారే చ మఙ్గలాధారే సారే త్వం సర్వకర్మణామ్ ।
ప్రతిమఙ్గలవారే చ పూజ్యే త్వం మఙ్గలప్రదే॥ 29-34

జగన్మాతా! మంగళచండికా! నీవు సర్వవిపత్తులను విధ్వంసమొనరింపగలదానవు. మంగళములను హర్షమును ప్రసాదించుటకే పుట్టావిరాజిల్లెదవు. దేవీ! నన్ను రక్షింపుము-రక్షింపుము. హర్ష మంగళములను ప్రసాదింపగల దక్షురాలవైన నీవే శుభా యని, మంగళదక్షా యని, శుభ మంగళచండికా యని, మంగళా, సర్వమంగళమంగళా యని మంగళార్హాయని కీర్తింపబడుచున్నావు. సర్వమంగళాలయస్వరూపిణీ! సదా నాకు మంగళములను ప్రసాదింపుము, దేవీ! నీవు మంగళగ్రహమున కిష్టదేవతవు, మంగళవారదినముననే నీపూజ యొనరింపవలెను. మనువంశోత్పన్న ప్రభువైన మంగళునిచే బూజింపబడిన దేవీ నీవు మంగళాధిష్ఠాతృదేవతవు, నీవు మంగళములకే మంగళస్వరూపిణివి, జగములందు గలసమస్తమంగళములు నీపై నాధారపడియున్నవి. నీవు సర్వులకు మోక్షమంగళప్రదాయనివి. సకలసారస్వరూపిణీ! సకలమంగళములకు నాధారస్వరూపిణీ! సమస్తకర్మలకు నధీశు

రాలవైన దేవీ! ప్రతిమంగళవారము నిన్ను బూజించిన మంగళమయము లైన యఖండసుఖములను బ్రసాదింపగలవు.

ఈస్తోత్రమునే స్తుతించి శంకరుడు మంగళచండిక నుపాసించెను. ఆయన ప్రతిమంగళవారము మంగళచండికారాధన యొనరించును. ఇట్లు సర్వప్రథమమున మంగళచండిక శంకరునిచే పూజితురాలయ్యెను. తదనంతరము కుజగ్రహము భగవతి నుపాసించెను. తదుపరి రాజు మంగళు డుపాసించెను. నాటినుండి సుందరీస్త్రీలు మంగళములను వాంఛించు నసంఖ్యాక మానవులు మంగళచండికాపూజ లొనరింప నారంభించిరి. భగవతి శంకరునిచే పూజితురాలై సకలవిశ్వములందు నారాధ్యురాలయ్యెను. దేవతలు, మహర్షులు, మనువులు, మానవులు-అందఱు సర్వత్ర యీపరమేశ్వరిని బూజించి ధన్యులైరి. ఏపురుషు డేకాగ్రచిత్తముతో మంగళచండికా మంగళమయ మైనయీస్తోత్రమును శ్రవణమొనరించునో వానికి సదా సకల మంగళములు ప్రాప్తింపగలవు. అమంగళములు వానిదరి జేరలేవు. ఈస్తోత్ర పాఠకులు పుత్రపౌత్రాభివృద్ధి నొంది ప్రతిదినము మంగళములను దర్శించుచు సంపన్నులై సుఖింపగలరు.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణసంవాదమున
మంగళచండికోత్పత్తి, తత్ స్తోత్రకథనమను
నలుబదినాలుగవ అధ్యాయము
సంపూర్ణము.

# నలుబదియైదవ అధ్యాయము

## మనసాదేవి నామవ్యుత్పత్తి కథనము

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! ఆగమానుసారముగ షష్ఠిదేవియొక్క, మంగళచండిక యొక్క యుపాఖ్యానములను వర్ణించితిని. ఇపుడు పూర్వకాలములో నేనుధర్మ దేవుని దివ్యముఖారవిందమునుండి శ్రవణమొనరించిన మనసాదేవి చరితమును వర్ణించెద నాలకింపుము. ఈభగవతి కశ్యపుని మానసీకన్య, మనమునుండి యుద్దీప్తురాలైనకారణమున నీమెనామధేయము మనసాదేవి యని విఖ్యాతి నొందెను. స్వాత్మారామ సిద్ధయోగిని యైనయీవైష్ణవీదేవి మూడుయుగ ములపర్యంతము శ్రీకృష్ణపరబ్రహ్మమును గుఱించి తప మాచరించినది. ఆ సమయములో నీమెవస్త్రములు, శరీరము జీర్ణమైయుండుట గాంచి గోపీపతి పరమప్రభు డైనపరమేశ్వరు డీమెకు జరత్కారు వని నామకరణ మొనరించెను. ఆకృపానిధి మనసాదేవికి సకలాభీష్టములను బ్రసాదించి కృపాపూర్వకముగ స్వయముగ దానే యీమెను బూజించి యాపూజావిధానమును సర్వత్ర ప్రచార మొనరించెను. స్వర్గమునందు, బ్రహ్మలోకమునందు, భూమండల ములో, పాతాళలోకములలో సర్వత్ర మనసాదేవి యారాధన యఖండముగ నొనరింపబడెను. ఈకారణముననే యీసాధ్వి జగద్గౌరి యనునామమున విఖ్యాతిగాంచెను. శివునినుండి మహాజ్ఞానము పొంది యాయనశిష్యురా లైనకారణమున నీమె శైవి యనబడెను. విష్ణుదేవుని యనన్యోపాసకురా లైనకారణమున నీమెను వైష్ణవి యని కీర్తించిరి. జనమేజయ చక్రవర్తి యొనరించినయజ్ఞములో నీమె సత్ప్రయత్నమువలననే నాగులప్రాణములు రక్షింపబడినవి. కావున నీమె నామములు నాగేశ్వరి మఱియు నాగభగిని యైనవి. విషమును సంహరించుటలో బరమసమర్థురాలు కావున నీమెను విష హారి యనిరి. ఈమెకు శంకరునినుండి యోగసిద్ధి ప్రాప్తించినది గావున నీమె సిద్ధయోగిని యని కీర్తింపబడెను. మనసాదేవి శంకరమహాదేవునుండి మహానిగూఢజ్ఞానమును, మృతసంజీవని యనువిద్యను, గ్రహించినది. ఈకార ణముననే బుధజను లీమెను మహాజ్ఞానయుత యనిరి. ఈపరమతపస్వినీదేవి యాస్తీకమహర్షి జనని యైనకారణమున నీమెనామ మాస్తీకమాత యని

ప్రసిద్ధికెక్కెను. జగత్పూజ్యు డైనజరత్కారుమహర్షిప్రియార్ధాంగి యైన కారణమున నీమెను జరత్కారుప్రియ యనిరి.

'ఓం నమో మనసాయై'

జరత్కారు ర్జగద్గౌరీ మనసా సిద్ధియోగినీ।
వైష్ణవీ నాగభగినీ శైవీ నాగేశ్వరీ తథా ॥
జరత్కారుప్రియాఽఽస్తీకమాతా విషహరీతి చ।
మహాజ్ఞానయుతా చైవ సా దేవీ విశ్వపూజితా॥
ద్వాదశైతాని నామాని పూజాకాలే తు యః పఠేత్ ।
తస్య నాగభయం నాస్తి తస్య వంశోద్భవస్య చ ॥
నాగభీతే చ శయనే నాగగ్రస్తే చ మన్దిరే।
నాగక్షతే నాగదుర్గే నాగవేష్టితవిగ్రహే॥
ఇదం స్తోత్రం పఠిత్వా తు ముచ్యతే నాత్ర సంశయః।
నిత్యం పఠే ద్య స్తం దృష్ట్వా నాగవర్గః పలాయతే॥ 15-19

జరత్కారు, జగద్గౌరి, మనస, సిద్ధయోగిని, వైష్ణవి, నాగభగిని, నాగేశ్వరి, శైవి, జరత్కారుప్రియా, ఆస్తీకమాతా, విషహారి, మహాజ్ఞానయుత అను నీద్వాదశనామములతో విశ్వ మీమెను బూజించెను. పూజాసమయమున నీద్వాదశనామముల నెవరు పఠింతురో వారికి, వారివంశజులకు సర్ప భయము కలుగదు. ఎవరి శయనాగారములో నాగభయము కల్గునో, యెవరి భవనమందు సర్పములు చరించునో, సర్పములతోనున్నకారణమున నేప్రదేశము మహాదారుణస్థలమైనదో, యెవరు నాగవేష్టితు లయ్యెదరో, వారీస్తోత్రమును బఠించిన నిస్సంశయముగ సర్పభయమునుండి విముక్తులు కాగలరు. ఈ స్తోత్రమును నిత్యము పఠించువానిని గాంచి సర్పసమూహములు పాఱిపోగలవు.

పదిలక్షలపర్యాయములు పఠించిన నీమనసాదేవిస్తోత్రము మానవులకు సిద్ధించును. ఈస్తోత్రసిద్ధి పొందినవ్యక్తి విషభక్షణ మొనరింపగలడు, సర్ప

ముల నాభరణములుగ ధరింపగలడు, సర్పములనే యధిరోహింపగలడు. అతడు నాగాసనుడై, నాగతల్పగతుడై మహాసిద్ధుడు కాగలడు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణసంవాద
మున మనసాదేవిస్తోత్రాదికథన మను
నలుబదియైదవ అధ్యాయము
సంపూర్ణము.

—♦—

## నలుబదియాఱవ అధ్యాయము

### మనసాదేవ్యుపాఖ్యానము

**శ్రీనారాయణఋషి పలికెను :**

మునీశ్వరా! మనసాదేవి పూజావిధానమును, మూలమంత్రమును, సామవేదోక్తధ్యానాదుల నుపదేశించెద, సావధానుడవై శ్రద్ధతో నాలకింపుము.

మనసాదేవి ధ్యానము

శ్వేతచమ్పకవర్ణాభాం రత్నభూషణభూషితామ్ ।
వహ్నిశుద్ధాంశుకాధానాం నాగయజ్ఞోపవీతినీమ్ ॥
మహాజ్ఞానయుతాం చైవ ప్రవరాం జ్ఞానినాం సతామ్ ।
సిద్ధాధిష్ఠాతృదేవీం చ సిద్ధాం సిద్ధిప్రదాం భజే॥ (2, 3)

మనసాదేవి శ్వేతచంపకపుష్పసమానవర్ణ, (తెల్లచంపకపూలవంటి శరీరముగలది) రత్నభూషణభూషిత, యగ్నిశుద్ధవస్త్రపరీధాన, సర్పమునే యజ్ఞోపవీతముగ ధరించి దర్శనమొసంగు దేవి. మహాజ్ఞానసంపన్నురాలైన కారణమున ప్రసిద్ధయోగులందుగూడ మనసాదేవి ప్రవరురాలని కీర్తింపబడు

చున్నది. సిద్ధపురుషుల కధిష్ఠాత్రీదేవియు, సిద్ధిప్రదయు, స్వయంసిద్ధురాలు నైన మనసాదేవిని భజించెదను.

ఇట్లు ధ్యానించి మూలమంత్రోచ్చారణ మొనరించుచు భగవతినిబూజింపవలెను. అనేకనైవేద్యముల నర్పించి గంధపుష్పానులేపనాద్యుపచారములతో దేవీపూజ నొనరింపవలెను. సకలోపచారములను మూలమంత్రోచ్చారణ మొనరించుచు నర్పింపవలెను. మునీశ్వరా! మనసాదేవిసుసిద్ధమూల మంత్రమును మూలకల్పతరు వందురు. భక్తులసకలమనోరథములను బరిపూర్ణ మొనరింపగల యీమూలమంత్రము సామవేదప్రథితము.

'ఓం హ్రీం శ్రీం క్లీం ఐం మనసాదేవ్యై స్వాహా'

ఐదులక్షలపర్యాయములు జపించిన నీమంత్రము సిద్ధింపగలదు. ఈమంత్ర సిద్ధి నొందినవారు నిశ్చయముగ సిద్ధులు కాగలరు. వారికి విషము సహితమమృతముగ మారిపోవును. అట్టిపురుషుడు ధన్వంతరిసముడై విరాజిల్లగలడు.

నారదా! అషాఢసంక్రాంతిదినమున గూఢా (ప్రతి) వృక్షశాఖయందు యత్నపూర్వకముగ మనసాదేవి నావాహన మొనరించి భక్తిభావముతో బూజించి, మనసా పంచమీదినమున దేవికి (అహంకారమును) బలి నర్పించువారు తప్పక ధనవంతులు, పుత్రవంతులు, కీర్తిసంపన్నులు కాగలరు. మహాభాగా! పూజావిధానమును వర్ణించితిని. ఇపుడు భగవత్యుపాఖ్యానమును వివరించెద నవధరింపుము.

పూర్వకాలమున మానవులందఱు సర్పముల భయముచేనాక్రాంతులైరి. సర్పదష్టులైనమానవులు తత్క్షణమే మరణింపదొడంగిరి. ఈభయంకరదృశ్యములను గాంచి కశ్యపప్రజాపతియు భయభీతుడై బ్రహ్మదేవునియాదేశానుసారముగ సర్పభయనివారకము లైనమంత్రములను నిర్మించెను. ప్రజాపతి వేదబీజాక్షరములచే ఘోరవిషనివారకమహామంత్రములను రచించెను. విధాత తనమానసమునుండి తపశ్శక్తిచే భగవతిని బ్రాదుర్భవింపజేసి యీమంత్రముల కధిష్ఠాత్రీదేవిగ నొనరించెను. తపశ్శక్తిచే బ్రహ్మమనసమునుండి ప్రాదుర్భవించినకారణమున నీదేవి 'మనస' యనునామమున విఖ్యాతిగాంచెను. ఆవిర్భవింపగనే మనసాదేవి శంకరుని దివ్యధామము జేరి భక్తిపూర్వకముగ జంద్ర

శేఖరుని బూజించి యనేకవిధముల నాయనను స్తుతించెను. మునికుమారి మనసాదేవి మహాదేవుని బ్రసన్నతకొఱకై సహస్రదివ్యవర్షములు ఆయన నుపాసించి ధన్యురాలైనది. తదనంతరము సదాశివుడు ప్రసన్నుడై మనసాదేవిని దనప్రియశిష్యురాలుగ స్వీకరించి యామెకు సామవేదమును, శ్రీకృష్ణ పరమాత్మయొక్క కల్పవృక్షసదృశమైన యష్టాక్షరమంత్రము నుపదేశించి మృత్యుంజయజ్ఞానమును బ్రసాదించెను.

నారదా! మూలమంత్రమునకు మొదట లక్ష్మీబీజమును, మాయాబీజమును, గామబీజమును బ్రయోగించి కృష్ణశబ్దమునకు విభక్తిని జోడించి 'నమః' యని యుచ్చరింపవలెను.

'శ్రీం హ్రీం క్లీం కృష్ణాయ నమః' ఇదియే యష్టాక్షర మహామంత్రము.

అశుతోషుడైనశివుడు మనసాదేవికి శ్రీకృష్ణాక్షరమహామంత్రమును, త్రైలోక్యమంగళ మను కవచమును, సర్వమాన్యస్తవమును, భువనపావన మనుధ్యానమును, సర్వసమ్మతము లైనవేదోక్త పునశ్చరణనియమములను బ్రసాదించి శ్రీకృష్ణపరమాత్మపూజాక్రమమును, మృత్యుంజయజ్ఞానమును నుపదేశించెను. పరమేశ్వరుని యాదేశానుసారముగ సాధ్వి మనసాదేవి పుష్కరక్షేత్రము జేరి మూడుయుగములపర్యంతము పరబ్రహ్మమైన శ్రీకృష్ణపరమాత్మ నుపాసించి తపస్సిద్ధి నొందెను. శ్రీకృష్ణపరమాత్మ స్వయముగ మనసాదేవియెదుట సాక్షాత్కరించి కృశాంగియైనయామెను దనకృపాకటాక్షవీక్షణములతో వీక్షించి తానే స్వయముగ నామెను బూజించి యితరులచే బూజింపజేసి 'దేవీ! నీవు జగత్పూజ్యురాలవుకమ్మని' వరమొసంగి యంతర్హితుడయ్యెను.

దేవర్షీ! మనసాదేవిని బ్రప్రథమమున శ్రీకృష్ణపరమాత్మయేపూజించెను. తదనంతరము శంకరుడు, కశ్యపుడు, దేవతలు, మునులు, మనువులు, నాగులు, మానవులు మొదలగు వారెందఱో త్రిలోకములందు దేవీశ్రేష్ఠవ్రతముల నాచరించి పూజించిరి. కశ్యపప్రజాపతి మనసాదేవిని జరత్కారుమహర్షికి నర్ధాంగిగ నర్పించెను. మహాయోగియైన యామహర్షి వర్యుడు వివాహానంతరము ఘోరతపములో సంలగ్నుడయ్యెను. తపోదీక్షాసమయములో బుష్కరక్షేత్ర

ములో నొకదినమున వటవృక్షముక్రింద జరత్కారుమహర్షి మనసాదేవి జఘనము (తొడ) పై శిరమునుంచి నిద్రామగ్నులైరి. ఇంతలో సాయంసమయము కాగా సూర్యనారాయణు డస్తమింపనారంభించెను. మనసాదేవి పరమసాధ్వియుపతివ్రతాలలామగాన సూర్యుడస్తమించుటగాంచి తనమనములో నిట్లు విచారించెను. "ద్విజులు నిత్యము సాయంకాలసంధ్య యొనరింపవలెను. ఇది బ్రాహ్మణులకు బరమధర్మము. నాపతి దేవుడేగనుక సాయంసంధ్య యొనరింపక నిద్రామగ్నులై యున్న నాయనకు బాపము సంభవింపగలదు. ఎందువలన ననగ ప్రాతఃకాలసంధ్య, సాయంకాలసంధ్యల సరియైనసమయములలో నాచరింపని వా రపవిత్రులై ఘోరపాపమునకు గుఱికాగలరని నియమము కలదు". ఇట్లు విచారించి పరమసుందరి మనసాదేవి తనపతిదేవు నిద్రాభంగ మొనరించెను. మునీశ్వరా! నిద్రాభంగమగుట గాంచి జరత్కారుమహర్షి కోపించి మనసాదేవితో నిట్లు పల్కెను.

**జరత్కారుమహర్షి పలికెను :**

సాధ్వీ! సుఖముగ నిద్రించునాకు నిద్రాభంగమేల యొనరించితివి. ఏస్త్రీ తనస్వామికి నప్రియ మొనరించునో, యామె వ్రతములు, తపము, ఉపవాసములు, దానములు మొదలగుసత్కర్మములన్నియు వ్యర్థములు కాగలవు. ఏసత్కర్మ ఫలముగూడ బడయజాలదు. తనభర్తను బూజించిన శ్రీకృష్ణపరమాత్మపూజ సంపన్న మొనరించినటులే భావింపవలెను. పతివ్రతలైనసాధ్వీశిరోమణుల ననుగ్రహించుటకే స్వయముగ శ్రీహరి పతిరూపమున విరాజమానుడై యుండును. సర్వదానములు, యజ్ఞములు, తీర్థసేవనములు, వ్రతములు, తపములు, ఉపవాసములు, ధర్మాచరణము, సత్యవ్రతపాలనము, దేవపూజ మొదలగునత్కర్మములన్నియు బతిసేవాసౌభాగ్యమందుబదునాఱవయంశమునకైనను సరిరావు. ఏస్త్రీపవిత్రభారతవర్షపుణ్యక్షేత్రములో బతిని సేవించునో యామె తనస్వామితోగూడ వైకుంఠపరంధామము జేరి శ్రీహరిచరణసేవాసౌభాగ్యమును బొందగలదు. సాధ్వీ! ఏస్త్రీ తనభర్తకు బ్రతికూలముగ వర్తించునో, తనస్వామిని గఠినవచనములచే బాధించునో యాస్త్రీ సూర్యచంద్రులున్నంతవఱకు గుంభీపాకనరక మనుభవింపగలదు. తదనంతరము చండాలుని గృహమున జన్మించి పతిపుత్రసుఖవంచితురాలై దుఃఖించును.

**శ్రీనారాయణఋషి పలికెను :**

ఇట్లు కోపముతో బల్కి జరత్కారుమహర్షి మౌనము వహించెను. అపుడు మనసాదేవి భయకంపితురాలై తనపతిదేవునితో నిట్లు పల్కెను. "ఉత్తమవ్రతపరిపాలకా! మహాభాగా! తమసంధ్యోపాసన భంగము కాగలదని భావించి నేను నిద్రాభంగ మొనరించితిని. కాని యిందు నాదోషము లేశ మైనను లే" దనుచు గరుణింపవలసినదిగ బ్రార్థించుచు దనపతిదేవునిచరణ కమలముల నాశ్రయించెను. రోషావేశపరుడై మహర్షి తన్ను శపించుట కుద్యుక్తుడుకాగా నెఱిగి సూర్యభగవానుడు సంధ్యాదేవితోగూడ మహర్షి సమ్ముఖమున కఱుదెంచి భయభీతుడై వినయపూర్వకముగ నిట్లు యథార్థ విషయములను బలుక నారంభించెను. "మహర్షీ! తమరు పరమశక్తి సంపన్నులైనసద్బ్రాహ్మణులు. సంధ్యాసమయము వ్యతీతమగుట గాంచి తమకు ధర్మభంగ మగుననుభయముతో నీసాధ్వి మీకు నిద్రాభంగ మొన రించెను. విప్రశ్రేష్ఠా! నేను మిమ్ముశరణుజొచ్చుచున్నాను. నన్ను శపించుటమీ కుచితము కాదు. బ్రాహ్మణుల హృదయము సదా నవనీతమువలె కోమల ముగ నుండును. బ్రాహ్మణుడు సంకల్పించిన బునఃసృష్టి యొనరింపగలడు. బ్రాహ్మణునికంటె నధికతేజస్సంపన్నుడు మఱియొకడు లేడు. బ్రహ్మజ్యోతి స్సంపన్నులైనబ్రాహ్మణులు సనాతనుడైన శ్రీకృష్ణపరమాత్మారాధనలందే సదా సంలగ్నులై యుందురు". సూర్యుని వచనముల నాలకించి జరత్కారు మహర్షి ప్రసన్నుడై శాంతించెను. మహర్షి యనుజ్ఞ గైకొని సూర్యుడు స్వధామమునకు మరలిపోయెను. ప్రతిజ్ఞాపాలనార్థమై జరత్కారుమహర్షి మనసాదేవిని త్యజింపగా నామె యత్యంతదుఃఖితురాలై తనగురుదేవుడైన శంకరుని, బ్రహ్మను, నిష్టదైవమైనశ్రీహరిని, జన్మదాత యైనకశ్యపుని స్మరిం చెను. ఆమె సంకల్పింపగనే వారెల్లరు నామెయెదుట సాక్షాత్కరించిరి. ప్రకృతికతీతుడు, నిర్గుణుడు, పరబ్రహ్మము నైనశ్రీకృష్ణభగవానుడు జరత్కారు మహర్షి కభీష్టదైవము. దివ్యమంగళవిగ్రహుడైనశ్రీకృష్ణుని దర్శించి పరమభక్తితో జరత్కారుమహర్షి యనేకప్రణామము లర్పించి స్తుతించి, తద నంతరము శంకరునకు, బ్రహ్మదేవునకు, కశ్యపప్రజాపతికి నమస్కరించి వారి నిట్లు ప్రశ్నించెను. "మహాపురుషులారా! తమ శుభాగమనమునకు గారణ మేమో సెలవిండు?" మహర్షి వచనముల నాలకించి బ్రహ్మ శ్రీకృష్ణునిచరణ

కమలములకు బ్రణమిల్లి యిట్లు ప్రత్యుత్తర మొసంగెను. "మునీశ్వరా! నీ సహధర్మచారిణి మనసాదేవి పరమసాధ్వి, స్వధర్మపరిపాలకురాలు. నీ వీమెను బరిత్యజించుటకే సంకల్పించిన మొదట నీమెకు సంతానమును బ్రసాదింపుము. సంతానము కల్గిన పిదప బురుషుడు స్త్రీని ద్యజింపవచ్చునే గాని పుత్రోత్పత్తి యొనరింపక వైరాగ్యవశమున స్త్రీని బరిత్యజించుచో నట్టివాని పుణ్యమంతయు నశింపగలదు. వైరాగ్యవిషయమునగాక నన్యకారణములచే స్త్రీని బరిత్యజించు మానవుడు ఘోరపాతకములకు గురికాగలడు".

నారదా! బ్రహ్మవచనముల నాలకించి జరత్కారుమహర్షి మంత్రము నుచ్చరించుచు యోగబలము నుద్దీపింపజేసి మనసాదేవినాభిని స్పృశించుచు నామెతో నిట్లు పల్కెను. "మనసా! నీగర్భమునుండి సత్పుత్రుడు ప్రాదుర్భవింపగలడు. ఆపుత్రుడు జితేంద్రియు లైనపురుషులందు శ్రేష్ఠుడు పరమధార్మికుడు, మహాజ్ఞానియు, తేజస్వియు, తపస్వియు, యశస్వియు, గుణసంపన్నుడునై, వేదవేత్తలందు, యోగులందు, జ్ఞానులందు శ్రేష్ఠుడై, పరమవిష్ణుభక్తుడై తన వంశమునంతయు నుద్ధరింపగలడు. అట్టి యోగ్యుడై నపుత్రు గాంచిన పితరు లఖండానందభరితు లయ్యెదరు.

ఏస్త్రీ పతివ్రతాధర్మపాలన మొనరించునో, ప్రియభాషణమాడునో, సుశీలయై విరాజిల్లునో యామెనే ప్రియ యనవలెను. ఏస్త్రీ ధర్మమందు శ్రద్ధ కల్గి వర్తించునో సత్పుత్రులను గనునో, కులమును రక్షించునో, యామెనే కులపాలిక యనవలెను. ఎవరు శ్రీహరియందు భక్తిని గలిగింతురో, యభీష్ట సుఖముల బ్రసాదించుటలో దత్పరులై యుందురో వారే బంధువులని తెలిసికొనుము. ఏబంధువు శ్రీహరిని జేరుమార్గమునకు బ్రదర్శకుడగునో, యతనినే తండ్రిగా భావింపవలెను. ఏస్త్రీ జ్ఞానోపదేశమూలమున దన సంతానమునకు గర్భవాసమునుండి విముక్తిని బ్రసాదించునో యామెయే గర్భధారిణి యైనమాతృదేవత. ఏస్త్రీకృపవలన జీవుడు యమభయమునుండి విముక్తు డగునో, యామెనే దయాస్వరూపిణి యైనభగిని (సోదరి)గా భావింపవలెను. శ్రీహరియందనన్యభక్తిని బ్రసాదించి విష్ణుమంత్రోపదేశ మొనరించు వ్యక్తియే యాచార్యుడని తెలిసికొనవలెను, ఎవని కృపవలన శ్రీకృష్ణ పరమాత్మను సదా చింతించుసౌభాగ్యము ప్రాప్తించునో యామహాజ్ఞాన ప్రదాత యైనమహాత్ముఁనే గురువుగ భావింపవలెను. ఎందువలన ననగా బ్రహ్మ

మొదలుకొని తృణమువఱకు సకలచరాచర విశ్వములు యుద్భవించి మరల నశించుచుండును.

వేదజం యోగజం యద్య త్తత్సారం హరిసేవనమ్।
తత్త్వానాం సారభూతం చ హరే రన్య ద్విడమ్బనమ్॥
దత్తం జ్ఞానం మయా తుభ్యం స స్వామీ జ్ఞానదో హి యః
జ్ఞానా త్ప్రిముచ్యతే బన్ధా త్స రిపు ర్యో హి బన్ధదః॥
విష్ణుభక్తియుతం జ్ఞానం న దదాతి హి యోగతః।
స విప్రః శిష్యఘాతీ చ యతో బన్ధా న్న మోచయేత్॥
జననీ గర్భజా త్క్లేశా ద్యమతాడనజా త్తథా।
న మోచయే ద్యః స కథం గురు స్తాతో హి బాన్ధవః॥
పరమానన్దరూపం చ కృష్ణమార్గ మనశ్వరమ్।
న దర్శయే ద్యః స కథం కీదృశో బాన్ధవో నృణామ్॥
భజ సాధ్వి! పరం బ్రహ్మా చ్యుతం కృష్ణం చ నిర్గుణమ్।
నిర్మూలం చ పురాకర్మ భవే ద్యత్సేవయా ధ్రువమ్॥ 71–76

శ్రీహరిసేవయే సకలవేదయజ్ఞములతత్త్వసారము. శ్రీహరిసేవా సౌభాగ్యమే సకలతత్త్వములకు మూలతత్త్వము. శ్రీహర్యుపాసనముదక్క మిగిలినవన్నియు విడంబనములని తెలిసికొనుము. నేను నీ కీయదార్థజ్ఞానోప దేశ మొనరించితిని. ఎందువలన ననగా యదార్థజ్ఞానము నెవరుప్రసాదించె దరో, వారే స్వామి యనబడెదరు. జ్ఞానమువలన బంధనములనుండి విముక్తిని ప్రసాదించువానినే స్వామిగ భావింపవలెను. కాని బంధనములందు బడ ద్రోయుభర్తను శత్రువుగ భావింపవలెను. ఏగురువు శ్రీహరియందు భక్తి యుత్పన్నమగుజ్ఞానమును ప్రసాదింపడో, వానినే శిష్యఘాతి యందురు. ఎందు వలనన నాతడు శిష్యులను బంధవిముక్తుల నొనరింపలేడు. జననిగర్భమందు నివసించుక్లేశములనుండి, యమయాతనలనుండి ముక్తిని ప్రసాదింపని వారలను గురువని, తండ్రియని, బంధవులని యెట్లనగలము? శ్రీకృష్ణుని జేరు ననశ్వర సనాతనమార్గమే పరమానందస్వరూపము. అట్టి మార్గమును ప్రదర్శింపని వాడు మానవుల కెట్లు బంధువులు కాగలరు? కావున సాధ్వీ! నీవు నిర్గుణు డైన, పరబ్రహ్మమైన, అచ్యుతుడైన శ్రీకృష్ణపరమాత్మను సదా యుపాసింపుము. ఈయన నుపాసించిన జీవుని సకలకర్మమూలములు ఖండింప

బడగలవు. ప్రియా! అఖండవైరాగ్యము నొంది నాసమస్తజీవితమును శ్రీకృష్ణ పరమాత్మసేవలందు బరిపూర్ణముగ నర్పించుటకే నేను నిన్ను ద్యజించు చున్నాను. దేవీ! నాయీయపరాధమును క్షమింపుము. సాధ్వులైనస్త్రీలు క్షమాపరాయణులు. సత్త్వగుణప్రభావమువలన వారిలో క్రోధ ముద్భవింపదు. దేవీ! శ్రీకృష్ణాఖండ తప మొనర్ప నా కనుజ్ఞను బ్రసాదింపుము. నీ వీక సుఖముగ బోయిరమ్ము. నిస్పృహులైన వారి ఏకైకమనోరథము శ్రీకృష్ణ భగవానునిచరణకమలముల నుపాసించుటయే".

నారదమునీంద్రా! జరత్కారుమహర్షి యుపదేశించిన యీమహా జ్ఞానము నాలకించి మనసాదేవి సంతృప్తినొందినను బతివియోగమును భరింప లేక యశ్రుజలపూర్ణయై శోకముతో వినీతభావమును బ్రదర్శించుచు దన ప్రాణప్రియు డైనపతిదేవునితో నిట్లు పల్కెను. "ప్రభూ! నేను మీ నిద్రా భంగ మొనరించితి ననెడి దోషమువలన మీరు నన్ను ద్యజించుచున్నారు. కావున నాప్రార్థన యేమనగా నేప్రదేశములో నేను మిమ్ములను స్మరించెదనో మీ రాప్రదేశములో నాకు దర్శనమొసంగెదనని వాగ్దాన మొనరింపుడు. పతి వ్రత యైనస్త్రీలకు దమ నూర్గురుపుత్రులకంటె భర్తయే యధికప్రియుడు. పతి స్త్రీల కన్నివిధముల బ్రియతముడు. కావున విద్వాంసులు పతినే ప్రియుడనిరి. పుత్రవంతులకు బుత్రులలో, వైష్ణవపురుషులకు శ్రీహరిలో, యొకనేత్రమే కల్గినవారికి నేత్రములో, దప్పిక గొన్నవారలకు జలములల్లో, నాకలిగొన్నవారల కన్నమ్ములో, విద్వాంసులకు శాస్త్రములలో, వైశ్యులక్షు వాణిజ్యములో, నిరం తరము మనము సంలగ్నమై యుండునట్లు పతివ్రతాస్త్రీల మనస్సులు సదా తమపతులయందు సంలగ్నములై యుండును" అని మనసాదేవి తనభర్త చరణములపై బడెను.

నారదా! జరత్కారుమహర్షి కృపాసముద్రుడు కావున క్షణకాలము ప్రేమతో భార్యను దనయొడిలోనికి దీసికొని యశ్రుధారలచే నామె నభిషే కించెను. వియోగభయముతో దల్లడిల్లు మనసాదేవికూడ దనయశ్రుధారలచే మహర్షి వక్షఃస్థలమును సంప్లావిత మొనరించెను. తదనంతరమాదంపతులు స్వాస్థ్య మును బొంది శోకవిముక్తులైరి. జరత్కారుమహర్షి తనయర్ధాంగిని సమాధాన పఱచి శ్రీకృష్ణపరమాత్మచరణకమలములను స్మరించుచు ఘోరతప మాచరిం చుటకుద్యుక్తుడయ్యెను. మనసాదేవి వ్యథితహృదయముతో గైలాసమునకు

బయన మొనరించి తనగురుదేవు డైనశంకరునియాశ్రమమందు నివసింప దొడంగెను. శంకరుడు మనసాదేవికి దివ్యజ్ఞానమును బ్రసాదించి యామెపతివియోగ దుఃఖమును దూర మొనరించెను.

ఒక శుభముహూర్తమున మనసాదేవి కొకదివ్యపుత్రు డుదయించెను. ఆశిశువు శ్రీమన్నారాయణునంశోద్భవుడు. మాతృగర్భమం దుండగనే యా శిశువునకు శంకరునిదివ్యముఖారవిందమునుండి మహాజ్ఞానము లభించెను. ఈ కారణముననే యాబాలకుడు యోగీంద్రులకు, జ్ఞానులకు నాచార్యు డయ్యెను. శంకరుడే స్వయముగ నాశిశువునకుజాతకర్మాదిమంగళమయసంస్కారములనొనరించెను. శంకరుడు బాలకునికళ్యాణార్థము వేదపఠన మొనరింపజేసి యసంఖ్యామణులను, రత్నములను, సువర్ణములను బ్రాహ్మణులకు దాన మొసంగెను. పార్వతీదేవికూడ లక్షాధికగోవులను, బహురత్నములను బ్రాహ్మణులకు బ్రసాదించెను. స్వయముగ శివుడే యాబాలకునకు నాల్గువేదములను, శ్రేష్ఠమృత్యుంజయజ్ఞానమును నుపదేశించెను. మనసాదేవికి దనప్రాణవల్లభు డైనపతియందిష్టదైవ మైనశ్రీహరియందు, గురుదేవు డైనశివునందు బూర్ణభక్తి కలదు. కావుననే "యస్యా భక్తిః ఆస్తే తస్యాః పుత్రః" అనువ్యుత్పత్త్యనుసారముగ నాకుమారుని నామము 'ఆస్తీకు' డయ్యెను.

పుత్రోత్సవము నొ బాల్గొనుటకు జరత్కారుమహర్షి కైలాసమున కరుదెంచి కుమారు నాశీర్వదించి మహాదేవునకు బ్రణామము లర్పించి మరల దప మొనరించుటకు బుష్కరక్షేత్రముజేరెను. పుత్రవతి యైనమనసాదేవి తన కుమారునితో గశ్యపప్రజాపతియాశ్రమమున కరుదెంచెను. పుత్రవతి యైన కొమార్తెను గాంచి కశ్యపప్రజాపతి తద్భార్య లైనదితి, అదితి మొదలగువా రందఱు నఖండానందభరితు లైరి. ప్రజాపతి, పుత్రవతి యగుకొమార్తె వచ్చిన సమయమున వారికళ్యాణార్థమై బ్రాహ్మణుల కనేకదానము లొనరించి సంతర్పణములను గావించెను. మనసాదేవి దీర్ఘకాలము పుత్రునితోగూడ తండ్రి చెంతనే నివసించెను. తదనంతరము సంభవించినవిషయములను వర్ణించెద నాలకింపుము.

నారదా! అభిమన్యుకుమారు డైనపరిక్షిన్మహారాజు దుర్దైవప్రేరణము వలన బ్రాహ్మణునియెడనపరాధ మొనరించి బ్రాహ్మణశాపమునకు గుఱి

యయ్యెను. శృంగి యనుఋషిపుత్రుడు గంగాజలములను హస్తమున ధరించి తనతండ్రికి నెగ్గుగావించినగర్వోన్మత్తు డొకసప్తదినములలో దక్షకుడనుసర్పము వలన దష్టుడై మరణింపగలడని శపించెను. బ్రాహ్మణునిశాపానుసారముగ నేడవ దినమున దక్షకుడు తనవిషజ్వాలలతో బరిక్షిన్మహారాజును విగతప్రాణు జేసెను. రాజు నశ్వరశరీరమును త్యజించి పరలోకము జేరెను. జనమేయచక్రవర్తి తండ్రికి దహనసంస్కారము లొనరించి తనతండ్రిప్రాణముల దీసినదానికి ప్రతీకారముగ సర్పయజ్ఞ మారంభింపగా సర్పసమూహము లాయజ్ఞ కుండమునందు బడి మరణింప నారంభించినవి. తక్షకుడు తనప్రాణములను రక్షించుకొనుట కింద్రు నాశ్రయించెను. అపుడు బ్రాహ్మణు లింద్రసహితముగ దక్షకుని హోమమందు బడవేయుట కుద్యుక్తులైరి. ఆభయంకరపరిస్థితిలో సకలదేవతలతో గూడి యింద్రుడు మనసాదేవియొద్దకు జని ప్రాణభిక్ష నొసంగ వలసినదిగా భగవతిని స్తుతించెను. తత్ఫలరూపముగ దల్లియాజ్ఞానుసార మాస్తీకమహర్షి జనమేజయునియజ్ఞవాటికకరుదెంచి సర్పయజ్ఞము పరిసమాప్తి మొనరింపవలసినదిగా యాచించెను. బ్రాహ్మణోత్తముని యాజ్ఞను శిరసా వహించి జనమేజయచక్రవర్తి సర్పయజ్ఞమును జాలించి పూర్ణాహుతినొసరించి బ్రాహ్మణులకు యజ్ఞాంతదక్షిణ లొసంగెను. నారదా! యిట్లు సకలసర్పజాతి, దేవేంద్రుడును, మనసాదేవియనుగ్రహమున మృత్యువువాతబడక పునర్జీవితు లైరి. తదనంతరము బ్రాహ్మణులు, దేవతలు, మహర్షులు మొదలగువా రం దఱు మనసాదేవిచెంతకు జని యామె ననేకవిధముల స్తుతించి, పూజించిరి. దేవేంద్రుడు పవిత్రుడై శ్రేష్ఠసామగ్రులను సమాయత్త మొనరించి మనసాదేవికి షోడశోపచారముల నర్పించి యామె ననేకవిధముల బూజించి స్తుతించెను. తద నంతరము బ్రహ్మవిష్ణుశివాదులయాజ్ఞానుసారము సంతుష్టులైనసకలదేవతలు తమతమనిజధామముల కరిగిరి.

మునీశ్వరా ! మనసాదేవియుపాఖ్యానమునువివరించితిని. ఇక నీ వేవిష యములను శ్రవణమొనరింపగోఱుచున్నావు?

నారదుడు పలికెను :

ప్రభూ! దేవపతి యింద్రుడే విధానముతో మనసాదేవిని బూజించెను? ఏస్తోత్రముతో నామెను స్తుతించి ధన్యుడయ్యెను?

శ్రీనారాయణఋషి పలికెను :

నారదా! దేవపతి యింద్రుడు పవిత్రమందాకినీజలములలో స్నానమాచరించి పునీతుడై యాచమనమొనరించి నూతనవస్త్రములను ధరించి రత్నసింహాసనముపై మనసాదేవి నావాహన మొనరించి రత్నమయ కలశములో పవిత్రగంగాజలముల నుంచి వేదమంత్రముల నుచ్చరించుచు దేవి కభిషేక మొనరించెను. భగవతి కగ్నిశుద్ధవస్త్రములను చందనమును సమర్పించెను. భక్తిపూర్వకముగ నర్ఘ్యపాద్యాదులచే గణేశ్వరుని, సూర్యుని, నగ్నిని, విష్ణుదేవుని, శివుని, గౌరీదేవిని బూజించి తదనంతరము మనసాదేవి పూజ సంపన్న మొనరించెను.

'ఓం హ్రీం శ్రీం మనసాదేవ్యై స్వాహా' అను ఈ దశాక్షరమూల మంత్రోచ్చారణ మొనరించుచు యథోచితముగ భగవతిని బూజించి సకల సామగ్రులను దేవి కర్పించెను. దేవేంద్రుడు మంగళవాద్యములను బ్రయోగింప జేసి షోడశోపచారముల నర్పించి మనసాదేవిపూజను భక్తిభావసమన్వితుడై పరిపూర్ణ మొనరించెను. దేవత లాసమయములో మనసాదేవిపై బుష్పవృష్టి గురిపించిరి. పిదప బ్రహ్మవిష్ణుమహేశ్వరులయాజ్ఞానుసారము మహేంద్రుడు పులకిత శరీరుడై సాశ్రుపూర్ణలోచనములతో భక్తిభావసమన్వితుడై మనసాదేవి నిట్లు స్తుతింప నారంభించెను.

## మనసాదేవీ స్తోత్రము

మహేంద్ర ఉవాచ :

దేవి త్వాం స్తోతుమిచ్ఛామి సాధ్వీనాం ప్రవరాం వరామ్ ।
పరాత్పరాం చ పరమాం న హి స్తోతుం క్షమోఽధునా ॥

స్తోత్రాణాం లక్షణం వేదే స్వభావాఖ్యానతత్పరమ్ ।
న క్షమః ప్రకృతే వక్తుం గుణానాం తవ సువ్రతే ॥

శుద్ధసత్త్వస్వరూపా త్వం కోపహింసావివర్జితా ।
న చ శప్తో మునిస్తేన త్యక్తా యా చ త్వయా యతః ॥

త్వం మయా పూజితా సాధ్వీ జననీ చ యథాఽదితిః ।
దయారూపా చ భగినీ క్షమారూపా యథా ప్రసూః ॥

త్వయా మే రక్షితాః ప్రాణాః పుత్రదారాః సురేశ్వరీ ।
అహం కరోమి త్వాం పూజ్యాం మమ ప్రీతిశ్చ వర్ధతే ॥

నిత్యం యద్యపి త్వం పూజ్యా భవేఽత్రజగదమ్బికే ।
తథాపి తవ పూజాం చ వర్ధయామి చ సర్వతః ॥

యే త్వా మాషాఢసంక్రాన్త్యాం పూజయిష్యన్తి భక్తితః ।
పంచమ్యాం మనసాఖ్యాయా మిషాన్తం వా దినే దినే ॥

పుత్రపౌత్రోదయ స్తేషాం వర్ధన్తే చ ధనాని వై ।
యశస్వినః కీర్తిమన్తో విద్యావన్తో గుణాన్వితాః ॥

యే త్వాం న పూజయిష్యన్తి నిన్దన్త్యజ్ఞానతో జనాః ।
లక్ష్మీహీనా భవిష్యన్తి తేషాం నాగభయం సదా ॥

త్వం స్వర్గలక్ష్మీః స్వర్గే చ వైకుణ్ఠే కమలాలయా ।
నారాయణాంశో భగవాన్ జరత్కారు ర్మునీశ్వరః ॥

తపసా తేజసా త్వాం చ మనసా ససృజే పితా ।
అస్మాకం రక్షణాయైవ తేన త్వం మనసాభిధా ॥

మనసా దేవితుం శక్తా స్వాత్మనా సిద్ధయోగినీ ।
తేనత్వం మనసా దేవీ పూజితా వన్దితా భవే ॥

యే భక్త్యా మనసాం దేవాః పూజయ న్త్యనిశం భృశమ్ ।
తేన త్వాం మనసాదేవీం ప్రవదన్తి మనీషిణః ॥

సత్యస్వరూపా దేవీ త్వం శశ్వత్సత్యనిషేవయా ।
యో హి యద్ భావయే న్నిత్యం శతం ప్రాప్నోతితత్సమమ్ ॥

ఇన్ద్రశ్చ మనసాం స్తుత్వా గృహీత్వా భగినీం చ తామ్ ।
ప్రజగామ స్వభవనం భూషవాసపరిచ్ఛదామ్ ॥ (128-142)

దేవీ! నీవు పతివ్రతలందు బరమశ్రేష్ఠురాలవు. పరాత్పరురాల వైన దేవివి. నేను నిన్ను స్తుతింపవలెనని యాకాంక్షించుచున్నాను. కాని యీ మహత్త్వపూర్ణ కార్యము నాశక్తికి యతీతము. దేవీ! ప్రకృతీ! స్తుతుల్ని స్వభావప్రతిపాదనమే స్తోత్రములలక్షణ మని వేదములు ప్రవచించినవి, కాని సువ్రతా! నేను నీదివ్యస్వభావములను వర్ణించుటలో నసమర్థుడను. నీవు శుద్ధ సత్త్వస్వరూపిణివి, కోపహింసారహితవు. ఇట్టిదివ్యగుణసంపన్నురాలవు కావుననే జరత్కారుమహర్షి నిన్ను పరిత్యజించినను నీవు మహర్షిని శపించక శాంతము వహించితివి. సాధ్వీ! నేను నిన్ను అదితిమాతతో సమానముగ భావించి పూజించితిని. నీవు సహోదరివలె దయాస్వరూపిణివి, మాతృదేవతవలె క్షమా

శీలవు. సురేశ్వరీ ! నీవు నాపుత్రస్త్రీసహితముగ మాప్రాణములను రక్షించితివి. నీయెడల నాప్రీతి నిరంతరము వర్ధిల్లుచుండగ నిన్ను నేను పూజించెదను. జగదంబికా! ఈజగములో నిత్యము నీపూజలు కొనసాగుచున్నవి. అయినను నేను నీ పూజలను సర్వత్ర ప్రచారమొనరింపజేసెదను. సురేశ్వరీ ! ఆషాఢమాససంక్రాంతిసమయమున, పంచమీ(నాగపంచమి) దినమున, ఆషాఢమాసమునుండి యశ్వినివఱకు నెవరు ప్రతిదినము భక్తితో నిన్ను బూజించెదరో వారు పుత్రపౌత్రాభివృద్ధి నొంది నిశ్చయముగ ధనవంతులై విరాజిల్లగలరు. వారు యశస్వులు, కీర్తిమంతులు, విద్వాంసులు, గుణవంతులు కాగలరు. అజ్ఞానముచే నీపూజ లొనరింపక నిన్ను నిందించు వారిచెంత లక్ష్మి నివసింపదు, వారు సదా నాగభయముతో దుఃఖింపగలరు. దేవీ ! నీవే స్వయముగ స్వర్గములో స్వర్గలక్ష్మివి, వైకుంఠములో గమలాదేవికళవు. నారాయణాంశాసంభూతుడే జరత్కారుమునీశ్వరుడు. పితృదేవుడు (కశ్యపప్రజాపతి) మమ్ముల నందఱిని రక్షించుటకే తపస్తేజప్రభావముతో దనమనముద్వారమున నిన్ను సృజించిరి, కావుననే నీవు మనసాదేవి యని కీర్తింపబడి సిద్ధయోగినివై విరాజిల్లుచున్నావు. దేవీ ! నీవు సిద్ధయోగినివి, కావుననే స్వయముగ మనస్సుతో సర్వత్ర గమనమొనరింపగల శక్తి సమన్వితురాలవు. కావుననే జగములో మనసాదేవి యనునామమున బూజింపబడి వందనములందుకొనుచున్నావు. దేవతలందఱుభక్తిపూర్వకముగ నిరంతరము నేకాగ్రమనములతో నీపూజ లొనరింతురు, ఈకారణముననే విద్వాంసులు నిన్ను మనసాదేవి యని కీర్తింతురు, దేవీ ! నీవు సదా సత్యమును సేవించుటవలన సత్యస్వరూపిణి వైనావు. ఏ వస్తువునునిరంతర మెవరు చింతింతురో వా రావస్తువును నూఱురెట్లధికముగ బొందగలరు. మునీశ్వరా ! ఈప్రకారముగ నింద్రుడు మనసాదేవిని స్తుతించి వస్త్రాభరణవిభూషిత యైనయాసహోదరిని దోడ్కొని తననిజవాసమునకు బ్రస్థానమొనరించెను.

నారదా మనసాదేవి తనపుత్రునితో గలిసి తండ్రి యైనకశ్యపప్రజాపతి యాశ్రమములో దీర్ఘకాలము నివసించెను. భ్రాతృవర్గమంతయు (ఇంద్రాది దేవతలు) సదా యామెను బూజించుచు నామె కభివాదనము లర్పించుచు గౌరవింపదొడంగిరి. దేవర్షీ! తదనంతర మొకశుభసమయమున గోలోకనివాసినియైన సురభిగోమాత కశ్యపప్రజాపతియాశ్రమమున కరుదెంచి తనదివ్యక్షీరములతో

నాదణీయురాలై మనసాదేవి నభిషేకించి యామెను బూజించెను. సురభి గోమాత సర్వదుర్లభమైననిగూఢజ్ఞానమును గూడ మనసాదేవి కుపదేశించి దేవతలతో బూజింపబడి గోలోకమునకు మరలిపోయెను.

నారదా! ఈస్తోత్రము పుణ్యబీజమని కీర్తింపబడినది. మనసాదేవిని బూజించి యీ స్తోత్రమును పఠించు వారికి, వారివంశమువారలకు నాగభయ మెన్నటికి సంభవింపదు. ఈస్తోత్రసిద్ధి నొందినవారికి విషముసహిత మమృతము కాగలదు. అయిదులక్షలు జపించిననీస్తోత్రము సిద్ధింపగలదు. మంత్రసిద్ధి నొందినవారు సర్పమునే శయ్యగ జేసికొని శయనింపగలరు. సర్ప వాహనులై చరింపగలరు.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణ
సంవాదమున మనసాదేవ్యుత్పత్తి
పూజా స్తోత్రాదికథనమను
నలుబదియాఱవ అధ్యాయము
సంపూర్ణము.

—♦—

## నలుబదియేడవ అధ్యాయము

### ఆదిగోమాత యగుసురభి యుపాఖ్యానము

**నారదుడు పలికెను :**

దేవా! గోలోకమునుండి యరుదెంచిన యాసురభిగోమాత యెవ్వరు? ఆమెసంభవమును, చరితమును గృపతో వర్ణింపుము.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! సకలగోసముదాయములకు నధిష్ఠాత్రీదేవి, గోజనని, గోవు

లందు శ్రేష్ఠులాలు, ఆది గోమాత యైనసురభి గోలోకమందు ప్రాదుర్భవించెను. సర్వప్రథమమున సంభవించినసృష్టిప్రకరణమును వర్ణించెద నాలకింపుము. పూర్వకాలములో గోలోకస్థరమ్యబృందావనములో సురభి గోమాత యావిర్భవించెను.

ఒకానొకసమయమున గోపాంగనాపరివేష్టితుడై రాధాపతి శ్రీకృష్ణ పరమాత్మ కౌతూహలముచే శ్రీరాధతో కలిసి పుణ్యబృందావనములో విహరింపదొడంగెను. ఆలీలామానుషవిగ్రహమున కపుడు క్షీరములను ద్రాగవలెనని యిచ్ఛకల్గినది. అపు డాజగన్నాథుడు తనవామపార్శ్వమునుండి లీలాపూర్వకముగ సురభిగోమాతను ప్రాదుర్భవింపజేసెను. సురభిగోవత్సముతో గూడ నావిర్భవించెను, కావున నామెదుగ్ధవతి. సవత్సయగుగోవును గాంచి సుధాముడొకరత్ననిర్మితపాత్ర నందుకొని గోక్షీరములను బిండ నారంభించెను. ఆసురభి క్షీరములు సుధకంటె నధికమధురములు, జన్మమృత్యునివారకములు. స్వయముగ గోపీపతి శ్రీకృష్ణపరమాత్మ తదుష్ణస్వాదుక్షీరముల నాప్యాయముగ సేవించెను. తదనంతరము క్షీరము లున్నయాపాత్ర భగవంతునిసంకల్పముచే హస్తములనుండి జారి క్రిందబడి యాక్షీరములే యొకసరోవరరూపమున వ్యాపించినవి. ఆసరోవరవిస్తీర్ణము నూఱుయోజనములు. గోలోకమం దుద్భవించినయాసరోవరము క్షీరసరోవర మనునామమున ప్రసిద్ధిగాంచెను. గోపికలకు, శ్రీరాధకు నాసరోవరమే క్రీడాసరోవర మైనది. పరమాత్మసంకల్పముచే నాక్రీడాసరోవరతటము తత్కాలమే యమూల్య దివ్యరత్నములతో నిర్మితమైనది. ఆసమయముననే యసంఖ్యాకము లైనకామధేనువులు ప్రాదుర్భవించినవి. ఎన్ని కామధేనువులు సంభవించినవో యన్నిగోవత్సములుకూడ సురభిగోమాతరోమకూపములనుండి జన్మించినవి. తదనంతర మాగోవులకు బుత్రపౌత్రులు కల్గి గోసంఖ్య యసంఖ్యాకమైనది. ఇట్లు సురభిదేవినుండి గోవులు సృష్టింపబడి సకలజగములందు వ్యాపించినవి.

మునీశ్వరా! ప్రప్రథమమున స్వయముగ శ్రీకృష్ణపరమాత్మయే సురభి గోమాతపూజ సంపన్న మొనరించెను. తర్వాత త్రిలోకములం దాదేవినుర్లభ పూజ ప్రచారమైనది. దీపావళిమరుసటిదినమున శ్రీకృష్ణపరమాత్మయాజ్ఞ వలన సురభిగోమాతపూజ యవనిపై నొనరింపబడెను. నారదా! ఈయాఖ్యానమును నేను నా పితృదేవు లైనధర్మదేవుని ముఖారవిందమునుండి శ్రవణముచేసితిని.

మహాభాగా! సురభి దేవీధ్యానమును, స్తోత్రమును, మూలమంత్రమును, బూజా విధానమును నాగమానుసారముగ బ్రవచించెద శ్రవణమొనరింపుము. 'ఓం సురభ్యై నమః' సురభి దేవియొక్క షడక్షరదివ్యమంత్రమే యీమంత్రము. ఒకలక్ష పర్యాయములు జపించిన నీమంత్రము సిద్ధించి భక్తులను గల్పవృక్షమువలె ననుగ్రహింపగలదు. ఈ దేవీధ్యానము, పూజావిధానము యజుర్వేదమందు వర్ణింపబడెను.

సు ర భి గో మా త ధ్యా న ము

బుద్ధిదాం వృద్ధిదాం చైవ ముక్తిదాం సర్వకామదామ్ ॥
లక్ష్మీస్వరూపాం పరమాం రాధాసహచరీం పరామ్ ।
గవా మధిష్ఠాతృదేవీం గవామాద్యాం గవాం ప్రసూమ్ ॥

పవిత్రరూపాం పూజ్యాం చ భక్తానాం సర్వకామదామ్ ।
యయా పూతం సర్వవిశ్వం తాం దేవీం సురభీం భజే ॥ (17-19)

బుద్ధిని, వృద్ధిని, ముక్తిని, సర్వాభీష్టములను బ్రసాదింపగలదియు, లక్ష్మీస్వరూపిణియు, శ్రీరాధాసహచరియు, సకలగోవులకు నధిష్ఠాత్రియు, గోవులకాదిజననియు, పవిత్రస్వరూపిణియు, పూజనీయురాలు, భక్తులనిఖిలమనోరథములను సిద్ధింపజేయగలశక్తిసమన్వితయు సకలవిశ్వమును పునీతమొనరించునదియు నగుసురభి గోమాతను నేను భజించెదను.

మంగళకలశమందుగాని, గోమస్తకమందుగాని, గోవును బంధించుస్తంభమందుగాని, సాలగ్రామమూర్తియందుగాని, జలములందుగాని లేక యగ్నియందుగాని దేవి సురభి నావాహనమొనరించి పూజింపవలెను. దీపావళి రెండవ దినమున బూర్వాహ్ణమందు భక్తితో సురభిగోమాతను బూజించువారు జగత్పూజ్యులు కాగలరు.

నారదమునీంద్రా! ఒకానొకసమయమున వరాహకల్పములో సురభి గోమాత క్షీరములను బ్రసాదించుట నిరోధించెను. అపుడు దేవతలందఱు నత్యంతచింతాక్రాంతులై బ్రహ్మలోకము జేరి బ్రహ్మదేవు నాశ్రయించిరి. తదనంతరము బ్రహ్మదేవునాజ్ఞానుసారముగ మహేంద్రుడు సురభి దేవి యనుగ్రహార్థ మామెను స్తుతింప నారంభించెను.

## సురభి గోమాతృ స్తోత్రము

**మహేంద్ర ఉవాచ :**

నమో దేవ్యై మహాదేవ్యై సురభ్యై చ నమో నమః ।
గవాం బీజస్వరూపాయై నమస్తే జగదమ్బికే ॥
నమో రాధాప్రియాయై చ పద్మాంశాయై నమో నమః ।
నమః కృష్ణప్రియాయై చ గవాం మాత్రే నమో నమః ॥
కల్పవృక్షస్వరూపాయై సర్వేషాం సతతం పరమ్ ।
శ్రీదాయై ధనదాయై చ వృద్ధిదాయై నమో నమః ॥
శుభదాయై ప్రసన్నాయై గోప్రదాయై నమో నమః ।
యశోదాయై కీర్తిదాయై ధర్మజ్ఞాయై నమో నమః ॥ (24-27)

దేవీ! నీకు నమస్కారము. మహాదేవీ! సురభిగోమాతా! నీ కనేకానేక నమస్కారములు. జగదంబా! గోవులకు బీజస్వరూపిణి వైన నీకు నమస్కారము. శ్రీరాధాప్రియా! నీకు నమస్కారము, లక్ష్మ్యంశసంభూతవైన నీ కనేకానేకనమస్కారములు. శ్రీకృష్ణప్రియకునమస్కారము. గోవులకు జననివైన నీకు మరల మరల నమస్కారము. సర్వులకు గల్పవృక్షస్వరూపిణియు, శ్రీని, ధనమును, వృద్ధిని బ్రసాదింపగలదియు నగునాసురభి దేవికి మరల మరల నమస్కారము. శుభప్రదాయినీ! ప్రసన్నస్వరూపిణీ! గోప్రదాయినీ! సురభిదేవీ! నీకు నమస్కారము, యశమును, గీర్తిని బ్రసాదించుధర్మజ్ఞురాల వైననీకు నమస్కారము.

మహేంద్రు డిట్లు భక్తిభావముతో స్తుతింపగనే జగజ్జనని యగుసురభి గోమాత ప్రసన్నురాలై బ్రహ్మలోకము లో సాక్షాత్కరించి యింద్రునకు బరమదుర్లభము లైనవరముల నొసంగి మరలగోలోకమునకు దిరోగమించెను. సంతుష్టు లైనదేవతలుకూడ బ్రహ్మలోకమునుండి తమతమనిజ ధామముల కరిగిరి. నారదా! సురభిగోమాత యనుగ్రహించినంతనే సకల విశ్వము క్షీరములతో బరిపూర్ణ మయ్యెను. క్షీరములనుండి ఘృతమును బహిర్గత మొనరించి ప్రజలు ఘృతముతో యజ్ఞములను సంపన్న మొనరింప నారంభించిరి. యజ్ఞములవలన దేవతలు సంతుష్టులై ప్రసన్నులైరి.

ఈ మహా పవిత్ర స్తోత్రమును భక్తిపూర్వకముగ బఠించు వారు గోధనముతో సంపన్నులు, ప్రచురసంపత్తిసమన్వితులు, పరమయశస్వులునై

పుత్రపౌత్రాభివృద్ధి నొంది సుఖింతురు. వారికి సంపూర్ణ తీర్థస్నానఫలము, నిఖిల యజ్ఞదీక్షాఫలములు సులభముగ లభింపగలవు. సురభిగోమాత్రనుగ్రహమునకు పాత్రులైనవా రిహలోకమందు సుఖముల ననుభవించి, యంత్యకాలమున శ్రీకృష్ణపరమాత్మదివ్యధామమును జేరగలరు. నారదా! ఆభక్తులు చిరకాలము భగవంతునిపరంధామమందు నివసించి, తత్స్నేహాసౌభాగ్యసంపన్నులు కాగలరు. వారు మరల నీసంసారమందు జన్మింపనవసరము లేదు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణసంవాద
మున సురభియుపాఖ్యానములో తదుత్పత్తి,
తత్పూజాది కథన మను
నలుబదియేడవ అధ్యాయము
సంపూర్ణము.

—♦—

## నలుబదియెనిమిదవ అధ్యాయము

### పార్వతి ప్రశ్నింపగ మహాదేవుడు శ్రీరాధాదేవి ప్రాదుర్భావమును, ఆమెదివ్యమాహాత్మ్యమును ప్రశంసించుట

**నారదుడు పలికెను :**

శ్రీమన్నారాయణునిదివ్యధ్యానమందు సదా తత్పరుడవై యుండు మహాభాగా! శ్రీనారాయణఋషీంద్రా! నీవు శ్రీనారాయణాంశసంభవుడవు. స్వామీ! నారాయణీదివ్యచరితమును గృపతో వర్ణింపుము. అత్యంత మనోహర మైనసురభి గోమాత యుపాఖ్యానమును శ్రవణ మొనరించితిని.

ఈసురభి యుపాఖ్యానము సమస్తపురాణములం దత్యంతగోపనీయమని పురాణ వేత్తలు ప్రశంసించిరి. దేవా! నేను జగజ్జనని శ్రీరాధాదేవిపర మోత్తమదివ్యాఖ్యానమును శ్రవణమొనరింపవలెనని హృదయపూర్వకముగ నభిలషించుచున్నాను. శ్రీరాధాప్రాదుర్భావప్రసంగమును, నామస్తోత్రధ్యాన కవచాదులను నీవు కరుణతో నా కుపదేశింపుము.

## శ్రీనారాయణఋషి పలికెను :

నారదా! జగజ్జననియు మూలప్రకృతియు నీశ్వరియునైన శ్రీరాధాదేవి దివ్యచరితమును శ్రవణమొనరింపవలె ననెడి నీయభిలాష యత్యంత ప్రశంస నీయము. నారదా! నీజీవనము, నీయీకోరికచే ధన్యమైనది. దేవర్షీ! ఈ యాఖ్యాన మత్యంతప్రాచీనము. సర్వస్వరూపుడు, సర్వశ్రేష్ఠుడు, సిద్ధులకు స్వామి, సకలసిద్ధిప్రదాత, సనాతనుడైనశంకరుడు మహర్షిగణపరివేష్టితుడై వారిచే స్తుతింపబడుచు కైలాసములో విరాజమానుడై యుండెను. అత్యంత ప్రఫుల్లముఖారవిందుడై యధరములపై మందహాసములు నాట్యము లాడుచుండ నాజ్ఞానాధిష్ఠాతృదైవము కార్తికేయునకు శ్రీకృష్ణపరమాత్మ రాసోత్సవసరసాఖ్యానమును వినిపించుచుండెను. ఈప్రసంగశ్రవణమే కుమారు నకు నత్యంతరుచికరవిషయము. రాసమండలదివ్యశోభను వర్ణించి సదాశివు డాదివ్యాఖ్యానమును సమాప్తమొనరించెను. ఆసమయమున పార్వతీదేవి మందస్మిత ముఖారవిందముతో దన ప్రాణవల్లభు నిట్లు ప్రశ్నించుట కుద్యుక్తురాలయ్యెను. ఆజగదంబ ప్రాణేశ్వరుని మధురవచనములచే ప్రసన్నురాలై మహాదేవుని శ్రీరాధాదివ్యచరితమును వర్ణింపవలసినదిగ ప్రార్థించెను.

## పార్వతీదేవి పలికెను :

ప్రాణనాథా! నేను దమదివ్యముఖారవిందమునుండి పాంచరాత్రాది సక లోత్తమోత్తమాగమములను, నీతిశాస్త్రములను, యోగులయోగశాస్త్రము లను, సిద్ధులసిద్ధిశాస్త్రములను, నానావిధములైనమనోహరతంత్రశాస్త్రము లనట్టి శ్రీకృష్ణపరమాత్మభక్తులభక్తిశాస్త్రములను, సమస్తదేవాంగనలభవ్యచరి తములను శ్రవణమొనరించితిని. కాని నాథా! నామానస మెందులకో తృప్తి నొందుటలేదు. ప్రాణవల్లభా! ఇప్పుడు నేను శ్రీరాధాదేవి యుత్తమదివ్యా

ఖ్యానమును శ్రవణమొనరింపవలెనని యభిలషించుచున్నాను. శ్రుతులలోగణ్వ శాఖాంతర్గత మైనశ్రీరాధాప్రశంస కడుసంక్షిప్తముగదమ ముఖారవిందమునుండి శ్రవణమొనరించితిని. జగదీశ్వరా! శ్రీకృష్ణద్వైపాయనవ్యాసభగవానుడు వర్ణించినశ్రీరాధాదివ్యమహాత్మ్యములను సవిస్తరముగ వర్ణింపుము. మొదట ఆగమాఖ్యానప్రసంగములో నీవు శ్రీరాధాదివ్యచరితమును సవిస్తరముగ వర్ణించెదనని వాగ్దానమొనరించియున్నావు. ఈశ్వరునివాణి యెప్పుడును మిథ్య కాదు. కావున దేవాదిదేవా! శ్రీరాధాప్రాదుర్భావచరితమును, ధ్యానమును, నుత్తమ నామమాహాత్మ్యమును, బూజావిధానమును, జరితమును, స్తోత్రమును, గవచమును, దదారాధనావిధిని, నభీష్టపూజాపద్ధతిని సవిస్తరముగ వర్ణించి నన్ను ధన్యురాలి నొనరింపుము. భక్తవత్సలా! నేను నీభక్తురాలనుగావున నీ వీ విషయముల నన్నింటి నవశ్యముగ నుపదేశింపుము. ఆగమాఖ్యానముకంటె మొదటనే నీవు శ్రీరాధాప్రసంగము నెందులకు వర్ణింపలేదో విశదీకరింపుము.

**శ్రీనారాయణఋషి పలికెను :**

నారదా! పార్వతియొక్క వచనముల నాలకించి పంచముఖుడైనశివుడు నతమస్తకుడైనాడు. తనసత్యవ్రతము భంగమగునేమో యనెడిభయముతో శివుడు మౌనమువహించి చింతాగ్రస్తుడయ్యెను. అపుడు శంకరుడు తనయిష్ట దేవతయు నపారకరుణానిధి యగుశ్రీకృష్ణపరమాత్మను ధ్యానించి స్మరించి ఆయనయనుజ్ఞనుబొంది తనయర్ధాంగస్వరూపిణి యైనపార్వతితో నిట్లు పల్కెను.

**మహాదేవుడు పలికెను :**

దేవీ ! ఆగమాఖ్యానారంభసమయములో నేను శ్రీరాధాఖ్యానమును వర్ణింప సంకల్పింపగా శ్రీకృష్ణపరమాత్మ నిరోధించెను. కాని దేవీ! మహేశ్వరీ! నీవు నాయర్ధాంగివి, స్వరూపములో నానుండి భిన్నురాలవు కావు. కావుననే శ్రీకృష్ణపరమాత్మ యీసమయములో శ్రీరాధాప్రసంగమును నీయెదుట వర్ణించుటకనుజ్ఞ నొసంగెను. సతీశిరోమణీ! నాయిష్టదేవునిప్రాణవల్లభయైనభగవతిశ్రీరాధాదేవిదివ్యచరిత మత్యంతగోపనీయము, అఖండసుఖప్రదము, శ్రీకృష్ణ భక్తిదాస్యసౌభాగ్యప్రదము. దుర్గా! శ్రీరాధాదివ్యచరితము పరిపూర్ణముగ నాకవగతమే. నే నేరహస్యములను దెలిసికొంటినో యారహస్యములు బ్రహ్మ శేషాదులకైనను దుర్లభములే. సనత్కుమారునకైనను, సనాతనునకైనను,

దేవతలకైనను, ధర్మమునకైనను, మహర్షులకైనను, సిద్ధేంద్రులకైనను, సిద్ధపుంగవులకైనను, మహేంద్రాదులకైన నీమహాజ్ఞాన మగోచరమే. సురేశ్వరీ! నీవు నాకంటె మహాబలసంపన్నురాల వైనావు; ఎందుచే ననగ నీదివ్యప్రసంగమును శ్రవణమొనరింపనియెడల ప్రాణముల బరిత్యజించెదనని ప్రతినబూనితివి. కావున నత్యంతగోపనీయ మైనయీచరితమునుగూడ నీయెదుట వర్ణించెదను. దుర్గా! శ్రీరాధాచరితము దుర్లభము, పరమాద్భుతరహస్యము. అఖండపుణ్యప్రదము. నా కవగత మైనంతవఱకు సంక్షిప్తముగ శ్రీరాధామహాచరితమును బ్రవచించెద; సావధానురాలవై యవధరింపుము.

సృష్ట్యాదిలో దివ్యగోలోకపరంధామాంతర్గ మైనశతశృంగదేశ మైన బృందావన రాసమండల మాలతీ మల్లికావనములో స్వేచ్ఛామయు డైన శ్రీకృష్ణపరమాత్మ రమణోత్సుకుడై రమణీయరత్నసింహాసనము నధిష్ఠించి యుండెను. ఆస్వేచ్ఛామయునిసంకల్పమాత్రముననే సకలము సంభవించును. దుర్గా! ఆసమయములోనే శ్రీకృష్ణపరమాత్మ రెండురూపములలో విభక్తుడయ్యెను. పరమాత్మదక్షిణాంగము శ్రీకృష్ణునిగను, ఆయనవామార్ధాంగము శ్రీరాధగను నావిర్భవించెను. భగవంతునియర్ధాంగసంభూత మైనయా రమణీలలామ రమణోత్సుక యైనరాసేశ్వరి. ఆమె యమూల్యరత్నాభరణములను ధరించి రత్నసింహాసనము నధిరోహించెను. ఆభగవతి వహ్నిశుద్ధము లైన వస్త్రములను ధరించి కోటిపూర్ణశశిప్రభలతో బ్రకాశించుచు దప్తకాంచనవర్ణ సంయుక్తయై స్వతేజముతో బ్రజ్వరిల్లదొడంగెను. ఆమె సస్మితముఖారవింద, పరిశుద్ధురాలు, సుదతి, వికసించినపద్మములవంటి విశాలనయనములుగలది, మాలతీమాల్యమండితమై యామె కేశపాశ మలరారుచుండెను. ఆమె కంఠమున నలంకరింపబడియున్న రత్ననిర్మితమాల గ్రీష్మర్తువున సూర్యునివలె బ్రకాశించుచుండెను. ఆమెవక్షఃస్థలముపై బ్రకాశించుముక్తాహారము ధవళగంగాధారవలె శోభించుచుండెను. రసికశేఖరుడైన, శ్యామసుందరు డైనశ్రీకృష్ణపరమాత్మ మందస్మితముఖారవింద మైనతనప్రియతమను వీక్షించెను. ప్రాణవల్లభపై దృష్టిసారింపగనే విశ్వకాంతు డైనశ్రీకృష్ణునిలో మిలనేచ్ఛ యుద్భవించెను. పరమమనోహరకాంతిసమన్విత డైనతనప్రాణవల్లభుని గాంచగనే శ్రీరాధ తత్క్షణమునకు బరుగిడివచ్చెను.

దృష్ట్వా రిరంసుం కాన్తం చ సా దధావ హరేః పురః ।
తేన రాధాసమాఖ్యాతా పురావిద్భి ర్మహేశ్వరీ ॥

రాధా భజతి తం కృష్ణం స చ తాం చ పరస్పరమ్ ।
ఉభయోః సర్వసామ్యం చ సదా సన్తో వదన్తి చ ॥

ధావనం ధావనం రాసే స్మరత్యాలిఙ్గనం జపన్ ।
తేన జల్పతి సంకేతం తత్ర రాధాం స ఈశ్వరః ॥ (37-39)

మహేశ్వరీ! భగవతి తనప్రాణవల్లభుని దర్శించి యాయనచెంతకు బరుగిడెను. ఈకారణముననే పురాణవేత్తలైనపురుషు లీమె నామధేయము రాధ యని నిర్ణయించిరి. రాధ సదా శ్రీకృష్ణు నారాధించును; శ్రీకృష్ణుడు సదా శ్రీరాధ నారాధించును. వా రిర్వురు పరస్పర మారాధ్యులు, ఆరాధకులు. వారిర్వురు సన్నిధివిషయములందు సరిసములని మహాత్ములు ప్రవచించిరి. మహేశ్వరీ ! నాయీశ్వరు డైనశ్రీకృష్ణుడు రాసనమయములో దన ప్రియురాలిధావనకర్మమును సదా స్మరించును; కావుననే యాయన తనహృదయేశ్వరిని రాధ యని స్మరించును.

రాశబ్దోచ్చారణా ద్భక్తో రాతి ముక్తిం సుదుర్లభామ్ ।
ధాశబ్దోచ్చారణాద్దుర్గే ! ధావత్యేవ హరేః పదమ్ ॥

కృష్ణవామాంశసమ్భూతా రాధా రాసేశ్వరీ పురా ।
తస్యాంశాంశాంశకలయా బభూవు ర్దేవయోషితః ॥

రా ఇత్యాదానవచనో ధా చ నిర్వాణవాచకః ।
తతోఽవాప్నోతి ముక్తిం చ తేన రాధా ప్రకీర్తితా ॥ (40-42)

దుర్గా! భక్తులు 'రా'శబ్దోచ్చారణమాత్రముననే పరమదుర్లభ మైనభవబంధవిముక్తి నొందగలరు. 'ధా'శబ్దోచ్చారణమాత్రముననే వారు నిశ్చయముగ శ్రీహరిచరణములచెంతకు బరుగిడి చేరగలరు. పూర్వకాలముననిట్లురాసేశ్వరిశ్రీరాధ శ్రీకృష్ణునివామార్ధంగమునుండి యావిర్భవించెను. సకలదేవాంగనలు నామెవివిధాంశలనుండి, కళలనుండి ప్రాదుర్భవించినవారే యని తెలిసికొనుము. 'రా'శబ్దమున కర్థముపొందుట; 'ధా'శబ్దమున కర్థము నిర్వాణము (మోక్షము). భక్తజను లామెవలన నిర్వాణముక్తిని బొందగలరు. ఈ కారణముననే యామె రాధ యనికీర్తింపబడెను.

శ్రీరాధాదేవి రోమకూపములనుండి యసంఖ్యాక గోపికలు

పాదుర్భవించిరి. శ్రీకృష్ణునిరోమకూపములనుండి సకలగోపులు ప్రాదుర్భవించిరి. శ్రీరాధావామార్ధాంగమునుండియే శ్రీమహాలక్ష్మి యావిర్భవించెను. శ్రీమహాలక్ష్మియే సకలసస్యముల కధిష్ఠాత్రీదేవియై గృహలక్ష్మిరూపమున విరాజిల్లుచున్నది. ఆశ్రీమహాలక్ష్మియే చతుర్భుజుడైన విష్ణువునకు బత్నియై వైకుంఠపరంధామములో నివసించును. రాజన్యులకు సంపత్తులను బ్రసాదించురాజ్యలక్ష్మికూడ నీమెయంశసంభూతయే. గృహస్థులగృహములందు విరాజిల్లుగృహలక్ష్మి రాజలక్ష్మియంశసంభూతురాలని తెలిసికొనుము. శ్రీమహాలక్ష్మియే స్వయముగ సస్యాధిష్ఠాతృదేవియై, గృహదేవతయై విరాజిల్లియున్నది. స్వయముగ శ్రీరాధ శ్రీకృష్ణపరమాత్మప్రియతమయై యాయనవక్షఃస్థలములో నివసించును.

ప్రాణాధిష్ఠాతృదేవీ చ తస్యైవ పరమాత్మనః ॥ (47)

ఆమె పరమాత్మ యగుశ్రీకృష్ణునిప్రాణముల కధిష్ఠాత్రీదేవి.

ఆబ్రహ్మస్తమ్బపర్యన్తం సర్వం మిథ్యైవ పార్వతి ।<br>
భజ సత్యం పరం బ్రహ్మ రాధేశం త్రిగుణాత్పరమ్ ॥

పరం ప్రధానం పరమం పరమాత్మాన మీశ్వరమ్ ।<br>
సర్వాద్యం సర్వపూజ్యం చ నిరీహం ప్రకృతేః పరమ్ ॥

స్వేచ్ఛామయం నిత్యరూపం భక్తానుగ్రహవిగ్రహమ్ ।<br>
తద్భిన్నానాం చ దేవానాం ప్రాకృతం రూపమేవ చ ॥ (48-50)

పార్వతీ! బ్రహ్మ మొదలు క్షుద్రకీటకపర్యంతము సర్వజగములు మిథ్యలని తెలిసికొనుము. కేవలము త్రిగుణాతీతుడు, పరబ్రహ్మము, పరమాత్మ, శ్రీరాధావల్లభుడైనశ్రీకృష్ణుడే పరమసత్యము. కావున నీ వాయననే సదా భజింపుము ఆయనయే సర్వులందు బ్రధానపురుషుడు, పరమాత్మ, పరమేశ్వరుడు, సకలములకు నాదికారణుడు, సర్వపూజ్యుడు, నిరీహుడు, ప్రకృతికే యతీతుడై విరాజిల్లుచున్నాడు. ఆయన నిత్యరూపుడైనస్వేచ్ఛామయుడు. ఆపరబ్రహ్మము భక్తుల ననుగ్రహించుటకే సచ్చిదానందవిగ్రహమున సాక్షాత్కరించెను. శ్రీకృష్ణునకన్యసకలదేవతలు ప్రాకృతరూపయుక్తులని తెలిసికొనుము. అనగా కేవలము శ్రీకృష్ణపరమాత్మయే సత్యము, నిత్యము, అక్షరము, సచ్చిదానందవిగ్రహమునై యున్నాడు.

శ్రీరాధ శ్రీకృష్ణునకు దనప్రాణములకంటె నధికప్రియురాలైన పరమసౌభాగ్యసంపన్న.

మహావిష్ణోః ప్రసూః సా చ మూలప్రకృతి రీశ్వరీ ॥ (51)

ఎవనిరోమకూపములందు దీ యసంఖ్యాకవిశ్వములు వర్తమానములై యున్నవో, "యామహావిష్ణువునకు మూలప్రకృతి యీశ్వరి శ్రీరాధయే జనని యని తెలిసికొనుము". మహాత్ములు సదా శ్రీరాధామానినీసేవలందు సంలగ్నులై యుందురు. బ్రహ్మాదిదేవతలకేని బరమదుర్లభము లైన శ్రీరాధాచరణారవిందములు భక్తజనులకు సదా సులభములు. దేవీ! సుదామునిశాపమును మన్నించుటకే శ్రీరాధ దివ్యగోలోకపరంధామమునుండి భువికి దిగివచ్చి వైశ్యశ్రేష్ఠు డైనవృషభానునికొమార్తెగ ఆయనగృహములో సాక్షాత్కరించెను. రాధకుమాత యైనసౌభాగ్యవతినామధేయమే కళావతి.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణ
సంవాదమున రాధోత్పత్తికథనమను
నలుబదియొనిమిదవ అధ్యాయము
సంపూర్ణము.

—♦—

# నలుబదితొమ్మిదవ అధ్యాయము

## శ్రీరాధాకృష్ణ దివ్యచరిత వర్ణనము

**పార్వతీదేవి పలికెను :**

హృదయేశ్వరా! సకలజగన్మాతకు సుదామునిశాప మెట్లు సంభవించెనో వర్ణింప బ్రార్థించుచున్నాను.

**మహాదేవుడు పలికెను :**

సర్వపురాణములందు గోప్యము, శుభదము, భక్తి ముక్తిప్రదమైన పరమాద్భుతరహస్యచరితమును బ్రవచించెద శ్రవణమొనరింపుము. పార్వతీ! ఒకానొకసమయమున దివ్యగోలోకపరంధామములో శతశృంగగిరిప్రదేశములో బృందావనాంతర్గతరాసమండలములో రాధికేశ్వరుడు రాధికాసమాన, సౌభాగ్యవతియైనవిరజ యనుగోపికతో రాసక్రీడలందు సంలగ్నుడయ్యెను. లక్ష మన్వంతరములకాలపర్యంత మారాధావల్లభుడు విరజాదేవితో దివ్యరాసక్రీడ నొనరించెను. శైలకన్యకా! జన్మాదిరహితమైనదివ్యగోలోకపరంధామములో నాకాల మత్యంతస్వల్పము. తనసఖులద్వారమున శ్రీకృష్ణరహస్యరాసక్రీడా వృత్తాంతము దెలిసికొని జగన్మాత శ్రీరాధ క్రుద్ధురాలై దివ్యరథము నధిరోహించి గోపీజనపరివేష్టితయై తనయంతఃపురమును వీడి రాసమండలమున కరుదెంచెను. మూలప్రకృతి యగుశ్రీరాధ కోపానలమునకు గురియైనవిరజా గోపిక నదీరూపముగ బరిణామమొంది గోలోకపరంధామములో బ్రవహించెను. ఆదివ్యనదివిస్తీర్ణము కోటియోజనములు, పొడవంతకంటే పంద రెట్లు. గోలోకమును బరివేష్టించి యాదివ్యనది ప్రవహింపదొడంగెను. విరజాదేవిసఖులైనగోపిక లందఱుగూడ నదులై ప్రవహించిరి. శ్రీకృష్ణునియనుగ్రహమున నదీస్వరూపిణియైన విరజాదేవినుండి సప్తసముద్రము లావిర్భవించినవి. సుందరీ! విశ్వమందు గలసకలసరిత్తులు నీవిరజాదేవియంశోద్భవములే.

పార్వతీ! శ్రీరాధ శ్రీకృష్ణుని జేరి ప్రణయకోపముతో నాజగన్నాథు ననేకనిష్ఠురోక్తు లాడనారంభించెను. అది గాంచి పరమాత్మ యనన్యభక్తుడైనసుదాముడు రాధాదేవిని నిరోధింపయత్నింపగా నాజనని లీలాపూర్వకముగ నసురుడవు కమ్మని భక్తు నాదేశించెను. సుదాముడుకూడ భగవత్సంకల్పము వలన బ్రేరితుడై యవనిపై నవతరింపుమని శ్రీరాధను శపించెను. తదనంతరము సుదాముడు తన మాతాపితలైనశ్రీరాధాకృష్ణులకు బ్రణామము లర్పించి గోలోకమును వీడుట కుద్యుక్తుడుకాగా శ్రీరాధ పుత్రవియోగమును భరింపలేక యశ్రుపూర్ణనయనములతో దనశోకమును బ్రకటించెను. శ్రీకృష్ణుడు వారి నిర్వురిని సమాధానపఱచి త్వరలో శాపవిముక్తులై గోలోకమునకు మరల నరుదెంచగలరని యనుగ్రహించెను. దేవీ! ఆసుదాముడే తులసీదేవికి

స్వామి యైనశంఖచూడు డనుమహాదైత్యుడుగ జన్మించి నాత్రిశూలప్రహారముచే విదీర్ణుడై శాపవిముక్తి నొంది మరల దివ్యగోలోకపరంధామము జేరెను.

రాధా జగామ వారాహే గోకులం భారతం సతీ ।

సతీ రాధ యీవరాహకల్పములోనే పవిత్రభారతవర్షములో విరాజిల్లు గోకులములో నవతరించెను.

వృషభానోశ్చ వైశ్యస్య సా చ కన్యా బభూవ హ ॥
అయోని సంభవా దేవీ వాయుగర్భా కలావతీ ।
సుషువే మాయయా వాయుం సా తత్రాఽవిర్బభూవ హ ॥
అతీతే ద్వాదశాబ్దే తు దృష్ట్వా తాం నవయౌవనామ్ ।
సార్థం రాయణవైశ్యేన తత్సంబన్ధం చకార సః ॥
ఛాయాం సంస్థాప్య తద్గేహే సాఽన్తర్థాన మవాప హ ।
బభూవ తస్య వైశ్యస్య వివాహ శ్ఛాయయా సహ ॥ (౩౧-౪౦)

ఆమె వ్రజములో వృషభాను డనువైశ్యశ్రేష్ఠుని కొమార్తెగా నవతరించెను. శ్రీరాధ తల్లిగర్భమునుండి జన్మింపలేదు. ఆమె యయోనిసంభవ. రాధామాత కళావతి తనగర్భములో వాయువునుమాత్రమే ధరించెను. ప్రసవకాలమున గళావతి యోగమాయాప్రేరణముచే వాయువునే జన్మింపజేసెను. జగజ్జనని యగుశ్రీరాధ తనంతటతానే కళావతిసమక్షమున నావిర్భవించి దివ్యదర్శన మొసంగెను. పండ్రెండువర్షములు గడవగనే రాధ నవయౌవనవంతయగుటగాంచి యామెతలిదండ్రులు రాయణు డనువైశ్యశ్రేష్ఠునితో (ఆయన శ్రీమన్నారాయణునియంశోద్భవుడు) సంబంధము నిశ్చయించిరి. ఆసమయములో శ్రీరాధాదేవిగృహములో తనఛాయను దనరూపమున స్థాపించి స్వయముగ నంతర్థానమయ్యెను. ఆఛాయనే రాయణుడు వివాహమాడెను.

గోకులములో నవతరించి తనకై యెదురుచూచుశ్రీరాధాదేవిని జేరుటకే శ్రీకృష్ణుడు శైశవావస్థలో గంసభయమునుండి తన్ను దాను రక్షించుకొనుచున్నా ననెడునెపముతో దండిద్వారమున గోకులమును జేరెను. గోకులములో శ్రీకృష్ణునిమాత యైనయశోదాదేవిసహోదరుడే యీరాయణుడు. గోలోకములో శ్రీకృష్ణునిపార్షదు డైనరాయణగోపకుమారు డీయవతారసమయమున భూతలముపై శ్రీకృష్ణునిమేనమామగా నవతరించెను. జగత్స్రష్ట

యగువిధాత స్వయముగ బౌరోహిత్యము వహించి పుణ్యక్షేత్రమైనబృందా వనములో శ్రీరాధాకృష్ణులదివ్యకళ్యాణమునుసంపన్న మొనరించెను. శ్రీరాధా దేవి దివ్యపాదారవిందములను గోపకుమారులైనను దర్శింపలేరు. ఆమె స్వయముగ శ్రీహరివక్షఃస్థలమందే సదా విరాజిల్లును. ఆమెఛాయయే రాధగ రాయణమందిరములో సకలగోపగోపికలకు గోచరించినది. పూర్వకాలమున శ్రీరాధాదివ్యచరణారవిందదర్శనార్థమైజగద్విధాతయగుబ్రహ్మ పుష్కరక్షేత్ర ములో నరువదివేలదివ్యసంవత్సరములు ఘోరతప మొనరించెను. ఆయఖండ తపఃఫలప్రభావముననే గోకులములో శ్రీరాధాకృష్ణకళ్యాణశుభసమయమున బ్రహ్మదేవునకు శ్రీరాధాదేవి దివ్యచరణారవిందసందర్శనసౌభాగ్యము కల్గెను. గోకులేశ్వరుడైన శ్రీకృష్ణపరమాత్మ కొంతకాలము శ్రీరాధతో నామోదప్రమోదము లొనరించెను. తదనంతరముసుదామునిశాపమునుమన్నిం చుట కాసకలజగజ్జననీజనకులు కొంతకాలము బాహ్యావియోగ మనుభవించిరి. ఈవియోగకాలములోనే శ్రీకృష్ణపరమాత్మ పృథ్వీభారమును దొలగించెను. నూఱుసంవత్సరములవియోగము పరిపూర్ణము కాగానే తీర్థయాత్రాసమయ ములో శ్రీరాధాకృష్ణులపునఃసమాగమము సంభవించెను. విఘ్నరాజజననీ! శ్రీరాధాకృష్ణులు నందయశోదలను, వృషభానుకళావతులను, సకలగోపగోపీ సముదాయమును దోడ్కొని యవనిని వీడి గోలోకపరంధామము జేరిరి.

మహామాయా! ప్రజాపతియగుద్రోణుడే నందుడుగ నవతరించెను. ద్రోణ పత్నియే యశోదగ నవని కరుదెంచెను. ఆదంపతులు తమ యఖండతపఃప్రభావ మున శ్రీకృష్ణునే బుత్రునిగ బడసి జన్మరాహిత్యమొందిరి. దేవీ! కశ్యపప్రజా పతియే వసుదేవుడు, ప్రజాపతి యర్థాంగియే దేవకి. ప్రతికల్పమందు భగవంతు డవతరింపవలెనని సంకల్పింపగ దేవమాత యదితి, దేవపిత కశ్యపుడు నాపరం ధామునితల్లిదండ్రులస్థానమును గ్రహింతురు. ఆదిశక్తీ! శ్రీరాధామాత యైన కళావతి పితరులమానసీకన్య. గోలోకనివాసి యైనవసుదాము డనుగోపశ్రేష్ఠుడే వృషభానుడై యవనిపై కరుదెంచెను.

దుర్గా! యిట్లు నేను సంక్షిప్తముగ శ్రీరాధాదేవి దివ్యోపాఖ్యానమును వర్ణించితిని. ఈయుపాఖ్యానశ్రవణ మఖండసంపత్తిప్రదాయకము, పాపహారము, పుత్రపౌత్రాభివృద్ధిప్రదము.

శ్రీకృష్ణపరమాత్మ రెండురూపముల విభక్తుడైనాడు. ఆయన దక్షిణార్థ

భాగము శ్రీకృష్ణుడుగ శేషింపగా, వామపార్శ్వము చతుర్భుజరూపమున సాక్షాత్కరించెను. చతుర్భుజరూపధారి వైకుంఠములో నివసింపగా ద్విభుజరూపధారి శ్రీకృష్ణుడు గోలోకములో విరాజిల్లును. చతుర్భుజుడైన శ్రీమన్నారాయణుని దేవేరులే శ్రీమహాలక్ష్మి, సరస్వతి, గంగ, తులసి. శ్రీకృష్ణునియర్థాంగమునుండి ప్రాదుర్భవించిన శ్రీరాధయే పరమాత్మకు బత్నియైనది. తేజమందు, సమవస్థయందు, రూపమందు, గుణములందు, సకలవిషయములందు శ్రీరాధ శ్రీకృష్ణపరమాత్మకు సమాన.

ఆదౌ రాధాం సముచ్చార్య పశ్చా త్కృష్ణం వదే ద్బుధః ।
వ్యతిక్రమే బ్రహ్మహత్యాం లభతే నాత్ర సంశయః ॥ (59)

విద్వాంసులు మొదట శ్రీరాధానామ ముచ్చరించియే కృష్ణనామోచ్చారణ మొనరింపవలెను. ఈక్రమము నతిక్రమించినవారలకు నిస్సంశయముగ బ్రహ్మహత్యాపాతకము సంభవించును.

కార్తికపూర్ణిమనాడు గోలోకరాసమండలములో స్వయముగ శ్రీకృష్ణపరమాత్మయే శ్రీరాధాదేవి పూజ యొనరించి మహోత్సవము గావించెను. శ్రీరాధాకవచములను రత్నగుటికలం దుంచి సకలగోపగోపికలు, స్వయముగ శ్రీహరితమకంఠమందు దక్షిణభుజమందు ధరించిరి. మధుసూదనుడు రాధాచర్వితతాంబూలమును స్వయముగ స్వీకరించి భుజించెను.

రాధా పూజ్యా చ కృష్ణస్య తత్పూజ్యో భగవాన్ ప్రభుః ।
పరస్పరాభీష్టదేవో భేదకృ న్నరకం వ్రజేత్ ॥ 63

శ్రీరాధ శ్రీకృష్ణునకు బూజనీయురాలు, శ్రీకృష్ణపరమాత్మ శ్రీరాధకు బూజనీయుడు. వారిర్వురు పరస్పరారాధకులు, ఆరాధ్యులైనయిష్టదైవములు. శ్రీరాధాకృష్ణులలో భేదభావము వహించువారు నరకము నొందగలరు.

శ్రీకృష్ణునియనంతరము ధర్మదేవుడు, బ్రహ్మ, నేను (మహాదేవుడు), అనంతుడు, వాసుకి, సూర్యుడు, మహేంద్రుడు మొదలుగాగలసకలదేవతలు శ్రీరాధను బూజించితిమి. వీరందఱు ప్రథమావరణపూజకులైరి. తదనంతరము రుద్రగణములు, మనువులు, మనుపుత్రులు, దేవేంద్రగణములు, మునీంద్రగణములు, శ్రీరాధ నారాధించిరి. వీరందఱు ద్వితీయావరణపూజకులైరి.

తృతీయావరణములో సకలవిశ్వములందు గలమానవులు సప్తద్వీపసమాశ్రితైన సుయజ్ఞుడు, తత్పుత్రులు, పౌత్రులు, మిత్రులు పవిత్రభారతవర్షములో బ్రసన్నతాపూర్వకముగ శ్రీరాధాదేవి నారాధించిరి.

సుయజ్ఞుడు దురదృష్టవశమున నొకబ్రాహ్మణుని శాపమునకు గురియై రోగగ్రస్తహస్తయుక్తుడై యత్యంతదుఃఖితు డయ్యెను. రాజ్యభ్రష్టుడైనయాచక్రవర్తి బ్రహ్మ ప్రసాదించిన దివ్యస్తోత్రముతో శ్రీరాధను స్తుతించి యామెయభేద్యకవచమును గంఠప్రదేశమున ధరించి పుష్కరతీర్థములో నూఱుసంవత్సరము లేకాగ్రమనముతో శ్రీరాధనారాధించెను. సుయజ్ఞప్రభుడు శ్రీరాధానుగ్రహమునకు బాత్రుడై, పరిపూర్ణారోగ్యవంతుడై మరల సప్తద్వీపవతి యగుపృథ్వికి నధిపతియై పెద్దకాలము సుఖించి యంత్యకాలమున దివ్యవిమాన మధిరోహించి గోలోకపరంధామము జేరెను. పార్వతీ! శ్రీరాధాప్రసంగమును వర్ణించితిని. నీ విక నేవిషయములను శ్రవణ మొనరింపగోరెదవో తెల్పుము.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణ
సంవాదమున రాధాదేవి సుదామునకు
శాపమొసంగుట యనునలువది
తొమ్మిదవ అధ్యాయము
సంపూర్ణము.

# ఏబదియవ అధ్యాయము

## సుయజ్ఞమహారాజోపాఖ్యానము

పార్వతీదేవి పలికెను:

ప్రభూ! సుయజ్ఞమహారాజెవ్వరు? ఏవంశమం దాయన జన్మించెను? ఆజననాథునకు బ్రాహ్మణశాప మెట్లు సంభవించెను? ఆనరేశ్వరు డెట్లు శ్రీరాధాకృపాకటాక్షములకు బాత్రుడైనాడు? ఏదేవి సర్వాత్మకు డైన శ్రీకృష్ణునిపత్నియో, శ్రీకృష్ణపరమాత్మ యేదేవిని స్వయముగ బూజించెనో యట్టిశ్రీరాధాసేవాసౌభాగ్య మొకమలమూత్రధారి యైనక్షుద్రమానవున కెట్లు సంప్రాప్తించెను? ఏదేవీదివ్యచరణారవిందములధూళిని బొందుటకు బ్రహ్మదేవుడు పూర్వకాలమున బుష్కరతీర్థములో నఱువదివేలదివ్యసంవత్సరములు తపమొనరించెనో, యేదేవీదివ్యసందర్శనము తమకైన నత్యంతదుర్లభమో, సనాతని శ్రీమహాలక్ష్మి యగు నా శ్రీరాధాదేవీదివ్యసందర్శనాఖండసౌభాగ్యము సుయజ్ఞున కేతపములవలన బ్రాప్తించెను? ప్రాణనాథా! ఆసచ్చిదానందస్వరూపిణి మనుష్యునిదృష్టి కెట్లు గోచరించెను? జగత్స్రష్ట బ్రహ్మ సుయజ్ఞునకు శ్రీరాధాకవచ మెట్లు ప్రసాదించెను? ఆమె ధ్యానమును, పూజావిధానమును, స్తోత్రమును విధాత యెట్లుపదేశించెను? నాయీసందేహముల నన్నింటిని నివారింపవలసినదిగ బ్రార్థించుచున్నాను.

మహాదేవుడు పలికెను:

దేవీ! పదునల్వురు మనువులలో నగ్రగణ్యు డైనప్రథమమనువునే స్వాయంభువమను వందురు. ఆయన బ్రహ్మపుత్రుడు, మహాతపోధనసంపన్నుడు. ఆమహాత్ముడు శతరూప యనుసౌభాగ్యవతిని బరిణయమాడెను. శతరూపామనువులకు గల్గినకుమారుడే యుత్తానపాదుడు. ఉత్తానపాదునిపుత్రరత్నమే పరమభాగవతోత్తము డైనధ్రువచక్రవర్తి. గిరిరాజనందినీ! ధ్రువునిసత్కీర్తి సమస్తవిశ్వమందు వ్యాపించెను. శ్రీమన్నారాయణునకనన్యభక్తు డైనయుత్కళరాజు ధ్రువకుమారుడే. ఉత్కళుడు పుష్కరతీర్థములో సహస్రరాజసూయయజ్ఞముల నొనరించెను. ఆయజ్ఞములం దుపయోగింపబడినసకలసామగ్రి, పాత్రలు రత్ననిర్మితములు. రా జత్యంతప్రసన్నుడై బ్రాహ్మణులకు యజ్ఞాంత

మహోత్సవములో నాయమూల్యరత్నవస్తువులను, బహుమూల్యవస్త్రరాసులను, ననేకసంపదలను, సువర్ణములను బ్రాహ్మణులకు దానమొనరించెను. ప్రియా! చారుశీలా! ఆసుందరయజ్ఞమును గాంచి బ్రహ్మదేవు డత్యంతప్రసన్నుడై దేవసభామధ్యమున నుత్కళుని సుయజ్ఞు డని కీర్తించెను. నాటినుండి యుత్కళునినామము సుయజ్ఞు డయ్యెను. దేవీ! సుయజ్ఞుడు నిత్యము నన్నమును, రత్నములను, సకలవస్తుసామగ్రులను, ననేకసంపదలను దానమొనరింప నారంభించెను. ఆ రాజు ప్రతిదినము లక్షలకొలదిగోవులను దక్షిణాసహితముగ బ్రాహ్మణులకు దానమొనరించి వారలను తృప్తిపఱచును. నిత్యము పాకశాస్త్రప్రవీణులు వివిధభోజ్యపదార్థములను వండుచు నూఱుకోట్ల బ్రాహ్మణులకు సంతర్పణ మొనరింతురు. విప్రు లందఱు సుయజ్ఞునిసత్కారముల కత్యంతసంతుష్టులై భోజనసమయములో మనువంశోద్భవు డైనసుయజ్ఞుని, దత్పితరులను బ్రస్తుతింతురు. పార్వతీ! సుయజ్ఞుడు యజ్ఞమారంభించి ముగించులోపల ముప్పదియాఱులక్షలకోట్లబ్రాహ్మణులు తృప్తిగా భుజించి రాజు నాశీర్వదించిరి. సుయజ్ఞు డొసంగినయపారదక్షిణలను వారు వాహనములపై నెక్కించి తమతమస్థలములకు జేర్చుకొనవలసివచ్చెను. బ్రాహ్మణు లందఱు రాజు తమకొసంగినయపారధనరాసులను మోయలేక మార్గమధ్యముననే శూద్రులకు గొంతభాగము ప్రసాదించిరి. ఇంచుక బ్రాహ్మణులు, తదితరులు భుజించినను దరుగనియన్నరాసులట్లే శేషించినవి.

ఇంతవైభవముతో రాజసూయయజ్ఞములను బరిసమాప్త మొనరించి ప్రసన్నచిత్తముతో సుయజ్ఞుడు రత్ననిర్మితసింహాసన మలంకరించి సభామధ్యమున గొలువుదీరియుండెను. ఆరాజసభలో వసువులు, వాసవులు, చంద్రేంద్రాదిదేవతలు, నాదిత్యగణములు, దేవర్షి నారదుడు, మహర్షులు విరాజమానులై యుండిరి. ఆసమయమున నాప్రదేశమునకు శుష్కకంఠోష్ఠతాలుకు డైనబ్రాహ్మణోత్తము డరుదెంచి సస్మితముఖారవిందముతో రత్నసింహాసనము నధిరోహించి పుష్పమాలాచందనచర్చితుడై యున్న సుయజ్ఞరాజు నాశీర్వదించెను. రాజుకూడ బ్రాహ్మణోత్తమునకు నమస్కరించెనుగాని సింహాసనమునుండి లేచి నిలువబడి గౌరవింపలేదు. సభాసదులు కూడబ్రాహ్మణుని గాంచినతోడనేనిలువబడి గౌరవింపరైరి. అప్పు డా బ్రాహ్మణశ్రేష్ఠుడు ఆరాజసభలో దనకు గల్గినయవమానమునకు గినుక

వహించి రాజు నిట్లు శపించెను "ఓరీ! పామరా! నీవు రాజ్యభ్రష్టుడవై శ్రీహీనుడ వయ్యెదవు. నీకు కుష్ఠవ్యాధి సంభవించుగాక! నీవు బుద్ధిహీనుడవై యుపద్రవములందుబడి దుఃఖించెదవుగాక!" రాజుతోగూడ సభాసదు లందఱు గడగడవణకుచు దమతప్పిదమును దెలిసికొని యాసనములపైనుండి లేచి నిలువ బడి బ్రాహ్మణునకు బ్రణామము లర్పించిరి. కోపించిన బ్రాహ్మణోత్తముడు బ్రహ్మతేజఃప్రకాశభాసమానుడై యాసభాభవనమును వీడి బయలుదేరెను. ఆబ్రాహ్మణోత్తముని వెనువెంట సకలమహర్షిగణములు బయలుదేరి 'విప్రోత్తమా! ఆగుమాగు' మని, యుచ్చస్వరములతో బిలువనారంభించిరి.

పులహుడు, పులస్త్యుడు, ప్రచేతసుడు, భృగువు, అఙ్గిరుడు, మరీచి, కశ్యపుడు, వశిష్ఠుడు, క్రతువు, శుక్రుడు, బృహస్పతి, దుర్వాసుడు, లోమశుడు, కణాదుడు, కణ్వుడు, కాత్యాయనుడు, కఠుడు, పాణిని, జాజలి, ఋష్యశృఙ్గుడు, విభాండకుడు, ఆపిశలి, తైత్తిరి, మార్కండేయుడు, ఓఘుడు, పైలుడు, సనకసనందనసనాతనసనత్కుమారాదులు, నరనారాయణఋషులు, పరాశరుడు, జరత్కారువు, సంవర్తకుడు, కరథుడు, ఔర్వుడు, చ్యవనుడు, భరద్వాజుడు, వాల్మీకి, అగస్త్యుడు, అత్రి, ఉతథ్యుడు, ఆస్తీకుడు, ఆసురి, శిలాలి, లాఙ్గలి, శాకల్యుడు, శాకటాయనుడు, గర్గమహర్షి, వాత్స్యుడు, పంచశిఖుడు, జమదగ్ని, దేవలుడు, జైగీషవ్యుడు, వామదేవుడు, వాలఖిల్యాదిమహర్షులు, శక్తి, దక్షుడు, కర్దముడు, ప్రసన్నుడు, కపిలుడు, విశ్వామిత్రుడు, కౌత్సుడు, ఋచీకుడు, అఘమర్షణుడు మొదలగువారు, పితరులు, అగ్ని, హరిప్రియులు, దిక్పాలకులు, సమస్తదేవతలు, నాబ్రాహ్మణుని వెనువెంట జనిరి. పార్వతీ! ఆనీతివిశారదు లందఱు బ్రాహ్మణు నాసభాస్థలి వీడకుండ నిలువరించి క్రమముగ నీతిసమ్మత వచనములచే నాయనకోపోపశమన మొనరింపదొడంగిరి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణసంవాద
మున సుయజ్ఞోపాఖ్యాన మను
ఏబదియవ అధ్యాయము
సంపూర్ణము.

# ఏబదియొకటవ అధ్యాయము

## ఋషులు పాపకర్మల కర్మవిపాకములను వర్ణించుట

పార్వతీదేవి పలికెను :

ప్రభూ! మహానీతిసంపన్నులైన బ్రాహ్మణులు, బ్రహ్మపుత్రులు నాసమయమున నేయేనీతివచనములను బల్కి యాబ్రాహ్మణోత్తముని శాంతింపజేసిరి?

మహాదేవుడు పలికెను :

వరాననా! ఆమహర్షి సముదాయ మొనరించిన స్తుతులకు, వినయప్రదర్శనమునకు బ్రాహ్మణోత్తము డత్యంతసంతుష్టు డయ్యెను. అపుడు వా రా బ్రాహ్మణోత్తమునితో క్రమముగ నిట్లు సంభాషింప నారంభించిరి.

సనత్కుమారుడు పలికెను :

బ్రాహ్మణోత్తమా ! రాజ్యలక్ష్మి, కీర్తి రాజును వీడి నీవెనువెంట బయలుదేరినవి. సత్త్వము, యశము, సుశీలత్వము, మహైశ్వర్యాదులు, పితరులు, అగ్ని, దేవతలు రాజును శ్రీహీనునిగ నొనరించి యాయన గృహమును వీడి బయల్వెడలిరి. బ్రాహ్మణులు శీఘ్రముగ ప్రసన్నులగువారు గావున కోపమును వీడి ప్రసన్నుడవు గమ్ము. మునీశ్వరా! బ్రాహ్మణులహృదయము నవనీతమువలె కోమలము. వారు తపోధనసంపన్నులైనకారణమున నత్యంతనిర్మలులై పరిశుద్ధులుగ నుందురు, కావున విప్రప్రవరా! ఇక రాజును క్షమించి రాజగృహమును బవిత్ర మొనరింపుము.

భృగువు పలికెను :

ఎవనిగృహమునుండి యతిథి నిరాశతో మరలిపోవునో దేవతలు, పితరులు, అగ్ని మొదలగువా రందఱు నతిథిసత్కరింపబడలేదని కినుక వహించి వానిగృహమును వీడిపోగలరు. కావున విప్రవరా! రాజును క్షమింపుము. మరల దయచేసి రాజభవనమును బవిత్ర మొనరింపుము.

పులస్త్యుడు పలికెను :

గృహమున కేతెంచిన యతిథిని వక్రదృష్టితో వీక్షించు వారలకు నతిథి తనపాపము నొసంగి పుణ్యమును గ్రహించి మరలిపోవును. కావున బ్రాహ్మణోత్తమా రాజును క్షమింపుము. రాజు తనప్రారబ్ధమునకు వశుడై లేచి నిలువబడి నిన్ను గౌరవింపలేకపోయెను. వానియీయపరాధమును నీవు క్షమింపక తప్పదు.

పులహుడు పలికెను :

రాజ్యలక్ష్మీమదముతో సద్బ్రాహ్మణు నవమానించు క్షత్రియులు శ్రీహీనులు కాగలరు. విద్యామదముతో సద్బ్రాహ్మణుడైనయతిథి నవమానించు బ్రాహ్మణులు త్రికాలసంధ్యాశూన్యులై యపవిత్రులు కాగలరు. వీ రేకాదశీవ్రతఫలమునుండి విష్ణునైవేద్యమునుండి వంచితులు కాగలరు. విప్రేంద్రా! రాజును క్షమించి మరల నృపాలయమును బ్రవేశించి యాప్రదేశమును శుద్ధ మొనరింపుము.

క్రతువు పలికెను :

బ్రాహ్మణులైనను, క్షత్రియులైనను, వైశ్యులైనను, శూద్రులైనను నతిథి నవమానించిన దీక్షాహీనులై యధికారభ్రష్టులు కాగలరు. అంతియే కాదు; వారు నిశ్చయముగ ధనహీనులు, పుత్రహీనులు, భార్యాహీనులునై దుఃఖింపగలరు. కావున రాజును క్షమించి రాజగృహమును పవిత్ర మొనరింపుము.

ఆంగిరసుడు పలికెను :

జ్ఞానవంతుడైనబ్రాహ్మణుడైయుండి బ్రాహ్మణాతిథి నవమానించిన నతడు సప్తజన్మములవఱకు శకటమును లాగువృషభమై దుఃఖింపగలడు.

మరీచి పలికెను :

పుణ్యక్షేత్ర మైనభారతవర్షములో దేవతలను, బ్రాహ్మణులను, ఆచార్యుని నవమానించు యభాగ్యులు విష్ణుదేవునిభక్తినుండి వంచితులు కాగలరు.

కశ్యపుడు పలికెను :

బ్రాహ్మణుల నవమానించు వైష్ణవులు విష్ణుమంత్రదీక్షనుండి వంచితులై విష్ణుపూజావిహీనులు కాగలరు.

ప్రచేతసుడు పలికెను :

అతిథిరాకను గాంచి లేచినిలువబడి గౌరవించిఅభ్యుత్థానమొనరింపని వారు భారతభూమిలో మాతృపితృభక్తిహీను లయ్యెదరు. ఆమూఢులు సప్తజన్మములపర్యంతము గజయోనియందు బరిభ్రమించెదరు. కావున ద్విజశ్రేష్ఠా! రాజగృహమును బ్రవేశించి రాజు నాశీర్వదింపుము.

దుర్వాసుడు పలికెను :

ఆచార్యుని, బ్రాహ్మణుని, దైవప్రతిమను గాంచగనే తలవంచి నమస్కరింపని వారు పృథ్విపై సూకరములై జన్మింపగలరు. కావున ద్విజశ్రేష్ఠా! మాయపరాధముల నన్నిటిని క్షమించి మరల రాజగృహమును ప్రవేశించి, యతిథిసత్కారమును గ్రహింపుము.

సుయజ్ఞుడు పలికెను :

మహానుభావులారా! మీ రందఱు మహర్షిశ్రేష్ఠులు, ఏదో యొకనెపముతో ప్రజలకు ధర్మోపదేశ మొనరించుటయే మీస్వభావము. కావున మూర్ఖుడ నైన నాపం దేహముల నివారింపవలసినదిగా మిమ్ములను బ్రార్థించుచున్నాను. మహర్షులారా! స్త్రీహత్య యొనరించినవారికి, గోహత్యనొనరించిన వారికి, కృతఘ్నులకు, గురుపత్నీగాములకు, బ్రహ్మహత్య నొనరించినవారికి నేయేపాపములు సంభవించును? ఆపాపపరిహారములగూడ వచింపుడు.

వశిష్ఠుడు పలికెను :

రాజా! గోవధ నొనరించినపాపి ప్రాయశ్చిత్తముకొఱకు నొకసంవత్సరము పాపపరిహారార్థమై తీర్థముల సేవింపవలెను. యవధాన్యాహారమునే గ్రహించుచు, హస్తములతోనే జలములను ద్రాగవలెను. ఇట్లొకసంవత్సరము నియమముగ గడపి బ్రాహ్మణులకు దక్షిణాసహితముగ క్షీరములను బ్రసాదింపగల మూఁడుమంచిగోవులను దానముచేయవలెను. ఈప్రాయశ్చిత్తముతో గొంత

పాపము క్షీణించినను పాపి సంపూర్ణ పాపములనుండి విముక్తి నొందలేడు. శేషించినపాపఫలప్రభావమున నతడు చండాలుడై దుఃఖింపగలడు. గోవధతో సమానమైనపాప మాచరించినపాపకర్ములు సాక్షాద్గోవధపాపములో నర్ధఫల మనుభవింపవలెను. ప్రాయశ్చిత్తమువలన వారిపాపము కొంతయే క్షీణించును. ఆ పాపులు శేషపాపఫల మనుభవింపక తప్పదు.

శుక్రుడు పలికెను :

స్త్రీహత్య నొనరించినవారికి నిశ్చయముగ గోహత్యకంటె ద్విగుణీకృతపాపము సంభవించును. స్త్రీహత్య యొనరించినపాపి వేనవేలు సంవత్సరములు కాలసూత్ర మనునరక మనుభవింపవలెను. తదనంతర మాపాపు లేడుజన్మములలో సూకరములై జన్మించి మఱియేడుజన్మములలో సర్పములై తుదకు పాపవిముక్తు లయ్యెదరు.

బృహస్పతి పలికెను :

బ్రహ్మహత్యవలన స్త్రీహత్యకంటె ద్విగుణీకృతపాపము సంభవించును. బ్రహ్మహత్యాపాతకు డనేకలక్షలసంవత్సరములు నిశ్చయముగ మహాభయంకర కుంభీపాకనరక మనుభవింపవలెను. తదనంతర మామహాపాతకుడు నూఱుసంవత్సరములు మలకీటకమై, యేడుజన్మములవఱకు సర్పమై తుదకు పాపవిముక్తుడు కాగలడు.

గౌతముడు పలికెను :

రాజేంద్రా! కృతఘ్నునకు బ్రహ్మహత్యాపాతకముకంటె నాల్గురెట్లధిక పాపము సంభవించును. వేదములందుగూడ కృతఘ్నులకు ప్రాయశ్చిత్తము ప్రవచింపబడలేదు.

సుయజ్ఞ రాజు పలికెను :

వేదవేత్తలందు శ్రేష్ఠులైనమహర్షులారా! నాకు కృతఘ్నులలక్షణములను వర్ణింపుడు. కృతఘ్నులం దెన్నిభేదములు కలవు? వారిలో నెవరెవరి కేయేదోషములు సంప్రాప్తించును?

ఋష్యశృంగుడు పలికెను :

రాజా! సామవేదమందు కృతఘ్నులు పదునాఱుతెగలవారు కలరని ప్రవచింపబడెను. వా రందఱు వారివారికర్మఫలానుసారముగ నరకములను నుభవింపకతప్పదు. సత్కర్మము లొనరించువారలకు, సత్యవ్రతపరాయణులకు, పుణ్యాత్ములకు, స్వధర్మనిరతులకు, తాపసులకు, ప్రతిజ్ఞాపరిపాలకులకు, దానశీలురకు, స్వగోష్ఠీపరిపాలకులకు, గురుకృత్యములకు, ద్విజపూజనాదులకు, నిత్యకృత్యములకు, విశ్వాసమునకు, పరధర్మమునకు, పరప్రదానమునకు, గామ్యకృత్యమునకు నెవ రెగ్గొనరింతురో, యాకృత్యములలో సంలగ్నులై యున్న వారిని వధింతురో యట్టిపాపాత్ములే కృతఘ్ను లనబడిరి. ఈపాపాత్ములు వివిధ నరకముల ననుభవించి యసంఖ్యాకక్షుద్రయోనులందు పరిభ్రమింపగలరు.

సుయజ్ఞ రాజు పలికెను :

ప్రభూ! ఏయేకర్మల నొనరించి మానవులు కృతఘ్ను లయ్యెదరు? ఆ కృతఘ్ను లేయేనరకముల ననుభవింపవలెను? ఈవిషయముల నన్నింటిని ప్రవచింపగా ప్రార్థించుచున్నాను.

కాత్యాయనుడు పలికెను :

శపథమొనరించి దానిని పాలింపక సత్యభంగ మొనరించువారు కృతఘ్నులై నాలుగుయుగములపర్యంతము కాలసూత్ర మనునరకము ననుభవింపగలరు. తరువాత నేడేడుజన్మములవఱకు గాకములై, గుడ్లగూబలై మఱి యేడుజన్మములవఱకు మహారోగగ్రస్తులై దుఃఖింపగలరు. తదనంతరమే వారిపాపము క్షీణించును.

పిదప సనందనుడు, సనాతనుడు, పరాశరుడు, భరద్వాజుడు, విభాండకుడు విభిన్నకృతఘ్నులను వర్ణించి వారిదుర్గతులను వర్ణించిరి. తదనంతరము మార్కండేయమహర్షి కూడ కృతఘ్నులైన బ్రాహ్మణులపాపఫలములను వర్ణించెను. సుయజ్ఞరాజు మరల మహర్షిమండలి నిట్లు ప్రార్థించెను.

సుయజ్ఞ రాజు పలికెను :

మహర్షులారా! అన్యకృతఘ్నులకర్మఫలములనుగూడ కృపతో వర్ణింపుడు. ఈబ్రాహ్మణోత్తమునిశాపము నా కత్యంతశుభప్రద మైనది. ఈ ద్విజుని

శాపమువలననే నాకు మీవంటివారి సత్సాంగత్యము లభించెను. విపత్తులందు బడనిదే యెవరికి సంపత్తి లభించును? నేను ధన్యుడనైతిని. కృతకృత్యుండనైతిని. నాజీవనము సఫలమైనది. ఎందువలననగా నేడు నాకు మహర్షుల దివ్యోపదేశములను శ్రవణమొనరించుసౌభాగ్యము కల్గినది.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణ
సంవాదమున కర్మవిపాకనిరూపణ మను
ఏబదియొకటవ అధ్యాయము
సంపూర్ణము.

---

# ఏబదిరెండవ అధ్యాయము

## కర్మవిపాకవర్ణనము

నారదుడు పలికెను :

ప్రభూ! అన్యకృతఘ్నుల కేయే ఫలములు ప్రాప్తింపగలవు? ఆవేద వేదాంగపారంగతులైనవిద్వాంసు లీవిషయములో రాజున కేమని ప్రవచించిరి?

మహేశ్వరుడు పలికెను :

ప్రియా! సుయజ్ఞప్రభునిప్రశ్నము నాలకించి యామహర్షిసముదాయ మందు విరాజిల్లునారాయణు డనుఋషి తనప్రవచన మిట్లారంభించిరి.

నారాయణుడు పలికెను :

భూపాలా! తామొసగిన లేదా యితరులొసంగినబ్రాహ్మణవృత్తి నపహరించు వారినే కృతఘ్నులుగ భావింపవలెను. తనజీవనాధారమును బోగొట్టుకొనినబ్రాహ్మణునివిషాదాశ్రుసిక్త ప్లావితమైనధరణిలో నెన్నిధూళికణ

ములుకలవో యన్ని వేలయేండ్లు జీవనాధారమును హరించినకృతఘ్నుడు శూల ప్రోత మనునరక మనుభవింపగలడు. ఆనరకములో వానికి బ్రజ్వలించునంగార ములే భుజించుటకును, దప్తమూత్రమే పాన మొనరించుటకును లభించును. తప్తాంగారశయ్యపై శయనింపవలసియుండును. ఆతడు శయ్యపైనుండి లేచుటకు బ్రయత్నించినచో యమదూతలు వానిని హింసించెదరు. ఇట్లు నరకయాతనల ననుభవించి యీమహాపాపి భారతవర్షములో విషకీటకమై యిరువదివేల దివ్య సంవత్సరములు దుఃఖింపగలడు. పిదప నాకృతఘ్నుడు భూహీనుడై, సంతాన హీనుడై, దరిద్రుడై, కృపణుడై, రోగియై, నింద్యుడై యనేకవిధముల దుఃఖించి తుదకు బాపవిముక్తి నొందగలడు. బ్రాహ్మణేతరులజీవనాధారమును గ్రహించినవారు పైనప్రవచించిననరకములో నర్ధభాగ మనుభవింపగలరు.

నా ర దు డు  ప లి కె ను :

పరులకీర్తికి నసూయచెంది దానిని హనన మొనరించువానినే కృతఘ్నుడనిరి. నరేశ్వరా! ఈకృతఘ్నుడు దీర్ఘకాలపర్యంత మంధ కూప మనునరక మనుభవింపవలెను. ఆనరకములో బహుకీటకములు, గృధ్ర ములు వానిని భక్షింపగలవు. ఆపాపాత్ముడు ప్రతప్తక్షారోదకమును ద్రాగ వలెను. తదనంతర మాత డేడుజన్మములు సర్పమై, యేడుజన్మములు కాకమై తుదకు పాపవిముక్తుడు కాగలడు.

దే వ లు డు  ప లి కె ను :

బ్రాహ్మణ, గురుదేవ, దైవధన మపహరించు వారినే మహా పాపులని, కృతఘ్నులని భావింపవలెను. వారు సూర్యచంద్రు లున్నంతవఱకు నవటోదనరక మనుభవించి తదనంతరము గ్రాగుబోతులై దుఃఖించి యెట్లో పాపవిముక్తులుకాగలరు.

జై గీ ష వ్యు డు  ప లి కె ను :

> పితృమాతృగురూంశ్చాపి భక్తిహీనో న పాలయేత్ ।
> వాచాఽపి తాడయే త్తాంశ్చ స కృతఘ్న ఇతి స్మృతః ॥
> వాచా చ తాడయే న్నిత్యం స్వామినం కులటా చ యా ।
> సా కృతఘ్నీతి విఖ్యాతా భారతే పాపినీ వరా ॥ (13, 14)

తలిదండ్రులయెడల, గురుదేవునియెడల భక్తిహీనులై వారిని గౌరవముతో సేవింపక కఠినవచనములను బల్కి వారిమనముల నొప్పించువారే కృతఘ్నులని శ్రుతులు ప్రవచించినవి. ప్రతిదినము కఠినవచనములతో దనస్వామిని నొప్పించుకులటాస్త్రీ కృతఘ్న. అట్టిస్త్రీ భారతవర్షమున బాపురాండ్రలో మొట్టమొదటిది.

కృతఘ్నుడైనపురుషుడైనను లేక స్త్రీయైనను వారు వహ్నికుండ మను మహాఘోరనరక మనుభవింపగలరు. సూర్యచంద్రు లున్నంతవఱకు నాకృతఘ్నులు నరకము ననుభవించి తదనంతర మేడుజన్మములపర్యంతము జలగలై జన్మించి తుదకు బాపవిముక్తు లయ్యెదరు.

వాల్మీకి పలికెను :

రాజా ! సకలవృక్షములందు సర్వత్రవృక్షత్వము ముండునట్లు వృక్షత్వత్యాగముునుండ నట్లు సర్వపాపములందు గృతఘ్నత్వముండును. రాజా ! పుణ్యకర్మలను హననమొనరించువారుకూడ గృతఘ్నులే. సర్వత్ర సర్వులపుణ్యములహానిలో గృతఘ్నత్వము నిహితమై యున్నది. నరేశ్వరా! కామక్రోధ లోభభయములచే భారతవర్షములో నసత్యసాక్ష్య మొసంగువారు, సభలలోపక్షపాతయుక్తులై మాట్లాడు వారు నిశ్చయముగ వేయియింద్రుల కాలము సర్పకుండ మనునరక మనుభవించెదరు. ఆనరకములో నాపాపిశరీరమున కనేకసర్పములు చుట్టుకొని వానిని విషదంష్ట్రలతో బీడింపగా నాపాపి యనేకవిధముల భయమునొంది దుఃఖించును. యమదూతలు తాడించుచుండగ నాపాపాత్ముడు వివశుడై సర్పములమలమూత్రములనే యాహారముగ స్వీకరింపవలెను. తదనంతర మాతడనేకనీచయోనులందు బరిభ్రమించి వృక్షమై తుదకు మూగవాడై జన్మించి పాపవిముక్తుడు కాగలడు.

ఆస్తీకుడు పలికెను :

గురుపత్నీగమన మొనరించినమానవుని మాతృగామిగ భావింపవలెను. మాతృగాములైనమానవులకు బ్రాయశ్చిత్తము లేదు. నృపశ్రేష్ఠా! కొమార్తెతోగాని, పుత్రవధువుతోగాని, యత్తతోగాని, సహోదరునిపత్నితోగాని, సహోదరితోగాని సమాగమ మొనరించిన మాతృగమనమహాపాతకము సంభవించును. రాజేంద్రా! బ్రహ్మదేవు డొనరించినప్రవచనానుసారముగ మాతృ

గమనమహాపాతకఫలమును వర్ణించెద నవధరింపుము. మాతృగమన మొనరించిన మహాపాపి జీవించియున్ననుమృతతుల్యుడు కాగలడు. అట్టివానినే చండాలునిగ, నస్పృశ్యునిగ భావింపవలెను. వానికి సూర్యమండలమును దర్శించునధికారము కూడ లేదు. అట్టివాడు సాలగ్రామమును, సాలగ్రామచరణామృతమును, దులసీ దళమిశ్రితజలములను, సర్వతీర్థజలములను, సద్బ్రాహ్మణులచరణోదకములను స్పృశించుటకైనను దగడు. ఆపాపి పశుతుల్యుడై సర్వులకు నింద్యుడుకాగ లడు. దేవతలకు, గురువునకు, బ్రాహ్మణునకు నమస్కరించునధికారముకూడ వానికి లేదు. ఆపాపి స్పృశించినజలములు మూత్రముకంటె నపవిత్రములుకా గలవు. భారతవర్షములో బృథ్వి యీకృతఘ్నునిభారముచే వ్యథాక్రాంతకా గలదు. కౌమార్తెను విక్రయించుపాపాత్ములయొక్క, కుమారుని విక్రయించు పాపులయొక్క, గురుపత్నీగాము లగునీచులయొక్కస్పర్శమువలన సకలదేశము పతితమగును. అట్టివారిని స్పృశించినవారితో వార్తాలాపము లొనరించిన, వారితో నిద్రించిన, వారితో గలిసి యొకేస్థానములో నివసించిన, వారితోగలిసి భుజించిన మనుష్యులకు బాపము సంభవించును. నరేశ్వరా! యిట్టిపాపాత్ములే యస్పృశ్యులని గ్రహింపుము. మాతృగమన మొనరించినపాపి కుంభీపాకమున బడి దీర్ఘకాల మవిరామగతితో జక్రమువలె బరిభ్రమించుచు దుఃఖములననుభ వింపగలడు. అగ్నిజ్వాలలో బడి జ్వలించునాపాతకుని యమదూతలు నిర్దాక్షిణ్య ముగ దాడన మొనరింతురు. ఇట్లామహాపాపి ప్రతిదినము నరకయాతన లనుభ వించుచు మహాప్రాకృతప్రళయకాలము వ్యతీతమై మరల సృష్టి యారంభమై నను నరకమునుండి యుద్ధరింపబడడు. నరక మనుభవించినపిదప నాపాపి పెక్కు వేల సంవత్సరములపర్యంతము మలకీటకమై దుఃఖించును. తదుపరి పత్ని వదలివేసిన నపుంసకుడై చండాలు డగును. ఏడుజన్మములవఱకు గుష్ఠురోగ యుక్తుడు, యంధుడు, నపుంసకుడునై తుద కామహాపాపి పాపవిముక్తుడు కాగలడు.

మునులు పలికిరి:

రాజా! మే మిట్లు శాస్త్రానుసారముగ గృతఘ్నులకర్మవిపాకములను వర్ణించితిమి. మానవసమాజములో నన్నివర్ణములవారు సరిసమానులే. కేవ లము మేము ప్రవచించినకృతఘ్నులే యస్పృశ్యులు. నరేశ్వరా! నీ వీసద్బ్రా హ్మణునిచరణకమలముల నాశ్రయించి పూజించి యాయనయనుగ్రహమునకు

పాత్రుడవై యాశీర్వచనమును బొందుము. మహారాజా! అతిథిని సాదరముగ గృహమున కాహ్వానించి సేవించి తరింపుము. తదుపరి వనముల కేగి తపమాచరించి బ్రాహ్మణశాపవిముక్తుడవై రాజధానికి మరలిపొమ్ము.

మహాదేవుడు పలికెను :

పార్వతీ! మహర్షిగణములు సుయజ్ఞరాజు నిట్లాదేశించి తమతమ స్థలముల కరిగిరి. దేవతలు, నరేశ్వరులు, బంధువులు తమతమధామముల కరిగిరి.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణ
సంవాదమున కర్మవిపాక మను
ఏబదిరెండవ అధ్యాయము
సంపూర్ణము.

---

## ఏబదిమూడవ అధ్యాయము

### సుతపుడు సుయజ్ఞునకు శివప్రదత్తమగు పరమదుర్లభజ్ఞానము నుపదేశించుట.

పార్వతీదేవి పలికెను :

ప్రభూ! మహర్షులు మరలిపోయినపిదప మనుష్యుల కర్మఫలముల వర్ణన మాలకించి బ్రాహ్మణశాపముచే విహ్వలుడును నృపశ్రేష్ఠుడునగు సుయజ్ఞు డేమిచేసెను? అతిథిదేవతారూపమున నరుదెంచినయాబ్రాహ్మణోత్తము డేమిచేసెను? నాథా! ఆద్విజోత్తముడు రాజు ననుగ్రహించెనా? లేదా?

మహేశ్వరుడు పలికెను :

ప్రియా! మహర్షులు మరలిపోయినతర్వాత శాపగ్రస్తుడైన యా

నరేశ్వరుడు తనవంశపురోహితుడైనవశిష్ఠుని యాదేశానుసారముగ దండమువలె భూమిపైబడి యావిప్రోత్తమునిచరణములకు వందనము లర్పించి ప్రసన్నులు గండని యనేకవిధముల బ్రార్థించెను. అపు డాద్విజశ్రేష్ఠుడు క్రోధమును వర్జించి ప్రసన్నుడై రాజు నాశీర్వదించెను. శాంతస్వరూపముతో సస్మితముఖారవిందముతో దనయెదుట నిలువబడియున్నయాద్విజోత్తముని గాంచి సుయజ్ఞుడు పులకితశరీరుడై యశ్రుపూర్ణనయనుడై హస్తములు ముకుళించి, యత్యంతవినమ్రభావముతో నాత్మార్పణ మొనరించుచు దమపరిచయమును బ్రసాదింపవలసినదిగ బ్రార్థించెను.

సుయజ్ఞుడు పలికెను :

బ్రాహ్మణోత్తమా! మీరు ఏవంశమున నుద్భవించితిరి? తమనామధేయమేమి? మీనివాస మెక్కడ? మీ రెచ్చటనుండి యరుదెంచినారో వచింపుడు. సాక్షాదగ్నివలె బ్రహ్మతేజముతో బ్రజ్వరిల్లుతాము కపటవిప్రవేషమున స్వయముగ నరుదెంచినవిష్ణుదేవులా? తమకంటె నాచార్యులు నాకు మఱియొకరు లభింపరు. తమకంటె నిష్టదైవము మఱియొకరు లేరు. దేవా! నాకు సత్యమైన, నిత్యమైనపరమజ్ఞానోపదేశ మొనరింపుడు. బ్రాహ్మణోత్తమా! నేను, నాభార్యపుత్రులు, నేటినుండి మీదాసులము. నా యఖిలైశ్వర్యమును, ధనాగారమును, నాయావత్సామ్రాజ్యమును దమరేగ్రహించి రత్నసింహాసనము నధిరోహించి పరిపాలింపుడు,

రాజు పల్కినవచనముల నాలకించి సస్మితముఖారవిందుడై యామునిపుంగవు డజ్ఞాతము, సర్వదుర్లభము నైనపరమతత్త్వజ్ఞానము నిట్లు ప్రవచింప నారంభించెను.

అతిథి పలికెను :

రాజా! బ్రహ్మకుమారుడే మరీచి, మరీచినందనుడే కశ్యపుడు. కశ్యపుని సకలపుత్రులు తమమనోవాంఛితదైవభావము నొందిరి. వారియందు త్వష్ట యనుమహాజ్ఞాని సహస్రదివ్యవర్షములుపుష్కరక్షేత్రములో దుష్కరతప మాచరించెను. సద్బ్రాహ్మణుని బుత్రునిగ బొందుటకు ఆమహర్షి దేవాదిదేవుడైన శ్రీహరిని సమారాధన మొనరించెను. అప్పుడు శ్రీమన్నారాయణు డామహర్షిపుంగవునకు దనవరప్రభావముతో మహాతేజస్వియైనబ్రాహ్మణపుత్రు నొసం

గెను. ఆకుమారుడఖండ తపోధనుడు, యమితతేజస్వియునై విశ్వరూపు డను నామమున ప్రసిద్ధిగాంచెను. ఒకసమయమున బృహస్పతి దేవేంద్రునిపై నలిగి యమరావతిని వీడి చనెను. అపు డింద్రు డీవిశ్వరూపునే తనపురోహితునిగ నియమించెను. విశ్వరూపునిమాతామహుడు దైత్యుడుగావున నాయన దేవ యజ్ఞములందు దైత్యులకుగూడ నాహుతు లర్పింప నారంభించెను. అపు డింద్రు డీరహస్యమును దెలిసికొని తనతల్లియాజ్ఞగైకొని విశ్వరూపునిమస్తక మును వజ్రాయుధముచే ఖండించెను. నరేశ్వరా! విశ్వరూపునికుమారు డైన విరూపుడే నాతండ్రి. తత్పుత్రుడ నైననన్ను సుతపు డందురు. నరేశ్వరా! నేను గాశ్యపగోత్రుడ నైనవిరాగి బ్రాహ్మణుడను. నాగురుదేవుడు స్వయముగ మహాదేవుడే. ఆభూతపతి నాకు విద్యను, జ్ఞానమును, మంత్రమును బ్రసాదించెను. ప్రకృతికి నతీతుడు, సర్వాత్మకుడు నైనశ్రీకృష్ణభగవానుడు నాయిష్టదైవము. నేను సదా యాపరమపురుషునిదివ్యచరణారవిందములను జింతింతును. నాకు సంపత్తులపై నిచ్ఛలేదు. రాధావల్లభు డైనశ్రీకృష్ణభగవానుడు నాకు సాలోక్య, సార్ష్టి, సారూప్య, సామీప్యము లనుమోక్షములు ప్రసాదింపగలడు. కాని నేనాయన కళ్యాణమయసేవాసౌభాగ్యముదక్క నన్యములనువాంఛింపను. బ్రహ్మత్వము, అమరత్వములనైనను నేను జలప్రతిబింబములవలె మిథ్యలుగ భావింతును.

> భక్తివ్యవహితం మిథ్యా భ్రమ మేవ తు నశ్వరమ్ ।
> ఇన్ద్రత్వం వా మరత్వం వా బ్రహ్మత్వం వా నరాధిప ॥
> న మన్యే జలరేఖేతి నృపత్వం కేన గణ్యతే ॥ (22)

నరనాథా! భక్తిదక్క మిగిలినవన్నియు మిథ్య, భ్రమమాత్రము, నశ్వ రమునని తెలిసికొనుము. ఇంద్రత్వము, మనుత్వము, అమరత్వములైనను జలములపై గీచినరేఖలవలె మిథ్యలు. ఆపదములను నే నసత్యములుగ భావింతును. అయినచో నీ వొసంగురాజపద మేలెక్కలోనిది ?

సుయజ్ఞా! నీ వొనరించుయజ్ఞమునకు సకలమహర్షిమండలి యరుదెంచినారని విని వారిదర్శనార్థమై నీసభను బ్రవేశించితిని. నీకు విష్ణుభక్తిని బ్రసాదింపవలె ననెడిసత్సంకల్పముతో నిన్ను శపించితిని. శపించుటతో నిన్నను గ్రహించితిని. రాజా! యజ్ఞములు కర్మబంధములు. ఘోరభవసాగరమందు బడియున్న నిన్నుద్ధరించుటకే శపించితిని.

న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః ।
తే పున న్త్యురుకాలేన కృష్ణభక్తాశ్చ దర్శనాత్ ॥ (26)

కేవలము జలమయము లైనతీర్థములే తీర్థములుకావు. భగవద్భక్తులే తీర్థస్వరూపులు. మృణ్మయులు, శిలారూపులు నైనదేవతలే దేవతలు కారు, భగవద్భక్తులే దేవతలు. జలమయతీర్థములు, మృణ్మయశిలామయదేవతలు దీర్ఘకాలము సేవించినవారలను బవిత్రమొనరింపగలరు; కాని శ్రీకృష్ణభక్తుడు తనను దర్శించినవారలను దక్షణమే పవిత్రమొనరింపగలడు.

రాజా ! ఈభవబంధములను వీడుము. గృహమును ద్యజింపుము. కుమారా! రాజ్యమును, నీపత్నిని, నీకుమారునిరక్షణమునం దుంచి శ్రీహరి నారాధించుటకు వనగమన మొనరింపుము.

బ్రహ్మాది స్తమ్బపర్యన్తం సర్వం మిథ్యైవ భూమిప ।
శ్రీకృష్ణం భజ రాధేశం పరమాత్మాన మీశ్వరమ్ ॥

ధ్యానాసాధ్యం దురారాధ్యం బ్రహ్మవిష్ణుశివాదిభిః ।
ఆవిర్భూతై స్తిరోభూతైః ప్రాకృతైః ప్రకృతేః పరమ్ ॥

బ్రహ్మ స్రష్టా, హరిః పాతా, హరః సంహారకారకః ।
దిక్పాలాశ్చ దిగీశాశ్చ భ్రమన్త్యే వాస్య మాయయా ॥

యదాజ్ఞయా వాతి వాయుః సూర్యో దినపతి శ్చరేత్ ।
నిశాపతిః శశీ శశ్వ త్సర్వసుస్నిగ్ధతాకరః ॥

కాలేన మృత్యుః సర్వేషాం సర్వవిశ్వేషు వై భవేత్ ।
కాలే వర్షతి శక్రశ్చ దహ త్యగ్నిశ్చ కాలతః ॥

భీతవ ద్విశ్వశాస్తా చ ప్రజాసంయమనో యమః ।
కాలః సంహరతే కాలే కాలే సృజతి పాతి చ ॥ (27-32)

భూపాలా! బ్రహ్మమొదలు కీటకపర్యంతము గలసకలము మిథ్యయే. సర్వేశ్వరుడు, పరమాత్మ, రాధావల్లభు డైనశ్రీకృష్ణపరమాత్మనే భజింపుము. ధ్యానమువలన ఆయన సులభుడుగాడు, బ్రహ్మవిష్ణుశివాదులకైనను దురారాధ్యుడు. ఉత్పత్తినొందుచు వినాశమొందుచు భ్రమించుప్రాకృతపదార్థములకు, బ్రకృతికి యాయన యతీతుడు. ఆయనమాయవలననే బ్రహ్మ సృష్టించును, విష్ణువు పాలించును, రుద్రుడు సంహరించును, దిక్పాలకులు సదా భ్రమింతురు; ఆయన యాజ్ఞవలననే వాయువు చలించును, దినేశ్వరు డైన

సూర్యుడు తపించును, నిశాపతి చంద్రుడు సదా సత్వములకు సుస్నిగ్ధత్వమును ప్రసాదించును. సర్వవిశ్వములందు మృత్యువు కాలమువలన సంభవించును. కాలమాసన్నమైనపుడే యింద్రుడు వర్షించును; అగ్ని జ్వలించును. విశ్వశాసకుడు, ప్రజలను సంయమములో నుంచుయముడు కాలమునకే భయభీతుడై తన కార్యమునందే సదా సంలగ్నుడై యుండును. సమయమాసన్నమైనపుడు కాలము సంహార మొనరించును. ఆకాలమే యథాసమయమున సృష్టించి పరిపాలన మొనరించును.

స్వదేశే వై సముద్రశ్చ స్వదేశే వై వసుంధరా ।
స్వదేశే పర్వతాశ్చైవ స్వాః పాతాలాః స్వదేశతః॥ (33)

కాలప్రేరితములై సముద్రములు తమతమపరిధులలో మెలంగుచున్నవి; పృథ్వి తనస్థానములో స్థిరమై యున్నది. పర్వతములు తమస్థానములలో గదలక యున్నవి. సప్తపాతాళములు కాలప్రభావమువలననే తమతమస్థానములలో నున్నవి.

రాజేంద్రా! సప్తస్వర్గములు, సప్తద్వీపవతి యగుపృథ్వి, పర్వతములు, సముద్రములు, సప్తపాతాళములు, ఈసమస్తలోకములు కలిసి యొకబ్రహ్మాండాకారమున జలములపై దేలియాడుచుండును. ప్రతిబ్రహ్మాండమందు బ్రహ్మవిష్ణురుద్రాదులు విరాజిల్లెదరు. దేవతలు, మనుష్యులు, నాగులు, గంధర్వులు, రాక్షసులు మొదలగువారు నివసించెదరు. రాజా! పాతాళలోకమునుండి బ్రహ్మలోకమువఱకు నండరూపముగ నేవిశ్వము కలదో యదియే బ్రహ్మదేవుని కృత్రిమబ్రహ్మండము. కమలకర్ణికలో బీజముండునట్లు బ్రహ్మ జలములపై శయనించుక్షుద్రవిరాట్ విష్ణునాభి కమలముపై నున్నాడు. ఇట్లు విస్తృతజలశయ్యపై శయనించు నాప్రాకృతమహాయోగి క్షుద్రవిరాట్ విష్ణువుకూడ సదా ప్రకృతికి అతీతుడు, సర్వేశ్వరేశ్వరుడు, సర్వాత్మ, కాలేశ్వరుడైనశ్రీకృష్ణ భగవానునే ధ్యానించును. ఈక్షుద్రవిరాట్ విష్ణువునకు మహావిరాట్పురుషుడైన మహావిష్ణువుయొక్క విస్తృతరోమకూపమే యాధారము. మహావిష్ణువుయొక్క యనంతరోమకూపములలో నుపర్యుక్తాసంఖ్యాక బ్రహ్మండములు వర్తమానములై యున్నవి. ఈయఖిలబ్రహ్మండములకు నుత్పత్తిస్థానమై, యాధారమైన యామహావిరాట్పురుషుడుకూడ శ్రీకృష్ణపరమాత్మ దివ్య తేజస్సంయోగముచే ప్రకృతినుండి మహాడింభరూపమున నావిర్భవించెను. సర్వాధారస్వరూపుడైన

మహావిరాట్పురుషుడుకూడ గాలమునకే స్వామి, సర్వేశ్వరుడు, పరమాత్మ యైనశ్రీకృష్ణభగవానునే సదా చింతించును.

సర్వబ్రహ్మాండములకు, వానియందు నివసించుబ్రహ్మవిష్ణుశివాదులకు, క్షుద్రవిరాట్పురుషులకు, మహావిరాట్పురుషునకు నేకైకజనని యైనమూల ప్రకృతి మహాప్రళయకాలములో గాలేశ్వరు డైనశ్రీకృష్ణపరమాత్మలో విలీనయై సదా తద్ధ్యానమందే సంలగ్నురాలై యుండును. నాగురుదేవు లైనశంకరు డనుగ్రహించిన యీపరమదుర్లభమహాజ్ఞానమును నీ కుపదేశించి తిని. నరనాథా! నశ్వరము లైనరాజ్యభోగాదులను, నశాశ్వతము లైనస్త్రీ పుత్రాదివ్యామోహములను, నశ్వరదేహమునకు గారణమైనయహంకారమును దత్క్షణమే పరిత్యజించి వనముల కేగి సర్వేశ్వరేశ్వరుడు, సర్వకారణకారణుడు, సనాతనుడు, నఖండజ్యోతిస్స్వరూపుడు, పరబ్రహ్మము, పరమాత్మ, సచ్చిదా నందవిగ్రహు డైనశ్రీకృష్ణునే యనన్యభక్తితో నారాధించి యవలీలగ దరింపుము.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణ
సంవాదమున సుతపుడు సుయజ్ఞునకు
జ్ఞానోపదేశముచేయుట యను
ఏబదిమూడవ అధ్యాయము
సంపూర్ణము.

—♦—

# ఏబదినాలుగవ అధ్యాయము

## సుతపుడు సుయజ్ఞునకు గోలోకశ్రీకృష్ణులయుత్కృష్టతను విప్రచరణోదకమహత్త్వమును వివరించి వెడలుట, సుయజ్ఞుడు దుష్కరతపమొనరించి శ్రీరాధాదేవి కృపవలన గోలోకమునకు వెడలి శ్రీకృష్ణుని దర్శించుట.

సుయజ్ఞ రాజు పలికెను :

మునీశ్వరా! సర్వాధారుడైనమహావిష్ణువున కేవరాధారము? అందఱు కాలమునకు లోబడి భయభీతులై వర్తింతురంటిరి. అయినచో నాకాలమున కాధార మెవ్వరు? క్షుద్రవిరాట్పురుషునియాయుర్దాయకాల మెంత? బ్రహ్మ, ప్రకృతి, మనువు, ఇంద్రుడు, చంద్రుడు, సూర్యుడు, నన్యప్రాకృతదేహధారుల యాయుఃప్రమాణము లెంత ? వేదవిదాంవరా ! వీరందఱివేదోక్తాయుర్దాయ ప్రమాణములను బాగుగ విచారించి నాకు దెలియ జెప్పుడని ప్రార్థించు చున్నాను. మహాభాగా! ఈసమస్తవిశ్వసముదాయముల కావల నూర్ధ్వభాగ ములో నేయేలోకములు కలవు? నాయీసంశయముల నన్నింటిని గృపతో నివారింపుము.

సుతపుడు పలికెను :

> గోలోకో నృప! విశ్వానాం విస్తృతశ్చ నభస్సమః ।
> తథా నిత్యం డిమ్భరూపః శ్రీకృష్ణేచ్ఛాసముద్భవః ॥
> జలేన పరిపూర్ణశ్చ కృష్ణస్య ముఖబిన్దునా ।
> సృష్ట్యున్ముఖ స్యాఽఽదిసర్గే పరిశ్రాన్తస్య ఖేలతః ॥
> ప్రకృత్యా సహ యుక్తస్య కలయా నిజయా నృప ।।
> తత్రాఽఽధారో మహావిష్ణో ర్విశ్వాధారస్య విస్తృతః ॥
> ప్రకృతే ర్గర్భసంభూతడిమ్బోద్భూతస్య భూమిప ।।
> సువిస్తృతే జలాధారే శయానశ్చ మహావిరాట్ ॥ (5-8)

రాజా! ఆకాశమువలె విస్తృతమైనదివ్యగోలోకము సర్వవిశ్వములకు

నూర్ధ్వభాగమున విరాజిల్లియున్నది. ఆలోకము శ్రీకృష్ణుని యిచ్ఛచే బ్రాదుర్భవించి సదా నిత్యాండరూపమున బ్రకాశించుచున్నది. ఆదిసర్గలో సృష్టినిర్మాణమున కున్ముఖుడై శ్రీకృష్ణపరమాత్మ తనకాలస్వరూపిణియైనప్రకృతితో సంయుక్తుడై క్రీడాపరాయణుడై లీలావశమున నలసినట్లు నటించెను. ఆసమయములో భగవంతునిదివ్యముఖారవిందమునుండి నిర్గత మైనఘర్మజలబిందువులఖండజలరాశిగ నవతరించినవి. ఆమహాజలములతో గోలోక మంతయు నిండియుండును. శ్రీకృష్ణునిదివ్య తేజమువలన బ్రకృతినుండి యండాకారమున నుత్పన్నమై సకలవిశ్వములకే యాధారస్వరూపుడైనశ్రీమహావిష్ణువు (మహావిరాట్పురుషు) నకు నాధారముపర్యాప్తవిస్తృతగోలోకపరంధామమే. ప్రకృతిగర్భమునుండి డింభరూపమున నావిర్భవించినమహావిరాట్పురుషు డాసువిస్తృతజలాధారము (జలశయ్య) పై శయనించును.

రాధేశ్వరస్య కృష్ణస్య షోడశాంశః ప్రకీర్తితః । [8]

ఆమహావిరాట్పురుషుడు రాధేశ్వరుడైనశ్రీకృష్ణభగవానునిషోడశాంశసముడని కీర్తింపబడెను.

దూర్వాదలశ్యామరూపః సస్మితశ్చ చతుర్భుజః ॥
వనమాలాధరః శ్రీమాన్ శోభితః పీతవాససా ।
ఊర్ధ్వం నభసి తద్విష్ణో ర్నిత్యవైకుణ్ఠ ఏవ చ ॥
ఆత్మాకాశసమో నిత్యో విస్తృత శ్చన్ద్రబిమ్బవత్ ।
ఈశ్వరేచ్ఛాసముద్భూతో నిర్లక్ష్యస్య నిరాశ్రయః ॥
ఆకాశవ త్సువిస్తారో రత్నౌఘైశ్చ వినిర్మితః ।
తత్ర నారాయణః శ్రీమా న్వనమాలీ చతుర్భుజః ॥
లక్ష్మీసరస్వతీగఙ్గాతులసీపతి రీశ్వరః ।
సునన్దనన్దకుముదపార్షదాదిభి రావృతః ॥ [9-13]

ఆమహావిరాట్పురుషుడు దూర్వాదలశ్యామలవర్ణుడు, సస్మితముఖారవిందుడు, చతుర్భుజుడు. వనమాలలనుధరించి శ్రీమహావిష్ణువు పీతాంబరధారియై శోభించును. ఆకాశమున కూర్ధ్వభాగములో నామహావిష్ణుదేవునినిత్యవైకుంఠపరంధామము కలదు. వైకుంఠపరంధామ మాత్మాకాశసదృశముగ నిత్యము, చంద్రబింబమువలె గుండ్రముగ విస్తృతరూపమున నుండును. ఈశ్వరేచ్ఛచే సంభవించినయానిత్యలోక మలక్ష్యము, ఆశ్రయరహితము. ఆకాశసమముగ

సత్యంతవిస్తృతమైన ఆలోకము, దివ్యరత్నములతో నిర్మింపబడెను. ఆపరంధామములోనే వనమాలాధారి, చతుర్భుజుడు, లక్ష్మీ సరస్వతీ గంగా తులసీపతియైన శ్రీమన్నారాయణుడు సునందనంద కుముదాది పార్షద పరివేష్టితుడై విరాజిల్లును.

సర్వేశః సర్వసిద్దేశో భక్తానుగ్రహ విగ్రహః ।
శ్రీకృష్ణశ్చ ద్విధాభూతో ద్విభుజశ్చ చతుర్భుజః ॥
చతుర్భుజశ్చ వైకుణ్ఠే గోలేకే ద్విభుజః స్వయమ్ ।
ఊర్ధ్వం వైకుణ్ఠలోకాచ్చ పంచాశత్కోటియోజనాత్ ॥
గోలోకో వర్తులాకారో వరిష్ఠః సర్వలోకతః ।
అమూల్యరత్నఖచితై ర్మన్దిరైశ్చ విభూషితః ॥
రత్నేన్ద్రసారఖచితైః స్తమ్భసోపానచిత్రితైః ।
మణీన్ద్రదర్పణాసక్తైః కపాటైఃకలశోజ్జ్వలైః ॥
నానాచిత్రవిచిత్రైశ్చ శిబిరైశ్చ విరాజితః ।
కోటియోజనవిస్తీర్ణా దైర్ఘ్యే శతగుణస్తథా ॥
శైలార్ధపరిమాణేన యుక్తో బృన్దావనేన చ ।
తదర్ధమానవిలసద్రాసమణ్డలమణ్డితః ॥
సరిచ్ఛైలవనాదీనాం మధ్యే గోలోక ఏవ చ ।
యథా పఙ్కజమధ్యే చ కర్ణికా సుమనోహరా ॥
తత్ర గోగోపగోపీభి ర్గోపీశో రాసమణ్డలే ।
రాసేశ్వర్యా రాధికయా సంయుక్తః సంతతః నృప॥ [14-21]

సర్వేశ్వరుడు, సర్వసిద్ధేశ్వరుడు, భక్తానుగ్రహవిగ్రహుడైన శ్రీకృష్ణభగవానుడు ద్విభుజుడుగ, చతుర్భుజుడుగ రెండు రూపముల విభక్తుడైనాడు. చతుర్భుజరూపమున నాయన వైకుంఠములో గొలువుండును, స్వయముగ ద్విభుజరూపమున గోలోకములో విరాజిల్లును. వైకుంఠలోకమున కూర్ధ్వదిశలో నేబదికోట్లయోజనములదూరములో సర్వలోకములకంటె శ్రేష్ఠతమమైనవర్తులాకారమున విరాజిల్లుగోలోకపరంధామ ముండును. అమూల్యరత్ననిర్మితాసంఖ్యాకవిశాలభవనము లాదివ్యలోకశోభను వృద్ధిచేయుచున్నవి. రత్నేంద్రసారముచే నిర్మింపబడినవిచిత్ర స్తంభములతో, సోపానములతో నాభవనము లలంకృతములై యున్నవి. శ్రేష్ఠమణిమయదర్పణములచే ఘటితములైనద్వారములతో, సుజ్జ్వలకలశములతో నానాప్రకారచిత్రములతో శోభించునాహర్మ్య

మూలు గోలోకశ్రీవృద్ధి గావించుచున్నవి. ఆదివ్యలోకవిస్తార మొకకోటి యోజనములు, పొడవు విస్తారముకంటె నూఱురెట్లధికము. విరజానదితో పరివేష్టితమై యున్న శతశృంగపర్వత మాలోకమందు విరాజిల్లుచున్నది. విరజానది పొడవు వెడల్పులో నర్థప్రమాణము కల్గి శతశృంగపర్వతౌన్నత్యములో నర్థప్రమాణమైయున్న బృందావన మాలోకశోభనుబెంపొందించుచున్నది. బృందావనముయొక్క పొడవు వెడల్పులో నర్థప్రమాణముగ నిర్మింపబడినరాసమండలము గోలోకధామమున కలంకారము. ఉపర్యుక్తనదీపర్వతవనాదులమధ్యభాగములో కమలముమధ్య సుమనోహరకర్ణికవలె గోలోకబృందావనము కలదు. తదంతర్గతరాసమండలములో గోగోపగోపీజన పరివేష్టితుడై గోపికావల్లభుడైన శ్రీకృష్ణభగవానుడు రాసేశ్వరి యగు శ్రీరాధాదేవితో నిరంతరము నివసించుచుండును.

ఆయన మురళీహస్తుడు, ద్విభుజుడు, బాలగోపాలరూపధారి, వహ్నిశుద్ధ చిన్మయవస్త్రపరీధానుడు, రత్నాభరణభూషితుడు. ఆయన సర్వాంగములు చందనోక్షితములు. రత్నమాలావిరాజితుడై, రత్నసింహాసనము నధిరోహించి విరాజిల్లునాయనపై రత్నఛత్రము శోభిల్లుచుండును. ప్రియగోపబాలకులు శ్వేత చామరములను వీచుచు సదా భగవంతునిసేవలందు దత్పరులై యుందురు. వస్త్రాభరణములచే విభూషితలైనసుందరగోపికలు కుసుమమాలికలచే జందనాదులచే నాదివ్యపురుషుని శృంగారింతురు. మందస్మితముఖారవిందుడై విరాజిల్లు షరమాత్ముని దివ్యసౌందర్యమును గోపికలు తమకటాక్షవీక్షణములచే సదా పానమొనరించుచుందురు. శంకరభగవానుని ముఖారవిందమునుండి నేను శ్రవణమొనరించినదివ్యలోకవిస్తారజ్ఞానము యథాశక్తి యాగమానుసారముగ నీయెదుట వర్ణించితిని.

ఇక గాలమానమును బ్రవచించెద నవధరింపుము. ఆఱుతులముల బంగారముతో నిర్మించిననాలు గంగుళములలోతు గలస్వర్ణపాత్రకు మిరపగింజలంతవి నాల్గుఛేదము లొనరించి దానిని నీటిపై నుంచవలెను. ఆఛిద్రములనుండి నీరు పాత్రలోనికి బ్రవేశించి యాపాత్ర నెంతకాలములో నింపగలవో, ఆకాలమునే యొకదండ మందురు. రెండుదండము లొకముహూర్తము, నాల్గుముహూర్తము లొకజాము, ఎనిమిదిజాము లొకదినము, పదునైదుదినము లొకపక్షము, రెండు పక్షము లొకమాసము, పండ్రెండుమాసము లొకవర్షము. మనుష్యుల కొక

మాసమైన పితరుల కొకపగలు, రాత్రి యగును. శుక్లపక్షమే పగలు, కృష్ణ పక్షమే రాత్రి. మనుష్యుల కొకవర్షము దేవతల కొకదినమునకు సమానము. ఉత్తరాయణమే పగలుకాగా దక్షిణాయనము రాత్రి యగును. నరేశ్వరా! మనుష్యాదుల యాయుఃప్రమాణములు యుగానుసారముగ వారివారికర్మాను రూపముగ నుండగలవు. ఇక ప్రకృతిప్రాకృతపదార్థములు బ్రహ్మాదులయాయుః పరిమాణములను వర్ణించెద నవధరింపుము. కృత (సత్య) యుగము, త్రేతా యుగము, ద్వాపరయుగము, కలియుగ మను వానిని చతుర్యుగము లందురు. ఈనాల్గుయుగములకాలప్రమాణము పండ్రెండు వేలదివ్యవర్షములు.

సావధానుడవై యవధరింపుము. సత్యయుగప్రమాణము నాల్గువేలదివ్య వర్షములు, త్రేతాయుగప్రమాణము మూడువేలదివ్యవర్షములు, ద్వాపరయుగ ప్రమాణము రెండువేలదివ్యవర్షములు, కలియుగప్రమాణ మొకవేయిదివ్యవర్ష ములు. పండ్రెండువేలదివ్యవర్షములలో మిగిలినరెండువేలదివ్యవర్షము లానాల్గు యుగములసంధ్య, సంధ్యాంశకాలమని చెప్పబడినవి. దీని భావ మేమనగ సత్య యుగకాలపరిమాణము నాలుగువేలదివ్యసంవత్సరములు. యుగారంభసంధ్య నాలుగువందలదివ్యసంవత్సరము లగును; యుగాంతసంధ్య నాలుగువందలదివ్య సంవత్సరములు అనగా సత్యయుగప్రమాణము రెండుసంధ్యలతో గలిసి నాలుగువేలయెనిమిదివందల దివ్యసంవత్సరములు. అట్లే త్రేతాయుగసంధ్యా మానము మూడువందలదివ్యసంవత్సరములుకాగా, యుగమానము మూడువేల దివ్యవర్షము లగును. యుగాంతసంధ్యామాన మైనమూడువందలదివ్యసంవత్సర ములను గలుపుకొని త్రేతాయుగసంపూర్ణకాలమానము మూడువేలయారు వందలదివ్యవర్షము లగును. అట్లే ద్వాపరసంధ్య రెండువందలదివ్యవర్షములు, యుగమానము రెండువేలదివ్యవర్షములు, యుగాంతసంధ్య రెండువందలదివ్య వర్షములు కలుపుకొని ద్వాపరయుగసంపూర్ణకాలమానము రెండువేలనాలుగు వందలదివ్యవర్షము లగును. అట్లే కలియుగసంధ్య యొకవందదివ్యవర్షములు, యుగమాన మొకవేయిదివ్యవర్షములు, యుగాంతసంధ్య యొకవందదివ్యవర్ష ములు. ఇవియన్నియు గలిసి కలియుగపూర్ణకాలమాన మొకవేయిరెండువందల దివ్యవర్షము లగును. ఇట్లు నాల్గుయుగములసమ్మిళితపరిపూర్ణకాలమానము పండ్రెండువేలదివ్యవర్షము లగును. మనుష్యకాలమానప్రకారము నాల్గుయుగ ములకాలము నలుబదిమూడులక్షలయిరువదివేలసంవత్సరములు. కృతయుగ

మానవకాలప్రమాణము పదునేడులక్షలయిరువదియెనిమిది వేలసంవత్సరములు, త్రేతాయుగమనుష్యకాలమానము పండ్రెండులక్షలతొంబదియాఱు వేలసంవత్సరములు, ద్వాపరయుగమనుష్యకాలమాన మెనిమిదిలక్షలయఱువదినాల్గు వేల సంవత్సరములు, కలియుగమానవకాలమానము నాల్గులక్షలముప్పదిరెండు వేల సంవత్సరములు.

ఏడుదినములు గలవారములు, పదునైదుతిథులు, దినము, రాత్రి, రెండు పక్షములు, పండ్రెండుమాసము లొకవర్షమై; ఒకవర్షము తదుపరి మఱియొక వర్ష మెట్లు భ్రమించుచుండునో, యట్లే యీనాల్గుయుగక్రమముకూడ జక్రము వలె ననంతకాలప్రవాహములో సదా పరిభ్రమించుచుండును. రాజేంద్రా! ఒకయుగముతర్వాత మఱియొకయుగము సంభవించుచు నాల్గుయుగములు సదా పరిభ్రమించుచుండునట్లు మన్వంతరములచక్రము వర్తమానమైయుండును. డెబ్బదియొక్క దివ్యయుగము లొకమన్వంతర మగును. ఈక్రమముననే పదు నల్గురుమనువులు సదా భ్రమణ మొనరించెదరు.

రాజేంద్రా! నేను శంకరభగవన్ముఖారవిందమునుండి శ్రవణ మొనరించిన ధర్మాత్ములైనమనువులయాఖ్యానములను వర్ణించెద నాలకింపుము. ఆదిమనువు బ్రహ్మసముద్భవుడు. కావున నాయనను స్వాయంభువమను వనిరి. ఆయన పత్నియే శతరూప, స్వాయంభువమనువు ధర్మాత్ములందు వరిష్ఠుడు, మనువులందు గరిష్ఠుడు. ఆయనయే నీప్రపితామహుడు. శంకరభగవానుని శిష్యుడైనయాయన విష్ణువ్రతపరిపాలకుడు, మహాజ్ఞాని, జీవన్ముక్తుడు. శంకరభగవానునాజ్ఞానుసారము స్వాయంభువమనువువిష్ణుదేవునిప్రసన్నతకొఱకై ప్రతిదినము నొకలక్ష బహుమూల్యరత్నములను, బదికోట్లసువర్ణముద్రలను, స్వర్ణశృంగసంయుక్తములై, సుపూజితములైనలక్షదివ్యధేనువులను; అగ్నిశుద్ధ దివ్యవస్త్రములను; ఒకలక్షశ్రేష్ఠమణులను; సకలసస్యభరితహరితభూములను; ఉత్తమోత్తమలక్షోపలక్షగజరాజులను; అసంఖ్యాకసువర్ణ భూషణములను; సువర్ణభూషణవిభూషితములైనమూడులక్షలయశ్వములను; స్వర్ణఘటితబహు లక్షరథములను; లక్షశిబిరములను; అన్నభరితములైనమూడుకోట్లసువర్ణపాత్ర లను; జలభరితములైనమూడుకోట్లసువర్ణకలశములను; గర్పూరాదిసువాసిత తాంబూలాదులను; విశ్వకర్మనిర్మితములైనశ్రేష్ఠరత్నఖచితవహ్నిశుద్ధవస్త్ర యుక్తములైనపుష్పమాలాసమూహములతో సుశోభితములైనమూడుకోట్ల

విచిత్రస్వర్ణపర్యంకములను; బ్రాహ్మణులకు దానమొనరించును. రాజా సుయజ్ఞా! నీప్రపితామాహుడు శంకరభగవానుననుగ్రహామువలన బరమదుర్లభ జ్ఞానమును, శ్రీకృష్ణదివ్యమంత్రమును బొంది యఖండభక్తియోగసాధనలబ్ధ దుర్లభశ్రీహారిదాస్యసౌభాగ్యసంపన్నుడై దివ్యగోలోకపరంధామము జేరెను. తనకుమారుడు భవసాగరమునుండి విముక్తుడగుట గాంచి బ్రహ్మ పరమానంద భరితుడై శంకరభగవాను ననేకవిధముల స్తుతించి యాదిమనువుస్థానములో రెండవమనువును బ్రతిష్ఠించెను.

రెండవమనువునామధేయమే స్వారోచిషమనువు. అగ్నిదేవునిపుత్రుడైన స్వారోచిషుడుకూడ స్వాయంభువమనువువలె మహాధర్మాత్ముడు; దానగుణసంపన్నుడు, ఈయనయనంతరము ప్రియవ్రతప్రభుపుత్రులు, ధర్మాత్ములందుశ్రేష్ఠులునగు తాపసుడు, ఉత్తముడు నను చక్రవర్తులు మూడవ నాల్గవమనుపదముల నలంకరించిరి. వారిర్వురు పరమవైష్ణవులు, శంకరభగవానునిశిష్యులు. సదా శ్రీకృష్ణభక్తిదాస్యములందు దత్పరులై జీవించినపరమ భాగవతోత్తములు. ధర్మాత్ములందు శ్రేష్ఠుడైనరైవతుడే యైదవమను వైనాడు. విష్ణుభక్తితత్పరుడైనచాక్షుషుడే యాఱవమనువైనాడు. శ్రీహారి పరమభక్తుడు, సూర్యపుత్రుడునగుశ్రాద్ధదేవుడే యేడవమనువైనాడు. ఈచక్రవర్తినే వైవస్వతమను వందురు. సూర్యునియొక్క మఱియొకవైష్ణవపుత్రుడు సావర్ణి యెనిమిదవమనుపదము నలంకరించెను. విష్ణువ్రతపరాయణుడైనదక్షసావర్ణి తొమ్మిదవమనువైనాడు. బ్రహ్మజ్ఞానవిశారదుడైనబ్రహ్మసావర్ణి పదియవమనువు. పదునొకండవమనునామధేయమే ధర్మసావర్ణి. ఆయన ధర్మిష్ఠుడు, వరిష్ఠుడు, వైష్ణవవ్రతపరిపాలకుడు. మహాజ్ఞానియైనరుద్రసావర్ణియే పండ్రెండవమనువు. ధర్మాత్ముడైనదేవసావర్ణియే పదుమూడవమను వన బడెను. మహాజ్ఞని చంద్రసావర్ణియే పదునాల్గవమనువు. ఒక్కొక్కమనువు నాయుఃపరిమాణ మొక్కొక్కయింద్రునాయువుతో సమానము.

బ్రహ్మకొకపగలైన బదునల్వు రింద్రులు గతింపగలరు. బ్రహ్మదిన (పగలు) కాల మెంతయో రాత్రికాలముకూడ నంతియే. నరేశ్వరా! ఆబ్రహ్మ రాత్రికాలమునే బ్రహ్మనిశ యని తెలిసికొనుము. ఈకాలమునే వేదములు కాలరాత్రి యని ప్రవచించినవి. రాజా! బ్రహ్మదేవునియొకదిన మొకక్షుద్ర కల్పమనబడెను. మహాతపస్వి యగుమార్కండేయునియాయుర్దాయ మట్టివేడు

కల్పములుమాత్రమే. బ్రహ్మ కొకపగలు గడచిన బ్రహ్మలోకమున కధోభాగ మున నున్న సకలలోకములు ప్రళయాగ్నియందు భస్మములు కాగలవు. ఆప్రళయాగ్ని ప్రళయకాల మాసన్నమైనపుడు సంకర్షణుని (ఆదిశేషుని) ముఖమునుండి నిర్గతమగును. ఆప్రళయసమయమున బ్రహ్మపుత్రాదులు బ్రహ్మలోకము జేరి ప్రళయరాత్రి గడచినపిదప మరల సృష్టికార్యమందు సంలగ్నులయ్యెదరు. బ్రహ్మరాత్రిలో సంభవించుప్రళయమునే క్షుద్రప్రళయ మందురు. ప్రళయములో దేవతలు, మనువులు, మనుష్యులు, మొదలుగాగల సకలదేహధారులు నశింతురు. ఇట్లు ముప్పదిదినములు, రాత్రులు వ్యతీతము లైన బ్రహ్మ కొకమాసము పూర్ణమగును. అట్టిపండ్రెండుమాసము లొకసంవ త్సరమై పదునైదుసంవత్సరములుగతించిన సంభవించుప్రళయమును వేదములు దైనందినప్రళయమని ప్రవచించినవి. ప్రాచీనవేదజ్ఞు లాప్రళయకాలమునే మోహరాత్రి యనిరి. ఈప్రళయములో సూర్యచంద్రాదులు, దిక్పాలకులు, ఆదిత్యులు, వసువులు, రుద్రులు, మార్కండేయ లోమశాది చిరంజీవులు, ఇంద్రద్యుమ్నరాజు, అకూపార మనుకచ్ఛపము, నాడీజంఘ డనుబకము మొద లగువారందఱు నశింతురు. ఈప్రళయకాలములోగూడ బ్రహ్మపుత్రాదులు బ్రహ్మలోకము జేరెదరు. దైనందిన ప్రళయము వ్యతీతమైన తరువాత బ్రహ్మదేవుడు మరల సృష్టి నారంభించును. ఇట్లు నూఱువర్షములు పరిపూర్ణ మైన బ్రహ్మదేవునాయుర్దాయము సమాప్తమగును. ఒకబ్రహ్మపరిపూర్ణాయు ర్దాయమునే యొకమహాకల్ప మనిరి. మహాకల్పానంతరమున సంభవించు మహాప్రళయమునే పురాతనమహాత్ములు మహారాత్రి యనిరి. బ్రహ్మయాయువు పరిపూర్ణమైనతోడనే బ్రహ్మాండము జలమగ్నము కాగలదు. వేదజనని సావిత్రి, వేదములు, ధర్మాదు లందఱు తిరోహితు లయ్యెదరు; కాని ప్రకృతి, శివుడు నామహాప్రళయకాలమందు నశింపక నిత్యులై యుందురు. విశ్వమందు గలవైష్ణవగణములు శ్రీమన్నారాయణునిలో విలీనమయ్యెదరు. సంహారకర్త యగుకాలాగ్నిరుద్రుడు సమస్తరుద్రగణములతో మృత్యుంజయు డైనమహాదేవునిలో విలీనమగును. వారితో దమోగుణముకూడ లయమగును. తదనంతరము ప్రకృతికి తెప్పపాటు సంభవించును. అట్లే నారాయణునకు, శివు నకు, మహావిష్ణువునకుగూడ తెప్పపాటు సంభవించును. నరేశ్వరా! నిమేషాంత ములో ననగాతెప్ప పైకిలేవగనే శ్రీకృష్ణభగవానునిసంకల్పముచే మరల సృష్టి

యారంభమగును. ధరణీనాథా! శ్రీకృష్ణపరమాత్మ నిమేషరహితుడు. కాల మాయన కాపాదింపబడదు; ఎందువలన నన ఆయన ప్రకృతికే యతీతుడు, ప్రాకృతగుణరహితుడు.

ఎవరుసుగుణులో వారికే నిమేషమగును. ఆనిమేషకాలము సంఖ్యాత్మకాపరిధిలోనే యుండును. నిత్యుడు, నిర్గుణుడు, అనాదియు, ననంతుడు నగు ఆయనకు నిమేష మెక్కడ ? ప్రకృతియొనరించిన వేయిఱెప్పపాటుల కాలమే యొకదండ మగును. అట్టి యఱువది దండలొకరాత్రిపగలై, యట్టి ముప్పదిదినములు మాసమై, పన్ఱెండుమాసములు సంవత్సరమై, నూఱుసంవత్సరములు పరిపూర్ణమైనప్రకృతి శ్రీకృష్ణునిలో లయమగును. అప్రళయమునే ప్రాకృతికప్రళయ మందురు. మహావిరాట్పురుషుడైన శ్రీమహావిష్ణువుజననిమూలప్రకృతి యీశ్వరి సకలసంహార మొనరించి స్వయముగ శ్రీకృష్ణపరమాత్మ వక్షఃస్థలములో విలీనమగును. ఆమహాప్రాకృతప్రళయకాలములో సకలప్రాకృత జగము లన్నియు నశింపగలవు. సంతపురుషు లామెనే సనాతని విష్ణుమాయ యని, సర్వశక్తిస్వరూపిణి దుర్గ యని, నారాయణి యని శ్రీకృష్ణునిబుద్ధికే యధిష్ఠాత్రీదేవి యని, నిర్గుణాత్మికయని కీర్తింతురు. ఆదిశక్తి మాయకు గొప్పగొప్ప దేవతలే మోహితులయ్యెదరు. ఆమెనే వైష్ణవజనులు శ్రీమహాలక్ష్మి యని, పరాదేవి రాధ యని కీర్తింతురు. శ్రీకృష్ణునియర్ధాంగ సంభూతమైన శ్రీమహాలక్ష్మి శ్రీమన్నారాయణప్రియ. ఆమెయే శ్రీరాధానామమున శ్రీకృష్ణునిప్రాణాధిష్ఠాతృదేవియై యాయనకుప్రాణాధికప్రియురాలైనది. రాజా! ఆమె యెవ రనుకొంటివి? ఆమెయే ప్రేమ యనెడుదివ్యశక్తి, ప్రాకృత నిర్గుణుడైనపరమాత్మకు నిర్గుణస్వరూపిణి యైనప్రియురాలు.

శ్రీమన్నారాయణుడు, శివుడు వీ రిర్వురు శుద్ధసత్త్వస్వరూపులు. ప్రాకృతప్రళయకాలమున నీమహానుభావు లిర్వురు తమపార్షదులను దమలో లయమొనరించుకొని నిర్గుణుడైనశ్రీకృష్ణపరబ్రహ్మములో లీనమయ్యెదరు. నరేశ్వరా! గోపకుమారులు, గోపికలు, సవత్సగోసమూహములు మొదలగున వన్నియు శ్రీరాధలో లీనముకాగా నయ్యాద్యప్రకృతి పరమేశ్వరుడైన శ్రీకృష్ణునందు లయమగును. క్షుద్రవిష్ణువులు మహావిష్ణువునందు లీనముకాగా మహావిష్ణువు మూలప్రకృతియందు లీనమగును. శ్రీకృష్ణునియామూలప్రకృతి యాయనయందే విలీనమగును. మాయాదేవి యైనయీశ్వరి యీశ్వరసంకల్ప

ముచే యోగనిద్రయై శ్రీకృష్ణునినయనారవిందములందు నివసించును. ఇంత కాలమే శ్రీకృష్ణుడు యోగనిద్ర నభినయించి మరల సకలసృష్టి సంకల్పించును.

తద్వన్దనం తత్స్మరణం తస్య ధ్యానం తదర్చనమ్ ।
కీర్తనం తద్గుణానాం చ మహపాతకనాశనమ్ ॥ (100)

ప్రాకృతికనిర్గుణు డైన శ్రీకృష్ణపరమాత్మయొక్క వందనము, స్మరణము, ధ్యానము, పూజనము, గుణనామసంకీర్తనము, మహాపాతకములను నాశన మొనరించును.

మహారాజా ! మృత్యుంజయు డైనమహాదేవునిముఖారవిందమునుండి నే నవధరించినయీమహాకాలజ్ఞానము నాగమానుసారముగ నీయెదుట వర్ణించితిని. నీ విక నేవిషయములను శ్రవణ మొనరింపగోరెదవో తెల్పుము.

సుయజ్ఞుడు పలికెను :

గురుదేవా! బ్రహ్మదేవునాయుర్దాయము పరిపూర్ణమైన సమస్తలోక సంహారకారియగుకాలాగ్నిరుద్రుడు, తమోగుణసత్త్వగుణములు మృత్యుంజయు డైన శివునిలో విలీనములగుననియు ప్రాకృతప్రళయ సమయములో శివుడుకూడ శ్రీకృష్ణపరమాత్మలోవిలీనముకాగలడనియు మీరు నొక్కివక్కాణించితిరి. మహాభాగా! అట్లయిన తమ గురుదేవుని నామము మృత్యుంజయుడని యెట్లు శ్రుతులు కీర్తించినవి? ఎవనిరోమకూపములం దసంఖ్యాకబ్రహ్మాండములు వర్తమానములై యున్నవో యామహావిష్ణువునకు మూలప్రకృతి యెట్లు జనని కాగల్గెను ?

సుతపుడు పలికెను :

నరేశ్వరా! బ్రహ్మాయుర్దాయము పరిపూర్ణమైనపుడే బ్రహ్మాదిసమస్త లోకములను సంహార మొనరించుమృత్యుకన్య జలబింబమువలె సంహారకార్యానంతరము నశించును. ఇట్లెందఱో మృత్యుకన్యలు, కోటానుకోట్ల బ్రహ్మలు లయమొందుట వీక్షించి శివుడు ప్రాకృతప్రళయసమయములో నిర్గుణపరబ్రహ్మమైనశ్రీకృష్ణభగవానునిలో విలీనమగును. నాగురుదేవు డైనశివుడు సదా మృత్యుకన్యపై విజయమునే సాధించెను; కాని యెపుడును మృత్యువు శివుని పరాజితునిగ నొనరింపలేదు. ఈవిషయము ప్రతికల్పమందు శ్రుతులద్వారమున

ప్రవచింపబడెను. కావున శంకరభగవానుని మృత్యుంజయుడని కీర్తించుటత్యం తోచితము. నరనాథా! శంకరుడు, నారాయణుడు, ప్రకృతి-ఈముగ్గురు నిత్య తత్త్వసంపన్నులు. నిత్యుడైన శ్రీకృష్ణపరమాత్మలో లయమగుట కేవలము లీలావినోదమేకాని వాస్తవము కాదు. స్వయముగ ప్రాకృతనిర్గుణపరమ పురుషుడైనపరమాత్మయే తనకాలశక్త్యనుసారముగ సగుణుడగును. ఆయ నయే స్వయముగ నాత్మమాయచే నారాయణ, శివ, ప్రకృతులరూపములలో ప్రకటితుడగును.

తదంశ స్తత్సమః శశ్వ ద్యథా వహ్నేః స్ఫులిఙ్గవత్ ।
యేయే చ బ్రహ్మణా సృష్టా రుద్రాదిత్యాదయ స్తథా ॥
కల్పే కల్పే జితా స్తే తే నశ్వరా మృత్యుకన్యయా ।
న శివో బ్రహ్మణా సృష్టః సత్యో నిత్యః సనాతనః ॥ (110, 111)

అగ్నికి, నగ్నికణములకు భేదము లేనట్లు పరమాత్మునంశసంభవులైన నారాయణ, శివ, ప్రకృతులు పరమాత్మసములే. శివునకు, నారాయణు నకు, ప్రకృతికి, భగవంతునకు నెట్టిభేదము లేదు. బ్రహ్మవలన ప్రతికల్పములో నేయేరుద్రులు నాదిత్యాదులు సృష్టింపబడెదరో వారందఱు మృత్యుకన్యచే బరాజితు లగుకారణమున నశ్వరు లనబడిరి; కాని శివుడు బ్రహ్మచే సృష్టింప బడలేదు; కావున శంకరభగవానుడు సత్యస్వరూపుడని, నిత్యుడని, సనాతను డని తెలిసికొనుము.

రాజా! శంకరునినిమేషమాత్రములోనే యెందఱో బ్రహ్మలు పతన మయ్యెదరు.

ఆదిసర్గములో జగద్గురుడైనశ్రీకృష్ణపరమాత్మ ప్రకృతిలో దనతేజము నాధానమొనరించెను. పవిత్రబృందావనములో దివ్యరాసక్రీడాసమయమున శ్రీకృష్ణపరమాత్మవామార్ధభాగమునుండి ప్రాదుర్భవించినరాసేశ్వరి శ్రీరాధయే పరాప్రకృతి యని తెలిసికొనుము. ఆదేవి సమయానుసారముగ గోలోకరాస మండలములో నొకమహాడింభమును దననుండి ప్రకటితమొనర్చెను. తనసంతతి యండాకారముగ నుండుట గాంచి ప్రకృతిమాత యత్యంతవ్యథితురాలై కోపించి యాయండమును గోలోకాథోజలములందు విడిచివైచెను. ఆమహాండమునుండియే సర్వాధారస్వరూపుడైనమహావిరాట్పురుషుడు (మహా విష్ణువు) ప్రాదుర్భవించెను.

సుయజ్ఞ రాజు పలికెను :

ప్రభూ ! నేడు నా జన్మము సఫలమైనది, నాజీవనము సార్థకమైనది. మీశాపము భక్తిప్రాప్తికి గారణమగుట నాకు వరదానమైనది. దేవా! సమస్త మంగళములకే మంగళప్రద మైనహరిభక్తి పరమదుర్లభ మనిరి. విప్రశ్రేష్ఠా! వేదములందు బ్రవచింపబడినయైదువిధము లైనభక్తులుకూడ శ్రీహరియనన్య భక్తికి సరిరావు. మహామునీశ్వరా! శ్రీకృష్ణపరమాత్మయం దనన్యభక్తి సంభవించు బరమదుర్లభ మైనయుపాయమును నా కుపదేశింపుడని ప్రార్థించుచున్నాను. కేవలము జలమయతీర్థములే తీర్థములు కావు; మృణ్మయశిలామయ దేవతలే దేవతలు కారు; శ్రీకృష్ణ భక్తుడే ముఖ్యతీర్థము, దైవము. ఆజలమయతీర్థములు, మృణ్మయ శిలామయదైవములు చిరకాల ముపాసించినయనంతరమే యుపాసకునిబవిత్రు నొనరింపగలవు; కానీ శ్రీకృష్ణునియనన్యభక్తుడు తనదర్శనమాత్రముననే దేహ ధారులను పునీతుల నొనరింపగలడు. సమస్తవర్ణములలో బ్రాహ్మణులు శ్రేష్ఠులు; వారిలో భారతవర్షములో నివసించి స్వధర్మపరి పాలన మొనరించు వారు శ్రేష్ఠులు; వారిలో శ్రీకృష్ణమంత్రోపాసన మొనరించుచు శ్రీకృష్ణానన్యభక్తిపరాయణులై ప్రతిదినము శ్రీకృష్ణునికి నివేదించినప్రసాదములనే భుజించుచు జీవించు వారే సర్వశ్రేష్ఠులు, మహాపవి త్రులు. మహాపురుషా! తమరు వైష్ణవులు; కావున బ్రాహ్మణులందు శ్రేష్ఠులు. గురుదేవా! తమ రపారజ్ఞానసాగరులు. మునీశ్వరా! మీవంటిశివశిష్యు డైన మహాత్ముని వీడి నే నన్యుల నెవ్వరిని శరణువేడగలను? మహామునీశ్వరా! తమ శాపవశమున నీసమయమున నేను కుష్ఠురోగి నైతిని. అపవిత్రుడ నైననే నధికారవంచితుడ నైతిని. మహాభాగా! యిట్టిదశలో నే నెట్లు తప మాచరింప గలను ?

సుతపుడు పలికెను :

> హరిభక్తిప్రదాత్రీ సా విష్ణుమాయా సనాతనీ ।
> సా చ యా ననుగృహ్ణాతి తేభ్యో భక్తిం దదాతి చ ॥
> యాంశ్చ మాయా మోహయతి తేభ్య స్తాం న దదాతి చ ।
> కరోతి వంచనాం తేషాం నశ్వరేణ ధనేన చ ॥ (126, 127)

రాజా! సనాతని యగువిష్ణుమాయయే హరిభక్తిప్రదాత్రి. ఆమెయెవరిని

గరుణించునో వారికే భగవదనన్యభక్తిసౌభాగ్యమును బ్రసాదించును. మాయ యెవరిని మోహితులుగ నొనరించునో (ఎవరు మాయకు వశులయ్యెదరో), వారికాదేవి హరిభక్తి నొసంగక నశ్వరము లైనధనముల నొసంగి వారలను మోసగించును.

కృష్ణప్రేమమయీం శక్తిం ప్రాణాధిష్ఠాతృదేవతామ్ ।
భజ రాధాం నిర్గుణాం తాం ప్రదాత్రీం సర్వసంపదామ్ ॥ (128)

"కావున రాజా! నీవు ప్రాకృతగుణరహితు డైనశ్రీకృష్ణభగవానుని ప్రేమమయశక్తి, శ్రీకృష్ణప్రాణాధిష్ఠాతృదేవి, సర్వసంపత్ప్రదాయని యైన శ్రీరాధను భజింపుము". ఆమెను సేవించి తదనుగ్రహామునకు బాత్రుడవై శ్రీకృష్ణానన్యభక్తుడవై నీవు శీఘ్రముగ గోలోకపరంధామము జేరగలవు. శ్రీరాధాజనని సర్వారాధ్యు డైనశ్రీకృష్ణునిచేగూడ సదా పూజిత, సేవిత. నిర్గుణపరమాత్మ యైనశ్రీకృష్ణభగవానుడు ధ్యానముచేనైనను వశుడు కాడు. ఆయన దురారాధ్యు డని తెలిసికొనుము. అసంఖ్యాకజన్మములతర్వాత దేహధారులు క్రమముగ సంస్కరింపబడి శ్రీకృష్ణానన్యభక్తులై తుదకు గోలోక పరంధామము జేరగలరు.

కాని సర్వసంపత్స్వరూపిణి యైనశ్రీరాధ మహావిష్ణువునకే జనని, యఖండకృపామయి. కావున నామెను సేవించిన భక్తజనులు జననమరణ చక్రమున దగుల్కొనక శీఘ్రమే శ్రీకృష్ణానన్యభక్తులై గోలోకపరంధామము జేరెదరు. రాజా! నీ వొకసంవత్సరము సద్బ్రాహ్మణులను సేవించివారి చరణోదకపాన మొనరింపుము. ఈవ్రతముమూలమున నీవు రోగహీనుడవై కామదేవసమానరూపవంతుడవు కాగలవు. సద్బ్రాహ్మణుని చరణోదకములచే బృథ్వి యాప్లావితమగుచుండువఱకు నాబ్రాహ్మణ భక్తుని పితరులు కమలపత్రములలో జలపాన మొనరింపగలరు (అనగా సుఖింపగలరు). పృథ్విపై నేయేతీర్థములు కలవో, యవి యన్నియు సముద్రమందును గలవు. సముద్రములో నేతీర్థములు కలవో యవి యన్నియు సద్బ్రాహ్మణుని చరణములందు నివసించును. భాగవతోత్తము డైనసద్బ్రాహ్మణునిచరణోదకము పాపములను, రోగములను వినాశ మొనరింపగలదు. ఆచరణోదకమే తీర్థజలములవలె భోగములను, శుభములను, మోక్షమును బ్రసాదింపగలదు. భక్త బ్రాహ్మణుడు మనుష్యరూపములో నున్న దేవాదిదేవు డైనజనార్దనుడే యని

తెలిసికొనుము. భాగవతోత్తము డైనసద్బ్రాహ్మణున కర్పింపబడినపదార్థము లను స్వయముగ దేవతలు స్వీకరింతురు. బ్రాహ్మణసేవ యొన రించిన నీవు పునీతుడవు కాగలవు. రాజా ! నే నొకసంవత్సరానంతరము మరల నీచెంత కరుదెంతును.

మహాదేవుడు పలికెను :

కల్యాణీ ! ఆనాటినుండి సుయజ్ఞరాజు ప్రతిదినము భక్తిభావముతో సద్బ్రాహ్మణులను సేవింప నారంభించెను. ఒకసంవత్సరము కాగానే రాజు భయంకరకుష్ఠరోగమునుండి విముక్తి నొందెను. ఆసమయముననే కశ్యపకులా గ్రణియు మునిశ్రేష్ఠు డైనసుతపోమహర్షి రాజుచెంత కరుదెంచి శ్రీరాధా పూజావిధానమును, స్తోత్రమును, కవచమును, మంత్రమును, సామవేదోక్త ధ్యానమును సుయజ్ఞున కుపదేశించి 'రాజా! గృహమును వీడి వనముల కరిగి యేకాగ్రతతో శ్రీరాధాదేవి నారాధింపుమని' యాదేశించి మరలిపోయెను. సుయజ్ఞుడు సకలసామ్రాజ్యమును త్యజించి తపోభిలాషియై ఘోరదుర్గమవన ముల కరిగెను. సుయజ్ఞునినల్వురురాణులును ప్రాణత్యాగ మొనరించి తమ భర్తకంటెముందుగనే గోలోకము జేరిరి. సుయజ్ఞరాజుకుమారుడు సకలపృథ్వీ పతి యయ్యెను.

సుయజ్ఞుడు పుష్కరక్షేత్రము జేరి దుష్కరతపోనిష్ఠుడై నూటయిరువదిసంవ త్సరములు శ్రీరాధాదేవ్యుత్కృష్టమంత్రజప మొనరించెను. సుయజ్ఞునితపో దీక్షకు ప్రసన్నురాలై పరమేశ్వరియగుశ్రీరాధ గగనములో ననంతకోటిసూర్య సమగ ప్రకాశించుచు రాజునకు దర్శన మొసంగెను. ఆజగజ్జననిదర్శనమాత్రము ననే సుయజ్ఞునిసర్వపాపములు నశించినవి. ఆయన నశ్వరమానవదేహమును జాలించి దివ్యదేహధారియై రాధతో రత్ననిర్మిత విమానము నధిరోహించి గోలోకప్రస్థాన మొనరించెను. విరజానదిచే బరివేష్టితమై శ్రీబృందావన యుక్తమై, రాసమండలమండితమై, శతశృంగపర్వతశ్రేణిలో శోభించుదివ్య గోలోకపరంధామము నారాజు దర్శించెను. ఆపరంధామము దివ్యరత్నేంద్ర సారనిర్మితము లైనయసంఖ్యాకసుమనోహరభవనయుక్తము, గోగోపగోపికా సమూహాభరితము. గోలోక మనేకానేక చిత్రవిచిత్రదృశ్యములతో, ముప్పదియేడు కల్పవృక్షయుక్తములైన ఉపవనములచే శోభించుచుండెను.

సకలగోలోకము దివ్యకామధేనువులచే నావేష్టితము. వైకుంఠమునకూర్ధ్వభాగ ములో గోటానుకోట్లయోజనములదూరమున, శూన్యములో నెట్టియాధారము లేక కేవలము శ్రీకృష్ణపరమాత్మసంకల్పమాత్రమున నాదివ్యగోలోకపరంధా మము సుస్థిరమై పూర్ణచంద్రునివలె వర్తులాకారమున బ్రకాశించుచుండెను. ఆత్మాకాశసదృశముగ నిత్యమైన యాదివ్యగోలోకపరంధామ మాభక్తులకు బరమదుర్లభము. నేను (శివుడు), నారాయణుడు, అనంతుడు, బ్రహ్మ, విష్ణువు, మహావిరాట్పురుషుడు, గంగ, లక్ష్మి, సరస్వతి, నీవు (పార్వతి), విష్ణు మాయ, సావిత్రి, తులసి, గణేశ్వరుడు, సనత్కుమారుడు, స్కందుడు, నర నారాయణఋషులు, కపిలుడు, దక్షిణ, యజ్ఞము, బ్రహ్మపుత్రులు, యోగులు, వాయువు, వరుణుడు, చంద్రుడు, సూర్యుడు, రుద్రులు, అగ్ని, శ్రీకృష్ణమంత్రోపాసకు లైనభారతీయభక్తులు, వీ రందఱు గోలోకమును దర్శించిరి. ఇతరుల కీదివ్యలోక మదృశ్యము.

ఆగోలోకపరంధామములో నవీననీరదశ్యామలవర్ణుడు నిరామయుడు నైనశ్రీకృష్ణభగవానుడు దివ్యరత్నసింహాసనము నధిష్ఠించి సచ్చిదానందవిగ్ర హుడై భక్తజనులకు దివ్యదర్శన మొసంగును. రత్నమాలాకిరీటాదులచే, రత్న భూషణములచే భూషితుడై వహ్నిశుద్ధనిర్మల పీతాంబరధారియై శ్రీకృష్ణపర మాత్మ సదా విరాజిల్లును. ఆయన చందనోక్షితసర్వాంగుడు, కిశోరగోపబాల వేషధారి, నూతనజలధరకాంతియుతుడు, శ్వేతపంకజవిశాలలోచనుడు, శర త్పూర్ణిమాచంద్రశోభనే తిరస్కరించుమందహాసవదనముగలవాడు. శ్రీకృష్ణుడు పరమమనోహరుడు, ద్విభుజుడు, మురళీహస్తుడు, భక్తానుగ్రహవిగ్రహుడు. ఆసకలజగన్నియంత, స్వేచ్ఛామయుడు, పరమస్వతంత్రుడు, ప్రకృతికే యతీ తుడు, పరబ్రహ్మస్వరూపుడు, ప్రాకృతగుణరహితుడు, దివ్యగుణయుక్తుడు, పర మాత్మ. ధ్యానమునకుగూడ నాయన యసాధ్యుడు, దురారాధ్యుడు, అభక్త లకు బరమదుర్లభుడు. పండ్రెండుగురు గోపపార్షదులు శ్రీకృష్ణుని బరివేష్టించి శ్వేతచామరములతో వీచుచు నాయనసేవలందు సంలగ్నులై యుందురు. సుస్థిరయౌవనసంపన్నలు, వహ్నిశుద్ధవస్త్రధారిణులు, రత్నాభరణ భూషితలు, ప్రేమపీడితలు, పరమమనోహారిణులు నైనగోపకాంతలు మంద స్మిత ముఖారవిందలై సదా యాదివ్యసుందరవిగ్రహుని వీక్షించు చుందురు.

పార్వతీ! రాసమండలమధ్యభాగములో బరాత్పరుడు, పరమపురుషుడైన శ్రీకృష్ణభగవానునిదివ్యమంగళవిగ్రహమును సుయజ్ఞుడు దర్శించి చరితార్థుడయ్యెను. శ్రీరాధకూడ దనప్రాణవల్లభునిదివ్యసందర్శనమున సంలగ్నురాలైనది. నాల్గువేదములు మనోహరరూపములను ధరించి యవ్వేదాతీతుని బ్రస్తుతింప నారంభించినవి. రాగరాగిణులుకూడ రూపవతులై వాద్యయంత్రములను బ్రయోగించుచు శ్రీకృష్ణదివ్యనామసంకీర్తనముల నొనరింపదొడంగిరి. శివా! నిత్యసనాతని యగుప్రకృతితో నీవుకూడ నాయనదివ్యచరణారవిందముల సేవలందు సదా సంలగ్నురాలవై యుందువు. భగవతీ! శ్రీకృష్ణపరమాత్మ తులసీదళమండితుడు. కస్తూరి, కుంకుమ, గంధము, చందనము, దూర్వాంకురములు, అక్షతలు, పారిజాతపుష్పములు, విరజానదీనిర్మలజలములలో గలిపిగోలోకమందు గలపరమాత్మభక్తులాజలములనే నిత్యము భగవంతున కర్ఘ్యముగ నర్పింతురు. భక్తులారాధించుసమయమున బరమాత్మ దివ్యమంగళవిగ్రహముగ శోభించుచు దర్శనమొసంగును. పార్వతీ! శ్రీకృష్ణపరమాత్మ సదా సుప్రసన్నుడు, సర్వతంత్రస్వతంత్రుడు, సర్వకారణకారణుడు, సర్వాంతరాత్మ, సర్వేశ్వరుడు, సర్వజీవనుడు, సర్వాధారుడు, సర్వపూజ్యుడు, సనాతనుడు, అఖండపరబ్రహ్మజ్యోతికి గారణమూర్తి, సర్వసంపత్స్వరూపుడు, సకలసంపత్ప్రదాత, సర్వమంగళస్వరూపుడు, సర్వమంగళకారణుడు, సర్వమంగళదాత, సమస్తమంగళములకే మంగళస్వరూపుడు.

శ్రీకృష్ణపరమాత్మ సచ్చిదానందవిగ్రహమును దర్శించి పరమానందభరితుడై సుయజ్ఞుడు విమానమును దిగి పులకితశరీరుడై యశ్రుపూర్ణనయనుడై భగవంతునిచరణారవిందములపై దండమువలె బడి యనేకప్రణామము లర్పించెను. శ్రీకృష్ణపరమాత్మ తనపాదముల నాశ్రయించినసుయజ్ఞునకు దాస్యసౌభాగ్యమును, శుభాశీర్వాదమును బరమదుర్లభము, సత్యము నగు తన యనన్యభక్తిని బ్రసాదించెను. శ్రీరాధ విమానము డిగ్గి శ్రీకృష్ణుని వక్షఃస్థలమందు విరాజమానురాలైనది.

ప్రాచీనకాలమందలి వేదవేత్తలైనవిద్వాంసులు వేదకథనానుసారముగ మొదట శ్రీరాధానామమునే యుచ్చరించి తదనంతరమే కృష్ణ యని లేక మాధవ యని పల్కెదరు. ఈవిధానమునకు విపరీతముగ నుచ్చరించువారు ఆజగదంబను, శ్రీకృష్ణ ప్రాణాధిక ప్రియురాలిని, ప్రేమమయశక్తిని

శ్రీరాధను నిందించువారు సూర్యచంద్రులస్థితిపర్యంతము కాలసూత్రనరక మనుభవించి తదనంతరము నూఱుజన్మములవఱకు స్త్రీపుత్రరహితులై, మహా రోగయుక్తులై దుఃఖింపగలరు.

సతీ! యిట్లు నేను బరమోత్తమశ్రీరాధోపాఖ్యానమును వర్ణించితిని. సతి, భగవతి, వైష్ణవి, నారాయణి, విష్ణుమాయ, మూలప్రకృతి, యీశ్వరి నామములను ధరించునాద్యశక్తివి నీవే. దేవీ! నీవు మాయ నాశ్రయించి యేమియు దెలియనిదానివలె నటించుచు నన్ను బరీక్షించుచున్నావు. పార్వతీ! నీవు స్వయముగ సర్వజ్ఞురాలవు, సర్వస్వరూపిణివి, సకలస్త్రీజాతికి నధిదేవతవు, పూర్వజన్మముల విషయములు జ్ఞప్తియం దుంచుకొనగల శ్రేష్ఠపరాశక్తివి. శ్రీరాధోపాఖ్యానమును వర్ణించితిని. ఇక నేవిషయములను శ్రవణమొనరింప గోరుచున్నావో తెల్పుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతి ఖండములోని నారదనారాయణ
సంవాదమున సుయజ్ఞుడు గోలోకమునకు
వెడలుట యను ఏబదినాల్గవ
అధ్యాయము
సంపూర్ణము.

—o—

# ఏబదియైదవ అధ్యాయము

## శ్రీరాధాధ్యానము, షోడశోపచారపూజావిధి, పరిహారస్తవము, పూజామహిమ, స్తుతి, మాహాత్మ్యముల వర్ణనము.

పార్వతీదేవి పలికెను :

భగవానుడా! పురుషోత్తముడు, సకలేశ్వరేశ్వరుడునైన శ్రీకృష్ణునిదివ్య మంత్రమున్నను నావైష్ణవనరేశ్వరుడైనసుయజ్ఞుడు శ్రీరాధామంత్రమునేల గ్రహించెను? సుతపోమహర్షి సుయజ్ఞునకు శ్రీరాధారాధన మొనర్పనేవిధా నము నుపదేశించెను ? ఏధ్యానమును, స్తోత్రమును, కవచమును, మంత్రమును నుపదేశించెను? శ్రీరాధాదేవిపూజావిధాన మంతయు గృపతో నా కుపదే శింప బ్రార్థించుచున్నాను.

మహేశ్వరుడు పలికెను :

ప్రియా! సుయజ్ఞుడు సుతపోమహర్షి నిట్లు ప్రశ్నించెను "ఓవిప్రశ్రేష్ఠా! మహర్షీ! నేనెవరిని భజింపవలెను? ఎవరి నారాధించిన శీఘ్రముగ నాకు గోలోకము లభించును?" రాజొనరించినప్రశ్నముల నాలకించి యాబ్రాహ్మణ శిరోమణి యిట్లు ప్రత్యుత్తర మొసంగెను. "మహారాజా ! శ్రీకృష్ణసేవవలన దద్దివ్యలోకమును నీ వనేకజన్మములపిదపగాని చేరలేవు; కావున శ్రీకృష్ణప్రాణా ధిష్ఠాతృదేవి, పరాత్పరస్వరూపిణి యగు శ్రీరాధను భజింపుము, ఆమె యపారకృపామయి. శ్రీరాధానుగ్రహమునకు బాత్రులైనసాధకులు శీఘ్రమే గోలోకపరంధామము నొందగలరు". ఇట్లాదేశించి యామహర్షి సుయజ్ఞునకు శ్రీరాధాషడక్షరమంత్రము నుపదేశించెను.

'ఓం రాధాయై స్వాహా' ఈ దివ్యమంత్రమే శ్రీరాధామూలమంత్రము. మూలమంత్రమును బ్రసాదించి సుతపోమహర్షి సుయజ్ఞునకు ప్రాణాయామ మును, భూతశుద్ధిని, మంత్రన్యాసమును, గరన్యాసమును, అంగన్యాసమును, శ్రీరాధాసర్వమర్గ్లభ ధ్యానమును, గవచమును, స్తోత్రమును నుపదేశించెను. మహర్షి యుపదేశానుసారముగ సుయజ్ఞుడు శ్రీరాధామంత్రజప మొనరించెను. పూర్వకాలములో నేధ్యానముచే శ్రీకృష్ణపరమాత్మయే శ్రీరాధను ధ్యానించి

పూజించెనో, యాసామవేదోక్తధ్యానము నుపదేశించెద నవధరింపుము. పార్వతీ! శ్రీరాధాధ్యానము సకలమంగళములకే మంగళకరము.

### శ్రీ రా ధా దే వి ధ్యా న ము

శ్వేతచమ్పకవర్ణాభాం కోటిచన్ద్రసమప్రభామ్ ।
శరత్పార్వణచన్ద్రాస్యాం శరత్పఙ్కజలోచనామ్ ॥

సుశ్రోణీం సునితమ్బాం చ పక్వబిమ్బాధరాం వరామ్ ।
ముక్తాపఙ్క్తివినిన్దైకదన్తపఙ్క్తిమనోహరామ్ ॥

ఈషద్ధాస్యప్రసన్నాస్యాం భక్తానుగ్రహకారికామ్ ।
వహ్నిశుద్ధాం శుకాధానాం రత్నమాలావిభూషితామ్ ॥

రత్నకేయూరవలయాం రత్నమంజీరరంజితామ్ ।
రత్నకుణ్డలయుగ్మేన విచిత్రేణ విరాజితామ్ ॥

సూర్యప్రభాప్రతికృతిగణ్డస్థలవిరాజితామ్ ।
అమూల్యరత్నఖచితగ్రైవేయకవిభూషితామ్ ॥

సద్రత్నసారనిర్మాణకిరీటముకుటోజ్జ్వలామ్ ।
రత్నాఙ్గులీయసంయుక్తాం రత్నపాశకశోభితామ్ ॥

బిభ్రతీం కబరీ భారం మాలతీమాల్యశోభితమ్ ।
రూపాధిష్ఠాతృదేవీం చ గజేన్ద్రమన్దగామినీమ్ ॥

గోపీభిః సుప్రియాభిశ్చ సేవితాం శ్వేతచామరైః ।
కస్తూరీబిన్దుభిః సార్థ మధశ్చన్దనబిన్దునా ॥

సిన్దూరబిన్దునా చారు సీమన్తాధఃస్థలోజ్జ్వలామ్ ।
నిత్యం సుపూజితాం భక్త్యా కృష్ణేన పరమాత్మనా ॥

కృష్ణసౌభాగ్యసంయుక్తాం కృష్ణప్రాణాధికాం వరామ్ ।
కృష్ణప్రాణాధిదేవీం చ నిర్గుణాం చ పరాత్పరామ్ ॥

మహావిష్ణువిధాత్రీం చ ప్రదాత్రీం సర్వసంపదామ్ ।
కృష్ణభక్తిప్రదాం శాన్తాం మూలప్రకృతి మీశ్వరీమ్ ॥

వైష్ణవీం విష్ణుమాయాం చ కృష్ణప్రేమమయీం శుభామ్,
రాసమణ్డలమధ్యస్థాం రత్నసింహాసనస్థితామ్ ।
రాసే రాసేశ్వరయుతాం రాధాం రాసేశ్వరీం భజే ॥ (10-21)

శ్వేతచంపక పుష్పవర్ణమువంటి కాంతిగలదియు, కోటిచంద్రులవంటి

ప్రభగలదియు, శరత్పూర్ణిమాచంద్రునివంటి ముఖముకలదియు, శరత్కాలపంక జములవంటి లోచనములు గలదియు, మంచినితంబములు గలదియు, పండిన దొండపండువంటి అధరముకలదియు, ముత్యాలవరుసను దిరస్కరించు దంత పంక్తులతో మనోహరమైనదియు, చిరునవ్వుచే ప్రసన్నమైనముఖముగలదియు, భక్తుల ననుగ్రహించునదియు, వహ్నిశుద్ధాంశుకములను ధరించునదియు, రత్న మాలలచే విభూషితయు, రత్నకేయురవలయములుగలదియు, రత్నమంజీరము లచే రంజితమైనదియు, రత్నకుండములచే విచిత్రముగ విరాజిల్లునదియు, సూర్యప్రభలతోసమాన మైనకపోలములతో విరాజిల్లునదియు, అమూల్యము లగురత్నములచే గూర్చబడినకంఠహారములచే నలంకరింపబడినదియు, ఉత్తమ రత్నములసారముచే నిర్మితమైనకిరీటముకుటములచే శోభిల్లునదియు, రత్నాంగు ళులతోగూడినదియు, రత్నపాశకములచే శోభిల్లునదియు, మాలతీమాల్యములచే శోభిల్లుకేశపాశమును ధరించునదియు, రూపాధిష్ఠాతృదేవియు, గజరాజుగమ నమువంటి గమనముగలదియు, అత్యంతప్రియ లైనగోపికలచేత, శ్వేతచామర ములచేత సేవింపబడునదియు, కస్తూరీబిందువులచేత, క్రింద చందనబిందువుచేత, సిందూరబిందువుచేత మనోహరసీమంతనిమ్నభాగముచేత ప్రకాశించుచున్న దియు, పరమాత్మ యగుశ్రీకృష్ణునిచే నిత్యము భక్తితో పూజింపబడునదియు, కృష్ణసౌభాగ్యముతోగూడినదియు, కృష్ణప్రాణాధికయు, కృష్ణప్రాణాధిదేవియు, నిర్గుణయు, పరాత్పరియు, మహావిష్ణువిధాత్రియు, సర్వసంపత్ప్రదాత్రియు, కృష్ణ భక్తిప్రదయు, శాంతయు, మూలప్రకృతియు, ఈశ్వరియు, శుభముకలదియు, వైష్ణవియు, విష్ణుమాయయు, కృష్ణప్రేమమయియు, రాసమండలమధ్యస్థయు, రత్నసింహాసనమునం దధిష్ఠించినదియు, రాసమున రాసేశ్వరునితోగూడినదియు, రాసేశ్వరియు నగుశ్రీరాధాదేవిని సేవించుచున్నాను.

ఇట్లు ధ్యానించి మస్తకముపై బుష్పముల నర్పించి. మరల జగదంబ శ్రీరాధాదేవిని జింతించి పుష్పముల నర్పింపవలెను. మరల ధ్యానమొనరిం చినపిదప షోడశోపచారముల నర్పింపవలెను. ఆసనము, వస్త్రము, పాద్యము, అర్ఘ్యము, గంధము, అనులేపనము, ధూపము, దీపము, సుందరపుష్పము, స్నానీయము, రత్నభూషణము, వివిధనైవేద్యము, సువాసితతాంబూలము, జలము, మధుపర్కము, రత్నమయశయ్య యివియే షోడశోపచారములు. సుయజ్ఞ డీయుపచారములను వేదోక్తమంత్రముల నుచ్చరించుచు భక్తిభావ

ముతో శ్రీరాధ కర్పించెను. ఆయుపచారసమర్పణము సర్వసమ్మతమంత్ర ములనుపదేశించెద నవధరింపుము.

రత్నసారవికారం చ నిర్మితం విశ్వకర్మణా ।
వరం సింహాసనం రమ్యం రాధే పూజాసు గృహ్యతామ్ ॥ 24

రాధాదేవీ! రత్నసారముచే విశ్వకర్మనిర్మించిన యీరమ్యశ్రేష్ఠసింహాసనమును బూజాసమయమున నర్పించుచున్నాను. కృపతో స్వీకరింపుము.

అమూల్యరత్నఖచిత మమూల్యం సూక్ష్మమేవ చ ।
వహ్నిశుద్ధం నిర్మలం చ వసనం దేవి! గృహ్యతామ్ ॥ 25

దేవీ! బహుమూల్యరత్నములతో ఘటితములై, యమూల్యములైన సూక్ష్మవస్త్రములు నీసేవయం దర్పితములు. ఈవస్త్రములగ్నిపై శుద్ధిగావింపబడిన నిర్మలవస్త్రములు. నాచే సమర్పింపబడిన యీవస్త్రములను స్వీకరింపుము.

సద్రత్నసారపాత్రస్థం సర్వతీర్థోదకం శుభమ్ ।
పాదప్రక్షాళనార్థం చ రాధే! పాద్యం చ గృహ్యతామ్ ॥ 26

రాధాదేవీ! ఉత్తమరత్నసారనిర్మితపాత్రలో సర్వతీర్థములశుభజలములు నీసేవ కర్పింపబడినవి. మాతా! నీదివ్యచరణ ప్రక్షాళనార్థమై నాచే నర్పింపబడిన యీపాద్యజలములను గ్రహింపుము.

దక్షిణావర్తశఙ్ఖస్థం సుదూర్వాపుష్పచన్దనమ్ ।
పూతం యుక్తం తీర్థతోయై రాధేఽర్ఘ్యం ప్రతిగృహ్యతామ్ ॥ 27

రాధామాతా! దక్షిణావర్తశంఖములో నుంచినదూర్వాపుష్పచందనతీర్థజలయుక్తమైన యీపవిత్రార్ఘ్యము నీసేవలందు ప్రస్తుతము కృపతో స్వీకరింపుము.

పార్థివద్రవ్యసమ్భూత మతీవసురభీకృతమ్ ।
మఙ్గలార్హం పవిత్రం చ రాధే! గన్ధం గృహాణ మే ॥ 28

దేవీ! పార్థివద్రవ్యములతో సిద్ధముచేయబడి యత్యంతసుగంధిలమై మంగళార్హమైన యీపవిత్రగంధము నర్పించుచున్నాను. దయతో గ్రహింపుము.

శ్రీఖణ్డచూర్ణం సుస్నిగ్ధం కస్తూరీకుఙ్కుమాన్వితమ్ ।
సుగన్ధయుక్తం దేవేశి! గృహ్యతా మనులేపనమ్ ॥ 29

దేవేశ్వరీ! కస్తూరీకుంకుమలచే సంపన్నమై సుగంధయుక్తమైన యీ మెత్తనిచందనచూర్ణము ననులేపనరూపమున నీ కర్పించుచున్నాను. కృపతో స్వీకరింపుము.

వృక్షనిర్యాససంయుక్తం పార్థివద్రవ్యసంయుతమ్ ।
అగ్నిఖణ్డశిఖాజాతం ధూపం దేవి! గృహాణ మే ॥ 30

దేవీ! వృక్షనిర్యాససంయుక్తమై పార్థివద్రవ్యములతో సమ్మిళితమై ప్రజ్వలితాగ్నిశిఖనుండి నిర్గతమైన ధూపమును నీసేవలందుంచితిని. మాతా! కృపతో స్వీకరింపుము.

అన్ధకారే భయహర మమూల్యమణిశోభితమ్ ।
రత్నదీపం శోభాఢ్యం గృహాణ పరమేశ్వరీ ! ॥ 31

పరమేశ్వరీ! అమూల్యరత్ననిర్మితమైన యీపవిత్రోజ్జ్వలశోభాసంపన్న రత్నప్రదీప మంధకారభయమును దూరమొనరించును. దేవీ! దీపమును కృపతో గ్రహింపుము.

పారిజాతప్రసూనం చ గన్ధచన్దనచర్చితమ్ ।
అతీవ శోభనం రమ్యం గృహ్యతాం పరమేశ్వరి ! ॥ 32

పరమేశ్వరీ ! గంధచందనములతో జర్చితములై యత్యంతశోభాయమానములైనయీరమణీయపారిజాతపుష్పములను గ్రహింపుము.

సుగన్ధామలకీచూర్ణం సుస్నిగ్ధం సుమనోహరమ్ ।
విష్ణుతైలసమాయుక్తం స్నానీయం దేవి! గృహ్యతామ్ ॥ 33

దేవీ! విష్ణుతైలయుక్తమైనయీబహుమనోహరసుస్నిగ్ధసుగంధిల్లామలక చూర్ణము నీసేవలందు సమర్పితము. ఈస్నానోపయోగమైనవస్తువును కృపతో స్వీకరింపుము.

అమూల్యరత్ననిర్మాణం కేయూరవలయాదికమ్ ।
శఙ్ఖం సుశోభనం రాధే! గృహ్యతాం భూషణం మమ ॥ 34

రాధాదేవీ! అమూల్యరత్నములచే నిర్మింపబడిన యీ కేయూర కంకణా

ద్యాభరణములను, బరమశోభను బ్రసాదించుశంఖాకారచూడాభూషణములను నీసేవలందు సమర్పించుచున్నాను. కృపతో స్వీకరింపుము.

కాలదేశోద్భవం పక్వఫలం చ లడ్డుకాదికామ్ ।
పరమాన్నం చ మృష్టాన్నం నైవేద్యం దేవి ! గృహ్యతామ్ ॥ 35

దేవీ ! దేశకాలానుసారముగ నుపలబ్ధము లైన సుపక్వఫలములను, లడ్లను, మృష్టాన్నమును, బరమాన్నమును నైవేద్యముగ సమర్పించుచున్నాను. ఈనైవేద్యములను స్వీకరింపుము.

తామ్బూలం చ వరం రమ్యం కర్పూరాది సువాసితమ్ ।
సర్వభోగాధికం స్వాదు సలిలం దేవి ! గృహ్యతామ్ ॥ 36

దేవీ! కర్పూరాదులచే సువాసితమై శ్రేష్ఠమైన యీరమ్యతాంబూలమును సర్వభోగములందు నుత్కృష్ట మైనస్వాదుజలములను గృపతో స్వీకరింపుము.

అశనం రత్నపాత్రస్థం సుస్వాదు సుమనోహరమ్ ।
మయా నివేదితం భక్త్యా గృహ్యతాం పరమేశ్వరి ! ॥ 37

పరమేశ్వరీ! రత్నపాత్రలో నుంచబడిన యీమధుపర్క మత్యంతస్వాదిష్టము, పరమమనోహరము. నేను భక్తిభావముతో నీసేవలందు సమర్పించితిని. కృపతో స్వీకరింపుము.

రత్నేన్ద్రసారనిర్మాణం వహ్నిశుద్ధాంశుకాన్వితమ్ ।
పుష్పచన్దనచర్చాఢ్యం పర్యఙ్కం దేవి! గృహ్యతామ్ ॥ 38

దేవీ! శ్రేష్ఠరత్నములసారముచే నిర్మితమై యగ్నిశుద్ధనిర్మలవస్త్రములచే నాచ్ఛాదితమై పుష్పచందనచర్చిత మైనయీశయ్యను నీసేవలందు సమర్పించుచున్నాను. కృపతో స్వీకరింపుము.

ఇట్లు శ్రీరాధాదేవికి షోడశోపచారపూజ లొనరించి మూడుపర్యాయములు పుష్పాంజలుల నర్పింపవలెను. తదనంతరము శ్రీరాధాదేవి ప్రియపరిచారిక లైనయష్టనాయికలను భక్తిభావముతో బంచోపచారముల సమర్పించి పూజింపవలెను. ప్రియా! పూర్వదిశనుండి యారంభించి యీశాన్యకోణము వఱకు గలయెనిమిదిదిశలలో నీయష్టనాయికలను నారాధింపవలెను. పూర్వదిశలో మాలావతిని, ఆగ్నేయదిశలో మాధవిని, దక్షిణమందు రత్నమాలను,

నైరృత్యకోణమందు సుశీలను, బశ్చిమదిశలో శశికళను, వాయవ్యకోణమందు బారిజాతను, ఉత్తరదిశలో బద్మావతిని, ఈశానకోణమందు సుందరిని యత్న పూర్వకముగ బూజింపవలెను.

ప్రతి వ్రతకాలములో మల్లికామాలతీ కమలమాలికలను శ్రీరాధ కర్పించి సామవేదోక్త రీతిచే బరిహార మను స్తుతితో స్తుతింపవలెను.

శ్రీ రాధా దేవి పరిహార స్తుతి

త్వం దేవీ జగతాం మాతా విష్ణుమాయా సనాతనీ ।
కృష్ణప్రాణాధిదేవీ చ కృష్ణప్రాణాధికా శుభా ॥

కృష్ణప్రేమమయీ శక్తిః కృష్ణసౌభాగ్యరూపిణీ ।
కృష్ణభక్తిప్రదే‌ః రాధేః నమస్తే మఙ్గలప్రదే ॥

అద్య మే సఫలం జన్మ జీవనం సార్థకం మమ ।
పూజితాసి మయా సా చ యా శ్రీకృష్ణేన పూజితా ॥

కృష్ణవక్షసి యా రాధా సర్వసౌభాగ్యసంయుతా ।
రాసే రాసేశ్వరీరూపా బృన్దా బృన్దావనే వనే ॥

కృష్ణప్రియా చ గోలోకే తులసీ కాననే తు యా ।
చమ్పావతీ కృష్ణసఙ్గే క్రీడా చమ్పకకాననే ॥

చన్ద్రావలీ చన్ద్రవనే శతశృంగే సతీతి చ ।
విరజాదర్పహన్త్రీ చ విరజాతటకాననే ॥

పద్మావతీ పద్మవనే కృష్ణా కృష్ణసరోవరే ।
భద్రా కుంజకుటీరే చ కామ్యా వై కామ్యకే వనే ॥

వైకుణ్ఠే చ మహాలక్ష్మీ ర్వాణీ నారాయణోరసి ।
క్షీరోదే సిన్ధుకన్యా చ మర్త్యే లక్ష్మీ ర్హరిప్రియా ॥

సర్వస్వర్గే స్వర్గలక్ష్మీ ర్దేవదుఃఖవినాశినీ ।
సనాతనీ విష్ణుమాయా దుర్గా శంకరవక్షసి ॥

సావిత్రీ వేదమాతా చ కలయా బ్రహ్మవక్షసి ।
కలయా ధర్మపత్నీ త్వం నరనారాయణప్రసూః ॥

కలయా తులసీ త్వం చ గఙ్గా భువనపావనీ ।
లోమకూపోద్భవా గోప్యః కలాంశా రోహిణీ రతిః ॥

కలా కలాంశరూపా చ శతరూపా శచీ దితిః ।
అదితి ర్దేవమాతా చ త్వత్కలాంశా హరిప్రియా ॥
దేవ్యశ్చ మునిపత్న్యశ్చ త్వత్కలా కలయా శుభే ।
కృష్ణభక్తిం కృష్ణదాస్యం దేహి మే కృష్ణపూజితే ॥
ఏవం కృత్వా పరీహారం స్తుత్వా చ కవచం పఠేత్ ।
పురాకృతం స్తోత్ర మేత ద్భక్తిదాస్యప్రదం శుభమ్ ॥ (44-57)

శ్రీరాధా ! నీవు దేవివి, జగజ్జననివి, సనాతనివి, విష్ణుమాయవు, శ్రీకృష్ణుని ప్రాణములకే యధిష్ఠాత్రీదేవివి. ఆయనకు స్వప్రాణములకంటె నధికప్రియురాలవు, శుభస్వరూపిణివి. దేవీ ! నీవు కృష్ణప్రేమమయశక్తివి, శ్రీకృష్ణసౌభాగ్యస్వరూపిణివి, శ్రీకృష్ణభక్తిని బ్రసాదించుమంగళప్రదాయనివి. నీకు నమస్కారము. నేడు నాజన్మము సఫలమైనది, నాజీవనము సార్థకమైనది, ఎందువలన ననగా శ్రీకృష్ణు డేదేవిని బూజించెనో, యాదేవియే నేడు నావలన బూజింపబడుచుండెను. శ్రీకృష్ణవక్షఃస్థలములో నేసౌభాగ్య సంపన్నురాలైనభగవతి శ్రీరాధగవిరాజిల్లెనో, యామెయే రాసమండలములో రాసేశ్వరి, బృందావనములో బృందాదేవి, గోలోకములో గృష్ణప్రియ; తులసీకాననములో దులసీదేవి, కృష్ణసాంగత్యములో జంపావతి, చంపకకానన ములో గ్రీడ, చందనవనములో జంద్రావతి; శతశృంగపర్వతముపై సతి, విరజాతటముపై విరాజిల్లుకాననములో విరజాదర్పహంత్రి, పద్మవనములో బద్మావతి, కృష్ణసరోవరములో గృష్ణ, కుంజకుటీరములో భద్ర, కామ్యకవనములో గామ్య, వైకుంఠములో మహాలక్ష్మి, నారాయణుని హృదయములో వాణి, క్షీరసాగరములో సింధుకన్య, మర్త్యలోకములో హరిప్రియలక్ష్మి, స్వర్గములో దేవదుఃఖవినాశని స్వర్గలక్ష్మి, శంకరునివక్షఃస్థలముపై సనాతని విష్ణుమాయ దుర్గ. శ్రీరాధయే తనకళామూలమున వేదమాత సావిత్రియై బ్రహ్మ వక్షఃస్థలములో విరాజిల్లును. దేవీ! రాధా! నీవే నీకళతో ధర్మపత్నివై నరనారాయణఋషులకు జననివైనావు. నీవే నీకళవలన దులసివైనావు, భువనపావని గంగ వైనావు. గోపిక లందఱు నీరోమకూపములనుండి ప్రాదుర్భవించిరి. రోహిణి, రతి మొదలగువారు నీకళాంశస్వరూపులే. శతరూప, శచి, దితి నీకళలకు కళాంశరూపిణులే. దేవమాత హరిప్రియ యదితి నీకళాంశ స్వరూపిణియే. దేవాంగనలు, మునిపత్నులు నీకళాకళాంశములనుండి ప్రాదు

ర్భవించినవారే. శ్రీకృష్ణపూజితా ! నీవు నాకు శ్రీకృష్ణభక్తిని, శ్రీకృష్ణ
దాస్యసౌభాగ్యములను ప్రసాదింపుము. ఇట్లీపరిహార మను స్తుతిని స్తుతించి
కవచమును బఠింపవలెను. ఈప్రాచీనశుభ స్తోత్రము శ్రీహరిభక్తిని, దాస్య
సౌభాగ్యమును ప్రసాదింపగలదు.

ప్రతిదినముపైనిజెప్పినవిధముగ శ్రీరాధాపూజ సంపన్న మొనరించు
వారు భారతవర్షములో సాక్షాత్తుగ విష్ణుసములు కాగలరు. వారు జీవన్ము
క్తులై పవిత్రులు కాగలరు. వారికి నిశ్చయముగ గోలోకధామము లభించును.
పార్వతీ! ప్రతిసంవత్సరము కార్తికపూర్ణిమాశుభసమయమున నీక్రమములో
శ్రీరాధారాధన సంపన్న మొనరించువారు రాజసూయయజ్ఞఫలమును బొంద
గలరు; వారిహాలోకములో నుత్తమైశ్వర్యసంపన్నులై, పుణ్యవంతులై యంత్య
కాలములో సర్వపాపములనుండి ముక్తులై శ్రీకృష్ణధామము జేరగలరు.
షణ్ముఖవిఘ్నరాజజననీ ! ఆదికాలములో బ్రప్రథమమున శ్రీకృష్ణపరమాత్మ
ఈక్రమములో బృందావనాంతర్గత రాసమండలములో భగవతి శ్రీరాధను
బూజించి స్తుతించెను. తదనంతరము నీవరప్రభావమున వేదమాత యగు
సావిత్రిని దనహృదయేశ్వరిగ బొంది సృష్టికర్త బ్రహ్మ యీక్రమముగనే భగ
వతిశ్రీరాధారాధనలను సంపన్న మొనరించెను. నారాయణుడుకూడ శ్రీరాధా
దేవి నారాధించి మహాలక్ష్మిని, సరస్వతిని, గంగను, భువనపావని పరాశక్తిని
తులసిని ప్రియపత్నులుగ బొందగల్గెను. క్షీరసాగరశయను డైన శ్రీవిష్ణువు
శ్రీరాధాదేవి నారాధించియే సింధుకన్యకను దనయర్ధాంగిగ బొందగల్గెను.
మొదట దక్షకన్య యంతర్ధాన మందగా నేనుగూడ శ్రీకృష్ణుని యాజ్ఞానుసార
ముగ బుష్కరక్షేత్రములో శ్రీరాధ నారాధించి యాపూజాఫలప్రభావమున
నిన్ను నర్ధాంగిగ బొందగల్గితిని. శ్రీరాధాదేవిని బూజించి యావే యను
గ్రహమునకు బాత్రులై కామదేవుడు రతిని, ధర్మదేవుడు సతీసాధ్వీమూర్తిని,
దేవతలు, మునులు, ధర్మార్థకామమోక్షములను బొందగల్గిరి. పార్వతీ !
యిట్లు నేను శ్రీరాధాదేవి పూజావిధానమును వర్ణించితిని. తదనంతరము
స్తోత్రమును వర్ణించెద నవధరింపుము.

ఒకానొకసమయమున శ్రీరాధ కోపించి శ్రీకృష్ణునిసమీపమునుండి
యంతర్ధానమందెను. అపుడు బ్రహ్మలు, విష్ణువులు, శివాదులు, దేవతలు
మొదలుగాగలసర్వులు నైశ్వర్యభ్రష్టులై, శ్రీహీనులై, భార్యారహితులై

ఉపద్రవగ్రస్తులై శ్రీకృష్ణభగవానుని శరణువేడిరి, శ్రీకృష్ణపరమాత్మ శ్రీరాధాప్రసన్నత్వముకొఱకై యామెను యథావిధి పూజించి యిట్లు స్తుతింప నారంభించెను.

## శ్రీ రా ధా దే వి స్తో త్ర ము

శ్రీ కృ ష్ణ ఉ వా చ :

ఏవమేవ ప్రియోఽహం తే ప్రమోదశ్చైవ తే మయి ।
సువ్యక్త మద్య కాపట్యవచనం తే వరాననే ॥

హేకృష్ణ! త్వం మమ ప్రాణా జీవాత్మేతి చ సంతతమ్ ।
బ్రూషే నిత్యం తు యత్ ప్రేమ్ణా సామ్ప్రతం తద్గతం ద్రుతమ్ ॥

అస్మాకం వచనం సత్యం యద్ బ్రవీమీతి తద్ ధ్రువమ్ ।
పంచప్రాణాధిదేవీ త్వం రాధా ప్రాణాధికేతి మే ॥

శక్తో న రక్షితుం త్వాం చ యాన్తి ప్రాణా స్త్వయా వినా ।
వినాధిష్ఠాతృదేవీం చ కో వా కుత్ర చ జీవతి ॥

మహావిష్ణోశ్చ మాతా త్వం మూలప్రకృతి రీశ్వరీ ।
సగుణా త్వం చ కలయా నిర్గుణా స్వయమేవ తు ॥

జ్యోతీరూపా నిరాకారా భ క్తానుగ్రహవిగ్రహా ।
భక్తానాం రుచివైచిత్ర్యా న్నానామూర్తిశ్చ బిభ్రతీ ॥

మహాలక్ష్మీశ్చ వైకుణ్ఠే భారతీ చ సతాం ప్రసూః ।
పుణ్యక్షేత్రే భారతే చ సతీ త్వం పార్వతీ యథా ॥

తులసీ పుణ్యరూపా చ గఙ్గా భువనపావనీ ।
బ్రహ్మలోకే చ సావిత్రీ కలయా త్వం వసున్ధరా ॥

గోలోకే రాధికా త్వం చ సర్వగోపాలకేశ్వరీ ।
త్వయా వినాహం నిర్జీవో హ్యశక్త స్సర్వకర్మసు ॥

శివః శక్త స్త్వయా శ క్త్యా శవాకార స్త్వయా వినా ।
వేదకర్తా స్వయం బ్రహ్మ వేదమాత్రా త్వయా సహ ॥

నారాయణ స్త్వయా లక్ష్మ్యా జగత్పాతా జగత్పతిః ।
ఫలం దదాతి యజ్ఞశ్చ త్వయా దక్షిణయా సహ ॥

బిభర్తి సృష్టిం శేషశ్చ త్వాం కృత్వా మస్తకే భువమ్ ।
బిభర్తి గఙ్గారూపాం త్వాం మూర్ధ్ని గఙ్గాధరః శివః ॥

శక్తిమచ్చ జగత్ సర్వం శవరూపం త్వయా వినా ।
వక్తా సర్వ స్త్వయా వాణ్యా సూతో మూక స్త్వయా వినా ॥

యథా మృదా ఘటం కర్తుం కులాలః శక్తిమాన్ సదా ।
సృష్టిం స్రష్టుం తథాహం చ ప్రకృత్యా చ త్వయా సహ ॥

త్వయా వినా జడ శ్చాహం సర్వత్ర చ న శక్తిమాన్ ।
సర్వశక్తిస్వరూపా త్వం సమాగచ్ఛ మమాన్తికమ్ ॥

వహ్నౌ త్వం దాహికా శక్తి ర్నాగ్నిః శక్త స్త్వయా వినా ।
శోభాస్వరూపా చన్ద్రే త్వం త్వాం వినా న స సున్దరః ॥

ప్రభారూపా హి సూర్యే త్వం త్వాం వినా న స భానుమాన్ ।
న కామః కామినీబన్ధు స్త్వయా రత్యా వినా ప్రియే ॥

ఇత్యేవ స్తవనం కృత్వా తాం సమ్ప్రాప జగత్ప్రభుః ।
దేవా బభూవుః సశ్రీకాః సభార్యాః శక్తిసంయుతాః ॥

సస్త్రీకం చ జగత్ సర్వం బభూవ శైలకన్యకే ।
గోపీపూర్ణశ్చ గోలోకో బభూవ తత్ప్రసాదతః ॥

రాజా జగామ గోలోక మితి స్తుత్వా హరిప్రియామ్ ।
శ్రీకృష్ణేన కృతం స్తోత్రం రాధయా యః పఠేన్నరః ॥

కృష్ణభక్తిం చ తద్దాస్యం స ప్రాప్నోతి న సంశయః ।
స్త్రీవిచ్ఛేదే యఃశృణోతి మాసమేకమిదం శుచిః ॥

అచిరా ల్లభతే భార్యాం సుశీలాం సున్దరీం సతీమ్ ।
భార్యాహీనో భాగ్యహీనో వర్షమేకం శృణోతి యః ॥

అచిరా ల్లభతే భార్యాం సుశీలాం సున్దరీం సతీమ్ ।
పురా మయా చ త్వం ప్రాప్తా స్తోత్రేణానేన పార్వతి ॥

మృతాయాం దక్షకన్యాయా మాజ్ఞయా పరమాత్మనః ।
స్తోత్రేణానేన సమ్ప్రాప్తా సావిత్రీ బ్రహ్మణా పురా ॥

పురా దూర్వాససః శాపాన్నిః శ్రీకే దేవతాగణే ।
స్తోత్రేణానేన దేవై స్తైః సమ్ప్రాప్తా శ్రీః సుదుర్లభా ॥

శృణోతి వర్షమేకం చ పుత్రార్థీ లభతే సుతమ్ ।
మహావ్యాధీ రోగముక్తో భవేత్ స్తోత్ర ప్రసాదతః ॥

కార్త్తికీపూర్ణిమాయాం తు తాం సమ్పూజ్య పఠేత్తు యః ।
అచలాం శ్రియమాప్నోతి రాజసూయఫలం లభేత్ ॥

నారీ శృణోతి చేత్ స్తోత్రం స్వామిసౌభాగ్య సంయుతా ।
భక్త్యా శృణోతి యః స్తోత్రం బన్ధనాన్ముచ్యతే ధ్రువమ్ ॥

నిత్యం పఠతి యో భక్త్యా రాధాం సమ్పూజ్య భక్తితః ।
స ప్రయాతి చ గోలోకం నిర్ముక్తో భవబన్ధనాత్ ॥ (72-100)

శ్రీరాధా! నాయెడల నీకుగల ప్రేమ యింతేనా? నాయందు నీకు ప్రీతి యున్నదా? నీమాటలలో నెంతకపటము కలదో యీనాడే గ్రహింపగల్గితిని. "శ్రీకృష్ణా! నీవే నాప్రాణము, నీవే నాజీవాత్మవు" అనుచు నీవు నిరంతరము ప్రేమపూర్వకముగ బలికెడిదానవు. ఆప్రేమయంతయు యిపు డేమైనది? ఎచటకు జనినది? నేను మొదట నీసమక్షములో నేబాసలను జేసితినో యవి యన్నియు నేటికిని సత్యములే. నీవే నాపంచప్రాణములకు నధిష్ఠాత్రీదేవివి. రాధా! నాకు నీవు నాప్రాణములకంటె నధికప్రియురాలవను నాయీవచనములు మొదట నెట్లు సత్యములో నేడును నట్లే యథార్థములు. నేను నిన్ను నా సమీపములో విరాజిల్ల జేసికొనుటలో నసమర్థుడ నైతిని. కావున నీవు లేని నాప్రాణములు నన్ను వీడుచున్నవి. అధిష్ఠాత్రీదేవి లేనిచో నెవ రెట్లెందు జీవింపగలరు? దేవీ! నీవు మహావిష్ణువునకు జననివి, మూలప్రకృతి యీశ్వరివి. స్వయముగ బ్రాకృతనిర్గుణురాల వైననీవు నీకళచే దివ్యగుణసంపన్నురాలవై సగుణరూపమున సాక్షాత్కరించితివి. అఖండజ్యోతిఃపుంజమే నీస్వరూపము. నీవు వాస్తవముగ నిరాకారవు, భక్తుల ననుగ్రహించుటకే రూపమును ధరించి నావు. భక్తులవిభిన్నరుచులనుబట్టి నీవు నానారూపములను ధరించి వారి ననుగ్రహించితివి. వైకుంఠములో నీవు మహాలక్ష్మి సరస్వతీ రూపములతో విరాజిల్లుచున్నావు. పుణ్యక్షేత్ర మైనభారతవర్షములో సత్పురుషులకు జననివి నీవే. నీవే సతీరూపమున బార్వతీరూపమున నవతరించినావు. నీవే పుణ్య స్వరూపిణి యగుతులసివి, భువనపావనియగు గంగవు. బ్రహ్మలోకములో నీవే సావిత్రివి. నీవే నీకళచే వసుంధరవైనావు. గోలోకములో సమస్త గోపికలకు నధీశ్వరి వైన శ్రీరాధవు నీవే, నీవు లేనినేను నిర్జీవుడను, ఏకర్మము నిర్వర్తించుటకైన నసమర్థుడను. నిన్ను శక్తిరూపములో బొందియే శివుడు శక్తిమంతు డైనాడు, నీవు లేనిదే యతడు శివుడు కాడు శవము. నిన్నే వేదమాతసావిత్రీరూపములో బొంది బ్రహ్మదేవుడు వేదములకు బ్రకటనకర్త యని కీర్తింపబడినాడు. లక్ష్మి వైననీసహయోగము పొందియే జగత్పాలకు

డైననారాయణుడు జగమును బాలింపగల్గుచున్నాడు. నీవే దక్షిణారూపమున వెంట నున్న కారణముననే యజ్ఞము యజ్ఞఫలము ప్రసాదింపగల్గుచున్నాడు. పృథ్వీరూపములో నిన్నే యాదిశేషుడు తనమస్తకముపై ధరించి సృష్టిని సంరక్షించుచున్నాడు. గంగాధరుడైనశివుడు నిన్నే గంగారూపమున దన మస్తకముపై ధరించియున్నాడు. నీవలననే సర్వజగములు శక్తివంతము లైనవి. నీవు లేనిదే యన్నియు శవతుల్యములే. నీవే వాణివి, నీయనుగ్రహమునకు బాత్రులైనవారు వక్తలయ్యెదరు. నీయనుగ్రహము లేనిదే పౌరాణికుడైనసూతుడుకూడ మూగివాడు కాగలడు. కులాలుడు (కుమ్మరి) సదా మృత్సహాయోగమువలననే ఘటములను నిర్మించుటలో సమర్థుడైనట్లు ప్రకృతి వైననీసహాయోగము పొంది నేను సృష్టినిర్మాణములో సఫలీకృతుడనైనాను. నీవు లేనిదే జడుడను, నీవు లేనినేను సర్వత్ర శక్తివంతుడను గాను. నీవే సర్వశక్తిస్వరూపిణివి, కావున న న్ననుగ్రహించి, నాచెంతకు రమ్మా. అగ్నిలో నీవే దహనశక్తివి, నీవు లేనిదే యగ్ని దహనకార్యమందు సమర్థుడు కాడు. చంద్రునిలో నీవే శోభవై విరాజిల్లుచున్నావు. నీవు లేనిచంద్రుడు సుందరుడు కానేకాడు. సూర్యునిలో నీవే ప్రభాస్వరూపిణివి. నీవు లేనిదే సూర్యుడు ప్రభాపూర్ణుడై యుండలేడు. ప్రియా ! నీవే రతివి, నీవు లేనిదే కామదేవుడు కాములకు ప్రాణవల్లభుడు కాలేడు.

మ హా దే వు డు ప లి కె ను :

ఇట్లు శ్రీరాధాదేవిని స్తుతించి జగత్ప్రభు వైనశ్రీకృష్ణభగవాను డామెయనుగ్రహమునకు బాత్రుడై మరల భగవతిని బొందగల్గెను. తదనంతరము సర్వదేవతలు శ్రీసంపన్నులై, శక్తిసంపన్నులై సస్త్రీకులైరి. గిరిరాజనందినీ! సకలజగములు సస్త్రీకములై వెలుగొందినవి. శ్రీరాధాదేవికృపవలన గోలోకమంతయు మరల గోపాంగనలచే బరిపూర్ణమయ్యెను. ఇట్లే శ్రీహరి ప్రియ యైనశ్రీరాధాదేవిని స్తుతించి సుయజ్ఞుడు గోలోకపరంధామము జేరెను. శ్రీకృష్ణునిచే గీర్తింపబడిన యీరాధాస్తోత్రము నెవరు బఠింతురో, వారు శ్రీకృష్ణభక్తిని, దద్దాస్యసౌభాగ్యమును నిస్సంశయముగ బొందగలరు. స్త్రీవియోగము సంభవించినవా రొకమాసపర్యంత మీస్తోత్రమును శుచిగ శ్రవణమొనరించిన వారు శీఘ్రమే సతి సుందరి సుశీల యైనస్త్రీని భార్యగ బొందగల్గెదరు. భార్యాహీనులైనను, సౌభాగ్యహీనులైనను నొకసంవత్సర

కాలమీ స్తోత్రమును శ్రవణమొనరించినవారుకూడ శీఘ్రమే సుందరి సుశీలయైనభార్యనుబడయగలరు. పార్వతీ! పూర్వము దక్షకన్య సతి తనయవతారము చాలింపగా నేను శ్రీకృష్ణపరమాత్మాజ్ఞానువర్తినై యీ స్తోత్రముచే శ్రీరాధను స్తుతించి నిన్ను మరల నర్ధాంగిగ బొందగల్గితిని. పూర్వకాలము బ్రహ్మకూడ నీస్తోత్రప్రభావముననే సావిత్రిని బొందగల్గెను. పూర్వము దూర్వాసమహర్షి శాపమునకు గుఱియై దేవతలు శ్రీహీనులైరి. అపుడు వారీస్తోత్రమునుగావించియే శ్రీరాధాదేవి యనుగ్రహమునకు బాత్రులై మరల బరమదుర్లభురాలైనలక్ష్మిని బడయగల్గిరి. పుత్రార్థులొకవర్షపర్యంత మీ స్తోత్రమును శ్రవణమొనరించిన బుత్రుల నొందగలరు. ఈస్తోత్రప్రసాదమున మహారోగయుక్తులైనను రోగముక్తులు కాగలరు. ఎవరు కార్తికపూర్ణిమా శుభసమయమున శ్రీరాధను బూజించి యీస్తోత్రముపఠింతురో, వారు స్థిర లక్ష్మిని బొంది రాజసూయయజ్ఞఫల మొందగలరు. స్త్రీ లీస్తోత్రమును భక్తితో శ్రవణమొనరించిన బతిసౌభాగ్యసంపన్నలై సుఖింపగలరు. భక్తిపూర్వకముగ నీ స్తోత్రమును శ్రవణమొనరించువారెల్లరు నిశ్చయముగ బంధవిముక్తులు కాగలరు. ప్రతిదినము భక్తిభావముతో శ్రీరాధాదేవిని బూజించి ప్రేమపూర్వకముగ నీ స్తోత్రమును బఠించు వారు భవబంధములనుండి ముక్తులై గోలోకపరంధామము జేరగలరు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణ
సంవాదమున రాధాపూజా స్తోత్రాది
కథన మను ఏబదియైదవ
అధ్యాయము
సంపూర్ణము.

# ఏబదియాఱవ అధ్యాయము

## జగన్మంగళ శ్రీరాధా కవచము

పార్వతీదేవి పలికెను :

జగదీశ్వరా ! తమకృపాకటాక్షములవలన బరమాద్భుతము లైన శ్రీరాధాపూజావిధానస్తోత్రములను శ్రవణమొనరించితిని. దేవా! శ్రీరాధాదేవీదివ్యకవచమును వర్ణించి నన్ను గృతార్థ నొనరింపుడు.

మహేశ్వరుడు పలికెను :

దుర్గా! నేను పరమాద్భుత మైనశ్రీరాధాకవచము నుపదేశించెదను అవధరింపుము. పూర్వకాలమున గోలోకపరంధామమున సాక్షాత్ శ్రీకృష్ణపరమాత్మయే స్వయముగ నతిగోపనీయ పరమతత్త్వ స్వరూపము సర్వమంత్రసమూహ మైనశ్రీరాధాకవచమును నా కుపదేశించిరి. ఏదివ్యకవచమును ధరించి పఠించిన మహాపుణ్యఫలితముగ బ్రహ్మ వేదమాత యైన సావిత్రినే తన పత్నిగాబొందగల్గెనో దానినే నేను నీ కుపదేశింపబోవుచున్నాను. సురేశ్వరీ! నీవు సర్వలోకజననివి. ఈదివ్యకవచమును నేను ధరించి నీకు స్వామిని గాగల్గితిని. ఈకవచమునే ధరించి శ్రీమన్నారాయణుడు శ్రీమహాలక్ష్మిని బొందగల్గెను. ఈకవచమును ధరించియే ప్రకృతికే యతీతుడు, నిర్గుణుడు నైనశ్రీకృష్ణపరమాత్మ యాదికాలములో సృష్టినిర్మాణకార్యమందు శక్తిసంపన్నుడై నాడు. జగత్పాలకు డైనవిష్ణుమూర్తి యీకవచమును ధరించియే సముద్రరాజతనయ నర్ధాంగిగ బడయగల్గెను. ఈకవచప్రభావమునచే యనంతుడు (ఆదిశేషుడు) బ్రహ్మాండము నొకయావగింజనువలె దనశిరముపై ధరింపగలిగెను. ఈకవచము నాశ్రయించియే మహావిరాట్పురుషుడు తనప్రత్యేక రోమకూపములం దసంఖ్యాకబ్రహ్మాండములను ధరించి సర్వాధారుడై విరాజిల్లుచుండెను. ఇద్దాననే ధర్మము సర్వసాక్షి కాగలిగెను; కుబేరుడు ధనాధ్యక్షుడు కాగలిగెను. ఇంద్రుడు దేవతలకు స్వామి కాగల్గెను; అట్లే మనువు నరపతులకు జక్రవర్తి కాగల్గెను. దీనిని బఠించి ధరించుటచేతనే శ్రీచంద్రదేవుడు రాజసూయయజ్ఞము నాచరించి సఫలుడయ్యెను; అట్లే సూర్యదేవుడు త్రిలోకములకు నీశ్వరుడు కాగల్గెను, అగ్నిదేవుడు జగమును బవిత్ర మొనరింపగల్గు

చున్నాడు. అట్లే పవనుడు మందగతితో జరించుచు ద్రిభువనములను జుసి తమకు గావింపగల్గుచున్నాడు. ఇంక మృత్యువు సమస్తప్రాణులందు స్వచ్ఛంద గతితో జరింపగల్గుచున్నాడు. ఈకవచమునే పఠించి ధరించి మహాశక్తిసంప న్నుడై జమదగ్నినందను డైనపరశురాముడు నిరువదియొక్క-పర్యాయములు క్షత్రియుల హతమార్చి పృథ్విని క్షత్రియ శూన్య మొనరింపగల్గెను. సము ద్రుడు రాజసూయయజ్ఞ మొనరింపగల్గెను. కుంభజు డనుమహర్షి సముద్ర మునే పాన మొనరింపగల్గెను. సనత్కు-మారుడు జ్ఞానులకే యాచార్యుడయ్యెను. నరనారాయణబుషీంద్రు లేతత్ప్రభావముననే సిద్ధులై జీవన్ముక్తులైరి. బ్రహ్మనందను డైనవశిష్ఠుడు సిద్ధుడైనాడు, కపిలమహర్షి సిద్ధులకే స్వామి యైనాడు. దక్షుడు ప్రజాపతియై నిర్భయుడై నన్ను ద్వేషింపగల్గెను. భృగు మహర్షికూడ నిర్భీకుడై నన్ను ద్వేషింపగల్గెను. దీని ప్రభావముననే యాది కూర్మ మనంతునే భరింపగల్గెను. వాయుదేవుడు సర్వాధారు డైనాడు, వరు ణుడు సర్వులను బవిత్రులుగ నొనరింపగల్గుచున్నాడు. మంగళాంగీ! ఈకవచ ప్రభావముననే యీశానుడు దిక్పతి యైనాడు, యముడు శాసకుడైనాడు. ఈకవచము నాశ్రయించియే కాలము, కాలాగ్నిరుద్రుడు త్రిలోకములను సంహ రించుటలో సమర్థులైనారు. గౌతముడు సిద్ధుడైనాడు, కశ్యపుడు ప్రజాపతి పదమున సుప్రతిష్ఠితుడైనాడు. భార్యావియోగము సంభవించినదూర్వాస మునిపుంగవు డీకవచప్రభావముననే పూర్వము ప్రకృతికళాస్వరూపిణి యైనవసు దేవనందిని నేకానాంశ నర్ధాంగిగ బడయగల్గెను. రావణునిచే హరింపబడిన సీతాసాధ్విని శ్రీరామచంద్రు డీకవచప్రభావముననే బడయగల్గెను. నలమహా రాజిద్దాననే దమయంతి నర్ధాంగిగ బడయగల్గెను. మహావీరుడైనశంఖ చూడుడు దైత్యులకు స్వామి కాగల్గెను. దుర్గా! వినుము, శ్రీహరి వృషభ స్వరూపుడై నన్నువహింపగల్గుచున్నాడు. గరుత్మంతుడు శ్రీహరికి వాహన మైనాడు. పూర్వము సిద్ధులు, మహర్షులు దీని ప్రభావముననే పరిపూర్ణ సిద్ధి నొందిరి. ఈకవచమును ధరించి శ్రీమహాలక్ష్మి సంపూర్ణ సంపదలను బ్రసా దించుటలో సమర్థురాలైనది. సరస్వతి విద్వాంసులందు (సత్పురుషులందు) శ్రేష్ఠురాలైనది. మన్మథునిపత్ని రతి క్రీడలయందు బ్రవీణురాలైనది. వేదమాత సావిత్రి పరిపూర్ణ సిద్ధి నొందగల్గెను. సింధుకన్య మర్త్యలక్ష్మియై విష్ణుపత్ని యైనది. ఇద్దాననే తులసి పవిత్రురాలైనది, గంగ భువనపావని

యైనది. వసుంధర సర్వులకు నాధారమై సంపూర్ణ సస్యములతో సంపన్నురా లైనది. మనసాదేవి విశ్వపూజితయై సిద్ధురాలైనది. దేవమాత విష్ణు మూర్తినే తనపుత్రునిగ బడయగల్గెను. లోపాముద్ర, అరుంధతి పతివ్రతలందు శ్రేష్ఠలైనారు. దేవహూతి కపిలమహర్షినే కుమారునిగ బడయగల్గెను. దీనిమాహాత్మ్యముననే శతరూపకు ప్రియవ్రతుడు, నుత్తానపాదుడు ననుపుత్రులు గల్గిరి. నిక్కముగ నీజనని మేనాదేవికూడ నిన్నే కుమార్తెగ బడయగల్గెను. ఇట్లు సమస్తసిద్ధగణములు శ్రీరాధా కవచప్రభావమువలన సంపూర్ణైశ్వర్య సంపన్నులైరి.

## కవచ వినియోగ మంత్రము

'ఓం అస్య శ్రీజగన్మంగలకవచస్య ప్రజాపతి ఋషిః, గాయత్రీ ఛన్దః, స్వయం రాసేశ్వరీ దేవతా, శ్రీకృష్ణభక్తిసమ్ప్రాప్తౌ వినియోగః'.

## జగన్మంగళ శ్రీ రాధా కవచము

శ్రీజగన్మంగలస్యాస్య కవచస్య ప్రజాపతిః ॥
ఋషిశ్ఛన్దోఽస్య గాయత్రీ దేవీ రాసేశ్వరీ స్వయమ్ ।
శ్రీకృష్ణభక్తిసంప్రాప్తౌ వినియోగః ప్రకీర్తితః ॥

శిష్యస్య కృష్ణభక్తాయ బ్రాహ్మణాయ ప్రకాశయేత్ ।
శఠాయ పరశిష్యాయ దత్త్వా మృత్యుమవాప్నుయాత్ ॥

రాజ్యం దేయం శిరోదేయం న దేయం కవచం ప్రియే ।
కణ్ఠే ధృతమిదం భక్త్యా కృష్ణేన పరమాత్మనా ॥

మయా దృష్టం చ గోలోకే బ్రహ్మణా విష్ణునా పురా ।
ఓం రాధేతి చతుర్థ్యన్తం వహ్నిజాయాన్తమేవ చ ॥

కృష్ణేనోపాసితో మన్త్రః కల్పవృక్షః శిరోఽవతు ।
ఓం హ్రీం శ్రీం రాధికా జేన్తం వహ్నిజాయాన్తమేవ చ ॥

కపాలం నేత్రయుగ్మం చ శ్రోత్రయుగ్మం సదావతు ।
ఓం ఐం హ్రీం శ్రీం రాధికాయై వహ్నిజాయన్తమేవ చ ॥

మస్తకం కేశసంఘాంశ్చ మన్త్రరాజః సదావతు ।
ఓం రాం రాధాం చతుర్థ్యన్త్వం వహ్నిజాయాన్త మేవ చ ॥

సర్వసిద్ధిప్రదః పాతు కపోలం నాసికాం ముఖమ్ ।
క్లీం ప్రీం కృష్ణప్రియాం జే న్తం కణ్ఠం పాతు నమోఽన్తకమ్॥
ఓం రాం రాసేశ్వరీం జే న్తం స్కన్ధంపాతు నమోఽన్తకమ్॥
ఓం రాం రాసవిలాసిన్యై స్వాహా పృష్ఠం సదాఽవతు ॥

బృన్దావన విలాసిన్యై స్వాహా వక్షః సదాఽవతు ।
తులసీవనవాసిన్యై స్వాహా పాతు నితమ్బకమ్ ॥

కృష్ణప్రాణాధికాం జే న్తం స్వాహా న్తం ప్రణవాదికమ్ ।
పాదయుగ్మం చ సర్వాఙ్గం సంతతం పాతు సర్వతః ॥

ప్రాచ్యాం రక్షతు సా రాధా వహ్నౌ కృష్ణప్రియాఽవతు ।
దక్షే రాసేశ్వరీ పాతు గోపీశా నైరృతేఽవతు ॥

పశ్చిమే నిర్గుణా పాతు వాయవ్యే కృష్ణపూజితా ।
ఉత్తరే సంతతం పాతు మూలప్రకృతిరీశ్వరీ ॥

సర్వేశ్వరీ సదైశాన్యాం పాతు మాం సర్వపూజితా ।
జలే స్థలే చాన్తరిక్షే స్వప్నే జాగరణే తథా ॥

మహావిష్ణోశ్చ జననీ సర్వతః పాతు సంతతమ్ ।
కవచం కథితం దుర్గే శ్రీజగన్మఙ్గలం పరమ్ ॥

యస్మై కస్మై న దాతవ్యం గుహ్యాద్గుహ్యతరం పరమ్ ।
తవ స్నేహాన్మయాఽఽఖ్యాతం ప్రవక్తవ్యం న కస్యచిత్ ॥

గురుమభ్యర్చ్య విధివద్వస్త్రాలంకారచన్దనైః ।
కణ్ఠే వా దక్షిణే బాహౌ ధృత్వా విష్ణుసమో భవేత్ ॥

మహోత్సవవిశేషే చ పర్వన్నితి సుకీర్తితా ।
తస్యాధిదేవీ యా సా చ పార్వతీ పరికీర్తితా ॥

పర్వతస్య సుతా దేవీ సాఽఽవిర్భూతా చ పర్వతే ।
పర్వతాధిష్ఠాతృదేవీ పార్వతీ తేన కీర్తితా ॥

సర్వకాలే సనా ప్రోక్తా విస్తృతే చ తనీతి చ ।
సర్వత్ర సర్వకాలే చ విద్యమానా సనాతనీ ॥

శతలక్ష జపేనైవ సిద్ధం చ కవచం భవేత్ ।
యది స్యాత్సిద్ధకవచో న దగ్ధో వహ్నినా భవేత్ ॥

ఏతస్మాత్కవచా ద్దుర్గే రాజా దుర్యోధనః పురా ।
విశారదో జలస్తమ్భే వహ్నిస్తమ్భే చ నిశ్చితమ్ ॥

మయా సనత్కుమారాయ పురా దత్తం చ పుష్కరే ।
సూర్యపర్వణి మేరౌ చ స సాన్దీపనయే దదౌ ॥

బలాయ తేన దత్తం చ దదౌ దుర్యోధనాయ సః ।
కవచస్య ప్రసాదేన జీవన్ముక్తో భవేన్నరః ॥

నిత్యం పఠతి భక్త్యేదం తన్మన్త్రోపాసకశ్చ యః ।
విష్ణుతుల్యో భవేన్నిత్యం రాజసూయఫలం లభేత్ ॥

స్నానేన సర్వతీర్థానాం సర్వదానేన యత్ఫలమ్ ।
సర్వవ్రతోపవాసేన పృథివ్యాశ్చ ప్రదక్షిణౌః ॥

సర్వయజ్ఞేషు దీక్షాయాం నిత్యం వై సత్యరక్షణే ।
నిత్యం శ్రీకృష్ణసేవాయాం కృష్ణనైవేద్య భక్షణే ॥

పాఠే చతుర్ణాం వేదానాం యత్ఫలం చ లభేన్నరః ।
తత్ఫలం లభతే నూనం పఠనాత్కవచస్య చ ॥

రాజద్వారే శ్మశానే చ సింహవ్యాఘ్రాన్వితే వనే ।
దావాగ్నౌ సంకటే చైవ దస్యుచౌరాన్వితే భయే ॥

కారాగారే విపద్గ్రస్తే ఘోరే చ దృఢబన్ధనే ।
వ్యాధియుక్తో భవేన్ముక్తో ధారణాత్కవచస్య చ ॥

ఇత్యేతత్కథితం దుర్గే తవైవేదం మహేశ్వరి ।
త్వమేవ సర్వరూపా మాం మాయాపృచ్ఛసిమాయయా॥ (28-59)

ఈ శ్రీజగన్మంగళదివ్యకవచమునకు ప్రజాపతియే ఋషి, గాయత్రియే ఛందము, స్వయముగ రాసేశ్వరి శ్రీరాధయే యధిదైవము, శ్రీకృష్ణభక్తి ప్రాప్తికొఱకే కవచమును వినియోగింపవలెను. శిష్యులు; శ్రీకృష్ణభక్తులు నగు వారిసమక్షముననే యీదివ్యకవచమును ప్రకాశమొనరింపవలెను. మూర్ఖులకు, బరిశిష్యులకు (నాస్తికులకు) దీని నుపదేశించినవారలకు మృత్యువు సంప్రాప్తింపగలదు. ప్రియా! రాజ్యము నీయవచ్చును, మస్తకమును ఖండించి యొసంగవచ్చును; కాని యపాత్రున కీకవచము నుపదేశింపరాదు. గోలోకములో శ్రీకృష్ణపరమాత్మ యత్యంతభక్తిభావముతో నీదివ్యకవచమును దనకంఠమం దలంకరించుకొనియుండగా నేను స్వయముగ దర్శించితిని. పూర్వకాలమందు బ్రహ్మావిష్ణువులుకూడ నీకవచమును ధరించిరి. 'ఓం రాధాయై స్వాహా' – ఈ మంత్రము కల్పవృక్షసదృశముగ మనోవాంఛితఫలములను బ్రసాదింపగలదు.

శ్రీకృష్ణుడు స్వయముగ నీమంత్రము నుపాసించెను. ఈమంత్రము నాశిరమును రక్షించుగాక. 'ఓం హ్రీం శ్రీం రాధికాయై స్వాహా' ఈమంత్రము నాకపాల మును నేత్రద్వయమును, గర్ణద్వయమును సదా రక్షించుగాక. 'ఓం ఐం హ్రీం శ్రీం రాధికాయై స్వాహా' సదా నామస్తకమును, కేశసమూహమును రక్షించుగాక. 'ఓం రాం రాధాయై స్వాహా' ఈసర్వసిద్ధిప్రదాయక మైన మంత్రము నాకపోలములను, నాసికను, ముఖమును రక్షించుగాక. 'ఓం క్లీం శ్రీం హ్రీం కృష్ణప్రియాయై నమః' ఇది నాకంఠమును రక్షించుగాక. 'ఓం రాం రాసేశ్వర్యై నమః' నాభుజములను రక్షించుగాక. 'ఓం రాం రాసవిలా సిన్యై స్వాహా' నాపృష్ఠ (వెనుక) భాగమును రక్షించుగాక. 'ఓం బృన్దావన విలాసిన్యై స్వాహా' నావక్షఃస్థలమును రక్షించుగాక. 'ఓం తులసీవనవాసిన్యై స్వాహా' నానితమ్బములను రక్షించుగాక. 'ఓం కృష్ణప్రాణాధికాయై స్వాహా' నాచరణయుగ్మమును, సర్వాంగములను సర్వదిశలనుండి రక్షించుగాక. రాధా! పూర్వ (తూర్పు) దిశయందు నన్ను రక్షింపుము. కృష్ణప్రియా! ఆగ్నేయకోణ మందు నన్ను పాలింపుము. రాసేశ్వరీ! దక్షిణదిశలో నన్ను రక్షింపుము. గోపీశ్వరీ! నైఋతికోణములో నన్ను సంరక్షింపుము. నిర్గుణా! పశ్చిమదిశలో నన్ను గాపాడుము. కృష్ణపూజితా! వాయవ్యకోణములో నన్ను పాలింపుము. మూలప్రకృతీశ్వరీ! ఉత్తరదిశలో నన్ను సంరక్షింపుము. సర్వపూజితా! సర్వే శ్వరీ! ఈశానకోణములో సదా నన్ను రక్షింపుము. మహావిష్ణుజననీ! జలము లందు, స్థలమందు, నంతరిక్షమందు, స్వప్న, జాగరణసుషుప్త్యవస్థలయందు సదా సర్వదిశలందు నన్ను సంరక్షింపుము. దుర్గా! ఈపరమోత్తమ మైన శ్రీజగన్మంగళకవచమును నేను నీ కుపదేశించితిని.

ఈకవచము బరమనిగూఢమైనది. ఈదివ్యకవచము నపాత్రులకు ప్రసాదింపరాదు. నేను నీపైగలస్నేహకారణమున దీనిని నీకు వర్ణించితిని. వస్త్రాభరణచందనాదులచే గురుదేవుని యథావిధి పూజించి యీకవచమును శ్రవణమొనరించి కంఠమందుగాని లేక దక్షిణభుజమందుగాని ధరించువారు శ్రీవిష్ణుసమాన తేజోమూర్తులు కాగలరు. మహోత్సవాదివిశేష ములను బర్వములని కీర్తించిరి. ఆపర్వములకు నధిదేవికావున నామెను పార్వతి యని ప్రస్తుతించిరి. పర్వతరాజపుత్రికావున, పర్వతమునుండి యావి ర్భవించినదిగావున, పర్వతముల కధిష్ఠాత్రిగావున నీదేవిని పార్వతి యనిరి. పర్వ

కాలములకు వాచకముగ 'సనా' ప్రయోగింపబడెను. విస్తృతత్త్వమునకు 'తనీ' వాచకము. సర్వత్ర సర్వకాలములందు విద్యాభిమానురాలై యున్న కారణమున నీదేవిని సనాతని యని భక్తులు ప్రస్తుతించిరి.

పదిలక్షలపర్యాయములు జపించిన నీకవచము సిద్ధింపగలదు. ఈకవచము సిద్ధించినవా రగ్నిచే దహింపబడబోరు. దుర్గా! పూర్వకాలములో నీకవచమును ధరించినందుననే దుర్యోధనసార్వభౌముడు జలస్తంభనాగ్నిస్తంభన విద్యలందు దక్షుడు కాగలైను. నేను బ్రథమమున బుష్కరతీర్థములో సూర్యగ్రహణసమయమున దీనిని సనత్కుమారున కుపదేశించితిని. సనత్కుమారుడు మేరుపర్వతముపై దీనినే సాందీపనిమహర్షి కుపదేశించెను. ఆమహర్షి దీనిని బలరామున కుపదేశింపగా నతడు దుర్యోధనునకు బ్రసాదించెను. ఈకవచ ప్రభావమువలన మనుష్యులు జీవన్ముక్తులు కాగలరు. రాధామంత్రోపాసకులై ప్రతిదినము భక్తిభావముతో నీకవచమును బఠించువారు విష్ణుతుల్య తేజోవిరాజితులు కాగలరు. వారికి రాజసూయయజ్ఞఫలము సంప్రాప్తించును. సర్వతీర్థస్నానఫలములు, సర్వదానఫలములు, సర్వవ్రతోపవాసఫలములు, పృథ్వీప్రదక్షిణాదిఫలములు, సమస్తయజ్ఞదీక్షాగ్రహణఫలములు, సతతము సత్యమును రక్షించిన లభించుఫలము, నిత్యము శ్రీకృష్ణసేవవలన ప్రాప్తించుఫలము, శ్రీకృష్ణనైవేద్యఫలము, నాల్గువేదములను బఠించినగల్గుఫలములు మొదలగు ఫలముల నన్నింటిని కేవల మీదివ్యకవచమును బ్రతిదినము పఠించువారు సునాయాసముగ బొందగలరు. రాజద్వారమందు, శ్మశానభూమిలో, సింహవ్యాఘ్రాదిపూర్ణమైనవనములో, దావాగ్నిలో, సంకటములలో జిక్కుకొన్నపుడు, చోరులవలన, దస్యులవలన భయము సంప్రాప్తమైనపుడు, భయంకర దృఢబంధనము సంప్రాప్తమైనపుడు, కారాగారబంధము నొందినపుడు, భయంకరరోగములచే నాక్రాంతులైనపుడు మనుష్య లీకవచమును ధరించిన వారు నిశ్చయముగ సమస్తదుఃఖములనుండి ముక్తులు కాగలరు. దుర్గా! మహేశ్వరీ! ఈనీదివ్యకవచమే నేను నీ కుపదేశించితిని. సర్వస్వరూపిణీ! మాయవైన నీవు మాయతో నీకవచవిషయమై నన్ను బ్రశ్నించుచున్నావు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా! ఇట్లు శ్రీరాధాదివ్యచరితమును బ్రవచించి మాధవునిదివ్యనామసంకీర్తన మొనరించుచు శంకరుడు పులకితగాత్రుడై సాశ్రుపూర్ణ

లోచనుడై బ్రహ్మానందము ననుభవింపదొడంగెను. శ్రీకృష్ణసముడైన దైవము మఱియొకరు లేరు. గంగవంటితీర్థము మఱియొకటిలేదు. పుష్కరసమమైనక్షేత్రము రెండవది లేదు, బ్రాహ్మణవర్ణముకంటె శ్రేష్ఠమైనది గాని లేక ఆశ్రమముగాని మఱియొకటి లేదు.

పరమాణోః పరం సూక్ష్మం మహావిష్ణోఃపరోమహాన్।
నభఃపరం చ విస్తీర్ణా యథా వాస్త్యేవ నారద ॥

తథా న వైష్ణవాద్ జ్ఞానీ యోగీంద్రః శంకరాత్పరః।
కామక్రోధలోభమోహా జితాస్తేనైవ నారద ॥

స్వప్నే జాగరణే శశ్వత్కృష్ణధ్యానరతః శివః।
యథా కృష్ణస్తథా శంభుర్న భేదో మాధవేశయోః ॥

యథా శంభుర్వైష్ణవేషు యథా దేవేషు మాధవః।
తథేదం కవచం వత్స। కవచేషు ప్రశస్తకమ్ ॥ (62-65)

నారదా! పరమాణువుకంటె సూక్ష్మమైనది, మహావిరాట్పురుషునికంటె స్థూలమైనది, యాకాశముకంటె నధికవిస్తృతమైనది మఱియొకవస్తువేదియు లేనట్లు వైష్ణవునికంటె జ్ఞాని, శంకరునికంటె యోగీంద్రుడు మఱియొకరు లేరు. దేవర్షీ! సదాశివుడే కామక్రోధలోభమోహములపై విజయము పొందెను. శంకరుడు స్వప్నజాగ్రత్సుషుప్త్యవస్థలయం దహర్నిశము శ్రీకృష్ణ ధ్యానమందే తత్పరుడై యుండును. కృష్ణు డెట్టివాడో యట్టివాడే శివుడు. శ్రీకృష్ణునకు శివునకు నెట్టిభేదము లేదు. వత్సా! వైష్ణవులలో శంకరుడు, దైవములలో మాధవుడు శ్రేష్ఠులైనట్లే కవచములందు జగన్మంగళశ్రీరాధా కవచము సర్వోత్తమమని తెలిసికొనుము.

శివేతి మఙ్గలార్థం చ వకారో దాతృవాచకః।
మఙ్గలానాం ప్రదాతా యః స శివః పరికీర్తితః ॥

నరాణాం సంతతం విశ్వే శం కల్యాణం కరోతి యః।
కల్యాణం మోక్షవచనం స ఏవ శంకరః స్మృతః ॥

బ్రహ్మాదీనాం సురాణాం చ మునీనాం వేదవాదినామ్।
తేషాం చ మహతాం దేవో మహాదేవః ప్రకీర్తితః ॥

మహతీ పూజితా విశ్వే మూలప్రకృతి రీశ్వరీ।
తస్యా దేవః పూజితశ్చ మహాదేవః స చ స్మృతః ॥

విశ్వస్థానాం చ సర్వేషాం మహతా మీశ్వరఃస్వయమ్।
మహేశ్వరం చ తేనేమం ప్రవదన్తి మనీషిణః ॥ (66-70)

'శి' అనగా మంగళవాచకము, 'వ'కారము దాతృవచనము. ఏదైవము మంగళప్రదాతయో యాయననే శివుడని కీర్తించిరి. ఎవరు విశ్వములందు గల సకలప్రాణులకు సదా 'శం' (కళ్యాణముల) నొనరించునో యాయననే శంకరు డనిరి. కళ్యాణార్థమే మోక్షము. ఆమోక్షమును బ్రసాదించుదైవమునే శంకరు డనిరి. బ్రహ్మాదిదేవతలను, మహర్షులను, వేదవిదులను మహాజను లందురు. ఆమహాపురుషుల కెవరు దైవమో యాయననే మహాదేవుడని కీర్తింతురు. సర్వవిశ్వములందు బూజింపబడుమూలప్రకృతి నీశ్వరినే మహతి యందురు. ఆమహాదేవిద్వారమున బూజింపబడు దేవునిదివ్యనామమే మహాదేవుడు. విశ్వములలో నెందఱు మహాత్ములు కలరో, వారి కందఱకు నీయనయే యీశ్వరుడు. కావున మనీషిగణము లీదైవమును మహేశ్వరు డని కీర్తించిరి.

బ్రహ్మనందనా! నారదా! నీవు ధన్యుడవు. శ్రీకృష్ణభక్తినే ప్రసాదింపగలయాచార్యు డైనమహేశ్వరుడే నీగురువు. అయినచో నీవిషయము నన్నేల ప్రశ్నించుచున్నావు?

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతి ఖండములోని నారదనారాయణ
సంవాదమున జగన్మంగళశ్రీరాధాకవచ
మను ఏబదియాఱవ అధ్యాయము
సంపూర్ణము.

—o—

# ఏబదియేడవ అధ్యాయము

## దుర్గాదేవ్యుపాఖ్యానము

నారదుడు పలికెను:

బ్రహ్మదేవా! పరమాద్భుతములైనసర్వాఖ్యానములను మీకరుణవలన శ్రవణమొనరింపగల్గితిని. దేవా! దుర్గాభగవతి పావనచరితమును నేను మీ దివ్యముఖారవిందమునుండి శ్రవణమొనరింపవలెనని యభిలషించుచున్నాను.

దుర్గా నారాయ ణీశానా విష్ణుమాయా శివా సతీ।
నిత్యా సత్యా భగవతీ శర్వాణీ సర్వమఙ్గలా॥
అమ్బికా వైష్ణవీ గౌరీ పార్వతీ చ సనాతనీ।
నామాని కౌథుమోక్తాని సర్వేషాం శుభదాని చ॥ 2, 3

వేదములో కౌథుమీశాఖలో వర్ణింపబడినదుర్గ, నారాయణి, ఈశాన, విష్ణుమాయ, శివ, సతి, నిత్య, సత్య, భగవతి, శర్వాణి, సర్వమంగళ, అంబిక, వైష్ణవి, గౌరి, పార్వతి, సనాతని యనుపదునారుదివ్యనామములు సర్వులకు బరమకళ్యాణప్రదములు.

వేదవిదాంవరా! శ్రీనారాయణఋషీంద్రా! ఈషోడశదివ్యనామములకు సర్వాభీష్టములైన యేయుత్తమార్థములు కలవో సర్వసమ్మతములైనఆవేదోక్తార్థములను వర్ణింపుడని ప్రార్థించుచున్నాను. ప్రప్రథమమున నెవరు భగవతి దుర్గను బూజించిరి? రెండవవా రెవరు? మూడవవా రెవరు? నాల్గవవా రెవరు?

శ్రీనారాయణఋషి పలికెను:

దేవర్షీ! విష్ణుభగవానుడే స్వయముగ వేదములో నీషోడశదివ్యనామములకు నర్థములను బ్రవచించెను. ఆయర్థములు నీకవగతములైనను సర్వజీవుల నుద్ధరించుటకే నీవు నన్ను బ్రశ్నించితివి. ఆగమానుసారముగ నే నీదివ్యనామములవ్యుత్పత్తులను బ్రవచించెద నవధరింపుము.

దుర్గో దైత్యే మహావిఘ్నే భవబన్ధే చ కర్మణి।
శోకే దుఃఖే చ నరకే యమదణ్డే చ జన్మని॥
మహాభయేఽతిరోగే చాప్యశబ్దో హన్తృవాచకః।
ఏతాన్ హన్త్యేవ యా దేవీ సా దుర్గా పరికీర్తితా॥ 7, 8

దుర్గాశబ్దపదచ్ఛేదమే దుర్గ+ఆ=దుర్గా. దుర్గశబ్దము దైత్యులకు, మహావిఘ్నములకు, భవబంధములకు, గర్మములకు, శోకములకు, దుఃఖములకు, నరకములకు, యమదండములకు, జన్మములకు, మహాభయములకు, భయంకరరోగములకు నర్థముగ బ్రయోగింపబడెను. 'ఆ' శబ్దము 'హన్తా' (వినాశ). వాచకము; ఈదైత్యమహావిఘ్నాదులను హననమొనరించు నామెనే 'దుర్గా' యని కీర్తించిరి.

యశసా తేజసా రూపై ర్నారాయణసమా గుణైః ।
శక్తి ర్నారాయణస్యేయం తేన నారాయణీ స్మృతా ॥ 9

దుర్గాదేవి యశమునందు, దేజమునందు, రూపమందు, గుణములందు శ్రీమన్నారాయణసమురాలు; నారాయణునిశక్తి. కావున నీమె నారాయణి యనబడెను.

ఈశానః సర్వసిద్ధ్యర్థే చాశబ్దో దాతృవాచకః ।
సర్వసిద్ధిప్రదాత్రీ యా సైవేశానా ప్రకీర్తితా ॥ 10

'ఈశానా శబ్దమునకు బదచ్ఛేదమే ఈశాన+ఆ=ఈశానా. ఈశాన శబ్దము సంపూర్ణసిద్ధుల కర్థముగా బ్రయోగింపబడెను. 'ఆ' శబ్దము దాతృవాచకము. తనభక్తులకు సర్వసిద్ధులను బ్రసాదించు దేవినే 'ఈశానా' యని కీర్తించిరి.

సృష్టా మాయా పురా సృష్టౌ విష్ణునా పరమాత్మనా ।
మోహితం మాయయా విశ్వం విష్ణుమాయా ప్రకీర్తితా ॥ 11

పూర్వకాలములో సృష్టిసమయమున బరమాత్మ యగువిష్ణువు మాయను సృష్టించి తనమాయవలన సకలవిశ్వములను మోహింపజేసెను. ఆమాయాదేవి సాక్షాత్తుగా విష్ణుదేవునిశక్తియే గావున నామెను 'విష్ణుమాయా' యని కీర్తించిరి.

శివే కల్యాణరూపా చ శివదా చ శివప్రియా ।
ప్రియే దాతరి చాఽఽశబ్దో శివా తేన ప్రకీర్తితా ॥ 12

శివా శబ్దమునకు బదచ్ఛేదమే శివ+ఆ=శివా. శివశబ్దము శివునకు, గళ్యాణమునకు అర్థముగ బ్రయోగింపబడెను. 'ఆ'శబ్దము ప్రియ, దాత్రియను నర్థమున బ్రయోగింపబడెను. ఆదేవి కళ్యాణస్వరూపిణి, శివదాయిని, శివప్రియ; కావుననే యామె 'శివా'యని కీర్తింపబడెను.

సద్బుద్ధ్యధిష్ఠాతృదేవీ విద్యమానా యుగే యుగే ।
పతివ్రతా సుశీలా చ సా సతీ పరికీర్తితా ॥ 13

దుర్గాదేవి సద్బుద్ధికి నధిష్ఠాత్రీదేవి. ప్రతియుగమందు విద్యమానురాలై యుండుశక్తి, పరమపతివ్రత, సుశీల. కావుననే యామెను 'సతీ' యని కీర్తించిరి.

యథా నిత్యో హి భగవా న్నిత్యా భగవతీ తథా ।
స్వమాయయా తిరోభూతా తత్రేశే ప్రాకృతే లయే ॥ 14

భగవానుడు నిత్యుడైనట్లే భగవతికూడ నిత్యయే. ప్రాకృత ప్రళయ సమయమున నామె తనమాయచే శ్రీకృష్ణపరమాత్మునిలో దిరోహిత యగును.

ఆబ్రహ్మస్తమ్బపర్యన్తం సర్వం మిథ్యైవ కృత్రిమమ్ ।
దుర్గా సత్యస్వరూపా సా ప్రకృతి ర్భగవా న్యథా ॥ 15

బ్రహ్మమొదలు కీటకపర్యంతము గలసర్వసృష్టి కృత్రిమము; కావున మిథ్య; కాని దుర్గ సత్యస్వరూపిణి. భగవంతుడు సత్యమైనట్లే ప్రకృతి దేవికూడ సత్యమే.

సిద్ధ్యైశ్వర్యాదికం సర్వం యస్యా మస్తి యుగే యుగే ।
సిద్ధాదికే భగో జ్ఞేయ స్తేన సా భగవతీ స్మృతా ॥ 16

సిద్ధి, యైశ్వర్యాదుల కర్థముగ భగశబ్దప్రయోగ మొనరింపబడెను. ఆమె సర్వసిద్ధులకు, నైశ్వర్యాదులకు నిలయము. ఇట్టి భగపూర్ణత ప్రతియుగ మందు నేదేవిలో విరాజిల్లుచుండునో యా దుర్గయే 'భగవతి' యని కీర్తింపబడును.

సర్వా న్మోక్షం ప్రాపయతి జన్మమృత్యుజరావృతాన్ ।
చరాచరాంశ్చ విశ్వస్థాన్ శర్వాణీ తేన కీర్తితా ॥ 17

విశ్వమునందుగల జన్మమృత్యుజరావృతులగు సమస్తచరాచర జీవులకు మోక్షమును బ్రసాదించు నట్టిదేవి తనయీగుణములకారణమున 'శర్వాణీ' యనబడెను.

మఙ్గలం మోక్షవచనం చాఽఽఽశబ్దో దాతృవాచకః ।
సర్వా న్మోక్షా న్యా దదాతి సైవ స్యా త్సర్వమఙ్గలా ॥

హర్షే సంపది కల్యాణే మఙ్గలం పరికీర్తితమ్ ।
తాన్దదాతి చ సర్వేభ్య స్తేన సా సర్వమఙ్గలా ॥ 18, 19

మంగళశబ్దము మోక్షమునకు వాచకము; 'ఆ'శబ్దము దాతృవాచకము. సర్వమోక్షములను ప్రసాదించు దేవియే 'సర్వమంగళా' యనబడెను. మంగళశబ్దము హర్షమునకు, సంపదలకు, కళ్యాణములకు నర్థముగ ప్రయోగింపబడెను. వీనినన్నింటిని ప్రసాదించు నామెయే సర్వమంగళ యను నామమున విఖ్యాతినొందెను.

అమ్బేతి మాతృవచనో వన్దనే పూజనే సదా ।
పూజితా వన్దితా మాతా జగతాం తేన సాఽమ్బికా ॥ 20

అంబాశబ్దము మాతృవాచకము; వందనమునకు బూజకు నర్థముగగూడ 'అంబ'శబ్దము ప్రయోగింపబడెను. ఈదేవి సర్వులకును బూజనీయ, వందనీయ, త్రిలోకములకు దల్లి. కావుననే యామెను 'అంబికా' యని కీర్తించిరి.

విష్ణుభక్తా విష్ణురూపా విష్ణోః శక్తిస్వరూపిణీ ।
సృష్టౌ చ విష్ణునా సృష్టా వైష్ణవీ తేన కీర్తితా ॥ 21

ఈదేవి విష్ణుదేవునిపరమభక్తురాలు, విష్ణుస్వరూపిణి, విష్ణుశక్తి. సృష్టికాలమందు విష్ణుదేవునిద్వారమున నీమె సృష్టింపబడెను. కావుననే యీదేవిని 'వైష్ణవీ' యనిరి.

గౌరః పీతే చ నిర్లిప్తే పరే బ్రహ్మణి నిర్మలే ।
తస్యాఽఽత్మనః శక్తి రియం గౌరీ తేన కీర్తితా ॥

గురుః శంభుశ్చ సర్వేషాం తస్య శక్తిః ప్రియా సతీ ।
గురుః కృష్ణశ్చ తన్మాయా గౌరీ తేన ప్రకీర్తితా ॥ 22, 23

గౌరీశబ్ద మెఱనివర్ణమునకు, నిర్లిప్తకు, నిర్మలపరబ్రహ్మమైనపరమాత్మకు నర్థముగ ప్రయోగింపబడెను. ఆగౌరశబ్దస్వరూపుడైనపరమాత్మకీమెయే శక్తి; అందువలననే యీమెను 'గౌరీ' యని కీర్తించిరి. సర్వులకు శివుడే గురువు. ఈదేవి శివునకు సతి, ప్రియ, శక్తి; ఈకారణమువలన నీమె గౌరి యని కీర్తింపబడెను. శ్రీకృష్ణభగవానుడే సర్వులకు నాచార్యుడు (గురువు). ఈదేవి తన్మాయయే కావుననే యీమెను గౌరి యనిరి.

తిథిభేదే పర్వభేదే కల్పభేదేఽన్యభేదకే ।
ఖ్యాతౌ తేషు చ విఖ్యాతా పార్వతీ తేన కీర్తితా ॥
మహోత్సవవిశేషే చ పర్వన్నితి సుకీర్తితా ।
తస్యాధిదేవీ యా సా చ పార్వతీ పరికీర్తితా ॥
పర్వతస్య సుతా దేవీ సాఽఽవిర్భూతాచ పర్వతే ।
పర్వతాధిష్ఠాతృదేవీ పార్వతీ తేన కీర్తితా ॥ 24-26

పర్వశబ్దము తిథిభేదములకు, బర్వభేదములకు, గల్పభేదములకు, నన్యాన్య భేదముల కర్థముగ బ్రయోగింపబడెను. 'తీ'శబ్దమునకే ఖ్యాతి యని యర్థము. ఆపర్వాదులలో విఖ్యాతురాలైనకారణమున నీదేవిని బార్వతి యనిరి. పర్వన్ శబ్దము మహోత్సవముల కర్థముగ బ్రయోగింపబడెను. ఆమహోత్సవముల కీమె యధిష్ఠాత్రీదేవి, కావున బార్వతియని కీర్తింపబడెను. ఈదేవి పర్వత రాజపుత్రి. పర్వతముపై బ్రాదుర్భవించిన యీయామె పర్వతముల కధిష్ఠాత్రీదేవి. కావుననే యీదేవిని బార్వతి యనిరి.

సర్వకాలే సనా ప్రోక్తా విస్తృతే చ తనీతి చ ।
సర్వత్ర సర్వకాలే చ విద్యమానా సనాతనీ ॥ 27

సనా యనగా సర్వదా యని యర్థము. తనీ యనగా విద్యమాన యని భావము. సర్వత్ర, సర్వకాలములలో విద్యమానురాలై యుండుకారణమున నీదేవిని సనాతని యని కీర్తించిరి.

మహామునీ! ఆగమానుసారముగ దుర్గాదేవి షోడశదివ్యనామముల యర్థములను బ్రవచించితిని. తదనంతరము వేదోక్తమైనదుర్గాదేవ్యుపాఖ్యానమును వర్ణించెద నవధరింపుము. నారదా! ప్రప్రథమమున స్వయముగ శ్రీకృష్ణపరమాత్మయే సృష్ట్యాదిలో గోలోకస్థితబృందావనరాసమండలములో దుర్గను బూజించెను. తదనంతరము మధుకైటభు లనుమహాదైత్యులభయమును నివారించుకొనుటకు జగత్స్రష్ట బ్రహ్మ యీయామెను బూజించెను. మూడవ పర్యాయము త్రిపురాసురసంగ్రామములో విజయముకొఱకై త్రిపురారియగుమహాదేవుడు దుర్గ నారాధించెను. నాల్గవపర్యాయము మొదట దూర్వాసమహర్షి శాపమున రాజ్యలక్ష్మీభ్రష్టుడైనయింద్రుడు భక్తిభావముతో సతీసమారాధన

మొనరించి యామెకృపకు బాత్రుడై తనసకలాభీష్టములను బొందగల్గెను. ఆనాటినుండి మునీంద్రులు, సిద్ధేంద్రులు, దేవతలు, మహర్షులు, మానవులు, సర్వవిశ్వములందుగలసర్వులు దుర్గాదేవి నారాధింప నారంభించిరి.

మునీశ్వరా! పూర్వకాలములో సర్వదేవతల తేజములనుండి దేవి యవతరించెను. ఆసమయమున సకలదేవతలు తమయస్త్రశస్త్ర భూషణాదులను భగవతి కర్పించిరి. ఆదుర్గాదేవియే దుర్గాదిమహాదైత్యులను వధించి దేవతలకు స్వారాజ్యము నొసంగి వారికి సర్వాభీష్టములను బ్రసాదించెను. రెండవకల్పములో మేధస్ఋషిశిష్యుడై నసురథరాజు సరితానదీతటమున దుర్గాదేవి మృణ్మయమూర్తిని నిర్మించి వేదోక్తషోడశోపచారముల నర్పించి విధిపూర్వకముగ బూజించి ధ్యానించి కవచము ధరించి తదనంతరము పరిహారమనుస్తోత్రముతో నామెను స్తుతించి తనమనోభీష్టవరమును బడసెను. అట్లే తన్నదీతీరముననే యామృణ్మయదుర్గామూర్తి నొకవైశ్యశ్రేష్ఠు డనన్యభక్తితో నారాధించి పూజించి మోక్షము నొందెను. బ్రహ్మకులపావనా! ఆవైశ్యశ్రేష్ఠుడు, నరేశ్వరుడు సాశ్రుపూర్ణనయనులై, పులకితగాత్రులై, ముకుళితహస్తులై దుర్గాదేవి ననేకవిధముల స్తుతించి యామృణ్మయప్రతిమను నదీనిర్మలజలములలో విసర్జించిరి.

త్యక్త్వా దేహం చ వైశ్యస్తు పుష్కరే దుష్కరం తపః ।
కృత్వా జగామ గోలోకం దుర్గాదేవీవరేణ సః ॥ 41

పుష్కరతీర్థములో నావైశ్యశ్రేష్ఠుడు ఘోరతపమొనర్చి దుర్గ నారాధించి యాజననియనుగ్రహమునకు బాత్రుడై యామెవరమువలన జన్మరాహిత్యమొంది నశ్వరదేహమును ద్యజించి దివ్యగోలోకపరంధామము జేరెను.

నారదా! సురథుడు దుర్గాదేవి నారాధించి యామెవరమువలన సకలసామ్రాజ్యమునకు జక్రవర్తియై సర్వాదరణీయుడై మహాబలసంపన్నుడై యఱువదివేల సంవత్సరములు రాజ్యమును బాలించి యనేకసుఖముల ననుభవించెను. తదనంతరము తనపత్నిని, రాజ్యమును బుత్రుల కప్పగించి పుష్కరక్షేత్రములో దప మాచరించి మఱుజన్మమున సావర్ణియై జన్మించి మనుపదమును నలంకరించెను. వత్సా! ఋగ్వేదాగమానుసారముగ నేను దుర్గాదేవి

దివ్యోపాఖ్యానమును సంక్షిప్తముగ ప్రవచించితిని. ఇక నే విషయములను శ్రవణ మొనరింపగోరెదవో తెల్పుము.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
ప్రకృతి ఖండములోని నారదనారాయణ
సంవాదమున దుర్గాదినామవ్యుత్పత్త్యాది
కథన మను ఏబదియేడవ
అ ధ్యా య ము
సంపూర్ణము.

—o—

## ఏబదియెనిమిదవ అధ్యాయము

### తా రా శ శాం క ము

నా ర దు డు ప లి కె ను :

ధర్మాత్ములందు శ్రేష్ఠుడైన సురథు డేవంశోద్భవుడు? జ్ఞానులందు వరేణ్యుడైనమేధోమహర్షినుండి యారాజెట్లు జ్ఞానము నొందెను? ముని సత్తమా! మేధోమహర్షి యేవంశమున బుట్టెను? రాజునకు మహర్షికి నేప్రదేశములో సంవాదము జరిగెను? రాజునకు వైశ్యునకు నేప్రదేశములో సఖ్యము కల్గెను? వేదవిదాంవరా! ఈవిషయముల నన్నింటిని సవిస్తరముగ నెఱుగవలెనని యభిలషించుచున్నాను.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

బ్రహ్మదేవునికుమారుడే యత్రి. అత్రిపుత్రుడే నిశాకరుడు (చంద్రుడు). చంద్రుడు రాజసూయయజ్ఞముల నొనరించి ద్విజులకు రాజై విరాజిల్లెను. గురుపత్ని యైనతారవలన జంద్రునకు బుధు డనుతనయుడు కల్గెను. ఆబుధ పుత్రుడే చైత్రుడు. చైత్రునికుమారుడే సురథుడనిరి.

నారదుడు పలికెను:

గురుపత్ని యైనతారకు జంద్రునివలన బుత్రుడు కల్గెనని వచించితివి. అయ్యో! మహామునీ! ఈవ్యతిక్రమ మెట్లు సంభవించెనో ప్రవచింపుడు.

శ్రీ నారాయణ ఋషి పలికెను:

నారదా! పరమపతివ్రత, ధర్మిష్ఠ, సురగురుపత్ని యైనతారను జాహ్నవీ నదీతటముపై సంపన్నత్తుడు, మహాకామి యైనచంద్రుడు దర్శించెను. ఆమె సుస్నాత, సుందరి, రమ్య, పీనోన్నతపయోధర, సుశ్రోణి, సన్ననినడుము కల్గిన పరమమనోహారిణి, చక్కనిపలువరుసకల్గినది, కోమలాంగి, నవయౌవనసంపన్న, సూక్ష్మవస్త్రపరీధాన, రత్నభూషణభూషిత. ఆమె నుదుటిపై గస్తూరిబిందువు లను, జందనబిందువులను నిడుకొని, సిందూరబిందువును దిద్దుకొని, చక్కని ఫాలభాగము కల్గి ప్రకాశించుచుండెను. ఆమెముఖము శరత్పూర్ణిమాచంద్రుని వలె నుండెను. ఆమెయధరములు పక్వబింబఫలములవలెనరుణవర్ణమునను న్నవి. ఆమె స్త్రీలలో శ్రేష్ఠురాలు. ఆసమయమున వాయువు వీచుచున్నకారణమున నామెయధోవస్త్రములు తొలగినవి. తారను గాంచి చంద్రుడు పులకితగాత్రుడై కామవికారముతో నామెతో నిట్లు పల్కెను. చంద్రుని జూడగనే యాసుస్మిత లజ్జతో దల వంచుకొనెను.

చంద్రుడు పలికెను:

రసికభామినులందు వరిష్ఠురాలా! స్త్రీలలో శ్రేష్ఠురాలా! క్షణ మాగుము. నేర్పుగలస్త్రీలలోనే నీవు మిక్కిలి నేర్పుగలదానవు. సంతతము నామనమును హరించుచున్నావు. బృహస్పతి వేయిజన్మములపర్యంతము ప్రకృతి నారాధించి యాతపఃఫలముగ బృహచ్ఛ్రోణి వైననిన్ను గామసాగ రమునుండి భార్యగ బొందగల్గెను. బ్రహ్మ విదగ్ధుడు కాకపోవుటవలననే యతడు రసవతివి, సదా కాముకురాలవు, స్త్రీలయందు శ్రేష్ఠురాలవు నైనని న్నామునలి వానిమెడకు గట్టెను. రతివిజ్ఞానములో చతురుడు కానివానిసంగమమువలన నీకేసుఖములు లభించును? చతుర లైనవారు చతురు లైనవారితోనే సంగమ మొనరించి సుఖసాగరమందు సుఖింపగలరు. కామినీ! కామమువలన నీజీవిత మంతయు వ్యర్థమగుచున్నది. కర్మమువలనగాని, యాత్మదోషమువలనగాని యేపురుషుడైనను స్త్రీలయాంతర్యమును గ్రహింపలేడు. నవయౌవనసంపన్న

రాల వైననీభర్త వృద్ధుడుగావున నీదుర్లభనవయౌవనము దినదినము క్షీణించు చున్నది. బృహస్పతి సదా తపమునందు సంలగ్నుడై యుండి తన కభీష్టుడైనశ్రీకృష్ణపరమాత్మనే స్వప్నములందు, జాగ్రదవస్థయందు ధ్యానించుచుండును. కామసుఖమును గోరుకొనునీవు సర్వకామరసజ్ఞురాలవు. యౌవనసంపన్నులశృంగారములను లోలోపల ధ్యానించుచున్నావు. నీమనోవాంఛితమైనకామసుఖము వేఱు, నీభర్తమనోభీష్టము వేఱు. మీవిషయము లిట్లు భిన్నముగ నున్న ఇకమీసంగమములో నెట్లుప్రీతికల్గును? కావున దేవీ! నన్నను గ్రహించి నాతో రమ్ము. మన మిర్వురము వివిధప్రదేశములలో విహరించుచు సుఖింతము.

శ్రీ నారాయణ ఋషి పలికెను :

మన్మథునికంటె సుందరుడైన, మదోన్మత్తుడైనచంద్రు డిట్లు పల్కి యనుగ్రహింపవలసినదిగ తారచరణముల నాశ్రయించెను. తనమార్గము నడగించినచంద్రుని గాంచగనే తారాదేవి తాలుకములు, అధరములు, కంఠము శుష్కములైనవి. అయిన నామె భీతినొందక కోపముచే రక్తపంకజలోచనయై యిట్లు పల్కెను.

తార పలికెను :

చంద్రా! నీకు ధిక్కారము, పరస్త్రీలంపటుడవైన, శఠుడవైననిన్ను నేను ఘృణముగ భావించుచున్నాను. అత్రిమహర్షి దౌర్భాగ్యమువలన నీవాయనకు బుత్రుడుగజన్మించితివి. ఈదుష్కార్యమువలన నీజన్మము, జీవనము వ్యర్థము లైనవి. రాజసూయయజ్ఞము నొనరించినమాత్రమున నీవే బలవంతుడవని భావించుచున్నావా? పరస్త్రీయందు నీమనము సంలగ్నమైనది గావున నీయనేకజన్మసముపార్జితపుణ్య మంతయు నీక్షణమందే వ్యర్థమైనదని గ్రహింపుము.

యస్య చిత్తం పరస్త్రీషు సోఽశుచిః సర్వకర్మసు ।
న కర్మఫలభాక్పాపీ నిన్ద్యో విశ్వేషు సర్వతః ॥   32

ఎవనిచిత్తము పరస్త్రీలయందు సంలగ్నమగునో, యతడు సర్వకర్మములకు నశుచి కాగలడు. వానికి దా నొనరించినసత్కర్మములఫలములు లభింపవు. ఆపాపి సర్వదా విశ్వమందు నింద్యుడు కాగలడు.

దుర్బుద్ధికల్గినవు డత్యంతోన్నతు డైనను బతనము నొందగలడని శ్రుతులు నొక్కి-వక్కాణించినవి. నాసతీత్వమును భంగమొనరింపవలెనని ప్రయత్న మొనరించుచున్నాడవు గావున నీవు యక్ష్మరోగగ్రస్తుడ వయ్యెదవు గాక. దుష్టులదర్పములను హరించుశ్రీకృష్ణపరమాత్మయే నీగర్వాంధకార మును హరింపగలడు. కుమారా! మాతృసమురాల నైననన్ను త్యజింపుము. అట్లొనరించిన సత్యముగ నీకు గళ్యాణములు కల్గును.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

ఇట్లుపల్కి- తార చంద్రు డొనరింపబోవు దుష్కార్యమునకు సాక్షులుగ ధర్మమును, సూర్యుని, వాయువును, నగ్నిని, బ్రహ్మను, బరమాత్మను, నాకాశ మును, బవనమును, భూమిని, నహర్నిశములను, సంధ్యను, సకలదేవతలను నియమించి దుఃఖింప నారంభించెను. తారాదేవి పల్కినహితవచనములను సరకుగొనక భీతిచెందక చంద్రుడు కోపించినవాడై యామెపాణిని గ్రహించి తనరథముచం దిడుకొని యాప్రదేశమును వీడి వెడలిపోయెను. ఆపరమసౌంద ర్యవతిని జంద్రుడు నూఱుసంవత్సరములపర్యంతము చెఱపట్టెను. తుదకు దానొనరించినదుష్కార్యమునకు ఫలితము నూహించి బృహస్పత్యాగ్రహము నకు భీతుడై యఖండతేజస్వి యైనబలిచక్రవర్తి గురుదేవు డైనశుక్రాచార్యుని చంద్రుడు శరణువేడెను. దేవతల కాచార్యు డైనబృహస్పతి తన కెదిరిపక్షము వాడుకావున భృగునందను డైనశుక్రాచార్యుడు చంద్రున కభయ మొసంగెను. సభలో దితినందను డైనబలి కలంకితుడై భీతుడైనచంద్రున కభయమొసంగి దేవతలను బరిహసించెను. మహాభీతు డైనచంద్రునిగాంచి వేదవిదులందు శ్రేష్ఠు డైనశుక్రాచార్యుడు హితకరములు, తథ్యములు, వేదసమ్మతములు, పరిణామమందు సుఖప్రదము లైనవచనముల నిట్లు బల్కెను.

శు క్రు డు ప లి కె ను :

చంద్రా! నీవు బ్రహ్మదేవుని పౌత్రుడవు, భగవత్సముడైనయత్రిమహర్షి పుత్రుడవు. కుమారా! అయశస్కర మైనపరమనీచాతినీచ మైనయీదుష్కర్మ మెట్లు గావించితివి? రాజసూయయజ్ఞ మొనరించి సఫలుడ వై నిర్మలకీర్తిని బొందితివి. ఆకీర్తిసుధారాశిలో నీకళంకసురాబిందువును జేర్చి సర్వయశమును నాశమొనరించుకొంటివి. ప్రసవించుటకు సిద్ధముగ నున్నయీమహాసతి దేవ

గురుపత్నిని ద్యజింపుము. బృహస్పతి పరమధార్మికులందు, బ్రాహ్మణులందు వరిష్ఠుడు; దేవతల కాచార్యుడు; ఆంగీరసునిపౌత్రుడు, నిత్యము బ్రహ్మతేజముతో బ్రజ్వరిల్లుతపస్సంపన్నుడు.

శత్రోరపి గుణా వాచ్యా దోషా వాచ్యా గురోరపి ।
ఇతి సద్వంశజాతానాం స్వభావశ్చ సతామపి ॥ 50

శత్రువులసద్గుణములను బ్రశంసించుట, దోషము లొనరించునాచార్యుని దోషములను నిర్భయముగ బల్కుట సద్వంశసంజాతులైనసత్పురుషుల స్వభావము.

నిశాకరా! సురగురువు నాకు బరమశత్రువైనను నీధర్మసభలో నాయన సహజగుణములను వర్ణించితిని.

యత్ర లోకాశ్చ ధర్మిష్ఠా స్తత్ర ధర్మః సనాతనః ।
యతో ధర్మ స్తతః కృష్ణో యతః కృష్ణ స్తతో జయః ॥ 51

ధర్మాచరణ మొనరింపబడు ప్రదేశములోనే సనాతనమైన ధర్మము విరాజిల్లును. ధర్మ మెటనుండునో కృష్ణుడును నచ్చటే యుండును, కృష్ణు డెటనుండునో యచ్చటే విజయము సంప్రాప్తించును.

గోవునకొకసంతానమేకల్గును. వ్యాఘ్రికైదుబిడ్డలేకకాలములోనేకల్గును. సింహి యొకేసమయమున సప్తసంతానములను బ్రసవించును. అయిన నీహింసాకరజంతువు లన్నియు నతిత్వరితముగ నశింపగలవు. సాధువైన, ధర్మస్వరూపమైనగోవును ధర్మమే రక్షించును. దేవతలు, గురువులు, విప్రులు నిన్ను రక్షించుటలో శక్తిమంతులైనను ధర్మహాని కలిగించినవానిని బాపిని వారురక్షింపరు. కులట మైనవిప్రపత్నితో సంగమమొనరించిన విప్రులకు నిశ్చయముగ బ్రహ్మహత్యాపాతకములో షోడశాంశము లభించును. తమవద్ద కేతెంచిన కులటాగమన మొనరించినవారి కాపాతకములో నాల్గవభాగము సంభవించును. విప్రపత్నినిగాని, పతివ్రతనుగాని యెవరు బలపూర్వకముగ సతీత్వభంగమొనరించెదరో, వారికి నూఱుబ్రహ్మహత్యలపాతకములు సంభవించునని శ్రుతులు ప్రవచించినవి. మహాభాగా! ధర్మము నాచరింపుము. ఈక్షణమే యీ బ్రాహ్మణిని ద్యజింపుము. నీవొనరించినపాపమునకు బశ్చాత్తాపమునొంది మఱియెన్నడు నిట్టిపాపము లొనరింపనిచో నీకు మహాఫలము లభింపగలదు. ఉపాయముచే నీపాపమును దూరమొనరించెదను. అత్యంతభయము

నొంది నన్ను శరణువేడినావుగావున నేను నాధర్మముగ నిన్ను రక్షించెదను. భయభీతులైనవారిని, దీనులను, శరణార్థులను, శస్త్రహీనులను నెవరు రక్షింపరో వారు ధర్మిష్ఠులైనను ధ్రువముగ కుమ్భీపాకనరకము బొందగలరు. శరణుజొచ్చినవానిని రక్షించువారికి నూఱురాజసూయయజ్ఞము లొనరించినఫలము లభించును. వారు పరమేశ్వరునికృపకు బాత్రులై ధర్మయుక్తులై యిహమున సుఖముతో విరాజిల్లగలరు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

దైత్యాచార్యు డిట్లు పల్కి చంద్రునిచే స్వర్గమందాకినీజలములలో స్నానమొనరింపజేసి, విష్ణుపూజ యొనరింపజేసి, విష్ణుపాదాబ్జజాతము, శుభప్రదమైననైవేద్యమును భుజింపజేసి, వానికి దివ్యగంగాజలములను దీర్థములుగ నొసంగెను. పాపకర్మ మొనరించి లజ్జితుడై భయమునొంది పశ్చాత్తప్తహృదయుడైనచంద్రునిశిరముపై దనహస్తముంచి కుశములతో స్పృశించుచు మాటిమాటికి శ్రీహరిని స్మరించుచు నామహర్షి యిట్లు పల్కెను.

శు క్రు డు ప లి కె ను :

నే నొనరించినతపము, శ్రీహరిపూజలు, నాసత్యవాక్పరిపాలనావ్రతము, నాతీర్థస్నానఫలము, నాదానఫలము, నాయుపవాసఫలము సత్యమైనచో నీ వీ ఘోరపాపవిముక్తుడ వయ్యెదవుగాక. చేసినపాపము నశింపదు. నాతపశ్శక్తిచే నీపాపమును గొందఱుపాపకర్ములకు బంచెదను.

విప్రం త్రిసన్ధ్యాహీనం చ విష్ణుపూజావిహీనకమ్ ।
తదాప్నోతు మహాఘోరం చన్ద్రపాపం సుదారుణమ్ ॥ 65

త్రికాలసంధ్య లొనరింపనట్టి, విష్ణుపూజావిహీనులైనట్టి విప్రులకుమహాదారుణమైనచంద్రునిపాపము సంభవించుగాక.

స్వభార్యావంచనం కృత్వా యః ప్రయాతి పరస్త్రియమ్ ।
స యాతు నరకం ఘోరం చన్ద్రపాపేన పాతకీ ॥ 66

స్వభార్యను వంచించి పరస్త్రీని బొందువారు చంద్రపాపము నొంది పాతకులై ఘోరనరక మనుభవించెదరుగాక.

వాచా వా తాడయే త్కాన్తం దుశ్శీలా దుర్ముఖీ చ యా ।
సా యుగం చన్ద్రపాపేన యాతు లాలాముఖం ధ్రువమ్ ॥ 67

దుశ్శీలయై, దుర్ముఖియై వాక్కుతోగాని, తాడనచేగాని తనభర్తమనము నొప్పించుస్త్రీ నిశ్చయముగ జంద్రపాపమును బొంది యుగములపర్యంతము లాలాముఖ మనునరక మనుభవింపగలదు.

అనై వేద్యం వృధాన్నం చ యశ్చ భుంక్తే హరే ర్ద్విజః ।
స యాతు కాలసూత్రం చ చన్ద్రపాపా చ్చతుర్యుగమ్ ॥ 68

హరి కర్పింపని (హరికినై వేద్యముచేయని) వృధాన్నమును భుజించు ద్విజులు చంద్రపాపమునకు గుఱియై నాల్గుయుగములపర్యంతము కాలసూత్ర మనునరక మనుభవించెదరుగాక.

అమ్బువీచ్యాం భూఖననం యః కరోతి నరాధమః ।
చన్ద్రపాపా ద్యుగశతం కాలసూత్రం స గచ్ఛతు ॥ 69

అంబువీచీసమయములో భూఖనన మొనరించునరాధముడు చంద్రపాపమునకు గుఱియై నూఱుయుగములపర్యంతము కాలసూత్రనరకమును బొందగలడు.

స్వకాన్తం వంచయిత్వా చ యా యాతి పరపూరుషమ్ ।
సా యాతు వహ్నికుణ్డం చ చన్ద్రపాపా చ్చతుర్యుగమ్ ॥ 70

భర్తను వంచించి పరపురుష సమాగమ మొనరించుస్త్రీ చంద్రపాపమునకు గుఱియై నాల్గుయుగములపర్యంతము వహ్నికుండ మనునరక మనుభవింపగలదు.

కీర్తిం కరోతి రజసా పరకీర్తిం విలుప్య చ ।
స యుగం చన్ద్రపాపేన కుమ్భీపాకం చ గచ్ఛతు ॥ 71

రాజసుడై యితరులకీర్తిని క్షీణింపజేయుచు దనకీర్తిని బెంపొందింప జేయుటకు యత్నించువాడు (ఇతరులయశమును విమర్శించి దన్ను దాను బ్రశంసించుకొనువాడు) చంద్రపాపమునకు గుఱియై యొకయుగము ముగియువఱకు కుంభీపాకనరక మనుభవింపగలడు.

పితరం మాతరం భార్యాం యో న పుష్ణాతి పాతకీ ।
స్వగురుం చన్ద్రపాపేన యాతు చణ్డాలతాం ధ్రువమ్॥ 72

తన తల్లిదండ్రులను, భార్యను, నాచార్యుని పోషింపని మానవుడు

చంద్రపాపమునకు గుఱియై పాతకియై నిశ్చయముగ జండాలత్వమును బొందగలడు.

కులటాన్న మవీరాన్న మృతుస్నాతాన్న మేవ చ ।
యోఽశ్నాతి తం చన్ద్రపాపం యాతు ధిక్ పాపినం ధ్రువమ్ ॥ 73

కులట వండినయన్నమును, అవీరుడు (పిఱికి) వండినయన్నమును, ఋతుస్నాత వండినయన్నమును భుజించువారికి నిశ్చయముగ జంద్రునిపాపములో భాగము లభించును.

దివసే యో గ్రామ్యధర్మం మహాపాపీ కరోతి చ ।
యో గచ్ఛే త్కామతః కామీ గర్భిణీం వా రజస్వలామ్ ॥

తం యాతు చన్ద్రపాపం చ మహాఘోరం చ పాపినామ్ ।
స యాతు తేన పాపేన కాలసూత్రం చతుర్యుగమ్ ॥ 75, 76

పగలు సంభోగ మొనరించువారు, కాముకులై గర్భిణీస్త్రీని, రజస్వలను భోగించువారు మహాఘోరచంద్రపాపమునకు గుఱియై, పాపులై యాపాపఫలముగ నాల్గుయుగములవఱకు గాలసూత్ర మనునరక మనుభవింపగలరు.

ముఖం శ్రోణీం స్తనం యోనిం యః పశ్యతి పరస్త్రియాః ।
కామతః కామదగ్ధశ్చ యాతు తం చన్ద్రకల్మషమ్ ॥

స యాతు లాలభక్ష్యం చ చన్ద్రపాపా చ్చతుర్యుగమ్ ।
తస్మా దుత్తీర్య భవతు చణ్డాలోఽన్ధో నపుంసకః ॥ 77, 78

పరస్త్రీ ముఖమును, శ్రోణీభాగము (పిఱుఁద) ను, స్తనములను, యోనిని వీక్షించి కామదగ్ధు లగువారు జంద్రపాపమునకు గుఱియై, నాల్గుయుగముల పర్యంతము లాలభక్ష్య మనునరక మనుభవించి తదనంతరము చండాలురు, యంధులు, నపుంసకులునై దుఃఖింపగలరు.

అమావాస్యనాడు, పూర్ణిమనాడు, సంక్రాంతినాడు, చతుర్దశినాడు, అష్టమినాడు మాంసమును, మసూరమును, లకుచమును భుజించువారు, స్త్రీసంగమ మొనరించువారు చంద్రునిపాపమునకు గుఱికాగలరు. ఏకాదశి, శ్రీకృష్ణజన్మాష్టమి, శివరాత్రిదినములలో భుజించుమహాపాపి చంద్రపాతకము నొందగలడు. తామ్రపాత్రలో గాచబడినమధువు (తేనె) ను, ఎంగిలిఘృతమును, గంచుపాత్రలోనినారికేళజలమును, లవణము కలిపినపాలను, నొకరు త్రాగగా మిగిలినజలమును, నొకరు భుజింపగా శేషించినయన్నమును స్వీకరించు

వారికి, సూర్యాస్తమయసమయములలో మాటిమాటికి నన్నమును భుజించు వారికి దుర్నివార్యమైన, దారుణమైనచంద్రపాపము సంభవించును. వారీపాప ఫలముగ నాలుగుయుగములపర్యంత మంధకూప మనునరక మనుభవింపగలరు.

స్వకన్యను విక్రయించువారికి (కన్యాశుల్కము స్వీకరించువారు), స్వపుత్రుని విక్రయించువారికి (వరకట్నము స్వీకరించువారికి), నశ్వత్థవృక్షమును ఖండించువారికి, విష్ణువైష్ణవనిందకులకు నిశ్చయముగ దారుణమైనచంద్ర పాపము సంభవించును. వారాపాపఫలస్వరూపముగ బదునల్వురింద్రులకాల పర్యంతము తప్తమూర్మి యనునరక మనుభవించి యేడుజన్మములవఱకు జండాలురై, యైదుజన్మములవఱకు వృషభములై, నూఱుజన్మములవఱకు గార్దభములై, యేడుజన్మములవఱకు సూకరములై, యేడుజన్మములవఱకు గాకములై, యైదుజన్మములవఱకు విట్కృములై (మలకీటకములై), నూఱుజన్మములవఱకు జలగలై దుఃఖించి తదనంతరమే యాచంద్రపాపవిముక్తులు కాగలరు. వృథాగా జీవహింస యొనరించి మాంసము భుజించువారు, స్వార్థపరులై తాము వండుకొనినపదార్థముల నితరులకు బెట్టక స్వయముగ భుజించువారు చంద్రపాపమునకు గుఱియై నాలుగుయుగములపర్యంత మసిపత్రనరక మనుభవింపగలరు. తదనంతర మనేకనీచయోనులందు బరిభ్రమించి యెట్టకేలకు బరిశుద్ధులు కాగలరు. వడ్డీవ్యాపార మొనరించువిప్రులు, యోనినివిక్రయించి జీవించువారు, పరులకు జికిత్సయొనరించి ధనార్జనముచేయుచికిత్సకులు, హరినామమును విక్రయించువారు, స్వాంగములను విక్రయించువారు, స్వధర్మమును గొప్పగా జెప్పుకొనువారు (బరధర్మములను నిందించువారు), ఆత్మప్రశంస మొనరించుకొనువారు (తమ్ము దాము పొగడుకొనెడివారు), వ్యభిచారిణులపై నాధారపడి జీవించువారు వీరి కందఱకు జంద్రపాపము సంభవించి చంద్రుడు పరిశుద్ధుడగుగాక. నరఘాతకులకు, జోరులకు, శవములపై జీవించువారలకు, జీవహింస యొనరించి జీవించువారలకు, జంద్రపాపము సంభవించి చంద్రుడు పరిశుద్ధుడగుగాక.

శ్రీ నారాయణఋషి పలికెను :

ఇట్లు చంద్రుని బరిశుద్ధునిగ నొనరించి శుక్రాచార్యులు తారను సంబోధించి యిట్లు పలికెను. "మహాసతీ! సాధ్వీ! నీవు నీస్వస్థలమునకు మరలిపొమ్ము.

ప్రాయశ్చిత్తం వినా పూతా త్వమేవ శుద్ధమానసా।
అకామయా బలిష్ఠేన న స్త్రీ జారేణ దుష్యతి ॥ 106

తారా! నీవు శుద్ధమానసురాలవు. కావున ప్రాయశ్చిత్తము లేకయే పవిత్రురాలవైనావు. కామము లేనిస్త్రీ బలవంతముగ జెరచబడినను నాస్త్రీ జారత్వముచే దూషింపబడదు (జారదోషము సంభవింపదు)".

ఇట్లు పల్కి శుక్రాచార్యులు చంద్రుని, సస్మితయైనతారను జెలువ్వలతో నాశీర్వదించెను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణ
సంవాదమున తారాచంద్రులదోష
నివారణ మను ఏబదియెనిమిదవ
అధ్యాయము
సంపూర్ణము.

—♦—

# ఏబదితొమ్మిదవ అధ్యాయము

## బృహస్పతి కైలాసగమనము

నారదుడు పలికెను:

తారాహరణానంతరము బృహస్పతి యేమి చేసెను? ఆసాధ్వి నాయన మరల నెట్లు పొందగల్గెనో వ్యాఖ్యానింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీ నారాయణ ఋషి పలికెను:

జాహ్నవీతటమునకు స్నానార్థమై వెడలినతార మరలివచ్చుటలో విలంబనమగుట గాంచి బృహస్పతి విషయమును దెలిసికొని రావలసినదిగ శిష్యులని గంగాతీరమునకు బంపెను. శిష్యులు గంగాతీరమునకు జని యచ్చోట

జరిగినదంతయు బ్రజలనుండి తెలిసికొని రోదించుచు నాశ్రమమునకు మరలి వచ్చి తారాహరణవృత్తాంతము నత్యంతదుఃఖముతో దనగురుదేవునకు విన్నవించెను. చంద్రుడు తనప్రియతమను హరించె ననెడిదుర్వార్త నాకర్ణింపగనే సురగురు డొకముహూర్తకాలము మూర్ఛిల్లెను. మరల జేతనత్వము నొంది హృదయవిదారకముగ శిష్యులతో గలసి శోకముచే లజ్జితుడై మరలమరల దుఃఖించుచు నేత్రముల నీరుగార్చుచు శోకార్తుడై నశిష్యుల నుద్దేశించి శోకార్తితో శ్రుతిసమ్మతములైననీతివచనముల నిట్లుపలికెను.

బృహస్పతి పలికెను :

కుమారులారా! ఎవరివలన నేను శపింపబడితినోగదా! ఆకారణము నేను దెలియలేకున్నాను.

దుఃఖం ధర్మవిరుద్ధో యః స ప్రాప్నోతి న సంసయః ॥ 7

ధర్మవిరుద్ధులైనవారు నిస్సంశయముగ దుఃఖములను బొందగలరు.

యస్య నాస్తి సతీ భార్యా గృహేషు ప్రియవాదినీ ।
అరణ్యం తేన గన్తవ్యం యథాఽరణ్యం తథా గృహమ్ ॥

భావానురక్తా వనితా హృతా యస్య చ శత్రుణా ।
అరణ్యం తేన గన్తవ్యం యథాఽరణ్యం తథా గృహమ్ ॥

సుశీలా సున్దరీ భార్యా గతా యస్య గృహా దహో ।
అరణ్యం తేన గన్తవ్యం యథాఽరణ్యం తథా గృహమ్ ॥

దైవే నాపహృతా యస్య పతిసాధ్వీ పతివ్రతా ।
అరణ్యం తేన గన్తవ్యం యథాఽరణ్యం తదా గృహమ్ ॥

యస్య మాతా గృహే నాస్తి గృహిణీ వా సుశాసితా ।
అరణ్యం తేన గన్తవ్యం యథాఽరణ్యం తథా గృహమ్ ॥

ప్రియాహీనం గృహం యస్య పూర్ణం ద్రవిణబన్ధుభిః ।
అరణ్యం తేన గన్తవ్యం యథాఽరణ్యం తథా గృహమ్ ॥

భార్యాశూన్యా వనసమాః సభార్యాశ్చ గృహాగృహాః ।
గృహిణీ చ గృహం ప్రోక్తం న గృహం గృహ్య ముచ్యతే ।

అశుచిః స్త్రీవిహీనశ్చ దైవే పిత్ర్యే చ కర్మణి ।
యదహా కురుతే కర్మ న తస్య ఫలభా గ్భవేత్ ॥ (౮-౧౫)

ఎవనికి యోగ్యురాలు, సతి, ప్రియవాదిని యైనభార్య గృహమునందు లేదో యతడరణ్యములకు బోవలయును. అరణ్య మెట్లో వానికి గృహ మట్లే. భావానురక్త, వినీతురాలైనభార్యను శత్రువులు హరించిన దద్భర్త యరణ్యముల కేగవలయును. అరణ్య మెట్లో వానికి గృహమట్లే. ఎవనిగృహము వీడి సుశీల, సుందరి యైనభార్య వెడలిపోవునో, పతిసాధ్వురాలు, పతివ్రతయైన యెవనిభార్య దైవముచే హరింపబడునో (మరణించునో) యతడును, యెవనికి గృహములోదల్లి లేదో, సుశిక్షితురాలైన గృహిణిలేనివాడును, గృహముధనాదులచే, బంధువులచేబరిపూర్ణమైయున్నను బ్రియభార్యలేనివాడును నరణ్యముల కేగుటుచితము. వాని కరణ్యమెట్లో గృహమట్లే. భార్యాశూన్యము లైన గృహములు వనసమములు, భార్యతోనున్నగృహములే వాస్తవముగ గృహములు. గృహిణి విరాజిల్లు గృహమునే గృహమందురు. కాని భార్య లేని గృహము గృహము కానేకాదందురు. స్త్రీవిహీను డైనవా డశుచియై దైవ పితృకార్యముల కర్హుడు కాడు. ఆతడు పగలొనరించినసత్కర్మముల ఫలములను బొందలేడు.

దాహశక్తిహీను డైనహుతాశను డెట్లు మందగించునో, ప్రభాహీను డైనసూర్యు డెట్లుండునో, శోభాహీను డైనశశాంకు డెట్లుండునో, శక్తిహీను డైనజీవు డెట్లుండునో, శరీరము లేనియాత్మ యెట్లుండునో, యాధారము లేనియాధేయ మెట్లుండునో, ప్రకృతి లేనియీశ్వరు డెట్లుండునో, కర్మఫలములను బ్రసాదించుమూలసామగ్రి యైనయజ్ఞఫలప్రదాయిని యైనదక్షిణ లేనిదే యజ్ఞ మెట్లు అశక్తమో, సువర్ణము లేనిదే స్వర్ణకారు డెట్లశక్తుడో, మృత్తిక (మన్ను) లేనిచో గుమ్మరి తనకర్మమునం దెట్లుఅశక్తుడో, యట్లే గృహాధిష్ఠాతృదేవి, స్వశక్తి యైనగృహిణి లేనిచో సతతము సర్వకర్మలందు గృహి (భర్త) యశక్తుడే. సర్వక్రియలకు భార్యయే మూలము; గృహములకు భార్యయే మూలము; గృహస్థు లైనవారికి గృహములో సదా సుఖములకును హర్షమునకును శుభములకును సంసారమునకును జీవనసౌరభమునకును భార్యయే మూలము. రథులకు రథ మెట్లో గృహముకలవారలకు గృహ మట్లే, రథము కలవారలకు సారథి యెట్లో గృహస్థులకు వారిప్రియభార్యయట్లే.

సర్వరత్నప్రధానం చ స్త్రీరత్నం దుష్కులాదపి ।
గృహీతా సా గృహస్థేనై వేత్యాహ కమలోద్భవః ॥ 24

సర్వరత్నప్రధానమైన (సర్వసద్గుణసంపన్నురాలైన) స్త్రీరత్నము దుష్కులమునకు జెందినదైనను గృహస్థు నిస్సంకోచముగనట్టి స్త్రీరత్నమును భార్యగ స్వీకరింపవచ్చునని కమలోద్భవు డాదేశించెను.

జలము లేనిదే పద్మమెట్లుండునో, శోభ లేనిదే పద్మ మెట్లుండునో, యట్లే స్వగృహములో గహిణి లేనిచో గృహస్థు డట్లుండును.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

ఇట్లు పల్కి బృహస్పతి దుఃఖించుచు గృహములో ప్రవేశించి మరల గృహము బయల్వెడలి యనేకపర్యాయములు మూర్ఛనొంది, చైతన్యము నొంది, తనప్రియురాలిగుణములను స్మరించుచు, మాటిమాటికి దుఃఖింప నారంభించెను. ఆసమయమున కొందఱు జ్ఞాను లామహాజ్ఞాని నూరడించిరి. తనశిష్యులు, మహర్షులు నొనరించిన ప్రబోధానుసారముగ బృహస్పతి పురందరుని (ఇంద్రుని) గృహమునకు జనెను. తనగురుదేవుని గాంచి యింద్రుడు బాగుగ బూజించి యాతిథ్య మొసంగెను. అత్యంత హృదయవిదారకమైన యప్రియమైన స్వవృత్తాంతమును బృహస్పతి తెల్పగా నింద్రుడు అయన వచనముల నాలకించి కోపప్రస్ఫురితాధరుడై రక్తపంకజలోచనుడై యిట్లు బల్కెను.

మ హేం ద్రు డు ప లి కె ను :

అత్యంతనిపుణులు, చారకర్మయందు దక్షులు, తత్త్వప్రాప్తిలో సమర్థులైనసహస్రాధికదూతలను దారాచంద్రుల యన్వేషణార్థమై యీక్షణమందే పంపెదను. పాపాత్ముడైనచంద్రుడు నాతల్లి తారతోగూడ నేప్రదేశమున నుండెనో నేనాప్రదేశమునకు సర్వదేవగణసహితుడనై యుద్ధమునకు బయలు దేరెదను. మహాభాగా చింతను వీడుము. నీకు సర్వము శుభముగనే పరిణమింప గలదు.

భద్రబీజం దుర్గ మిదం కస్య సంప ద్విప ద్వినా ॥ 33

ఈక్లేశము లన్నియు శుభములకు బీజములే. విపత్తులు లేకుండ సంపద లెట్లుండును?

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

ఇట్లు పల్కి యింద్రుడు పెక్కుదూతలను దదన్వేషణార్థమై పంపెను. మునీశ్వరా! చారకర్మములో నిపుణులైనయాదూతలు నూఱుసంవత్సరముల పర్యంతము నిర్జనప్రదేశములో, సుదుర్లంఘ్యము లైనవిశ్వములలో వెదకి వెదకి తుదకింద్రుని జేరి శుక్రాచార్యునిభవనములో నాయనశరణు జొచ్చి నిర్భీకుడై యున్నచంద్రునితో భయకంపితురాలై యున్నతారను గాంచితి మని విన్నవించిరి. ఈసమాచారము నాలకింపగనే సునాసీరుడు (ఇంద్రుడు) శోకసంతప్తహృదయుడై తలవంచుకొని బృహస్పతితో నిట్లు పల్కెను. "మహాత్మా! పరిణామమందు సుఖమును బ్రసాదింపగలవచనములను బల్కెద నాలకింపుము. మహాభాగా! భయమును వీడుము. సర్వము నీకు శుభమే కల్గును. నేను దితినందనుని, శుక్రాచార్యుని జయింపలేనని తలచి చంద్రుడు శుక్రాచార్యునిశరణమునాశ్రయించెను. కావున మాయందఱతో గలసి బ్రహ్మలోకమునకు రమ్ము. బ్రహ్మతో గలసి మనమందరము కైలాసమును జేరి శంకరు నాశ్రయింతము." ఇట్లు పల్కి యింద్రుడు బృహస్పతితో గూడి సుఖదృశ్యము, నిరామయమైనబ్రహ్మలోకము జేరెను. బ్రహ్మలోకములో బ్రహ్మదేవుని దర్శించి బృహస్పతితో గూడ బ్రణామము లర్పించి సకలదేవత లకు బరమేశ్వరు డైనయాయనకు సర్వవృత్తాంతమును వివరించెను. మహేంద్రునివచనముల నాలంకించి కమలోద్భవుడు హితకరములు, తథ్య ములు, నీతిసారములునగువచనముల నిట్లు పల్కెను.

బ్ర హ్మ ప లి కె ను :

యో దదాతి పరస్మై చ దుఃఖమేవ చ సర్వతః ।
తస్మై దదాతి దుఃఖం చ శాస్తా కృష్ణః సనాతనః ॥ 44

పరులకు దుఃఖములను సర్వదా కల్గించువారికి సకలశాసకుడు, సనాతను డైన శ్రీకృష్ణుడు దుఃఖముల నిచ్చును.

ఈసృష్టికి నేను స్రష్టను, సనాతను డైనవిష్ణువే పరిపాలకుడు, రుద్రుడే సంహారకుడు. శివుడు సదా సృష్టికి మంగళములను బ్రసాదించును. నిరంతరము సర్వకారణములకు సర్వసాక్షియై ధర్మము విరాజిల్లును. విషయులు లైనయీ సర్వదేవతలు శ్రీకృష్ణునియాజ్ఞాపరిపాలకులే. వేదవేదాంగపారంగతు లైనబృహ

స్పతి, యుతథ్యుడు, జితేంద్రియుడైనసంవర్తుడు - ఈముగ్గురు నాంగీరసుని పుత్రులు. సంవర్తునకు గనిష్ఠుడైనబృహస్పతికి దండ్రి యేసంపదలను నొసంగ లేదు. ఆతడు సర్వేశ్వరుడైనశ్రీకృష్ణుని ధ్యానించుచు దపస్విగా మాఱెను. మధ్యముడైనయుతథ్యుడు తనసోదరుని (సంవర్తుని) భార్య, యకాముకి, గర్భవతియైనయామెను గాముకుడై చెఱపట్టెను. కాముకుడై యకాముకియైనసోదరునిభార్యను హరించుచువారికి నిస్సంశయముగ నూఱుబ్రహ్మహత్యాపాతకములు సంభవింపగలవు. ఆతడు సూర్యచంద్రు లున్నంతవఱకు గుంభీపాకనరక మనుభవించును. సోదరునిభార్య నపహరించినమానవుడు మాతృగామియై మహాపాపమునకు గుఱికాగలడు. నరకానుభవానంతర మాపాపి వేయి కోట్లసంవత్సరములపర్యంతము మలమునందు క్రిమియై దుఃఖించి మరల నంత కాలము పుంశ్చలీయోనిలో గృమియై జీవించును. పురందరా! ఆపాపి బహు జన్మములు గ్రద్ధయై జన్మించి నూఱుజన్మములు కుక్కురమై, మఱినూఱుజన్మములు సూకరమై దుఃఖించును.

దదాతి యో న దాయం చ బలిష్ఠో దుర్బలాయ చ ।
స యాతి కుమ్భీపాకం చ యావచ్చన్ద్రదివాకరౌ ॥ 55

"బలిష్ఠులైనవారు దుర్బలులకు సరిసమానముగ భాగమర్పింపనియెడల వారు సూర్యచంద్రు లున్నంతవఱకు గుంభీపాకనరకమనుభవింపగలరు". నూఱు కోట్లకల్పములు గతించినను ననుభవింపనిదే కర్మఫలములు క్షీణింపవు. తా మొనరించినశుభాశుభకర్మఫలముల నవశ్య మనుభవింపక తప్పదు. జగద్గురుడైనశివునకుగూడ బృహస్పతి గురుపుత్రు డనెడివృత్తాంతమును బలముగల వారిలో శ్రేష్ఠుడైనయీశ్వరునకు విన్నవించుకొనుడు.

సర్వదేవసమూహములు వాహనారూఢులై మధ్యలో మహర్షుల నుంచుకొని నర్మదానదీతటమును జేరుడు. తదనంతరము నేనుగూడ బుణ్యప్రదమైన యానర్మదానదీతీరమున కేతెంచెదను. బృహస్పతి యింద్రుడు శీఘ్రముగ శివాలయమును (కైలాసమును) జేరుడు.

మహేంద్రుడు పలికెను:

వేదకర్తా! సిద్ధులకు, యోగులకు గురుదేవా! మృత్యుంజయుడైన శంకరునకు బృహస్పతి గురుపుత్రు డెట్లు కాగలడు? ఆంగిరసమహర్షి నీకుమా

రుడుగదా! బృహస్పతి యాయనకుమారుడేగదా! నీకంటె మహాదేవుడు మహాజ్ఞానసంపన్నుడు. ఆయనకు బృహస్పతి గురుపుత్రు డెట్లయ్యెనో వివరింపవలసి నదిగ గోరుచున్నాను.

బ్రహ్మ పలికెను :

పురందరా! ఈకథ పురాణములందుగూడ నత్యంతగోప్యము. అతి పూరాతన మైనయీచరితమును బ్రవచించెద నవధరింపుము. పూర్వకాలములో గర్మదోషమువలన నాంగీరసునిభార్య మరణించినకుమారుని బ్రసవించెను. ఆమె సత్పుత్రునికోఱకై నాయాదేశానుసారముగ శ్రీకృష్ణపరమాత్మదివ్య వ్రతము నాచరించెను. పుంసవన మనెడియాశ్రీకృష్ణవ్రతమును నాంగీరసుని భార్య యొకసంవత్సరపర్యంతము సనత్కుమారునే పురోహితునిగ నొనరించు కొని, యాచరించెను. కృపామయుడు, స్వేచ్ఛామయుడు, పరబ్రహ్మము, భక్తానుగ్రహవిగ్రహుడు నగుశ్రీకృష్ణభగవానుడు గోలోకమునుండి దిగివచ్చి యాసాధ్వియెదుట సాక్షాత్కరించెను. సాశ్రుపూర్ణ నయనములతో వినీతు రాలై స్తుతించుచు బ్రణామము లర్పించుచున్న యాసాధ్విని గాంచి కృపానిధి యిట్లు పల్కెను.

శ్రీకృష్ణభగవానుడు పలికెను :

సాధ్వీ! మత్తేజఃసమన్విత మైనయీవ్రతఫలమును గ్రహింపుము. ఈవ్రత ఫలమును భుజించిననీకు నావరమువలన నాయంశమున బుత్రుడుద్భవింపగలడు. నీకుమారుడు సర్వదేవతలకు నాచార్యుడై, సకలజ్ఞానులందు మహాశ్రేష్ఠుడై నావరమువలన బృహస్పతి యనునామమున విరాజిల్లగలడు. నావరమువలన నెవరు కల్గెదరో వారు నావరపుత్రు లనబడెదరు. నీగర్భములో నాకుమారుడే చిరంజీవియై విరాజిల్లగలడు. పుత్రు లేడువిధములుగ నుందురు.

వరజో వీర్యజశ్చైవ క్షేత్రజః పాలక స్తథా ।
విద్యామన్త్రిసుతౌ చైవ గృహీతః సప్తమఃసుతః ॥ 70

1. వరజుడు – వరమువలన కల్గినవాడు, 2. వీర్యజుడు – వీర్యమువలన గల్గినవాడు, 3. క్షేత్రజుడు – భార్యవలన గల్గినపుత్రుడు, 4 పోషింపబడువాడు – 5. విద్యాసుతుడు విద్యార్థి 6. మంత్రసుతుడు – శిష్యుడు. 7. దత్తస్వీకృతు డగు పుత్రుడు.

బ్రహ్మ పలికెను :

ఇట్లాసాధ్వి ననుగ్రహించి రాధికానాథుడు గోలోకమునకుమరలిపోయెను. స్వయముగ సురలకాచార్యుడైన బృహస్పతి శ్రీకృష్ణునివరపుత్రుడే. హిమాలయముపై మూడులక్షలదివ్యవర్షములు శివుడు శ్రీకృష్ణభగవాను నారాధింపగా నాసకలజగన్నాథుడు ప్రసన్నుడై శంకరునకు మృత్యుంజయ మహాజ్ఞానమును, స్వయోగమును, నఖిలజ్ఞానమును, తనతో సమమైనతేజ మును, స్వశక్తియైనవిష్ణుమాయను, స్వాంశసంభవమైనవృషభవాహనమును (నందిని), శూలమును, స్వకవచమును, ద్వాదశాక్షరస్వమహామంత్రమును గృపామయుడై యనుగ్రహించెను. శివలోకములో విరాజిల్లుశివప్రియ శివయే విష్ణుమాయ. ఆమె శ్రీమన్నారాయణునిశక్తికావున నామెను నారాయణి యనిరి. ప్రాచీనకాలములో సర్వదేవతాతేజములనుండి యావిర్భవించి యాసనా తని దైత్యులను సంహరించి దేవతలకు విజయమును బ్రసాదించెను. కల్పాంత రములో నామూలప్రకృతియే దక్షకన్య సతిగ ప్రాదుర్భవించి పితృయజ్ఞములో దన హృదయేశ్వరుని నింద సహింపలేక తనువును యోగమార్గమున ద్యజించి యాసిద్ధయోగిని శైలకన్యకయై ప్రాదుర్భవించెను. కాలానుసారముగ నాగిరి రాజనందిని శ్రీకృష్ణు నారాధించి శంకరుని పొందగల్గెను. పరాత్పరుడు పరమాత్ముడునైన శ్రీకృష్ణుడే శంభునకు గురుదేవుడు. శ్రీకృష్ణునివరపుత్రుడే స్వయముగ బృహస్పతి. ఈహేతువువలన సురగురువు శివునకు గురుపుత్రు డైనాడు. అతిగుహ్యమైనయీవిషయమును నే వర్ణించితిని. శ్రుత్యనుసారముగ బ్రధానసంబంధము లిట్లు వర్ణించితిని. అన్యవిషయములనుగూడ వర్ణించెద నాలకింపుము. మహాప్రతాపవంతుడై నగరుత్మంతుడు; శంకరాంశ సంభూతుడు దూర్వాసుడు, వీ రిర్వురు నాంగీరసమహర్షి శిష్యులు. ఈకారణమువలననే శివునకు బృహస్పతి గురుపుత్రు డయ్యెను. దక్షప్రజాపతి యజ్ఞములో దన ప్రాణాధికురాలైనసతి మృతినొందగ శంకరుడు స్వమోహామునకు గురియై స్వజ్ఞానమును విస్మరించియుండగా శ్రీకృష్ణప్రేరితుడై యాంగీరసమహర్షి శంకరుని బ్రబోధించెను. ఈకారణమువలన నాంగీరసుడు శివున కాచార్యుడు కాగా బృహస్పతి గురుపుత్రు డైనారు. కావున బృహస్పతీ! స్వయముగ నీవు కైలాసము జేరి శివు నాశ్రయింపుము. ఇంద్రా! నీవు నర్మదానదీతీరమును జేరుము.

ఇట్లు బృహస్పతీంద్రులను బ్రహ్మదేవు డాదేశించెను. నారదా! దేవ గురువు కైలాసమునకు బయనముకాగా మహేంద్రుడు నర్మదానదీతటమును జేరెను.

ఇదిశ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
ప్రకృతి ఖండములోని నారదనారాయణ
సంవాదమున బృహస్పతికైలాసగమన
మను ఏబదితొమ్మిదవ
అ ధ్యా య ము
సంపూర్ణము.

—o—

## అఱువదియవ అధ్యాయము

### శివబృహస్పతులసంవాదము

నా ర దు డు ప లి కె ను :

శ్రీమన్నారాయణా! మహాభాగా! వేదవేదాంగపారగా! నీముఖ చంద్రునినుండి బయల్వెడలినసుధాఖ్యానములను దనివిదీర బానమొనరించితిని. బృహస్పతి కైలాసముజేరి సర్వసంపదలకు బ్రదాత యైనశివునితో నేమి పల్కెనో శ్రవణమొనరింప గోరుచున్నాను. బృహస్పతి వచనములకు జగ త్కర్త, విధాత యైనశంకరభగవానుడు ప్రత్యుత్తరముల నొసంగిన యావిషయ ముల నన్నింటిని ప్రవచింపుము.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

లక్ష్మీభ్రష్టు డైనబృహస్పతి శీఘ్రముగ గైలాసము జేరి లజ్జామలిన విగ్రహుడై శంకరునకు ప్రణామము లర్పించి నిలువబడెను. గురుపుత్రుని గాంచగనే శంకరుడు కుశాసనమునుంచి లేచివచ్చి బృహస్పతి నాలింగనము

జేసికొని వానికి మంగళాశీస్సులు నొసంగి తనయాసనముపై నాశీనుని జేసెను. భయము నొంది లజ్జతో నతమస్తకుడై యున్న బృహస్పతిని గాంచి శివుడు కుశలప్రశ్నలు ప్రశ్నించి మధురవచనముల నిట్లు పల్కెను.

శంకరుడు పలికెను :

సోదరా! నీవేకారణమున నశ్రుపూర్ణ నేత్రములతో మలినవిగ్రహుడవై లజ్జితుడవై దుఃఖించుచున్నావో తెల్పుము. మునీశ్వరా! నీతపము క్షీణించెనా? సంధ్యాహీనుడ వైతివా? దైవదోషమువలన శ్రీకృష్ణసేవావిహీనుడ వైతివా? గురువునందు నభీష్టదైవమైనహరియందు భక్తిహీనుడ వైతివా! శరణాగతుడై ప్రపన్నుడైనవానిని రక్షించుటలో నసమర్థుడవైనావా? నీయతిథి నీనుండివిముఖుడైనాడా? నీచే పోషింపబడువారాకలితోనున్నారా? నీభార్య స్వతంత్రించెనా? నీపుత్రుడు నీయాదేశములను పరిపాలింపలేదా? నీశిష్యులు నీచే శాసింపబడుట లేదా? నీభృత్యులు నీ కెదురుదిరిగి ప్రత్యుత్తరముల నొసంగుచున్నారా? లక్ష్మి నీయెడల విముఖురాలయ్యెనా? సత్పురుషులందు శ్రేష్ఠుడు, గరిష్ఠుడు, వరిష్ఠుడు, వశిష్ఠుడు, ప్రేష్ఠుడు సదా సంతుష్టమానసుడైననీగురుదేవుడు నీపై గోపించెనా? నీయిష్టదైవము నీపై గోపించెనా? బ్రాహ్మణులు నీపై గోపించిరా? వైష్ణవులు నీపై గోపించిరా? నీశత్రువులు ప్రబలులైరా? నీకు బంధువిచ్ఛేదము సంభవించెరా? నీకు బలవంతులతో విగ్రహము (యుద్ధము) సంభవించెనా? నీపదము పరగ్రస్తమయ్యెనా? నీబంధువులధన మపహరింపబడెనా? మునీశ్వరా! పాపులు, ఖలులైనవారు నిన్ను నిందించిరా? నీబాంధవులు, నీప్రియతములు నిన్ను పరిత్యజించిరా? వైరాగ్యయుక్తులై నీబంధువులు నిన్ను వీడిపోయిరా? పుణ్యతీర్థములలో నీవు స్నానము లాచరింపలేదా? పుణ్యావసరములలో దానముల నొనరింపలేదా? ఖలులముఖమునుండి గురునిందనుగాని, బంధువులనిందనుగాని వింటివా ఏమి?

గురునిన్దా హి సాధూనాం మరణా దతిరిచ్యతే ॥ 17

గురునిందాశ్రవణము సాధువులకు మరణముకంటె నధిక బాధాకరము.

మరలమరల నరకమును బొందుదుశ్శీలవంతులే గురునిందయొనర్తురు. ఖలులు, అసద్వంశ్యులుమాత్రమే యాచార్యుని నిందింతురు. సదా పరులను ప్రశంసించుమహాత్ములే పుణ్యవంతులు, సదామంగళసంయుక్తులు, విమలమన

స్కులు. సంతానమును, యశమును, పరాక్రమమును, నైశ్వర్యమును, ప్రతాపమును, ప్రజలను, భూములను, ధనమును, వచనములను, బుద్ధిని, స్వభావమును, జరిత్రమును, నాచారవ్యవహారములను, సమృద్ధిని, పరిశీలించి యెదుటివారిహృదయమును తెలిసికొనవచ్చును.

యాదృ గ్యేషాం చ హృదయం తాదృక్తేషాం చ మఙ్గలమ్ ।
యాదృ గ్యేషాం పూర్వపుణ్యం తాదృ క్తేషాం చ మానసమ్ ॥ 22

వారి హృదయ మెట్లుండునో వారిమంగళము లట్లే యుండును. వారి పూర్వపుణ్యమెట్లుండునో వారిమనమట్లే యుండును. అనగా మనహృదయ పవిత్రతయే మనకు శుభకరము, మన యొనరించినపూర్వపుణ్యమే మనకు మంచి మనస్సు నొసంగును.

ఇట్లు బల్కి మహాదేవుడు మౌనమువహించెను. మహాదేవునివచనముల నాలకించి మహావక్త బృహస్పతి యిట్లు ప్రత్యుత్తర మొసంగెను.

బృ హా స్ప తి ప లి కె ను :

ఈశ్వరా! చెప్పదగనివృత్తాంతమును జెప్పెద నవధరింపుము. లోకములందు గలసకలజీవులు తా మొనరించిన కర్మమునకు వశులై యనేకజన్మములను బొందుచున్నాడు. జన్మజన్మములందు జీవులు తా మొనరించిన కర్మఫలములనే యనుభవించుచున్నారు. అనుభవింపనిదే స్వకర్మములు క్షీణింపవు. ప్రభూ! మానవులకు వారివారి కర్మానుసారముగనే సుఖములు, దుఃఖములు భయశోకాదులు సంభవించును. వేదవేదాంగపారగా! కర్మానుభవములు మూడువిధములనిరి. కొందఱు తా నాచరించినకర్మములవలన సుఖదుఃఖముల ననుభవించెద రనిరి. మరికొందఱు దైవకృతమువలన ననిరి. మరికొందఱు స్వభావమువలన ననిరి. స్వయంకృతకర్మమే దైవకారణము కాగలదు. పూర్వకర్మమువలననే మానవులకు స్వభావ మేర్పడగలదు. తా మొనరించిన కర్మానుసారముగనే దేహధారులకు సుఖములు, దుఃఖములు భయశోకాదులు సంభవింపగలవు. స్వకర్మముల ననుభవించుజీవుడు సదా సగుణుడై యుండును. జీవునిచే కర్మఫలముల ననుభవింపజేయుచు సాక్షియై నిర్గుణమై ప్రకృతికే యతీతమై విరాజిల్లునదియే యాత్మ. ఆయాత్మయే సర్వసేవ్యము, సకలఫలప్రదము.

ఆత్మయే దేవదర్శన మొసంగగలదు, స్వభావములను, కర్మలను ప్రసాదింప గలదు. కర్మవలననే సిగ్గు, ప్రశంస, సంతోషము లభించును.

ఇట్లు పల్కి బృహస్పతి జరిగినవృత్తాంత మంతయు మహాదేవునకు విన్నవించెను. తారాపహరణవృత్తాంతము నాలకింపగనే శంకరునిశిరము లజ్జతో నతమయ్యెను. ఆయనకరమునుండి జపమాల క్రిందబడెను. శంకరుడు మహాకోపముతో శరీరము కంపింపగ రక్తపంకజలోచను డయ్యెను. సంహారకుడైన రుద్రులకీశ్వరుడు, పరిపాలకుడై విష్ణువునకు సఖుడు, బ్రహ్మచే స్తుత్యుడు పరమాగతి, నిర్గుణుడైన శ్రీకృష్ణుని ప్రకృతీశ్వరుడు కోపించినవాడై యిట్లు పల్కెను.

మ హా దే వు డు ప లి కె ను :

సాధువులకు, వైష్ణవులకు సదాశుభమగునుగాక! అవైష్ణవులకు, అసాధువులకు, ప్రతిపదమందు సదా యశుభములు సంభవించుగాక. వైష్ణవులకు దుఃఖముల నొసంగువారికి శ్రీకృష్ణు డడుగడుగున విఘ్నముల నొసంగి తుదకు వారిని సంహరించును. అవైష్ణవులహృదయములు శుద్ధములు కావు, సదా మలయుక్తములు.

శ్రీకృష్ణమన్త్రస్మరణం మనోనైర్మల్యకారణమ్ ॥
భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః ।
విష్ణుమన్త్రోపాసనయా క్షీయతే కర్మ తన్నృణామ్ ॥ 40

మానవులకు శ్రీకృష్ణస్మరణమే మనోనైర్మల్యకారణముకాగలదు. శ్రీకృష్ణ మంత్రస్మరణము హృదయగ్రంథులను ఖండించును, సర్వసంశయములను నశింపజేయును, విష్ణుమంత్రోపాసన మొనరించిన దేహధారికర్మలు క్షీణింపగలవు.

ఆహా! శ్రీకృష్ణదాసులస్వభావ మెంత సునిర్మలము. బృహస్పతీ! నీభార్య నపహరించినచంద్రుడు నీకు శత్రువైనను నీవువానిని శపింపకున్నావు. ఆచార్యుడు వరిష్ఠుడు క్రోధహీనుడు, దార్మికుడునైనచో దనశత్రువు తన నూర్గురు పుత్రులను సంహరించినను నాతని శపింపడు. నాసోదరుడు సురగురుడైనబృహస్పతి తననిశ్వాసచే క్షణములో నూర్గురుచంద్రులనైన నిశ్చయముగ భస్మమొనరింపగలసమర్థుడైనను ధర్మభంగమగునని చంద్రుని శపింపలేదు.

నిత్యము కోపావేశము కల్గి యితరులను శపించినతాపసులకు తమతపశ్శక్తి క్షీణించును. మహాతపస్వీ! వైష్ణవుడు, ధీమంతుడు, ధర్మిష్ఠుడునైన బ్రాహ్మణుడు, బ్రహ్మకుమారుడైనయత్రిమహర్షికి బరస్త్రీలుబ్ధకుడు, శఠుడునైనయీ చంద్రుడసత్పుత్రుడు. బృహస్పతీ! స్వధర్మనిరతులైనవిప్రులు సదా నారాయణపరాయణులై జీవింతురు. శైవులు, శాక్తేయులు, శివారాధనసంలగ్నులై యుందురు. పూజావివర్జితులై యుండువారే దైత్యులు, ముముక్షువులై హరిదాస్యసౌభాగ్యము నాకాంక్షించువిష్ణుభక్తులే బ్రాహ్మణులు. ఐశ్వర్యాదుల నాకాంక్షించువారే దానవులు. తామసయుక్తులైనవారే యసురులు. ఈప్సితమైన శ్రీకృష్ణార్చనమే (సగుణోపాసన) బ్రాహ్మణులకు స్వధర్మము. నిష్కాములైనవారికి బ్రకృతికేయతీతుడు, ప్రాకృతికనిర్గుణుడైనదైవము నారాధించుటే ధర్మము. ఇట్టి బ్రాహ్మణులు, వైష్ణవులు సర్వస్వతంత్రులు. వారు నిర్భయముగ బరమపదము చేరగలరు. అన్యదేవతోపాసకులు ప్రాకృతప్రళయమందా దేవతలను చేరగలరు.

> వర్ణానాం బ్రాహ్మణాః శ్రేష్ఠాః సాధవో వైష్ణవా యది ।
> విష్ణుమన్త్రవిహీనేభ్యో ద్విజేభ్యః స్వపచో వరః ॥ 52

సాధువులు, వైష్ణవులునైనచో బ్రాహ్మణులు సర్వవర్ణములందు శ్రేష్ఠులు కాగలరు. విష్ణుమంత్రవిహీనులైనద్విజులకంటె విష్ణుమంత్రయుక్తుడైనశునకభక్షకుడే శ్రేష్ఠుడు.

పరిపక్వులైనను, నపరిపక్వులైనను వైష్ణవులు, సాధువులునైనచో వారిని సదా విష్ణుచక్రమైనసుదర్శనము రక్షించును. శుష్కతృణములు సదా యగ్నిలో భస్మమగు నట్లే వైష్ణవులపాపములు శ్రీకృష్ణభక్తియనెడుహుతాశనుని (అగ్ని) వాతబడి భస్మములు కాగలవు. గురుముఖము నుండి విష్ణుమంత్ర మేవైష్ణవునికర్ణములో ప్రవేశించునో యావైష్ణవుడే మహాపవిత్రుడని మనీషులు ప్రవచించిరి. అట్టివైష్ణవుడు తనపితృవంశములో వందలతరములవారిని, మాతామహులవంశములో వందలతరములవారిని, సహోదరులను, దల్లిని నుద్ధరింపగలడు. శ్రీకృష్ణమంత్రగ్రహణమాత్రముననే నరుడు జీవన్ముక్తుడు కాగలడు. గరుడుని గాంచి సర్పములు పాఱిపోవునట్లు శ్రీకృష్ణమంత్రయుక్తుని గాంచి పాపములు పాఱిపోగలవు. వైష్ణవులను గాంచిన యముడైనను భయమునొందగలడు. కృష్ణమంత్రోపాసకుల స్పర్శ

మాత్రముననే గంగాదిమహాతీర్థములు పవిత్రములు కాగలవు. పాపులు తమ పాపములను దమస్పర్శద్వారమున తీర్థముల కొసంగెదరు. తీర్థములకు సంక్ర మించినయాపాపములన్నియు వైష్ణవులస్పర్శమాత్రమున నశింపగలవు. కృష్ణ మంత్రోపాసకులపాదపద్మములరజస్స్పర్శముచే ఘాతకులు పాపవిముక్తులు కాగలరు, వసుంధర పునీత కాగలదు. వైష్ణవులస్పర్శమాత్రముననే వాయువు, అగ్ని, సూర్యుడు మొదలుగాగలసర్వులు పవిత్రులు కాగలరు. నేను (శివుడు) బ్రహ్మ, యాదిశేషుడు, కర్మములకు సాక్షియైన ధర్మము మొదలుగాగల మేమందఱము సదా వైష్ణవుల సమాగమమునే వాంఛించెదము. సర్వులకు తమతమకర్మానురూపముగనే ఫలములు ప్రాప్తించును.

కుళ్ళినబీజములో నంకుర ముద్భవింపనట్లు వైష్ణవులకు గర్మాను రూపముగ గర్మఫలములు సంప్రాప్తింపవు. ఆవైష్ణవుల పూర్వకర్మమంతయు భక్తవత్సలుడు హరింపజేయును. ఆకృపానిధి వారికి దనపదమున గృపతో బ్రసాదించును. తేజస్వులందు శ్రేష్ఠుడు,వైష్ణవులం దగ్రగణుడు భృగునందనుడు నైనశుక్రాచార్యుని దుర్బలుడు, భీతుడు నైనచంద్రుడు శరణువేడెను. అత్యంత బలిష్ఠమైనసుదర్శన చక్రముకూడ శుక్రాచార్యుని జయించుటలో సమర్థము కాదు. అయినను మంత్రోపాయముచే జంద్రునినుండి తారను రక్షించి నీకప్ప గించెదను. బృహస్పతీ! సత్యుడు, పరబ్రహ్మము, పరమాత్మ, సర్వేశ్వరేశ్వరు డైనశ్రీకృష్ణుని భజింపుము. ఆయన నీయెడల బ్రసన్నుడైన నీభార్య నీకు సులభముగ లభింపగలదు. సోదరా! కల్పవృక్షసదృశము, పరమోత్కృష్టము, కోటిజన్మపాపవినాశకము, సర్వమంగళకారణమైనశ్రీకృష్ణమహామంత్రము నుపదేశించెద నవధరింపుము. బ్రహ్మ మొదలు కీటకము లేక తృణపర్యంత మన్నియు జలబిందువువలె నశ్వరములు కావున బరమాత్ముడు నీశ్వరుడు నగు గోవిందుని శరణము నొందుము. గురుదేవునిముఖారవిందమునుండి శ్రీకృష్ణ మహామంత్రమును శ్రవణమొనరింపనంతవఱకే మానవున కీభవమునందు గోరికగాని, భోగేచ్ఛగాని, స్త్రీసుఖేచ్ఛగాని కలుగగలవు. దుర్లభమైన శ్రీహరిమంత్రమును బొందగనే మానవు డాశారహితుడు కాగలడు. వైష్ణవు లింద్రత్వమునైన, నమరత్వమునైన వాంఛింపరు. హరిదాస్యభక్తిదక్క మోక్షమునైనను వారాకాంక్షింపరు. భక్తిని నశింపజేయుమోక్షమును వారు వాంఛింపరు. జ్ఞానమునైనను, మృత్యుంజయత్వమునైనను, సర్వసిద్ధులనైనను,

వాక్సిద్ధినైనను, దాతృత్వమునైనను భక్తు లాకాంక్షింపరు. భక్తిని విడనాడి యెవరువిషయములను వాంఛించెదరో, వారమృతమును వీడి విషమును స్వీకరించువారై విష్ణుమాయచే వంచితులు కాగలరు. నేను (శివుడు), బ్రహ్మ, ధర్మము, అనంతుడు, కశ్యపుడు, కపిలుడు, కుమారుడు, నరనారాయణఋషులు, స్వాయంభవమనువు, ప్రహ్లాదుడు, పరాశరుడు, భృగువు, శుక్రాచార్యుడు, దూర్వాసుడు, వశిష్ఠుడు, క్రతువు, ఆంగీరసుడు, బలిచక్రవర్తి, వాలఖిల్యాదులు, వరుణుడు, అగ్ని, వాయువు, సూర్యుడు, గరుత్మంతుడు, దక్షుడు, పరమ భక్తులలో శ్రేష్ఠులు.

ఇట్లు పల్కి శంకరుడు బృహస్పతికి గల్పతరుసదృశ మైనశ్రీకృష్ణ మహామంత్రము నుపదేశించెను. 'శ్రీం హ్రీం క్లీం కృష్ణాయ నమః'. ఈ మంత్రము నుపదేశించి హరుడు గురునకు బూజావిధానమును, స్తోత్రమును, గవచమును, బురశ్చరణవిధానమును, ధ్యానమును, శుద్ధమందాకినీ తటముపై బ్రసాదించెను. జగద్గురు డైనశంకరునిదివ్యముఖారవిందమునుండి శ్రీకృష్ణ మహామంత్రశ్రవణ మొనరింపగనే బృహస్పతి భవమునందు దృష్ణ నశించిన వాడై యిట్లుపల్కెను. "జగన్నాథా! నాకు శ్రీహరితప మొనరించుట కనుజ్ఞ నిమ్ము, తార నచటనే యుండనిమ్ము. తారవలన నా కేమి ప్రయోజనము? ఈశ్వరా! సర్వపదములు నశ్వరములని, విషతుల్యములని గ్రహింపగల్గితిని. సత్యము, నిత్యము, నిర్గుణ మైనశ్రీకృష్ణపరమాత్మయే శరణముగాన నేనాయన నాశ్రయించెదను. బృహస్పతి పల్కినవచనముల నాలకించి మరల మహాదేవు డిట్లు తనప్రవచనమును గొనసాగించెను.

మహాదేవుడు పలికెను:

మునీశ్వరా! పరగ్రస్త యైనస్త్రీని త్యజించి తపమున కేగుట ప్రశంసనీయము కాదు. అత్యంత గౌరవసంపన్ను లైనవారికి దుశ్చర్య మరణముకంటె నధికవ్యసనకరమనిరి. మహాభాగా! శీఘ్రమే నర్మదాతటమునకు జనుము. బ్రహ్మాదిదేవతలు నిరీక్షించు ఆప్రదేశమునకు నేను శీఘ్రమే రాగలను.

శివునివచనముల నాలకించి బృహస్పతి నర్మదానదీతటమునకు బయలుదేరెను. అచట సమావిష్టులైన దేవతలను, బృహస్పతిని, బ్రహ్మశివాదుల నుద్దేశించి విష్ణుమూర్తి యిట్లుపాయ ముపదేశించెను.

విష్ణువు పలికెను:

దేవతలారా! యుద్ధమువలన నిస్సంశయముగ విషమపరిస్థితులు సంభవించును. నాయాశీర్వాదబలముచే సురగురువు నిశ్చయముగ దారను మరల బొందగలడు. దేవతలు శుక్రాచార్యుని స్తుతించిన నాయన ప్రసన్నుడు కాగలడు. కృష్ణచక్రముచే రక్షింపబడుచున్న శుక్రాచార్యుని దేవతలు జయింపలేరు. మీరందఱు శుక్రాశ్రమమును జేరి శుక్రాచార్యుని బ్రసన్ను నొనరించుకొనుడు.

రిపు ర్బలిష్ఠః స్తోత్రేణ వశీభూత ఇతి శ్రుతిః ॥ 97

బలవంతు డైనశత్రువు స్తోత్రముద్వారా వశీభూతుడుకాగలడని శ్రుతులు ప్రవచించినవి.

ఇట్లు పల్కి బ్రహ్మాది దేవతలచే బూజల నొంది విష్ణుమూర్తి యంతర్ధానమయ్యెను. చింతాక్రాంతులై విషణ్ణమానసులై యున్న దేవతలను శ్వేతద్వీపమునకు పోవలసినదిగా నాజ్ఞాపించి బ్రహ్మదేవుడు వారితో నిట్లు పల్కెను. "నేను, శంకరుడు, ధర్మము, విష్ణువు, సర్వసాక్షులము. మాకు దేవతలందు, దైత్యులందు సరిసమాన మైనప్రేమ కలదు. దైత్యులకాచార్యు డైనశుక్రాచార్యుని జంద్రుడు శరణువేడెను. దితినందనునిచే బూజ లొందుశుక్రాచార్యుడు దేవతలచే నజేయుడు. తారకొఱకు నేనే స్వయముగ శుక్రాచార్యుని భవనమునకు బ్రస్థానమొనరించెదను. విష్ణుమూర్తియాదేశానుసారముగ మీరు సముద్రతీరము జేరుడు". ఇట్లు పల్కి జగద్విధాత శుక్రాచార్యుని సన్నిధికి బయలుదేరగా దేవతలు, విప్రులు సముద్రతటము జేరిరి.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
ప్రకృతిఖండములోని నారదనారాయణ
సంవాదమున శివబృహస్పతుల
సంవాద మనుఅఱువదియవ
అధ్యాయము
సంపూర్ణము.

# అఱువదియొకటవ అధ్యాయము

## బృహస్పతికి తార మరల లభించుట; బుధుడు జన్మించుట.

నారదుడు పలికెను:

దేవా! బ్రహ్మకు, నసురులకు జరిగినసంవాదము నాకర్ణింపవలెనని నే నత్యంతకుతూహలముతో నున్నాను.

శ్రీ నారాయణఋషి పలికెను:

బ్రహ్మదేవుడు శుక్రాచార్యుని నిలయమును జేరెను. బ్రహ్మదేవుని గాంచగనే శ్రీకృష్ణసంకీర్తన మొనరించుచున్న శుక్రాచార్యుడు రత్నసింహాసనముపైనుండి లేచి నమస్కరించి పూజించి యనేకవిధముల స్తుతించి కృతాంజలియై భయముతో నిలువబడెను. శుక్రాచార్యునిస్తోత్రమునకు సంతుష్టుడై బ్రహ్మదేవుడు సకలదానవులయు మహర్షిగణములయు నమోవాకములను స్వీకరించి రత్నసింహాసనము నలంకరించెను. అశ్రుపూర్ణనయనుడై పులకితాంగుడై యత్యంతవినయముతో ప్రణామము లర్పించుచు శుక్రాచార్యుడు బ్రహ్మదేవునితో నిట్లు పల్కెను. "భగవంతుడు స్వయంవిధాత యైనబ్రహ్మదేవుని సాక్షాత్తుగ నాగృహములో దర్శింపగల్గితిని. నేడు నాజన్మము సఫలమైనది, నాజీవనము సుజీవన మయ్యెను. బ్రహ్మపుత్రులైన సనకసనందనాదులును నేడు బ్రహ్మతో నేతెంచి నాకు దర్శనమొసంగుటనాభాగ్యము. పరమాత్ముడు పరాత్పరుడు నైననాదైవము శ్రీకృష్ణుడే ప్రసన్నుడైనటుల నేను భావించుచున్నాను. నేను శిశుతుల్యుడను, నన్ను గృతార్థునొనరించుటకే యరుదెంచిన మీకు సుస్వాగతము. స్వాత్మారాములైన మిమ్ము గుశలురా యని ప్రశ్నించుట యనుచితము. నన్ను బవిత్రు నొనరించుటకే మహర్షిగణసహితముగ విచ్చేసి, దమరు నాగృహమును పావనమొనరించినారు. దేవా! నేను దమకు జేయగలకార్యమేదైన నున్నచో నన్ను శాసింపుడు". శుక్రాచార్యునివచనముల నాలకించి ప్రసన్నుడై బ్రహ్మదేవు డిట్లుపల్కెను.

బ్రహ్మ పలికెను :

నాపౌత్రుడవైననిన్ను గాంచుటకే చిరకాలము నుండి విచ్ఛేద మనుభవించి యుద్విగ్నుడనైన నేనరుదెంచితిని.

విచ్ఛేదః పుత్రపౌత్రాణాం మరణా దతిరిచ్యతే ॥ 22

పుత్రపౌత్రులవియోగము మరణముకంటె నధికదుఃఖప్రదము.

మునిశ్రేష్ఠా ! నీకు కుశలమా ! నీపుత్రులకు కుశలమా ! నీస్త్రీలకు కుశలమా ! నీకభీప్సిత మైనశ్రీకృష్ణార్చనము దినదినము నపరిచ్ఛిన్నముగ సాగుచుండెనా ? నీస్వధర్మము, తపము బాగుగ గొనసాగుచున్నవా ? నీగురుసేవ నిత్య మవిచ్ఛిన్నముగ జరుగుచుండెనా ? గురుపూజనము సర్వమంగళములకు ముఖ్యకారణము, పుణ్యాహర్ష ప్రదము, శుభము, పాపాదిరోగశోకఘ్నము. అభీష్టదైవము సంతుష్టుడైన, నాచార్యుడు సంతుష్టుడైన, సర్వదేవతలు సంతుష్టు లయ్యెదరు. గురువు, విప్రులు, సురలు, నేపాపాత్ముని గోపింతురో వానికి కుశలము లేదు. వాని కడుగడుగున విఘ్నములు సంభవించును. కుమారా ! నీయారాధనకు సర్వాంతరాత్మ, నిర్గుణుడు, ప్రకృతికే యతీతుడు భగవంతుడు నైనశ్రీకృష్ణుడు సంతుష్టుడైనాడు. కావున విధాత నైననేను సంతృప్తి నొందితిని. నేను సంతుష్టి నొందగనే శ్రీహరి సంతుష్టుడైనాడు. శ్రీహరి ప్రసన్నుడు కాగనే సకలదేవతలు ప్రసన్నులైరి. కుమారా ! నే నరుదెంచిన విషయమును వివరించెద నాలకింపుము. శంకరుని గురుతనయు డైనబృహస్పతియొక్క భార్య తార నపహరించి నిశానాథుడు నీకు శరణాగతు డైనాడు. కుమారా ! శంకరుడు, ధర్మము, సూర్యుడు, అనంతుడు, ఆదిత్యులు, వసువులు, రుద్రులు, దిక్పాలకులు, దిగీశ్వరులు, మూడుకోట్ల దేవతలు యుద్ధసన్నద్ధులై యేతెంచిరి. వీరేగాక నాగులు, కిన్నరులు, కింపురుషులు, యక్షులు, రాక్షసులు, గుహ్యకులు, భూతప్రేతపిశాచకూష్మాండ బ్రహ్మరాక్షసాదులు, కిరాతులు, గంధర్వులు తారకొఱకై యుద్ధమొనరించుటకు సన్నద్ధులైయున్నారు. కుమారా ! యుద్ధ మెందులకు? తార నర్పింపుము కాముకు డైనచంద్రుని పరిత్యజింపుము.

శుక్రాచార్యుడు పలికెను :

రణదుర్మదాంధులై యుద్ధమునకు సంసిద్ధులై యేతెంచినసకలదేవతలతో

నేను యుద్ధమొనరింపగలను. కాని సర్వులకు పరమగురు డైనశివునిదక్క నన్యు లతో యుద్ధమొనరింపగలను.

దైత్యులు పల్కిరి:

ఉభయపక్షములవారికి శంకరుడు సర్వదా వంద్యుడు, ధర్మము సాక్షి, నీవు పితామహుడవు. మీరుదక్క నన్యులను మేము తృణప్రాయముగ భావించెదము. దేవతలు యుద్ధమునకు వచ్చినచో రానిండు, ప్రభూ! ఆగ్నేయాస్త్రమును ప్రయోగించి వారిని జయింపగలము.

బ్రహ్మ పలికెను:

దైత్యులారా! విశ్వసంహర్త, బలవంతులందు శ్రేష్ఠుడు నైన కాలాగ్నిరుద్రునితో నెవరు యుద్ధమొనరింపగలరు? మహాభయంకరస్వరూపిణి జగన్మాతయగు భద్రకాళితో నెవరు యుద్ధమొనరింపగలరు? శంకరకింకరు లైన భైరవుతో, నందీశ్వరునితో నెవరు యుద్ధమొనరింపగలరు? వీరభద్రునితో నెవరు యుద్ధమొనరింపగలరు? సహస్రఫణాసమన్వితు డైనయాదిశేషునితో నెవరు యుద్ధమొనరింపగలరు? పాశుపతధారి యైనకాలాగ్నిరుద్రుని మార్కొనుట యసాధ్యము. మధుకైటభులను హిరణ్యాక్షహిరణ్యకశిపులను సంహరించిన విష్ణుమూర్తియే స్వయముగసంగ్రామమునకై శ్వేతద్వీపమునుండి యేతెంచెను. ఇట్లు పల్కిజగద్విధాత మౌనమువహింపగా దైత్యనందనుడు దానవేశ్వరు డైనప్రహ్లాదుడు పరిహాసించుచు బ్రహ్మదేవునితో నిట్లు పల్కెను.

ప్రహ్లాదుడు పలికెను:

సర్వపూజ్యా! జగద్విధాతా! నీకు నమస్కారము. సర్వులందు బ్రాక్తనేశ్వరుడ వైననీసమక్షములో నే నేమి పలుకగలను? హిరణ్యాక్ష హిరణ్యకశిపులను సంహరించెనని, మధుకైటభులను వధించెనని నీవు ప్రసంసించినయావిష్ణుమూర్తి పరిపూర్ణతము డైనశ్రీకృష్ణపరమాత్మకు కేవలము కళాస్వరూపుడేగదా. సర్వాంతరాత్మకునిసుదర్శన మనెడిచక్రము మమ్ములను, మాలోకములనుసదారక్షించును. ఆసుదర్శనముకంటె శివుడుగాని, పాశుపతముగాని, భద్రకాళిగాని, యనంతుడుగాని, రుద్రాకులుగాని, దేవతలుగాని బలవంతులు కారు. సర్వాధారుడు, స్థూలములన్నిటికంటె స్థూల

తముఁడు, సర్వములకు విభుడు, తనరోమకూపములందు నిఖిలవిశ్వములు యావర్తమానములై యున్న మహావిరాట్పురుషుడు శ్రీకృష్ణభగవానునకు షోడశాంశమాత్రమే. అనంతుడుగాని, భద్రకాళిగాని, బృహస్పతిగాని, యామహావిరాట్పురుషునికంటె స్థూలతములా ? దేవత లందఱు వచ్చిన రానీ, యుద్ధమొనరించిన నొనరింపనీ, నాకు శంకరుడన్న భయము లేదు, పాశుపతమన్న భయము లేదు, శివస్వరూపుడవు భగవంతుడ వైనశివా ! నీకు నమస్కారము. అనంతునకు నమస్కారము, సాధువులకు నమస్కారము, వైష్ణవులకు నమస్కారము; ప్రజాపతీ! శ్రీకృష్ణునిప్రసాదమువలన నేను నిర్భయుడనై, నిరామయుడనై విరాజిల్లగల్గుచున్నాను. నాకు స్వాత్మబల మేదియును లేదు. అంతయు జగత్ప్రభు నైనశ్రీకృష్ణపరమాత్మ ప్రసాదించినబలమే. బ్రహ్మదేవా ! నాతండ్రి హిరణ్యకశిపుడు విష్ణునింద యొనరించిన పాపము వలన మరణించెను, నిర్బంధితుడై శంఖచూడుడు మరణించెను, దర్పమువలన మధుకైటభులు మరణించిరి. త్రిపురాసురు లాదిగాగలరాక్షసు లందఱు నాకింకరసములు, వారలను వీరులుగ లెక్కింపబోము. నారదా ! ఇట్లు పల్కి మౌనము వహించిన ప్రహ్లాదునితో బ్రహ్మదేవు డిట్లు పల్కెను.

బ్రహ్మ పలికెను :

దేవతలకు దానవులకు యుద్ధము వినాశకారణము. వత్సా ! మంచినడవడి సర్వమంగళకారణము. బ్రహ్మదేవుడనైననేనే నిన్నర్థించుచున్నాను, తారను నాకు భిక్షగా నొసంగుము. రాజా ! భిక్షుకుడు విముఖుడైన గృహస్థుసర్వపాప భాజనుడు కాగలడు.

సనత్కుమారుడు పలికెను :

రాజేంద్రా ! సురదైత్యులందు నీవు సింహాసముడవు. స్వకీర్తిని రక్షించుకొనుము. జగద్విధాతయే నీయెదుట భిక్షుకుడైనాడు. నీకీర్తి నేమని ప్రవచింపగలను ?

సనాతనుడు పలికెను :

సురేంద్రులైనను, బ్రహ్మశివాదులైనను నిన్ను జయింపలేరు. వైష్ణవుడవు, పుణ్యవంతుడవు, పరిశుద్ధుడ వైననీవు శ్రీకృష్ణచక్రముచే సదా రక్షింపబడుచున్నావు.

సనందనుడు పలికెను :

ప్రకృతికే యతీతుడు, సర్వాత్ముడైన శ్రీకృష్ణుడే నీయిష్టదైవమై యుండగా, వైష్ణవశ్రేష్ఠుడైన శుక్రుడే యాచార్యుడై యుండగా మహాబల సంపన్నుడవైన నిన్నెవరు జయింపగలరు !

సనకుడు పలికెను :

పుణ్యాత్ముడెంతటివారివలననైనను జయింపబడడు, పాపి స్వపాతకము వలననే జయింపబడగలడు. పాషండవాయువులకు బుణ్యదీప మారిపోదు.

ఋషులు పలికిరి :

మహాభాగా ! బృహస్పతికి ప్రాణాధికురాలైనతార నర్పింపుము. చంద్రుని బరిత్యజించి సుచిరమైనస్వకీర్తిని రక్షించుకొనుము. మేము నిన్ను మరల, మరల ప్రార్థించుచున్నాము.

ప్రహ్లాదుడు పలికెను :

నాయీశ్వరుడైనగురుదేవులు విరాజమానులై యుండగనే నెంతటి వాడను. మీరు మాగురుదేవులనే యర్థింపుడు. యోగ్యులైనశిష్యులయాధి పత్యములో, సాధువులయాధిపత్యములో గురువే యీశ్వరుడు. మునీశ్వరుడైననాగురుదేవునకే నాసర్వస్వము నర్పించితిమి. మే మందఱ మాయన భృత్యులము, ఆయనచే పోషింప బడెడివారము, గురుదేవునకు బరిచారకులము. శిష్యులమైనమేము కేవలము గురుదేవునియాజ్ఞాపరిపాలకులమే.

శ్రీ నారాయణ ఋషి పలికెను :

ప్రహ్లాదునివచనముల నాలకించి సకలదేవతలు శుక్రాచార్యుని ప్రార్థించిరి. మునీశ్వరా ! శుక్రాచార్యుడు సతి యగుతారను, మలినుడైన చంద్రుని బ్రహ్మదేవున కర్పించి నమస్కరించెను. ప్రహ్లాదు డత్యంతభక్తి సమన్వితుడై విధాతపాదములకు స్వగణములతో నమస్కరించెను. సకల మహర్షులు బ్రహ్మదేవునకు నమస్కరించి తమతమధామములకు జనిరి. లజ్జతో, సత్రమక్త్రయై, గర్భమును ధరించి దుఃఖించుచు దనపాదముల నాశ్రయించిన తారనుగాంచి బ్రహ్మయిట్లుపలికెను. "తారా ! భయమును వీడుము.

నావలన నీ కేభయము లేదు. నావరమువలన నీవు సౌభాగ్యయుతవై నీభర్తను జేరగలవు.

దుర్బలా బలినా గ్రస్తా నిష్కామా న చ్యుతా భవేత్ ।
ప్రాయశ్చిత్తేన శుద్ధా సా న స్త్రీ జారేణ దుష్యతి ॥ 81

నిష్కాముకురాలు, దుర్బలురాలైనస్త్రీ బలవంతునిచే బలాత్కరింప బడినను బతనముచెందదు, ప్రాయశ్చిత్తముతో శుద్ధురాలైయాస్త్రీ జార దోషముచే దూషింపబడదు.

స్వసుఖముకొఱకై కాముకురాలై కామముతో జారత్వము నాచరించిన స్త్రీ స్వామిచే పరిత్యజింపబడి యెట్టిప్రాయశ్చిత్తముతోనైనను శుద్ధురాలు కాదు. అట్టిపాపిని సూర్యచంద్రు లుండుపర్యంతము కుంభీపాకనరక మనుభవింప గలదు. పూర్వమున జరిగిన దేదో జరిగినది. కుమారీ! లజ్జను వీడి గురుని (బృహస్పతి) గృహమును జేరుము. శుభా! నీ కీగర్భ మెవరివలన సంప్రాపించెను?" బ్రహ్మదేవునివచనముల నాలకించి "తండ్రీ! నాస్వకర్మము వలన జంద్రునిద్వారమున నా కీగర్భము సంప్రాప్తించినది. ప్రజాపతీ! దయాహీనుడు, దుర్మతి యైనచంద్రుడు దుర్బలురాల నైననన్ను జెఱపట్టెను. ఇందులకు సర్వభూతములు సాక్షులే." యని తారపల్కె సువర్ణప్రభాసదృశుడు, నత్యంత సుందరుడు, బ్రహ్మతేజముతో బ్రకాశించు కుమారుని బ్రసవించెను. బ్రహ్మదేవునిమెదుట లజాయుక్తుడై చేసిన దుష్కార్యమునకు బశ్చాత్తప్తుడై తలను వంచుకొని నమస్కరించుచున్న చంద్రుడు విధాతృనాజానుసారముగ నాతనయుని జేకొని స్వస్థానమునకు మరలిపోయెను. బ్రహ్మదేవుడు సాధ్వి యగుతారను బృహస్పతి కప్పగించి దేవతల కభయ మొసంగెను. శివాదులు సకలదేవతల నాశీర్వదించి తమతమ ధామములు కరిగిరి. భావానురక్త యైనవనితను (తారను) మరల బొంది బృహస్పతి సంతుష్టమానసుడై దేవతలతో గూడి స్వగృహము జేరెను. తారకాగర్భసంభవు డైనకుమారుడే బుధుడు, బుధుడు మహాతేజస్వి, మహాబల సంపన్నుడు, బుధుడు నందనవనములో చిత్ర యనుసుందరాంగిని గాంచి ప్రేమించెను. ఆచిత్ర కుబేరుని రేతస్సుచే ఘృతాచి యనునప్సరసకు గొమార్తెగా జనించెను. బుధు డానిర్జన వనములో యౌవనసంపన్నురాలు, కమలలోచన, షోడశవర్షీయ యగుసుందరకన్యను గాంచి ప్రేమించి గాంధర్వ

విధిని వివాహమాడెను. బుధునివలన జిత్రకు చైత్రు డనుమహాబలపరాక్రమ సంపన్ను డైనపుత్రు డుదయించి సప్తద్వీపవతి యగుపృథ్వికి శాసకుడై మహా బలవంతుడై ధర్మముగ రాజ్యపాలన మొనరించెను. ఆమండలేశ్వరు డైన చైత్రు డసంఖ్యాకదానములను, నిత్యము నొసంగుచు మహాకీర్తిసంపన్ను డయ్యెను. ఆచైత్రుని కుమారుడే రాజవర్యు డధిరథుడు; అధిరథునికుమారుడే బృహచ్ఛ్రవు డైన (విశాలకర్ణములు కల్గిన) సురథచక్రవర్తి. ఆసురథుడు మేధ స్సనుమునిసత్తముని ప్రార్థించి మహాజ్ఞానమును బొంది పుణ్యక్షేత్ర మైనభారతవర్షములో విష్ణుమాయను భజించెను. శరత్కాలములో నదీతట ముపై మహామాయ నారాధించి సురథప్రభు వామెయనుగ్రహముచే సక లైశ్వర్యసంపన్ను డయ్యెను.

వైశ్యేన సార్ధం స మహాన్ జ్ఞానినాం మునిసత్తమ ।
రాజా కలిఙ్గదేశస్య విరాధశ్చ విశాం వరః ॥

తస్య పుత్రో మహాయోగీ ద్రుమిణో జ్ఞానినాం వరః ।
ద్రుమిణో వైష్ణవః ప్రాజ్ఞః పుష్కరే దుష్కరం తపః ॥

కృత్వా సమాధిం సంప్రాప జ్ఞానినాం వైష్ణవాగ్రణీః ।
పుత్రైర్దారైర్నిరస్తశ్చ ధనలోభాద్దురాత్మభిః ॥

స చ కోటిసువర్ణం చ నిత్యం దత్త్వా జలం పపౌ ।
ముక్తిం సంప్రాప సంసేవ్య విష్ణుమాయాం సనాతనీమ్॥ 104 - 107

మునిసత్తమా! చక్రవర్తిసురథుడు మహాజ్ఞానసంపన్ను డైనవైశ్యునితో కలిసి తపమాచరించెను. వైశ్యశ్రేష్ఠు డైనవిరధుడు కళింగదేశమునకు రాజు. విరధునికుమారుడే జ్ఞానులందు శ్రేష్ఠుడు మహాయోగి యైనద్రుమిణుడు. ఆవైష్ణవోత్తము డైనద్రుమిణుడు పుష్కరతీర్థములో దుష్కరతప మాచరించెను. ఆతపఃఫలముచే జ్ఞానులందు వైష్ణవాగ్రణి యైనసమాధి యను కుమారుని పొందెను. ఈసమాధి వైశ్యశ్రేష్ఠుడు నిత్యము కోటిసువర్ణములను దానము మొనరింపనిదే జలములనైనను త్రాగడు. ఆయన యొనరించెడిదానము లకు గినుకవహించి ధనలోభులై యాయనభార్యాపుత్రులు సమాధిని గృహము నుండి వెడలగొట్టిరి. సమాధివైశ్యశ్రేష్ఠుడు సనాతన యగువిష్ణుమాయను

సేవించిముక్తిపొందెను. సురథుడు విష్ణుమాయానుగ్రహమువలన నిష్కంటక రాజ్యమును మనుత్వమును బొందెను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి
ప్రకృతి ఖండములోని నారద నారాయణ
సంవాదమున గురువునకు దార లభించుట,
బుధుడు జన్మించుటయను
అఱువదియొకటవ అధ్యాయము
సంపూర్ణము.

## అఱువదిరెండవ అధ్యాయము

### సురథుడనురాజు, సమాధి యనువైశ్యశ్రేష్ఠుడు తమతమ యభీష్టసిద్ధికొఱకై మేధోమహర్షి నాశ్రయించుట.

నారదుడు పలికెను :

దేవా ! ఆమునిసత్తమునిముఖారవిందమునుండి సురథుడు సమాధి వైశ్యుడు మహాజ్ఞానమును శ్రవణమొనరించిన ప్రసంగమును వర్ణింపుడు. మేధోమహర్షి యుపదేశమువలన సమాధివైశ్యుడెట్లు ముక్తిపొందెనో వివరింప వలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీ నారాయణ ఋషి పలికెను :

ధ్రువచక్రవర్తిపౌత్రుడు, నుత్కళునిపుత్రుడు మహాబలసంపన్నుడునైననంది స్వాయంభువమనువంశములో జన్మించిన జితేంద్రియుడైనరాజు. ఆనరేశ్వరుడు నూఱక్షౌహిణులసేనను దోడ్కొని సురథుడనురాజురాజ్యమును ముట్టడించెను. నారదా ! ఇరుపక్షములవారు ఒకసంవత్సరపర్యంతము నిరంతరఘోరయుద్ధము

జరిపిరి. చివరకు జిరంజీవి యైనవైష్ణవనరేశ్వరుడునంది సురథుని యుద్ధములో నిర్జించి రాజ్యమునుండి బహిష్కృతు నొనరించెను. భయభీతు డైనసురథుడు డర్ధరాత్రి ఘోటకము (గుఱ్ఱము) నధిరోహించి వనములజేరెను. ఆఘోర వనములో భద్రానదీతటముపై సురథుడు ఒకవైశ్యశ్రేష్ఠుని గలసికొనెను. మునీశ్వరా ! వారిద్వరు పరస్పరము స్నేహితులై తమతరణోపాయముకొఱకు మేధోమహర్షియాశ్రమమునకు జనిరి. భారతవర్షములో బుణ్యక్షేత్ర మైన పుష్కరతీర్థమునకు సురథుడు వైశ్యశ్రేష్ఠసహితముగ జని మహాతేజస్వి యైన మేధోమహర్షిని దర్శించెను. ఆసమయమున నామహర్షి తనశిష్యులకు పరమ దుర్లభ మైనబ్రహ్మతత్త్వోపదేశ మొనరించుచుండెను. రాజు, వైశ్యుడు శిరములను వంచి మునిశ్రేష్ఠునకు బ్రణామము లర్పించిరి. మహర్షి యాయిద్వర నతిథులనాదరించి వారికి శుభాశీర్వాదముల నొసంగెను. కుశలప్రశ్నానంతరము సురథుడు తమపరిచయముల నిట్లు మహర్షికి నివేదింప నారంభించెను.

సు ర థు డు ప లి కె ను :

బ్రహ్మర్షీ! చైత్రవంశములో జన్మించిననన్ను సురథు డందురు. మహా బలసంపన్ను డైననందిరాజు నాపై విజయము నొంది నన్ను రాజ్యభ్రష్టు నొనరించెను. గురుదేవా! నేనిపు డేయుపాయ మొనరింపవలెను? నే నెట్లుమరల నారాజ్యమును బొందగలను ? తమరే నాకు పరిష్కారమార్గము నుపదేశింప వలసినదిగ బ్రార్థించుచున్నాను. మహాభాగా మునీశ్వరా ! నేను మీశరణము నాశ్రయించినభక్తు డనుగావున నన్ను రక్షింపుము. బ్రాహ్మణోత్తమా ! సమాధి నామధేయు డైనయీవైశ్యశ్రేష్ఠుడు గొప్పధర్మాత్ముడు; కాని దైవ వశమున నీతనిస్త్రీపుత్రాదులు ధనలోభమునకు వశులై యీయనను గృహము నుండి బహిష్కరించిరి. ఇతనియపరాధ మేమనగా దారపుత్రాదులు బంధువులు నిరోధించుచున్నను సరకుగొనక ప్రతిదిన మసంఖ్యాకధనరత్నములను బ్రాహ్మణు లకు, యాచకులకు దాన మొనరించుటయే. అందులకు వారు కినుకవహించి యీవైశ్యశ్రేష్ఠుని గృహమునుండి బహిష్కృతు నొనరించిరి. కొలదికాలము పిదప వారు తమతప్పిదమును గ్రహించి పశ్చాత్తప్తహృదయులై సమాధి కొఱ కన్వేషించి యీయనను మరల గృహమునకు రావలసినదిగ ననేకవిధ ముల నర్థించిరి. కాని పవిత్రుడై, జ్ఞానియై, విరక్తుడైన ఈతడు వారిప్రార్థనలను మన్నింపక వనముల కరిగెను. అపు డితనిపుత్రులుకూడ పితృశోకముతో

సంతృప్తులై సకలకర్మలనుండి విరక్తులై తమసమస్తసంపదలను దానమొనరించి తండ్రి ననుసరించుచు వనముల కరిగిరి.

సుదుర్లభం హరే ర్దాస్యం వైశ్య స్యాస్య చ వాంఛితమ్ ।
కథం ప్రాప్నోతి నిష్కామ స్త న్మే వ్యాఖ్యాతు మర్హసి॥ 17

పరమదుర్లభ మగుశ్రీహరి దాస్యసౌభాగ్యము నొందవలెనని యీవైశ్య శ్రేష్ఠునిమనోరథము. ఈనిష్కామవైశ్యకులతిలకునకాయభీష్టమెట్లుసిద్ధింపగలదు? ఆయుపాయమును దమరు విపులముగ గృపతో వర్ణింప బ్రార్థించుచున్నాను.

శ్రీ మే ధో మ హ ర్షి ప లి కె ను :

కరోతి మాయయా చ్ఛన్నం విష్ణుమాయా దురత్యయా ।
నిర్గుణస్య చ కృష్ణస్య త్రిగుణా విశ్వ మాజ్ఞయా ॥
కృపాం కరోతి యేషాం సా ధర్మిణాం చ కృపామయీ ।
తేభ్యో దదాతి కృపయా కృష్ణభక్తిం సుదుర్లభమ్ ॥ 18, 19

రాజా ! నిర్గుణుడైనశ్రీకృష్ణపరమాత్ముని యాజ్ఞానుసారము దుర్లంఘ్యత్రిగుణమయి యగువిష్ణుమాయ విశ్వములనెల్ల తనమాయతో నాచ్ఛన్నమొనరించుచున్నది. ఆకృపామయి యగు దేవి యేధర్మాత్ము లగు పురుషులపై బ్రసన్నురా లగునో, వారలకు బరమదుర్లభ మైనశ్రీకృష్ణభక్తిని బ్రసాదించును. (అనగా విశ్వములందు గలమాయా మోహితులైన దేహధారులకు విష్ణుమాయయే శ్రీకృష్ణభక్తిని బ్రసాదింప గలదు)

యేషాం మాయావినాం మాయా న కరోతి కృపాం నృప।
మాయయా త న్నిబధ్నాతి మోహజాలేన దుర్గతాన్ ॥
నశ్వరే నిత్య సంసారే భ్రామయే ద్బర్బరా సదా ।
కుర్వతీ నిత్యబుద్ధిం చ విహాయ పరమేశ్వరమ్ ॥
దేవ మన్యం నిషేవన్తే తన్మన్త్రం చ జపన్తి చ ।
మిథ్యా కించిన్నిమిత్తం చ కృత్వా మనసి లోభతః ॥ 20-22

నరేశ్వరా ! మాయావులైనవారిపై విష్ణుమాయ కరుణింపదు. ఆదుర్గతిగ్రస్తులైనజీవులను భగవతి మాయాద్వారమున మోహజాలమున బంధించును. విష్ణుమాయకు లోనైనయాబర్బరజీవు లీనశ్వరములు, ననిత్యములు

నగుసాంసారిక విషయములందు సదా యనురక్తులై నిత్యబుద్ధి కల్గి చరింతురు. వారు సాంసారిక మోహములకు బానిసలై పరమేశ్వరునిగూడ విస్మరింతురు. వారు భగవంతుని యుపాసనను వీడి విషయవాంఛలసిద్ధికొఱకై యన్యదేవతలను సేవించుచు వారిమంత్రములను జపించుచుందురు. లోభవశమున మనస్సులో మిథ్యానిమిత్తములకు స్థానము నొసంగి యిట్లు వారు జనన మరణచక్రమునందు బరిభ్రమించుచుందురు.

సప్తజన్మసు సంసేవ్య దేవతాశ్చ హరేః కలాః ।
తదా ప్రకృత్యాః కృపయా సేవన్తే ప్రకృతిం సదా ॥

సప్తజన్మసు సంసేవ్య విష్ణుమాయాం కృపామయీమ్ ।
శివే భక్తిం లభన్తే తే జ్ఞానానన్దే సనాతనే ॥

జ్ఞానాధిష్ఠాతృదేవం చ హరేః సంసేవ్య శంకరమ్ ।
అచిరా ద్విష్ణుభక్తిం చ ప్రాప్నువన్తి మహేశ్వరాత్ ॥

సేవన్తే సగుణం సత్త్వం విష్ణుం విషయిణం సదా
తత్త్వజ్ఞానాచ్చ పశ్యన్తి జ్ఞానం వై నిర్మలం నరాః

నిషేవ్య సగుణం విష్ణుం సాత్త్వికా వైష్ణవా నరాః
లభన్తే నిర్గుణే భక్తిం శ్రీకృష్ణే ప్రకృతేః పరే

గృహ్ణన్తి సన్త స్తద్భక్తా మన్త్రం తస్య నిరామయమ్
నిషేవ్య నిర్గుణం దేవం తే భవన్తి చ నిర్గుణాః

అసంఖ్య బ్రహ్మణాం పాతం తే చ పశ్యన్తి వైష్ణవాః
దాస్యం కుర్వన్తి సతతం గోలోకే చ నిరామయే 23-29

అన్యదేవతలుకూడ శ్రీహరికళలే యని తెలిసికొనుము, ఏడుజన్మలవఱకు వారిని సేవించి తదనంతరము దేహధారి ప్రకృతిదేవీకృపకు పాత్రుడై తదారాధనలో సదా సంలగ్నుడు కాగలడు. సప్తజన్మములవఱకు గృపామయియైనవిష్ణుమాయను సేవించి తదనంతరము వారు సనాతనుడు, జ్ఞానానంద స్వరూపుడు నైనశివునియొక్క భక్తికి పాత్రులు కాగలరు. శంకరుడు శ్రీహరి జ్ఞానమున కధిష్ఠాతృదైవము. శివుని సేవించినమానవుడు శీఘ్రమే యాయన నుండి శ్రీవిష్ణుభక్తి నొందగలడు. ఆశ్రీవిష్ణుభక్తిద్వారమున మానవుడు సత్త్వస్వరూపుడైనసగుణవిష్ణుదేవుని సేవలందు సంలగ్నుడు కాగలడు. ఆసగుణోపాసనవలనవానికి బరమనిర్మలజ్ఞానసాక్షాత్కారము లభించును. సగుణవిష్ణు

దేవు నారాధించిన సాత్త్వికవైష్ణవు లైనమానవులు ప్రకృతికతీతుడు పాకృత నిర్గుణుడు నగుశ్రీకృష్ణపరమాత్మయొక్క యనన్యభక్తిని పొందగలరు. పిదప నాసాధుపురుషులు నిరామయమైన శ్రీకృష్ణదివ్యమంత్రమును గ్రహించి యాప్రాకృతనిర్గుణదైవము నారాధించి తాము నిర్గుణులు కాగలరు. ఆవైష్ణవ పురుషులు నిరామయదివ్యగోలోకపరంధామములో దివ్యదేహధారులై విరాజిల్లుచు నిరంతరము శ్రీకృష్ణభగవానునిదాస్య (కైంకర్య) మయసేవల నొనరించుచు నగణితబ్రహ్మాదులపతనములను స్వయముగ వీక్షింపగలరు.

కృష్ణభక్తా త్కృష్ణమన్త్రం యో గృహ్ణాతి నరోత్తమః
పురుషాణాం సహస్రం చ స్వపితౄణాం సముద్ధరేత్ ॥

మాతామహానాం సహస్ర ముద్ధరే న్మాతరం తథా ।
దాసాదికం సముద్ధృత్య గోలోకం స ప్రయాతి చ ॥

భవార్ణవే మహాఘోరే కర్ణధారాస్వరూపిణీ
దీనా న్పారయతే నిత్యం కృష్ణభక్త్యైచ నౌకయా ॥

స్వకర్మబన్ధనం ఛేత్తుం వైష్ణవానాం చ వైష్ణవీ ।
తీక్ష్ణశస్త్రస్వరూపా సా కృష్ణస్య పరమాత్మనః ॥ 30-33

శ్రీకృష్ణానన్యభక్తుని ముఖారవిందమునుండి శ్రీకృష్ణమంత్రదీక్ష వహించు శ్రేష్ఠమానవులు తమ వేల తరముల పూర్వజుల నుద్ధరింపగలరు. అంతియే కాదు వారిమాతామహునివంశములోని పెక్కుతరములవారిని దల్లిని, దాసాదులనుగూడ నుద్ధరించి గోలోకగమన మొనరింపగలరు. మహాభయంకరభవసాగరములో గర్ణధారస్వరూపిణి యగుదుర్గ శ్రీకృష్ణభక్తియనెడు నౌకామూలమున నాకృష్ణభక్తుల నుద్ధరించి సంసారసాగరములను దరింపజేయగలదు. వైష్ణవులకర్మబంధనములను ఖండించుటకు శ్రీకృష్ణపరమాత్మయొక్క వైష్ణవీశక్తి యైనదుర్గ తీక్ష్ణశస్త్రరూపమును ధరించును.

వివేచికా చాऽవరణీ శక్తేః శక్తి ర్ద్విధా నృప ।।
పూర్వం దదాతి భక్తాయ చేతరాయ పరాం పర ॥

సత్యస్వరూపః శ్రీకృష్ణ స్తస్మా త్సర్వం చ నశ్వరమ్ ॥
బుద్ధిర్వివేచికేత్యేవం వైష్ణవానాం సతామపి ॥

నిత్యరూపామమేయంశ్రీరితిచాऽऽవరణీ చ ధీః।
అవైష్ణవానామసతాం కర్మభోగభుజామహో ॥ 34-36

నరేశ్వరా ! ఆశక్తిశక్తులుకూడ రెండువిధములు కలవు. ఒకటి వివేచనాశక్తి, రెండవది ఆవరణీశక్తి. భగవతిమొదటి దైనవివేచనాశక్తిని భగవద్భక్తులకు ప్రసాదించును, రెండవదియైన ఆవరణీశక్తిని అభక్తులకు సంక్రమింపజేయును. భగవాను డైనశ్రీకృష్ణపరమాత్మయే సత్యస్వరూపుడు నిత్యుడు, ఆయనదక్క అన్యములన్నియు నశ్వరము లనెడు వివేచనాబుద్ధియే నిత్యస్వరూపిణి, సనాతని శక్తి. ఈవివేచనాజ్ఞానమే శ్రీ (శ్రీకృష్ణభక్తిదాస్య సౌభాగ్యము) యని తెలిసికొనుము. ఆసౌభాగ్యమే (వివేచనాశక్తి) వైష్ణవులకు సంప్రాప్తించును. కాని యావరణీ బుద్ధి కర్మఫలముల ననుభవించు (విషయాసక్తులైన) అవైష్ణవాధమపురుషులకు సంప్రాప్తించును. కర్మభోగ లాలసత్వమే యావరణీబుద్ధి.

రాజా ! నేను ప్రచేతసునినందనుడను, బ్రహ్మదేవునకు పౌత్రుడను. నాగురుదేవులైనశంకరభగవానుని యనుగ్రహమువలన దివ్యజ్ఞానప్రాప్తినొందిన నేను సదా శ్రీకృష్ణపరమాత్మ దివ్యనామసంకీర్తనమందే సంలగ్నుడనై యుందును.

గచ్ఛ రాజ న్నదీతీరం భజ దుర్గాం సనాతనీమ్ ।
బుద్ధి మావరణీం తుభ్యం దేవీ దాస్యతి కామినే ॥
నిష్కామాయ చ వైశ్యాయ వైష్ణవాయ చ వైష్ణవీ।
బుద్ధిం వివేచికాం శుద్ధాం దాస్యత్యేవ కృపామయీ 38-39

మహారాజా ! నదీతటమున కేగి సనాతని యగు దుర్గను భజింపుము. నీమనములో రాజ్యకాంక్ష కలదు, కావున దేవి నీకు నావరణీ బుద్ధిని ప్రసాదింపగలదు. కాని యావైష్ణవీశక్తి యీనిష్కామవైష్ణవు డైన వైశ్యశ్రేష్ఠునకు కృపతో శుద్ధవివేచనాబుద్ధి నొసంగగలదు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

ఇట్లు మహాజ్ఞానోపదేశ మొనరించి యాకృపానిధి యైన మేధోమహర్షి వారి కిర్వురకు దుర్గాదేవి పూజావిధానమును, స్తోత్రమును, కవచమును, మంత్రమునుపదేశించెను, వైశ్యశ్రేష్ఠు డైనసమాధియాకృపామయియగుదుర్గను నిష్కామభావముతో నారాధించి దివ్యగోలోకపరంధామము జేరెను. సురథ మహారాజు సకాముడై భగవతి నర్చించి తనమనోభీష్ట సామ్రాజ్యమును,

మనుపదమును, బరమైశ్వర్యములను బొంది సుఖముల ననుభవించెను. నారదా ! ఇట్లు నేను సుఖప్రదమైన, సారభూతమైన మోక్షప్రదాయకమైన, పరమోత్తమమైన దుర్గాదేవ్యుపాఖ్యానమును సంక్షిప్తముగ వర్ణించితిని. ఇక నేవిషయముల వినగోఱుచున్నావో తెల్పుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతి ఖండములోని నారదనారాయణ సంవాద
మున సురథసమాధుల అభిలాషసిద్ధి యను
అఱువదిరెండవ అధ్యాయము
సంపూర్ణము

—•—

## అఱువదిమూడవ అధ్యాయము

### దుర్గాదేవి సమాధివైశ్యునకు శ్రీకృష్ణానన్యభక్తిని ప్రసాదించుట.

నారదుడు పలికెను :

వేదవిదులందు శ్రేష్ఠుడా! మహాభాగా! సురథప్రభు వేపూజావిధితో బరాప్రకృతిని సేవించి కామితార్థములను బొందగల్గెను ? సమాధివైశ్యశ్రేష్ఠుడు కూడ నెట్లు ప్రకృత్యుపదేశమును బొంది ప్రాకృతికనిర్గుణుడు, నిష్కాముడు, నైన శ్రీకృష్ణపరమాత్మయొక్క దివ్యపరంధామమును జేరెను ? మేధో మహర్షి నరేశ్వరునకు, వైశ్యశ్రేష్ఠునకు నుపదేశించిన పూజావిధానమును, మంత్రస్తోత్రకవచాదులను గృపతో నా కుపదేశింపుడు. సమాధికి బ్రకృతిదేవి యెట్టియుత్తమోత్తమమహాజ్ఞానమును బ్రసాదించెను ? ఏయుపాయముచే వారిర్వురు శీఘ్రముగ బ్రకృతిదేవి దివ్యసాక్షాత్కారమును బొందగల్గిరి ? వైశ్యుడు ప్రకృతిదత్తజ్ఞానమును బొంది యెదుర్లభపదము జేరెను ? రాజున కెట్టిగతిప్రాప్తించెను ? నా యీసంశయముల నన్నింటెని నివారింపవలసినదిగా ప్రార్థించుచున్నాను.

శ్రీ నారాయణ ఋషి పలికెను :

మునీశ్వరా! సురథుడు, సమాధివైశ్యుడు మేధోమర్షి ముఖారవింద మునుండి దేవీమంత్రమును, స్తోత్రమును, గవచమును, ధ్యానమును, బురశ్చరణవిధానమును నుపదేశము పొంది పవిత్రపుష్కర తీర్థమున కేగి క్షేత్రములో దేవీ మంత్రజప మారంభించిరి. వారిద్దరు నొకసంవత్సర పర్యంతము ప్రతి దినము త్రికాలస్నానము లాచరించి దేవీమంత్రమును జపించుచు బ్రకృతి నారాధించి పరిశుద్ధులైరి. ఆదివ్య క్షేత్రములోనే వారిద్దరకు మూలప్రకృతి యీశ్వరి తనదివ్యదర్శనమును బ్రసాదించెను. దేవి రాజునకు రాజ్యలక్ష్మిని గటాక్షించి భవిష్యత్తులో మనుపదము నలంకరింపగలవని, మనోవాంఛిత సుఖముల ననుభవింపగలవని వరముల ననుగ్రహించెను.

పూర్వకాలమున శ్రీకృష్ణభగవానుడు శంకరున కేదివ్యజ్ఞానోపదేశ మొనరించెనో యాపరమదుర్లభ మైననిగూఢజ్ఞానమునే ప్రకృతిమాత వైశ్యశ్రేష్ఠున కుపదేశించెను. నిరంతరోపవాసములచే నిశ్చేష్టుడై శ్వాసరహితుడై ప్రకృతిదేవీమంత్రజపమందే సంలగ్నుడై పడియున్నవైశ్యుని గాంచి శ్రీప్రకృతీదేవి ప్రేమతో దనయొడిలోనికి దీసికొని 'కుమారా! చైతన్యము పొందుమని యనుగ్రహించెను. చైతన్యస్వరూపిణి యైనదేవియే యావైశ్య శ్రేష్ఠునకు జేతనత్వమును బ్రసాదించెను. ప్రకృతికరుణవలన బాహ్యచైతన్యమును బొంది సమాధి తనసమక్షమున ననంతకోటిసూర్యప్రకాశసమన్వితయై సాక్షాత్కరించిన సకలజగజ్జననిని గన్నులకఱవు దీరదర్శించి తద్దివ్య చరణారవిందముల నాశ్రయించెను. అత్యంతకృపామయి యైనదేవి వైశ్యశ్రేష్ఠునిపై నతిప్రసన్నురాలై కృపాపూర్వకముగ నిట్లు పల్కెను.

శ్రీ ప్రకృతి రువాచ :

వరం వృణీష్వ హేవత్స! య త్తే మనసి వర్తతే ।
బ్రహ్మత్వ మమరత్వం వా తతో వాఽతిసుదుర్లభామ్ ॥
ఇన్ద్రత్వం వా మనుత్వం వా సర్వసిద్ధత్వమేవ చ ।
తుచ్ఛం తుభ్యం న దాస్యామి నశ్వరం బాల వంచనమ్॥ 13-14

కుమారా! నీమనమం దేయభీష్టము కలదో దానికోరకై వరము నర్థింపుము. అత్యంతదుర్లభ మైన బ్రహ్మత్వమునుగాని ఇంద్రత్వమునుగాని,

యమరత్వమునుగాని, మనుత్వమునుగాని, సంపూర్ణసిద్ధత్వమునుగాని నీవు వాంఛించిన ప్రసాదింపగలను; కాని యట్టినశ్వరము లైనపదములను నాపుత్ర తుల్యుడ వైననీకు ప్రసాదింపను.

సమాధి వైశ్యుడు పలికెను:

బ్రహ్మత్వ మమరత్వం వా మాత ర్మే నహి వాంఛితమ్ ।
తతోఽతిదుర్లభం కింవా న జానే తదభీప్సితమ్ ॥
త్వయ్యేవ శరణాపన్నో దేహి య ద్వాంఛితం తవ ।
అనశ్వరం సర్వసారం వరం మే దాతు మర్హసి ॥ 15-16

తల్లీ! నాకు బ్రహ్మత్వమునుగాని, యమరత్వమునుగాని, మఱి యితర పదములనుగాని పొందవలెనని కాంక్ష లేదు. వీటి కన్నింటికంటె నత్యంత దుర్లభ మైనదివ్యపద మేది? ఆపద మేదో నే నెరుగను. అట్టిసర్వోన్నత పద మేదైన నున్నచో నట్టినిత్యపదమే నాయభీష్టవరము. జననీ! నేను నీశర ణము నాశ్రయించిన వాడను, నీకేవరము ననుగ్రహింపనభీష్టమో, యావర మునే నాకు ప్రసాదింపుము. సకలతత్వసారము ననశ్వరమునైన దివ్యవరమునే కృపతో నా కనుగ్రహింపుము.

శ్రీ ప్రకృతి పలికెను:

అదేయం నాస్తి మే తుభ్యం దాస్యామి మమ వాంఛితమ్ ।
యతో యాస్యసి గోలోకం పదమేవ సుదుర్లభమ్ ॥
సర్వసారం చ యద్ జ్ఞానంసురర్షీణాం సుదుర్లభమ్ ।
త ద్గృహ్యతాం మహాభాగ! గచ్ఛ వత్స! హరేః పదమ్॥ 17-18

కుమారా! నీ కనుగ్రహించుట కెట్టివరమైనను నాకదేయము కాదు (అనగా నెంతటివరమునైనను ప్రసాదింపగలనని భావము). ఏవరము నా కభీష్టమో, దానినే నీ కనుగ్రహించెదను. నావరమువలన నీవు పరమదుర్లభ మైన దివ్యగోలోక పరంధామమును జేరగలవు. మహాభాగా! ఏమహాజ్ఞానము దేవఋషులకైన నత్యంత దుర్లభమో, సకలసారభూత మైనయాదివ్యజ్ఞాన మును నీ కుపదేశించెద. కుమారా! శ్రీహరి పరంధామమునకు బయానమొన రింపుము.

స్మరణం వన్దనం ధ్యాన మర్చనం గుణకీర్తనమ్ ।
శ్రవణం భావనం సేవా కృష్ణే సర్వనివేదనమ్ ॥
ఏతదేవ వైష్ణవానాం నవధా భక్తిలక్షణమ్ ।
జన్మమృత్యుజరావ్యాధియమతాడనఖణ్డనమ్ ॥ 19-20

పరమాత్మ యగుశ్రీకృష్ణభగవానుని స్మరించుట, యాయనకు వంద నముల నర్పించుట, యాయనను ధ్యానించుట, పూజించుట, తద్దివ్యగుణనామ సంకీర్తన మొనరించుట, తద్దివ్యచరితములను శ్రవణ మొనరించుట, యాయననే సదా భావన మొనరించుట, సేవించుట, సర్వస్వమును శ్రీకృష్ణునకు సమర్పించుట – ఇవియే వైష్ణవులనవవిధభక్తిలక్షణములు. ఈ నవలక్షణ సంయుక్త మైనభక్తి జన్మమృత్యుజరావ్యాధులను యమతాడనాదులను ఖండింప గలదు.

ఆయు ర్హరతి లోకానాం రవిరేవ హి సంతతమ్ ।
నవధాభక్తిహీనానా మసతాం పాపినామపి ॥
భక్తా స్తద్గతచిత్తాశ్చ వైష్ణవా శ్చిరజీవినః ।
జీవన్ముక్తా శ్చ నిష్పాపా జన్మాది పరివర్జితాః ॥ 21, 22

ఎవరు నవవిధ భక్తిహీనులో, పాపులో, యధములో యట్టిమానవుల యాయుర్దాయమును సూర్యదేవుడు సదా హరించుచుండును. ఎవరు భక్తులో, భగవంతునియందు దమచిత్తములను సంలగ్న మొనరించెదరో, యట్టి వైష్ణవులు చిరంజీవులు, నిష్పాపులై, జన్మాదివికారరహితులై, జీవన్ముక్తులు కాగలరు.

శివః శేషశ్చ ధర్మశ్చ బ్రహ్మ విష్ణు ర్మహా న్విరాట్ ।
సనత్కుమారః కపిలః సనకశ్చ సనన్దనః ॥
వోఢుః పంచశిఖో దక్షో నారదశ్చ సనాతనః ।
భృగు ర్మరీచి ర్దుర్వాసాః కశ్యపః పులహోఽఙ్గిరాః ॥
మేధావీ లోమశః శుక్రో వశిష్ఠః క్రతురేవ చ ।
బృహస్పతిః కర్దమశ్చ శక్తి రత్రిః పరాశరః ॥
మార్కణ్డేయో బలిశ్చైవ ప్రహ్లాదశ్చ గణేశ్వరః ।
యమః సూర్యశ్చ వరుణో వాయు శ్చన్ద్రో హుతాశనః ॥
అకూపార ఉలూకశ్చ నాడీజంఘశ్చ వాయుజః ।
నరనారాయణౌ కూర్మ ఇన్ద్రద్యుమ్నో విభీషణః ॥

నవధాభక్తియుక్తాశ్చ కృష్ణస్య పరమాత్మనః ।
ఏతే మహాన్తో ధర్మిష్ఠా భక్తానాం ప్రవరా స్తథా ॥ 24-28

శివుడు, ఆదిశేషుడు, ధర్మదేవత, బ్రహ్మ, విష్ణువు, మహావిరాట్పురుషుడు, సనత్కుమారుడు, కపిలుడు, సనకుడు, సనందనుడు, వోఢుడు, పంచశిఖుడు, దక్షుడు, నారదుడు, సనాతనుడు, భృగువు, మరీచి, దుర్వాసుడు, కశ్యపుడు, పులహుడు, ఆంగిరసుడు, మేధావి, లోమశుడు, శుక్రుడు, వశిష్ఠుడు, క్రతువు, బృహస్పతి, కర్దముడు, శక్తి, అత్రి, పరాశరుడు, మార్కండేయుడు, బలి, ప్రహ్లాదుడు, గణేశ్వరుడు, యముడు, సూర్యుడు, వరుణుడు, వాయువు, చంద్రుడు, అగ్ని, అకూపారుడు, ఉలూకుడు, నాడీజంఘుడు, వాయుపుత్రుడైన హనుమంతుడు, నరుడు, నారాయణుడు, కూర్మము, ఇంద్రద్యుమ్నుడు, విభీషణుడు, వీరందఱు శ్రీకృష్ణపరమాత్మ నవధా భక్తియుక్తులు, మహాధర్మిష్ఠులైన భక్త శిరోమణులు.

యే తద్భక్తా స్తదంశా స్తే జీవన్ముక్తాశ్చ సంతతమ్ ।
పాపాపహారా స్తీర్థానాం పృథివ్యాశ్చ విశాంపతే ॥ 29

వైశ్యేంద్రా ! శ్రీకృష్ణ భక్తులైన వారందఱు నే మున్ను ప్రవచించిన వైష్ణవ శిరోమణుల యంశ సంభవులే. శ్రీకృష్ణభక్తులు సదా జీవన్ముక్తులై విరాజిల్లగలరు. వారు భూమండలములో గల సమస్తతీర్థముల పాపములను సయితము నశింప జేయుటలో సమర్థు లయ్యెదరు.

ఊర్ధ్వం చ సప్త స్వర్గాశ్చ సప్తద్వీపా వసున్ధరా ।
అధః సప్త చ పాతాలా ఏతద్బ్రహ్మాణ్డమేవ చ ॥

ఏవంవిధానాం విశ్వానాం సంఖ్యా నాస్త్యేవ పుత్రక ।
ఏవం చ ప్రతివిశ్వేషు మహావిష్ణుశివాదయః ॥

దేవా దేవర్షయశ్చైవ మనవో మానవాదయః ॥
సర్వాశ్రమాశ్చ సర్వత్ర సన్తి బద్ధాశ్చ మాయయా ॥

మహావిష్ణో ర్లోమకూపే సన్తి విశ్వాని యస్య చ ।
స షోడశాంశః కృష్ణస్య చాఽఽత్మనశ్చ మహా న్విరాట్ ॥ 30-33

పైన సప్తస్వర్గములు, మధ్య సప్తద్వీపవతి పృథ్వి, క్రింద సప్తపాతాళములు, ఇవి యన్నియు గలిసి యొక బ్రహ్మాండ మనబడెను. కుమారా ! అట్టి

విశ్వబ్రహ్మాండముల కెట్టి నిర్ణీత సంఖ్యయును లేదు (అనగా నవి యసంఖ్యాకములు). ప్రతి విశ్వమందు బ్రహ్మవిష్ణు శివాదులు, దేవతలు, దేవర్షులు, మనువులు, మానవులు, మొదలగు వా రందఱు, మఱియు సర్వాశ్రమస్థులు కూడ నివసించుచుందురు. సర్వత్ర జీవుడు మాయాబద్ధుడై నివసించును. ఏ మహావిష్ణుదేవుని యసంఖ్యాక రోమకూపములలో నసంఖ్యాక బ్రహ్మాండములున్నవో యాయననే మహా విరాట్పురుషు డందురు. ఆయన శ్రీకృష్ణ పరమాత్మ పదునాఱవ యంశమాత్రుడే.

భజ సత్యం పరం బ్రహ్మ నిత్యం నిర్గుణ మచ్యుతమ్ ।
ప్రకృతేః పర మీశానం కృష్ణ మాత్మాన మీశ్వరమ్ ॥

నిరీహం చ నిరాకారం నిర్వికారం నిరంజనమ్ ।
నిష్కామం నిర్విరోధం చ నిత్యానన్దం సనాతనమ్ ॥

స్వేచ్ఛామయం సర్వరూపం భక్తానుగ్రహవిగ్రహమ్ ।
తేజఃస్వరూపం పరమం దాతారం సర్వసంపదామ్ ॥

సర్వాధారం చ సర్వజ్ఞం సర్వానన్దకరం పరమ్ ।
సర్వధర్మప్రదం సర్వం సర్వజం ప్రాణరూపిణమ్ ॥

సర్వధర్మస్వరూపం చ సర్వకారణకారణమ్ ।
సుఖదం మోక్షదం సారం పరరూపం చ భక్తిదమ్ ॥

ధ్యానాసాధ్యం దురారాధ్యం శివాదీనాం చ యోగినామ్ ।
సర్వేశ్వరం సర్వపూజ్యం సర్వేషాం సర్వకామదమ్ ॥

దాస్యదం ధర్మదం చైవ సర్వసిద్ధిప్రదం సతామ్ ।
సర్వం తదతిరిక్తం చ నశ్వరం కృత్రిమం సదా ॥

పరాత్పరం నిత్యశుద్ధం పరిపూర్ణతమం శివమ్ ।
యథాసుఖం గచ్ఛ వత్స భగవన్తం మధోక్షజమ్ ॥

కృష్ణేతి ద్వ్యక్షరం మన్త్రం గృహీత్వా కృష్ణదాస్యదమ్ ।
పుష్కరం దుష్కరం గత్వా దశలక్ష మిమం జప ॥

దశలక్షజపేనైవ మన్త్రసిద్ధి ర్భవే త్తవ । 34-42

సర్వులకు నభీష్టాత్మ స్వరూపుడైన శ్రీకృష్ణుడు సత్యుడు, నిత్యుడు, పరబ్రహ్మస్వరూపుడు, ప్రాకృత గుణరహితుడు, అచ్యుతుడు, ప్రకృతికే యతీతుడు, పరమేశ్వరుడు, నీ వాయననే సదా భజింపుము. ఆయన నిరీహుడు,

నిరాకారుడు, నిర్వికారుడు, నిరంజనుడు, నిష్కాముడు, నిర్విరోధుడు, నిత్యానందుడు, సనాతనుడు. శ్రీకృష్ణుడు స్వేచ్ఛామయుడు (స్వతంత్రుడు), సర్వరూపుడు, భక్తుల ననుగ్రహించుటకొఱకే దివ్య సచ్చిదానంద విగ్రహమును ధరించినవాడు, పరమ తేజస్స్వరూపుడు, సర్వసంపదలను బ్రసాదించుదాత, ధ్యానమూలమున నాయనను వశమొనరించుకొనుట యసంభవము. శివాది యోగులకైన నాయన యారాధన బహుకఠినము. శ్రీకృష్ణుడు సర్వేశ్వరుడు, సర్వపూజ్యుడు, సర్వులకు సర్వాభీష్టములను ప్రసాదించు దాత. ఆయన సర్వాధారుడు, సర్వజ్ఞుడు, సర్వులకు బరమానంద కరుఁడు, అన్ని ధర్మములకు దాత, సర్వరూపుడు, సకలప్రాణి స్వరూపుడు, సర్వధర్మ స్వరూపుడు, సర్వకారణ కారణుడు, సుఖప్రదుడు, మోక్షదాయకుడు, సారస్వరూపుడు, ఉత్కృష్ట దివ్యరూప సంపన్నుడు, అనన్యభక్తిదాయకుడు. శ్రీకృష్ణపరమాత్మ దాస్యసౌభాగ్యదాత, ధర్మ ప్రదాత, సత్పురుషులకు సర్వసిద్ధులను బ్రసాదించు పురుషోత్తముఁడు. ఆయన దక్క నన్యము లన్నియు కృత్రిమములే, నశ్వరములే యని తెలిసికొనుము. ఆ పరాత్పరుఁడైన శ్రీకృష్ణ భగవానుడే పరిశుద్ధుడు, పరిపూర్ణతముడు శివస్వరూపుడు. కుమారా! నీవు సుఖపూర్వకముగ నా భగవంతుఁడైన యధోక్షజు శరణమును గ్రహింపుము. కృష్ణ యను రెండక్షరముల దివ్య మంత్రము శ్రీకృష్ణ దాస్య సౌభాగ్య ప్రదాయకము. నీవు నా నుండి యీ దివ్యమంత్రము నవధరించి దుష్కర సిద్ధిని బడయజేయు పుష్కర తీర్థమున కరిగి శ్రీకృష్ణ మంత్రమును బదిలక్షల పర్యాయములు జపింపుము. అట్లు జపించిన నా మంత్రము నీకు సిద్ధింపగలదు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా! ఇట్లు భగవతి ప్రకృతి సమాధివైశ్యున కుత్తమోత్తమమైన దివ్యజ్ఞానోపదేశ మొనరించి యంతర్హిత యయ్యెను. మునీశ్వరా! జగజ్జననికి భక్తిభావముతో ననేకనమస్కారముల నర్పించి సమాధి వైశ్యుఁడు పుష్కర క్షేత్రములలో దుష్కర తప మాచరించి పరమేశ్వరుఁడైన శ్రీకృష్ణ భగవానుని దివ్యగోలోక పరంధామమును జేరెను. భగవతి ప్రకృతి యనుగ్రహమునకు బాత్రుడై యతడు శ్రీకృష్ణ దాస్యాఖండ సామ్రాజ్యము నొంది జన్మరహితుడై గోలోక గమన మొనరించెను. కుమారా! సర్వధర్మముల

సారము కేవలము శ్రీకృష్ణ పరమాత్మానన్యభక్తి, దాస్య సౌభాగ్యములే యని తెలిసికొనుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతి ఖండములోని నారదనారాయణ సంవాద
మున ప్రకృతిసమాధివైశ్యసంవాదకథన
మనుఅఱువదిమూడవ అధ్యాయము
సంపూర్ణము

## అఱువదినాలుగవ అధ్యాయము

## శ్రీదుర్గాదేవి పూజా విధానము, ధ్యానము, స్తోత్రము

శ్రీ నారాయణ ఋషి పలికెను :

మహాభాగా ! నారదమునీంద్రా ! సురథరాజేంద్రుడీప్రకారముగ బరాప్రకృతి నారాధించినవిధమును, వేదోక్తక్రమము నుపదేశించెద నాలకింపుము. సురథుడు స్నానమాచరించి యాచమన మొనరించెను. తదనంతరము త్రివిధన్యాసము, కరన్యాసము, అఙ్గన్యాసము, మంత్రాఙ్గన్యాసము, భూతశుద్ధి యొనరించెను. తదుపరి ప్రాణాయామ మొనరించి శంఖధ్వని గావించి యనంతరము దేవిని ధ్యానించి మృణ్మయు ప్రతిమలోనికి భగవతి నావాహనము చేసెను. అతడు భక్తిభావముతో దేవిని ధ్యానించి ప్రేమపూర్వకముగ బూజించెను. దేవికి దక్షిణ దిశలో శ్రీమహాలక్ష్మిని స్థాపించి పరమధార్మికుడు రాజేశ్వరుడు భక్తిభావముతో నామెనుగూడ బూజించెను. నారదా ! తదనంతరము దేవీ సమక్షమున మంగళకలశముపై గణేశ్వరుని, సూర్యుని, నగ్నిని, విష్ణుదేవుని, శివుని, పార్వతిని, ఈ యార్గురు దేవతల నావాహన మొనరించి రాజు విధిపూర్వకముగ వారి పూజలను సంపన్న

యొనరించి వందనముల నర్పించెను. పిదప సురథు డత్యంత ప్రేమపూర్వక ముగ మహాదేవిని క్రింద దెల్పినరీతి ధ్యానించెను. మునీశ్వరా! సామవేద మందు ప్రవచింపబడిన యీ దురా ధ్యానము పరమోత్తమము, కల్పవృక్ష సదృశము సకలాభీష్టప్రదము.

ధ్యాయే న్నిత్యం మహాదేవీం మూలప్రకృతి మీశ్వరీమ్ ॥

బ్రహ్మవిష్ణుశివాదీనాం పూజ్యాం వన్ద్యాం సనాతనీమ్ ।
నారాయణీం విష్ణుమాయాం వైష్ణవీం విష్ణుభక్తిదామ్ ॥

సర్వస్వరూపాం సర్వేశీం సర్వాధారాం పరాత్పరామ్ ।
సర్వవిద్యాసర్వమన్త్ర సర్వశక్తిస్వరూపిణీమ్ ॥

సగుణాం నిర్గుణాం సత్యాం వరాం స్వేచ్ఛామయీం సతీమ్ ।
మహావిష్ణోశ్చ జననీం కృష్ణస్యార్ధాఙ్గసంభవామ్ ॥

కృష్ణప్రియాం కృష్ణశక్తిం కృష్ణబుద్ధ్యధిదేవతామ్ ।
కృష్ణస్తుతాం కృష్ణపూజ్యాం కృష్ణవన్ద్యాం కృపామయీమ్ ॥

తప్తకాంచనవర్ణాభాం కోటిసూర్యసమప్రభామ్ ।
ఈషద్ధాస్యప్రసన్నాస్యాం భక్తానుగ్రహకారికామ్ ॥

దుర్గాం శతభుజాం దేవీం మహాదుర్గతినాశినీమ్ ।
త్రిలోచనప్రియాం సాధ్వీం త్రిగుణాం చ త్రిలోచనామ్ ॥

త్రిలోచనప్రాణరూపాం శుద్ధార్ధచన్ద్రశేఖరామ్ ।
బిభ్రతీం కబరీభారం మాలతీమాల్యమణ్డితమ్ ॥

వర్తులం వామవక్త్రం చ శమ్భోర్మోహనమోహినీమ్ ।
రత్నకుణ్డలయుగ్మేన గణ్డస్థలవిరాజితామ్ ॥

నాసాదక్షిణభాగేన బిభ్రతీం గజమౌక్తికమ్ ।
అమూల్యరత్నం బహులం బిభ్రతీం శ్రవణోపరి ॥

ముక్తాపఙ్క్తి వినిన్దైకదన్తపఙ్క్తిసుశోభితామ్ ।
పక్వబిమ్బాధరోష్ఠీం చ సుప్రసన్నాం సుమఙ్గలామ్ ॥

చిత్రపత్రావలీరమ్యకపోలయుగలోజ్జ్వలామ్ ।
రత్నకేయూరవలయరత్నమంజీరరంజితామ్ ॥

రత్నకఙ్కణభూషాఢ్యాం రత్నపాశసుశోభితామ్ ।
రత్నాఙ్గులీయనికరైః కరాఙ్గులిచయోజ్జ్వలామ్ ॥

పదాఙ్గులినఖాసక్తాలక్తరేఖాసుశోభితామ్ ।
వహ్నిశుద్ధాంశుకాధానాం గన్ధచన్దనచర్చితామ్ ॥

బిభ్రతీం స్తనయుగ్మం చ కస్తూరీబిన్దుశోభితామ్ ।
సర్వరూపగుణవతీం గజేన్ద్రమన్దగామినీమ్ ॥

అతీవ కాన్తాం శాన్తాం చ నితాన్తాం యోగసిద్ధిషు ॥
విధాతుశ్చ విధాత్రీం చ సర్వధాత్రీం చ శంకరీమ్ ॥

శరత్పార్వణచన్ద్రాస్యా మతీవ సుమనోహరామ్ ।
కస్తూరీబిన్దుభిః సార్థ మధశ్చన్దనబిన్దునా ॥

సిన్దూరబిన్దునా శశ్వ ద్భాలమధ్యస్థలోజ్జ్వలామ్ ।
శరన్మధ్యాహ్నకమలప్రభామోచనలోచనామ్ ॥

చారుకజ్జలరేఖాభ్యాం సర్వతశ్చ సముజ్జ్వలామ్ ।
కోటికన్దర్పలావణ్యలీలానిన్దితవిగ్రహామ్ ॥

రత్నసింహాసనస్థాం చ సద్రత్నముకుటోజ్జ్వలామ్ ।
సృష్టౌ స్రష్టుః శిల్పరూపాం దయాం పాతుశ్చ పాలనే ॥

సంహారకాలే సంహర్తుః పరాం సంహారరూపిణీమ్ ।
నిశుమ్భశుమ్భమర్దినీం మహిషాసురమర్దినీమ్ ॥

పురా త్రిపురయుద్ధే చ సంస్తుతాం త్రిపురారిణా ।
మధుకైటభయో ర్యుద్ధే విష్ణుశక్తిస్వరూపిణీమ్ ॥

సర్వదైత్యనిహన్త్రీం చ రక్తబీజవినాశినీమ్ ।
నృసింహశక్తిరూపాం చ హిరణ్యకశిపో ర్వధే ॥

వరాహశక్తిం వారాహే హిరణ్యాక్షవధే తథా ।
పరబ్రహ్మస్వరూపాం చ సర్వశక్తిం సదా భజే ॥ 8-31

## శ్రీ దుర్గాదేవి ధ్యానము

మహాదేవియు, మూలప్రకృతియు, ఈశ్వరియు, బ్రహ్మవిష్ణు శివాదులకు బూజ్యురాలును, వంద్యురాలును, సనాతనియు, నారాయణియు, విష్ణుమాయయు, వైష్ణవియు, విష్ణుభక్తిప్రదయు, సర్వస్వరూపిణియు, సర్వేశ్వరియు, సర్వాధారయు, పరాత్పరయు, సర్వావిద్యాస్వరూపిణియు, సర్వమంత్ర స్వరూపిణియు, సర్వశక్తి స్వరూపిణియు, సగుణయు, నిర్గుణయు, సత్యమైనదియు, శ్రేష్ఠమైనదియు, స్వేచ్ఛామయయు, సతియు, మహావిష్ణువునకు జననియు,

శ్రీకృష్ణార్ధాంగ సంభూతయు, కృష్ణప్రియయు, కృష్ణశక్తియు, కృష్ణుని బుద్ధి కధిదేవతయు, కృష్ణునిచే స్తుతింపబడునదియు, కృష్ణునకు బూజింపదగినదియు, కృష్ణునకు వందనీయురాలును, కృపామయియు, తప్తకాంచనవర్ణము వంటి యంగ కాంతి గలదియు, కోటిసూర్య సమప్రభయు, చిరునవ్వుచే ప్రసన్నమైన ముఖము గలదియు, భక్తానుగ్రహకారిణియు, దుర్గాదేవియు, శతభుజములు గలదియు, మహాదుర్గతిని నశింపజేయునదియు, త్రిలోచనుడైన యీశ్వరునకు బ్రియురాలును, సాధ్వియు, త్రిగుణములు త్రిలోచనములు గలదియు, త్రిలోచనునకు బ్రాణరూపిణియు, విశుద్ధార్ధ చంద్రుడు మకుటముగా గలదియు, మాలతీమాలలచే నలంకృతమైన కేశపాశమును ధరించునదియు, వర్తులము సుందరము నగు ముఖముగలదియు, శంభుని మనస్సును మోహింపజేయు నదియు, రత్నకుండల యుగళముచే విరాజిల్లు గండస్థలములు గలదియు, నాసిక దక్షిణభాగమున గజముక్తికమును ధరించినదియు, చెవులయం దమూల్య రత్నాభరణములను ధరించునదియు, ముత్యముల వరుసను దిరస్కరించి ప్రకా శించు పలువరుసకలదియు, పండిన దొండపండువంటి యధరము గలదియు, సుప్రసన్నయు, సుమంగళియు, చిత్రములైన పత్రావళులచే రమ్యములైన కపోలయుగళముచే శోభిల్లునదియు, రత్నమయములైన భుజకీర్తులచేత కంకణ ములచేత మంజీరములచేత శోభిల్లునదియు, రత్నకంకణములచేత రత్నపాశ ములచేత విలసిల్లునదియు, రత్నాంగుళీయకములచేత బ్రకాశించు కరాంగుళులు గలదియు, పాదముల వ్రేళ్ళయందు గోళ్ళయందు లగ్నమైన పారాణి రేఖ లచే శోభిల్లునదియు, అగ్నిశుద్ధములగు వస్త్రములను ధరించినదియు, గంధ చందనములచే చర్చితయు, కస్తూరీ బిందువులచే శోభిల్లు స్తనయుగ్మము గలదియు, సర్వరూపములు గుణములు గలదియు, గజేంద్రుని గమనము వంటి గమనము గలదియు, అత్యంత కాంతిమతియు, శాంతస్వరూపిణియు, యోగసిద్ధులయందు నిపుణయు, విధాతనుగూడ సృష్టించునదియు, సర్వమును ధరించునదియు, శుభంకరియు, శరత్పూర్ణిమనాటి చంద్రునివంటి ముఖము గలదియు, మిగుల మనోహారిణియు, కస్తూరీ చందన సిందూర బిందువులచే శోభిల్లు ఫాలప్రదేశము గలదియు, శరత్కాల మధ్యాహ్నమున వికసించిన కమలములవంటి నేత్రములు గలదియు, సుందరమైన కాటుక రేఖలచే శోభిల్లు నేత్రములు గలదియు, కోటిమన్మథలావణ్యమును దిరస్కరించు

రూపము గలదియు, రత్నసింహాసనము నధిష్ఠించినదియు, దివ్యరత్న నిర్మిత ముకుటముచే విరాజిల్లినదియు, స్రష్టయొక్క సృష్టియందు శిల్పరూపిణియు, పాలకుని పాలనయందు దయారూపిణియు, సంహార కాలమున సంహారకుని సంహార శక్తియు, శుంభ నిశుంభులను మహిషాసురుని సంహరించినదియు, పూర్వము త్రిపురారియైన యీశ్వరునిచే త్రిపురాసుర యుద్ధమున స్తుతింపబడినదియు, మధుకైటభుల యుద్ధమున విష్ణుశక్తి స్వరూపిణియు, సర్వదైత్య సంహారిణియు, రక్తబీజవినాశినియు, హిరణ్యకశిపునివధసమయమున నృసింహశక్తి రూపిణియు, హిరణ్యాక్ష వధ సమయమున వరాహ భగవానుని వరాహశక్తియు, పరబ్రహ్మ స్వరూపిణియు, సర్వశక్తి స్వరూపిణియు నగు శ్రీ దుర్గాదేవిని యెల్లపుడు ధ్యానింపవలెను.

ఇట్లు ధ్యానమొనరించి వ్రతి తనశిరముపై బుష్పముల నుంచుకొని మరల ధ్యానించి భక్తిభావముతో భగవతి నావాహన మొనరింపవలెను. ప్రకృతిమాతృ ప్రతిమను స్పృశించి వ్రతి యిట్లుమంత్రోచ్చారణ మొనరించుచు మంత్రములద్వారమున యత్నపూర్వకముగ జీవనన్యాస మొనరింపవలెను.

భ గ వ త్యా వా హ న మ o త్ర ము

ఏహ్యేహి భగవత్యమ్బ శివలోకాత్సనాతని ।
గృహాణ మమ పూజాం చ శారదీయాం సురేశ్వరి ॥

ఇహాఽఽగచ్ఛ జగత్పూజ్యే తిష్ఠ తిష్ఠ మహేశ్వరి ।
హే మాతరస్యామర్చాయాం సన్నిరుద్ధా భవామ్బికే ॥

ఇహాఽఽగచ్ఛన్తు త్వత్ప్రాణాశ్చాఽఽధిప్రాణైః సహాచ్యుతే।
ఇహాఽఽగచ్ఛన్తు త్వరితం తవైవ సర్వశక్తయః ॥

ఓం హ్రీం శ్రీం క్లీం చ దుర్గాయై వహ్నిజాయాన్తమేవచ ।
'ఓం హ్రీం శ్రీం క్లీం చ దుర్గాయై స్వాహా'
సముచ్చార్యోరసి ప్రాణాః సంతిష్ఠన్తు సదా శివే ॥

సర్వేన్ద్రియాధిదేవీ స్త ఇహాఽఽగచ్ఛన్తు చణ్డికే ।
తే శక్తయోఽత్రాఽఽగచ్ఛన్తు ఇహాఽఽగచ్ఛన్తు తేఽశ్వరాః ॥ 34-38

అంబా! భగవతీ! సనాతనీ! శివలోకమునుండి దయచేయుము. సురేశ్వరీ! నా శరత్కాల పూజనుగ్రహింపుము. జగత్పూజ్యే! మహేశ్వరీ! ఈప్రదేశమునకు దయచేయుము. నాపూజాగృహములో

ము, మాతా ! అంబికా ! నీవు నాపూజా ప్రతిమలో
ంపుము. అచ్యుతే ! ఈవిగ్రహములో నీప్రాణము నిమ్నభాగ
వ విరాజిల్లు ప్రాణములతో రావలెను, నివసింపవలెను. నీసంపూర్ణ
ములు ఈపూజాప్రతిమలో శీఘ్రముగ పదార్పణ మొనరింపవలెను. ఓం
ం శ్రీం క్లీం దుర్గాయై స్వాహా (ఈమంత్రోచ్చారణ మొనరించుచు భగవతి
ప్రార్థింపవలెను) సదాశివే ! ఈ పూజాప్రతిమ హృదయములో
ణముల నుంచుము. చండికా ! నీవు సంపూర్ణ ఇంద్రియముల కధి
తవు. మాతా ! నీవు నాపూజాగృహమునకు దయచేయుము.
క్తులుకూడ దయచేయవలెను. ఈశ్వరీ ! ఈప్రదేశమునకురమ్ము. దేవీ !
యీపూజాప్రతిమలోనికి దయచేయుము.

ఇట్లు దుర్గాదేవి నావాహనమొనరించి క్రిందిమంత్రములతో
హారస్తుతి నొనరింపవలెను. విప్రేంద్రా ! ఏకాగ్రచిత్తుడవై పరిహారస్తుతి
ధరింపుము.

## శ్రీ దుర్గాదేవీ పరిహార స్తుతి

స్వాగతం భగవత్యమ్బ శివలోకా చ్ఛివప్రియే ।
ప్రసాదం కురు మాం భద్రే భద్రకాలి నమోఽస్తు తే ॥

ధన్యోఽహం కృతకృత్యోఽహం సఫలం జీవనం మమ ।
ఆగతాఽసి యతో దుర్గే మాహేశ్వరి మదాలయమ్ ॥

అద్య మే సఫలం జన్మ సార్థకం జీవనం మమ ।
పూజయామి యతో దుర్గాం పుణ్యక్షేత్రే చ భారతే ॥

భారతే భవతీం పూజ్యాం యో బుధః పూజయేద్ సదా ।
సోఽన్తే యాతి చ గోలోకం పరమైశ్వర్యవా నిహ ॥

కృత్వా చ వైష్ణవీం పూజాం విష్ణులోకం వ్రజే త్సుధీః ।
మాహేశ్వరీం చ సంపూజ్య శివలోకం చ గచ్ఛతి ॥

సాత్త్వికీ రాజసీ చైవ త్రిథా పూజా చ తామసీ ।
భగవత్యాశ్చ వేదోక్తా చోత్తమా మధ్యమాఽధమా ॥

సాత్త్వికీ వైష్ణవానాం చ శాక్తాదీనాం చ రాజసీ ।
అదీక్షితానా మసతా మన్యేషాం తామసీ స్మృతా ॥

జీవహత్యావిహీనా యా వరా పూజా తు వైష్ణవీ ।
వైష్ణవా యాన్తి గోలోకం వైష్ణవీ వరదానతః ॥
మాహేశ్వరీ రాజసీ చ బలిదానసమన్వితా ।
శక్తాదయో రాజసాశ్చ కైలాసం యాన్తి తే తథా ॥
కిరాతా స్త్రిదివం యాన్తి తామస్యా పూజయా తయా ।
త్వమేవ జగతాం మాతా చతుర్వర్గఫలప్రదా ॥
సర్వశక్తిస్వరూపా చ కృష్ణస్య పరమాత్మనః ॥
జన్మమృత్యుజరావ్యాధిహరా త్వం చ పరాత్పరా ।
సుఖదా మోక్షదా భద్రా కృష్ణభక్తిప్రదా సదా ॥
నారాయణీ మహామాయే దుర్గే దుర్గతినాశిని ।
దుర్గేతి స్మృతిమాత్రేణ యాతి దుర్గం న నా మిహ ॥ 39-51

శివప్రియా ! భగవతీ ! అంబికా ! శివలోకమునుండి దయచేసిననీకు స్వాగతము, సుస్వాగతము. భద్రా ! నన్ను గరుణింపుము. భద్రకాళీ ! నీకు నమస్కారము. దుర్గా ! మహేశ్వరీ ! నీవు నాగృహమునకు దయచేసిన కారణమున నేను ధన్యుడ నైనాను, నాజీవనము సఫలమైనది. నేడు నాజన్మసఫలమైనది, నాజీవనము సార్థకమైనది; ఎందువలన ననగా బుణ్యక్షేత్ర మైన భారతవర్షములో నేను దుర్గాదేవిపూజ యొనరించుచున్నాను. ఏ విద్వాంసులు భారతవర్షములో బూజనీయురాలవైననిన్ను దుర్గాదేవిని బూజించెదరో, వారిహలోకములో నుత్తమైశ్వర్యసంపన్నులై సుఖించి, యంత్యకాలములో గోలోకపరంధామమును జేరెదరు. వైష్ణవీదేవిని బూజించి విద్వాంసులైనపురుషులు విష్ణులోకము జేరెదరు. మాహేశ్వరిని బూజించినవారు శివలోకము నొందెదరు. వేదములలో సాత్త్వికపూజయని, రాజసపూజయని, తామసపూజయని త్రివిధములైనపూజలు ప్రవచింపబడినవి, అవియే క్రమముగ నుత్తమము, మధ్యమాధమపూజ లనబడినవి. సాత్త్విక పూజలను వైష్ణవు లొనరించెదరు, శాక్తాదులు రాజసపూజ లొనరింతురు; మంత్రదీక్ష వహింపనియసత్పురుషు లొనరించు పూజయే తామసపూజ యనబడెను. ఏపూజ జీవహత్యారహితమై యొనరింపబడునో, యాపూజయే యత్యంతశ్రేష్ఠము. ఆపూజనే సాత్త్వికపూజయని, వైష్ణవారాధన యనిరి. వైష్ణవులు వైష్ణవదేవివరదానముచే గోలోకమును జేరెదరు. మాహేశ్వరీ

రాజసీపూజలందు బలిదాన మర్పింపబడును. శాక్తాదిరాజసపురుషు లట్టిపూజ లొనరించి కైలాసమునొందరు. కిరాతాదులు తామసపూజతో నిన్నారాధింతురు. తల్లీ ! నీవే జగములందు గలజీవులకు ధర్మార్థ కామమోక్షము లనెడుచతుర్విధపురుషార్థములను ప్రసాదింపగలదానవు. దేవీ ! నీవు శ్రీకృష్ణ పరమాత్మకు సర్వశక్తిస్వరూపిణివి. జన్మమృత్యుజరావ్యాధులను నివారింప గలపరాత్పరజననివి. సుఖదాయినివి, మోక్షదాయినివి, భద్రవు (కళ్యాణ కారిణివి); సదా శ్రీకృష్ణభక్తిప్రదాత్రివి. మహామాయా ! నారాయణీ ! దుర్గా ! నీవు దుర్గతులను నశింపజేయగలదానవు. దుర్గ యనుదివ్యనామ స్మరణమాత్రముననే మానవులదుర్గమకష్టము లన్నియు దూరముకాగలవు.

ఇట్లు పరిహారస్తుతి యొనరించి సాధకులు దేవీవామభాగమునపీఠముపై శంఖమునుంచవలెను. ఆశంఖములో దూర్వాపుష్పచందన మిళితజలముల నుంచవలెను. తదనంతరము ఆశంఖమును దక్షిణహస్తములో నుంచుకొని ప్రతి యీ మంత్రమును బఠింపవలెను.

పుణ్యస్త్వం శఙ్ఖపుణ్యానాం మఙ్గలానాం చ మఙ్గలమ్ ।
ప్రభూతః శఙ్ఖచూడా త్త్వం పురాకల్పే పవిత్రకః ॥ 54

"ఓ, శంఖమా నీవు పవిత్రవస్తువులందు పరమపవిత్రురాలవు, మంగళము లకేమంగళప్రదవు, పూర్వకాలమున శంఖచూడునినుండి యుత్పన్న మైనకారణ మున నీవు పరమపవిత్రురాలవు". ఈ విధానముతో నర్ఘ్యపాత్రను స్థాపించి యాయర్ఘ్యమును ప్రతి దేవి కర్పింపవలెను. తదనంతరము షోడశోపచార ముల నర్పించి భగవతిని బూజింపవలెను. సజలకుశములతో త్రికోణమండల మొనరించి యామండలములో నాదికూర్మమును, ఆదిశేషుని, వసుంధరను బూజింపవలెను. ఆ త్రికోణమండలములోపల బీఠము నుంచి పీఠముపై శంఖము నుంచవలెను. శంఖమును మూడుభాగములవఱకు జలముతో నింపి యాజల మును బూజించి యాజలములలోనికి గంగాదిదివ్యతీర్థముల నావాహన మొనరింపవలెను.

### దివ్యతీర్థావాహనమంత్రములు

గఙ్గే చ యమునే చైవ గోదావరి సరస్వతీ ।
నర్మదే సిన్ధు కావేరి చన్ద్రభాగేచ కౌశికి ॥

స్వర్ణరేఖే కనఖలే పారిభద్రే చ గణ్డకి ।
శ్వేతగఙ్గే చన్ద్రరేఖే పమ్పే చ గోమతి ॥
పద్మావతి త్రిపర్ణాశే విపాశే విరజే ప్రభే ॥
శతహ్రదే చేలగఙ్గే జలేఽస్మిన్ సంనిధిం కురు ॥ 58-60

గంగా ! యమునా ! గోదావరీ ! సరస్వతీ ! నర్మదా ! సింధూ ! కావేరీ ! చంద్రభాగా ! కౌశికీ !, స్వర్ణరేఖా ! కనఖలా ! పారిభద్రా ! గండకీ ! శ్వేతగంగా ! చంద్రరేఖా ! చంపా ! పంపా ! గోమతీ ! పద్మావతీ ! త్రిపర్ణాశా ! విపాశా ! విరజా ! ప్రభా ! శతహ్రదా ! చేలగంగా ! మీ రందఱు నీజలములో నివసింపుడు.

తదనంతర మాజలములో దులసీచందనముల నుంచి యగ్నిని, సూర్యుని, జంద్రుని, విష్ణుదేవుని, వరుణుని, శివుని, బూజింపవలెను. పిదప నాజలముతో సమస్తనైవేద్యములపై సంప్రోక్షణ మొనరింపవలెను. మంత్రములను బఠించుచు షోడశోపచారముల నర్పింపవలెను. ఆసనము, వసనము, పాద్యము, స్నానీయము, అనులేపనము, మధుపర్కము, గంధము, అర్ఘ్యము, పుష్పము, అభీష్టనైవేద్యము, ఆచమనీయము, తాంబూలము, రత్నమయభూషణములు, ధూపము, దీపము, శయ్య-ఇవియే షోడశోపచారము లనబడినవి.

### ఆ స న స మ ర్ప ణ మ ం త్ర ము

అమూల్యరత్ననిర్మితం నానాచిత్ర విరాజితమ్ ।
వరం సింహాసనశ్రేష్ఠం గృహ్యతాం శంకరప్రియే । 65

శంకరప్రియా ! అమూల్యరత్నములచే నిర్మితమై నానాప్రకార చిత్రములతో శోభించునీశ్రేష్ఠసింహాసనమును గ్రహింపుము.

### వ స్త్ర స మ ర్ప ణ మ ం త్ర ము

అనన్తసూత్రప్రభవ మీశ్వరేచ్ఛావినిర్మితమ్ ।
జ్వలదగ్నివిశుద్ధం చ వసనం గృహ్యతాం శివే ॥ 6

శివే ! అసంఖ్యాకసూత్రములలోఁగూర్చి యీశ్వరసంకల్పముచే నిర్మింపబడి ప్రజ్జ్వలితాగ్నికడ శుద్ధమొనరింపబడిన యీదివ్యవస్త్రములను స్వీకరింపుము.

### పాద్య సమర్పణ మంత్రము

అమూల్యరత్నపాత్రస్థం నిర్మలం జాహ్నవీజలమ్ ।
పాదప్రక్షాలనార్థాయ దుర్గే దేవి ప్రగృహ్యతామ్ ॥ 67

దుర్గాదేవీ ! బహుమూల్యరత్నమయపాత్రలో నుంచిననిర్మలగంగాజలములను పాదప్రక్షాళనార్థమై పాద్యరూపమున స్వీకరింపుము.

### స్నానీయ సమర్పణ మంత్రము

సుగన్ధాఽమలకీస్నిగ్ధద్రవ మేత త్సుదుర్ల భమ్ ।
సుపక్వం విష్ణుతైలం చ గృహాత్వాం పరమేశ్వరి ! 68

పరమేశ్వరీ ! సుగంధిలామలకస్నిగ్ధద్రవమును, బరమదుర్లభసుపక్వ విష్ణుతైలములను, స్నానీయసామగ్రులుగ నర్పించుచున్నాను. వీనిని స్వీకరింపుము.

### అనులేపన సమర్పణ మంత్రము

కస్తూరీకుఙ్కుమా క్తం చ సుగన్ధిద్రుమచన్దనమ్ ॥
సువాసితం జగన్మాత ర్గృహ్యతా మనులేపనమ్ ॥ 69.

జగదంబా! కస్తూరీకుంకుమలచే మిశ్రితమైనసుగంధిచందనద్రవము సువాసితానులేపనరూపమున సమర్పితము, దీనిని స్వీకరింపుము.

### మధుపర్క సమర్పణ మంత్రము

మాధ్వీకం రత్నపాత్రస్థం సుపవిత్ర సుమఙ్గలమ్ ।
మధుపర్కం మహాదేవి గృహ్యతాం ప్రీతిపూర్వకమ్ ॥ 70

మహాదేవీ! రత్నపాత్రలో నుంచబడి పరమపవిత్రమై పరమమంగళమయమైన మాధ్వీకము మధుపర్కరూపముగ సమర్పితము. దేవీ ! ప్రసన్నతాపూర్వకముగ నీమధుపర్కమును స్వీకరింపుము.

### గంధ సమర్పణ మంత్రము

సుగన్ధమూలచూర్ణం చ సుగన్ధద్రవసంయుతమ్ ।
సుపవిత్రం మఙ్గలార్హం దేవి గన్ధం గృహాణ మే ॥ 71

దేవీ ! విభిన్నవృక్షమూలములచూర్ణము గంధద్రవయుక్త మొనరింపబడి పరమపవిత్ర మొనరింపబడి మంగళోపయోగ మైనగంధరూపమున సమర్పితము. దీనిని స్వీకరింపుము.

ఆ ర్ఘ్య స మ ర్ప ణ మం త్ర ము

పవిత్రం శఙ్ఖపాత్రస్థం దూర్వాపుష్పాక్షతాన్వితమ్ ।
స్వర్గమన్దాకినీతోయ మర్ఘ్యం చణ్డి ! గృహాణ మే ॥ 72

చండీ ! పవిత్రశంఖపాత్రలో నుంచబడినస్వర్గగంగాజలములు దూర్వాపుష్పాక్షతయుక్తము లైనయీయర్ఘ్యజలములను, స్వీకరింపుము.

పు ష్ప స మ ర్ప ణ మ ం త్ర ము

సుగన్ధిపుష్పశ్రేష్ఠం చ పారిజాతతరూద్భవమ్ ।
నానాపుష్పాదిమాల్యాని గృహ్యతాం జగదమ్బికే ॥ 73

జగదంబా ! పారిజాతవృక్షములనుండి యుత్పన్నము లైనసుగంధపుష్పములతో, మాలతి మొదలగుకుసుమములతో నిర్మింపబడిన యీపుష్పమాలికలను గ్రహింపుము.

నై వే ద్య స మ ర్ప ణ మ ం త్ర ము

దివ్యం సిద్ధాన్న మామాన్నం పిష్టకం పాయసాదికమ్ ।
మిష్టాన్నం లడ్డుకఫలం నైవేద్యం గృహ్యతాం శివే ! ॥ 74

శివా ! దివ్యసిద్ధాన్నములు, ఆమాన్నములు, పిష్టకములు, పాయసాదులు, లడ్డులు, మఱియితరమిష్టాన్నకములు, సమయానుసారముగ లభించిన ఫలములు నైవేద్యరూపమున సమర్పితములు. దేవీ ! ఈనైవేద్యములను స్వీకరింపుము.

ఆ చ మ నీ య స మ ర్ప ణ మ ం త్ర ము

సువాసితం శీతతోయం కర్పూరాదిసుసంస్కృతమ్ ॥
మయా నివేదితం భక్త్యా గృహ్యతాం శైలకన్యకే ! ॥ 75

గిరిరాజనందినీ ! కర్పూరాదులచే సుసంస్కృతము లైనసువాసిత

శీతలజలములను నేనాచమనీయములుగ నీ కర్పించుచున్నాను. ఈయాచమనీయములను గ్రహింపుము.

తాంబూల సమర్పణ మంత్రము

గువావపర్ణచూర్ణం చ కర్పూరాదిసువాసితమ్ ।
సర్వభోగవరం రమ్యం తామ్బూలం దేవి గృహ్యతామ్ ॥ 76

దేవీ ! పోకచెక్కలను, దమలపాకులను, సున్నమును నేకత్రిత మొనరించి కర్పూరాదులచే నీతాంబూలము సువాసిత మొనరింపబడెను. ఈతాంబూలమే సమస్తభోగములందు శ్రేష్ఠము, రమణీయము. ఈతాంబూలమును స్వీకరింపుము.

రత్నమయ భూషణ సమర్పణ మంత్రము

అమూల్యరత్నసారైశ్చ ఖచితం చేశ్వరేచ్ఛయా ।
సర్వాఙ్గశోభనకరం భూషణం దేవి గృహ్యతామ్ ॥ 77

దేవీ ! అమూల్యరత్నసారతత్త్వముతో నీశ్వరేచ్ఛచే నిర్మితములైన సంపూర్ణాంగములను శోభాసంపన్న మొనరిలపగల యీరత్నమయాభరణములను గ్రహింపుము.

ధూప సమర్పణ మంత్రము

తరునిర్యాసచూర్ణం చ గన్ధవస్తుసమన్వితమ్ ।
హుతాశనశిఖాశుద్ధం ధూపంభోదేవి ! గృహ్యతామ్॥ 78

దేవీ ! వృక్షనిర్యాసచూర్ణమును సుగంధివస్తువులతో మిశ్రిత మొనరించి యగ్నిశిఖతో శుద్ధమొనరించి నీకు ధూపరూపమున సమర్పించుచున్నాను, కృపతో స్వీకరింపుము.

దీప సమర్పణ మంత్రము

దివ్యరత్నవిశేషం చ సాన్ద్రధ్వాన్తనివారకమ్ ।
సుపవిత్రం ప్రదీపం చ గృహ్యతాం పరమేశ్వరి ॥ 79

పరమేశ్వరీ ! ఘోరాంధకారమును దూర మొనరింపగల యీపరమపవిత్రదీపము దివ్యరత్నవిశేషము. ఈరత్నప్రదీపమును గ్రహింపుము.

శ య్యా స మ ర్ప ణ మ ం త్ర ము

రత్నసారగణాకీర్ణం దివ్యం పర్యఙ్క ముత్తమమ్ ।
సూక్ష్మవస్త్రైశ్చ సంస్యూతం దేవి తల్పం ప్రగృహ్యతామ్ ॥ 80

దేవీ ! ఈయుత్తమదివ్యపర్యంకము రత్నములసారతత్త్వముచే నిర్మింప బడెను. ఈతల్పముపై బట్టువస్త్రము లాచ్ఛాదితములై యున్నవి. ఈశయ్యను స్వీకరింపుము.

మునీశ్వరా ! ఇట్లు దుర్గాదేవిని భజించి యామెకు బుష్పాంజలులను సమర్పింపవలెను. అనంతరము దేవీసహచారిణు లైనయష్టనాయికలను యత్నపూర్వకముగ బూజింపవలెను. ఉగ్రచండా, ప్రచణ్డాగ్రా, చణ్డోగ్రా, చణ్డనాయికా, అతిచణ్డా, చాముణ్డా, చణ్డా, చణ్డవతీ యనువీరే యష్ట నాయికలు. ఈ శక్తుల నష్టదళకమలముపై బూర్వాదిశాదిక్రమముగ స్థాపించి పంచోపచారములద్వారమున బూజింపవలెను. వీరిని దళాగ్రభాగము లలో నావాహన మొనరింపవలెను. దళములమధ్యభాగములో భైరవులను బూజింపవలెను. మహాభైరవుడు, సంహారభైరవుడు, అశితాఙ్గభైరవుడు, రురు భైరవుడు, కాలభైరవుడు, క్రోధభైరవుడు, తామ్రచూడభైరవుడు, చంద్ర చూడభైరవుడు-వీరే భైరవు లనబడిరి. వీరందరిని బూజించి యష్టదళమధ్య కర్ణికలో నవశక్తులను బూజింపవలెను. క్రమ మేమనగా నష్టదళములలో నష్టశక్తులను, మధ్యకర్ణికలో నవమశక్తిని స్థాపించి పూజింపవలెను. బ్రహ్మాణి, వైష్ణవి, రౌద్రి, మాహేశ్వరి, నారసింహి, వారాహి, ఇంద్రాణి, కార్తికి (కౌమారి), వీరే యష్టశక్తులు. వీరందఱికి బ్రధానశక్తి యైననవమశక్తియే సర్వశక్తిస్వరూపిణి యైనసర్వమంగళ. ఈ నవ శక్తులను భక్తిభావముతో బూజించి పిదప గలశములో దేవతలను బూజింపవలెను. శంకరుని, గార్తికే యుని, సూర్యుని, జంద్రుని, నగ్నిని, వాయువును, వరుణుని, దేవియొక్క చెలిని, వటువును, నలుబదియాఱుగురు యోగినులను విధిపూర్వకముగ బూజించి యుప హారముల నర్పింపవలెను.

తదనంతరము వ్రతి దుర్గాదేవిని స్తుతించి యామె కవచమును భక్తిపూర్వకముగ బఠించి గళమున ధరింపవలెను. ఇట్లు దుర్గాదేవి

పూజ సంపన్నమొనరించి ప్రతిదేవికి సాష్టాంగదండప్రణామము లర్పించి బ్రాహ్మణులకు దక్షిణ లొసంగవలెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతి ఖండములోని నారదనారాయణ సంవాద
మున శ్రీదుర్గాదేవి పూజావిధానము,
ధ్యానము, స్తోత్రము నను
అఱువదినాలుగవ అధ్యాయము
సంపూర్ణము

—+—

# అఱువదియైదవ అధ్యాయము

## సురథునకు దుర్గాదేవ్యనుగ్రహముచే జ్ఞానము కలుగుట.

నారదుడు పలికెను:

మహాభాగా! తమరు ప్రవచించినప్రవచనము లన్నియు నమృతము కంటె నత్యంతమధురాతిమధురములు, సర్వోత్తమములు. ప్రభూ! దుర్గా దేవిస్తోత్రమును, గవచమును, బూజాఫలాదులను గృపతో నుప దేశింపుడు.

శ్రీనారాయణ ఋషి పలికెను:

నారదా! ఆర్ద్రానక్షత్రములో దేవిని మేల్కొల్పవలెను, మూలానక్షత్ర ములో నామె నొకప్రతిమలోని కావాహన మొనరింపవలెను. ఉత్తరాషాఢా నక్షత్రములో బూజయొనరించి శ్రవణాంతమున దేవిని విసర్జింపవలెను. ఆర్ద్రా నక్షత్రయుక్తనవమీతిథియందు దేవిని మేల్కొల్పి యొక్కపర్యాయమైనను బూజించిన మనుష్యునకు నూఱుసంవత్సరములపూజాఫలము ప్రాప్తించును. మూలానక్షత్రమున భగవతి నారాధించిన యజ్ఞఫలము లభించును. ఉత్త రాషాఢానక్షత్రములో నారాధించిన వాజపేయయజ్ఞ ఫలము ప్రాప్తించును.

శ్రవణానక్షత్రములో దేవిని విసర్జించిన మనుష్యుడు పుత్రపౌత్రవంతుడై నిస్సంశయముగ పరమైశ్వర్యసంపన్నుడు కాగలడు. దేవీపూజవలన మనుష్యునకు బృథ్వీప్రదక్షిణపుణ్యము లభించును. తిథితోనార్ద్రానక్షత్రసంయోగమైనశుభసమయమున కేవలము నవమీదినమున దేవిని మేల్కొల్పి మనుష్యుడొకపక్షపర్యంతము పూజ లొనరించిన వాని కశ్వమేధయజ్ఞఫలము సంప్రాప్తించును. అట్టిదశలో నవమీదినమున బూజించి దశమీదినమున విసర్జనమొనరింపవలెను. సప్తమీదినమున బూజించి విద్వాంసుడైనపురుషుడు బలిని సమర్పింపవచ్చును. అష్టమీదినమున బలిరహితమైనపూజయే యుత్తమ మనబడెను. అష్టమీదినమున బలి నర్పించినమనుష్యులకు విపత్తులు సంభవించును. విద్వాంసులు నవమీదినమున భక్తిభావముతో విధిపూర్వకముగ బలి నర్పింపవచ్చును. బలి యనగా జీవహింస కాదు. మానవుడు భగవతిసమక్షములో దనదుర్గుణములను విసర్జించుటయే బలి. విప్రవరా ! ఇట్టిబలి నర్పించినమానవులకుమాత్రమే దుర్గ ప్రసన్నురాలు కాగలదు.

హింసాజన్యం స పాపం చ లభతే నాత్ర సంశయః ।
యో యం హన్తి స తం హన్తి చేతి వేదోక్తమేవచ ॥ 10

హింసాయుక్తమైనబలి నర్పించినమానవునకు నిస్సంశయముగ ఘోర పాపము సంభవింపగలదు ఎవరెవరిని వధింతురో యావధింపబడినప్రాణి జన్మాంతరములో వధించినవానిని మరల వధించునని వేదప్రవచనము.

కుర్వన్తి వైష్ణవీం పూజాం వైష్ణవా స్తేన హేతునా ॥ 12

ఈకారణమువలననే వైష్ణవజనులు వైష్ణవీ (హింసారహిత) పూజల నొనరింతురు.

ఇట్లొకసంవత్సరపర్యంతము రాజు భక్తిభావముతో దేవి నారాధించి గళమునందు గవచమును ధరించి పరమేశ్వరిని స్తుతించెను. రా జొనరించిన స్తోత్రమునకుభగవతి సంతుష్టురాలై తనదివ్యదర్శన మొసంగెను. అనంతకోటి ప్రచండసూర్యప్రభాసమానురాలైనభగవతీ దుర్గను రాజు తనసమక్షమున దర్శించెను. ఆ తేజఃస్వరూపిణి దివ్యగుణసగుణ, ప్రాకృతగుణనిర్గుణ, పరాదేవి, భగవతి దుర్గ తేజోమండలమధ్యభాగమున విరాజల్లుచు నత్యంతకమనీయ స్వరూపిణిగ రాజునకు దర్శనమొసంగెను భక్తానుగ్రహకారిణి, కృపాస్వరూపిణి, స్వేచ్ఛామయి యైనభగవతిని దర్శించి రాజేంద్రుడు పరమానంద

భరితుడై శిరమును వంచి హస్తములను ముకుళించి మరల ననేకవిధముల దేవిని స్తుతించెను. రాజొనరించినస్తోత్రములకు సంతుష్టురాలై జగదంబ మందస్మితముఖారవిందముతో రాజేంద్రుని సంబోధించుచు కృపాపూర్వకముగ సత్యవచనముల నిట్లు పల్కెను.

శ్రీ ప్ర కృ తి ప లి కె ను :

రాజా ! నీవు నాదివ్యసందర్శనమును బొందియు నుత్తమవైభవములను మాత్రమే యర్థించుచున్నావు. నీకభీష్టములను నేను నీ కనుగ్రహించుచున్నాను. మహారాజా ! నీవు నీసమస్తశత్రువులను నిర్జించి నిష్కంటకుడవై చక్రవర్తివి కాగలవు. మనుజన్మములో నీవు సావర్ణివై జన్మించి యష్టమమనుపదమును బొందగలవు. నరేశ్వరా ! నీవు నన్నారాధించి శ్రీకృష్ణభక్తిసామ్రాజ్యమున కర్హుడవైతివి, కావున నేను నీకు మహాజ్ఞానమును బ్రసాదించెను. రాజా ! నీకు నేను శ్రీకృష్ణపరమాత్మభక్తిని, దాస్యసౌభాగ్యములనుగూడ బ్రసాదించెదను.

వృణోతి విభవం యో హి సాక్షిన్మాం ప్రాప్య మన్దధీః ।
మాయయా వంచితః సోఽపి విషమత్త్యమృతం త్యజన్ ॥21

మందబుద్ధియైనమానవుడు సాక్షాత్తుగ నాదివ్యసందర్శనమును బొందియు కేవలము వైభవములనే యర్థించుచో ఆతడు మాయచే మోసగింపబడినవా డనిభావింపవలెను. కావుననే యట్టివాడమృతమును ద్యజించి విషమును భుజించును.

బ్రహ్మాదిస్తమ్బపర్యన్తం సర్వం నశ్వరమేవ చ ।
నిత్యం సత్యం పరం బ్రహ్మ కృష్ణం నిర్గుణమేవ చ ॥

బ్రహ్మవిష్ణుశివాదీనా మహ మాద్యా పరాత్పరా।
సగుణా నిర్గుణా చాపి వరా స్వేచ్ఛామయీ సదా ॥

నిత్యానిత్యా సర్వరూపా సర్వకారణకారణమ్ ।
బీజరూపా చ సర్వేషాం మూలప్రకృతి రీశ్వరీ ॥ 22–24

బ్రహ్మాదులు మొదలు కీటకపర్యంతము గలసకలజగములు నశ్వరములు; కేవలము ప్రాకృతనిర్గుణుడైన శ్రీకృష్ణపరబ్రహ్మమే నిత్యుడు, సత్యుడు. బ్రహ్మవిష్ణుశివాదుల కాదిజననియైనపరత్పరప్రకృతిని నేనే. నేను దివ్యగుణసగుణ

స్వరూపిణిని, ప్రాకృతగుణనిర్గుణురాలను, శ్రేష్ఠురాలను, సదా స్వేచ్ఛామయిని నిత్యానిత్యసర్వరూపస్వరూపిణిని, సర్వకారణకారణురాలను, సర్వులకు బీజస్వరూప మైనమూలప్రకృతి యగునీశ్వరిని.

> పుణ్యే బృన్దావనే రమ్యే గోలోకే రాసమణ్డలే ।
> రాధా ప్రాణాధికాఽహం చ కృష్ణస్య పరమాత్మనః ॥
>
> అహం దుర్గా విష్ణుమాయా బుద్ధ్యధిష్ఠాతృదేవతా ।
> అహం లక్ష్మీశ్చ వైకుణ్ఠే స్వయం దేవీ సరస్వతీ ॥
>
> సావిత్రీ వేదమాతాఽహం బ్రహ్మాణీ బ్రహ్మలోకతః ।
> అహం గఙ్గా చ తులసీ సర్వాధారా వసుంధరా ॥
>
> నానావిధాఽహం కలయా మాయయా సర్వయోషితః ।
> సాఽహం కృష్ణేన సంసృష్టా నృప భ్రూభఙ్గలీలయా॥ 25-28

రమణీయగోలోకములో పుణ్యమయబృందావనాంతర్గత రాసమండలములో శ్రీకృష్ణపరమాత్మప్రాణాధికప్రియరాధను నేనే. నేనే దుర్గను, విష్ణుమాయను, బుద్ధి కధిష్ఠాత్రీదేవతను. వైకుణ్ఠములో నేనే లక్ష్మిని; సాక్షాత్తుగా సరస్వతిని, బ్రహ్మలోకములో నన్నే బ్రహ్మాణియని, వేదమాత యగుసావిత్రి యని కీర్తింతురు. నేనే గంగను, తులసిని, సర్వులకు నాధారమైన వసుంధరను. నరేశ్వరా! నేనే నా బహువిధ కళలమూలమున సర్వస్త్రీలరూపములను ధరించి యున్నాను. మాయవలన సర్వస్త్రీలరూపములలో నేనే ప్రాదుర్భవించి యున్నాను. పరమపురుషుడైన శ్రీకృష్ణపరమాత్మ తనభ్రూభంగలీలతో నన్ను సృష్టించెను.

> భ్రూభఙ్గలీలయా సృష్టో యేన పుంసా మహాన్విరాట్ ।
> లోమ్నాం కూపేషు విశ్వాని యస్య సన్తి హి నిత్యశః ॥
>
> అసంఖ్యాని చ తాన్యేవ కృత్రిమాణి చ మాయయా ।
> అనిత్యే నిత్యబుద్ధిం చ సర్వే కుర్వన్తి సంతతమ్ ॥
>
> సప్తసాగరసంయుక్తా సప్తద్వీపా వసుంధరా ।
> తదధః సప్తపాతాలాః స్వర్లోకాశ్చైవ సప్త సు ॥
>
> ఏవం విశ్వం బహువిధం బ్రహ్మాణ్డం బ్రహ్మణా కృతమ్ ।
> ప్రత్యేకం సర్వబ్రహ్మాణ్డే బ్రహ్మవిష్ణుశివాదయః ॥ 29-32

ఎవనిరోమకూపములలో నసంఖ్యాకబ్రహ్మాండములు సదా వర్తమాన

ములై యుండునో, యామహావిరాట్పురుషుని బురుషోత్తము డైన శ్రీకృష్ణపర మాత్మయే తనభ్రూభంగలీలామాత్రమున సృష్టించెను. ఆబ్రహ్మాండము లన్నియు కృత్రిమములు, నశాశ్వతములు, ననిత్యములు. అయినను మాయా మోహితు లైన దేహధారు లాయనిత్యవిశ్వములందు సదా నిత్యబుద్ధి వహింతురు. సప్తద్వీపవతి, సప్తసముద్రసంయుక్త యైనపృథ్వికి నూర్ధ్వభాగమున సప్తస్వర్గములు, నధోభాగమున సప్తపాతాళములు కలవు. ఈచతుర్దశభువనము లన్నియు గలసి యొకవిశ్వబ్రహ్మాండమనబడెను. ఈబ్రహ్మాండము బ్రహ్మ వలన సృష్టింపబడును. ఇట్టిబ్రహ్మాండము లసంఖ్యాకములుగలవు. ప్రతిబ్రహ్మాండమందు బ్రహ్మవిష్ణుశివాదిదేవత లందఱు నివసింతురు.

సర్వేషా మీశ్వరః కృష్ణ ఇతి జ్ఞానం పరాత్పరమ్ ।
వేదానాం చ వ్రతానాం చ తీర్థానాం తపసాం తథా॥

దేవానాం చైవ పుణ్యానాం సారః కృష్ణ ఇతి స్మృతః ।
తద్భక్తిహీనో యో మూఢః స చ జీవన్మృతో ధ్రువమ్॥

పవిత్రాణి చ తీర్థాని తద్భక్తస్పర్శవాయునా ।
తన్మన్త్రోపాసకశ్చైవ జీవన్ముక్త ఇతి స్మృతః ॥

మన్త్రగ్రహణమాత్రేణ నరో నారాయణో భవేత్ ।
వినా జపేన తపసా వినా తీర్థేన పూజయా ॥

మాతామహానాం శతకం పితౄణాం చ సహస్రకమ్ ।
పుంసామేవం సముద్ధృత్య గోలోకం చ స గచ్ఛతి ॥

ఇదం జ్ఞానం సారభూతం కథితం తే నరాధిప ।
మన్వన్తరాన్తే భోగాన్తే భక్తిం దాస్యామి తే హరౌ ॥

నాఽభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి ।
అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్ ॥

అహం య మనుగృహ్ణామి తస్మై దాస్యామి నిర్మలమ్ ।
నిశ్చలాం సుదృఢాం భక్తిం శ్రీకృష్ణే పరమాత్మని ॥

కరోమి వంచనాం యం యం తేభ్యో దాస్యామి సంపదమ్।
ప్రాతఃస్వప్నస్వరూపాం చ మిథ్యేతి భ్రమరూపిణీమ్॥33-41

ఈసకలవిశ్వబ్రహ్మాండములకును, సర్వులకును నైకైకేశ్వరుడు భగవాను డైన శ్రీకృష్ణపరమాత్మయే యని దెలిసికొనుటయే పరాత్పరజ్ఞానము. సకల

వేదములయు వ్రతములయు, దీర్ఘస్నానాదులయు, దైవారాధనలయు, బుణ్యాములసారతత్త్వము కేవలము శ్రీకృష్ణుడేయని గ్రహింపుము. శ్రీకృష్ణభక్తిహీను డైనమూఢమానవుడు జీవించియున్నను నిశ్చయముగ మృతునితో సమానమే. శ్రీకృష్ణభక్తులను స్పృశించి ప్రవహించువాయుస్పర్శమాత్రముననే సకలతీర్థములు పవిత్రములు కాగలవు. శ్రీకృష్ణమంత్రోపాసకులే జీవన్ముక్తులని శ్రుతులు నొక్కివక్కాణించుచున్నవి. తపోజపాదులను దీర్ఘసేవనములను, బూజాదులను నొనరింపకున్నను గేవలము శ్రీకృష్ణదివ్యమంత్రమును గ్రహించి శ్రీహరినామసంకీర్తన మొనరించినమాత్రముననే నరుడు నారాయణుడు కాగలడు. శ్రీకృష్ణభక్తుడు తనమాతామహునివంశములో నూఱుతరముల వారిని, దండ్రివంశములో వేయితరములవారిని నుద్ధరించి స్వయముగ గోలోకమును జేరగలడు. నరేశ్వరా! ఈసకలసారభూత మైనదివ్యజ్ఞానమును నేను నీ కుపదేశించితిని. సావర్ణివై జన్మించి మనుపదము నధిష్ఠించి నీవు సకలప్రారబ్ధముల ననుభవించి భోగరహితుడ వైనసమయములో నేను నీకు శ్రీహరి భక్తిని బ్రసాదింపగలను. కర్మలఫలము లనుభవింపనిదే కోటానుకోట్ల కల్పములు వ్యతీతములైన నవి క్షీణింపవు. తా నొనరించినశుభాశుభకర్మఫలములను మానవు డవశ్య మనుభవింపక తప్పదు. నే నెవరి ననుగ్రహింతునో వారికే శ్రీకృష్ణపరమాత్మయెడల నిర్మల నిశ్చలసుదృఢభక్తిని బ్రసాదింతును. నేనెవరిని వంచింపవలెనని సంకల్పింతునో వారికి బ్రాతఃకాలస్వప్నసదృశములు, మిథ్యలు, చంచలములు, భ్రమరూపములునైనసంపదలను బ్రసాదింతును. కుమారా! నీయెడల గలయనుగ్రహముచే నేను నీకీయఖండజ్ఞానోపదేశ మొనరించితిని. ఇక సుఖముగ మరలిపొమ్ము.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

ఇట్లు భగవతీ దుర్గ నరేశ్వరు ననుగ్రహించి యంతర్హితురాలయ్యెను. రాజ్యప్రాప్తి వరమును బొంది రాజు దేవి కనేకనమస్కారముల నర్పించి స్వస్థలమునకు మరలిపోయెను. కుమారా! నారదమునీంద్రా! ఇట్లు నేను దుర్గాదేవి పరమోత్తమ దివ్యోపాఖ్యానమును బ్రవచించితిని.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి ప్రకృతిఖండములోని నారదనారాయణసంవాదమున దుర్గాసురథ సంవాదమున జ్ఞానకథనమును అఱువదియైదవ అధ్యాయము సంపూర్ణము

# అఱువదియాఱవ అధ్యాయము

## శ్రీకృష్ణు డొనరించినశ్రీదుర్గాదేవిస్తోత్రము

నా ర దు డు ప లి కె ను :

మునిసత్తమా! నేను సర్వమును శ్రవణమొనరించితిని. నేను వినుట కవశిష్టమైన దేదియు లేదు, ఇది నిశ్చయము. కాని, దేవా! ప్రకృతి దేవి దివ్యస్తోత్రమును, బరమాద్భుత కవచమును నా కుపదేశింపుడని ప్రార్థించు చున్నాను.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా! గోలోకాంతర్గతరాసమండలములో వసంతఋతుసమయములో బ్రప్రథమమున శ్రీకృష్ణపరమాత్మయే యత్యంతప్రసన్నతాపూర్వకముగ శ్రీదుర్గాదేవీపూజలను సంపన్నమొనరించి యామెను స్తుతించెను. మధుకైటభులతో యుద్ధము సంభవించినపుడు విష్ణుభగవానుడు రెండవపర్యాయము దేవిని స్తుతించెను. మూడవపర్యాయ మా ప్రాణసంకటావసరకాలమందే జగత్స్రష్ట బ్రహ్మ దుర్గను స్తుతించెను. మునీశ్వరా! నాల్గవపర్యాయము త్రిపురారి యైనశివుడు త్రిపురాసురఘోరసంగ్రామము లో విజయార్థియై భక్తిభావముతో దేవిని స్తుతించెను. ఐదవపర్యాయములో ఘోరప్రాణసంకట సమయమున వృత్రాసురసంగ్రామములో విజయార్థియై సకల దేవతాసహితముగ మహేంద్రుడు దుర్గాదేవిని స్తుతించెను. తదనంతరము మునీంద్రులు, మనువులు సురథరాజాదులు మనుష్యులు ప్రతికల్పమందు నప్పరాత్పర పరమేశ్వరిని బూజించి స్తుతింప నారంభించిరి. సర్వవిఘ్నవినాశకము, సుఖదాయకము, మోక్షదాయకము, సకలసారము, భవసంతరణకారణ మైన శ్రీదుర్గాదేవి దివ్యస్తోత్రము నుపదేశించెద బ్రాహ్మణోత్తమా! సావధానుడవై శ్రవణ మొనరింపుము

### శ్రీ కృ ష్ణ కృ తం దు ర్గా స్తో త్ర మ్

త్వమేవ సర్వజననీ మూలప్రకృతి రీశ్వరీ ।
త్వమే వాऽऽద్యా సృష్టివిధౌ స్వేచ్ఛయా త్రిగుణాత్మికా॥

కార్యార్థే సగుణా త్వం చ వస్తుతో నిర్గుణా స్వయమ్ ।
పరబ్రహ్మస్వరూపా త్వం సత్యా నిత్యా సనాతనీ ॥

తేజ స్స్వరూపా పరమా భక్తానుగ్రహవిగ్రహా।
సర్వస్వరూపా సర్వేశా సర్వాధారా పరాత్పరా ॥

సర్వబీజస్వరూపా చ సర్వపూజ్యా నిరాశ్రయా ।
సర్వజ్ఞా సర్వతోభద్రా సర్వమఙ్గలమఙ్గలా ॥

సర్వబుద్ధిస్వరూపా చ సర్వశక్తిస్వరూపిణీ ।
సర్వజ్ఞానప్రదా దేవీ సర్వజ్ఞా సర్వభావినీ ॥

త్వం స్వాహా దేవదానే చ పితృదానే స్వధా స్వయమ్।
దక్షిణా సర్వదానే చ సర్వశక్తిస్వరూపిణీ ॥

నిద్రా త్వం చ దయా త్వం చ తృష్ణా త్వం చాఽఽత్మనః ప్రియా ।
క్షుత్క్షాన్తిః శాన్తి రీశా చ కాన్తిః సృష్టిశ్చ శాశ్వతీ ॥

శ్రద్ధా పుష్టిశ్చ తన్ద్రా చ లజ్జా శోభా ప్రభా తథా ।
సతాం సంపత్స్వరూపా శ్రీ ర్విపత్తి రసతా మిహ ॥

ప్రీతిరూపా పుణ్యవతాం పాపినాం కలహాఙ్కురా ।
శశ్వత్కర్మమయీ శక్తిః సర్వదా సర్వజీవినామ్ ॥

దేవేభ్యః స్వపదోదాత్రీ ధాతు ర్ధాత్రీ కృపామయీ ।
హితాయ సర్వదేవానాం సర్వాసుర వినాశినీ ॥

యోగనిద్రా యోగరూపా యోగదాత్రీ చ యోగినామ్ ।
సిద్ధిస్వరూపా సిద్ధానాం సిద్ధిదా సిద్ధయోగినీ ॥

మాహేశ్వరీ చ బ్రహ్మాణీ విష్ణుమాయా చ వైష్ణవీ ।
భద్రదా భద్రకాళీ చ సర్వలోకభయంకరీ ॥

గ్రామే గ్రామే గ్రామదేవీ గృహదేవీ గృహే గృహే ।
సతాం కీర్తిః ప్రతిష్ఠా చ నిన్దా త్వ మసతాం సదా ॥

మహాయుద్ధే మహామారీ దుష్టసంహారరూపిణీ।
రక్షాస్వరూపా శిష్టానాం మాతేవ హితకారిణీ ॥

వన్ద్యా పూజ్యా స్తుతా త్వం చ బ్రహ్మాదీనాం చ సర్వదా ।
బ్రాహ్మణ్యరూపా విప్రాణాం తపస్యా చ తపస్వినామ్॥

విద్యా విద్యావతాం త్వం చ బుద్ధి ర్బుద్ధిమతాం సతామ్ ।
మేధా స్మృతిస్వరూపా చ ప్రతిభా ప్రతిభావతామ్ ॥

రాజ్ఞాం ప్రతాపరూపా చ విశాం వాణిజ్యరూపిణీ ।
సృష్టౌ సృష్టిస్వరూపా త్వం రక్షారూపా చ పాలనే ॥

తథాఽన్తే త్వం మహామారీ విశ్వే విశ్వైశ్చ పూజితే
కాలరాత్రి ర్మహారాత్రి ర్మోహరాత్రిశ్చ మోహినీ ॥

దురత్యయా మే మాయా త్వం యయా సమ్మోహితం జగత్
యయా ముగ్ధో హి విద్వాంశ్చ మోక్షమార్గం న పశ్యతి ॥

ఇత్యాత్మనా కృతం స్తోత్రం దుర్గాయా దుర్గనాశనమ్ ।
పూజాకాలే పఠే ద్యో హి సిద్ధి ర్భవతి వాఞ్ఛితా ॥

వన్ధ్యా చ కాకవన్ధ్యాచ మృతవత్సా చ దుర్భగా ।
శ్రుత్వా స్తోత్రం వర్ష మేకం సుపుత్రం లభతే ధ్రువమ్ ।

కారాగారే మహాఘోరే యో బద్ధో దృఢబన్ధనే ।
శ్రుత్వా స్తోత్రం మాస మేకం బన్ధనా న్ముచ్యతే ధ్రువమ్॥

యక్ష్మగ్రస్తో గలత్కుష్ఠీ మహాశూలీ మహాజ్వరీ ।
శ్రుత్వా స్తోత్రం వర్ష మేకం సద్యో రోగా త్ప్రముచ్యతే ॥

పుత్రభేదే ప్రజాభేదే పత్నీభేదే చ దుర్గతః ।
శ్రుత్వా స్తోత్రం మాస మేకం లభతే నాత్ర సంశయః ॥

రాజద్వారే శ్మశానే చ మహారణ్యే రణస్థలే ।
హింస్రజన్తుసమీపే చ శ్రుత్వా స్తోత్రం ప్రముచ్యతే ॥

గృహదాహే చ దావాగ్నౌ దస్యుసైన్యసమన్వితే ।
స్తోత్రశ్రవణమాత్రేణ లభతే నాత్ర సంశయః ॥

మహాదరిద్రో మూర్ఖశ్చ వర్షం స్తోత్రం పఠేత్తు యః ।
విద్యావా న్ధనవాంశ్చైవ స భవే న్నాత్ర సంశయః ॥ 8-34

దేవీ ! నీవే సర్వులకు జననివి, మూలప్రకృతివి, ఈశ్వరివి. నీవే సృష్టికార్యములో నాద్యశక్తివి. నీవు నీసంకల్పముచే త్రిగుణాత్మిక వైతివి. సృష్టికార్యమునకై రూపమును ధరించితివి. వాస్తవముగ స్వయముగ నీవు నిర్గుణవు. నీవు సత్యస్వరూపిణివి, నిత్యురాలవు, సనాతనివి, పరబ్రహ్మస్వరూపిణివి. పరమతేజస్స్వరూపిణివి. భక్తుల ననుగ్రహించుటకే దివ్యరూపమును ధరించినదానవు; నీవు సర్వస్వరూపిణివి, సర్వేశ్వరివి, సర్వాధారవు, పరాత్పరవు నీవే సర్వబీజ స్వరూపిణివి, సర్వపూజ్యురాలవు, నిరాశ్రయవు, సర్వజ్ఞురాలవు, సర్వతోభద్రురాలవు (సర్వమంగళమయురాలవు),

సర్వమంగళ మంగళవు. దేవి! నీవే సర్వబుద్ధి స్వరూపిణివి, సర్వశక్తి స్వరూపిణివి, సర్వజ్ఞానప్రదవు, సర్వజ్ఞురాలవు, సర్వుల సుత్పన్న మొనరింపగల శక్తివి. దేవతలకు హవిష్యదాన నిమిత్తమై నీవే స్వాహాదేవి వైతివి, పితరులకు శ్రాద్ధార్పణనిమిత్తమై నీవే స్వయముగ స్వధాదేవి వైతివి. సర్వదానములందు నీవే దక్షిణవు, సర్వశక్తులు నీ స్వరూపములే. నీవు నిద్రవు, దయవు, మనమునకు ప్రియురాల వైనతృష్ణవు. క్షుధా, క్షమా, శాంతి, ఈశ్వరి, కాంతి, శాశ్వతి, సృష్టి, ప్రభృతి రూపము లన్నియు నీవే. నీవే శ్రద్ధవు, పుష్టివి, తంద్రవు, లజ్జవు, శోభవు, దయవు. సత్పురుషుల చెంత సంపత్తివి, దుష్టుల గృహములలో విపత్తివికూడ నీవే. నీవే పుణ్యాత్ములకు ప్రీతిరూపిణివి, పాపులకు గలహాంకురరూపిణివి. మఱియు సమస్త జీవులందు గర్మమయశక్తివికూడ నీవే. దేవతలకు స్వపదమును ప్రసాదించిన జననివి నీవే. ధాతనుగూడ (బ్రహ్మనుగూడ) బాలించి పోషించు దయామయి ధాత్రివి నీవే. దేవతల హితార్థమై నీవే సమస్తాసురులను వధించిన దానవు. నీవు యోగనిద్రవు, యోగము నీస్వరూపమే. నీవే యోగులకు సిద్ధిప్రదాయనివి, సిద్ధయోగినివి. నీవే బ్రహ్మణివి, మహేశ్వరివి, విష్ణుమాయవు, వైష్ణవీశక్తివి, భద్రప్రదాయనివి, భద్రకాళివి, సకలలోక భయంకరివి, గ్రామగ్రామములందు గ్రామదేవతవు. నీవే ప్రతిష్ఠవు. దుష్టులయెడ నొనరింపబడు నిందలుకూడ నీస్వరూపములే. మహాయుద్ధములలో నీవు దుష్టసంహారరూపిణి వైనమహామారివి, కాని శిష్టపురుషులకు మాతృదేవతవలె బరమహితకారిణివి, మఱియు రక్షా స్వరూపిణివి. బ్రహ్మాదిదేవత లందఱు నిన్ను బూజించుచు, స్తుతించుచు, నీకు వందనము లర్పింతురు. బ్రాహ్మణుల బ్రాహ్మణత్వము నీవే. తాపసుల తపముకూడ నీవే. విద్వాంసుల విద్యవు నీవే. బుద్ధిమంతుల బుద్ధివి నీవే. సత్పురుషుల మేధస్సు, స్మృతి నీ స్వరూపములే. ప్రతిభాశాలు లైన వారిప్రతిభ నీ స్వరూపమే. దేవీ! రాజుల ప్రతాపము నీవే, వైశ్యుల వాణిజ్యము నీ స్వరూపమే. విశ్వపూజితా! సృష్టికాలములో నీవే సృష్టిస్వరూపిణివి, పాలనకాలములో నీవే రక్షాస్వరూపిణివి, నీవే సంహార కాలములో విశ్వముల వినాశ మొనరించు మహామారీరూపిణివి. నీవే కాళరాత్రివి, మహారాత్రివి, మోహరాత్రివి, మోహినివి; నీవే తరింపుటకసాధ్యమైన మాయవు, నీవే సర్వజగములను మోహమునందు

బడ వైచితివి. నీ మాయచే మోహితులై, ముగ్ధులై విద్వాంసులు సహితము మోక్షమార్గమును గానలేకున్నారు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

ఇట్లు శ్రీకృష్ణపరమాత్మచే స్తుతింపబడిన దుర్గాదేవియొక్క సంకటనాశన మనెడి యీ స్తోత్రము నెవరు పూజాకాలమందు బఠింతురో వారి సకలమనోభీష్టములు సంపన్నములై సర్వసిద్ధి కలుగును. వంధ్యయైనను, గాకవంధ్యయైనను, మృతవత్సయైనను దౌర్భాగ్యురాలైనను నీ స్తోత్రము నొక సంవత్సర పర్యంతము భక్తితో శ్రవణమొనరించిన శ్రీకి సత్సంతానము కల్గును. అత్యంత ఘోరకారాగారములో దృఢబంధనములచే బంధింపబడినవ్యక్తి యొకమాసపర్యంత మీస్తోత్రశ్రవణమొనరించిన నిశ్చయముగ బంధవిముక్తుడు కాగలడు. క్షయరోగియైనను, గలితకుష్ఠురోగియైనను, మహాజ్వరపీడితుడైనను, నీ దివ్యస్తోత్రము నొకసంవత్సరకాలము శ్రవణమొనరించిన శీఘ్రముగ రోగవిముక్తుడు కాగలడు. పుత్రులతోగాని, ప్రజలతోగాని, పత్నితోగాని కలహము సంభవించిన నొకమాసపర్యంత మీస్తోత్రశ్రవణమాత్రముననే యాసర్వసంకటములనుండి నిస్సంశయముగ విముక్తులుకాగలరు. రాజద్వారమందుగాని, శ్మశానమందుగాని, విశాల వనమందుగాని, రణక్షేత్రము నందుగాని, క్రూర జంతు సమీపమందుగాని, కష్టములపాలైన వారీదివ్యస్తోత్రశ్రవణమాత్రమున సంకటవిముక్తులు కాగలరు. గృహమున కగ్నిప్రమాదము సంభవించిన, దావానలమందు జిక్కిన, దస్యులచేతబడిన యట్టివారీస్తోత్రశ్రవణమాత్రముననే నిస్సంశయముగ నాయాపదలనుండి విముక్తులు కాగలరు. మహాదరిద్రుడు మూర్ఖుడైనను గూడ నొకసంవత్సర మీస్తోత్రమును బఠించిన నాతడు నిస్సందేహముగ ధనవంతుడై, విద్వాంసుడై విరాజిల్ల గలడు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
ప్రకృతి ఖండములోని నారదనారాయణ సంవాద
మున శ్రీకృష్ణకృత దుర్గాస్తోత్ర మను
అఱువదియాఱవ అధ్యాయము
సంపూర్ణము.

# అఱువదియేడవ అధ్యాయము

## బ్రహ్మాణ్డమోహన మనెడి శ్రీదుర్గాదేవి కవచము

నా ర దు డు ప లి కె ను :

సర్వజ్ఞాన విశారదా! నీవు సమస్త ధర్మ జ్ఞాతవు. దేవా! బ్రహ్మాండమోహన మను దుర్గాదేవి కవచము నుపదేశింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

బ్ర హ్మా ణ్డ మో హ న మ నె డి దు ర్గా దే వి క వ చ ము

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

శృణు వక్ష్యామి హే వత్స కవచం చ సుదుర్లభమ్ ।
శ్రీకృష్ణేనైవ కథితం కృపయా బ్రహ్మణే పురా ॥

బ్రహ్మణా కథితం పూర్వం ధర్మాయ జాహ్నవీ తటే ।
ధర్మేణ దత్తం మహ్యం చ కృపయా పుష్కరే పురా ॥

త్రిపురారిశ్చ యద్ధృత్వా జఘాన త్రిపురం పురా ।
ముమోచ ధాతా యద్ధృత్వా మధుకైటభయోర్భయమ్ ॥

జఘాన రక్తబీజం తం యద్ధృత్వా భద్రకాలికా ।
యద్ధృత్వా తు మహేన్ద్రశ్చ సంప్రాప కమలాలయామ్ ॥

యద్ధృత్వా చ మహాకాల శ్చిరజీవీ చ ధార్మికః ।
యద్ధృత్వా చ మహాజ్ఞానీ నన్దీ సానన్దపూర్వకమ్ ॥

యద్ధృత్వా చ మహాయోద్ధా రామ శ్శత్రుభయంకరః ।
యద్ధృత్వా శివతుల్యశ్చ దుర్వాసా జ్ఞానినాం వరః ॥

ఓం దుర్గేతి చతుర్థ్యన్తః స్వాహాన్తో మే శిరోఽవతు ।
మన్త్రః షడక్షరోఽయం చ భక్తానాం కల్పపాదపః ॥

విచారో నాస్తి వేదేషు గ్రహణేఽస్య మనో ర్మునే ।
మన్త్రగ్రహణమాత్రేణ విష్ణుతుల్యో భవే న్నరః ॥

మమ వక్త్రం సదా పాతు ఓం 'దుర్గాయై నమో౽న్తతః ।
ఓం దుర్గే రక్ష ఇతి చ కణ్ఠం పాతు సదా మమ ॥

ఓం హ్రీం శ్రీం ఇతి మన్త్రోఽయం స్కన్ధం పాతు నిరన్తరమ్ ।
ఓం హ్రీం శ్రీం క్లీం ఇతి పృష్ఠం పాతు మే సర్వతః సదా॥

హ్రీం మే వక్షఃస్థలం పాతు హస్తం శ్రీమితి సంతతమ్ ।
ఓం శ్రీం హ్రీం క్లీం పాతు సర్వాఙ్గం స్వప్నే జాగరణేతథా ॥

ప్రాచ్యాం మాం పాతు ప్రకృతిః పాతు వహ్నౌ చ చణ్డికా ।
దక్షిణే భద్రకాలీ చ నైరృత్యాం చ మహేశ్వరీ ॥

వారుణ్యాం పాతు వారాహీ వాయవ్యాం సర్వమఙ్గలా ।
ఉత్తరే వైష్ణవీ పాతు తథైశాన్యాం శివప్రియా ॥

జలే స్థలే చాన్తరిక్షే పాతు మాం జగదమ్బికా ।
ఇతి తే కథితం వత్స కవచం చ సుదుర్లభమ్ ॥

యస్మై కస్మై న దాతవ్యం ప్రవక్తవ్యం న కస్యచిత్ ।
గురు మభ్యర్చ్య విధివ ద్వస్త్రాలఙ్కారచన్దనైః ॥

కవచం ధారయే ద్యస్తు సోఽపి విష్ణు ర్న సంశయః ।
భ్రమణే సర్వతీర్థానాం పృథివ్యాశ్చ ప్రదక్షిణే ॥

యత్ఫలం లభతే లోక స్త దేతద్ధారణే మునే ।
పంచలక్షజపేనైవ సిద్ధ మేత ద్భవేద్ ధ్రువమ్ ॥

లోకం చ సిద్ధకవచం నాస్త్రం విధ్యతి సఙ్కటే ।
న తస్య మృత్యు ర్భవతి జలే వహ్నౌ విషే జ్వరే ॥

జీవన్ముక్తో భవే త్సోఽపి సర్వసిద్ధేశ్వరేశ్వరః ।
యది స్యాత్ సిద్ధకవచో విష్ణుతుల్యో భవేద్ ధ్రువమ్॥ 2-20

వత్సా ! నే నాపరమసుదుర్లభదివ్యకవచము నుపదేశించెద నవధరింపుము. పూర్వకాలములో స్వయముగ శ్రీకృష్ణపరమాత్మయే యీకవచమును బ్రహ్మదేవున కుపదేశించెను. తదనంతరము బ్రహ్మ గంగానదీతటముపై నీకవచమును ధర్మదేవున కుపదేశించెను. ధర్మదేవుడు పుష్కరక్షేత్రములో నత్యంతకృపాపూర్వకముగ నీకవచమును నా కుపదేశించెను. ఈకవచమును ధరించియే పూర్వకాలములో త్రిపురారి యగుశివుడు త్రిపురాసురులను వధింపగల్గెను. ఈకవచమును ధరించియే బ్రహ్మదేవుడు మధుకైటభులభయమునుండి విముక్తుడయ్యెను. ఈకవచమును ధరించియే భద్రకాళి రక్తబీజుని సంహరింపగల్గెను, మహేంద్రుడు కమలాలయ (శ్రీమహాలక్ష్మి) కృపను బొందగల్గెను. ఈకవచమును ధరించియే మహాకాలుడు చిరంజీవి మఱియు ధార్మికుడైనాడు.

ఈకవచమును ధరించియే నంది మహాజ్ఞానియై సానందముగ జీవింపగల్గు చున్నాడు. ఈకవచమును ధరించియే పరశురాముడు మహాయోధుడై శత్రు భయంకరుడు కాగల్గెను. ఈకవచమును ధరించియే జ్ఞానశిరోమణియగు దుర్వాస మహర్షి శివతుల్యు డయ్యెను.

'ఓం దుర్గాయై స్వాహా' ఈమంత్రము నామస్తకమునురక్షించుగాక. షడక్షరయుక్త మైనయీమంత్రము భక్తులకుక ల్పవృక్షసదృశము. మునీశ్వరా! ఈమంత్రమును గ్రహించువిషయములో వేదములం దెట్టివిషయములను విచార మొనరింపబడలేదు. మంత్రగ్రహణమాత్రముననే మనుష్యులు విష్ణుసములు కాగలరు. 'ఓం దుర్గాయై నమః' ఈమంత్రము సదా నాకంఠ మును రక్షించుగాక. 'ఓం దుర్గే రక్ష' అను ఈమంత్రము నిరంతరము నాభు జములను రక్షించుగాక. 'ఓం హ్రీం శ్రీం క్లీం' అను నీమంత్రము అన్నిదిక్కులనుండి నాపృష్ఠ (వెనుక) భాగమును పాలించుగాక. 'హ్రీం' నావక్షఃస్థలమును మఱియు 'శ్రీం' నాహస్తములను రక్షించెదరుగాక. 'ఓం శ్రీం హ్రీం క్లీం' అను నీమంత్రము స్వప్నజాగ్రత్సు షుప్త్యవస్థలలో నాసర్వాంగములను సంరక్షించుగాక. పూర్వదిశలో (తూర్పుదిశ) ప్రకృతి నన్ను రక్షించుగాక! ఆగ్నేయకోణములో చండిక నన్ను రక్షించుగాక! దక్షిణ దిశలో భద్రకాళి నన్ను గాపాడుగాక! నైఋతీకోణములో మాహేశ్వరి నన్ను రక్షించుగాక! పశ్చిమదిశలో వారాహి నన్ను బాలించుగాక! వాయవ్య కోణములో సర్వమంగళ నన్ను సంరక్షించుగాక! ఉత్తరదిశలో వైష్ణవి! నన్ను బరిపాలించుగాక, ఈశాన్యకోణములో శివప్రియ! నన్నుగాపాడుగాక! జలము లందు, స్థలమందు, నంతరిక్షమందు, జగదంబిక! నన్ను బాలించుగాక! కుమారా! ఈపరమ దుర్లభమైన కవచమును నేను నీ కుపదేశించితిని.

ఈకవచము నపాత్రుల కెవరికిని నుపదేశింపరాదు. అనర్హుల యెదుట బహిర్గత మొనరింపరాదు. ఎవరు వస్త్రభూషణ చందనాదులతో గురుదేవుని విధిపూర్వకముగ బూజించి, యీకవచమును గురుముఖతః శ్రవణ మొనరించి ధరింతురో, వారు నిస్సంశయముగ విష్ణుతుల్యులు కాగలరు. మునీశ్వరా! సర్వతీర్థయాత్రలవలన, పృథ్వీప్రదక్షిణములవలన మనుష్యుల కేఫలము ప్రాప్తించునో, యాఫలమంతయు నీకవచధారణమాత్రముననే ప్రాప్తింప గలదు. అయిదులక్షల పర్యాయములు జపించిన నిశ్చయముగ నీకవచము

సిద్ధించును. ఈ కవచసిద్ధి నొందినవానిని ఘోరరణమందైనను నస్త్రములు ఖండింపలేవు. అతడు నిస్సంశయముగ నగ్నిలో జలములలో బ్రవేశించినను వానికి మృత్యువు సంభవింపదు. విషజ్వరములు సంభవించినను నాతడు మృత్యువువాతబడడు. ఎవరి కీకవచము సిద్ధించునో వారు నిశ్చయముగ విష్ణుసములు కాగలరు. మునీశ్వరా! అమృతఖండముకంటే నధికమధురమైన ప్రకృతిఖండమును నే నిట్లు వర్ణించితిని.

యా చైవ మూలప్రకృతి ర్యస్యాః పుత్రో గణేశ్వరః ॥
కృత్వా కృష్ణవ్రతం సా చ లేభే గణపతిం సుతమ్ ।
స్వాంశేన కృష్ణో భగవా న్బభూవ చ గణేశ్వరః ॥ 21, 22

ఏయాదిశక్తిని మూలప్రకృతి యందురో యామె తనయుడే గణేశ్వరుడు. ఆదేవి శ్రీకృష్ణుని దివ్యవ్రత మాచరించి గణపతినే పుత్రునిగ బడసెను. సాక్షాత్తుగ శ్రీకృష్ణపరమాత్మయే స్వాంశతో గణేశ్వరుడుగ, పార్వతీ కుమారుడుగ నవతరించినాడు.

ఈప్రకృతిఖండము శ్రవణమొనరించుట కత్యంతసుఖప్రదము, అమృతమువలె బరమమధురము. ప్రకృతిమాతదివ్యచరితము నాలకించి వక్తకు దధిసహిత మృష్టాన్నభోజనముల నొసంగి సువర్ణదాన మొనరింపవలెను. సవత్స యైన గోవును భక్తిపూర్వకముగ వక్తకు దానమొనరింపవలెను.

మునీశ్వరా ! శ్రోతలు వాచకుని వస్త్రభూషణములతో సత్కరించి రత్నముల నొసంగి సంతుష్టుని గావింపవలెను. పుష్పములను, ఆభూషణములను, వస్త్రములను, నానాప్రకారములైనయుపహారములను దానము లొనరించి భక్తిశ్రద్ధలతో శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణగ్రంథమును బూజింపవలెను. ఏకాగ్రచిత్తముతో భక్తిభావసమన్వితులై యీమహాపురాణశ్రవణ మొనరించువారిపై నిస్సంశయముగ విష్ణుభగవానుడు ప్రసన్నుడగును. అట్టి భక్తుడు పుత్రపౌత్రాభివృద్ధి నొంది సకలైశ్వర్యసంపన్నుడు భగవంతునికృపకు బాత్రుడునగును. వానియింట మహాలక్ష్మియే యష్టలక్ష్మీసమన్వితయై విరాజిల్ల గలదు. ఆభక్తుడిహలోకములో సుఖములననుభవించియంత్యకాలములోగోలోక పరంధామము జేరగలడు. వానికి శ్రీకృష్ణునిదివ్యచరణారవిందములం దనన్య భక్తి, పరమాత్మదాస్యసౌభాగ్యములు సంప్రాప్తింపగలవు.

నమోఽస్తు బ్రాహ్మణేభ్యశ్చ కృష్ణాయ పరమాత్మనే ।
శివాయ బ్రహ్మణే నిత్యం గణేశాయ నమో నమః ॥
కాయేన మనసా వాచా పరం భక్త్యా దివానిశమ్ ।
భజ సత్యం పరం బ్రహ్మ రాధేశం త్రిగుణాత్పరమ్ ॥
నమో దేవ్యై సరస్వత్యై పురాణగురవే నమః ।
సర్వవిఘ్నవినాశిన్యై దుర్గాదేవ్యై నమో నమః ॥

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి ప్రకృతిఖండములోని
నారదనారాయణసంవాదమున బ్రహ్మాండమోహనమనెడి
శ్రీదుర్గాకవచమను అఱువదియేడవ అధ్యాయము
సర్వము సంపూర్ణము

—o—

ఇదిశ్రీకృష్ణపరమాత్మ చరణారవింద మిళిందాయమాన మానసత్వ
మహావైభవసంపన్నులు, పారాశర్యగోత్రికులు, వైశ్యశ్రేష్ఠులు,
గర్తపురీనివాసులు నగుశ్రీమట్టుపల్లి వేంకటమహాలక్ష్మీ
జగన్నాథుల తనూభవుడు, భక్తజనదాసానుదాసుడు,
సుజనవిధేయుడు నగుశివసుబ్బరాయగుప్త
నామధేయప్రణీతంబైన శ్రీమదాంధ్ర
బ్రహ్మవైవర్త మహాపురాణమందు
ద్వితీయ భాగమైన
ప్రకృతిఖండము సర్వము
సంపూర్ణము.

—0—

# SREE MADANDHRA BRAHMAVYVARTHA MAHAPURANAMU-PRAKRUTI KHANDAMU

# శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణము - ప్రకృతిఖండము

## ఈ సంపుటమును గురించి

1. శ్రీమద్బ్రహ్మవైవర్త మహాపురాణము అష్టాదశ పురాణములలో పదియవది. వానిలోని ప్రధానభాగములను ఖండములందురు, అవి నాలుగు 1. బ్రహ్మఖండము 2. ప్రకృతిఖండము 3. గణపతిఖండము 4. శ్రీకృష్ణజన్మఖండము. ( 2. భా )
2. మూలగ్రంథకర్తయైన శ్రీకృష్ణ ద్వైపాయన వ్యాసమహర్షి ద్వాపరాంతమున ఈ మహాపురాణమును లోకోపకారార్థమై ప్రవచించెను.
3. 'బ్రహ్మణో.... వివర్తః(పరిణామః)బ్రహ్మవైవర్తః' కాన,పరబ్రహ్మము పరిణామము చెంది తననుండి యఖిల జగములను సృజించెను.

   వివృతం బ్రహ్మకార్త్స్న్యం చ కృష్ణేన యత్ర శౌనక ।
   బ్రహ్మవైవర్తకం తేన ప్రవదంతి పురావిదః ॥

   తా॥ ఓ శౌనక మహర్షీ ! ఈ పురాణమునందు శ్రీకృష్ణ భగవానుడు తన పూర్ణబ్రహ్మస్వరూపమును వివృత (ప్రకటిత) మొనరించెను. అందువల్లననే పురాణవేత్తలీపవిత్రసంహితను శ్రీ బ్రహ్మవైవర్త మనికీర్తించిరి. "బ్రహ్మము" అన సకలసృష్టిబీజస్వరూపుడైనభగవానుడు( **GOD** ) "వైవర్తము" అన సకల జగన్నిర్మాణశీలయైన ప్రకృతి **(Nature).** ప్రకృతి భగవంతుల దివ్యచరితవిశద వర్ణనమే యీ బ్రహ్మవైవర్త మహాపురాణము **( This Scripture is the eloborate history of GOD and NATURE )**
4. బ్రహ్మవైవర్తమహాపురాణములో 4 ఖండములు 274 అధ్యాయములు 18000 వేల శ్లోకములు గలవు. ఈ సంపుటము రెండవది యైన ప్రకృతిఖండము. దీని లోని 67 అధ్యాయములను ముఖ్యములైన మూల శ్లోకములను ఉదహరించుచు అనువదించుట జరిగినది.
5. "వాసుదేవస్సర్వమితి"యనియు, సృష్టికి కర్త, భర్త, సంహర్త శ్రీకృష్ణభగవానుడే యనియు, మనోవాక్కాయ కర్మములచే, ప్రతిఫలాపేక్షలేని భక్తితో అహర్నిశములు ఆరాధేశుని భజించుట జీవులపరమకర్తవ్యమనియు ఈ మహాపురాణ ముపదేశించుచున్నది. ద్వైతాద్వైతవిశిష్టాద్వైతులకు శిరోధార్యమిది.
6. రెండవది యైన ఈ ప్రకృతి ఖండములో పరిపూర్ణమైన శక్తితత్త్వమును, జగజ్జనని యొక్క అనేక దివ్యరూపాలను, ఉపాసనా విధానాలను, శ్రీ యమగీతను, దుర్వాసగీతను, ప్రకృతి మంత్రకవచ స్తోత్ర సూక్తులు, వర్ణించడము జరిగినది, జీవరాసి ఒక భూగ్రహము పైననేయుండునని, ఇతరగ్రహములు జీవశూన్యములని ఇందు నొక్కివక్కాణింపబడెను. కావున జీవరాసికోసం అన్యగ్రహములలో వెదకుట ప్రయాసమాత్రమే కాగలదు.
7. ముఖ్యములైన మూల శ్లోకములను ఉదహరించుచు సరళగ్రాంథిక వచనములోనికి తొలిసారిగా సమగ్రంగా వచ్చిన ఆంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమిదే.
8. సందర్భానుసారముగా ఆకర్షణీయములైన 10 వర్ణచిత్రములు కూర్చబడినవి.